# అర్పణ

సుమారు, నూరేళ్ళ ప్రపంచయాత్ర సాగించి పుత్రపౌత్ర ప్రపౌత్రాదులతో నిజకుటుంబాన్ని శాఖోపశాఖలుగా వృద్ధిగావించుకొని, భగవత్సంకల్పాన్ని నెరవేర్చి, గృహస్థాశ్రమంలో 'రాజయోగి'గా కృతకృత్యులై నాచేతులలో—నాచే నారాయణ మంత్ర జపము చేయించుకొంటూ, ఇచ్ఛానుసారం—సునాయాసంగా, సుఖంగా భౌతిక దేహాన్నొదిలి, పరమేశ్వర సాన్నిధ్యం చేరి, తరించిన నాజనకులు—దైవసములు, అయిన శ్రీ లక్ష్మీనారాయణ శర్మగారికి, హృదయపూర్వకంగా అర్పణ చేయబడ్డ దీ కావ్యకన్య!

ఇట్లు
రచయిత
కొవ్వలి

# మా మాట

విశ్వవిఖ్యాతులు, నవలాప్రపంచానికి చిరపరిచితులు అయిన శ్రీ కొవ్వలివార్ని గురించి, మేము వివరించడం మా తాహతుకు మించిన కార్యమవుతుంది. తెలుగుజాతి వున్నంత మేర—తెలుగు గాలి సోకినంతదూరం—తెలుగక్షరాలు నేర్చినవారిలో వారి రచనలు చదివి ఆనందించనివారు లేరు—వారి నభినందించనివారు లేరు!

మే ద్రవిడులము—అయినా చిరకాలంనుంచి తెలుగు గ్రంథ లకు ప్రకటన కర్తలుగా వుంటూ—తెలుగీయుల ఆదరాభిమానాలు పొందాము. తెలుగు నాట శ్రీ కొవ్వలివారి ప్రఖ్యాతి విని—వారి గ్రంథముల కొన్నింటిని ప్రకటింప బూనుకొన్నాము. మా దక్షిణ దేశమంతటా, వేలసంవత్సరాల క్రితంనుంచీ, వీధినాటకములుగా ప్రదర్శించబడే 'అపూర్వచింతామణి' అనే నాట్యకథను ఆధారంగా తీసుకుని, వారికితోచిన విధంగా నవలాసృష్టిని చేయవలసిందిగా కోరాము.

వారు మా కోరిక నాదరించి, ప్రస్తుత దేశకాలపరిస్థితుల కనుగుణంగా, సరసమైన వాడుక భాషలో—అందరికీ అందుబాటులో నుండేలాగే, రచన సాగించి—జానపదగాథలో ప్రస్తుత రాజకీయాలు—అహింసా సిద్ధాంతము—అభ్యుదయ భావాలు—మొదలయిన వాటిని నేర్పుగా యిమిడ్చి, పాఠకలోకాని కొక వినూత్న కళాసృష్టి నందించడంలో విజయమును పొందారు.

సకాలంలో తమ రచన నందించి, మా ప్రయత్నాని కమిత ప్రోత్సాహం కలిగించిన, వారికి మేము సదా కృతజ్ఞులం.

ఇట్లు

పి. జి. మురిగేశ మొదలియారు

ప్రకటకర్త

బొమ్మలాగ, చిత్రకారుని కుంచనుంచి రాలిన ఓ అపూర్వచిత్రంలాగ, కన్నూమిన్నూ తెలీక స్పృహలేకుండా పడివుంది. ఆ పాన్పుమీదనే దేవీ మంజుల కుమార్తె వొంటిమీద చెయ్యివేసుకునివుండి అంతులేని దుఃఖము ననుభవిస్తూంది. పాన్పుకు చేరివున్న ఒక కుర్చీలో కీర్తికాముడు చేష్టలుడక్కి కూర్చునివున్నాడు. ప్రధాని ధీమంతుడు, మరి కొందరు రాజోద్యోగులు కొంచందూరంలో చిన్నబోయిన ముఖాలతో నిలుచునివుంటారు. ఇద్దరు రాజవైద్యులు కొంచం దూరంలో కూర్చుని ఏవేవో మందులు నూరుతుంటే, వారికి అవసరమైన సాధన సామగ్రి సందియ్యడంలో దాసదాసీజనాలు నిమగ్నులై ఊపిరి సలపకుండా వున్నారు.

ఒక రాజవైద్యు డొక తమలపాకులో గోరెడౌషధమును వేసి తీసుకునిరాగా, రెండో వైద్యు డొక వెండిగ్లాసుతో నీళ్లు తీసుకుని వచ్చాడు.

"అమ్మా! ఈ యౌషధాని కిక తిరుగుండదు."

అని ఒక వైద్యుడనగా—

"దీన్ని మనం మింగించకలిగామా అంటే-కంఠదిగిన తక్షణం కన్నువిప్పుతారు-సందేహం లేదు."

అని రెండవవైద్యుడన్నాడు. మంజులాదేవి ఆ వైద్యుని చేతిలోని మందును తానందుకుని, కుమార్తె నోటిలో వెయ్యబోగా, ఆమె నోరు విడలేదు-బిడ్డ నోరు విప్పడాని కీర్తికాముడుకూడా ప్రయత్నం చేశాడు. కాని పళ్లు గిట్టకరుచుకునివున్నాయి. నోరు పెకలిరాలేదు. వైద్యులు నిరాశ చెందారు. మంజులాదేవి కళ్ళంట తిరిగి నీటిబిందువులు రాలాయి. కీర్తికాముడు నిరాశతో కుర్చీలో చతికిలబడ్డాడు.

"ప్రభూ! ఇంకేందారి? ఇప్పుడేం చెయ్యాలి."

అని మంజులాదేవి కంపించే గొంతుకతో అంది. రాజు నోటంట మాటరాలేదు.

"ఇప్పటికి వారంరోజులనుంచి కొంచమించుమించు ఇదే పరిస్థితి అయినప్పటికీ, ఈపూట మరీ హీనంగావుంది. మందుకూడా మింగకపోతే—" అని మంత్రి అనగా—

"త్వరగా కర్తవ్య మాలోచించండి-నాబిడ్డ బ్రతికే మార్గం చేసుకోండి. నాతల్లికోసం ఎన్నినోములు నోచాను! ఎన్ని యాత్రలు

సేవించాము! భగవంతుడు ప్రసాదించిన వరమనుకొంటే-అయ్యో! యింతలోనే యిలా మిన్నువిరిగి మీదపడాలా! పలకరేం ప్రభూ! త్వరపడండి!"

అని మంజులాదేవి వేగిరపాటుతో అంటుంటే, ప్రభువు కీర్తి కాము దీర్ఘ వేడి నిట్టూర్పును విడిచి—

"మిగిలిన ప్రయత్నమేదీ కనుపించడం లేదు-" అన్నాడు.

"దేశంలోని ఘనవైద్యులందరూ వచ్చారు - ప్రయత్నంచేసి వాదిలారు తల్లీ! రోగనిరూపణ అయినా కాలేదు. పాముకాటేమో అని ఒకరు-అపస్మారమని యింకొకరు-మూర్ఛకావచ్చునని వేరొకరు-అన్నిటికి అన్ని ప్రయత్నాలూ చేశారు." అని మంత్రి చెబుతుండగా-

"అయ్యయ్యో! అయితే యిక నాతల్లి నాకు దక్కేయోగం లేదా మంత్రీ! నాతల్లిలేని బ్రతుకు నాకనవసరం-చెడుమాట నా చెవుల బడకముందే—నేనాత్మహత్య చేసుకొని, జీవనా లొతలడంమంచిది."

అని మంజులాదేవి అనడంవల్ల అందరూ ఖంగారుపడ్డారు.

"కొంచం శాంతి వహించండి దేవీ!"

అని మంత్రి వారింపబోయినాడు.

"లోకంలో నాబిడ్డను రక్షించగల వైద్యుడే లేనప్పుడు— నాతల్లి వ్యాధి నయంచెయ్యగల ఓషధే కరువైనప్పుడు, ఇహ నా కెక్కడిశాంతి-నాకెందుకొచ్చిన బ్రతుకు? ఎన్నిరాజ్యసంపదలున్నా-ఎన్నిభోగభాగ్యాలున్నా - అవన్నీ వ్యర్థం! లేక లేక పుట్టిన దొక్క బిడ్డ-ఆ ఒక్కబిడ్డకూ కరువుపడే కర్మ నాకుంది గాబోలు-"

అని మంజులాదేవి కుమిలి కుమిలి యేడుస్తుంటే అక్కడివారు చూడలేకపోతున్నారు.

ఈసారి వైద్యులిద్దరూ రోగినోరును విప్పి మందును మింగించ డానికి ప్రబల ప్రయత్నాలు చేశారు. అదేంగ్రహచారమో-గిట్టకరు చుకొన్న పళ్లు గిట్టకరుచుకునే వున్నాయి. చీమంతయినా సందియ్య లేదు. వైద్యుల ప్రయత్నం వృధా అయింది.

"వైద్యులూవున్నారు-ఓషధులూవున్నాయి. సూదిమొనంత మందు లోపలికిపోతే మాటదక్కేది. కాని యేంలాభం?-పట్టకారులు పెట్టి లాగినా బిగుసుకుపోయిన పళ్లు విడడంలేదు." అని వైద్యులంటుం డగా, మంజులాదేవి వారి మాటలకు చిరాకుతో—

"చాలు-ఇక కట్టిపెట్టండి! వారంరోజులనుంచీ పరిస్థితి యిది కాదుగా! అప్పుడు మీా ఔషధులూ మీారూ ఏమైనారు!" అంది తీక్షణంగా, వైద్యులు వెనక్కుతగ్గారు.

"బిల్వనగరం మా అన్నగారికి కబురుచేయించలేదా ప్రభూ!" అని భార్య అడిగినదానికి, కీర్తికాముడు మంత్రి ధీమంతునివైపు చూశాడు.

"చెయించకేమి దేవీ! మూడుదినాలయింది. ఇక్కడి పరిస్థితులు విన్నవించి, వారి యాస్థానమందుండే ధన్వంత్రి సయితంగా ధర్మపాలుడు మహారాజులుంగారిని తోడుకొని రావలసిందని మనుషులను పంపాను. వారీపాటికి రావలసిందే!"

అని మంత్రి సవినయంగా దేవిగారికి మనవిచేశాడేకాని, కీర్తికాముని కామాటలేవీ వినిపించడంలేదు. అతని మెదడు సరిగా పనిచెయ్యడంలేదు. అర్థంకాని కుమార్తె పరిస్థితి కతని గుండె చెదరివుంది.

ఇంతలో వాకిటి గుఱ్ఱముల యలజడినిబట్టి ఎవరో వచ్చివున్నారని అక్కడివా రూహించుకొన్నారు. ఒక పరిచారకుడువచ్చి-బిల్వనగరంనుంచి ధర్మపాలుడు మహారాజులుంగారు సపరివారంతో వేంచేసి, కోటప్రవేశించినారని తెలుపగా, దేవీ మంజుల ఆపత్కాలములో వచ్చిన తోబుట్టును కలుసుకోడానికి తహతహలాడింది. వచ్చినవారిని తక్షణం అమ్మందిరానికి తీసుకురావలసిందని, కీర్తికాముడు పరిచారకుల కాదేశించి పంపించాడు.

కుండిననగరానికి వారంరోజుల ప్రయాణంలోవున్న బిల్వనగరాధిపతి ధర్మపాలుడు, రాణీ మంజులాదేవికి స్వయాన అన్నగారు. మేనగోడలు స్వస్థత చెడివున్నదని వార్త వినిన తక్షణం, కొడుకు, ఆనందకుమార్‌తోను, ఆస్థాన వైద్యులలో దిట్ట, ధన్వంత్రితోను, మరికొందర పరివారంతోను-బయలుదేరి, వారంరోజులు చెయ్యవలసిన ప్రయాణమును, రాత్రింబగళ్లు సాగించి మూడురోజుల్లో వచ్చి చేరుకున్నాడు.

"చింతామణి కెలావుందత్తయ్యా"

అంటూ ముందర ఆనందుడే పట్టలేని ఆవేదనతో లోపల జొరపడ్డాడు. అతని ననుసరించే మిగిలినవారు లోపల ప్రవేశించారు.

"మాస్థితి అంధకారబంధురమైపోయింది-చూడన్నయ్యా."

అంటూ మంజులాదేవి వలవలయేడవడం మొదలుపెట్టింది.

"బావ, ఆనందు వొచ్చాడనగానే-పరుగుపరుగునపోయి ఒళ్లో వాలేది నాతల్లి-ఇప్పుడేదీ! వారంరోజులనుంచి మూసినకన్నెరగదు బిడ్డ!" అంది తిరిగి మంజుల. ఆమాట వినగానే ఆనందునికి కళ్లు చెమ్మగిల్లాయి-అతడు ముఖము నింకోవయిపుకు తిప్పేసుకున్నాడు.

"బావ, మావయ్యా, వొచ్చారు-కళ్లు విప్పు తల్లీ-చూడమ్మా!"

అంటూ, కీర్తికాము డొకవైపున, మంజుల మరోవైపున, కుమార్తెను హెచ్చరించారు-కదిపారు-పలకరించారు. ఊహుం! ఆమె కదల్లేదు-కళ్లు విప్పలేదు.

"ఉన్నట్టుండి ఇదేం గ్రహాచారం!"

అని ధర్మపాలుడు తమతోవచ్చిన ధన్వంత్రివైపు తిలకించాడు. ఆవైద్యుడు వెంటనే చింతామణి నాడినందుకుని పరీక్షచెయ్యడం మొదలు పెట్టాడు. కాని అతముఖంలో వికాశం కలుగలేదు. నోరు విప్పాలని ప్రయత్నం చేశాడు-యథా ప్రకారమే. లాభం కనుపించలేదు.

"స్పృహాలేకపోయినా, ఈ వారంరోజులనుంచీ, వేసిన మందులన్నీ మింగుతూనేవుంది బిడ్డ. ఈపూట పరిస్థితే యిలాగయిపోయింది."

అని కీర్తికాముడు చెప్పగా—

"అసలు వ్యాధిరావడం యెలావచ్చిందో-వివరాలు చెప్పండి" అని వైద్యుడడిగిన దానికి, కీర్తికాముడు తిరిగి యిలా చెప్పాడు.

"ఇప్పటికి ఎనిమిదిరోజుల క్రితం సరిగా ఇదేవారంనాడు అమ్మాయికి పన్నెండో జన్మదినం-వుత్సవాన్ని అతివేడుకగా చేశాము-"

అని కీర్తికాముడు చెబుతుండగా—

"అవును-ఇప్పటికి పదిహేనురోజుల క్రితమే మీరు పంపించిన శుభలేఖను మేమందుకున్నాము. కాని రాచకార్యాల తొందరలో ఎవరమూ రాలేకపోయినాము — ఆజన్మదినంవరకూ కులాసాగానే వుందన్నమాట-సరి-తరవాత?" అని ధర్మపాలుడు ప్రశ్నించాడు.

"ఆరోజు సాయంకాలంవరకూ కూడా ఖులాసాగానే వుంది— విందులు. వేడుకలూ అతిఘనంగా జరిగాయి. వేలాది బంధుమిత్రులు ఉత్సవంలో పాల్గొన్నారు. ఆ జన్మదినానికి ప్రత్యేకం, రెండున్నర

లక్షలుపెట్టి మణులహారంకొంటే—అది తనకెంతో బాగుందని మురిసి పోయింది నాతల్లి-రోజంతా దానిని వొదిలిపెట్టలేదు.''

అని చెబుతుంటే, కీర్తికాముని గొంతుక శోకంతో పూడుకొని పోయింది. అత డిక చెప్పలేకపోయాడు. అందువల్ల మంత్రి, ధీమం తుడు చెప్పడాని కుపక్రమించాడు.

''చీకటి పడేటప్పటికి రాజకుమారిగారి జన్మదినోత్సవాని కొచ్చిన బంధుమిత్రులలో చాలామంది వారివారి బసలకు వెళ్లిపోయి నారు. సర్వాంబరాభరణ భూషితురాలైన రాజకుమారి, శోభ, మొద లయిన కొందరు చెలులతోకలిసి, కోట పూతోటలోని తూగు టుయ్యాలమీద వూగుతుండగా, ఆ వుయ్యలపైనుంచి కిందపడ్డదట! పడుతూ భయంలో కెవ్వున ఒక కేకమాత్రం వేసిందిట! పడ్డతరువాత ఇహ వొంటిమీద స్పృహలేదు. శోభ, మొదలయిన చెలులు పరుగు పరుగునవచ్చి కోటలో యీవార్త చెప్పారు. తక్షణం ప్రభువులు, దేవిగారు, మేమందరమూ పరుగెత్తిపోయాము. ఏముంది? రాజకుమా రికి ఒంటిపై తెలివిలేదు—నోటంట నురగలు కక్కడం మొదలు పెట్టింది. మాటలేదు చూపులేదు. వెంటనే చేతులపై కోటలోకి తీసు కొచ్చి ఈపాన్పుమీద పడుకోబెట్టాము. ఆనిమిషం మొదలుకొని చికి త్సలు జరుగుతూనేవున్నాయి—మనుషులను పంపి వివిధనగరాల్లోని సమర్థులయిన వైద్యులను రావించాము—ఎవరివల్ల ఏమీ జరుగలేదు. ఈరాత్రి పరిస్థితి మరీ విషమించింది. పళ్లు దగ్గిరిగా గిట్టకరుచుకుపోయి, ఆహారంగాని మందుగాని, లోపలికిపోయే అవకాశం లేకుండావుంది.''

అని మంత్రి చెప్పేలోపుగా, బిల్వనగరంనుంచి ధర్మపాలునితో వచ్చిన ధన్వంత్రి పరీక్షచెయ్యడం ముగించుకొని ఆలోచన నభిన యిస్తూ—

''ఉయ్యాల ఊగుతూ, ఎంత ఎత్తులోనుంచి కిందపడివుంటుందో చెప్పగలరా?'' అని అడిగాడు. ఆవిషయ మెవరికీ తెలియకపోవడం వల్ల ఒకరిముఖాల్లోకొకరు సూన్యంగా చూసుకున్నారు.

''దగ్గరనేవుంది గాబట్టి శోభ కీవిషయం తెలిసివుంటుంది—పిల వండి—అడుగుదాం'' అంది మంజులాదేవి.

''ఎక్కడుంది శోభ?'' అని కీర్తికాముడు ప్రశ్నించాడు.

"శోభకు చింతామణి ప్రాణం—నిమిషం వొదిలిపెట్టదు—అంచేత ఈవారంరోజులనుంచి ఆపిల్లకు నిద్రాహారాలు లేవు. కొంచ మించు మించు మన చింతామణి యీడుదే కావడంవల్ల, అలిసి సొలిసి ఏ మూలనో పటుకుని వుంటుంది చూడండి."

అని దేవీ మంజుల తిరిగి అనడంతోనే కొందరు పరిచారకులు పోయి నాలుగువైపులా పరిశీలించి సిద్రమైకంలో వున్న శోభను పిల్చుకొని వచ్చారు.

"అక్క కెలావుంది? కళ్ళు తెరిచిందా?"

అని శోభ ఆదుర్దాగా అడిగింది.

"తెరుస్తుందిగా నమ్మాయి! ఇటుచూడు! ఆవేళ మీారందరూ ఉయ్యాల ఊగుతున్నప్పుడు, చింతామణి ఎంత ఎత్తుమీాదనుంచి కింద పడింది?

అని ధన్వంత్రి అడిగిన దానికి శోభ నిద్రమైకం పోగొట్టుకుని, కొంచ మాలోచించి—

"ఓయబ్బో! చాలాయెత్తునుంచి అప్పుడు చింతామణి ఒక్కతే ఊయలపై కూర్చుంది. వెనుకతట్టు కొందరు పిల్లలు నిలుచుని బలంగా ఊపుతున్నారు—నేనూ మరికొందరం ఎదురుగా నిలుచుని చింతామణి తోపాటు కిలకిల నవ్వుతున్నం." అని చెబుతుంటే—

"ఆమె ఎంత ఎత్తులోంచి పడివుంటుందీ అని."

అని ధన్వంత్రి తిరిగి ప్రశ్నించాడు.

"అదాండీ! ఒక పెద్దతాడిచెట్టులో సగంఎత్తుకు ఉయ్యాలా లేచినప్పుడు—అక్కడనుంచి పడింది."

అని శోభ చెప్పిన అనంతరం, ధన్వంత్రి చింతామణి నాడిని తిరిగి పరీక్ష చేశాడు. కనురెప్పలను చేతితో యెత్తి పరికించాడు. నోరు తెరవడానికి ప్రయత్నం చేశాడు. కాని ప్రయోజనం కలగలేదు. అత నేమి చెబుతాడో అని అందరూ అతనివైపు ఆదుర్దాగా చూడడం మొదలు పెట్టారు.

"ఏవండీ! అమ్మాయి పరిస్థితి యెలావుందీ? ఏమయినా ఆశ వుందా!"

అని రాణీ మంజులాదేవి ఖంగారుతో అడిగింది.

"చెప్పడం కష్టం. నాడియెక్కడో అంతర్భాగంలో హీనంగా కొట్టుకొంటూంది. ఆమె అంతయెత్తునుంచి పడ్డప్పుడు దెబ్బలేమీ తగలకపోవడానికి కారణ మేమిటండి!"

అని వైద్యుడు తిరిగి అడిగినదానికి.

"క్రిందిభాగంలో అంతా యిసుక అంచేతనే దెబ్బలేమీ తగల్లేదు."

అని మంత్రి జవాబు చెప్పాడు.

"శరీరభాగాని కెటువంటి ముప్పమూ కలుగ లేదు కాని—ఎత్తునించి పడడం మెదడు దెబ్బతింది. ఔషధం మింగుతే ఏదయినా సాధన చేయ్యవచ్చు. కాని పళ్లు బిగ్గట్టకరుచుకుపోవడంవల్ల అటువంటి ఆశయేమీ లేదు"

అంటూ అతడు తన సంచిలోనుంచి కొన్ని మూలికలు తీసి, వాటినుంచి పిండిన పసరును నుదురుపై పట్టుగావేసి—

"ఈరాత్రి దాటితే గండం గడిచిందనుకోవచ్చు."

అని అతడు చెబుతుండగా కోటలోని నగారా మూడు కొట్టింది నిరాశ నిస్పృహలు తిరిగి అందర్నీ ఆవరించాయి.

నిమిష మొకయుగమైనప్పుడు, యింకా మూడుగంటలరాత్రి గడవడమంటే దుస్సాధ్యం. ధర్మపాలుని ఆస్థానంలోని రాజవైద్యుడు మహాఘుటికుడనీ—అతనివల్ల తప్పక కార్యసానుకూలత కలుగుతుందనీ—అతడేదో ఒక మార్గము నవలంభించి, అపాయమును దాటించగలడనీ—అందరకూ అంతవరకున్న ఆశయిప్పుడు లేకుండాపోయింది. ఓషధులవల్ల వైద్యులవల్ల ఏమీ ప్రయోజనం కలుగలేదు. అప్పుడిక కేవలం భగవంతునిమీద భారం వెయ్యడంతప్ప, వేరు మార్గ మెవరికీ కనుపించలేదు.

అతికష్టంమీద మరి రెండుగంటలు గడిచాయి. రాత్రి పూర్తిగా దాటిందని చెప్పడాని కవకాశంలేదు. చీకటి తెరలు ఒకదాని వెనుక మరియొకటి తప్పకోవటం మొదలు పెట్టాయి. చీకటో—వెలుగో—అటో యిటో తెలియని సందిగ్ధసమయం. చావుబ్రతుకుల దోసందు. చింతామణి స్థితిలో యెటువంటి మార్పూ కనుపించలేదు. ఆ సంస్థానపు భవిష్యత్తు, తలిదండ్రుల ఆశ ఆబిడ్డ బ్రతుకుమీదనే ఆధారపడి వున్నాయి.

చింతామణి నోటినుంచి నురగలు గ్రక్కడం ముందుగా దేవీ మంజుల తిలకించి గుండెలు బాదుకుంటూ—

"అయ్యో! బిడ్డ నురగలు గక్కుతూంది—ఇంకేముంటుంది! నా బిడ్డలేని లోకంలో నేను బ్రతకనండీ—"

అని గోలుగోలున యేడవడం మొదలుపెట్టింది. వైద్యుడు తిరిగి నాడినందుకుని పరీక్షించాడు. అతని నోటంట మాటరాలేదు. చప్ప రించాడు. వెలవెలబోతున్న అతని ముఖభావమును చూచిన మంజులా దేవికి హృదయం బ్రీలిపోయింది.

"నేను పాపిని—నేను బ్రతకకూడదు."

అని తనలో అనుకొంటూ ఆమె కూచున్న చోటులో నుంచి కదిలి వడివడిగా పోవడం మొదలుపెట్టింది. సోదరుడు ధర్మపాలుడు, మంత్రి ధీమంతుడు, మరికొందరు పరిచారకులు వడివడిగా ఆమె ననుసరించారు.

రాజా, కీర్తికాముని తల తిరిగిపోతూంది. పాదముల క్రింది నేల క్రింది క్రిక్కిలో దిగజారిపోతున్నట్లయింది. అతనికి కళ్లు పచ్చబరాయి ప్రపంచమే అంధకారబంధురమై అయోమయంగావుంది. కుమార్తె నాడిలో పెట్టుకుని, స్త్రీకంటే హీనంగా వలవలయేడుస్తున్న మహా రాజు నెవరోదార్చగలరు? ఆసందుడు ఇరవై యేళ్ళ ప్రాజ్ఞుడై వుండిన్నీ గుడ్లనీరు గ్రక్కడం తప్ప యింకేమీ చెయ్యలేకపోతున్నాడు.

ఒక్క ఆనందు డన్నమాటేమిటి? మహారాజన్న మాటేమిటి? పరిచారకులు, బందుగులు, ఉద్యోగు లాదిగాగల్గజనులు కలిగిన పరిస్థి తికి ఎవరిమట్టుకు వారు దుఃఖసాగరంలో మునిగిపోయారు. అంతటా రోదనధ్వనులు—కోటలో ఎటుచూసినా హాహాకారములు—శోకము!

అందరి చూపుల్లో చందమామ, నగరమంతటికీ దివ్యకాంతి రాజవంశానికి రాయుంచ—మగధరాజ్యానికే మణిపూస అనదగిన చింతామణి దివ్యరూపం మట్టిపాలు కాబోతుంటే, చూసి సహించ గలవారెవ్వరుంటారు.

అప్పుడొక పరిచారకు డొక కాషాయవస్త్రధారియైన బైరా గిని వెంటబెట్టుకొనివచ్చి, నమస్కరించి, రాజు సన్నిధిని నిలిపాడు.

"ప్రభూ! రక్షకభటు లీసన్యాసిని అనుమానించి-గతరాత్రంతా ఖాయిదాలో వుంచారు. ఈతనికి వైద్యం తెలుసునట—అందువల్ల తీసుకొని వచ్చాము."

అని భటుడు చెప్పినదానిని వినగానే కీర్తికాముడు, ఒడిలోని బిడ్డను పాన్పుమీద పడుకోబెట్టి, లేచి నిలుచుని, బైరాగికి నమస్కరించి—

"స్వామీ! నగరపాలకులు ఆచారప్రకారం చేసినదానిని మన్నించండి! నేను ఈదేశమునకు రాజును. కీర్తికాముడంటారు. ఈ బిడ్డ నాకుమార్తె చింతామణి! ప్రాణములు గోల్పోయినట్టుంది."

అని చెప్పగానే బైరాగి ఆమె నాడినిపట్టి పరీక్షించి—

"లేదు. కొనప్రాణ మింకా నిలిచివుంది."

అని బైరాగి చెప్పినందువల్ల, కీర్తికామునికి, మిగిలిన వారికీ కూడా అంధకారంలో ఆశాజ్యోతి అంకురించింది. బైరాగి, బాలిక యొక్క కాళ్ళుచేతులు తాకి పరిశీలన చేస్తున్నాడు. ఈ సంతోష వార్తను మంజులాదేవికి చెప్పడాని కొక పరిచారిక పరుగు పరుగున పోయింది.

కోట బావిదగ్గర దేవి మంజులను ఆత్మహత్యా కార్యంనుంచి వారించడాని కందరూ బహుకష్టపడుతున్నారు. బిడ్డను గోల్పోయే సమయంలో తల్లి ప్రాణంపొందే ఆదుఃఖం—ఆకడుపుమంట—ఆవేదన—ఆతల్లులు తప్ప అన్యులు తెలుసుకోలేరు. ఎందరెన్ని విధాల చెప్పినా ఆమె చెవికి పట్టడంలేదు.

"మీకు వెర్రి—నిర్బంధంచేసి మీరందరూ నన్నిప్పుడు వారించ గలరుగాని, నాతల్లిలేని యీలోకంలో వుండగోరని నన్నెల్లప్పుడూ ఎవరు వారించగలరు! గుక్కెడు ప్రాణం—ఎలాగయినా పోగొట్టుకో వచ్చు—జన్మజన్మలకీ నాతల్లి నాకు లభ్యంకాదు—నేను పాపిని—నన్ను వొదలండి."

అని ఆమె పరివారజనాన్ని విదిలించుకుని, నూతిగోడలకు తల కొట్టుకొని చావుబ్రతుకులు కానకుండా తపనపొందుతుండే సమయంలో ఆతావు కొక పరిచారిక పరుగుపరుగున వచ్చి—

"దేవీ! ఎవరో బైరాగి! మన కోటలోకొచ్చాడు—రాజకుమారిని పరీక్షచేసి—ఆమె జీవములు పోలేదని చెబుతున్నాడు." అనేటప్పటికి—

"ఆఁ! నాబిడ్డ బ్రతికివుందా?"

అని ఆశ్చర్యసంభ్రమాలతో ఒక్కకేక వేసి మంజులాదేవి కోట లోకి పరుగెత్తిపోతుండగా, మిగిలినవారునూ ఆమె ననుసరించారు.

కాషాయాంబరధారియైన బైరాగి ఒకచేత కమండలము మరి యొక చేతిలో శంఖము పట్టి, మహారాజు కట్టెదుట నిలుచుని, రాజ కుమారి ముఖంలోకి తదేకదీక్షతో చూస్తున్నాడు. జటాజూటమును శిరస్సుపై ముడిగా వేసుకొనివున్న అతని ముఖంలో బ్రహ్మతేజస్సు తాండవిస్తూంది. అతడు తన గడ్డమును సవరించుకొంటూ—దేనిని గురించో దీర్ఘాలోచన చేస్తున్న సమయంలో మంజులాదేవి వడివడిగా వచ్చి ఆయోగి పాదాలు పట్టుకుంది.

"స్వామీ రక్షించండి! తమరు రేపరో మహాత్ములై వుంటారు: నాబిడ్డను బ్రతికించి—నాకు కడుపుశోకం లేకుండా చెయ్యండి! పుణ్యం కట్టుకొండి—"

అని అతని పాదాలు విడవకుండా ప్రార్థిస్తుంటే—

"సద్గురు సంకల్పం! అమ్మా! ముందర నాపాదాలు వొదలు—దేవునిపై భారముంచి ప్రయత్నం చేస్తాం."

అని బైరాగి పలికిన వెంటనే మంజులాదేవి అతని పాదాలు వొదిలిపెట్టింది. ఆమెకు మిగిలినవారికికూడా కొంచం ఆశకలిగింది.

"ఈబిడ్డకు వయస్సెంత?"

అని మహర్షి అడిగిన దానికి—

"పన్నెండో జన్మదినం దాటి వారంరోజులయింది స్వామీ! ఏడుతరాలనుంచి మా వంశాని కాడసంతతిలేదు. నేను అసలే సంతు లేక, అనేక క్రతువులు—యాత్రలూ చేసి—ఇక సంతానయోగం లేదని నిరాశచెందివుండగా, భగవంతు డీబిడ్డను వరంగా ప్రసాదిం చాడు. ఏడు తరాల పెద్దలలో నావంశం తరించిందని, ఈపన్నెండేళ్లు మురిసిపోయాం. మా మురిపె మింతలో ముక్కలవుతుందని తలచ లేదు." అని కీర్తికాముడు వివరించగా—

"బిడ్డ కీపరిస్థితి ఎంతకాలంనుంచి? కారణమేమిటి?"

అని బైరాగి తిరిగి ప్రశ్నించినమీదట—

"వారం దినాలకు ముందొకరోజు, పూతోటలో ఊయల ఊగుతూ—ఎత్తుకుంచి పడిపోయింది స్వామీ! నాటినుంచి యిదే పరి స్థితి. ఈ రోజువరకు ఒంటిమీద స్పృహలేకపోయినా నోరు తెరవడం వేసిన మందులు మింగడం కద్దు. గడచినరాత్రి లగాయితు మాత్ర మే మరీ విషమపరిస్థితి—పళ్ళుగిట్ట కరుచుకుపోయి—మందులు మింగించే

పాపకాశంకూడా లేకుండాపోయింది! తమ రెవరో మహాత్ములు! అయాచితంగా దయచేశారు. ఇవరకే నిస్పృహచేసుకొన్న మాకు బిడ్డ శరీరంలో ప్రాణమింకా నిలిచివుందని తమరు చెప్పినమీదట మాలో తిరిగి ఆశాజ్యోతి అంకురించింది—మా పూర్వ పుణ్యవశంచేత తమరు రాకలిగింది—ఏమహాత్మువల్లనయినా తమరు బిడ్డను రక్షించగల గుతే—నేనూ, నారాజ్యంలోనివారూ, తమ కాజన్మాంతమూ దాసులమై పాదసేవలు చేసుకుంటాం.''

అని కీర్తికాముడు చేతులు జోడించుకొని సవినయంగా మనవి చేసుకున్నాడు.

''బాలిక నుదురుమీద పట్టును కడిగివేయండి.''

అని మహర్షి చెప్పినమీదట ఆప్రకారంగా చెయ్యబడింది. అందరూ యివతలకొచ్చి. విడిగా నిలుచున్నారు.

బైరాగి తన చేతి సంచిలోనుంచి, ఒక చిన్న సీసాను తీసి, అందులోనుంచి ఏదో చిటికెడు చూర్ణమును తీసి, రాజకుమారి నాసికారంధ్రముల కందించాడు. రెండు నిమిషములపాటు తనచేతిలోని చూర్ణము నామె ముక్కుదగ్గర అదేప్రకారం పట్టివుంచాడు! అనంతరం, తనదగ్గరవున్న శంఖమును రాజకుమారి చెవిదగ్గర పూరించి పూదగా శంఖంలోనుంచి బయలుదేరిన భీకర నాదానికి భూనభోంతరాళాలు దద్దరిల్లాయి—కోటకోటంతా భయంకరంగా ప్రతిధ్వనించింది. అక్కడివారందరికీ గుండె బేజారయింది. తక్షణం రాజకుమారి కళ్ళు విప్పింది. బైరాగి శంఖానాదము నాపుచేశాడు. దేవీ మంజుల, కీర్తికామ మహారాజు, మిగిలినవారందరూకూడా సంతోషమును పట్టలేక, బైరాగికి సాష్టాంగనమస్కారాలు చేస్తూ అనేక విధాల మొక్కారు.

కన్నులు విప్పిన రాజకుమారి—

''అమ్మా! దాహం!''

అనేటప్పటికి మంజులాదేవి మరింత సంతోషంతో కుమార్తె దగ్గరకు పరుగెత్తి ఆమెను కౌగలించి—

''నాతల్లీ! బ్రతికి బయటపడ్డావా అమ్మా! దాహం కావాలా? ఇదుగో యిప్పుడే తెప్పిస్తా.'' అని మంజులాదేవి బైరాగి వైపు చూడగా—

"తాగినంత మజ్జిగను దాహమియ్యండి."

అనతడు చెప్పాయి. తక్షణం కొందరు పరిచారకులు పోయి రెండుమూడు గ్లాసులలో మజ్జిగను తీసుకొచ్చారు. రాజకుమారి ఆ మజ్జిగను దాహం పుచ్చుకుని, అతితేలికగా లేచి కూర్చుంది. మంజులాదేవి ఒక వయిపున, కీర్తికాము డొకవైపున కూర్చుని బిడ్డ ముంగురులు సవరిస్తున్నారు.

"ఏం తల్లీ! ఎలావుంది." అని తండ్రి అడిగిన ప్రశ్నకు

"ఏవుంది? నాకు బాగానేవుందే!" అని చింతామణి బదులు చెప్పింది. అనంతరం మంజులాదేవి కుమార్తెకు బైరాగిని చూపించి—

"తల్లీ! చూడు! నీకు ప్రాణభిక్షపెట్టినవా రామహాత్ములే! పోయి వారి పాదాలకు మొక్కు!"

అని హెచ్చరించగా, ఆబాల, పాన్పుదిగి బైరాగి పాదాల మీద వాలి, మొక్కుతుండగా—

"బిడ్డా! పునర్జన్మనెత్తావు—చిరంజీవ్విగా!"

అని బైరాగి దీవించి ఆమెను లేవదీసి, తల్లికి చేర్చాడు. రాజకుమారి అక్కడ మూగివున్న జనసమూహము నంతటినీ ఒక్కసారి కలయజూచి—

"బావ, ఆనందుడు—ఇక్కడున్నాడే!" అంది.

"మావయ్యకూడా యిక్కడే వున్నాడు తల్లీ!" అంది మంజుల రాజకుమారి చరచరపోయి, ఆనందుని ఒడిలో వాలింది.

"ఇక మేము శలవు తీసుకుంటాము."

అని బైరాగి లేవబోగా కీర్తికాముడు అతని రెండుచేతులూ పట్టుకుని—

"స్వామీ! నామనవిని కొంచం ఆలకించండి! తమ రెక్కడి నుంచి వేంచేశారో—ఎక్కడికి పోనున్నారో శలవిచ్చారు కాదు." అని ప్రార్థనా పూర్వకంగా అడిగినదానికి బైరాగి చిరునవ్వుముఖంలో—

"రాజా! బైరాగులకు ఒక నివాసమనీ—ఒక గమ్యస్థానమనీ ఏముంటుంది?—సత్రం భోజనం—మఠానిద్ర. అంతేగదా! నాసంచార క్రమము ననుసరించి, గతరాత్రి యీ పట్టణంమీదుగా పోతుంటే—కొత్తవాడినైన నన్నుచూచి మీకావలివారు అనుమానించారు.

రాత్రంతా బందీలోవుంచారు. ఉదయం నావాలకమును—రూపమును పరిశీలించి—

"అయ్యా! మీరు సాధువులుగా వున్నారు—వైద్యమేదయినా తెలుసునా?"

అని ఒక వుద్యోగి నన్ను ప్రశ్నించగా—

"తెల్సునే—ఏంకావాలి?" అని నేనడిగాను.

"మారాజపుత్రి స్వస్థత చెడి చావుబ్రతుకుల్లోవుంది—దేశంలో వుండే వైద్యశిఖామణులందరూ ఏమీ చెయ్యలేకపోయారు—మీరు ప్రయత్నం చేస్తామంటే—కోటలోకి తీసుకుపోతాము."

అని వారు చెప్పినమీదట నేను సరే అన్నాను—వారు నన్ను యిక్కడికి తీసుకొచ్చి విడిచిన విషయం మీకు తెలిసిందే.

కీర్తికాముడు—"అయ్యా! అపచారం జరిగింది. క్షమించాలి—తమ మాహాత్మ్యను తెలుసుకోలేక భటులు తప్పుచేశారు. ఆతప్పు వారిది గాదు—నాది. మన్నించండి."

అని ఆబైరాగిని ప్రార్థించాడు.

"దానికేమి! పరిపాలనలో శాంతి భద్రతలు కాపాడవలె నంటే—కొన్ని నిబంధనలు పాటించే తీరాలి. అందులో మీదిగాని, మీ భటులదిగాని యేటువంటి అపరాధమున్నూ లేదు."

"కేవలం, మా పూర్వపు పుణ్యవశంచేత, మహాత్ములయిన తమరు మారాజ్యానికి రావడమైంది. ఇంకనించి తమరు మానగరంలోనే నివాసమేర్పరుచుకుని వుండి, మమ్మల్ని తరింపచెయ్యవలసిందిగా ప్రార్థన."

అని మహారాజు చెప్పినదానికి బైరాగి కొంచమాలోచించి—

"లోకకళ్యాణిక్కై పాటుపడడమే మా ఆశయం. కాబట్టి మీ కోరిక ప్రకారం చెయ్యడానికి అభ్యంతరముండదు. కాని, మా ప్రశాంత జీవితానికి ఆటంకాలు కలుగవేమోనని ఆలోచన."

"తమకటువంటి ఆలోచన అవసరంలేదు. ఒక ప్రత్యేక మందిరము నేర్పాటుచేసి అందులో తమ జపతపాదులకుగాని, ప్రశాంతతకు గాని యేటువంటి ఆటంకాలూ రాకుండా కట్టడి చేయించగలను."

"తమ పుత్రికకు ప్రమాదమును తప్పించిన కారణంవల్ల—అనేకులు వచ్చి మాకు తొందర కలుగ జేయువచ్చు."

"అటువంటిదికూడా జరుగకుండా నేను అన్ని యేర్పాటులు చెయ్యగలను—"

"మా వునికివల్ల తమకు ప్రయోజనం?"

"మాకు పుత్రికాభిక్ష పెట్టిన తమ్ము సేవించవలెనన్నది కోరిక"

"మేము స్వేచ్ఛాజీవులం— ఈ రోజిక్కడ— రేపు హిమవత్పర్వత శిఖరంమీద—"

"కావచ్చు—కొంత కాలమైనా మా ఆతిధ్యంలోవుండి—అనుగ్రహించవలసిందని ప్రార్థన."

అందుకు బైరాగి బదులు చెప్పలేదు.

"తమకు వయస్సేమో అంత ఎక్కువయినదిగాలేదు—అయినా సర్వసంగపరిత్యాగంచేసి—ఈవిధంగా విరాగులు కావడానికిగల కారణం అడగవచ్చునా? చనిపోయిందనుకున్న మాబిడ్డను రక్షించేటంతటి శక్తిసామర్థ్యాలు తమరెలా సంపాదించ గలిగారు."

"సద్గురు సంకల్పం! మనః ప్రవృత్తులకు వయస్సుతో నిమిత్తమేముంటుంది. వారి వారి పూర్వపుణ్య సుకృత దుష్కృతములను బట్టి ఆ యా వాసనలు కలుగుతుంటవి. ధృవునియొక్క, ప్రహ్లాదుని యొక్క చరిత్రలు మీరు వినకుండావుండి వుండరు. నేనున్నూ నా యిరవయ్యోయేట ప్రాపంచిక సుఖాలను రోసి సన్యసించాను. ఇపుడు నలభై యేళ్లు— ఈ యిరవై యేళ్లు—అనేక దేశాలు తిరిగి—మహాత్ముల నెందరినో ఆశ్రయించి ఇప్పు డీస్థితిలో వున్నాను. అంత చిన్నవయస్సులో విరాగినయిన కారణంవల్ల లోకం నన్ను 'బాలమహర్షి' అని పిలవడం మొదలుపెట్టింది—బైరాగుల వివరములు ఇంతకంటె ఎక్కువ తెలుసుకో గోరడం నియమ విరుద్ధ—"

"క్షమించండి—ఏదో కుతూహలం కొద్దీ అడిగాను. నేను, మావంశంవారూ, తమరు గావించిన మేలును జన్మజన్మలకూ మరచిపోము. తమరాక మరొక పదనిమిషములు ఆలశ్యమై వుంటుంటే, కార్యం మించిపోయేది. కూతురు చావుకు తల్లి ఆత్మహత్య చేసుకొని వుండేది—భార్యా పుత్రికలను గోల్పోయి నేను మాత్రం మెలా బ్రతుకుతాను—క్షణంలో స్మశానం కావలసిన యీ రాజకోటను స్వర్గసమానం చెయ్యగలిగిన మహాత్ములు తమరు—నా ప్రార్థనల నంగీకరించి, మా నగరమున మా సేవల నంగీకరిస్తూ వుండవలసిందని వేడుకుంటున్నాను."

"మంచిది. ఇటువంటి ప్రమాదస్థితినొచ్చి—తిరిగి బ్రతికినవా రెక్కడా కనుపించరు. మీ చింతామణిది ఒక అపూర్వ జీవితము—ఆమె భవిష్యత్తుకూడా అపూర్వమైనదే అవుతుంది. ఇంతటి నుంచి మీరామెను 'అపూర్వచింతామణి' అని పిలవండి."

"తమ ఆజ్ఞలకు మేమెప్పుడూ బద్ధులం."

"ఆమెకు ఉత్తమ విద్యలు సక్రమముగా నేను స్వయంగా నేర్పవలెనని సంకల్పం కలిగింది."

"స్వామీ! అది కూడా మాపూర్వపుణ్యమే—తమ రామెకు ప్రాణభిక్ష పెట్టిన దాతలు. చింతామణి యింతటినుంచి మీ బిడ్డకాని, మా బిడ్డకాదు. ప్రాజ్ఞురాలయ్యేవరకు ఆమెను మీమందిరంలోనే వుంచుకుని, విద్యావతిని చెయ్యండి."

"మంచిది."

అని బాలమహర్షి, ఆనందునితో ఆటలాడుతున్న చింతామణిని చూసి—

"అమ్మాయీ! అపూర్వచింతామణీ!" అని పిలిచాడు. చింతామణి బిరబిరవచ్చి, బాలమహర్షికి నమస్కరించి నిలుచుంది.

"కీర్తిశాముని వంశానికి మరింత వన్నె తేగల కన్య—"

"ఏమి? నాదగ్గర విద్యలు నేర్చుకుంటావా?"

అని బాలమహర్షి ఆప్యాయముగా అడిగిన దానికి—

"అనుగ్రహిస్తే తప్పక నేర్చుకుంటాను."

అని చింతామణి బదులు పలుకగా—

"బేష్! నా శిష్యురాలవు కాదగిన పిల్లవు."

అని బాలమహర్షి ఆమెను మెచ్చుకున్నాడు.

"స్వామీ! తిరిగి యీమెకు ఔషధ సేవ ఏమయినా అవసరముంటుందా?

అని మంజులాదేవి అడిగిన దానికి,

"ఏమీ అవసరంలేదు. ఇంతటినుంచి మీబిడ్డ మునుపటికంటె యెక్కువ ఆరోగ్యమును—తేజస్సు కలిగి వర్ధిల్లుతుంది."

అని బాలమహర్షి బదులు చెబుతూ, ఆనందుని చూచి—

"వారు మీ కుమారులా?" అని ప్రశ్నించాడు.

"నాకు పుత్రసంతతి లేదనీ—చింతామణి ఏకైక పుత్రిక అనీ మనవిచేసుకున్నాను. అతడు ఆనందుడు నా బావమరది కుమారుడు, ఆ చేరువలోవున్న అతనే నా బావమరది, ధర్మపాలుడు, కాంచన నగరాధిపతి. మేనగోడలి ప్రమాదస్థితిని తెలుసుకొని పుత్రసయితంగా బయలుదేరి వచ్చాడు."

"సంతోషము."

కీర్తికాము డనంతరం మంత్రి ధీమంతుని జూచి—

"పూతోటలోని శాంతి భవనమును మహర్షికి నివాసముగా యేర్పాటు చేయించు. వారి సేవలకు పరిచారకులను—అవసరమైన సాధన సామగ్రిని ఏర్పాటు చేయించు. తరువాత ఎవరుగాని లోపల ప్రవేశించకుండేలాగున కాపలాలు పెట్టించి, కట్టుదిట్టాలు చేయించు. ఆ మహాత్ములు రాజపుత్రికకు ప్రాణదానంచేసిన దాతలని గుర్తుపెట్టుకొని అనుక్షణము వారి ఆజ్ఞలను పాటిస్తూ వుండవలసింది."

అని ఆజ్ఞలు జారీచేసి, తరువాత బాలమహర్షితో—

"స్వామీ! ఇప్పటికే తము కధికంగా శ్రమకలిగించాం. ఇక విశ్రాంతి తీసుకోండి—ఇది తమ స్వస్థలము—మేము తమ దాసులము అని భావించి—ప్రశాంతంగా వుండండి—తీరిక సమయాలలో నేను, నాభార్య వచ్చి తమ దర్శనం చేసుకుంటూవుంటాం."

అని కీర్తికాముడు, బాలమహర్షిని మంత్రి వెంబడి శాంతిభవనానికి సాగనంపి. పుత్రిక పునర్జీవితురాలైనందుకు అపరిమితానంద భరితుడై, తాను రాచకార్యాది నిత్య దినచర్యలలో నిమగ్నుడయ్యాడు.



బిల్వానగరాధిపతి, మంజులాదేవికి సోదరుడు అయిన ధర్మపాలుడు, ఆనందునితో మరికొంతకాలం కుండినగరంలోనే వుండి ఇక నిజరాజధానికి పోవాలని ప్రయాణమై వుండగా ఒకనాడు—

అంతఃపురంలో మంజులాదేవి, మహారాజు కీర్తికాముడు ఆత్మీయులను వీడ్కొలుపుతున్న సమయం.

ధర్మ—మేము వచ్చినవేళ మంచిదయింది. చింతామణి స్థితి యెలా వుంటుందో అని ప్రాణాలను అరిచేతుల్లో పెట్టుకొచ్చాం. దైవ

కృపవల్ల గండం గడిచింది. అతి విచారంతో వచ్చినవాళ్ళం అధికసంతోషంతో వెడుతున్నాము.

మం—ఇంతటితో నిభాగ్యత తీరిపోలేకన్నా! చింతామణిని నీకోడలుగా చేసుకొంటానని మాటయిచ్చావు. మరిచిపోయావు సుమా!

ధర్మ—నేనెప్పుడూ మరచిపోను—అందుకు బావగారుకూడా సమ్మతించినట్లయితే నా అభ్యంతర మెప్పుడూ వుండదు.

కీర్తి—నాయభ్యంతరమంతగనుముందే వుండదు. వివాహ విషయంలో పిల్లకు సంపూర్ణ స్వాతంత్ర్యమిచ్చి—నాతల్లి చింతామణి యిష్టానుసారంగా చెయ్యాలని నాసంకల్పం!

ధర్మ—అప్పు డసలు పేచీలేదు. అది యిప్పట్నుంచే బావమీద పంచప్రాణాలూ పెట్టుకుంది.

మం—కావలసిన సంబంధాన్ని కలుపుకోవడం అందరికీ మంచిది.

కీర్తి—ఇంతకీ ఆనందుని యభిప్రాయ మేమిటో తెల్సుకోరేం! ఏమయా ఆనందూ! మా చింతామణ్ణి పెళ్లి చేసుకుంటావా?

అని కీర్తికాము డడిగిన ప్రశ్నకు ఆనందుడు బదులు పలుకకుండా మౌనంతో తలను కిందికి దించుకున్నాడు.

ధర్మ—ఎంతో పుణ్యం చేసుకొన్న అదృష్టవంతులకుగాని, చింతామణివంటి సౌందర్యవతీ, గుణవతీ, భార్యగా లభ్యంకాదు. ఆ మాట నేనే చెబుతాను. దేవలోకంలో పుట్టవలసింది—పొరబాటున మన రాజపుత్ర వంశంలో పడింది.

మం—ఆనందుకు వేరే వేరే ప్రయత్నాలు చెయొద్దని మరీమరీ చెబుతున్నా నన్నయ్యా!

ధర్మ—ఆలాగే చెల్లమ్మా.

కీర్తి—ఇవే పెళ్లికి ఖాయమైన మాటలనుకోండి బావగారూ! యుక్త వయస్సురాగానే లేఖ వ్రాస్తాను.

ధర్మ—మంచిది—పోయొస్తుమా!

కీర్తి—మరికొంత కాలమైనా వుంటకుండా, అప్పుడే వెళ్లిపోతున్నారు రాక రాక వచ్చారు.

ధర్మ—అందుకే అయిదుమాసాలున్నాము—అవతల రాచకార్యాలు చెడిపోవా బావగారూ? ఇంకెంత కాలముంటాము? చింతామణి

ఆరోగ్యం సర్వవిధాలా తృప్తికరంగావుంది గాబట్టి సంతోషంతో వెడుతున్నాము—వెళ్ళనియ్యండి.

మం—ఒదినగార్ని మరీమరీ అడిగానని చెప్పన్నయ్యా.

ధర్మ—చెప్తా మంజులా!

అంతకుముందే సిద్ధం చెయ్యబడిన పరివారజనాలతో గుఱ్ఱముల నెక్కి తండ్రీ కుమారులు ప్రయాణ మయ్యారు. మహారాజు దేవీ సహితంగా కోటగుమ్మంవరకూ వచ్చి ఆత్మీయులను వీడ్కొలిపి తిరిగి కోటలో ప్రవేశించాడు.

బాలమహర్షి నివసించే భవనానికి విద్యాభ్యాసానికై వెళ్ళిన చింతామణి మరి కొంచంసేపట్లో శోభతో కలసివచ్చి తల్లిని కలుసుకుంది. ప్రతిదినమూ తను వచ్చినవేళకు జయంతు డెదురై—

"రాణీగారు వొచ్చారూ!" యని పరామర్శించేవాడు. ఆ నాడతను కనుపించకపోవడంవల్ల చింతామణి నేరుగా తల్లిదగ్గరకు పోయి—

"అమ్మా! ఆనందు బావేడీ?"

యని యడిగింది.

"ఇంకా యెంతకాలముంటాడు తల్లీ మనింట్లో! తండ్రిగారితో కలసి ఈదినమే బిల్వనగరం వెళ్ళిపోయాడు."

యని తల్లి చెప్పగానే—

"నాతో చెప్పకుండానా?"

యని ఆబాలిక ముఖమును చిన్నబుచ్చుకుంది.

"నీవు వస్తావేమోనని చాలాసేపు చూశారు. ప్రయాణ ముహూర్తం మించిపోతుందని బయలుదేరి వెళ్ళారు."

"అప్పుడు నాకెందుకు కబురుచెయ్యలేదూ?"

"విద్య నభ్యసించే సమయంలో అంతరాయం కలుగుతే గురువుల కాగ్రహం రాదా తల్లీ? ఎందుకూ కొద్దికాలం ఓపికపట్టావంటే—నువ్వెప్పుడూ ఆనందుడి దగ్గరే శాశ్వతంగా వుండిపోవచ్చు—ఆనందు బావని పెళ్ళి చేసుకుంటావా తల్లీ?"

"నే చేసుకోనుపో!"

"అదేం?"

"నాకు చెప్పకుండా వూరికి వెళ్ళిపోయాడు. అందుకని."

చింతామణి చెప్పిన జవాబుకు దేవీ మంజుల చెలికత్తె శోభ, ఫకాలున నవ్వారు. మంజుల కుమార్తెను కౌగలించి ముద్దాడి—

"ఆనందు డంటే, నీకెంత ప్రీతి తల్లీ." అంది.

"కొంచం కోప మొచ్చి అలా యన్నదంతేగాని, నిజంగా ఆనం దునే పెళ్ళిచేసుకుంటుంది—నాకు తెలుసు." యన్నది శోభ.

"యవ్వును చేసుకుంటా—నీకెందుకూ? పో యవతలికి."

అని చింతామణి శోభను విసిరికొట్టింది.

"నాతల్లి కీపూట చాలా చిరాకుగావుంది."

యని దేవీ మంజుల కుమార్తెకురులు నిమురుతూ యన్నది.

"కోపకారణంకూడా తెలుస్తూనేవుంది."

యని తిరిగి శోభ యంది. చింతామణి శోభ వయిపొకసారి తీక్షణంగా చూచి, తలను కిందికి దించుకుంది.

"గురువుగారు ఇవ్వుడేం విద్యలు చెబుతున్నారు తల్లీ?"

యని తల్లి యడిగినదానికి చింతామణి బదులు చెప్పలేదు.

"తర్కశాస్త్రమును, వ్యాకరణశాస్త్రమును పూర్తిచేశారు. ఇప్పుడు చిత్రలేఖనం నేర్పుతున్నారు." యని శోభ వివరించి చెప్పింది.

"యందుకే బావ బొమ్మరాసేశా."

యంటూ చింతామణి పకపకబడి నవ్వడం మొదలుపెట్టింది.

"ఏదీ ఆబొమ్మను నాకు చూపవా తల్లీ!"

యని తల్లి యడిగిన తక్షణం చింతామణి తన పుస్తకాలలో ఒకదాని నుంచి తాను రాసిపెట్టిన ఒక చిత్రపటాన్ని తీసి తల్లి కందించింది. దేవీ మంజుల విభ్రాంతురాలై కొంతసేపాపటమును రెప్ప వాల్చకుండా తిలకించింది.

అది, సమర్థుడైన ఏచిత్రకారుడూ చెయ్యలేనిపని. కుంచనుంచి జీవకళ ఆచిత్రపటంలోకి జారినట్లుంది. ఆనందుని సహజసౌందర్య మంతా ఆపటంలో అచ్చుగుద్దినట్లుంది. ఆనూనూగు మీసము—కను ముక్కు తీరు విశాలమైన నుదురు—రాచఠీవి ఉట్టిపడుతూ, మూడు మూర్తులా ఆనందుడే! యంత శ్రద్ధాపూర్వకంతో తన కుమార్తె ఆ బొమ్మను వ్రాసిందంటే దేవీ మంజులకు అపరిమితమైన ఆనందాశ్చ ర్యాలు కలిగాయి. ఆఘనత, నేర్పిన గురువులదో—నేర్చిన శిష్యురాలిదో మంజుల నిర్ణయం చెయ్యలేక పోయింది.

"చెప్పినట్టు వినకపోయాడంటే, ఈబావ బొమ్మకు ఓతోక తగిలించి, మన జంతుప్రదర్శనశాలలో పెట్టిస్తాను."

యని చింతామణి కొంటెతనంగా అన్నదానికి మంజుల, శోభ తిరిగి నవ్వారు.

"బావను కోతి చెయ్యాలనా తల్లీ?"

యని మంజుల నవ్వుతూ యడిగింది.

"చింతామణి తల్చుకుంటే ఏమైనా చెయ్యగలదు."

యని శోభ అంటుండగా—

"ఏయ్! నాపేరు చింతామణి కాదు—అపూర్వచింతామణి—ఇది, గురువుల ఆజ్ఞ! మీరరానిది!" యంది చింతామణి.

"అవును తల్లీ—మీరరానిదే! వారు నీకు ప్రాణదానంచేసిన దాతలు—మగధరాజ్యానికి దీప పెట్టిన మహాత్ములు—నాకు కడుపు చిచ్చులేకుండా కాపాడిన కరుణామయులు. వారియందాజన్మాంతమూ నువ్వు గురుభావమును కలిగి వుండవలసిందే!"

యని కుమార్తె భావమును తల్లి సమర్థించింది.

కష్టాల్లో కాలంగడవదుకాని—సంతోష వాహినిలో రోజులు వారాలూ, నెలలు, సంవత్సరాలు—ఎన్నయినా సునాయాసంగా కొట్టుకుపోతాయి. బాలమహర్షి కుండిననగరంలో—కీర్తికాముని కోరికపై—మూడుసంవత్సరాలు ప్రశాంత జీవితం గడిపాడు. రాజదంపతులకు రాజకుటుంబానికీ—రాజోద్యోగులకూ—బాలమహర్షి ఒక దేవుడుగా, ఒక గురువుగా, ఒక మహిమాన్వితుడుగా వున్నాడు. ఆ రాజ్యంలో యతని మాట శిలాక్షరంగా పరిగణించబడుతుంది. రాజదంపతుల కాతనియందుండే భక్తి విశ్వాసాలు దినదినమూ వృద్ధి పొందుతున్నాయి.

బాలమహర్షి తమ నగరంలో వుంటే చాలు—తమ కెటువంటి కష్టాలూరావన్న విశ్వాసం రాజదంపతులకు—ప్రజలకూ కూడా యేర్పడింది. అతను వచ్చిన మూడుసంవత్సరాలూ మూడునిమిషాలుగా గడిచిపోయాయి. రాజదంపతు లప్పుడప్పుడు తోటలోని ప్రశాంతి భవనానికి పోయి—బాలమహర్షిని కలుసుకొంటుండడము—యతనితో యిష్టాగోష్ఠి సల్పిరావడము పరిపాటి.

రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమాది అప్సరసల అంతస్తులో లెక్క కట్టవలసిన చింతామణి రూపురేఖలను వర్ణింపచూడడం ఎవరికి గాని తాహతుకు మించినపని. ఊహాకందినంత మేర కళాకోవిదులు సౌందర్య పిపాసకులు ఎవరిమట్టుకువారు ఊహించుకొని, ఆయమ్మ యపురూపసౌందర్యమును ఊహాగానం చెయ్యడమే లెస్స.

రూపానికి యౌవ్వనం, మేలిమికి పరిమళ మబ్బడంవంటిదికదా! రోజులు గడిచిన కొద్దీ ఆసుందరి యౌవ్వనం పాలపొంగులాగ బుస బుస పొంగుతూంది.

బాలమహర్షి తనకు వచ్చినంతవరకు విద్యలన్నింటిని శిష్యురాలికి నేర్పడంలో సర్వశక్తులూ వినియోగిస్తున్నాడు. చింతామణి అప్పటికే కొంతవరకు నేర్చి వుండడంవల్ల బాలమహర్షి తన సామర్థ్యము నంతటినీ వినియోగించి, సూక్ష్మపద్ధతులవల్ల తర్క, వ్యాకరణ గాన చిత్రకళాది విద్యలు నేర్పి ఆతరువాత, ధర్మశాస్త్రము—నీతిశాస్త్రము—గీతారహస్యములు మొదలుగాగల సమస్త విద్యలు, తనకు తృప్తి కలుగు విధంగా బోధించి, ఇహ వేదాంతభాగము నుపక్రమించు సమయంలో ఒక శుభముహూర్తమున చింతామణి పుష్పవతి అయిన దన్నవార్తను శోధవల్ల తెలుసుకున్నాడు.

రాజదంపతులు స్వయంగా వచ్చి—అతిఘనంగా జరుపబడు వేడుకలలో—ఉత్సవములలో పాల్గొనవలసిందని బాలమహర్షిని ప్రార్థించారు. కాని, సర్వసంగపరిత్యాగి విరాగియైన తనవంటి వైరాగికి యటువంటి ఐహిక విషయాలలో యెటువంటి ఆశక్తిన్నీ లేదని యతడు వివరించి చెప్పినందువల్ల, వారు బాలమహర్షి నెటువంటి నిర్బంధమూ చెయ్యలేదు.

పదిహేనవ జన్మదినం దాటి, పదహారవయేట, మొదటి వారంలో చింతామణి యౌవనచిహ్నంగా ఒక శుభలగ్నమున పుష్పవతి అయింది. వంశానుక్రమంగా రాచసాంప్రదాయము ననుసరించి—చేయవలసిన విధులు—వేడుకలు—ఉత్సవములు అతివైభవంగా జరిగించబడ్డాయి. నగరవాసులందరూ ఉత్సాహవంతులై పాల్గొన్నారు. ఈ శుభవార్త బిల్వనగరానికికూడా తెలియచెయ్యబడింది. కొద్దికాలంలోనే చింతామణి వివాహానికి ముహూర్తనిశ్చయంచేసి, వర్తమానం పంపుతాననికూడా కీర్తికాముడు ధర్మపాలునికి వ్రాశాడు.

కీర్తికాముని పుత్రిక, అపూర్వచింతామణి, యందాలకుప్ప యనీ—ఆమెను మించిన అందగత్తె లీ ప్రపంచంలో లేరనీ దేశమంతటా పేరు మోసింది. ఈ కారణంవల్ల వివిధ నగరాధీశులు—నానా దేశ రాజకుమారులు, ఆకన్యను వివాహమాడాలని రాయబారాలు పంపుతున్నారు—చిత్రపటాలు పంపుతున్నారు. కాని కీర్తికాము డింకా యెవరికీనీ మాట ఈయలేదు.

ఆ సౌందర్యరాశిని చేపట్టి సుఖములు పొందే భాగ్యశాలి యెవరో యింకా బయటపడలేదు.

ఈ విషయమును గురించే రాజా కీర్తికాము డాలోకనాడు, అంతఃపురంలో దేవీ మంజులతో సంభాషించాడు—

"దేశదేశాలనుంచి వస్తున్న రాజకుమారులకు, రాయబారాలకు, చిత్రపటాలకు యంతులేకుండా వుంది. అమ్మాయికి ఎవరినో ఒకరిని నిశ్చయంచేస్తేగాని యీ తొందర అణగదు. ఇందువల్ల రాచ కార్యాలకు కూడా యంతరాయాలు కలుగుతున్నాయి."

"తమరు చెప్పింది నాకర్థం కావడంలేదు. ఎవరినో ఒకరిని నిశ్చయం చెయ్యాడమంటే యేమిటి?"

"కదా?"

"ఆనందుని కియ్యాలని యింతకుముం దనుకున్నాము కదా!"

"యనుకున్నాము. యమ్మాయి యభిప్రాయమును పూర్తిగా తెలుసుకోవాలి కదా!"

"ఇప్పుడు కొత్తగా తెలుసుకోవలసిందిలేదు. చిరంజీవికి ఆనందుడి మీదనే మనసు నిలిచింది. చిన్నప్పటినుంచీ ఆయిద్దర మనసులూ యతికాయి. దానిని పురస్కరించుకునే, ఆమధ్య వచ్చినప్పుడు మా యన్నయ్యకు మాటయిచ్చాము కూడా. తమకిప్పుడు కొత్త ఆలోచనలు కలగడానికి గల కారణమేమిటో తెలియడంలేదు."

"కొత్త ఆలోచన లేమీ లేవు—చింతామణి మనసును తెలుసుకోవాలని అంతే—ఆమె ఆంతర్యానికి విరుద్ధంగా నడవడం ఎవరికీ శ్రేయస్సు కాదు."

"దాని మనస్సు ఆనందుని మీదనేవుంది. అందులో సందేహం లేదు. అదెప్పుడూ యతని రూపసంపదను వర్ణిస్తూ, యతని సద్గుణాలనే మెచ్చుకుంటూ వుంటుంది."

యంటూ మంజులాదేవి యిక్కడినుంచి లేచి వెళ్ళి, ఆ చేరువ నున్న బీరువానుంచి, ఒక చిత్రపటమును తెచ్చి, మహారాజు చేతి కందియ్యగా యతడు దానిని పరిశీలించి—

"ఇది ఆనందుడిది! ఎక్కడనుంచి వచ్చింది?"

యని ఆశ్చర్యంగా యడిగాడు.

"చింతామణి దీనిని వ్రాసింది! యతని రూపమును చూసి, యది ఎప్పుడూ మురిసిపోతూంటుంది."

"చింతామణి వ్రాసిందా!"

యని యతడు మరింత దిగ్భ్రమచెంది—

"ఇంతలోనే యిటువంటి కళానైపుణ్యము నెలా సంపాదించిది నాతల్లి! ఇందులోకూడా గురువుల సామర్థ్యం వెల్లడి యవుతూంది."

"చింతామణి మునుమ్మాటికీ ఆనందునే ప్రేమించుకొంది—నా మాటయందు నమ్మకం లేకపోతే, తమరే స్వయంగా దానిని యడిగి తెలుసుకోండి!"

"ఎంతమాట మంజులా! నీమాట నమ్మకపోతే నాఆత్మను నేనే వంచన చేసుకోవడంకదా! సరి—యప్పుడు, పురోహితుల రావించి ముహూర్తము నేర్పాటుచేయించి—మీ యన్నగారికి లేఖ పంపుతాను."

"తమ సావకాశమును బట్టి చెయ్యండి. ఇంకొక్క విషయం తమకు మనవి చెయ్యవలసివుంది."

"ఏమిటవి మంజులా?"

"యుక్తవయస్కురాలైన యంతగ తైను రాణివాసంనుంచి కదలనివ్వడం రాచసాంప్రదాయానికి విరుద్ధం."

"యవునవును—విద్యాభ్యాసము నింతటితో కట్టిపెట్టాలని నేనిది వరకే అనుకున్నా. రేపటినుంచి గురువుగదగ్గరకు పోవద్దని చెప్పు—"

"సరి—తమ యభిప్రాయమును తెలుసుకుని చెయ్యాలని యడిగాను."

"ఏ చెడ్డపేరయినా వచ్చిందంటే—వంశాని కపకీర్తి. ఏ రాజకుమారుడూ వివాహమాడడు—మీ యన్నకొడుకు సయితం యసహ్యించుకుంటాడు."

ఆవివరాలన్నీ అనుకోవడ మెందుకులెండి! మన సాంప్రదాయ సమ్మతమయిన పనిని మనం చేసుకుంటే తీరిపోతుంది.''

''మంచిది. ఇహా నేను వెళ్ళవలసివుంది.''

యని చెప్పి, మహారాజు యప్పటికి యంతఃపురమును వొదిలి వెళ్లాడు.

ఆ రోజుకు తమ నిశ్చయమును కుమార్తెకు చెప్పగల యవకాశం మంజులా దేవికి కలగ లేదు. ఆ మరునాటి వుదయం, స్నానాది నిత్యకార్యాలు ముగించుకుని, రాజకుమారి చింతామణి, కస్తూరికాది తిలకములతో యలంకరించుకొని, మేలురకపు దుస్తులు ధరించి, మామూలు అలవాటు ప్రకారం, శోభను వెంటబెట్టుకుని, శాంతిభవనానికి, బాలమహర్షి దగ్గరకు ప్రయాణమై వెడుతుండగా, మంజులా దేవి ఆమెను పిలిచింది.

''తల్లీ! నువ్వింక శాంతిభవనానికి పోవలసింది లేదు.''

''ఎందుకనీ?''

''నీకింక చదువు వొద్దనీ—శాంతిభవనానికి పోవలసింది లేదనీ మీ నాన్నగారు చెప్పారు.''

''అయ్యో! ఎంత నేర్చినా, తరగనివి చదువులు. యంతు లేని విద్యాసాగరాన్ని దాటడానికి ఒక జీవితంచాలదే! యటువంటిది నన్నింతలోనే చదువు చాలించమంటున్నారా!''

''ఇది మీనాయనగారి ఆజ్ఞ!''

''నీవుద్దేశము?''

''నావుద్దేశంకూడా యదే!''

తల్లిమాటకు చింతామణి ఒక నిట్టూర్పును విడిచి, విషాదము ననుభవిస్తుండగా—

''సాంప్రదాయ విరుద్ధమయిన పనులు మనం చెయ్యకూడదు తల్లీ! నువ్విప్పుడు నవయౌవ్వనవతివి— యపురూపసౌందర్యవతివి. పెండ్లీడు వచ్చిన పిల్లవు. యంతఃపురందాటి పోకూడదు. నేడో రేపో మీ నాయనగారు ముహూర్త నిర్ణయం చేయించి—శుభలేఖ పంపనై వున్నారు.''

''ఎవరికి?''

''ఇంకెవరికి? నువ్వు మనసారా తలచుకొన్న ఆనందుడికే!''

అని తల్లి చెప్పగానే చింతామణి ముఖం, నవవికసితకోమలం లా విప్పారింది. ఆమె వెంటనే తలకిందికి దించేసుకుంది.

"ఇంకేం? కోరుకొన్నా వరుడు ఇక చదువులు చుట్టబెట్టవలసిందే."

యని శోభ పరిహాసంగా యంది.

"తొందరపడకు—నీకూ తగిన సమయమే—వరుడే యింకా దొరకలేదు."

యని మంజుల యనడంవల్ల, శోభ తిరిగి పెదవికదలించలేదు.

"అయితే—పోయి ఈ సమాచారమును బాలమహర్షికి చెప్పేసి వస్తాను."

యని చింతామణి తల్లి నడగా—

"నువ్వెందుకూ! శోభ పోయి చెబుతుందిలే!"

యంది మంజుల.

"అదేం మర్యాద! ఇంతకాలం కష్టపడి విద్యనేర్పిన గురువులను ఆఖరుసారి దర్శించి—వారి శెలవు తీసుకోవడం విధి—ఇంత మాత్రంలో పోయిందేమీ లేదు."

యని కుమార్తె పట్టుపట్టడంవల్ల—

"సరే అయితే, వెళ్లి త్వరగా వొచ్చెయ్యి."

అని మంజుల యనుమతించింది. చింతామణి శోభతో కలసి శాంతిభవనానికి బయలుదేరి వెళ్లింది.

బాలమహర్షి యప్పటికే తన నిత్యకృత్యాలు ముగించుకుని, శిష్యురాలి రాకకోసం వేచివున్నాడు. చింతామణి నెచ్చెలితో ప్రవేశించి ముందుగా గురువులకు నమస్కరించింది.

"బిడ్డా! ఈదినం కొంచం ఆలశ్యమైంది—కదా?"

"రేపటినుంచి అసలు రావీలుపడదు—ఆ విషయమును తమతో మనవిచేసి, ఆఖరుసారి శెలవు తీసుకొని—తమ ఆశీర్వాదమును పొందాలనే ఇప్పుడు ప్రత్యేకించి వచ్చాను."

అని చింతామణి చెప్పిన దానిని వినగానే బాలమహర్షి కొంచ మాశ్చర్యపడ్డాడు.

"స్వామీ! రాజకుమారికి పెళ్ళి జరుగబోతూంది—కొద్దిరోజుల్లో ముహూర్త నిశ్చయం జరుగుతుందండి! అందుకనే వాళ్లనాన్నగారూ, అమ్మగారూ చదువు మానిపిస్తున్నారు."

అని శోభ—చింతామణి బిడియపడుతున్న సమాచారమును గమనించడంవల్ల, తానే గురువులతో విషయమును చెప్పేసింది.

"ఓహో! సంతోషకరమైన వార్త..."

అని బాలమహర్షి కొంతసేపు పలకకుండా, కళ్లుమూసుకుని దేనిని గురించో దీర్ఘంగా ఆలోచించడం మొదలుపెట్టాడు. తరవాత తిరిగి కళ్లు తెరచి చింతామణి ముఖపద్మంపై దృష్టి నిలిపి—

"రాజకుమారీ! నీగురువులయందు నీకు పరిపూర్ణమైన భక్తి విశ్వాసాలున్నాయా?"

అని ఉన్నట్టుండి యతి అడిగిన ప్రశ్నకు చింతామణి చకితురాలైంది.

"స్వామీ! యిది పరీక్షించి తెలుపుకోవలసిన విషయంగాని, యడిగి తెలుసుకోవలసింది కాదేమో—అయినా, యడిగినప్పుడు చెప్పడం నాకర్తవ్యం. దేవునియందుండే భక్తిభావము—నా ఆత్మపై నాకుండే విశ్వాసము—నాకు నాగురువులపై వున్నాయి. ఇవి నేను త్రికరణ శుద్ధిగా చెప్పే మాటలు!"

"మహాభాగ్! బిడ్డా! నువ్వు గురువులను మించే శిష్యురాలవు కాగలవు. సంతోషము. నీమేలు కోరి నేనొక హితోపదేశమును చెయ్యదల్చుకున్నాను."

"గురువుల అనుగ్రహానికి నేనెప్పుడూ పాత్రురాలను కావాలనే కోరుకుంటున్నాను."

"మంచిది. నావుపదేశమును యమలు జరపగలవో—లేవో—నీశక్తిని నువ్వే తూచుకుని తెలుసుకోవలసిన అవసరముంది."

"గురుదేవా! సందేహించకండి!"

"సందేహపడవలసిన కారణమున్నది. ఏమంటే—నేను నీకు ఉపదేశించదలుచుకొన్నది. ఒక క్రతువు విధానము—ఆయజ్ఞమును పూర్తి చెయ్యడం మహాకష్టం! నీభవిష్యత్తును సుఖప్రదం చెయ్యడం నిమిత్తమే నేనాక్రతువును నీచేత చేయించదలుచుకున్నాను."

"గురువులకు నాపై గలిగిన దయకు సదా కృతజ్ఞురాలిని."

"మంచిది—నే నుపదేశించబోయే యజ్ఞమును నెరవేర్చగలవో లేదో బాగా ఆలోచించి చెప్పు—తొందర లేదు."

"స్వామీ! శిష్యురాలినింకా సందేహించడం ధర్మంగా లేదేమో!"

"నువ్వాచరించబోయే క్రతువు సామాన్యమైనది కాదు—సాధారణ మానవులకది అసాధ్యము. సహనము—సాహసము—సత్యము—స్థయిర్యము—దీక్ష—మొదలయిన ఉత్కృష్ట గుణాలన్నీ ఎంతయినా అవసరం. క్రతువును తీరా ప్రారంభంచేసి, మధ్యలో నిలుపు చేసినయెడల విపరీతఫలితాలు కలుగగలవి. అందువల్లనే మళ్లీమళ్లీ ఆలోచించుకుని, మాట ఈయవలసిందని హెచ్చరిక చేస్తున్నాను."

"నేనందుకు సంసిద్ధురాలనై వున్నాను."

"ఒకవేళ—ఆత్మీయులకుగాని, తలిదండ్రులకుగాని—నువ్వు చెయ్యబోయేది సమ్మతము కాకపోవచ్చు."

"నాథవిమ్మత్తుకు బాధ్యురాలిని నేనుకాని పరులుకారు."

"మంచిది—ఇక నీ ప్రమాణవాక్యంతో నాకు సందేహ నివృత్తి కలుగుతుంది."

"పరమేశ్వరుని సాక్షిగా—గురుదేవుని పాదముల సాక్షిగా—ఏ సందర్భంలోనూ, నాకు ప్రాణభిక్షపెట్టి విద్యలు బోధించిన గురువుల ఆజ్ఞలు మీరను—ఎన్ని కష్టాలు కలిగినా—ఎటువంటి అవాంతరాలు వచ్చినా—వారు నిర్ణయించిన క్రతువును విధివిధాయికంగా పూర్తిచేస్తాను. ఇది నా ప్రమాణవాక్యము."

అని చింతామణి చెప్పినమీదట శాలమహర్షికి పరిపూర్ణమైన తృప్తి కలిగింది.

"రాజకుమారీ! ఇప్పుడిక నామనస్సులో యెటువంటి సంకోచమూ లేదు. సావధానంగా కూర్చుని, నేను చెప్పబోయె క్రతు విధానమును విను."

అని గురువు చెప్పగా, చింతామణి మనస్సును మరింత దృఢం చేసుకుని కూర్చుంది. శోభకూడా ఆమెకు చేరువలోనే కూర్చుని వుండి—శాలకు మహర్షి చెబుతున్న దానిని వింటూంది.

"నిన్ను వివాహం చేసుకునే వరుడికి కొన్ని అర్హతలు కావాలి. అతడు మహామేధావి—అధిక ప్రజ్ఞావంతుడు—పరాక్రమోపేతుడు. అయివుండాలి. నేను నీకు కొన్ని ప్రశ్నలు చెబుతాను. నిన్ను వివాహమాడగోరివచ్చే రాజకుమారుని నువ్వా ప్రశ్నలడగాలి. వాటికి సరియైన జవాబులు చెప్పగల యువకుని మాత్రమే నువ్వు వివాహమాడవలసివుంది. చెబుతాననివచ్చి, చెప్పలేకపోయిన రాజకుమారుని శిర

స్సును ఖండించి కోటద్వారమునకు కట్టించాలి! కోటలోని ఈ శాంతి భవనమును నేను చెప్పిన విధంగా పునర్నిర్మాణము గావించి యజ్ఞ వేదికగా ఉపయోగించాలి. నీప్రశ్నలకు సరియైన జవాబు చెప్పగల రాజకుమారుడువచ్చి, నిన్ను పరిణయ మాడేవరకూ—నువ్వీశాంతి భవనంనుంచి అడుగు బయటపెట్టకూడదు—నువ్వు నీతలిదండ్రులకు తప్ప ఏ యితర నరుడికంటికీ నువ్వు కనుపించకూడదు. నీచెలి శోభ కూడా నీతోవుండవచ్చు. ఈ సమాచారమును దేశదేశముల చాటిం పించి—వివిధ రాజకుమారులకు తెలిసేటట్లు చెయ్యాలి.''

అని కాలమహర్షి చెప్పినదాని నంతటినీవింటే, చింతామణి కెలావుందోగాని, శోభకు మాత్రం తలతిరిగిపోతున్నట్లయింది. ఏమి పలుకడానికీ ఆమె కధికారం లేకపోవడంవల్ల మెదలకుండా మౌన మును వహించింది. చింతామణి, గురువులు చెప్పిన ప్రతి అక్షరమును మెదడుకు పట్టించుకుని యోచన చేసింది.

''రాజకుమారీ! ఇదీ నీవ్రతవిధానము. నీప్రశ్నలకు జవాబు చెప్పగలనని వచ్చి, యజ్ఞవేదికపై నిలిచి, అపజయమును పొందిన రాజకుమారుడు, బంధువు కానీ—స్నేహితుడు కానీ—మరెవ్వరు కానీ—క్షమించదగినవాడు కాదు—నీచేతి కరవాలముతో నిస్సందే హముగా నువ్వతని శిరస్సును ఖండించవలసిందే!''

''చిత్తము.''

''కాలయాపన జరుగకుండా నేను చెప్పిన యేర్పాటులన్నీ చేసి, మూడుదినాలలో క్రతువును—ప్రారంభించెయ్యాలి.''

''రాజకుమారులను నేనడుగవలసిన ప్రశ్నలేమిటో యిప్పుడు చెబుతారా?''

''ఇప్పుడు కాదు—ఏర్పాటులన్నీ పూర్తిఅయి, నువ్వు దీక్షా కంకణమును కట్టుకున్నప్పుడు—నువ్విప్పుడేపోయి—నీతల్లిదండ్రుల కీ విషయమంతా చెప్పు—వారి అనుమతికూడా పొందిరా.''

అని గురువు చెప్పినమీదట అతని దగ్గర శలవుతీసుకుని, చింతా మణి శోభాసహితంగా రాణివాసానికి పయనమై వెళ్ళింది. మార్గంలో—

''ఇదేం క్రతువు—ఇదేం సమాచారం! నాకర్థం కావడం లేదమ్మా! ఆప్రశ్న లెటువంటివో—వాటికి ఒక్క రాజకుమారుడైనా జవాబు చెప్పగలడో—లేడో—''

"ఇష్! అటువంటి ఆలోచనల కిది సమయంకాదు. దేవునిమీద భారముంచి, గురువులు చెప్పినవిధంగా చెయ్యడమే కర్తవ్యం."

"మరి—నీకై నిర్ణయం చెయ్యబడ్డ ఆనందుడు?"

"దైవనిర్ణయం ఎలావుంటే అలా జరుగుతుంది."

"అతనే నువ్వడిగిన ప్రశ్నలకు జవాబుచెప్పి—నిన్ను పెళ్ళి చేసుకుంటే ఎంత బావుంటుంది?"

"అటువంటి ఆలోచనల కిదిసమయం కాదని చెప్పలేదా శోభా!"

అని చింతామణి తీక్షణంగా అనడంవల్ల—శోభ ఆ విషయమును గురించి మరి పలుకలేదు.

"గురువుల ధర్మమా అని, నన్ను నీతోవుండడానికి అనుమతించారు."

"వారు జ్ఞానాజ్ఞానసంపన్నులు-ధర్మాధర్మ విజ్ఞులు-మనయిద్దరివీ శరీరాలు వేరుకాని - ప్రాణాలొక్కటే అని, ఏనాడో తెలుసుకుని వుంటారు."

"ఒకవేళ వారేర్పాటును చెయ్యకపోయినట్లయితే-నేను నీకోసం బెంగపెట్టుకుని చచ్చిపోదును గదా చెల్లీ!"

"చెల్లీ అంటున్నావు-నేను నీకంటే చిన్నదానినా?"

"అదేమో అలా వొచ్చేసింది-నేను ఏళ్లు లెక్కపెట్టలేదు."

"ఏమయినా నన్నింతటినుంచీ అలాగే పిలు! నువ్వలా పిలుస్తుంటే వినడానికెంతో తియ్యగావుంది శోభా! నేను నిన్ను అక్కా" అని పిలుస్తా.

అని ఆయిద్దరూ కన్యలూ మాటలాడుకుంటూ, క్రమంగా అంతఃపురం చేరుకున్నారు.

ఆ సమయంలో మహారాజొక ఆసనంమీదా, దేవీ మంజుల ఒక ఆసనంపైనా కూర్చొని వుండగా వారికెదుట పురోహిత గురువు పంచాంగమును తిరగవేస్తూ తారాబల చంద్రబలాలను లెక్కగడుతున్నాడు. ముహూర్త నిర్ణయానంతరం అతని కీయబడే శాలువలు-జామాదులు-పండ్లు మొదలయినవాటిని తెచ్చి-పరిచారికలు సిద్ధంగా నిలుచునివున్నారు. అదే సమయంలో ప్రియకుమార్తె శోభా సయితంగా రావడమును గమనించి—

"రాతల్లీ! గురువు లేమన్నారు?"

అని దేవీ మంజుల కుమార్తెను వాత్సల్యంతో దగ్గరకు తీసు కుంది. కాని చింతామణి వెంటనే బదులు చెప్పలే.

"రాజకుమార్తె కప్పుడే పెళ్ళికళవచ్చి ముఖాన చిందులాడు తూంది."

అంటూ గణనము నాపుచేశాడు పురోహితుడు.

"వీలయినంత దగ్గరలోనే ముహూర్తమును నిర్ణయం చేయిం చండి."

అని కీర్తికాముడు పురోహితుని హెచ్చరించాడు.

"అదే విచారిస్తున్నాను ప్రభూ!"

అని అతడు తిరిగి పంచాంగమును తిరగవేయడం మొదలు పెట్టాడు.

"ఏం తల్లీ! గురువుగారేమన్నారో చెప్పవేం? ఇక విద్య చాలించుకొంటున్నావనీ-వారిదగ్గరకు పోవడంలేదనీ తెలిపావా!"

"ఆ! అన్నీ చెప్పాను. కాని మీరిప్పుడొక ఆశ్చర్యకరమైన వార్తను వినాలి."

అని చింతామణి చెప్పిన వెంటనే అందరూ ఆమెవయిపు పరి శీలనగా చూడడం మొదలుపెట్టారు.

"నామేలును కోరి-నాభవిష్యత్తు సుఖప్రదంకావడానికి గురు వులు నాచేత ఒక వ్రతమును చేయించడానికి సంకల్పించారు."

అని కుమార్తె చెబుతుండగా——

"వ్రతమా? ఏమిటది తల్లీ?"

అని రాజదంపతు లిద్దరూ ఒకేసారి ప్రశ్నించారు. రాజ కుమార్తె తిరిగి చెప్పడం మొదలుపెట్టింది—

"వారు నాకు కొన్ని ప్రశ్నలు చెబుతారట! ఆ ప్రశ్నలకు సరి యైన జవాబులు చెప్పగల రాజకుమారుణ్ణి మాత్రమే నేను వివాహ మాడాలట-అట్లు చెప్పలేక అపజయమును పొందిన రాజకుమారుల శిరస్సులను ఖండించి మందిరద్వారానికి వ్రేలగట్టాలట-ఈసమాచార మును దేశదేశాలా సాటింపించి రాజకుమారుల కందరకూ తెలుపుదు చేయువలెనట- మూడురోజులలో వారు నిర్ణయించిన ప్రకారం, వ్రతము నారంభం చేస్తాననీ, ఎన్నికష్టాలు కలిగినా భరించి, వ్రత పరిసమాప్తి చేస్తాననీ ప్రమాణం చేశాను."

ఆ సమాచారమును వినేటప్పటికి రాజదంపతుల తలలపై పిడుగులు పడుతున్నట్లయింది. కీర్తికాముని నోటంట అసలు మాటే రావడంలేదు. అతను స్థంభించి పోయ్యాగాడు.

"అయ్యయ్యో! ఇదేమి ప్రతము! ఇదెక్కడి విడ్డూరం తల్లీ! ప్రశ్నలు వేయటమూ-చెప్పలేని రాజకుమారుల శిరస్సులు ఖండించడమూనా! ఇటువంటి దారుణ వ్రతము ఎక్కడా వినలేదు-కనలేదు. పైగా ఆ ప్రకారం చేస్తానని-నువ్వు ప్రమాణం చేశావా—"

అని మంజులాదేవి మితిలేని వేదనను పొందుతుంటే—

"నాకు ప్రాణభిక్షపెట్టి, విద్యాదానం చేసిన గురువులుకదా, నా క్షేమం కోరి చెబుతున్న దానిని అతిక్రమించవచ్చునా అమ్మా!"

అని తల్లిని శాంతపరుప జూచింది చింతామణి. అప్పటికి మహారాజు కొంత స్వస్థత చేకూరుతోంది—

"క్షేమం కావాలంటే - సర్వసౌభాగ్యాలూ ప్రసాదించగలవి-భగవత్ప్రీతికరమయినవీ - ఎన్నినోములు నోచుకోవా? ఎంతవంటి క్రతువులు లేవు? హింసాత్మకమైన యిటువంటి ఘోర వ్రతమా-ఒద్దు-మన కటువంటివేమీ వొద్దు"

అని మహారాజు ఉద్రేకంతో అన్నగూడటే—

"తొందరపడి కార్యనిశ్చయం చేయకండి నాన్నగారూ! గురుదేవులు మహాతపస్సంపన్నులు! మహాత్ములు కూడాను. వారి ఆగ్రహానికి గురయైతే ఏశాపమయినా పెట్టగలరు. అప్పుడు-మనము-మన వంశము, ఏమైపోవాలి?"

అని రాజకుమారి తండ్రిగారికి సవినయంగా నచ్చచెప్పాలని చూచింది, కాని వారికి నచ్చుబడికాలేదు.

"అయ్యో! మన మొకటి తలుస్తే, దేవుడొకటి తలిచాడు! లక్షణంగా పెళ్లిచేయడానికి మాహూర్తనిశ్చయం చేయబోతున్న శుభసమయంలో యిదే మపశకునం-ఈ యవాంతరము నెందుకు తెచ్చిపెట్టావు భగవంతుడా."

అని మంజులాదేవి బాహోపడం మొదలుపెట్టింది.

"నా కేమీ తెలియడంలేదు. మంత్రికి కబురుచేయించు శోభా!"

అని మహారాజు చెప్పిన వెంటనే శోభ ఆతాపును వొదిలివెళ్లి, ప్రభువులు చెప్పినట్లుగానే చేసింది. మరి కొంచంసేపట్లో ధీమంతుడు

రాజసన్నిధికొచ్చి నమస్కరించి నిలిచాడు. కీర్తికాముడు దతనిని కూర్చుండ నియమించి - అదుపరి బాలమహర్షి విషయము-కుమార్తె విషయము అంతా వివరించి చెప్పి—

"ఇందుకు నీ ఆలోచన యేమిటి?"

అని అడిగాడు.

"ఇది దేవరవారి స్వజనానికీ, స్వకుటుంబానికీ, సంబంధించిన స్వవిషయం. తను యిష్టానుసారం చేసుకోడానికి సర్వస్వాతంత్ర్య ముంది. అయితే, బాలమహర్షిగారియొక్క ఏర్పాటును అంగీకరించ డమా లేదా అన్నది, గమకు వారిపై వుండుకొన్న భక్తివిశ్వాసాలపై ఆధారపడ్డ విషయం. వారేదిచేసినా, మనమంచికే అన్నగురి కుదు రితే, వారు చెప్పినట్లు చేయడము-లేకపోతే..."

అని మంత్రి చెబుతున్న దానిని రాజకుమారి మధ్యలో ఖండించి—

"లేకపోతే-అన్న సందేహానికి తావేలేదు. గురికుదరబట్టే, నేను వారి వ్రతవిధానాన్ని సక్రమంగా జరిగించడానికి మాటయిచ్చాను. వారు నాకు ప్రాణదానం చేసినవారు, విద్యనేర్పిన గురువులు, దైవ సమానులు. వారికి మాటయిచ్చి తిరిగిపోవడమంత నీచకార్య మింకొకటి వుండదు." అన్నది.

"రాజకుమారిగా రంత దృఢనిశ్చయంతో చెబుతున్నప్పు డవరేం చెయ్యగలరుప్రభూ!" అని రాజకుమార్తెవైపుచూచి,

"వ్రతనియామా లింతేనా? ఇంకేమయినా వున్నవాతల్లీ."

అని మంత్రి ప్రశ్నవేసినమీదట—

"ముఖ్యనియమాలింతే—మనకోటలోని శాంతిభవనం గురు వులు చెప్పినవిధంగా పునర్నిర్మాణం చెయ్యాలి. ఇతరులెవ్వరూ లోపలికిరాకుండేలాగున పహారాలుండాలి. వ్రతసమాప్తి అయ్యే వరకూ నేను గురువుల సన్నిధానంలో ఆభవనంలోనే వుండాలి. అమ్మగారు, నాన్నగారు, శోభతప్ప నన్నింకెవ్వరూ చూడకూడదు." అని చింతామణి మిగిలిన వివరములన్నీ తెలుపుడుచేసింది.

"అయితే నీతుది నిశ్చయమేమిటి తల్లీ!"

అని కీర్తికాముడు—

"గురువులయాజ్ఞలు పాటించడమే"

అని రాజకుమార్తె—

"కన్నవారిమాటలు వినవలసిందిలేదా?"

అని మంజుల—

"కన్నవారికి సయితము గురువులు, దైవసములు, విశేషించి, అంతరించిపోనున్న వంశానికి ఊపిరి పెట్టినదాతలు. అటువంటి మహాత్ముల ఆజ్ఞలు మీరూ, నేనూకూడా పాటించడమే ధర్మం!"

అని రాజకుమారి—మరియొకమారు ఖచ్చితమైన జవాబు చెప్పగా—

"మంచిది. ఇందుపై వాదోపవాదాలుపెంచి ప్రయోజనం లేదు. భగవంతునిపై భారముంచి, మంత్రీ! నువ్వు బాలమహర్షిని కలుసుకొని, వారుచెప్పిన ప్రకారం ఏర్పాటులన్నింటినీ సక్రమంగా చేయించు. వారికెటువంటి అసంతృప్తి కలుగకూడదు."

అని మహారాజు ఆజ్ఞలు ఇయ్యగా అందుకుని, మంత్రిఅవుతాను వాదిలివెళ్లాడు. అనంతరం కీర్తికాముడు పురోహితునివైపు తిరిగి—

"అయ్యా! విన్నారుకదా! అందుచేత ప్రస్తుతం ముహూర్తం నిర్ణయం చేయవలసిందిలేదు. అవసరమైనప్పుడు తిరిగి వర్తమానం చేస్తాను." అని చెప్పాడు.

"దైవసంకల్పం ఎలావుంటే, అలాజరగవలసిందే కదండీ! చిత్తం—శలవు."

అనిచెప్పి పురోహితుడున్నూ వెళ్ళిపోయాడు. శోభాచింతామణులున్నూ, ఆతావునువాదిలి, తమమందిరానికి నడిచారు.

వికలచిత్తులైవున్న రాజదంపతులు బాలమహర్షియొక్క అపూర్వ వ్రతమునుగురించి తిరిగి తిరిగి యోచనలు సాగించడం మొదలుపెట్టారు.

"గంపంత గండం గడిచిందనీ-బిడ్డబ్రతికి బయటపడ్డదనీ-ఎంతో మురిశాం. నాఅన్నకొడుక్కు వివాహంచేసుకొని, ఆనందునికూడా మన దగ్గరే వుండమనికోరి, అల్లునీ కూతుర్నీ కన్నులపండువుగా చూసుకోవాలని కొండంత ఆశతోవుంటే-భగవంతుడు సహించక, మన ఆశలు విచ్ఛిన్నంచేశాడు-మన కోరికలు తుత్తునియలుచేశాడు. ఆ ప్రశ్న లేమిటో-వాటికి జవాబు చెప్పగల రాజకుమారుడెవరో-అంతా అయోమయంగావుంది. అసలిక బిడ్డకు వివాహమవుతుందో కానే కాదో—"

అని మంజులాదేవి కంట తడి పెట్టుకుని దుఃఖిస్తూ—

"అమ్మాయి చెప్పిందానిని మీరయినా గట్టిగా కాదనలేక పోయారు. ఇప్పుడిక ఏందారి? కుక్కపిల్ల తెలీక మాటయిస్తేమాత్రం, మనమిద్దరంపోయి ఆకాలమహర్షి పాదాలమీదపడి—

"స్వామీ! తెలియనిపిల్ల మాటయిచ్చింది-మా అమ్మాయి కటువంటి ఘోరవ్రతం వొద్దండీ!"

అని ప్రార్థించుకుంటే ఆయన కాదంటాడా!"

అని మంజులాదేవి పశ్చాత్తాపను పొందడం మొదలుపెట్టింది.

"ఇందు గురువుల నేరమేమీ కనుపించదు. మనబిడ్డ మనఅంగీకారమును గాని, మనసలహానుగాని పొందకుండా గురువుగారికి మాట యిచ్చినప్పు డెవరేం చెయ్యగలరు! మాటయిచ్చి తిరిగిపోవడంమాత్రం ఏమంతగౌరవము! అది మనరాచవంశానికి శాశ్వతమయిన మచ్చ కదా! ఇంతకూ ప్రారబ్ధమిలావుంది. నాబిడ్డని ఆనందుకిచ్చి పెళ్ళి చేస్తానని వాగ్దానం చేశాను. ఇప్పుడతన్ని ఏముఖంపెట్టుకుని చూస్తాను. వాళ్లు సన్నోవంచకుడుగా యెంచుతారోయేమో—" అని మహారాజు భయంతో అన్నాడు.

"మనపిల్లగాకపోతే ఆనందుకు పెండ్లికాకపోతుందా? నవమన్మథమూర్తికదండీ! ఎందరు కన్యలయినావచ్చి వరిస్తారు. మనకు ప్రాప్తం లేకపోయినందుకు విచారించాలంతే."

"విచారించి ప్రయోజనమేముంది మంజులా! చింతామణికి గురువులయందుండే భక్తి, ప్రేమహృదయాన్నికూడా దూరంచెయ్య కలిగింది చూశావా!" అన్నది మంజుల.

"అదే నాకూ చాలా ఆశ్చర్యంగావుంది. ఆనందుకోసం అంత వరకూ కలవరించి-ఇప్పుడతనికి దూరంకావడానికి సయితం సిద్ధమై, గురువాజ్ఞప్రకారం, ఘోరము-అమానుషము అయిన వ్రతమును పూనింది!"

అని తిరిగి మహారాజాశ్చర్యమును వెలిబుచ్చాడు.

"ఒక్క విషయంలో మాత్రం నాకు గట్టినమ్మకముంది."

"ఏ విషయంలో మంజులా!"

"చింతామణి తెలివితక్కువది కాదు. ఏ విషయము నాలోచించినా పొరబాటుచెయ్యదు. అతిబుద్ధిమంతురాలు-వివేకముకలది.

ఎంతదూర మాలోచించకుండా గురువులకు మాట యిచ్చివుంటుంది!''

''అలా అనుకునే మనం తృప్తిపడవలసివుంది. ఇంతకూ గురువు లామెకు చెప్పిన ప్రశ్న లెంత కఠినమయినవో మనకు తెలియలేదు.''

''వారామెకు కూడా యింకా వాటిని చెప్పివుండరు-ఏర్పాటు లన్నీ జరిగిన అనంతరంగదా-ప్రశ్నలవిషయం వచ్చేది!''

''ఇంతకూ ఆమె కెటువంటి వరుడు రానై వున్నాడో-మన ప్రయత్నాలు ఎందుకూ కొరగావని మన మింకుమూలంగా మరియొక సారి తెలుసుకోనవలవుంది.''

తలచిన కార్యమును సాధించ లేనప్పుడు, జరిగిన దానితో తృప్తి వహించి వుండడంకూడా, మానవుల కుండవలసిన సద్గుణసంపత్తులలో ఒకటి.

ఆ రాజదంపతులు కుమార్తెను ప్రయత్నంనుంచి విరమింప చెయ్యాలని ఎంతయినా ప్రయత్నించేశారు. గురువులయందుండే భక్తి విశ్వాసములవల్ల, ఆమె తన నిశ్చయమును మళ్ళించక పోవడం వల్ల, వారు పై విధంగా మాటలాడుకుని కొంత మనశ్శాంతిని పొందారు.

రాజాజ్ఞ ననుసరించి, మంత్రి ఆనాడే బాలమహర్షిని కలుసుకుని, శాంతిభవనానికి చెయ్యవలసిన మార్పులు-తోట నుంచవలసిన పద్ధతులు, అన్నింటికీ, ప్లానులు, అంచనాలువేసుకొని పనులన్నీ మూడుదినములలో ముగింప చెయ్యడానికి సమర్థులయిన మనుషులనా యాశాఖలలో నియోగించి-అవసరమయిన ఏర్పాటులను అతిచురుకుగా చేయించడం మొదలుపెట్టాడు.

ఈసమాచారం నగరమంతటా వెంటనే తెలిసింది. కాని ఈ యేర్పాటు ఎందుకొచ్చిందో ఎవరికీ అర్థంకాలేదు, కాని రాజకుమారిని బ్రతికించిన బాలమహర్షి గొప్ప మహాత్ము కలవాడనీ-అత డేది చేసిన ఆమెయొక్క క్షేమానికి మాత్రమేననీ అందరూ చెప్పుకోవడం మొదలుపెట్టారు.

తన యేర్పాటు రాజదంపతులుకూడా అంగీకరించునట్లు చెయ్య గలిగిన శిష్యురాలి ప్రజ్ఞను బాలమహర్షి తనలోతానే పలుసార్లు మెచ్చుకున్నాడు. అక్కడ జరిగిన వివరములన్నీ మంత్రివల్ల తెలుసుకుని, చింతామణికి తనపైవుండు కొన్న భక్తి విశ్వాసాలను మరింత

దృఢంగా తెలుసుకున్నాడు, తనప్రయత్నం వృథాపోలేదనీ- చింతా మణి దీక్షామతియై క్రతువును సక్రమంగా జరిగించగలదనీ-అతడు తనలో నిశ్చయించేసుకొన్నాడు-తృప్తినిపొందాడు!

## 3

కోటకు దక్షిణదిక్కులో సుమారొక మైలుదూరాన వున్నదా రమణీయమైన పెద్దతోట. ఇరవై యెకరముల మేరలో చుట్టూయెత్తయిన ప్రహారీకలిగి, ఆలోపల—మామిడి, పనస, కొబ్బరి, అరటి, సపోటా, ఖర్జూర, పోక, బత్తాయి, నిమ్మ, నారింజ, మొదలయిన రకరకాల ఫలవృక్షులు; జాజి, విరజాజి, సంపగ, చేమంతి, గులాబి, కనకాంబరాది వివిధజాతుల పూచెట్లు; రంగురంగుల పూలతోనిండిన నానారకముల తీగలతో అల్లిబిల్లిగా అల్లుకొన్న లతా నికుంజాలు-పొదరిల్లు-వాటికిమధ్యలో ఎత్తుగా అమర్చబడిన జలయంత్రాలు-ఆజలయంత్రాలనుంచి సదాప్రవహించే ధారాపాతాలు-కన్నులకు పండుగ చేస్తుంటాయి.

ఆతోటకు మధ్యలోవున్నదే శాంతిభవనం. ఆకాలపు శిల్పుల కళావైశారిద్యము-వజ్ర వైఢూర్యాది రత్నములతో అమర్చబడ్డ ఆద్వారము సొగసు-మేలిమిపూతలో దగద్ధగాయమానంగా వెలిగే ఆవింతకాంతులు-జీవకళలు విరజిమ్ముతూ వివిధబంగిమాలలో చెక్కబడి-అజంతా యెల్లోరాశిల్పాలను మరిపించే ఆచెక్కడములు, తిలకించినవారికి కుండిన నగరౌన్నత్యము-ఆమహారాజునకు గల భాగ్య సంపదలు అర్థమవుతాయి. అటువంటి నిర్మాణమయునివంటి ఏగొప్ప శిల్పాచార్యుడికో సాధ్యంకావాలి-నివాసం, మహేంద్రునివంటి వేల్పు రేడుకో యోగ్యంకావాలి!

కాని గతమూడు సంవత్సరాలనుంచీ బాలమహర్షి కది నివాస స్థలముగా యేర్పరుపడింది. అందుకుముందు దాశాంతిభవనంలో మహారాజు, సకుటుంబంగా విడిది చేసి,కొద్దిరోజులు ప్రశాంతగా గడుపుతుండే వాడు-లేదా, వివాహాది శుభకార్యములు జరుగుతుండేవి. ఇతర నగరాధీసులు వచ్చినప్పుడుకూడా ఆభవనం వారి విడిదిగా ఈయబడు తుండేది.

ప్రస్తుతం, గురువుల ఆదేశము ననుసరించి, చింతామణి తల పెట్టిన వ్రతానికి అనుకూలంగా వుండగలందులకుగాను బాలమహర్షి సూచించిన విధంగా కొన్ని మార్పులు చెయ్యబడ్డాయి. గురూత్తము డాదేశించిన విధంగా, మంత్రి సర్వసన్నాహాలూ ఆయత్తపరచాడు. ఆనాడు రాజకుమారి చింతామణి, మంగళస్నానము లాచరించి, సర్వమంగళకరంగా, అమూల్యములయిన దుస్తులు, ఆభరణములు ధరించి, అపరరతీదేవిని మరిపించే సౌందర్య సంపద తొణికిసలాడు తుండగా, తలిదండ్రులదగ్గర శెలవుతీసుకొని, శోభాసహితంగా, ఒక జోడు గుఱ్ఱములబండిపై సపరివారంగావచ్చి, శాంతిభవనం దగ్గర దిగింది. పరివారజనా లామెను చెలియసహితంగా లోపలదిగవిడిచి శెలవుతీసుకొని వెళ్లిపోయారు.

శాంతిభవనం మునుపటికన్న వేయిరెట్లధిక శోభాయమానంగా అలంకరణలు చెయ్యబడింది. చుట్టూ విచ్చుకత్తుల పహారాలతో సైనికదళాలు గస్తీలు తిరుగుతున్నవి. ముఖద్వారమున ఒక పహారా-లోపలిగుమ్మందగ్గర మరియొకపహార. వారు వా రందించే సలాము లందుకొంటూ, రాజకుమారి ఆయా ద్వారములు దాటి క్రమంగా బాలమహర్షి వుండే మందిరం ప్రవేశించి ఆయనకు నమస్క రించి నిలుచుంది.

"విజయీభవా! నీ ఆగమనానికై నేనూ నిరీక్షిస్తువున్నాను. నిర్ణయించిన ముహూర్తందాటకుండా వచ్చినందుకు సంతోషం."

అని బాలమహర్షి కన్య నిరువురనూ కూర్చుండ నియమించాడు.

"నాయేర్పాటును విని నీతలిదండ్రులు నన్ననేకవిధాల శపించి వుంటారు."

"లేదుస్వామీ! తమర్ని వారెటువంటి పరుషవాక్యములుగాని అనలేదు. నాపైవుండే వాత్సల్యంవల్ల, నాముందుగతి యేమవు తుందో అనిమాత్రం చాలా కించపడ్డారు. ఇటువంటి విపరీత వ్రత మును ఎక్కడా చూడలేదని ఆశ్చర్యపడ్డారు."

అని రాజకుమారి చెప్పినదానిని విని బాలమహర్షి చిరునవ్వు ముఖాన చిందులాడ—

"నిన్ని వ్రతమును మానుకోవలసిందని చెప్పలేదా?"

అని అడిగాడు.

"చెప్పారు"

"మరి?"

"ప్రాణత్యాగానికయినా అంగీకరిస్తానుకాని-గురువుల ఆజ్ఞను మీరడానికి నే నంగీకరించనని దృఢనిశ్చయంతో చెప్పాను."

"భళీ! నీ కార్యదీక్ష ఎంతయినా మెచ్చుకోతగివుంది. తరవాత?"

"అప్పుడిక వారు నాకు ప్రతికూలంగా మాటలాడడం మానేశారు. తక్షణం రానించి గురువుల ఆదేశానుసారం అవసరమయిన ఏర్పాటులు చేయించవలసిందని ఆజ్ఞలుయిచ్చారు. వ్రతసమాప్తి అయ్యేవరకూ నే నిక్కడనే వుండడానికి తగిన సౌకర్యములన్నీ చేయించారు."

"బిడ్డా! యిప్పుడిక నువ్వు వ్రతవిధిని ఆరంభంచెయ్యడానికి అన్నివిధములా అర్హురాలవైవున్నావు. నిన్ను పెండ్లాడగోరి వచ్చిన రాజకుమారులను నువ్వడగవలసినవి అయిన ప్రశ్నలు—వాటి నిప్పుడే చెబుతున్నాను-సావధానవై విను-విని గుర్తుపెట్టుకో-ఇదుగో ముందర యీ దీక్షాతోరమును ధరించు."

అని బాలమహర్షి తన తోలుసంచిలో అంతకుముందే సిద్ధం చేసి వుంచబడిన ఒక పసుపుతోరమును తీసి, దానిని నొకమారు తనకన్నులకద్దుకొని, రాజకుమారి ముంజేతికి కంకణంగాకట్టాడు. అనంతరం—

"పశ్నలను చెబుతున్నాను—వినడానికి సావధానం కలిగి వున్నావా?"

అని గురువు హెచ్చరించిన మీదట చింతామణి—

"చిత్తంస్వామీ! సావధానంగా వేచివున్నాను—చెప్పండి."

అని ఆమె చెప్పినమీదట బాలమహర్షి, ఆమెకు తనప్రశ్నల నీ విధంగా తెలుపుదు చేశాడు—

1. ప్రతిజ్ఞ నెరవేరతేకాని, పెళ్లిచేసుకోనని భీష్మించుకున్న ఆరాజకుమారుడెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అత నింకా జీవించి వున్నాడా?

2. పురుషుడైవుండీన్నీ స్త్రీరూపంతో మహర్షిని మోసంచేసి, అతనిదగ్గరుండే మంత్రశూలము నపహరించి, అతనినికొట్టి తరిమి వేసిన ఆయువకుడెవరు? అత నింకా బ్రతికివున్నాడా? మృతుడైనాడా?

3. తపోధనమహారాజు ద్వితీయభార్య అయిన రూపసుందరి గతియేమయినది? ఆతపోధన మహారాజింకా బ్రతికివున్నాడా?

4. ప్రేమించిన వానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ స్త్రీ అయివుండిన్నీ పురుషవేషమును ధరించి, మహర్షి చే కామించబడిన ఆయిరువురు కాంతలనూ అపహరించి, మహర్షి ని ఖండింపబూనిన ఆధీరురాలెవరు? ఇప్పుడామె జీవించివున్నదా? మృతి నొందినదా?

5. శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన భక్తురాలిని మహర్షి కామించిన కారణంవల్ల, ఆయిరువురనూ కారాగృహమున బంధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే తత్త్రైయ మహా రాజింకా బ్రతికివున్నాడా? భక్తురాలెట్లున్నది?

మహర్షి చెప్పిన అయిదు ప్రశ్నలను ఆలకించిన అపూర్వ చింతామణియొక్క ముఖం వెలవెలబోయింది. ఆమె భావమును గమ నించిన గురువు—

"బిడ్డా! ఈప్రశ్నల భావము సామాన్యులు చెప్పలేరు—మహా కష్టవరములయిన యీప్రశ్నలకు జవాబు చెప్పగలవాడే నీచెట్టబెట్టి నిన్ను సుఖపెట్టగలవాడు. నేచెప్పిన అయిదు ప్రశ్నలూ నీకు జ్ఞాపక మున్నవా!"

అని గువు లడిగినమీాదట—

"ఎందుకు లేవు? మీారు చెప్పినవాటిని అక్షరమయినా తప్పు లేకుండా తిరిగి చెబుతాను—చూడండి స్వామీా!"

అని చింతామణి గురువు చెప్పిన అయిదు ప్రశ్నలను నిమిషంలో సక్రమంగా చెప్పడంవల్ల, బాలమహర్షి సంతోషపడి—

"సమర్థురాలవు—ఇక లేచి నాతోరా నీకింకా మరికొన్ని విష యములు చెప్పవలసివుంది."

అని బాలమహర్షి చెప్పగా, చింతామణి లేచి నిలుచుని గురు వుల ననుసరించింది. శోభకూడా వారి వెంబడే వెళ్లింది.

బాలమహర్షి ఆమెను ఒక చిన్న రంగస్థలమువంటి ఒక వేదిక దగ్గరకు తీసుకొని, వచ్చి—ఒక గంటను చూపాడు.

"నీవడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పి, నిన్ను వివాహమాడ గోరినవాడు వచ్చినప్పుడు—ఈ గంట మోగుతుంది. సింహద్వారము

నకును ఈగంటకును సంబంధమున్నది. అక్కడ మీాటనొక్కినయెడల ఇక్కడ యీగంట మోగుతుంది. ఇక్కడ, ఒకదానివెనుక నొకటి రెండు నల్లటి తెరలు వ్రేలగట్టబడివున్నాయి కదా! ఈరెండు తెరల వెనుక రెండు సింహాసనములున్నాయి. ముందు సింహాసనంమీాద నువ్వు కూర్చొనివుంటావు. నీవెనుక తెరలో నేను వుంటాను. ఇదిగో ఈవేదిక కెదురుగా మరియొక చిన్న వేదిక అమర్చబడివుంది. అదే యజ్ఞవేదిక. అక్కడ నీప్రశ్నలకు జవాబు చెప్పదలచిన రాజకుమారుడు నిలుచుని వుంటాడు. నువ్వు తెరవెనుకనుంచి అడగవలసిన ప్రశ్నల నడుగుతావు. ఎదుట నిలచి అతడు జవాబులు చెబుతాడు. అతడు చెప్పిన జవాబులు సరియైనవి అవునా కాదా అని నేను వెనుక తెరలోవుండి వింటూవుంటాను. సరియైనవి కాని పక్షంలో నేనిదిగో నాచేతిలో వుండే యీ చిరుగంటను మోగిస్తాను. నేను గంటను మోగించడమే తడవుగా నీవున్న యీతెర తంతులసహాయంతో ప్రక్కలకు తప్పుకొంటుంది. ఆక్షణం నువ్వివతలికొచ్చి నీచేత అమరి వుండే కరవాలంతో, ఆ రాజకుమారుని శిరస్సును ఒక్కవ్రేటులో ఖండించాలి. ఖండించబడిన ఆ శిరస్సును ఈశాంతిభవన ముఖద్వారానికి వ్రేలగట్టి, దాని మొండెమును, శాంతిభవనానికి వెనుకతట్టున త్రవ్వించబడివున్న కందకములో పడవెయ్యాలి—ఒకవేళ ఆరాజకుమారుడు చెప్పిన జవాబులు సరిపోయినప్పుడు, నేను గంటమోగించను, అందుకు బదులుగా ఒక పుష్పహారమును ఈ తెరసందునుంచి నీకందివ్వగలను—దాని నువ్వు ఆ విజయుడయిన రాజకుమారుని కంఠమున అలంకరించాలి. ఇది వ్రతసమాప్తి—తదుపరి వివాహము!

ఇకముందు ఇందు గురించి నీకు సందేహములు కలుగుటగాని, నన్ను ప్రశ్నలు అడుగుట కాని వుండకూడదు?"

అని గురువులు చెప్పిన దానినంతటినీ సాకల్యంవిని, మనస్సులో ఒకసారి భగవత్ప్రార్థనచేసుకొని, గురువులకు నమస్కరించి—

"స్వామీా! సద్గురువుల నాశ్రయించి, వారి యాజ్ఞలను పాటించడం తప్ప నాకింకేమీా తెలియదు-అదే నావ్రతము." అనిచెప్పింది.

"మంచిది. నీకు శుభములు కలుగును గాక—ఇక వెళ్లి—మీాకై యేర్పరుపబడిన ఆ యా గదులలో ఇచ్చా విలాసంగావుండండి—ఇందే పాకశాల, మీా పరిచారకులు వారి వారి నియమితమైన గదులలో

పనులు చేస్తుండండి. నేను పోయి నాస్థలంలో జపం చేసుకుంటాను. సింహద్వారము దగ్గర గంటమోగించబడినప్పుడుగాని, నీవు నన్ను కలుసుకోవలసిన పనివుండదు—అంతవరకు నేను నేర్పిన విద్యలు సాధన చేసుకొనవచ్చును—తత్సంబంధమై ఏమయినా సందేహములు కలిగినప్పుడు నన్నడగవచ్చును—తెలుసుకోవచ్చును. నేను లోగడ చెప్పినట్టియు, ఇప్పుడు చెప్పినట్టియు నిబంధనలన్నింటినీ మనసులో గుర్తుంచుకుని, ఆ యా సమయాలకు తగిన విధంగా ప్రవర్తించుకోవాలి—ఏ ఒక్కని నియమానికిగాని భిన్నం జరిగినప్పుడు—విపరీత ఫలితాలు కలుగుతే, అందుకు గురువు లెంతమాత్రమూ బాధ్యులుకారని హెచ్చరిస్తున్నాను—ఇక నాజపమునకు వేళయింది. వెళ్లాలి."

అని బాలమహర్షి ఆకన్యలను విడిచి, తనకై నిర్ణయించుకొన్న గదిలోకి వెళ్ళిపోయాడు. చింతామణి శోభలును, తమకై నిర్ణయించబడిన ప్రత్యేక మందిరమును చేరారు.

"చెల్లీ! గురువులు చెప్పిన ప్రశ్నలయొక్క భావం నీకేమైనా అర్థమయిందా?"

అని శోభ అడిగినదానికి—

"మనకెలా అర్థమవుతుంది? ప్రశ్నలను మాత్రమే చెప్పదలచినట్లును—జవాబులు మనకుకూడా తెలుపకుండా—వాటి నతిగుంభనగా వుంచడం వారి అభిప్రాయమైనట్లును—తెలియడం లేదా ఏక్కా?"

"అవి ఒక శాస్త్రానికి సంబంధించిగాని, వేదపురాణాలకుగాని సంబంధించినవి కావే! అంత గూఢమైనవాటి కేరాజకుమారుడు అర్థం చెప్పగలడా అని నాసందేహం!"

"అది వేచివుండి, గమనింపదగిన విషయం కాని ఊహించవలసింది కాదు."

"వ్రతసమాప్తి అయిన తరువాత, దానివల్ల కలిగే సత్ఫలితాలకూడా, గురువులు వివరించారు కారు."

"వారు తెలిపినప్పుడు తెలుసుకోవలసిందే కాని—అడిగి తెలుసుకోడానికి మన కధికారంలేదు శోభా!"

"అందుకే వూరుకున్నా—లేకపోయినట్లయితే, నా సందేహాలన్నింటినీ అడిగేదాన్ని."

"అటువంటి తెలివితక్కువ పనులెన్నడూ చేయకుమీ శోభా! గురువుల కాగ్రహం కలుగుతే పరిస్థితులు విషమించగలవు."

ఆ విషయమును గమనించడంవల్లనే మొదలకుండా పూరు కున్నాను. నీవ్రతవిధానమంతా రాజలోకానికి తెలిసేలాగున, మంత్రి వివిధ నగరాలకు మనషులను పంపి, దండోరాలు వేయించి, సాటిం పులు చేయించి, తక్కువ కాలంలో ఎక్కువమంది రాజకుమారులకు తెలిసేలాగున ఏర్పాట్లు చేయించాము. అనతికాలంలోనే, రాజ కుమారు లొక్కరొక్కరుగా వేంచేస్తారు."

"అంతవరకూ నువ్వేం చేస్తావక్కా?"

"నువ్వేం చేస్తావు చెల్లీ?"

"గురువులు చెప్పిన విధంగా నేర్చిన విద్యలను సాధన చేసు కుంటాను—మరి నువ్వో?"

"నీకు శీఘ్రమే కళ్యాణప్రాప్తి కలగాలని నిత్యమూ దేవి, రాజ రాజేశ్వరిని కొలుస్తాను. మంచి ఆలోచనతోచింది. ఇప్పుడే దేవికి పూజామంటపము నేర్పాటుచేసి—ఈ రోజునుంచీ పూజ మొదలు పెడతాను—"

"పటమేదీ?"

"నువ్వు రాసి ఈయాలి."

"నేనా!"

"అవును—బావ, ఆనందుడి పటం రాయకలిగిన దానవు— నాకొక దేవి పటమును రాసిఇయ్యలేవా యేం?"

ఆనందుని మాట చెవికిసోకగానే చింతామణికి హృదయం వికలమైంది. ఆమె ఒక నిట్టూర్పును విడిచి, కళ్లుమూసుకుంది. కొంచంసేపాగి, శోభ—

"కళ్లుమూసుకుంటా వేమక్కా! నాకు పటం రాసియ్యడం ఇష్టంలేదా!"

చింతామణి తిరిగి హృదయానికి స్థయిర్యం చేకూర్చుకుని.

"అదికాదు! నీకు పటం రాసిస్తాను—ఏవీ—కుంచ, రంగులు, మొదలయినవాటిని తీసుకురా!"

అని చింతామణి చెప్పిన వెంటనే, శోభ వాటిని తేవడానికి సంతోషంతో లేచి వెళ్ళింది.

చింతామణి ఒక గంటలో రాజరాజేశ్వరీ పటమును రాయడం పూర్తి చేసింది. సింహవాహనంపై దేవిచేత త్రిశూలమును పట్టి, సాక్షాత్కారమైనట్లుగానే వుందా చిత్రం. సహజమైన రంగులద్ది, సజీవంగా మాటలాడుతున్నట్లుంది. తను రాసిన చిత్రమును చూసి, తానే విభ్రాంతురాలైంది చింతామణి. వ్రాయడం పూర్తి అయ్యే లోపుగా శోభ పోయి—పూజకు మందిరమును అమర్చి వచ్చింది. రాగానే—శవ మెత్తున మహాభీకరంగావున్న దేవీ పటమును చూచిన శోభకు ఆశ్చర్యభయాలు కలిగాయి.

"అబ్బా! దేవీ విగ్రహం అచ్చుగుద్దినట్లుందక్కా! ఎంత బాగా రాశావు?" అని శోభ చింతామణిని ఎన్నోవిధాల అభినందించింది.

"చెల్లమ్మ పూజకు అర్హమయిన దేవీపటం కావద్దామరి?"

అంది చింతామణి నవ్వుతూ. అనంతర మాయిద్దరూ దేవీ పటమును తీసుకెళ్ళి పూజామందిరంలో ప్రతిష్ఠాపన చేశారు. పరిచారికను పిలిచి పూజ కవసరమైన సాధన సామగ్రిని తెప్పించారు. దీపధూప నైవేద్యములతో పూజావిధానం సక్రమంగా ముగిసిన తరువాత, ఇద్దరూ దేవికి మోకరించి నమస్కారాలు చేశారు. చింతామణి తనలో యేమనుకొందో తెలియదు కాని. శోభ మాత్రం!

"దేవీ! రాజరాజేశ్వరీ! మా రాజకుమారి పూనిన వ్రతవిధానం త్వరలో పూర్తి అయ్యేటట్లు చేసి, ఆమెకు తగిన భర్తను ప్రసాదించు తల్లీ." అని వేడుకొంది.

అదే ప్రకారం శోభ, నిత్యదీపధూప నైవేద్యాదులతో దేవి నారాధించి పూజలు చెయ్యడానికి అలవాటుపడింది.

వారాలుగడిచాయి నెలలుదాటాయి—కాని రాజకుమారి ప్రశ్నలకు జవాబుచెప్పి ఆమెను పరిణయమాడవచ్చిన రాజకుమారుడొక్కడూ కనుపించడు రాజదంపతులకు సహనం సన్నమైంది—వారిలో ఆవేదన పెరిగింది. నెలలుగడిచిన కొద్దీవారిలో తహతహ పెరిగింది. ఆనాడు దేవీ మంజులకు శరీరంలో స్వస్థత చెడివుండడంవల్ల, ఆమె పాన్పుదిగలేదు. అప్పుడు తన మందిరానికి మహారాజు వేంచేస్తున్నాడని పరిచారికలవల్ల తెలుసుకొని, ఆమె మెల్లిగా లేచి కూర్చుంది.

కీర్తికాముడు మంజులాదేవి వున్నదగ్గిరికొచ్చి ఆమెకు చేరువలో ఒక కుర్చీపై కూర్చున్నాడు. ఆమె శరీర పరిస్థితిని ప్రశ్నించి తెలుసుకున్న తరువాత—

''మీ అన్నగారి దగ్గరనుంచి వుత్తరమొచ్చింది. అతనికొలువులోని సహాయమంత్రి దానిని తీసుకొనివచ్చాడు—చదువుతాను. వింటావా?''

అనగా విని, మంజులాదేవి ఒక నిట్టూర్పును విడిచి,

''చదవండి—''అన్నది. హీనస్వరంతో కీర్తికాముడు తనతో తెచ్చిన లేఖను విప్పి యీవిధంగాచదివి, మంజులాదేవికి విని పించాడు.

''విక్రమోపేత, సాహసౌదార్య గుణధామ మగధాధీశ్వర, కుండిన నగరసార్వభౌమ, శ్రీశ్రీశ్రీ కీర్తికామరాజులుంగారి దివ్యసన్నిధికి బావమరది, ధర్మపాలుడు, బిల్వనగరంనుంచి వ్రాసుకొనుచున్న విన్నపములు—

ఉభయకుశలోపరి, తరువాత—నా మేనగోడలు చి। చింతామణి పుష్పవతి అయిన దన్న శుభవార్తనువిని, బ్రహ్మానందనమును పొందితిమి. అది జరిగి యిప్పటికి ఆరుమాసాలకు పైబడ్డది. కాని దరిమిలా, తమవద్దనుంచి యెటువంటి వర్తమానమున్నూ లేకపోవడం ఆశ్చర్యమును కలిగిస్తున్నది. మనం లోగడగావించుకొన్న యేర్పాటు ప్రకారం వీలయినంతత్వరలో ముహూర్త నిశ్చయమును చేయించి—చింతామణీ ఆనందుల వివాహశుభకార్యమును జరిగించవలసినదిగా కోరుతున్నాను. సర్వలక్షణలక్షితురాలైన మాకోడ లెప్పుడువచ్చి, యీయింటిని జాజ్వల్య శోభాయమానం చేస్తుందా అని వేచి వున్నాము. మా చెల్లెలుకు నా ఆశీర్వాదములు చెప్పవలెను. తమ శుభలేఖకై యెదురుచూచు చుందుము.

ఇట్లు,
విధేయుడు.
ధర్మపాలుడు.''

అన్నగారు వ్రాసినవుత్తరము నాలకించిన మంజులాదేవి కళ్ళంట నీటిబిందువుల ప్రయత్నింగా జలజలరాలాయి. ఆమె కంఠం శోకంలో పూడుకొనిపోయింది.

"కర్తవ్యము నాలోచించాలిగాని, దుఃఖపడి ప్రయోజనం లేదు."

అని కీర్తికాముడు కంపించే గొంతుకతో అన్నాడు.

"తానొకటి తలుస్తే దైవమింకొకటి తలచాడన్నది మనందే సార్థకమైంది. అన్నకొడుక్కు నాబిడ్డనిచ్చుకుని, లక్షణంగా పెళ్లి చేసుకోవాలనుకున్నాను."

"అనుకున్నాము—నిజమే—పుత్రులులేని లోటుకూడా తీరుతుందనీ—నాభావిరాజ్యానికికూడా ఆనందుడే అధిపతియై, ఇరువంశాలకూ కీర్తి ప్రఖ్యాతులు తేగలవాడని ఆశించాను—ఒకరియందొకరికి అపరిమితానురాగాలు కుదిరినై—వారిది ఆదర్శదాంపత్యం కాగలదనీ—మనం కన్నులపండుగ్గా తిలకించవొచ్చనీ—యోచించిన యోచనలన్నీ గాలిలో మేడలయినాయి. కలగని కథలయినాయి.

ఇప్పుడే వుత్తరానికి ఏమని జవాబు రాయాలి! వాళ్లేమనుకుంటారు? కావలసిన కళ్యాణం కాకపోగా, లోగడవున్నా బాంధవ్యానికికూడ భంగం కలుగుతుందేమో నని భయంగావుంది."

"కానియ్యండి-ఏది యెలా జరగవలసివుంటే-అది అలా జరుగుతుంది, జరిగిన యథార్థవిషయములన్నిటినీ జాబులోవ్రాసి పంపండి. ఆనందుడికి మరో యోగ్యురాలయిన కన్యనుచూసి వివాహం జరిగించవలసిందిగా వ్రాయండి. ఇక మనపిల్లపై ఆశ అనవసరమని తెలుపుదు చెయ్యండి—"

అని చెబుతూ, ఆమె దుఃఖాతిరేకంవల్ల మరిమాటలాడ లేకపోయింది.

"సరే—నువ్వెక్కువగా ఆయాసపడకు. విశ్రాంతిగా పడుకో-ఉత్తరమును వ్రాయవలసినవిధంగా వ్రాసి, యీదినమే మనిషిని పంపుతాను."

"అమ్మాయి దగ్గరకెళ్లి చూసొచ్చారా?"

"ఈదినంపోలేదు—నిన్నటిరోజున వెళ్లివచ్చాను. ఖులాసాగా వుంది. ఏమయినాసరే వ్రతాన్ని సాగించి తీరాలని కంకణం కట్టుకుంది. ఆరుమాసాలుదాటింది. ఇంతవరకు ఒక్కరాజకుమారుడైనా రాలేదు. అయినాసరే—ఆజన్మాంతం పెళ్ళిలేకుండా అయినా వుం

టుందిట కాని—నియమానికి భంగంకలిగించుకోచుట. గురువాజ్ఞను మీరదుట!"

"ఆదినుంచీ దాని పట్టుదల అంతేకదండీ!"

"గురువులమీద ఆమె కంతటి దృఢ విశ్వాసమేర్పడింది. దానిని త్రిమూర్తులయినా సడలించలేరు."

"శోభ ఏంచేస్తూందీ?"

"ఏంచేస్తుందీ? నీడలాగ యెప్పుడూ మన అమ్మాయినే అనుసరించివుంటుంది. కంటికి రెప్పలాగ కాచుకుంటుంది. మరోకొత్త విషయం ఏమంటే—రాజరాజేశ్వరిపటము నొకదానిని పెట్టుకుని, తమరాజకుమార్తెకు త్వరలో పెళ్లికావాలని, దేవికి ప్రార్థనలు సలుపుతూంది."

"పాపం! మనపాలిట పడ్డ ఆకన్య, కడుపున పుట్టినదానిలాగే వుంది. చింతామణి వివాహమైపోతుందనీ—ఆవెంబడే శోభకు కూడా ఒక చక్కనివరుణ్ణి వెదికి పెళ్లిచెయ్యాలనీ—అనుకున్నాము—ఇప్పుడిక దాని బ్రతుకుకూడా యిరుకుల్లో పడింది."

"ఏదిన్నీ మనంకావాలని చేసిందిలేదు—పరిస్థితులు విషమించాయి—సరే—ఎంత విచారించినా ఇప్పట్లో అవి తొలగేవి కూడా కాదు—ఒంటి విషయంచూసుకో—వైద్యుడికి కబురు చేయించావా?"

"అంతగా అవసరమయితే చేయొచ్చు. ఇప్పుడేమంత విశేషంలేదు."

"విశ్రాంతిగా పడుకో—ఈ గొడవలన్నీ మనసులో తలపోసుకొంటూ, ఆవేదన పడడంవల్లనే, ఆరోగ్యం చెడివుంటుంది."

అని, ఆతరువాత, కీర్తికాముడిక అక్కడవుండకుండా, రాచకార్యాల నిమిత్తం వెళ్లిపోయాడు. మంజులాదేవి విశ్రాంతిగా పడుకోవాలని, పాన్పుపై వాలి కళ్లుమూసుకుంది.



"బావమరది కానీ—బ్రహ్మదేవుడు కానీ—ప్రతీకారం చెయ్యవలసిందే! ఇది అనుమానం—సహించరానిది. తాను సామ్రాజ్యాధిపతి అనీ—నేను సామాన్యనగరాధీశ్వరుడ ననీ చులకనభావమును కలిగివున్నాడు కాబోలు! కూటికిపేదలయితే, కులానికి పేదలుకాదు

గదా!'' ''బలవంతమైన సర్పము, చలిచీమల చేతజిక్కి చావదె సుమతీ'' అన్న యదార్థ మతనికి తెలియదు కాబోలు! మిత్రరాజ్యాధిపతులను పదిమందినీ కూడగట్టుకుని, దండెత్తుతే, కీర్తికాముని వంటి మరి నలుగురు బలవంతులను సయితం అవలీలగా జయించవచ్చు.''

ఔరా! ఎంతసాహసం! భార్యాసమేతంగా నాకు మాటయిచ్చి తిరిగిపోతాడా? రాచవంశాన బుట్టినవాని కిదిలక్షణమా! ఆరుమాసాల నుంచి జాబులేకపోతే—కారణమేమో అనుకున్నాగాని, యిందులో యింత కుట్ర యిమిడివుందనుకోలేదు. నాకొడుక్కి వేరొకకన్యను తెచ్చి పెళ్లి చేసుకోవాలి, చచ్చునలహా, తాను నాకియ్యాలా? ఆదిలో, తనకుమార్తెను నాకొడుక్కియ్యవలసి దని నేను అతని కాళ్ళమీద పడి బ్రతిమిలాడానా? తనంటతాను కన్యనిస్తానని చెప్పి—అభిమానం లేని నీచుడు! యింతలోనే తిరిగిపోతాడా! యోచించి ప్రయోజనం లేదు. మంత్రీ! తక్షణం సర్వసైన్యాలూ సంసిద్ధం చెయ్యి! నేను ఈదినమేపోయి మిత్రరాజ్యసమితో యిందునుగురించి చర్చజరిగిస్తాను. నాకు కలిగిన యీ అవమానం అందరిదిగా భావించి—కీర్తికామునితో యుద్ధంచేసి, అతనిగర్వమణిగి తీరాలని చెప్తాను.''

అని బిల్వనగరాధిపతి, ధర్మపాలుడు, ముఖానరక్తం జేవురించేలాగున, మంత్రి పురోహిత సామంతాది ప్రముఖులుగల నిండుసభలో గర్జనలు చేస్తుంటే, అంతకుముందే వర్తమాన మంపబడ్డ రాజకుమారుడు ఆనందకుమార్, తండ్రిగారు కబురుపెట్టిన కారణమేమో తెలుసుకోవాలని వచ్చాడు. కొడుక్కి తనచేతనున్న జాబునందించి—

''ఇదిగో నీ మామరాసినవుత్తరం. ధనమదంవల్ల కళ్ళను పొంలు కమ్మడంచేత కలిగిన అసర్థకమిది. ఎవడో బాలమహర్షిట—ప్రశ్నలుట! వాటికి జవాబులు చెప్పినవాడే తనకుమార్తెను పెళ్లి చేసుకోవాలట. బాగుందా?''

అని తండ్రిగారనే పుద్రేకపూరిత వచనాలను చెవులతో వింటూనే, కళ్ళతో చేతిలోని జాబును చదవడమును పూర్తిచేశాడు ఆనందకుమార్!

''ఇందుకు ప్రతీకారంగా, యుద్ధసన్నాహాలు చేయవలసింది ప్రభువులసంకల్పం!''

అని మంత్రి చెప్పాడు.

"కుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నట్లు—అతడు చేసినదాని దేసవ్యమయిన పద్ధతి." అని ధర్మపాలుడు తిరిగి అన్నాడు.

మంత్రి—యుద్ధములలో జయాపజయములు దైవాధీనములు—అంతే గాక అదొక హింసాకాండ.

ఆనం—అప్పుడు మీరేమని నిర్ణయించారు?

మంత్రి—ఇంకా యేమీ నిర్ణయం చెయ్యలేదు. అందును గురించి చర్చ జరిగిస్తుండగా తమరువచ్చారు.

ధర్మ—ఈవిషయంలో మిత్రరాజ్యసమితి నాకు తప్పక సహాయం చేస్తుంది. పదిమందీ ఏకమైనప్పుడు—జయమును సందేహించ వలసినది లేదు.

ఆనం—యుద్ధములో కీర్తికాముని ఓడించి, అప్పుడతనికుమార్తెను వివాహంచేసుకోవలె నన్నది గౌరవ ప్రదముకాదేమో!

ధర్మ—క్షత్రియులకది సాంప్రదాయ విరుద్ధంకాదు.

ఆనం—తమప్రశ్నలకు జవాబు చెప్పగల ప్రజ్ఞావంతుడే కావాలని వారు సవాల్ చేసినప్పుడు, మనమే ఆప్రశ్నలకు జవాబు చెప్పి, కన్యను పొందడం గౌరవం!

ధర్మ—ప్రశ్నలకు జవాబు చెప్పలేనప్పుడు, ఆకన్యకామణి కర వాలాని బలికావడంకూడా గౌరవప్రదమేనా?

ఆనం—అదెప్పటికీజరగదు. నేను నాబుద్ధిబలంవల్ల ఆప్రశ్నలకు జవా బులు చెప్పగలను."

ధర్మ—ఏమో! అవి ఎటువంటి ప్రశ్నలో—మనకేం తెలుసు."

ఆనం—మీకు సందేహం అవసరంలేదు. అవి ఎంత కష్టతరమైన సరే నేను చెప్పగలను.

ధర్మ—ఒకవేళ చెప్పలేకపోతే మోసంకదా—

ఆనం—చింతామణి నన్నెంతగా ప్రేమించిందో తెలుసుకొని వుండిన్ని తమరిలా సందేహించడం అనవసరం! మీరన్నట్లు నేను ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పకపోతే మాత్రం—తనభావను తన చేతులతో ఎలాఖండించ గలుగుతుంది? నియమానుసారం పెళ్లి చేసుకోపోవచ్చుగాని—ఆమె నన్నెంతమాత్రమూ వధించదు.

ధర్మ—ఏవయిపాలోచించినా నాకు తృప్తికలగడంలేదు. మంత్రీ నీ తుదినిర్ణయం ఏమిటి? నావుద్దేశ ప్రకారం యుద్ధంచేసి అతని

గర్వమణిగించాలని కాని ఆనందకుమార ఆలోచనవేరు. విన్నావుకదా! ఇందులో యేపద్ధతి నీబుద్ధి కనుకూలమైందో చెప్పు—

మంత్రి—ప్రభూ! నాబుద్ధికి రెండుపద్ధతులూ అనుకూలించలేదు. కావలసినవారితో యుద్ధము, జననష్టము-ఈ హింసాత్మకమైన చర్య నాకంగీకారంగాలేదు. రెండవది, కుమారులు చెప్పి నట్లు, ప్రశ్నలకు జవాబు చెప్పకపోవడంకూడా క్షేమకరం కాదు. ప్రశ్నలకు సరియైన జవాబులు చప్పగల వారిమాగాని, చెప్పలేనప్పుడు రక్తబంధువుకదా అని క్షమించి వొదిలి, పెట్ట బడతారన్న పూర్తినమ్మకంగాని ఏమీలేవు.

ధర్మ—అందువల్ల?

మంత్రి—రాజకుమారునకు తగినరాచకన్య లనేకమందివున్నారు. వారిలో మనసుకెక్కినవారిని వరించి వివాహం చేసుకోవడం మంచిదని నావుద్దేశం.

ఆనం—అది అసలు జరగనిపని—నాకు చింతామణి కానినాడు, నేనాజన్మాంతమూ బ్రహ్మచారిగా వుండగలను. యుద్ధంలో జయించుకొన్న భార్య నాకంతకమునుపే అవసరంలేదు. ఇది నానిశ్చయం—శెలవిప్పించండి.—

అని చెప్పి ఆనందకుమార్ ఆతావును వొదిలి వెళ్లిపోయాడు. మంత్రి, ప్రభు, రాజకుమారుల ముగ్గురదీ మూడు అభిప్రాయాలయి పోయినాయి. ఏ యిద్దరి ఆలోచనా అతకలేదు. ధర్మపాలుడు ఎటూ నిర్ణయం చెయ్యలేక, అంతటితో ఆనాటిసభను ముగించి అతఃపురా నికి వెడలిపోయాడు.

రాణీమాంచాల, ఆనందకుమార్ వల్ల విషయమంతటినీ తెలుసు కొని, కీర్తికాముని చర్యల నెక్కువగా గర్హించింది. దేవీ మంజుల కూడా అతనితోనే యేకీభవించి, యింతకూట పన్నిందని ఆమె మరింత ఆశ్చర్యమును పొందింది. తల్లీకొడుకులూ సందర్భములను గురించే మాటలాడుకొంటుండగా, ప్రభువు ధర్మపాలుడు కూడా అక్కడ ప్రవేశించాడు.

"విషయం తెలిసిందిగదా!"

అని ధర్మపాలుడు అడిగినమీాదట.

"ఆ తెలిసింది! ఇది కేవలం మనల్ని వంచన చెయ్యడానికి పన్నినకుట్ర, మన ఆనందుకంటే, గొప్పవాడో, అందగాడో, ఎక్కువ సామ్రాజ్యం కలిగిన చక్రవర్తో లటస్థం కావడంవల్ల, మనసంబంధాన్ని ఎలాగయినా తప్పించుకోడానికి పన్నిన పన్నుగడిది. పురుషుడు అవివేకంగా ప్రవర్తించినప్పుడు స్త్రీ-స్త్రీ తప్పుడుమార్గం తొక్కినప్పుడు, పురుషుడు, ఒకరినొకరు సరిదిద్దుకోకుండా యిద్దరూ ఒకే గూడుబుఠాణీ చెయ్యడం చాలా అసహ్యంగావుంది. కాలకర్మావశాత్తూ వచ్చిన ఎవరో బైరాగిని మధ్య నడ్డపెట్టి, ఆ రాజదంపతులే యీ నాటకమంతా ఆడుతున్నారు."

అని రాణీ మాంచాల, తను చెప్పదలుచుకొన్న విషయాలన్నింటినీ చకచక, తడుముకోకుండా చెప్పేసింది.

"సరి—మేము నిర్ణయించింది కూడా అంతే. ఇప్పుడు జరిగించవలసిన కార్యక్రమం ఏమిటా అని?"

"వారు పిల్లనీయకపోతే, మనవాడల్లే బ్రహ్మచారిగా వుండిపోతాడా? చింతామణిని తలదన్నగల కన్యలు వందలు వేలూ తయారవుతారు."

"ఆనందు చింతామణినితప్ప యితరకన్యలను వివాహం చేసుకోడట."

"అవునా ఆనంద్!"

"చింతామణి అడిగే ప్రశ్నలకు నేను జవాబు చెప్పగలను—ప్రయాణమైపోయి, ఆమెనుజయించి అప్పుడే పెళ్లిచేసుకొంటాను.

"ఆప్రశ్నలు నీకు తెలుస్తాయని నిమ్మకమేముంది?"

"అవి యెంత కష్టతరములయిన వైనాసరే—నాబుద్ధి కుశలత నంతట నీ వినియోగించి, సాధించి తీరతాను. నామాటలు నమ్మండి."

"ఒకవేళ మారువిధంగా జరుగుతే-ఏకపుత్ర విషయం—మేము బతికివున్నంతకాలమూ నీకోసం తరుక్కుతరుక్కు యేడవాలి."

"అవసరంలేదమ్మా! చింతామణి నాయందెంతప్రీతిగలదో మీాఅందరకూ తెలిసినదే! అటువంటిది తనచేతులతో నా శిరస్సు ఖండిస్తుందా?"

"ఏమైనాసరే తండ్రీ! నువ్వుపోవద్దు-మనకాచింతామణివొద్దు-ఆమె ప్రశ్నలూవొద్దు. మనల నిలా వంచనచేసినందుకు, ఎప్పటి కయినా వాళ్ళకుచ్ఛితం వాళ్ళనే అనుస్తుంది—కానీ లే—"

"నావుద్దేశం యింకోకలావుంది. వాళ్లుచేసిన పరాభవానికి ప్రతిక్రియయేమిటంటే, మిత్రసమితి రాజులనందరనూ కూడగట్టుకుని, కీర్తికాముడిపై దండెత్తివెళ్లి యుద్ధంలో అతన్నినోడించి—అప్పుడు చింతామణిని మనం తెచ్చుకోవాలి."

"ఛా! తగువులాడి కన్యను తెచ్చుకోవడం హీనజాతుల లక్షణంకాని, మనలాంటి వాళ్లకు గౌరవంకాదు."

"మంత్రికూడా నువ్వు చెప్పినట్లే చెప్పాడమ్మా!"

అని ఆనందుడన్నాడు. మంత్రి ఆలోచన, భార్యఆలోచన, ఒకటైనందున ధర్మపాలు డావిషయమును గురించి యికచర్చ చెయ్యలేదు. అయితే, ఆనందుడు పట్టుపట్టిన ప్రకారం అతనిని కుండిననగరం పంపడమా, మానడమా, అదొక్కటే మిగిలిన ప్రశ్న.

"మన కీవుత్తరమును తెచ్చిన వారెవరు?"

అని మాంచాల అడిగినదానికి.

"కుండిన నగరపు సహాయమంత్రి."

అని ధర్మపాలుని జవాబు.

"మీారు తిరిగి బదులేమని వ్రాసిపంపారు?"

"ఏమీా వ్రాయలేదు. జాబునందుకుని చూచుకొని—ఆవేళ మును పట్టలేక చాలాసంతోషించామని చెప్పు—వెళ్లు అని మాత్రం చెప్పేసి, తక్షణం ఆవచ్చిన మనిషిని పంపించేశాను."

"అవు నంతే చెయ్యాలి—అంతకుమించి ఎక్కువ మర్యాద అనవసరం."

"ఇప్పుడింతకూ మనముందుకర్తవ్యం? మంత్రికిచెప్పి, అర్హురాలైన కన్యను అన్వేషించమంటాను."

"చెప్పండి. ఆచింతామణి వివాహాంకంటే, మన ఆనందు వివాహమే ముందుచేయొచ్చు."

అన్న తల్లిదండ్రుల నిశ్చయమును విని—

"మీరటువంటి ప్రయత్నాలేమీ చేయొద్దు—నేను రేపే కుండినవగరానికి ప్రయాణమైపెడతాను. చింతామణి ప్రశ్నలకు జవాబు చెప్పి తీరతాను."

అని ఆనందకుమార్ తన దృఢనిశ్చయను తెలుపుదు చేశాడు. రాజదంపతులు చేసేదిలేక, ఒకరిముఖాలవైపొకరు చూసుకున్నారు.

"మనవాడే మనచెప్పుచేతల్లో లేనప్పుడు ఇక పరులను నేపట్టడం దేనికి?"

అని మాంచాల విషాదమును పొందింది.

"మామాట నిర్లక్ష్యం చెయ్యకు నాయనా! మంత్రీ, అమ్మా, చెప్పిన ప్రకారం నేను యుద్ధప్రయత్నాలు విరమించుకోలేదూ? అదే ప్రకారంగా నువ్వుకూడా నీ అభిప్రాయమును మార్చుకోవాలి."

అని తండ్రిగారు చెప్పినమీదట—

"అది సాధ్యంకాదు నాన్నగారూ! క్షమించండి—నన్ను నిరుత్సాహ పరచకండి, నేనుపోయి తప్పక విజయమును పొందివస్తాను."

అని ఆనందకుమార్ తిరిగి ఖండితంగా చెప్పాడు.

"సరి కానియ్యండి—భగవంతుడేమి చెయ్యనున్నాడో— చిన్నపిల్లవాడు గనకనా. రెండు లెంపకాయలుకొట్టి ప్రయత్నమును విరమింపచేయడానికి—వయసు వచ్చినవాడు—ప్రాజ్ఞుడు. మనం చెప్పవలసింది చెప్పాము—ఇకనప్పుడు ఏంచెయ్యాలి?"

"ఏం ఆనంద్! వినవా?"

"పదేపదే నాచేత ఎందుకు చెప్పిస్తారు నాన్నగారు! నన్ను వెళ్ళనియ్యండి—మరేంభయంలేదు. జయంపొందివస్తాను."

"ధర్మపాలుడాపైన మరి మాటలాడలేదు.

"కొడుకుతో మీరు కూడా వెడతారా?"

అని భార్య అడిగినదానికి—

"కంఠంలో ప్రాణముండగానే నానిచులగుమ్మంలోకి వెళ్లాను."

అంటూ, ధర్మపాలు డాతావును వీడివెళ్లిపోయాడు. కొడుక్కు ఇంకా చెప్పినా ప్రయోజనంలేదనీ-అతను పట్టినపట్టు విడిచిపెట్టడనీ మాంచాలకు తెలుసు. తన బిడ్డకు విజయమును కలిగించి సలక్షణంగా తిరిగి అతన్ని తమ సాన్నిధ్యంలో చేర్చవలసిందని భగవంతుణ్ణి ప్రార్థించడంకంటే, ఆమె యింకేమీ చెయ్యలేకపోయింది.

మరునాడానందుడు ప్రయాణ సన్నాహములు పూర్తిగావించుకొని, తలిదండ్రుల యనుజ్ఞకై వెళ్లగా, వారిహృదయాలు అసమ్మతి తెలుపుతున్నప్పటికీ, విధిలేక అతని నాశీర్వదించారు. ఆనందు అవసరం లేదంటున్నప్పటికీ, ధర్మపాలుడు ఆనందకుమార్ వెంబడి, విశ్వాసపాత్రుడైన సేనానిని తోడిచ్చిపంపాడు. తల్లిమాంచాల, కొడుక్కు మార్గంలో అవసరమైన భోజనసామగ్రిని మూటలు కట్టించి యిచ్చింది. సేనాని ఆమూటలను తనగుఱ్ఱమునకు కట్టించి, మరియొక ఉత్తమాశ్వమును రాజకుమారున కమర్చి, ఇరువురును ఉదయం ఝాముప్రొద్దెక్కు వేళకు ప్రయాణమును సాగించారు.

మార్గంలో అడ్డుతగిలే కొండలను, అడవులను, పల్లెలను దాటుతూ, మార్గాయాసమువల్ల బడలిక కలిగినప్పుడు, అందదు విడిది చేసుకొంటూ, తమతో తెచ్చుకొన్న ఫలహారాదులను, భుజిస్తూ—రాత్రులందు ప్రయాణము చేయక, పగటివేళమాత్రమే గుఱ్ఱములను నడిపించుకొంటూ, మధ్యమధ్య గుఱ్ఱముల నేబచ్చిక బయళ్లలోనో మేపుకొంటూ, అయిదుదినములలో వారు కుండిన నగరము చేరుకున్నారు.

ఆనంద్రు రాకను వినగానే కీర్తికాము డపరిమితమైన ఆశ్చర్యమును పొందాడు. అతని రాకకు కారణమును ఊహించలేక అతని మనస్సు పరిపరి విధాలపోయింది—తాను వ్రాసిన సంగతులను అవమానించి, నిజానిజాలు తెలుసుకోవాలని వచ్చాడా? లేక చింతామణికి నచ్చచెప్పి, ఆమె బుద్ధిని ఆఘోరమునుంచి మళ్లించాలని వచ్చాడా? అదీగాక యిదీగాక, స్వస్థత చెడివున్న మేనత్తను చూసి పోవాలని వచ్చాడా? అని కీర్తికాముడు అనేకరకాలుగా యోచించి; కొసకెటూనిర్ణయం చేసుకోలేక-అతడువచ్చి అంతఃపురంలో వున్నాడని తెలియగానే, తానున్నా అక్కడికిపోయి విషయం తెలుసుకుందామనుకొని వెళ్లాడు.

ఆనంద్ కుమార అప్పుడు దేవీ మంజులదగ్గరనే వున్నాడు. అప్పటికే అతనిరాకకు కారణము నామె తెలుసుకొని వుండడంవల్ల—భర్తనుచూడగానే—

"చింతామణి అడగబోయే ప్రశ్నలకు జవాబు చెప్పాలని వచ్చాడుట!"

అని చెప్పడంలోనే కీర్తికాముడు తెల్లబోయాడు. అతని గుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. కొంతసేపటికి తమాయించుకొని—

"బ్రతుకుపై ఆశగలవారెవరూ ఆ ప్రయత్నం చేయరని చెప్ప లేదా మంజులా!" అని అడిగాడు.

"నేను చెప్పవలసిందంతా అయింది. అయినా మళ్లీ చెబుతా! అన్నవంశానికీ, నావంశానికీకూడా, వున్న మొగనలుసువు—నువ్వొ క్కడవుకదా ఆనంద్! చూసిచూసి పామునోట్లో తలదూరుస్తావా! చింతామణిని యికమరిచిపో—బ్రతికి నువ్వు నాసుఖంగావుండు— నీఒక్కనివల్లనే నా కన్నవారివంశం వృద్ధికావాలి."

అని దేవి మంజుల కంటతడిపెట్టుకోవడం మొదలుపెట్టింది.

"నీకు తెలియకపోయినా, మీవాళ్లు చెప్పలేదా ఆనంద్! నేను మీకురాసిన లేఖలో ఒక్క అక్షరంకూడా పొల్లులేదు. చింతా మణి గురువులయందుండే గురివల్ల ఈవ్రతంచెయ్యడానికి ఉపక్రమిం చింది. ఆమె నీప్రయత్నంనుంచి విరమింపచెయ్యాలని విశ్వప్రయ త్నాలూ చేశాము. కాని ప్రయోజనం కలగలేదు. ఆమెకు శాల మహర్షి చెప్పిన ప్రశ్నలు మహాకష్టతరములయినవి. అందువల్లనే ఆరుమాసాలయినా, ఒక్కరాజకుమారుడుకూడా, ధైర్యంచేసి వాటికి జవాబు చెప్పగలనని ముందుకురాలేదు."

అని కీర్తికాముడు చెబుతుండగా—

"అందుకని నేనాప్రశ్నలకు జవాబు చెప్పలేనని ఎలానిర్ణ యించగరదు?" అని ఆనందకుమార్ ప్రశ్నించాడు.

"చెప్పగలవనికూడా నిర్ణయం చెయ్యలేము—కాని అపజయం కలుగుతే, శిరస్సు తెగిపోతుందని మాత్రం ఖండితంగా తెలుస్తున్న విషయం. ఆనంద్! నువ్వు తొందరపడి వస్తుంటే, నీతలిదండ్రులయినా చెప్పలేదా! నీహితవుకోరి, నీయందుండే వాత్సల్యం కొద్దీ చెబు తున్నాము చెప్పింది వినుతండ్రీ! మీ అత్తకు అసలే స్వస్థత చెడివుంది ఇప్పుడు నీవిషయం మరింత ఆవేదన కలుగజేస్తుంది. మా మాటవిని, ప్రయత్నాన్ని విరమించుకో నాయనా!"

అని కీర్తికాము డెన్నివిధాల చెప్పినా, మంజులాదేవి ఎంత బ్రతిమాలినా—ఆనందకుమార్ పట్టు వొదిలిపెట్టలేదు.

"నాతలిదండ్రులు మీకంటే యెక్కువగానే శ్రమపడిచెప్పారు. కొసకు వారే అంగీకరించి నన్ను పంపినప్పుడు మీ అభ్యంతరం మీముంటుంది. చింతామణి అడిగే ప్రశ్నలకు బదులు చెప్పగలనన్న ధైర్యం నాకుంది. నేను తప్పక జయమును పొందుతాను-ఆశీర్వదించిపంపండి."

అని ఆనందకుమారు దృఢనిశ్చయంతో చెప్పినందువల్ల, ఆ రాజదంపతులు చేసేదిలేక, అతని అదృష్టమెలావుంటే అలాజరుగుతుందని, భగవంతునిమీద భారముంచి, వూరుకున్నారు. అతని ప్రాణాలు రక్షించవలసిందని యిష్టదేవతలను ప్రార్థించుకోవడంకంటే వారింకేమీ చెయ్యలేకపోయారు.

విజకుమార్తెనే ప్రయత్నంనుంచి తేనప్పుడిక వారు మేనల్లుడికా చెప్పగలరు?

చింతామణి, శాంతిభవనంలో వున్నదని తెలుసుకొన్నప్పటి నుంచీ ఆమె నెప్పుడు చూదునా, ఆమె అడిగిన ప్రశ్నల కెప్పుడు జవాబులుచెప్పి, విజయమును పొందుదునా, అని, ఆనందకుమార్ తహతహ పడుతున్నాడు—అతని హృదయం మేఘాలమీద పరుగులెడుతూంది. అత్తతోను మామతోనూ చర్చలు ముగిసిన వెంబడే పోవడాని కదిరాత్రి సమయం కావడంవల్ల, అప్పటి కతికష్ట మీద మనసు నెలాగో అరికట్టుకొని, తెల్లవారిన వెంటనే నిత్యకృత్యాలు నెరవేర్చుకుని, ఉచితమయిన దుస్తులు ధరించి, తోడువచ్చిన సేనానిని వెంటబెట్టుకొని, దేవీ మంజుల దగ్గర, కీర్తికాముని దగ్గర శలవు తీసుకొని శాంతిభవనానికి అశ్వారూఢుడై బలుదేరాడు. ఎక్కువదూరం లేక పోయినందువల్ల ఆతావును అనతికాలంలోనే పోయి చేరుకున్నాడు.

సర్వస్వతంత్రంగా లోపలికిపోతున్న అశ్వారోహులను విచ్చుకత్తులతో నిలచిన-కావలివా రాపుచేశారు. అందుకు రాజకుమారుడు ఆగ్రహావేశంతో—

"ఎందు కాపుచేస్తారు? నేనెవరో మీకు తెలుసునా?" అని అడిగాడు.

"ఎవరయినా కానియ్యండి—లోనికి పోయేదానికి కాదు."

"మంచిచెడ్డ లాలోచించకుండా మాట్లాడుతున్నారు—నేను మహారాజుల మేనల్లుణ్ణి—"

అని ఆనందకుమారనగా—

"అనక మీకు మాటొస్తుంది—ముందర రాజకుమారుని లోనికి పోనియ్యండి."

అనికూడా వున్న సేనానికూడా కావలివారిని హెచ్చరించాడు.

"మిమ్మల్ని లోనికి పోనిస్తేనే మాకు మాటొస్తుంది. చింతామణి అడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పి, ఆమెను వివాహమాడ గోరి వచ్చినవారికి తప్ప అన్యులకు ప్రవేశంలేదు."

"ఈ రాజకుమారుడు వచ్చిన దందుకే! త్వరగా లోనికి పోనియ్యండి."

అని సేనాని చెప్పగా విని, పరిచారకులు అపరిమితమయిన ఆశ్చర్యమును పొందారు.

"అందుకు తెలిసిన నిబంధనలన్నీ మీకు తెలుసునా!" అని అందులో ఒక కావలివాడు ప్రశ్నించాడు.

"ఓ అన్నీ తెలుసు."

అని ఆనందకుమార్ సగర్వంగా బదులు చెప్పాడు.

"రాజకుమారి అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పలేనివారి శిరస్సు ఖండించబడుతుంది. మావిధి ననుసరించి చెబుతున్నాము." అని ఒక భటుడు చెప్పాడు.

"సరి—సరి—మాకంతా తెలుసు. ముందర దారివిడు."

"అప్పుడుకూడా మీరు లోపలికి పోవఒసినపనిలేదు—ఇదుగో—యిక్కడున్న యీమీటను నొక్కినయెడల, లోపల గంటమోగుతుంది. వెంటనే రాజకుమారి చెలికత్తెవచ్చి మిమ్మల్ని లోపలికి తీసుకుపోతుంది."

అని ద్వారపాలకుడు చెప్పిన వెంటనే ఆనందకుమారాతను చూపిన మీట నొక్కాడు.

గంటారవమును వినగానే, పూజామందిరం దగ్గరవున్నా శోభ చరచర పరుగెత్తి చింతామణి వున్న దగ్గరకుపోయింది. గురువుగారి దగ్గరకు పరుగెత్తుతున్న ఆమెను మధ్యసావడిలో కలుసుకుంది.

"ఇదేమిటక్కా! ఎన్నడూ లేని దీవేళ గంటమోగింది."

అని చింతామణి వేగంగా కొట్టుకొనే గుండెలను పదిలపరుచుకొంటూ, తడబడే మాటలతో అంది.

"ఏ రాజకుమారుడో వచ్చివుంటాడు."

అన్నది.

అయినప్పుడూ, తక్షణం బాలమహర్షి వుండే గదిలో ప్రవేశించారు. అతడున్నూ తక్షణం చేతిని పుస్తకమును మూసి—

"అవును—గంటను నేనుకూడా విన్నాను." అన్నాడు.

"స్వామీ! కర్తవ్యం?"

అని చింతామణి అడిగింది.

"అంతా పూర్వం చెప్పిన విధంగానే—శోభపోయి ఆరాజకుమారుని లోపలకు తీసుకొస్తుంది—నువ్వు నీకై అమర్చబడిన తెరవెనుక—నేను నాకై అమర్చబడ్డ తెరవెనుక—సంసిద్ధులమై వుండాలి."

అని గురువులు చెప్పిన వెంబడే శోభ ఆతావును వీడిపోయి—ద్వారందగ్గర వేచివున్న ఆనందకుమారును, తని అనుచరునీ చూచి నిర్ఘాంతపోయింది.

"ఎందుకలా తెల్లబోతావ్! లోపలికి దారియెటు?"

అని ఆనందకుమారు ప్రశ్నించగా—

"పెద్దల అనుమతి పొందే వచ్చారా?"

అని శోభ అడిగింది.

"అదంతా నీకనవసరం—నీపని నువ్వుచెయ్యి."

అని ఆనందకుమారు తీక్షణంగా అనడంచేత, శోభ నిమిష మాలోచించి—

"అయ్యా, కొంచంసేపు యిక్కడే వుండండి—నేను తిరిగి వచ్చి తమర్ని లోపలకు తీసుకుపోతాను."

అని ఆమె తిరిగి లోపలికి పోయింది. అప్పటికే చింతామణి నిర్ణీతస్థలంలో సంసిద్ధురాలై వుంది. ముదురుగులాబి రంగుగల బనారసు జరీచీర నొకదానిని ధరించి, దాని కనువయిన రవికను బిగించి, అల్లిన కురులను పూలచెండుతో అమరించి—కళ్లకు కాటుక, నొసట పెండ్లితిలకము, శిరమున తురాయి, నడుమున జీరాడే ఒక నిసితకరవాలము, ముఖాన దృఢనిశ్చయము—కళ్ళలో కార్యదీక్ష తొణికిసలాడుతున్నాయి. అప్పుడాసుందరిని ఒక కోణంనుంచి చూస్తే, ఆమె తన వాడిచూపులతో, అందాల దొంతరలతో, యౌవనపు పొంగున పొడుచుకొచ్చే బంగారు ముద్దలవంటి శింగారపు కుచోబరువులతో

చురుకు బాణాలవంటి చూపుకోణాలతో—పురుషజాతిని సమ్మోహితులుగా చెయ్యడానికి అవతరించిన అపరరతీదేవేమో అనిపిస్తుంది. మరో కోణంనుంచి చూస్తే, అపరకపరాక్రమేపేత, రణరాణీఝాన్సీయో—రాణీ ప్రమీలో అని తోస్తుంది.

ఒంటరిగా వచ్చిన శోభను చూచి, ఆశ్చర్యంతో—

"ఎవరూ రాలేదా?" అని అడిగింది.

"బావ—ఆనందుడే—వొచ్చాడక్కా!"

అని శోభ చెప్పినమాట వినేటప్పటికి చింతామణి తల తిరిగిపోయింది. ఆచోటున నిలవలేకపోయింది. వెంటనే తన గదిలోకి వెళ్ళిపోయి, పాన్పుమీదపడి వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. శోభకు కర్తవ్యం తెలిసిందికాదు. ఆమె వెర్రిదానిలాగ దిక్కులు పరికించడం మొదలుపెట్టింది.

"అయ్యో! అక్కా! నాలాంటి పాపిష్టిది ఏలోకంలోనూ వుండదే! బావ! అయ్యో ఎందుకొచ్చాడే! ప్రేమించిన బావను పెళ్లాడలేకపోగా—అనున్నదమూర్తి కత్తుక నీపాడుచేతుల్తో ఎలా కొయ్యనే? ఆసుకుమార శరీరంనుంచి ప్రవహించే రక్తధారల నీపాడుకళ్ళతో ఎలాచూడగలనే? ఆ అందగాని నాప్యాంగా కౌగలించవలసిన నాపాపిష్టి చేతు లీఘాతుక కృత్యానికి—ఆనవమోహనమూర్తి చూపుల్తో నాచూపు లేకంచేసి ఆనందభారంతో మైకంవల్ల మూసుకుపోవాలిసిన యీకళ్లు ఈ ప్రళయకాల భయంకర కృత్యాన్ని చూడ్డానికీ విని యోగించాల్సిందే? శోభా! శోభా! అక్కా! చెప్పవే—నాకేందారి—?"

అని చింతామణి, హృదయం ప్రీలిపోయేటట్లు వలవల యేడుస్తుంటే—తిరిగి గంట గణగణ మోగింది.

"అదుగో! మళ్లీ గంట మోగించాడు—అతను వేగిరపడుతున్నాడు." అని శోభ హెచ్చరించింది.

"చెప్పు శోభా! త్వరగా చెప్పు. నేనేంచెయ్యాలి? గురువుగారు చెప్పిన ప్రశ్న లతికష్టతరములు. బావ జవాబు చెప్పలేడు. నిష్కారణంగా నాకరవాలానికి బలిఅవుతాడు. అతన్ని రక్షించడానికేమిటి దారి?"

అని చింతామణి తొందర చేయడంవల్ల—

"నేనేం చెప్పగలను? గురువుల శాసనం అతిక్రమించవలసినదైంది. వీరాగ వని యిదివరకే మాటనిచ్చావు—అయినా వారిని ప్రార్థిస్తే ఏమయినా లాభముంటుందేమో!" అదిం శోభ.

"ఏమని ప్రార్థించాలి శోభా! చెప్పు త్వరగా చెప్పు."

"ఆనందు నీమేనత్తకొడుకనీ—ప్రశ్నలకు జవాబు చెప్పడానికి ప్రప్రథమంలో వచ్చిన రాజకుమారుడితనే గాబట్టి, ఒకవేళ ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోయినప్పటికీ—అతన్ని ఖండించకుండా, క్షమించి ప్రాణాలతో వొదలడానికి అనుమతిం వలసిందనీ———"

అని శోభ చెబుతుండగా, బాలమహర్షి స్వయంగా అక్కడకు వచ్చాడు, చింతామణి ఖంగారుతో లేచినిలుచుకొని—కళ్లనీళ్లు తుడుచుకొంటుండగా అతను చూశాడు.

ఏమయింది? రెండోసారికూడా గంటమోగించిన, ఆరాజ కుమారుడెవర్నో లోపల ప్రవేశపెట్టలేదేం?"

అని తీక్షణంగా అడిగాడు.

"స్వామీ! ఈ సందర్భంలో నాదొక చిన్న మనవివుంది. ఆవచ్చిన రాజకుమారుడు నామేనమామ కొడుకు. మన ప్రశ్నల కతడు జవాబు చెప్పగలడనే నమ్మకంలేదు. అప్పుడు నియమాను సారం అతని శిరస్సును ఖండించవలసివుంది. కాని రక్తస్పర్శకల వాడవడంచేత మనస్సు బాధపడుతుంది. అతడు ప్రపథమంలో ప్రశ్నలకు జవాబు చెబుతానని వచ్చినవాడుగనుక, చెప్పలేక పోయి నప్పటికీ ప్రాణములతో వొదలిపెట్టవలసిందని ప్రార్థన!"

అని చింతామణి, లేని ధైర్యమును తెచ్చుకుని, సాహసించి గురువుల నడిగింది.

"ఒక దీక్ష—ఒక నియమం లేనప్పుడు, ఏకార్యంకాని కొనసాగదు. మనకు హితులైనవారిని ఒకవిధంగాను—కానివారిని మరొక విధంగానూ యెంచి ప్రవర్తించడం ధర్మబద్ధం కాదు గదా! ప్రతారంభంలో, ఇది మహాకష్టతరమైన యాగమనీ, తాహతుకలవాళ్ళే చెయ్యాలనీ, విపులంగా వివరించాను."

అన్న, గురువుల వ్యతిరేక భావమును గమనించగానే, చింతామణి కళ్ళనీళ్లు తిరిగి సంతతధారాపాతంగా ప్రవహించడం మొదలు పెట్టాయి. బాలమహర్షి తిరిగి ఆమెకు హెచ్చరిక చేశాడు—

"ఒక శుభమును కోరి కార్యసాధనకు పూనుకొన్నప్పుడు, మధ్యలో అనేక అశుభములు—అవాంతరాలూ కలగడం సహజం. సాహసంతో వాటి నెదిరించగలవారికే శుభములు ప్రాప్తించగలవు."

"హృదయము నాక్రమించిన మనోహరుడు హతమైపోయి నప్పుడు నాకింకేమి శుభములు స్వామీ! అతనిని పెళ్లాడలేదన్న విచారం నాకు గోరంతయినా లేదు. కాని కుటుంబానికి ఏకైక పుత్రుడు—నూరేళ్లు బ్రతికి సుఖములు పొందదలచినవాడు—అతని వల్ల వంశములు వృద్ధికావలసివున్నా—ఈ ఒక్కనిమాత్రం ఖండన లేకుండా—"

"చాలు—ఇంత హృదయ దౌర్బల్యంగలదానవని ముందర తెలిసిందిగాదు. చవిటినేలలో ప్రశస్తబీజమును నాటడం నాదితప్పు—"

"స్వామీ! కరుణ, మానవజాతికిగాక, రాక్షసజాతికుండదు గదా!"

"రాజకుమారీ!"

"స్వామీ!"

"నాముఖంలో కొకసారి చూడు!"

ఆమె చూసింది.

"నీముంజేతి దీక్షాకవచం వయిపు చూసుకో."

ఆమె ముంజేతిని ధరించుకొన్న తోరవయి పొకసారి చూచుకుంది.

"దానిని దేనికి గురుతుగా ధరించావు?"

ఆమె జవాబు చెప్పలేదు.

"నీగురువు ఆజ్ఞ—ప్రమాణము—"

ఆమె ముఖ మెఱ్ఱబారింది. దానికికూడా జవాబు చెప్పలేదు.

తిరిగి మరొకమారు గంట మోగింది.

"అయితే—గురువాజ్ఞను మీరిన పాతకరాలవు కాగలవా!" ఆమాట చింతామణికి, తన శరీరమును తాను మరచేటంత ఉద్రేకమును కలిగించింది. అశ్రుపూరితాలయిన నేత్రాల నొకసారి విదిలించి—

"లేదు! నేను గురువాజ్ఞను మీరను! నాహృదయ మిప్పుడు కఠినపాషాణ సదృశమయింది! శోభా! వెళ్లు—త్వరగా వెళ్ళి, ఆ రాజకుమారుని, లోపల ప్రవేశపెట్టు."

అని ఆమె ఆవేశంతో చరచర నడచిపోయి నిర్ణీతస్థలమున సంసిద్ధురాలై నిలిచింది.

"నువ్విప్పుడు నిజమైన ప్రతదీక్షాపరురాలవు!"

అంటూ బాలమహర్షి కూడా ఆమె ననుసరించాడు! మరి కొంచంసేపట్లో రాజకుమారుడు వచ్చి, వేదికపై నిలిచాడు. ఆవిషయమును శోభ, తెరలో కొచ్చి చింతామణికి చెప్పింది.

ఆమె తెరలోవుండి రాజకుమారు నుద్దేశించి యిలా చెప్పింది.

"రాజకుమారా!"

"చింతామణీ!"

"నీ పేరు?"

"ఆనందకుమార్!"

"నివాసము?"

"బిల్వనగరము—"

"తండ్రి పేరు."

"ధర్మపాలమహారాజు!"

"నానిబంధలన్నీ నీకు తెలుసును కదా!"

"ఆహా! తెలుసును."

"నా ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోతే నీశిరస్సు నిర్దాక్షిణ్యంగా ఖండించబడుతుంది. అందుకు సంసిద్ధుడవుగా వున్నావా!"

"ఆ! వున్నాను"

"వెర్రివాడా! బ్రతుకుపై తీపివొదిలి, యింత అవివేకంగా ప్రవర్తించడం నీకు క్షేమంగాదు. నా ప్రశ్నలు బహుకష్టతరమైనవి. నువ్వు నా శాస్త్రీయు డవడంవల్ల హితవు చెప్పకల్గుతున్నాను. వ్రత నియమాన్ననుసరించి ఇదికూడా కూడని మే! అయినా సాహసించి చెబుతున్నాను. ఇతరుల కిలా చెప్పను. ఇప్పటికైనా నువ్వు నీ ప్రయత్నాన్ని విరమించుకొని త్వరగా వెళ్ళిపో. నూరేళ్ళ బ్రతుకును ఎందుకు వృధాచేసుకుంటావు? నీచింతామణిని మరచిపోయి, అర్హురాలయిన మరొక రాచకన్యను చేపట్టి సుఖించు."

"అది జరగనిపని. నీ ప్రశ్నలకు సరైన జవాబులు చెప్పగల నన్న ధైర్యముండబట్టే రావడమైంది."

"ఆ యాలోచన సరియైనదికాదు. ఇప్పటి కారుమాసములు దాటినా నాప్రశ్నలకు జవాబు చెబుతానని సాహసించివచ్చిన రాజకుమారుడు ఒక్కడూ లేడు. నిండుప్రాణాన్ని బలి ఈయడానికి ఎవరు సాహసం చేస్తారు. తొలుదొల్తగా నువ్వే తయారయినావు. నీయందు నాకు జాలికలుగుతూంది. చిన్ననాటినుంచీ మనసులు కలుపుకొన్న ప్రాణప్రియులం కాబట్టి, స్వంత మేనమామకొడుకువు గాబట్టి, అవకాశమిస్తున్నాను. ప్రశ్నలను వినకముందే వెళ్ళిపో–ప్రాణరక్షణ చేసుకో–ఇదే నీకు నేను చెప్పగల హితవు–చెయ్యగల ఉపకారము!"

"అవసరంలేదు. నువ్వు నావిషయంలో యెటువంటి సానుభూతిగాని—జాలికాని—చూపవలసిన పనిలేదు. నీప్రశ్న లెంత కఠినములయిన వయినా సరే—నేను జవాబు చెప్పగలను—కాలయాపన చెయ్యక, అవేమిటో త్వరగా చెప్పు—"

అని ఆతడు మూర్ఖంగా తొందరచెయ్యడంవల్ల, చింతామణి కతని విషయంలో ఇంతవరకు వుండుకొన్నదయ—సానుభూతి, తొలగిపోయాయి.

"సరి–అయితే విను–నాప్రశ్నలను శ్రద్ధగా విని–వాటికి సరియైన జవాబులు చెప్పు—"

అని ఆమె తన అయిదు ప్రశ్నలను యీవిధంగా చెప్పడానికుపక్రమించింది.

1. ప్రతిజ్ఞ నెరవేరతేకాని, పెళ్లి చేసుకోనని భీష్మించుకున్న ఆ రాజకుమారుడెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అతనింకా జీవించి వున్నాడా?

2. పురుషుడై వుండీన్నీ స్త్రీరూపంతో మహర్షిని మోసంచేసి, అతనిదగ్గరుండే మంత్రశూలము నపహరించి, అతనినికొట్టి తరిమివేసిన ఆయువకుడెవరు? అతనింకా బ్రతికివున్నాడా? మృతుడైనాడా?

3. తపోధనమహారాజు ద్వితీయభార్య అయిన రూపసుందరి గతియేమయినది? ఆతపోధన మహారాజింకా బ్రతికివున్నాడా?

4. ప్రేమించిన వానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ స్త్రీ అయివుండీన్నీ పురుషవేషమును ధరించి, మహర్షిచే కామించబడిన ఆయిరువురు కాంతలనూ అపహరించి, మహర్షిని

ఖండింపబూనిన ఆధీరురాలెవరు? ఇప్పు డామె జీవించివున్నదా? మృతి నొందినదా?

5. శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన ఆ భక్తురాలిని మహర్షి శపించిన కారణంవల్ల, ఆయురుపురమూ కారాగృహమున బంధించి, వ్యభిచారి నిర్మూలనకు పాటుపడే తత్ప్రత్రేయ మహారాజింకా బ్రతికివున్నాడా? భక్తురాలెట్లున్నది?

"రాజకుమారా! విన్నావుకదా! ఇవే నాప్రశ్నలు—అందుకు నువ్వు చెప్పగల జవాబులేవి?"

రాజకుమారుడు తెల్లబోయి చూడడమేగాని—అతని నోటంట ఎటువంటి మాటారావడంలేదు.

"ఏం? మాట్లాడవేం! జవాబు చెప్పడం చేతకాలేదా?" అని చింతామణి తిరిగి హెచ్చరించినప్పటికీ అతనినుంచి బదులు రాలేదు. వెనుక తెరలోనుంచి చిరుగంట మోగింది తంతుల సహాయంతో, తెర, హస్తక రెండుగాచీలి, రెండువైపులకూ తొలగిపోయింది. చింతామణి తటాలున యివతలకు వచ్చి, ఒరనుంచి కత్తిని దూసింది. ఆనందకుమారుని ఖండనవైపు చూడగానే ఆమె నేత్రాలశ్రుపూరితాలయినాయి. తిరిగి హృదయదౌర్బల్యం మేల్కొంటుందని, వెంటనే ఆమె ఒకచేతితో కళ్లుమూసుకొని రెండవచేతితో కరవాలమును ఝుళిపించి, ఒక్కవేటున ఆనందకుమారుని శిరస్సును ఖండించింది. వెంటనే కళ్లు తెరచి —రక్తసిక్తమైయున్న తన కరవాలంపై పొకసారి, రెండుగా తెగిపడివున్న రాజకుమారుని శరీరంనుంచి సంతతధారాపాతంగా ప్రవహిస్తున్న రక్తవాహినిపై పొకసారి, తిలకించేటప్పటికి ఆమె కళ్లు తిరిగిపోయాయి. శరీరం కంపించి, భూమిపై నిలవలేక కిందపడి మూర్ఛపోయింది.

కాలమహర్షి శోధ, మరికొందరు పరిచారికలు బిరబిరవచ్చి ఆమెను లోపలికి తీసుకుపోయారు. చన్నీళ్లు ముఖానకొట్టి, కొంతసేపు శైత్యోపచారాలు చేసినమీదట, ఆమెకు మామూలు స్పృహ కలిగింది. కళ్ళు తుడుచుకొని, పాన్పుదిగి నిలుచుంది. చుట్టూ నిలిచిన పరివారాన్నీ, కాలమహర్షిని పరికిలించింది.

"నావిధి నేను నెరవేర్చానా?"

అని ప్రశ్నించింది.

"రాజకుమారీ! నీ వ్రతదీక్ష కేటువంటి భంగమూ కలుగలేదు. నీవిధిని నువ్వు లక్ష్యంగా నిర్వర్తించగలిగావు. నువ్వు తప్ప అన్యు లెవ్వరూ ఇంతటి సాహసకార్యమును చెయ్యలేరు. మొదటిసారి కావడంవల్ల కొంచం తొట్రుపాటును పొందుతున్నావు. ముందు ముందు ఇదికూడా వుండదు!"

అంటూ బాలకుమార్తె శోభవైపు తిలకించి—

"శోభా! సేవకులను రావించి, మిగిలిన కార్యమును పూర్తి చేయించు ఆ రాజకుమారుని శిరస్సును ఈశాంతిభవన ముఖద్వారా నికే వ్రేలగట్టించు — మొండెమును వెనుకతట్టు నున్న కంటకములో పడవేయించు."

అని ఏర్పరచి అగ నాతావును వొదిలి వెళ్ళిపోయాడు. గురువుల ఆజ్ఞలను అమలు జరిపించడానికి శోభ బయలుదేరింది. తన విధిని తాను నెరవేర్చిందే కాని, చింతామణి హృదయం వేయి రంపములు పెట్టి కోస్తున్నంతటి వ్యథను పొందుతూంది. ఆమె పూజామందిరం దగ్గరకు వెళ్ళి మోకరించి, మనశ్శాంతికి, దేవిని ప్రార్థించింది.

"దేవీ! గురువాజ్ఞలు పాటించడమే జీవితలక్ష్యంగా పెట్టు కున్నాను. అంతకుమించి వేరు కర్తవ్యమేదీ నాకు తెలియదు. నేనాచ రించే కార్యాకార్యముల బాధ్యత నాగురువులది కాని నాదెంత మాత్రమూ కాదు. నాకు నేనాహుతి అయిపోయినా గురువాజ్ఞల పాటించగల మనోస్థయిర్యమును—దీక్ష—నానుంచి వేరుకాకుండా అను గ్రహించు తల్లీ!"



శాంతిభవన ముఖద్వారం దగ్గర రాజకుమారుని రాకకై వేచి వున్న సేనాని, హఠాత్తుగా గుఱ్ఱపు సకిలింతను విని ఉలికిపడ్డాడు. అది ఒకసారిగాక, తిరిగి తిరిగి భయంకరంగా సకిలించడంవల్ల అదేమి టబ్బా అని అతడు నలువైపులా తిలకించాడు. ఒకవైపునుంచి ఖండించబడిన రాజకుమారుని శిరస్సు తీసుకొనిరాబడుతుండడమును గమనించాడు. ఆనందకుమారుని గుఱ్ఱము అదిచూచే అంత భయంక రంగా సకిలిస్తుందని అర్థం చేసుకున్నాడు. క్రమంగా ఆశిరస్సు అతనికి దగ్గరగా తీసుకొనిరాబడింది. ఆ ఖండించబడిన శిరస్సును చూచి

సేనాని భయ విభ్రాంతుడయ్యాడు. ఒక రాజసేవకు డాశిరస్సును దెచ్చి శాంతిభవన ముఖద్వారానికి వ్రేలగడుతుండడమును కళ్ళారా చూచి, భరించ లేకపోయినాడు.

"ఇదేమి ఘోరం! ఇది రాక్షసకృత్యంగాని, మానవకృత్యం కాదు—" అని అరిచాడు.

"అనవసర పేలాపన! దేనికయ్యా? కావాలని మృత్యువును కోరి తెచ్చుకున్న దాని కెవ రేం చెయ్యగలరు! మా రాజకుమారి చిలక్కు బోధించినట్లు బోధించినప్పుడయినా వినుకోవద్దూ? అందుకే అనుభవించాడు. అందుకు నువ్వంగలార్చుకోవడం దేనికి? వెళ్లు వెళ్లు—ముందుపని చూసుకో."

అని ఆ పరిచారకుడు గద్దించి పలకడంవల్ల, సేనాని చేసేది లేక, రెండు గుఱ్ఱములను నడిపించుకుని తిరుగుముఖం పట్టాడు.

"శ్రీహరీ! ఈచావు కబురును మోసుకొనిపోడానికా నేనింత దూరమూ వచ్చింది! రాజదంపతుల కీవార్త ఏముఖంపెట్టుకుని చెప్పను! ఏకపుత్రుడు అకాలమృత్యువాతపడ్డాడు కాతలిదండ్రులు ఎంతగా తల్లడిల్లిపోతారో గదా! పెళ్ళి పేరుతో ఈ రాజకుమారి యీ విధంగా ఇంకా ఎందరు రాజకుమారులను మింగనై వుందో గదా!"

భయంకర రణరంగాన, శత్రుసైన్యాల నెన్నింటినో నిజకరవాలంతో చెక్కి చెండాడి, తలలు నరకడంలో ఆరితేరిన సేనాని సయితం, నిర్దాక్షిణ్యంగా ఖండించబడిన ప్రభుకుమారుని శిరస్సును చూచి భరించలేకపోయినాడు. రాజాజ్ఞ కనకపుంటే—రాజకుమారుని ఖండించినవారినీ—ఆఖండనకు ప్రోత్సలం చేసినవారిని ఖండఖండలుగా చేసి, కసితీర్చుకొనేవాడు.

కాని అంతటి ప్రతిభాశాలీ, యిప్పుడు చేతులు తెగిన నిస్సహాయిగా వున్నాడు. తనలో తాను దుఃఖపడుతూ, ముందర కీర్తికాముని కోటజేరి నిండుసభలో కొలువైవున్న మహారాజును తిలకించి,

"ప్రభూ! మావచ్చిన పని అయింది. మా రాజకుమారుడు చింతామణి యాగపీఠానికి బలిఅయినాడు. అతని శిరస్సు శాంతిభవన ముఖద్వారానికి వ్రేలగట్టబడింది."

అని కళ్ళనీరు కారుస్తూ చెప్పాడు.

"శ్రీహరీ!" కీర్తికాము డొకసారి చెవులు మూసుకుని

"ఇంత జరుగుతుందని ముందర తెలియకపోలేదు. మేము ఎన్నివిధాల బోధించినా విన్నాడు కాదు. మా రాత యిలావుండగా యెవరేం చెయ్యగలరు?"

అని మితిలేని దుఃఖమును పొందుతున్న కీర్తికాముని తో—

"మీరే కాదు ప్రభూ! రాజకుమారి చింతామణికూడా, కొంత సమయంలో అనేక విధాల నచ్చచెప్పిందట—బ్రతిమాలిందట—ప్రశ్నలకు జవాబు చెప్పే ప్రయత్నమును వొదిలి—పోయి ప్రాణరక్షణ చేసుకోవలసిందని హెచ్చరించిందట! అప్పటికీ వినక ఆరాజకుమారుడు, మూర్ఖపు పట్టుపట్టి—తానా ప్రశ్నలకు జవాబుచెప్పి తీరతానని బీరువులు పలికాడట—అప్పుడి చేసేదిలేక రాజకుమారి తన విధిని తాను నిరవేర్చుకొన్నదట—"

అని మంత్రి తాను తెలుసుకొన్న విషయమును తెలిపాడు.

"కనుక ఇందులో అక్రమంగాని, అధర్మంగాని ఏమీ జరగలేదన్న మాట! బాలమహర్షి సమక్షంలో అటువంటి దేమీ జరగదాని కవకాశంలేదని—భగవంతుని నిర్ణయ మీవిధంగావుంది. పోయి, అతని తలిదండ్రులైన నా ఆత్మీయులకు కూడా యిదే సమాచారమును చెప్పి, పుత్రశోకంవల్ల ఆరెండు ప్రాణాలూ తల్లడిల్లకుండా, అక్కడివారయిన మీరందరూ రక్షణవాక్యాలు పలకండి, ఇంతకు మించి వేరు కర్తవ్యమేముంది?"

అని చెప్పిన కీర్తికాముని దగ్గర శెలవుతీసుకొని, సేనాని, బిల్వనగరాభిముఖంగా ప్రయాణమై వెళ్లిపోయి, మరికొన్ని దినములకు స్వస్థలం చేరుకున్నాడు. రాజదంపతుల కీ దుర్వార్త చెప్పడమే అతనికి ప్రాణగండమైంది. అతనుపోయి చేరినప్పటికి ధర్మపాలుడు అంతఃపురమున రాణిమారంచాలతో వుండి, కొడుకు సమాచార మేమీ తెలియలేదనే యోచన చేస్తున్నాడు. రెండుగుఱ్ఱములను వెంట నడిపించుకొంటూ కోటప్రవేశించిన సేనానిని ముందుగా తిలకించిన మారంచాల—

"అయ్యో! ఇంకేముంది! నాబిడ్డ యెక్కి వెళ్లిన గుఱ్ఱమదుగో-ఖాళీజీనుతో వొచ్చింది—సేనాని. ముఖం వ్రేలవేశాడు. నాకడుపున చిచ్చు—ఎలాభరించను."

అని తను మోదుకొంటూ నేలపై ఒరిగింది, ధర్మపాలుడు మిగిలిన అంతఃపురదాసీలూ, దేవి కుపచర్యలు చేస్తున్నసమయంలో సేనాని ప్రవేశించి, చిన్నబోయిన ముఖంలో, కళ్ళనీరు కారుస్తూ నిలుచున్నాడు.

"ఏమి జరిగింది!"

అని ధర్మపాలు డడిగినదానికి—

"ఏమని చెప్పను ప్రభూ!"

అన్న సేనాని గొంతుక వినపడగానే—మూంచాల కళ్లువిప్పి చూచింది,

"ఇక చెప్పవలసిందేముంది? చింతామణి నాబిడ్డను బలిపుచ్చుకొంది—నాకడుపున చిచ్చుపెట్టి—నావంశమును నిర్వంశం చేసింది—అయ్యో! నాతండ్రీ! ఎన్ని చెప్పినా వినక—చివరకు బలవన్మరణమునే పొందావు—"

అని ఆతల్లి, కంటికీ మంటికీ నేకధారగా విలపిస్తుంటే ఆమెనోదార్చ గలవారెవ్వరు?

కీర్తిగాయమహర్షి రాజులుంగారు, మంజులాదేవిగారూ, మీకంటే యెక్కువగా, మన ఆనందకుమారుకు హితబోధలు చేశారు—ఆప్రశ్నలకు జవాబులు చెప్పడం, మహాకష్టతరమనీ ఆప్రయత్నమును విరమించుకుని, చింతామణిని మరచిపోవలసిందనీ—వెయ్యివిధాల మొత్తుకుని చెప్పారు. కాని, మన ప్రభువువినలేదు. అంతేగాక, కొంత సమయంలో ప్రశ్నలను చెప్పబోయేముందు, రాజకుమారి, చింతామణి సయితం అదే హితవుచెప్పి, అప్పటికయినా పట్టువొదిలి ప్రయత్నం మానుకోవలసిందనీ, తన్ను మరచిపోవలసిందనీ—అనేకవిధాల హితవు బోధించిందిట—అప్పటికికూడా రాజకుమారుడు వినకపోవడంవల్ల, విధిలేక, ఆమె తన ప్రశ్నలను బయటపెట్టడమూ—అతడు చెప్పలేని కారణంవల్ల, నియమానుసారం అతని శిరస్సును ఖండించడం జరిగిందిట!"

అని సేనాని అక్కడ జరిగిన విషయమునంతటినీ చెప్పగా విని—ధర్మపాలుడు—

"ఇదంతా మాదుష్కర్మతప్ప యింకేమీ లేదు. ఎవర్ని నిందపెట్టీ, ఏమీ ప్రయోజనం లేదు. ఎవరు చేసుకొన్న దానిని వారనుభవించ వలసిందేకదా!"

అని చెప్పి, అనంతరం—

"నువ్వుపోయి మంత్రి నొకసారి పిలిపించు."

అనగా సేనాని—ఆతావును వొదిలివెళ్ళడము—అనంతరం మంత్రిరావడము జరిగింది. ధర్మపాలుడు సేనానివల్ల తెలిసిన విషయములన్నింటినీ మంత్రికి చెప్పిన తరువాత—

"మంత్రీ! పుత్రశోకంవల్ల కలిగిన యీ మనస్తాపం ఇంతలో చల్లారదు. నేను కొంతకాలం రాజ్యమును వొదిలి దేశసంచారం చెయ్య సంకల్పించుకొన్నాను. అందువల్లనయినా కొంత మనశ్శాంతి కలుగుతుందేమో ప్రయత్నిస్తాను. నేను తిరిగి వచ్చేవరకూ నువ్వే నాకు బదులు రాచవ్యవహారాలన్నింటినీ చక్కబెట్టుకుంటూ—అంతఃపుర రక్షణచేస్తూవుండు."

అని భర్త చెబుతున్న దాని నాలకించిన మాంచాల—

"జరిగినకష్టముకు తోడు, మీరుకూడా నన్ను దుఃఖపెట్ట దలుచుకొన్నారా ప్రభూ! కడుపుచిచ్చులో కాలిపోతున్న నాకు మాత్రం మనశ్శాంతి అవసరంలేదా?" అని అడిగింది.

"అవసరమే—కాని, సంచారంలో అనేక కష్టాలకు ఓర్చుకొనవలసి వుంటుంది—ఎన్నడూ రాణివాసమును వొదిలి యెరగని నీ వాయిబ్బందులన్నీ పడలేవనీ—నీడపట్టునవుంటే, ఆరోగ్యమయినా బావుంటుందనీ—చెప్పాను."

అని ధర్మపాలుడు, భార్యకు తన అభిప్రాయమును చెప్పాడు.

"నవమన్మథమూర్తి—పెళ్ళీడుకొచ్చిన నాబిడ్డ కాలగర్భంలో కలసిపోయిన తరువాత, నాఆరోగ్యము—నా రాణివాసము—కాటిలో కాల్చడానికిగాక, మరెందుకు ప్రభూ! దయచేసి, నన్నుకూడా మీతోనే వుండనియ్యండి."

అని మాంచాల నిర్బంధంచెయ్యడంవల్ల, ధర్మపాలుడామె కోరిన ప్రకారం చెయ్యడాని కంగీకరించి, తమప్రయాణమున కవసరమైన ఏర్పాటులు చేయించవలసిందని మంత్రి కాజ్ఞాపించాడు. దానికి మంత్రి కొంచమాలోచించి చెప్పాడు.

"ప్రభూ! తన ఆజ్ఞల కెదురు చెప్పదగిన వాడను కాను-కాని-"

"ఏమిటిమంత్రీ! నీ అభిప్రాయమేమిటి? సంకోచంలేకుండా చెప్పు—"

"దేశాటనం— అందులోనూ అమ్మగారితో—బహుకష్టతర మైనది. వేళకు భోజనం లేక నివసించడానికి వసతులు లేక, నానా యిబ్బందులూ పడవలసివుంటుంది. తమ మనస్సుకు శాంతి కావలసిన మాట నిజమే, అందుకు దేశసంచారమే చెయ్యవలసింది లేదు. తమ కానతిచ్చిన ప్రకారం, రాచకార్యాలలో తమకు నిమిత్తం లేకుండా నేను చూసుకుంటాను. నగరోద్యానవనంలో ఒక చిన్న మందిరమును నిర్మించుకొని తమరు సకుటుంబంగా అక్కడవుంటే కావుంటుందని నాతలంపు."

"లేదు-కొంతకాలం యీ వాతావరణమునే పూర్తిగా వొదిలి పెట్టి పోవాలి."

"పోనీ తమ అన్నగారి రాజ్యంవెళ్ళి తమ కిష్టమొచ్చినంత కాలం అక్కడ గడపకూడదా?—కష్టకాలంలో ఆత్మీయుల దగ్గర వుండడంవల్లకూడా మనస్సు కొకవిధమైన ప్రశాంతత కలుగుతుంది."

"హుఁ! ఎక్కడి అన్నగారు! ఎక్కడి ఆత్మీయులు! ఇప్పుడా విషయమంతా యెందుకు జ్ఞాపకం చేస్తావులే మంత్రీ!"

అని ధర్మపాలుడు విషాదంతో అనగా—

"తమకెక్కడో ఒక అన్నగారున్నారని వినడమేకాని—వారి వివరములేవీ నాకు తెలియవు ప్రభూ! తెలుసుకొని వుండడం ఎప్పటి కయినా మంచిదికదా!" అన్నాడు మంత్రి—

"నాకా పేరు తలపెట్టడం కూడా యిష్టంలేదు. అయినా అడిగావు కాబట్టి క్లుప్తంగా చెబుతాను—మా తండ్రిగారికి నేను, మామంజులాదేవి తప్ప, మాయిద్దరకంటే ముందుపుట్టిన మరో అన్న గారున్నారని చాలామందికి తెలీదు. ఇప్పటికి రమారమీ ముప్ప యేళ్లకు ముందునుంచి, మా అన్నగారి ముఖం నేను చూడలేదు— నాముఖం మా అన్నగారు చూడలేదు. కొసకు ఉత్తర ప్రత్యుత్తరా లయినా లేవు.

"నేను పదైదు సంవత్సరాలనుంచి మాత్రమే తమకొలువులో వుండంచేత నాకా వివరాలు తెలీవు. తమపై అన్నగారికంత వైర భావం దేనికి ప్రభూ?"

అని మంత్రి అడిగినదానికి ధర్మపాలుడు తిరిగి యీవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు—

"మా తండ్రిగారి కిరువురు భార్యలు—మా అన్నగారిని కనిన కొంతలానికి కా మొదటి భార్య చనిపోవడంవల్ల, వారు తిరిగి ద్వితీయ వివాహం చేసుకొన్నారు—నేనా రెండవ భార్యవల్ల కలిగిన కొడుకును. అప్పటికి మా మంజులాదేవి పుట్టనేలేదు, మా నాయన గారు తన రెండవభార్యయందు, ఆ రెండవభార్యకొడుకు నైన నాయందు ఎక్కువ ప్రేమను కలిగివున్నారనే మత్సరం మా అన్నకు ఆదినుంచీ వున్నది. అందువల్ల, మానాయనగారు జీవించివుండగానే, తనరాజ్యమును తాను పంచుకొని నాయనగారితో పోట్లాడి వేరు పడ్డాడు. బుద్ధిపూర్వకంగా, ఇక్కడికి నూరుయోజనముల దూర ములోవున్న పట్నమును తాను కోరి తీసుకున్నాడు—మాకళ్లకు దూరంగా వుండాలనే అతనలాచేశాడు. అతను వేరుపడి వెళ్ళిపోయిన మరికొన్ని సంవత్సరాల అనంతరం మా మంజులాదేవి జన్మించింది."

తరిమిలాను మానాయనగారు కాలధర్మమును పొందినప్పుడు అనగా, యిప్పటికి ముప్పదేళ్లి క్రితం ఉత్తరక్రియలు జరిపించడాని కయినా వచ్చినవాడు కాడు సరి కదా, నాయోగక్షేమమును తెలుసు కోవడంకాని, తనయోగక్షేమమును తెలుసుకోవడంగాని ఎప్పుడూ యేమీ లేదు. ఈనాడు నాకు కష్టంకలిగిందిగదా అని, అటువంటి అన్నగారి గుమ్మంలోకి ఏముఖంపెట్టుకుని వెడతాను మంత్రీ? అంతే గాకుండా నాకిప్పుడు దేనిమీదగాని, ఎవరిమీదగాని ఆపేక్ష లేదు. ఈ ప్రపంచంలో ఎంత కాలమున్నా దుఃఖాలు కలగడమేగాని, మనస్సుకు శాంతిగాని, ఆనందంగాని లేశమయినా లేదు. నానా దేశాలూ తిరిగి—ఎక్కడయినా, ఏమహాత్ములయినా కనుపిస్తే, వారి నాశ్రయించి మనశ్శాంతికి మార్గము నన్వేషింప తలుచుకున్నాను. కనుక, నాకిక ప్రతికూల వచనాలు చెప్పకు—ప్రయాణానికి అవసర మైన ఏర్పాట్లు చెయ్యి."

"అప్పుడు, పరివారసహితంగా బయిలుదేరండి ప్రభూ!"

"అయ్యో! పిచ్చివాడా! పరివార మెందుకు ఆడంబరానికి—ఏమీ వొద్దు. నాబిడ్డ, ఆనందకుమారుకు ప్రేమపాత్రమైన గుఱ్ఱమున్నది కదూ—అదొక్కటిచాలు—నేను, నాభార్య, దానిమీద ఎంత దూర మయినా ప్రయాణం చెయ్యగలం."

అని ప్రభువు ధర్మపాలుడు చెప్పినమీాదట మంత్రి ఇక యేటు వంటి అడ్డంకులూ చెప్పలేదు.

యువరాజు అకాలమరణమును పొందడము—రాజు దేశాటన మునకై బయలుదేరు తుండడము—బిల్వనగరవాసుల కందరకు యెంతయినా విషాదమును కలిగించాయి. ధర్మపాలుడంటే, పేరుకు తగినట్లు, తనప్రజల నెంతదయగా చూచేవాడో—అతని పాలనలో వారెంత సుఖులైవున్నారో—ఆనాడక్కడ మూగిన ప్రజాబాహుళ్యాన్ని బట్టి తెలుస్తుంది. స్త్రీలు, వృద్ధులు, పిల్లలు, పెద్దలు, పాపలు, నగరంలో జనాభా లెక్కల కెక్కిన ప్రతివారూ రాజమందిరం దగ్గర హాజరై, కంట తడిపెట్టుకోవడం మొదలుపెట్టారు.

ధర్మపాలుడు వారివారికి తగినరీతులుగా చెప్పి, తాను అనతి కాలంలో తిరిగిరాగలడనీ-అంతవరకూ మంత్రి తనవలెనే, ఎటువంటి లోపములు జరుగకుండా రాజ్యపాలన చెయ్యగలడనీ—ధైర్యవచనాలుపలికి, వచ్చినవారి నందరినీ ప్రసాతంగా సాగనంపాడు.

ఆమరునాడుదయమే దేవీ సయితంగా కోటవొదలి ప్రయాణమైన ధర్మపాలుడు, మొట్టమొదట నగరదేవాలయమును ప్రవేశించి, అక్కడి, అక్కడి శివాలయంలో ప్రార్థనలు సలిపిరి—

"దేవీ! నువ్వుకూడా పరమేశ్వరుని మొక్కుకుని, మనస్సుకు ప్రశాంతతకలిగించుకో." అని హెచ్చరించాడు.

"హుం! మనశ్శాంతి అది నాబిడ్డతోనే తరలిపోయింది—ఏపరమేశ్వరుడూ నాకడుపు శోకమును కదలించలేడు—ఈ జన్మంతా నేనీ శోకంతో కుంగిపోవలసిందే తప్ప వేరుమార్గంలేదు. అయినా భర్తృ ఆజ్ఞ శిరసావహించ వలసినది"—

అని మాంచాల, ఆలయంలోని పరమేశ్వర విగ్రహానికి మొాక రించి—

"సర్వేశ్వరా! నీకు తెలియని పరమార్థం ఏజగత్తునాలేదు—దేవదానవ మహాఋుష్యాదులు సయితము నీమహిమలు తెలుసుకోవాలని తపస్సులు ధారపోస్తున్నారు. నా అవసానకాలంలో అయినా మనస్సుకు శాంతికలిగించు—నీపై బుద్ధి నిలిచివుండగా నాప్రాణాలు పోయేటట్లనుగ్రహించు—ఇదే నా ప్రార్థన!"

అని నమస్కరించి, క్షణకాలం కళ్లుమూసుకుని, ఏమేమో ప్రార్థించుకొంది.

అనంతర మహారాజదంపతులు ఆలయమును వీడి, వెలుపలకొచ్చారు. ధర్మపాలుడు, భార్యను తనగుఱ్ఱముపై యెక్కించుకుని క్రమంగా ప్రయాణమును సాగించారు. ఎండకన్నెరుగని, రాణివాసపు స్త్రీ అయివుండి, సమస్త భాగ్యభోగాలను వొదిలి— తల్లి మాంచాల, ఆపథంగా భర్తతో గుఱ్ఱముపై ప్రయాణం సాగించడం, చూచిన వారందరకీ వింతగానూ, విడ్డూరంగానూ కనుపించింది. కాని, పుత్ర వియోగంవల్లనే, ఆయమ్మ హృదయంలో అటువంటి మార్పు కలిగిందన్న విషయం ఎవరికి తెలుసు?

ప్రతిదినము, సాయంకాలంవరకు ప్రయాణం చెయ్యడము— రాత్రికాగానే అప్పటికి తటస్థమైన ఏగ్రామంలోనో, ఏసత్రంలోనో, ఏచెట్టుకిందో—ఏకొండమీదో దిగి. ఆరాత్రి కక్కడగడిపి, తిరిగి ఉదయమే ప్రయాణం సాగించడము, ఈ ప్రకార మహారాజదంపతులు, ఇల్లువాకిలిలేని బికారులలాగ, తమ సంచార కార్యక్రమాన్ని జరిగిస్తున్నారు.

వారి ప్రయాణాల్లో, అందందు కనుపించే నదీనగ, వనారణ్యాదుల ప్రకృతి రామణీయకతను కన్నులపండువుగా తిలకించి వారెంతయినా అబ్బురపడుతుండేవారు.

కొండవాగులనుంచి కిందికి దిగజారే సెలయేళ్ళ జలజలలు— గుబురుగా పెరిగిన చెట్లసందులనుంచి వచ్చే పక్షుల కిలకిలలు-ప్రకృతి తమ స్వంతమైనట్లు అడవులలో సర్వస్వతంత్రంగా ఛెంగు ఛెంగున గెంతి ఆటలాడుకునే లేడిపిల్లల కుతూహలము—ఆతావుకు తామే ప్రభువులైనట్టు భయంకర గర్జనలు చేసుకుంటూ ఆలేడిపిల్లలను తరుముతుండే ఘాతుకమృగసమూహాల అల్లరినీ—సర్వజాతుల స్వాతంత్ర్యదినాలలో వాటి దౌర్జన్యము సాగదని ఖండించే వేటగాళ్ల వింటిశబ్దాలను దుష్టప్రజానాయకులవల్ల, ఆకర్మసంస్థలకే ముప్పుకలిగినట్టు, ఆవింటి శబ్దాలకు బెదిరి పరుగులెత్తే క్రూరజంతువులతోపాటు, సాధుజంతువుల పలాయనమును—ఒకదానికొకటంటుకొని పరులుచొరడానికి సందీయ్యకుండానిలిచి, నరులలోలేని సమరస, సంఘీభావాలు తమలోవున్నావని చాటుతున్న తరులును, ఆతరులకెటువంటి ముప్ప

మూరాకుండ, వాటి నల్లిబిల్లిగాచుట్టుకుని రక్షణచేస్తున్న నానాజాపిల తలును ఎండలోయెండి, వానలోతడిసి, పరులకోసం బరువయిన మధురఫలాలను తమకొమ్మలపై మోయలేక మోసుకొంటూ—పరోపకారమే పరమాత్మునిసేవ'—అని, లోకానికి నీతి నేర్పుతున్న ఫలవృక్షాల సహనత్యాగాలను, ఏచిత్రకారుడూ చిత్రించలేని వింత రంగులలో ఏకవికూమారుడూ ఊహించలేని సౌకుమార్య సౌందర్యాలలో వికసించి సృష్టికి శోభగలిగిస్తున్న పుష్పజాతులను, స్వార్థపరులైన పురుషులవలె వాటియావ్వన సౌందర్యాలను గ్రోలవలసిన వాళ్ళు తమదన్నట్లు, అవికేవలం తమ పిపాస తీర్చడంకోసమే పుట్టబడ్డట్లు, ఆ వికసించిన పుష్పజాతుల చూట్టూచేరి చేస్తున్న గండు తుమ్మెదల ఝూంకారములను—'మేము మాకై కాదు బ్రతుకుతున్నది-ప్రాణకోటికి జీవనాధారం కావడమే మా కానందం—' అను గంభీర భావాన్ని గర్భంలో వుంచుకొని, నిర్మలంగా, ప్రశాంతంగా పారుతున్న జీవనదులను—చూసిచూసి, ఎంతచూసినా తనివితీరక, ఒక్కొక్కప్పుడే ప్రపంచమునేమరచి అట్టె నిలిచిపోయే వాళా రాజదంపతులు—

"ఆహా! సృష్టి ఎంతవిశాలమైంది? ఎంతభావగర్భితంగా వుంది! భగవన్నిర్మాణం చూస్తుంటే—ఆకలిదప్పులు కూడా మరచి, పరమానందము ననుభవిస్తున్నాము. చూశావుగదా దేవీ! మంజులలో మనోహరము, మహానందదాయకము అయిన ఈప్రకృతి కంతకూ వేరుపడి, మనమింతకాలమూ ఒక అంధకారమైన అజ్ఞాతంలో బ్రతికాము."

అని ధర్మపాలుడు భార్యతో అనగా—

"అందుకేనా, నన్నా అంధకార అజ్ఞాతంలో పడేసి, తమరొక్కరు బయలుదేరాలని సంకల్పించారు?"

అని దేవీ మాంచాల అడిగింది.

"క్షమించు—పొరపాటు చేశాను. నిన్ను వెంటబెట్టుకొని రావడంలో నా మొదటి పొరబాటు సవరించబడింది గదా!"

"దానికేం లెండి—నాకంఠంలో కొనవూపిరి వుండినంతవరకూ, నేను మీతో వుండవలసినదాన్ని." అన్నదామె.

అంతలో సూర్యదేవు డస్తాద్రికి దిగుతుండడంచేత, చీకటి తెర లొక్కటొక్కటిగా కమ్ముకుంటున్నాయన్న విషయము వారు గమనించనేలేదు. ఉన్నట్టుండి ఆయరణ్య ప్రదేశమంతా గాఢ తిమిర మయమైంది. ఎటుపోవడానికీ దారి కనుపించడంలేదు. ప్రకృతి సౌందర్యమును తిలకించడంలో నిమగ్నులయిన వారికి ముందు ఆలోచన ఏమాత్రం లేకపోయింది!

౬

మరొక ఆరుమాసాలు కాలగర్భంలో కొట్టుకుపోయాయి. ఒకరి తరువాత ఒకరుగా వందలాది రాజకుమారులు వచ్చి దీపంముందర రెక్కలపురుగులులాగా, చింతామణి యజ్ఞకుండలోపడి ఆహుతి కావడమే కాని, ఒక్కరూ ఆమె అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పి, ఆమెను వివాహం చేసుకొన్నదిలేదు.

రాజకుమారికే గాక మిగిలిన వారందరికీకూడా నిస్పృహా యేర్పడ్డది. చింతామణిచే ఖండించబడిన శిరస్సులతో శాంతిభవన ప్రాఙ్గణమంతా నిండిపోయింది.

ఈవ్రతం, క్షత్రియకుల వినాశనానికే వచ్చిందని కొందరు— ఇంతర రాజకుమారులను చేతులారా ఖండించిన చింతా రాక్షసాంగన కాని, మానవస్త్రీ కాదని మరికొందరు—మహర్షి చే అడిగించబడు చున్న ఆప్రశ్నలకు జవాబు చెప్పగల ప్రజ్ఞావంతు డింతవరకూ పుట్టి వుండలేదేమో—అని వేరుకొందరూ—వివాహమాడవచ్చిన వరుల నంద రనూ ఖండించుకొంటూ, చింతామణి ఆజన్మాంతమూ కన్యగానే వుండి పోతుందని కొందరు—ఎవరికి తోచిన విధంగా వారనుకొంటున్నారు.

చింతామణికికూడా ఒకనాడి దేజిజ్ఞాస కలిగింది. శాంతిభవ నాంతర్భాగంలో శోభను దగ్గర చేర్చి యిలా ప్రస్తావించింది.

"ఏమే శోభా! ఇక నాగతి యింతేనా? నాయావ్వనము—నా సౌందర్యము అడవి గాసిన వెన్నెలై—బూడిదపోసిన పన్నీరై— వృథకావలసిందేనా! నువ్వు చెప్పు—ఇంకా యెంతకాలానికి, నా ప్రశ్నలకు జవాబు చెప్పగల ప్రతిభాశాలి రాగలడు."

"అదేమోనమ్మా—నాకేం తెలుసు? నేనేమైనా జ్యోతిష్కు రాలినా? మహర్షినా? నవమన్మథులవంటి రాజకుమారు లెందరెందరో

వస్తుంటారు—నువ్వు వారి శిరస్సులు ఖండించి ద్వారానికి వ్రేలగట్టిస్తూ వుండు.''

''నేనేమి చెయ్యనే! ఒక్కరూ నా ప్రశ్నలకు జవాబు చెప్ప రయ్యె. ఐదు ప్రశ్నలలో ఒక్క ప్రశ్నకయినా జవాబు చెప్పగల రాజకుమారుడు లేడయ్యె చూస్తున్నావుగదా! ఇలా ఎంతకాలమో—ఇంకా ఎందరు రాజపుత్రుల శిరస్సులు ఖండించాలో—?''

''అదే గురువుగారి నడిగి తెలుసుకోరాదూ!''

''అబ్బో! వారి కెదుట నిలబడి అడగడాని కెవరికి ధైర్యముం టుంది?''

''నేనడుగుదునా?''

''అహహా! ఒద్దొద్దు! నువ్వు సాహసికురాలవే—నాకు తెలుసు.''

''మన మిద్దరము ఒక్కటేనసీ—నాకు తెలియకుండా నువ్వేపనీ చెయ్యవనీ—నీకు తెలికుండా నే నేపనీ చెయ్యననీ వారెరుగుదురు.''

''అయితే సరి—నాకె దుఃఖమ్మా—నేనేమీ అడగను.''

''పోనీ గాని శోభా—ఒక్క విషయం చెప్పవే! నేను బ్రతికి వుండగా నాకు వివాహమవుతుందంటావా? కాదంటావా!''

''చచ్చిపోయిన తరవాత పెళ్లి చేసుకున్నవారిని నేనింతవరకూ ఎక్కడా చూడలేదమ్మా!''

''అబ్బ! అదికాదే! నేను చనిపోయేదాకా యిలా కన్యగానే వుండిపోతానంటావా!''

''అదేనమ్మా—నాకు తెలియదమ్మా—అని మొత్తుకుంటున్నా.''

''పోనీలే—అంత విసుగెందుకు వేవే!''

అని ఆయిద్దరూ మాటలాడుకుంటున్న సమయంలో కీర్తికామ మహారాజులుగారు వచ్చారని ఒక పరిచారిక ప్రవేశించి చెప్పడంవల్ల, ఆకన్య లిద్దరూ లేచి, మహారాజు కెదురేగి స్వాగతమిచ్చారు. శోభ ఒక ప్రత్యేకాసనమును తెచ్చి వారికి వేసింది. అతను కూర్చున్న తరువాత, వారున్నూ చేరువలో కూర్చున్నారు.

''ఏం తల్లీ! కులాసాగావున్నారా!''

''ఉన్నాము నాన్నగారూ! అమ్మ కెలావుంది?''

''అమ్మసంగతే అడిగావా తల్లీ! అన్నకొడుకు నీవ్రతాని కాహుతి అయినాడన్న దుఃఖమొకవైపున—నీకు పెళ్లి కాలేదన్న మనో

వ్యాధి మరోవైపున, ఆమెను పీల్చి పిప్పిచేసివేస్తున్నాయి. అన్నహా రాలు పైయితం మాని మంచంపట్టింది. ఆమె కహార్నిశలు నీ ఆలోచనలే—''

చింతామణి ఏమీ జవాబు చెప్పలేదు.

''మీగురువుగా రెక్కడ?''

''వారు వారి గదిలో ఎప్పుడూ ఏదో గ్రంథకాలక్షేపము—జపము చేసుకొంటూ వుంటారు అనవసరంగా ఎవరూ వారిదగ్గరకు పోడానికి వీలులేదు—వా రివతలకు రారు.''

''ఇప్పటికి నీచేత హతులు కాబడ్డ రాజకుమారుల సంఖ్య ఎంతో తెలుసునా తల్లీ!''

అందుకు చింతామణి తలకిందికి దించుకుంది. ఏమీ జవాబు చెప్పలేదు.

''ఆరువందల ఇరవై—''

అని శోభమాత్రం చెప్పింది. రాజు ఒక నిట్టూర్పును విడిచి—

''ఎన్ని రాజపుత్ర వంశాలు నాశనై పోయినాయ్!'' అని ఒక నిట్టూర్పును విడిచి—తిరిగి చింతామణితో—

''అమ్మా! ఇకముందుకూడా ఇదేప్రకారం జరగవలసివుంది కదా!''

''ఆఁ!''

''అయితే ఈహింసాకాండకు పరిసమాప్తి యెప్పుడు.''

''క్రతువుపేరిట జరుగుతున్నది హింసకాదని గురువుగారు చెప్తారు.''

''సరి సరి—దానికే పరిసమాప్తి యెప్పుడని?''

''ప్రశ్నలకు జవాబులు చెప్పగల రాజకుమారు డెవరయినా వచ్చినప్పుడు.''

''అసలా ప్రశ్నలకు జవాబులు చెప్పగలవా రెవరయినా వుంటారా అని నాకు సందేహం.''

అని మహారాజన్నప్పుడే—

''నాకూ అదే సందేహం ప్రభూ!''

అని శోభ సాహసంచేసి అనేసింది.

"లేకపోతే—ఇప్పటికి సంవత్సరమైంది. ఆరువందలయిరవై శిరస్సులు ఖండించబడ్డాయని చెబుతున్నారు. అందరిలో ఆ ప్రశ్నలకు జవాబులు చెప్పగల ప్రజ్ఞావంతుడొక్కడూ లేకపోవడం చాలా ఆశ్చర్యంగా వుంది. దీనినిబట్టి, ఆవచ్చిన రాజకుమారులందరూ తెలివి హీనులని చెప్పాలా? లేక ఆప్రశ్నలంత కఠినమైనవ ననుకోవాలా?"

"ప్రశ్నలు మహాకఠినములయిన మాట నిజం."

"ఈ విషయమును గురించి బాలమహర్షితో ప్రస్తావించాలని వచ్చాను."

అని మహారాజనగా—

"నేను పోయి. మీరాకను గురించి వారికి చెబుదునా!"

అని శోభ లేచింది. చింతామణికి గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. గురువులకు కోపము కలిగించే సంభాషణ తండ్రిగారేమి చేస్తారో అని ఆమె భయపడింది.

"ఒద్దొద్దు—వారి ప్రశాంతతకు భంగం కలిగించకూడదు."

అని రాజకుమారి అనగా—

"అయితే సరి—నేను పోయివస్తాను."

అని మహారాజు చివాలున లేచి, చరచర వెళ్ళిపోయాడు. అనంతరం చాలసేపటివరకు శోభా చింతామణులు ఒకరితో నొకరు మాటలాడుకోలేదు. తరువాత ముందుగా చింతామణే మాటలాడింది.

"నాన్నగారికి కోప మొచ్చిందనుకొంటాను."

"రాదా మరి—నువ్వన్న దేమిటి?"

"ఉన్న విషయమే కదా! ఆయనగారు గురువులను కలుసుకొంటే—మరింత పెద్దగొడవవుతుంది. ఈయన ఏవేవో అసందర్భపు ప్రశ్నలడుగుతారు—దానికి బాలమహర్షికి ఆగ్రహ మొచ్చిందంటే—ఎటువంటి ప్రమాదమైనా జరుగవచ్చు."

"అంత ప్రమాదమును కలిగించే మాటలను మహారాజులు మాత్రం ఏం మాట్లాడతారు!"

"నీకు తెలీదు శోభా! నాకు వివాహం కాలేకనీ—వచ్చిన రాజకుమారు లందరూ నాచేత ఖండించబడుతున్నారనీ—నాన్నగారికి చాలచికాకుగావుంది. అందుకు వారేమయినా అనవచ్చు—గురువులకు ఆగ్రహం రావచ్చు. ఆపరిస్థితిని తప్పించడానికే నేనలా చేశాను."

"మంచి పనే చేశావు కానీ—నేను పూజకుపోతానమ్మా—మళ్ళీ ఏ రాజకుమారుడైనా వచ్చి గంట మోగించాడంటే అంతరాయం కలుగుతుంది. ఇప్పటికి వారంరోజులనుంచి అదే ప్రకారం జరుగుతూంది. సరిగా నేను పూజకు కూర్చునే సమయాన గంట మోగడం—అంతరాయం కలగడం ఈ పూటయినా అంతరాయం కలక్కుండా వుండాలి కదా!"

"నీ పూజలవల్ల ప్రయోజన మేమిటి శోభా!"

"ఏం ప్రయోజనం కావాలీ?"

"నువ్వే ప్రయోజనా న్నాసించి చేస్తున్నావు పూజ?"

"నీకు త్వరగా పెళ్ళి కావాలనీ?"

"మరేదీ?"

"ఓహో! అటు తిరిగి యిటు తిరిగి నాపై కొచ్చిందన్నమాట నేరం?"

"నీపై కాదు—నువ్వు పూజించే దేవిపైన"

"ఓ! అయితే మంచిదే—నాకు పరవాలేదు."

అంటూ శోభ అక్కడనుంచి వెళ్ళిపోయింది. చింతామణికి ఏమీ తోచింది కాదు. మనస్సంతా వికలంగా వుంది. చదువుకుందామని పాతపుస్తకాలన్నీ పైకి తీసింది. ఒక్కొక్కటే తీసి పేజీలు తిరిగెయ్యడమే కాని, దేనిపై నా మనసు నిలబడలేదు. అలా తిరిగెయ్యడంలో, ఒక పుస్తకంలోనుంచి, తానేనాడో వ్రాసివుంచుకున్న ఆనంద కుమార్ చిత్రపటం జారి కిందపడింది. దాన్ని చూడగానే; ఆమె కళ్లు నీళ్ళతో నిండాయ్! వెంటనే దాన్ని తిరిగి దాన్ని పుస్తకంలో మూసి పెట్టి, ఆ తావును వొదిలి శోభవున్న పూజామందిరం దగ్గరదగ్గరకు వెళ్ళింది. ఆమెకు చేరువలో కూర్చుంది. ఆమె చేస్తున్న దాన్ని తిలకించడం మొదలుపెట్టింది. అప్పటికికూడా ఆమె మనస్సుకు స్థిమితం కలగలేదు. వెంటనే ఆచోటును వొదిలిపోయింది. శాంతిభవనమంతటా కలయ దిరిగింది.

ప్రశ్నలకు జవాబులు చెప్పడానికి వచ్చినప్పుడు నిలుచుండే వేదికపై కొంతసేపు, అప్పుడు తాను వుండే తెరలో కొంచంసేపు, గురువుగారు కూర్చుని చిరుగంట మోగించే రెండవ తెరలో కొంచంసేపూ నిలుచుని, కాలక్షేపం చేసింది. ఇంతలో పూజను ముగించు

కుని శోభ చింతామణి ఎక్కడా కనుపించకపోవడంవల్ల, భవన మంతటా కలియదిరగడం మొదలుపెట్టింది.

కొంత తామె వుండేస్థలమును తెలుసుకొనివచ్చి—

"ఒంటరిగా యిక్కడేం చేస్తున్నావమ్మా?"

అని అడిగింది.

"ఏమీ లేదక్కా! మన మీభవనం ప్రవేశించినది లగాయితు, ఎన్నడూ భవనమంతా చూడలేదు."

"ఇది కొత్తభవనమేం కాదుగా?"

"అయినప్పటికీ, గురువుగారు చేయించిన మార్పు లేమిటో అని చూస్తూన్నాను."

"ఏమున్నయ్! వచ్చిన రాజకుమారులు నిలుచుండుడాని కొక వేదిక, అప్పుడు నువ్వూన్నూ గురువుగారున్నూ వుండే యీరెండు తెరల వేదిక ఒకటి—ఈరెండు వేదికలు—తెరలు—అంతేగా, అంటూ శోభ ఆకొనసనుంచి యీకొసకు పరువబడిన తివాసీపై నడుస్తుండగా, మధ్యలో ఆమె కాలికేదో గట్టిగా బల్లవంటి పదార్థం తగిలింది. పలక రాతితో కట్టబడిన ఆవేదికమీద బల్లశబ్ద మేమిటబ్బా, అని తివాసీనెత్తి చూచింది. అది ఒక గజంమేర, పెట్టె కమర్చినట్లు గచ్చు నేలమీద అమర్చబడిన చెక్కమూతలాగ అమర్చబడింది.

"ఎత్తిచూదామా?"

అని శోభ అడగ్గా—

"చూదాము." అంది చింతామణి.

ఇరువురూ ఆచెక్కమూతను పైకెత్తిచూడగా, అది దిగుడు మెట్లు కలిగిన ఒక సొరంగముగా కనుపించింది. ఒకరితరువాత ఒకరు ఆమెట్లగుండా లోపలకు దిగారు—ఆసొరంగంగుండా కొంచందూరం—మరికొంచందూరం—నడవగా నడవగా ఆబాటకొసను, తిరిగి ఆరంభంలో వున్నటువంటివే మరికొన్ని మెట్లు కనుపించాయి—వారా మెట్లగుండా పైకెక్కారు. గడ్డితోను ఆకులతోను మూయుబడిన ఒక కంతద్వారం వారికి కనుపించింది. ఆగడ్డిని ఆకులను మెల్లిగా తొలగించుకొని, యివతలికిరాగా, అది శాంతిభవనపు వెనుకభాగమై—తోట ప్రహారీగోడ కానించివున్న ఒక చిన్నద్వారంమైంది.

శోభ మెల్లగా ఆద్వారమును తెరిచి, వెలుపలకు తొంగి చూడగా, అక్కడ నిర్మలజలపూరితమైన ఒక సరస్సు కనుపించింది. సమూహంలోనే, జనసమూహముల కోలాహలంకూడా వినిపించింది.

"మూసెయ్యి శోభా! త్వరగా ద్వారమును మూసెయి—ఆ సరస్సు నాకు తెలుసు—ఆసరస్సు ప్రక్కనుంచిపోతే-రాజవీధి కొద్ది దూరంలోనే వుంటుంది. ఆ రాజవీధిలోని జనకోలాహలమే మన కిప్పుడు వినిపించేది."

అని చింతామణి చెప్పిన వెంటనే శోభ ఆద్వారమును మూసింది.

"పద-తిరిగి యీసొరంగంగుండానే భవనంలోకి పోయి చేరుకుందాము—మనల నెవరయినా చూస్తే ప్రమాదం."

అని చింతామణి ముందర దారితియ్యగా, ఆమె వెనుకనే శోభ కూడా నడిచింది. ఇద్దరూ లోపలదిగి, మీదిభాగాన తిరిగి గడ్డి, ఆకులు, యధాప్రకారంగా కప్పి, ముందుకు సాగిపోవడం మొదలు పెట్టారు.

"శాంతిభవనంలో సరిగా గురువుగారు కూర్చుండే తెరదగ్గర నుంచి ఇంతవరకూ, యీసొరంగ మీవిధంగా ఎందుకు నిర్మించబడి వుంటుందంటావక్కా?"

అని శోభ అడిగినదానికి చింతామణి వెంటనే జవాబు చెప్ప లేక పోయింది.

"నువ్వాలోచించి చెప్పు—చూదాము."

"నాకేమీ తెలియడంలేదు. అసలు దీనిని ఎవరు నిర్మింపజేసి వుంటారో కూడా ఊహించలేకుండావున్నాను."

"గురువుగారే నిర్మింపజేసివుంటారు?"

"గురువుగారా? ఎందుకని."

అని శోభ ఆశ్చర్యంగా అడిగింది.

"ఈమాత్రం ఊహించలేవా శోభా! ప్రశ్నలకు జవాబు చెప్ప డానికొచ్చిన రాజకుమారులలో అనేక తరహాల మనుషులుండవచ్చు."

"నిజమే."

"ప్రశ్నలకు జవాబులు చెప్పలేనివారు-మరణానికి సంసిద్ధులై వుంటారుగదా, ఆసమయంలో వారు నిరాశతో కూడుకున్న ఉద్రేకంతో ఎటువంటి దౌర్జన్యమునయినా తలపెట్టవచ్చు—ఏతంత్రము

వల్లనయినా, నన్నవమానపరచవచ్చు. అటువంటి సమయంలో మన మీసారంగంగుండా వెలుపలకుపోయి, మానరక్షణచేసుకోగలందులకుగాను, గురువుగారిటువంటి క్షేమకరమయిన యేర్పాటును చేయించివుంటారు.''

''అవును సుమా అక్కా! నాబుద్ధి అంతదూరంపోలేదు. గురువుగారి మేధాశక్తి ఎంతయినా మెచ్చుకోదగ్గది.''

అని వారు మాటలాడుకుంటూ క్రమంగావచ్చి, బయలుదేరిన చోటు చేరుకున్నారు. వెంటనే చెక్కతలుపులుమూసి, మామూలు ప్రకారంగా, మీదతివాసీని కప్పారు.

ఇంతలో శాంతిభవనంలోని గంట గణగణమోగింది.

''అదుగో అక్కా; గంట—ఎవరో వరుడొచ్చాడు. తయారుకా త్వరగా—''

అని శోభ చెప్పకమునుపే, చింతామణి తన మామూలు పద్ధతి ననుసరించి సంసిద్ధురాకాసాగింది. గంటను విని, బాలమహర్షికూడా తన మందిరంనుంచి యివతలకొచ్చాడు.

## ౭

''అయ్యో! ఇప్పుడు మనకు మేంచెయ్యాలి? చీకటిపడక మునుపే-ఏ గ్రామమయినా చేరుకోవలసింది.''

''ఇప్పుడాప్రయత్నమేమిలాభంలేదు. చుట్టూ దట్టమైన మహారణ్యం—కన్ను కనుపించని గాఢాంధకారం. సమీపంలో ఏగ్రామమూ వున్నట్లుకూడా తోచదు.''

''ప్రకృతి సౌందర్యమును తిలకిస్తూ మైమరచాము. ఇంతలోనే యింత గాఢాంధకారం కమ్ముకుంటుందనుకోలేదు. క్రూర మృగసంచారము—విషజంతు నివాసము—అయిన యీ భీకరారణ్యంలో మనకు దిక్కెవరు.''

''దేశసంచారంలో యిటువంటి కష్టాలేవుంటవని, నేనాదిలో చెబుతే విన్నావా మాంచాలా! కడుపులో చల్లకదలకుండా, దాసదాసీ జనా లుపచర్యలుచేస్తుంటే, హాయిగా రాణివాసమున గడపవలసిన నీ కెందుకొచ్చిన తిప్పలివి?''

"నాకేగాని మీకుకాదా! కానియ్యండి! నాకు ప్రాణభయం లేదు. నవమన్మధ మోహనమూర్తి! ప్రాజ్ఞుడై, వెళ్ళేదుకొచ్చిన నాబిడ్డ, వంశానుద్ధరించగల ప్రజ్ఞావంతుడు, మీవృద్ధాప్యంలో మీ రాజ్యభారమును తానుమోసి, ధరాచక్రము నేలగలిగిన ధీరుడు—అటువంటి కులపర్వతమే కూలిపోయింది—నా కామధేనువే కాల గర్భంలో కలిసిపోయింది. ఇక నా తుచ్ఛపు ప్రాణం ఒకలెక్కా?"

"మళ్ళీ ఆవృత్తిని తెప్పించుకొని కుమిలిపోతావా మాంచాలా? ఆవిషయమంతా మరచిపోవడానికే గదా, మన మీసంచార కార్య క్రమంలో వున్నాము."

మాంచాల ఏమీ జవాబు చెప్పలేదు.

"ఈ రాత్రికి ఈయడివిలోనే గడిపి, తిరిగి ఉదయమే ప్రయాణ మును సాగిద్దాం."

"అంతకుమించి వేరు కర్తవ్యమేముంది."

అని మాంచాల అనగా, ధర్మపాలుడు గుఱ్ఱమునకు కట్టబడి వున్న తమసామానులను విప్పి, ఒకచెట్టుకింద శుభ్రపరచి, ప్రక్క నమర్చాడు—ఆచేరువ వృక్షాలకు వ్రేలాడుతున్న కొన్ని మధుర ఫలాలను కోసుకొనివచ్చి, మాంచాలకిచ్చాడు, తానున్నూ కొన్ని టిని భుజించాడు. గుఱ్ఱము నక్కడి పచ్చికబైలుపై మేతకు వొది లాడు. తరువాత కొంచంసేపట్లో మాంచాల ఆచెట్టు కిందనే మేను దాల్చి, ప్రయాణబడలికను విశేషంగా పొందివుండడంవల్ల ఆమెకు వెంటనే నిద్రపట్టిపోయింది. ధర్మపాలుమాత్రం రెప్పవాల్చకుండా, ఒరనుండి కత్తిదూసి, చేతధరించి, ఏఘాతుక మృగమైనావస్తే ఖం డించడానికి సంసిద్ధంగావున్నాడు. ఏ చిన్నశబ్దమయినా, అటుపోయి పరిశీలిస్తూ, అది ఎండుటాకుల ధ్వనిమాత్రమే అని తెలుసుకొన్న ప్పుడు తృప్తిపడుతూ, ఈప్రకారం రాత్రంతా కంటికి కునుకు లేకుండా, ఇల్లాలినీ, ముఱ్ఱమునూ సంరక్షించాడు.

పరిమితికాలం పూర్తికావడంవల్ల, క్రమంగా ఎలా కమ్ము కొన్న చీకటి తెరలలాగే ఒక్కటొక్కటిగా విడిపోవడం మొదలు పెట్టాయి. మాంచాల మేలుకొన్న తరువాత—భర్తముఖంలోకి చూచి—

"ఏమండీ! రాత్రంతా మీరిదేవిధంగా మేలుకొనివున్నారా!"

అని అడిగింది. ధర్మపాలు డామె నాప్రశ్ననుంచి దృష్టిని మళ్ళించి—

"ఈ పరిసరప్రాంతంలో ఏదయినా జలాశయముందేమో చూచి వస్తాను."

అని బయలుదేరి వెళ్ళి, తిరిగి వెంటనేవచ్చి—

"మొదట తెలిసిందికాదు—ఇదుగో, ఈతోపు మళుపులో నిర్మలజలపూరితమైన కొలనుంది." అని చెప్పాడు.

అప్పు డాయిరువురూ కొలనుదగ్గరకుపోయి స్నానాది కాల కృత్యాలు నెరవేర్చుకుని, గుఱ్ఱమునుకూడా కడిగి, దానిని కడుపు నిండా నీరుత్రాగనిచ్చి, తామున్నూ మరికొన్ని ఫలములభుజించి, తిరిగి గుఱ్ఱమెక్కి, సూర్యోదయమయించే సరికి ప్రయాణమును సాగించారు. బాటలు సక్రమంగా వున్నప్పుడశ్వమును పరుగెత్తించి, లేనప్పుడు నడిపించి—ఈ ప్రకారంగా ప్రొద్దువాలే పర్యంతము ప్రయాణమును సాగించారు. కాని ఎంతదూరంపోయినా అంతటా అరణ్యమే కాని, పల్లెలుగాని పట్నములుగాని వారికెక్కడా కనుపించలేదు. ఆ యడవీ ప్రాంతమావిధంగా ఎన్నివేలమైళ్ళవరకూ వుందో వారికి తెలియదు. మరికొన్ని యోజనములు గడచిన తరువాత, అశ్వము పరుగెత్తుతున్నదారి కెడమప్రక్కగా ఒక చిన్నకాలిబాటను ధర్మ పాలుడు గుర్తించాడు.

"మనుష్యసంచారంలేని ఈ మహారణ్యంలో కాలిబాట యెందు కేర్పడింది చెప్మా?"

అని భార్యతోచెప్పి ఆశ్చర్యపడ్డాడు.

"గుఱ్ఱము నాకాలిబాటవెంబడే పోనియ్యండి. చూదాము."

అని మాంచాల చెప్పినవెంటనే ధర్మపాలు డశ్వము నాబాట లోకి మళ్లించాడు. దారి కొంచం సక్రమంగా వున్నందువల్ల గుఱ్ఱము పరుగుతీసింది. రెండుమూడు యోజనముల దూరంలోనే వారికొక చిన్న ఆకులకుటీరం కనుపించింది. వెంటనే భార్యాభర్త లిద్దరూ గుఱ్ఱముదిగి దాని నక్కడి ఒకచెట్టుకు కట్టి వారా కాలిబాటగుండా నడిచివెళ్లి కుటీరమును సమీపించారు. వెంటనే ఆకుటీరంనుంచి ఇరు వురు కౌపీనధారులైన యువకులు ఇవతలికొచ్చి, రాజదంపతుల చూచి తెల్లబోయారు.

"అయ్యా! ఈ కుటీరమెవ్వరిది? ఇందులో వున్నవారెవరు?" అని ధర్మపాలుడు ప్రశ్నించిన దాని కందులో ఒక యువకుడు.

అయ్యా! ఇది శమంతకముని యొక్క ఆశ్రమప్రాంతము. మేము వారి శిష్యులము." అని ధర్మపాలునికి సవినయంగా బదులు చెప్పాడు.

"సంతోషము! మునీశ్వరుల వారెక్కడ?"

అని ధర్మపాలుడు తిరిగి ప్రశ్నించగా—

"ఈ కుటీరానికి వెనుకతట్టున మరియొక కుటీరముంది. మునీశ్వరు లందులో తపస్సు చేసుకుంటూవుంటారు. మీరెవరు? నిర్మానుష్యమైన ఈఅడవులలో స్త్రీ సయితంగా యెందుకు తిరుగుతున్నారు?"

అని బ్రహ్మచారి అడిగినదానికి.

"మేము దేశసంచారం చేసుకుంటూ అందందు తిరిగి, ఇప్పుడిక్కడ చేరాము— మీ గురువుల దర్శనం దొరుకుతుందా?"

అని ధర్మపాలుడు తిరిగి అడిగాడు.

సూర్యుడస్తమించగానే, వారు సమాధినుంచిలేస్తారు. అప్పుడు మీరు వారిదర్శనం చేయొచ్చు. మేము తీసుకువెళ్లి చూపుతాము."

అని అతడు చెప్పినదానికి రాజదంపతులు సంతోషించి— నియమిత కాలంవరకూ అక్కడనే వున్నారు.

"రాణివాసాలూ—రాజ్యభోగాలూ ఎందుకండీ? ఇక్కడ ఎంత ప్రశాంతంగావుందో చూశారా?"

అని మాంచాల అడిగింది.

"నిజమే. ప్రశాంతంగావుంటుందనీ—అందరూ యిలాగేవచ్చి, అడివిల్లో ముక్కుమూసుకు కూసుంటే, పరిపాలనలూ ఎలా జరుగుతాయి—సృష్టిక్రమం ఎలా సాగుతుంది?"

"అయ్యో! పూర్వజన్మ సుకృతం వున్నవాళ్ళకేకేగాని, అందరికీ యిలా ఎందుకు సాగుతుందండీ! ఈయనపేరు శమంతకమునిట— శిష్యులతో ప్రశాంతంగా వున్నాడు."

"అంతేగాదు—తరించే మార్గం చూసుకుంటున్నాడు."

అని వారావిధంగా మరికొంతసేపు ఇష్టాగోష్ఠి సల్పుతున్న సమయంలో మునిశిష్యుడు వారున్న దగ్గరకొచ్చి—

"అయ్యా! వారు సమాధినుంచి లేచారు-తమరువచ్చి దర్శనం చేసుకోవచ్చు—"

అని చెప్పినందువల్ల, రాజదంపతులు మునికుమారుడితో వెళ్లారు. అతను వారిని, మొదటచూసిన కుటీరంగాక, దానివెనుక భాగంలోవున్న మరియొక కుటీరంలోపలికి తీసుకొనిపోయి—ముని యెదుట నిలిపి—

"వీరు మార్గవశాత్తూ వచ్చిన పరదేశీయులు—తమదర్శనం కోరారు."

అని శిష్యుడు చెబుతుండగా—రాజదంపతు లామునికి నమస్కరించారు. మునివారిని కూర్చోవలసిందని, ఆచేరువలో పరువబడివున్న పులిచర్మమును చూపించాడు. దంపతులు కూర్చున్నారు.

"మీ రెవ్వరు? చూస్తే రాజపుత్రదంపతులుగా కనుపిస్తున్నారు. సర్వసంగ పరిత్యాగంచేసిన మాబోటి తాపసులకు మాత్రమే నివాసయోగ్యమైన యీకీకారణ్యంలోకి తమ రెందుకొచ్చారు?"

అని అడిగినమునికి ధర్మపాలుడు సవినయంగా, ఇలాబదులు చెప్పాడు—

"స్వామీ! మాది బిల్వనగరం—నే నా నగరపాలకుణ్ణి—పేరు ధర్మపాలుడు. నాతోవున్న యీమె నాఏకపత్ని, మాంచాల. నిజ పుత్రవియోగంవల్ల, మనసులు వికలమై—నానా దేశ సంచారంతో, కొంత మనశ్శాంతి కలుగుతుందని, బయలుదేరాము. ఇప్పటి కారు మాసాలుపైనయింది. ఆయాదేశాలు చూసుకుంటూ, అందందు గల పుణ్యతీర్థాలను సేవించుకొంటూ, నదీనగ, కీకారణ్య బ్రహ్మారణ్యాదు లన్నింటినీదాటి, ఈరోజు కిక్కడ చేరుకున్నాము—తపోధనులైన తమ్ము దర్శించగలిగాము."

"బిల్వనగరమా! అబ్బా యిక్కడికి చాలయోజనముల దూరమున్నదే! బిడ్డలారా! మీ ఆశయము మెచ్చుకోదగినది. రాణివాసపు స్త్రీ అయివుండి, సమస్త రాజభోగాలనూ వొదిలి, కష్టనిష్ఠురాలను సహించుకొంటూ దేశసంచారార్థం, నీసతికూడా నీతో బయలుదేరడ

మొక విశేషం. మీ దంపతులను చూసిన నాకు పరమ సంతోష మైంది.''

అని ముని చెప్పినమీదట, మాంచాల—

''స్వామీ! ఈ యారుమాసాల సంచారానంతరం, మీఆశ్రమ వాతావరణాన్ని, మమ్మల్ని చూసిన తరువాత, రాణివాసం వయిపు నాబుద్ధి అసలు మళ్ళడంలేదు. మనస్సు శాంతినితప్ప, యింకదేనినీ కోరడంలేదు. తమ రనుగ్రహిస్తే, భర్తృసహితంగా యిక్కడ వుండి పోవాలన్న సంకల్పం కలిగింది. మాకు శాశ్వతశాంతి కలిగేమార్గ మును తమరుపదేశం చెయ్యండి.'' విధేయురాలై వేడింది.

''మా దంపతులనుకూడ తమ శిష్యకోటిలో చేర్చుకుని, తరు ణోపాయమును బోధించండి.''

అని ధర్మపాలుడు కూడా ప్రార్థించాడు. ముని కొంచమాలో చించి—

''అభ్యంతరముండదు కాని, మీరు శాశ్వతంగా యిక్కడే వుండిపోతే, అక్కడ రాజ్యపాలనసాగే విధానమేది?'' అని అడిగాడు.

''ఆవిచార మవసరంలేదు స్వామీ! విశ్వాసపాత్రుడు—సమ ర్థుడు అయిన మంత్రికి రాజ్యభారమంతా నప్పగించివచ్చాను. అతడు నాకుమారుగా సక్రమపాలన చెయ్యగలడు.''

అని ధర్మపాలుడు మునిసందేహమును తీర్చాడు.

''మీవంటి మహారాజుల కవసరమయిన వసులీమహారణ్యంలో ఏముంటాయి?''

అని ముని తిరిగి ప్రశ్నించాడు.

''వాటిని రోసికదా స్వామీ, మే మీ ప్రకారం బయలు దేరాము. మాకేఅవసరాలు—ఆడంబరాలూలేవు. నేను, నాథర్త, ఈ యడివిలో ఏవేళ కేదిదొరుకుతే దానినితిని బ్రతకగలము. ఈసం చారంలో మేమటువంటి జీవితానికి అలవాటుపడే వున్నాము. ఇక మాగుఱ్ఱానికి చాలినంత పచ్చిక ఈప్రాంతంలో సమృద్ధిగావుంది.''

అని రాణి మాంచాల అంత ఉత్సాహం చెబుతున్నప్పుడు నిరాకరించలేక పోయినాడు.

''సంతోషం! మీకోరికప్రకారం చెయ్యండి. ఎప్పుడు మీ రాజధానికి వెళ్ళవలెనని వుంటే—తిరిగి అప్పుడే పోవచ్చును.''

ఓం

శుభమస్తు

౧

ఈ యనంతవిశ్వంలో ఏముఖంచూసినా, ఎవర్ని పలకరించినా, ఏదో ఒక అసంతృప్తి—ఏదో ఒక ఆరాటం—ఏదో ఒక ఆవేదన. అంతేగాని నిర్మలమైన శాంతి, పరిపూర్ణమైన ఆనందం, ఎక్కడా కనుపించదు. గంజిలోకి ఉప్పులేక ఒకడు కటకట్లాడుతుంటే, కోటికి పడగెత్తలేదని మరియొకడు కించపడుతున్నాడు. సంతులేదని ఒకడు చింతపడుతుంటే, తుక్కుమురికి సంతానంతో మరియొకడు కుంగిపోతున్నాడు. భార్యలేక ఒకడు బాధపడుతుంటే, ఉన్నభార్యను అదుపులో పెట్టుకోలేక యింకొకడు. కానికోసం ఒకడు, కాసుకోసం మరొకడు—నీడకోస మొకడు, మేడకోస మింకొకడు-మట్టికొంపకై ఒకడు, మహాసామ్రాజ్యానికని మరియొకడు—బంట్రోతు నౌఖరీ కొకడు, మంత్రిపదవి కింకొకడు—అంతస్తులు తేడాగా పిపీలకాది బ్రహ్మ పర్యంతం మొత్త మందరూ ఎందుకో ఒకందుకు, ఎంతో కొంత విషాదమును పొందుతున్నారే కాని విశ్రాంతిని పొందడంలేదని, ప్రతి హృదయంలోకీ దూరి, ప్రతి ఆంతర్యాన్నీ పలకరించిన వారికి తెలిసే విషయం.

యదార్థ విషయ మిలావుంటుండగా, ప్రపంచంలో తానొక్కడే బా[illegible]డనీ, మిగిలిన యావన్మందీ సుఖులైవున్నారనీ, ఎవరిమట్టుకు వారు వ్య[illegible]పరంగా అనుకొనే విషయం.

మగధదే[illegible]శాధిపతి, కీర్తికాముని విషయంలోకూడా యితర దేశ ప్రభువులు, [illegible]జలేగాక, స్వజనము స్వదేశపు ప్రజలూకూడా అనుకొనే విషయ మి[illegible]విషంవరకూ అంతే. అందరూ అనుకొనేదానికి ఆధారాలు లేకపోలేదు.

కీర్తికాముడు స[illegible]ప్రయోజకత్వంవల్ల శత్రుబాధలను, యుద్ధ భయాలను నివారించుకుని, సామ్రాజ్యమును సువిశాలము, సుస్థిరము జీవితేని తోటిరాజపుత్రు[illegible]లు మెచ్చుకొనేటట్లు రాజధానియైన కుండిన

నగరంలో వుంటూ ధరాపాలన సక్రమంగా నడుపుకుంటున్నాడు. ధనకనకవస్తువాహన సమృద్ధి కలిగి, పాడిపంటలతో నిండి, అతని సామ్రాజ్యము లక్ష్మీదేవికి నివాసమైవుంది. రాజధానియైన కుండిన నగరమో? లోకంలో వుండే శిల్పనా చమత్కృతి—నాగరికతా—మూవత్తూ ఆ నగరనిర్మాణంలోనూ, కట్టడముల ఘనతలోనూ విని యోగించబడ్డదని యెల్లరకు తెలిసినవిషయం. దేవేంద్ర పట్నమింత కంటే గొప్పగా వుండేదంటే ఎవరూ నమ్మరు.

అది, పేరుకు ప్రజారాజ్యం గాకపోయినా, ప్రజలో తిరుగుబాటులు, అల్లరులు మచ్చుకయినా మనం చూడం. ఎందుకని? ఆ రాజే తండ్రి-ఆ ప్రజ లతనిబిడ్డలు. ఆ రాజ్యంలో అన్నార్తులు లేరు: కూడుగుడ్డలకు కరువులేదు. నిరుద్యోగు లంతకన్నా లేరు. ప్రతి ఒక్కరికీ కడుపుకు తిండి, ఉండడానికి యిల్లు---ఆదేశప్రజల కెవ్విధమైన లోటున్నూ లేదు. ప్రజల ప్రశాంతతకు, పాలకుని సుస్థిరత్వమునకు ప్రధానకారణం మంత్రివర్గం. స్వార్థపరులయిన మంత్రులుగాని, జేబులు నింపుకొనే లంచగొండి రాజోద్యోగులుగాని వున్నటయితే, ఆపాలన ఏనాడో తారుమారయ్యేది---ఆ ప్రభు వేనాడో పదచ్యుతుడయ్యేవాడు, అటువంటి విపరీత పరిస్థితులు లేకపోగా కీర్తికాముడు స్వార్థమెరుగని ధర్మపాలకుడనీ, మంత్రివర్గమున్నూ ప్రజాహితవునే పరిపాలనా లక్ష్యంగా కలిగివున్నారనీ, ఇతర దేశములన్నిట కూడా గొప్ప ప్రతీతి. ఇంతకలిగిన కీర్తికాముడికి విచారమెందుకు? కలవరపాటు దేనికి?

అతని కొక్కడికే కాదు-ఆనాడు కుండిననగరపు కోటలోని ఏ ఒక్కరి మనస్సుకూ శాంతిలేదు. ఏముఖంచూసినా కత్తిపోటుకు నెత్తురుచుక్కలేక వెలవెలబోతూంది, పట్టమహిషి, మంజులాదేవి కంటికీ మంటికీ నేకధారగా గుడ్లనీరు కక్కుతుంటే, మహారాజు, కీర్తికాముడు సయితం ఆమెకు ఊరడి కలిగించలేకపోతున్నాడు. అతని గుండెల్లోని అగాధ దుఃఖమహాసముద్రం మరీ ఉల్లకల్లోలంగా వుంది. అయితే, పురుషహృదయం కాబట్టి ఆ దుఃఖతరంగాలు పైకెగదట్టకుండా లోలోపలనే అరికట్టుకోగలుగుతున్నాడు.

రాత్రిసమయం-కోటలోని నగారా ఒకటి కొట్టింది. ఆగదిలోని మృదుపాన్పుమీద పన్నెండేళ్ళ కన్నెపడుచు-పోతపోసిన బొమ్మ

అని శిష్యుల పిలిచి—

"ఈరాజదంపతులకు మీతోపాటు నివాసమేర్పాటు చెయ్యండి తీసుకెళ్లి ఫలవృక్షాలు—జలాశయము—పచ్చికబయళ్లు—మొదలయిన మన వాతావరణమంతటితో పరిచయం చెయ్యండి!"

చెప్పగా వారు సరేనని రాజదంపతులను తమతోకూడా తీసుకెళ్లి, గురువులు చెప్పినప్రకారం, ఆచెరువలోనే వున్నవాటి నొక్కటొక్కటిగా చూపడం మొదలుపెట్టారు.

"ఇది జలాశయము—నీరు అతిమధురంగావుంటుంది. ఈచెరువుకు చుట్టూ అన్నీ ఫలవృక్షాలే—అది పనస—ఇది సపోటా—వాటి వెనుక నున్నవన్నీ కొబ్బరిచెట్లు—కొబ్బరితోటకు నడుమ అరటిపండ్ల చెట్లు—ఇటుచూడండి—ఇవన్నీ జామలు—ఒక్క పండుతింటే కడుపు నిండిపోతుంది. మరి రెండడుగులు వేశారంటే మామిడితోపు కనిపిస్తుంది—ఏయే ఋతువులలో లభించే పండ్లు ఆయాఋతువులలో ఎన్నివంతలమంది క్రయినా సమృద్ధిగా సరిపోతాయి———"

అని వివరించి చెబుతున్న ఒకశిష్యునితో—"ఈప్రాంత మెవరి పాలనకు చెందివుంది తమ్ముడూ?" అని మాంచాల అడిగింది.

"ఏమో — తెలియదమ్మా— ఇంతకాలంనుంచి, నదులుగా మాకంటబడింది మీదంపతు లొక్కరే!"

అని అతడు బదులుచెప్పి, తరువాత—

"చీకటిపడుతూంది—ఇకరండి—మేముండే కుటీరంలోనే మీరుకూడా వుండొచ్చు—"

అన్నాడు. అప్పుడు ధర్మపాలుడు తమగుఱ్ఱానికి కట్టబడివున్న కొద్దిపాటి సామాను విప్పుకొని, వాటితో భార్యాసమేతంగా మునికుమారుడు చూపిన కుటీరంలో చేరుకొన్నాడు. ఆమునికుమారులో రాజదంపతులకు చాలినన్ని పండ్లు—మంచినీరు తీసుకొ యిచ్చారు.

ఆరోజులగాయితు, రాజదంపతు లాముసిఆశ్రమంలో యితర ప్రపంచమును మరచి మనస్సుకు కొంత స్థిమిత మేర్పరచుకొంటూ కాలక్షేపం చెయ్యడం మొదలుపెట్టారు. మునిసాన్నిధ్యంలో వుండే మహత్తర విషయాలన్నీ తెలుసుకుంటూవుండగా వారికి రోజులే కాదు—వారాలేకాదు—నెలలుకూడా గడచిపోతున్నాయి. శేషించిన జీవితమంతా అలాగేగడపాలని వారిసంకల్పం. కొంతకాలానికి ముని

చెప్పడమూ—వారు తెలుసుకోవలసిన విషయాలు తెలుసుకోవడమూ కూడా పూర్తి అయింది.

ఒకనాడు, తన చేరువలో కూర్చొనివున్న రాజదంపతులను నుద్దేశించి, ముని—

"పూజ్యదంపతులారా! మీరిక గురుముఖతా తెలుసుకోవలసిన విషయాలేవీ లేవు. స్వప్రయోజనంవల్లను, స్వశక్తివల్లనూ, పరంజ్యోతిని తెలుసుకొన వలసివుంది."

అని అందుకు వారవలంభించవలసిన పద్ధతులను కూడా బోధపరిచాడు.

"మహాత్మా! మీ అనుగ్రహంచేత మేము సమస్త దుఃఖాలకూ దూరమై తత్వమును తెలుసుకొని తరించాము. జనన మరణములు శరీరమునకుగాని ఆత్మకులేవనీ—ఆయాత్మ స్వరూపమే ప్రకృతి రూపమనీ—అట్టి ప్రకృతిరూపమైన ఆత్మను పరమాత్మలో ఏకం చెయ్యడమే పరమావధి అనీ—తమరు చేసిన బోధలు మహోత్కృష్టమును పొంది—ముక్తులము కాగలము—"

అని మాంచాల పరమసంతోషంతో పలికిన మాటలకు

"బిడ్డా! ఇట్టిది ఒకజన్మలో లభ్యమయ్యేది కాదు—మీ దంపతులు పూర్వజన్మమున యోగభ్రష్టులై—తిరిగి జన్మమునెత్తితిరి కనుక, ఇప్పుడు సిద్ధి పొందగలరు."

అని ముని బదులు చెప్పాడు.

"స్వామీ! మేము క్రితజన్మలో యోగభ్రష్టులమైనామని మనవి చేస్తిరిగదా, ఈజన్మలోకూడా అట్లుగాక, సిద్ధిని పొందగలమా?" అని, ధర్మపాలు డడిగినదానికి—

"నేను మీకు చేసిన బోధలు అందుకే ఉపయోగపడగలవు. సాధన సక్రమంగా చెయ్యండి—ప్రతిఫలము నపేక్షించకండి."

అని ముని తిరిగి చెప్పగా, రాజదంపతు లాతనికి నమస్కరించి—

"అమూల్యమైన తమ కాలము నిప్పటికే యెక్కువగా విని యోగించుకొన్నాము. ఇక శలవు."

అని ఆతావును వొదిలి వెళ్లిపోయారు. గురువాజ్ఞను పొంది ఆరోజు లగాయితు, వారును సమాధినిష్టాగరిష్టులై సాధన కుపక్రమించారు.

ఇట్లు మరి కొంతకాలం గడచిన అనంతర మొకనాడు పొద్దు నెత్తికెక్కిన సమయాన, కొందరు యోధులు వేటకై వచ్చారో-అరణ్య మధ్యంలో దారితప్పివచ్చారో—తిరిగి తిరిగి ఈముని కుటీరప్రాంతాని కొచ్చారు. కనుచూపు మేరలో ఒక చెట్టుకు కట్టబడివున్న అశ్వమును తిలకించి, వారాశ్చర్య విభ్రాంతులయినారు.

"విజయా! ఇదేదో మహామాయగా వుంది. ఇన్ని యోజన ములుగల ఈ మహారణ్యంలో ఉన్నట్టుండి, హఠాత్తుగా ఈ గుఱ్ఱ మెక్కడనుంచి అవతరించింది?"

అందులో ఒకడు, తమకు నాయకుడుగావున్న మరియొక యువ కునితో అన్నాడు. ఆయువకుడు కూడా గుఱ్ఱమున్న దెసకుచూసి—

"నిజంగా యిదేదో మాయగానేవుంది. నిర్మానుష్యమయిన చోటు కిగుఱ్ఱమెలావచ్చింది?" అన్నాడు.

"అదికూడా మనలాగే దారితప్పి పారిపోయొచ్చిందేమో విజ యా—" అని వారిలో మరియొక డన్నాడు.

"గుఱ్ఱ మాచెట్టుకు కట్టబడివుంది కదా—దారితప్పి యెలా వచ్చింది మూర్ఖుడా!" అని విజయుడన్నవాడు మొదటివానిని గసి రాడు. మిగిలినవారు విరగబడి నవ్వారు.

"అదుగో! అశ్వానికి మరి కొంచందూరంలో ఏదో కుటీర ముంది—పదండి పోయిచూదాం."

అని విజయుడన్న యువకుడనడంవల్ల, అందరూ కలిసి బిరబిర ముందుకు సాగిపోయారు.

మునిశిష్యులు ఫలాదులకు వెళ్లివుండడంచేత, వెలుపల యెవ్వ రూ కనుపించలేదు.

"ఇదేదో మునుల ఆశ్రమంలావుంది. గోలచెయ్యకండి—నే నొక్కడను లోపలకు పోయి చూచి వస్తాను."

విజయుడన్న యువకుడు మెల్లిగా లోపల ప్రవేశించాడు. ఇద్దరు స్త్రీ పురుషు లొకరికి ప్రక్కగా మరియొకరు కూర్చొని తపోనిష్ఠలో వుండడం కనుపించింది.

"అయ్యో! వీరెవరో మునిదంపతులు కాబోలు—అనుమతి లేకుండా లోపల ప్రవేశించినందు కేశాపమన్నా పడతారేమో—"

అని అతడు తనలో దిగులుపడుతుండగా ఫలాదులకు పోయిన శిష్యులు లోపల ప్రవేశించి—

"ఎవరు మీరు? అట్టహాసంగా పరివారంతో వచ్చి, మునిపుంగవుల ప్రశాంతతకు భంగం చేస్తున్నారు?"

అని తీవ్రంగా అడిగినందువల్ల, ఆధ్వనికి ఉలికిపడి—మునిదంపతులు కళ్లు తెరిచారు.

"మా రాకవల్ల కాదు—మీ అరుపులవల్లనే మునిదంపతుల శాంతికి భంగం కలిగింది—చూడండి."

అని నూతన యువకుడు జంకు లేకుండా బదులు చెప్పాడు.

"మీరు వచ్చినపని?"

అని శిష్యులలో ఒకడు తిరిగి అడిగాడు.

"ఆగంతకులై వచ్చినవారిని బెదరగొట్టకు నాయనా! దాహం కావాలో—నీడ కావాలో అడిగి తెలుసుకుని ఆదరించు."

అని కళ్లు తెరచిన మాంచాల అంటుంటే, ఆనూతన యువకుడు నమస్కరించి—

"తల్లీ! నీకరుణార్ద్రపూరితాలయిన ఆదరవచనాలతో నేను మూడుదినాలనుంచీ పడిన శ్రమఅంతా పోయింది—అమ్మా! నీమాటలెంత చల్లగావున్నాయ్! తెలియకవచ్చాను. క్షమించండి—శలవు."

అని ఆనూతన యువకుడు వెనుదిరిగి పోతుండగా, ధర్మపాలుడు-

"బిడ్డా!" అని పిలిచాడు.

యువకుడు వెనుదిరిగి ఆగాడు.

"రా! యిటువచ్చి కూర్చో."

యువకుడు నిరాకరించకుండా కూర్చున్నాడు. అతనికి సుమారు పాతికేళ్ళకు లోపు వయస్సుంటుంది. అతిసుందరమైన రూపము—మనోజ్ఞములై, కాంతిపూరితాలయిన నేత్రలు—మేలిమిరంగుగల శరీరచ్ఛాయ—అతను గంధర్వుడో—మన్మధుడో—అన్నట్లు అతిమనోహరంగా వున్నాడు. ముఖవర్చస్సునుబట్టి, నడుమున వ్రేలాడే నిసితకరవాలమునుబట్టి, శిరము నలంకరించిన మేలుతురాయినిబట్టి-విలువగల దుస్తులనుబట్టి, అదొక రాజపుత్రుడని చెప్పక తెలుసుకోవచ్చు.

"బిడ్డా! నువ్వెవరవు? ఈఅరణ్యప్రాంతానికెందుకొచ్చావు? నీకేం కావాలి? మీ దేవూరు?

అని ధర్మపాలు సాదరంగా అడిగినమీదట—

"స్వామీ! ఈప్రాంతమంతా మాపరిపాలనలోనిదే! ఇక్కడికి సుమారు ఏభై మైళ్ళదూరంలో, నాగపురము అనేపట్టణముంది. ఆ పట్టణము నేలే రాజు నాతండ్రి! మేము శిసునాగవంశానికి చెందిన రాజపుత్రులం—"

అని ఆయువకుడు చెబుతుంటే—ధర్మపాలుడు సలీసహితంగా నిర్ఘాంతపోయాడు—

"శిసునాగవంశమా? తండ్రిగారి పేరు?"

"ఛత్రపాలుడు—"

"బిడ్డా!"

అంటూ లేచివచ్చి ధర్మపాలు ఆయువకుణ్ణి కౌగలించి, కన్నీళ్లు కార్చడం మొదలుపెట్టాడు. మాంచాల రెప్పవాల్చకుండా ఆయువకుని వైపాశ్చర్యంగా చూడడం మొదలుపెట్టింది. యువకుని కేమీ అర్థంకాలేదు.

"నాయనా! ఛత్రపాలుడు నాఅన్న. తల్లులు వేరుగాని, మే మిద్దరమూ ఒకే తండ్రికి జన్మించినవాళ్ళము. మానాయనగారికి ఛత్రపాలుడు మొదటిభార్య కొడుకు—నేను రెండవభార్య కొడుకు. ఏవేవో కారణాలు పెట్టుకొని మీనాయన ఇప్పటికి ముప్పయ్యేళ్ళక్రితం—అనగా నీపుట్టుకలకు ముందే—కుటుంబంతో విరోధపడి—దూరదేశం వెళ్లిపోయాడు. నాటినుంచి అన్నదమ్ములమైనప్పటికీ మాలో ఒకరి విషయ మింకొకరికి అవసరం లేకుండాపోయింది. ఇన్నేళ్ళ తరువాత అన్నగారి సంతతి నాకళ్ళ కిక్కనుపించింది. బిడ్డా! నీతండ్రిగారునూ, మా అన్నగారునూ అయిన ఛత్రపాలుడు సురక్షితమే కదా!"

అని ధర్మపాలుడు తమ బాంధవ్యమును తెలిపి, అడిగినమీదట—

"వారిప్పుడు బ్రహ్మాండమయిన రాచపుండుతో బాధపడుతున్నారు. ఎందరు వైద్యులో ప్రయత్నించారుకాని, ఆరణమును మాన్పలేకపోయారు. ఎవరో ఒక సిద్ధుడు అయాచితంగా తటస్థమై, మా నాయనగారి మరణవేదనను గమనించి—"శ్వేతగంధకపు వేరును తెచ్చి, అరగదీసి, దాని గంధమును వేసినయెడల, ఈ పుండు నిమిషంలో పోతుంది. కాని దాన్ని సంపాదించడమే కష్టం" అని చెప్పిపోయాడు. ఆవేరును గురించి నేను సపరివారంతో మూడుదినాల

నుంచి, ఈ యరణ్యప్రాంతమంతా తిరిగి, విసిగిపోయాను. ఆవేరు లభ్యంగాకపోగా, దారితప్పాను.''

''గంధమనేది ఖనిజలోహము కదా, చెట్టనగా యెటువంటిది?''

''ఉన్నకట—ఆసిద్ధుడు నాకు దానిగుర్తులు సయితం చెప్పాడు. దానికేమీ, మీరీవిధంగా మునిదంపుతులై ప్రచ్ఛన్నంగా కాలం గడుపుతున్నా రెందుకు? నాకెవరో ఒక పినతండ్రి కలడనీ—ఏనగరానికో రాజనీ—ఒకటి రెండు పర్యాయములు మా నాయనగారు చెప్పగా విన్నాను. వారు మీరే అయితే యిలా యెందుకున్నారు? మీ పేరేమిటి?''

''నా పేరు ధర్మపాలుడు—ఈమె నీపినతల్లి మాంచాల. నేను పరిపాలించేది బిల్వనగరం—ఇక్కడికి వందయోజనాల దూరముంది. మాకు మూడుమూర్తులా నిన్నే బోలిన ఒక కొడుకుండేవాడు. అతను హఠాత్తుగా అకాలమరణమును పొందడంవల్ల-మేము రాజ్యభోగాల మీద విరక్తిపొంది—ఇప్పటికి సుమారు ఆరుమాసాలనుంచి, రాజ్యమును మంత్రి అధీనంచేసి, మే మీ ముని ఆశ్రమంలో గడుపుతున్నాము. ఆశ్రమవాసులు, మహాత్ములు—మాగురువులువారి దయవల్లనే, మాకు కొంత మనశ్శాంతి యేర్పడింది.''

అని ధర్మపాలుడు తమ విషయమునంతటినీ క్లుప్తంగా చెప్పిన అనంతరం—

''నీపేరేమిటి నాయనా!''

అని మాంచాల ఆయువకుణ్ణడగ్గా—

''విజయకుమార్!''

అని అతను బదులు చెప్పాడు.

మాంచాల ఒక వేడినిట్టూర్పును విడిచి—

''రూపమేగాక, పేరుకూడా మూడు మూర్తులా అదే చూశారా?'' అంది భర్తతో.

''ఏదీ?''

అని విజయకుమార్ తిరిగి అడిగాడు.

''మాబిడ్డ-నీకు అన్నగారవుతాడు. వాడిపేరు ఆనందకుమార్! పినతండ్రి పెద్దతండ్రి బిడ్డలు కదా, పోలికలెక్కడికి పోతాయి నాయనా! నిన్ను చూస్తే మావాణ్ణి చూసినట్టేవుంది...''

మూడుదినాలనుంచి తిరుగుతున్నాము. లభ్యంకాలేదు. తమరు సర్వజ్ఞులైన మహాత్ములని మాపినతండ్రిగారు చెప్పగా విన్నాను. ఆవేరు ఎక్కడ లభ్యమవుతుందో తమకు తెలిసిన, దయచేసి చెప్పండి— నాకు పితృభిక్ష పెట్టిన వారవుతారు.''

అని, తన విషయం సాకల్యంగా చెప్పాడు.

''కుమారా! ఆవేరు లభ్యమైనయెడ నువ్వు గుర్తుపట్టగలవా?'' అని ముని ప్రశ్నించాడు.

''సిద్ధుడు చెప్పిన ఆనవాళ్ళనుపట్టి గుర్తుపట్టగలను.''

''సిద్ధుడు చెప్పిన ప్రకారం ఆవేరును అరగదీసివేసి ఆగంధము వేసినయెడల ఎటువంటి కాచపుండయినా, నిమిషంలో మానిపోయే మాట నిజం. కాని దానిని అందరూ తాకకూడదు. ఒక్క ఏకపత్నీ వ్రతుడు మాత్రమే దానిని తాకి ప్రయోగించాలి. ఇతరు లెవరిచేతిలో పడినా, తెల్లటి సుద్దకణికలా వుండే ఆవేరు నల్లటి మసిబొగ్గుగా మారి పోతుంది.''

''ఆవేరుండే స్థలం తమకు తెలుసునా స్వామీ?''

''తెలిసి ప్రయోజనమేమిటి? దానిని తాకగల ఏకపత్నీవ్రతుడేడీ! నువ్వు బ్రహ్మచారివి కదా?''

అని ముని ప్రశ్నించగా—

''స్వామీ! తమకు విశ్వాసముంటే నేను ఏకపత్నీవ్రతుడని చెప్పకుంటాను''

అని ధర్మపాలుడు సంకోచం లేకుండా చెప్పాడు.

'' నావిశ్వాసంతో నిమిత్తమేముంది? ఏకపత్నీ వ్రతులుకాని వారిచేతిలో అది బొగ్గుగామారి, ప్రయోజనంలేని దవుతుందిగదా!''

అవును. అది పరీక్షేమకరమయిన మార్గం!—దయచేసి ఆవేరు దొరుకుచోటు తెలపయ్యండి, నేను పోతాను.''

''ఎక్కడికీపో నవసరంలేదు. ఆవేరు నాదగ్గరేవుంది. నువ్వు ఏకపత్నీ వ్రతుడవైతే—సోదరుడని చెబుతున్నావు. నీవే స్వయంగా పోయి, అతని ప్రాణాలురక్షించు—రక్షణకూడా యోగనియములలో ఒకటి.''

''చిత్తంస్వామీ!''

అని ధర్మపాలుడనినమీాదట, ముని కూర్చున్నచోటు నుంచి

లేచి, ఒకతాటియాకుల సంచిలోనుంచి, బొటనవ్రేలుపొడుగు—అదే లావుకలిగి, తెల్లటి సుద్దముక్కవలె వున్న వేరునుతీసి,

"బిడ్డా! చూడు! సిద్ధుడుచెప్పిన గుర్తులేవయినా ఈవేరుపై వున్నవేమో—"

అని ముని, తనచేతిలోనే ఆవేరునుంచుకొని, విజయకుమారునకు చూపాడు.

'అవును—ఇదే శ్వేతగంధకపువేరు స్వామీ! దాని కొకవైపున చక్రాకారము, రెండవవైపున శంఖాకారము—వుంటవని సిద్ధుడుచెప్పాడు, అంతేగాక వేరు నెక్కడఖండించినా రెండువైపులా రెండు గురుతులూ వుంటవట."

"నిజమే—"

అంటూ ముని, ఒకకత్తిని రెండుగా ఖండించి చూపాడు. అప్పుడుకూడా, రెండుముక్కలకు రెండువైపులా, అవేగుర్తు లుండడమును గమనించి, ధర్మపాలాదులందరూ విభ్రాంతులయినారు.

"ఏవీ—మీచేతులు చాపండి."

అని ముని విజయకుమారును, ధర్మపాలుని, హెచ్చరించిన మీదట వారదేప్రకారం చేశారు. ముని తనదగ్గరున్న రెండు వేరు ముక్కలను, చెరొక చేతిలోనూ వుంచాడు. విజయకుమార్ చేతిలోని వేరు నల్లటి మసిబొగ్గుగామారింది, ధర్మపాలుని చేతిలోనివేరు గోరంతయినా రంగుమారక, ఎప్పటి శ్వేతవర్ణమునే కలిగివుంది.

"బిడ్డలారా! నిదర్శనంచూశారా! ధర్మపాలుడు ఏకపత్నీవ్రతు డనడంలో యెటువంటి సందేహమూ లేదని ఈవేరు ఋజువు చేసింది, ఇనక వెంటనే బయలుదేరిపోయి, ఆమహారాజుకు ప్రాణభిక్ష పెట్టండి!"

అని మునిచెప్పిన ఆనతిప్రకారం ధర్మపాలుడు విజయకుమారునితో బయలుదేర సంసిద్ధుడైవుండగా, మాంచల గురువులను, భర్తను తిలకించి—

"నేను నా దేవుని వొదిలి వుండకుండే లాగున అనుగ్రహించండి." అని వేడుకొంది.

"అవశ్యం—సహధర్మచారిణి నీవంటిదే అమ్మా—పో! ఆత్మీయులను కూడా చూచిరావచ్చు."

అని ముని అనుజ్ఞ ఈయడంవల్ల, ధర్మపాలుడు మారు పలక లేక, సతీసహితంగానే విజయకుమారునితో బయలుదేరుతూ—

"స్వామీ! తిరిగి దారితప్పడ మవుతుందేమో—నాగపురము నకు మార్గమేటు?" అని అడిగాడు.

"ముందుగా తెలుసుకోవడం మంచిదయింది. ఇక్కడనుంచి దక్షిణపుదిక్కుగా పదియోజనములు గడచిన తరువాత—అక్కడ మూడు కాలిబాటలు కనిపిస్తాయి. నేరుగావున్నదీ, కుడిభాగమున వున్నదీ—తప్పుదారులు. ఎడమచేతి వైపునగల బాటగుండా పోయిన యెడల, తిన్నగాపోయి నాగపురము చేరగలరు."

అని ముని వారికి మార్గమునుకూడా సూచించిన వెంటనే ధర్మపాలుడు తన మామూలు అలవాటు ననుసరించి, సతీసహితంగా, తమ గుఱ్ఱముమీద బయలుదేరాడు. విజయకుమారుడున్నూ, మిగి లిన అతని పరివార జనాలునూ, ఎవరి గుఱ్ఱములపై వారు ప్రయాణ మును సాగించారు. ముని సూచించిన ప్రకారం, పదియోజనములు గడచిన అనంతరం, మూడు బాటలు కనుపించాయి. వారు తప్పు దారుల బడకుండా, ఎడమవేట్టు కాలిబాటకే గుఱ్ఱములను మళ్లించి, నియమిత కాలానికి సురక్షితంగా, నాగపురకోట ముఖద్వారమును చేరారు. అయితే, అంతవరకూ తండ్రిగారు రెటువంటి ప్రమాదమూ లేకుండా సురక్షితంగా జీవించివున్నారో లేదో, అని, విజయకుమారు ప్రాణం తహతహలాడడం మొదలుపెట్టింది!



ఛత్రపాలుడు, పాన్పుపై రోజుతుంటూ పడివున్నాడు. భార్య రమాదేవి కంట తడిపెట్టుకొంటూ చేరువలోవుండి ఉపచర్యలు చేస్తూంది. దాసదాసీ జనాలు, రాజబంధుగులు, ఉద్యోగులు, సర్వ జనులూ ఆసమయంలో అక్కడనే చేరివున్నారు. తమప్రభువు కడ అవసానకాలమని గుర్తెరిగి వుండడంవల్ల, దుఃఖాతిరేకంవల్ల కుంగి పోయివున్నారు. ఎవరినోటంటూ మాటరావడంలేదు—అంతటా నిశ్శబ్దం.

"విజయ రాలేదూ! వాడు దగ్గరలేకుండానే ప్రాణంపోతుంది కాబోలు—దశరథుడిలాగ, నేనుకూడా పుత్రశోకంతోనే చచ్చి పోతానా రమా—రమా—విజయ రాలేదూ?"

అని మధ్యమధ్య ఛత్రపాలుడు, మరణవేద ననుభవిస్తూ-సమయానికి కొడుకు దగ్గర లేనందుకు మరింత దుఃఖపడుతున్నాడు.

ఇంతలో, విజయకుమారుడు కొందరు కొత్తమనుషులను వెంట బెట్టుకొని ఖంగారుతో ప్రవేశించాడు.

"అదుగో ప్రభూ! విజయ వొచ్చాడు." అందిరమ ఆశ్చర్య సంభ్రమాలతో—

"వొచ్చావా నాయనా! నువ్వు రాకుండానే చచ్చిపోతానని భయపడ్డాను." అని ఛత్రపాలుడు కొడుకును దగ్గరగా పిలిచాడు.

"మీకింకేం భయంలేదు నాన్నగారూ! శ్వేతగంధకపు వేరు సంపాదించుకొచ్చాను. ఇక మీదంతా నయమవ లోపోతుంది."

అని చెప్పి, విజయకుమారు తల్లివైపుచూచి—

"అమ్మా! కొంచం నీళ్లు కావాలి."

అని అతడు చెప్పడమేతడవుగా రమాదేవి ఒక రజతపాత్రతో శుద్ధోదకమును తెచ్చి కుమారుని కందీయగా అత డానీటినందుకుని, ధర్మపాలునివైపు చూశాడు. ధర్మపాలు డానీటినందుకుని,

"అరగదియ్యడానికి సాన కావాలిగదా?" అన్నాడు. వెంటనే అదికూడా తీసుకునిరాబడింది. ధర్మపాలుడు కూర్చుని, గురువును మనసులో తల్చుకుంటూ, తనదగ్గర భద్రపరుచుకొని వున్న శ్వేత గంధకపు వేరునుతీసి, సానమీద అరగదీయడం మొదలుపెట్టాడు.

కాషాయ వస్త్రాలుధరించి కొడుకుతో వచ్చిన, ఆ కొత్తవారు రాజదంపతులని యెవరికి తెలుసు? ఆసమయంలో వార్ని గురించి అడిగి తెలుసుకోడాని కెవరికి సావకాశం? వారెవరో మునిదంపతులై వుంటారని, ఎవరిమట్టుకు వారే అనుకుని, వూరుకున్నారు.

ధర్మపాలుడు ఎవరితోనూ మాటలాడకుండా గంధం తియ్యడం పూర్తి అయినతరువాత, దానిని స్వయంగా తానే ఛత్రపాలుని రాచపుండుమీద వేశాడు. ఆ పుండతనివెన్నుమీద ఒక దోసెడు మేర నాక్రమించి, చూడడానికే అతిభయంకరంగావుంది. మొదట తీసినగంధం సరిపోలేదు. ధర్మపాలుడు తిరిగి వేరుసగరతీసి, పుండుకు పట్టించి, పూర్తిఅయిన తరువాత చేతులు కడుక్కుంటున్నాడు.

"అబ్బ! ఎంత చల్లగావుంది? ఇంతలోనే బాధంతా చేత్తోతీసి పారేసినట్టు మటుమాయమైందేమిటి?"

అని ఛత్రపాలు డనడమును గమనించి, అక్కడి వారందరూ ఆశ్చర్యపోయారు. గంధంవేసిన పుండుపై నుంచి, ఏదో ఆవిరి పైకెగసి పోతుండడమును వారందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఓషధు లలో అటువంటి మహాత్తుగల వుంటాయని వారికిప్పుడు తెలిసింది. రెండు మూడు నిమిషాలవరకూ మాత్రమే పుండుపై నుంచి ఆయావిరి పైకిపోయింది. అనంతరం అదికూడా లేదు. గంధంమాత్రం పుండుకు గట్టిగా పట్టుకుని, శ్వేతవర్ణంలోనుంచి—ఎరుపురంగుకు మారింది.

"నాన్నగారూ! ఇప్పుడెలావుంది?"

అని విజయుడు వికసించిన ముఖంతో అడగ్గా—

"లేదుతండ్రీ! నాకిప్పు డెటువంటి బాధలేదు. చాలా హాయిగా వుంది. ఆకురు పసరికో—ఆబాధవరికో—అంతా మర్చిపోయాడు. ఆరు మాసాలనుంచి పీల్చి పిప్పిచేసింది—ఈ రోజుకు విమోచనం కలిగింది. ఓషధికోసం ఎన్నికష్టాలుపడ్డావు? ఎక్కడ తేగలిగావు నాయనా!"

అని ఛత్రపాలు డడిగినమీదట—

"నేనేమీ కష్టపడలేదు—అదుగో ఆమునిదంపతులవైపు చూడండీ!" అని కొడుకు అన్నప్పుడు మాత్రమే ఛత్రపాలుడు వారి వైపు చూశాడు,

"వారెవరు నాయనా! ఋషిదంపతులుగా వున్నారు."

"ప్రస్తుతం అంతేకాని-ఇంతకుముందు వారు రాజదంపతులు."

"రాజదంపతులా?"

"అవునండి-బిల్వనగరం పేరు మీకేమయినా జ్ఞాపకముందా!"

"బిల్వనగరం—ఆ ఆ! దానిని మాతమ్ముడు ధర్మపాలుడు పాలించేవాడు."

"ఆధర్మపాలుడు, మీ సోదరుడు, ఈయనే—కూడా వున్నదా యన భార్య—వారి దయవల్లనే నాకు వేరు దొరికింది—మీరు బ్రతికారు."

అని విజయకుమారుడు చెప్పగా—

"ఆః! ఆ! తమ్ముడా! ధర్మపాలుడా? ఎంతకాలని కల్లుసు కున్నాము నాతప్పులు క్షమిస్తావా నాయనా!"

అంటూ ఛత్రపాలుడు లేచి సోదరుని కౌగలించి మితిలేని పశ్చాత్తాపమును పొందాడు.

"గడచిపోయిందాన్ని గురించి యిప్పుడు విచారించడం దేని కన్నయ్యా? పుండు రేగుతుందే మో—నెమ్మదిగా పడుకో."

అని, ధర్మపాలుడు ఛత్రపాలుని తిరిగి పాన్పుదగ్గరకు తీసు కెళ్లి కూచోబెట్టాడు.

"ముప్పయ్యేళ్ళముందునుంచి, ఎవరికెవరమూ లేము—ఇప్పు డీవిధంగా కలుసుకోవలసింది కాబోలు. అయినే తమ్ముడూ! సపత్నీ యుడవై యీ మునివేషధారణంలో వున్నావెందుకు? రాజ్య మేమైంది? పరిపాలన యెందుకు లేకుండాపోయింది. విజయ, మీరూ, ఎక్కడ, ఎలా కలుసుకున్నారు?"

అని ఆదుర్దాగా ప్రశ్నలు వేస్తుంటే—విజయుడు కల్పించుకుని, తాను వార్ని కలుసుకున్న విధానమేగాకుండా, వారికుమారుడైన అనంతకుమార్ మరణమాదిగా, వారు విరక్తిపొందడము—రాజ్య పాలన వొదిలి, దేశసంచార కార్యక్రమమును ముగించడము, తరు వాత, మహారణ్యం మధ్య శమంతకముని ఆశ్రమలో వైరాగ్య చింతనంలో మునిగివుండడము-తాను దారితప్పడము, ఆవారి ఆశ్రమం చేరుకోవడము—శమంతకముని దయనుపొంది, శ్వేత సుగంధపు వేరును పొందడము—దానిమహాత్తు—ఏకపత్నీ వ్రతులుతప్ప యిత రులు దానిని తాకకూడదని నియమము-ధర్మపాలుడు ఏకపత్నీవ్రతు డైన కారణంవల్ల, శమంతకముని అతనినే తనతో పంపడము— మొదలయిన అన్ని విషయాలూ వివరించి, తండ్రిగారికి, తల్లిగారికీ, మిగిలినవారికి చెప్పాడు. తమ ఆత్మీయులే భర్త ప్రాణరక్షణకు సాయ పడడమును తెలుసుకొని, రమాదేవి, మాంచలనూ ఆమెభర్తను అనేకవిధాల కొనియాడి కృతజ్ఞత తెలిపింది—తగిన మర్యాదలు చేసింది.

"అన్నా! భగవత్సంకల్పమున నువ్వు గండమునుగడిచి, సురక్షితుడవై యున్నావు. పరమసంతోషము. మాగురువులు చెప్పిన దానినిబట్టి—ఇక నీ కెన్నడూ యెటువంటి బాధాకలగదు. మాకు అనుజ్ఞయిస్తే—పోయి ఆశ్రమం చేరుకుంటాము."

అని ధర్మపాలుడనగా—

"అయ్యో! పూర్వపు బేధ... మింకా మనసులో వుందా తమ్ముడూ! నన్ను పరాయివాడిలాగ భావ్యం కాదు. క్షమింప వేడుకున్న కూడా, మాయింట్లో కొంత కాలమైనా వుండకుండా—మా యింట్లో తినకుండా అప్పుడే వెళ్ళిపోతానంటావా! అమ్మా మాం చాలా! నువ్వయినా నీ భర్తకు చెప్పు—మీదంపతులిద్దరూ నా సమక్షంలో కొంత కాలమైనా వుండాలి."

అని ధర్మపాలుడు, తమ్ము ననేక విధాల బ్రతిమాలాడు.

"అన్నా! నువ్వనుకొన్న దేమీ కాదు. మాకు ఆశ్రమ నివాసం తప్ప యితర వాతావరణమేదీ పట్టను-అందు కేగదా, రాజ్య సంపదలు—పరిపాలన వొదలి—ఈ ప్రకారముంటున్నాము!"

"నిజమే కావచ్చు-మీ కనువయిన పద్ధతులు నేనిక్కడ ఏర్పాటు చేయించగలను—కొంత కాలమయినా నాదగ్గర వుండితీరాలి,"

అని ఒకవైపున ఛత్రపాలుడు—

"ముప్పయి సంవత్సరాల అనంతరం కలుసుకుని, వచ్చినవాడే వెళ్లిపోతాననడం ధర్మం కాదు."

అని మరోవైపునుంచి మాంచాల—

"నేను మీ ఆనందుననుకొని—నాదగ్గర ఒక్క రోజయినా వుండండి."

అని విజయ, యింకోవైపున, నిర్బంధం చెయ్యడం మొదలు పెట్టారు. ఇతరులమాటల నాతడు పాటించలేదు కాని, విజయ అన్న దానికి మాత్రం వారిమనసు ద్రవీభూతమైంది.

"పోనీ, ఈదిన మిక్కడుండి—ఉదయమే బయలుదేరిపోయి—ఆశ్రమం చేరుకుందాము."

అని భార్య మాంచాల అన్న దానికి ధర్మపాలుడు తిరుగు చెప్ప లేదు. రమాదేవి వారి స్నానపానాదుల కవసరమైన యేర్పాట్లన్నీ స్వయంగా చేసింది. పండ్లు, పాలు మొదలయినవాటిని వారి ఆహారానికి అమరించింది. ధర్మపాలుడమిత ఉత్సాహంతో లేచి తిరుగుతూ, బహుకాలానికి కలుసుకున్న తమ్ముని, మరదులును చూసి, పరమానందభరితుడౌతున్నాడు. కాని, రాజ్యభోగాలను వొదిలి వారా విధంగా విరాగులై వున్నందుకు కించపడుతున్నాడు.

మునిదంపతులుగా వున్న రాజదంపతులు విశ్రాంతి తీసుకొన్న అనంతరం, ఛత్రపాలుడు వారిదగ్గర చేరి, ఆవిషయమును గురించే ప్రస్తాపించాడు.

"తమ్ముడూ! సకలసంపదలూ కలిగి, సమస్త రాజ్యభాగ్య భోగాలుకలిగి వుండికూడా, నువ్వీవిధంగా విరాగివై భార్యాసహితంగా అడవులపాలుకావడం నాకు తృప్తికరంగాలేదు. ఇప్పటి కయినా మనసును మళ్లించుకుని, తిరిగి నిజరాజధాని చేరుకుని, మామూలుగా వుండవలసిందని నాకోరిక—"

"అన్నా నాయందుండే వాత్సల్యంకొద్దీ నీకలాతోచింది. కాని మేమూఆశ్రమంలో పొందుతున్న బ్రహ్మానందమును ఏరాజాధిరాజూ పొందడు. తిరిగి రాజ్యభోగాలపై మామనసులు మళ్లడంకల్ల."

అని ధర్మపాలుడు చెబుతుండగా, రమాదేవి, విజయకుమారుడూ కూడా ఆతావుకొచ్చి కూర్చున్నారు.

"చిన్నాయన చాలామంచివాడే కాని, ఒక విషయమును మాత్రం నాతో చెప్పకుండా మగుపరచాడు.

అని విజయుడనగా—

"ఏమిటది నాయనా!"

అని ఛత్రపాలుడు కొడుకునడిగాడు.

"సుమారు నావయస్సువరకూ పెరిగి, అన్నివిధాలా నన్నే పోలివుండిన, ఆనందకుమారన్నయ్య అకాలమరణమును పొందాడన్నారే కాని, అతని మరణానికి కారణమేమిటో, ఎన్నివిధాల అడిగినా చెప్పడంలేదు."

అని విజయకుమారు చెప్పినమీదట—

"అవును. అడగడం మరిచాను. అది మేముకూడా తెలుసుకోవలసిన విషయం. మీవిరక్తికి కారణమైన ఆబిడ్డ ఏవిధంగా చనిపోయాడు? ఎప్పుడు చనిపోయాడు. చెప్పు తమ్ముడూ!"

అని ఛత్రపాలుకూడా ధర్మపాలుని నిర్బంధంచేశాడు. ధర్మపాలు డొక వేడినిట్టూర్పును విడిచి—

"గతజలసేతుబంధనము-ఏదో అయిపోయింది. ఇప్పుడావిషయమును తవ్వుకొన్నందువల్ల ప్రయోజనమున్నూ లేదు." అన్నాడు.

"వీల్లేదు చిన్నాన్నా! నా సోదరుడి, అకాలమరణ వివరాలు చెప్పేవరకూ నిన్ను వొదిలిపెట్టను. మా అన్న చావును గురించి తెలుసుకోడానికి నాకు సర్వాధికారమూ వుంది."

అని విజయకుమార్ మరీ పట్టుపట్టినందువల్ల ధర్మపాలు ఆ విషయం చెప్పక తప్పలేదు.

"అన్నా! నువ్వు నాయనగారితో పోట్లాడి వేరుపడి వెళ్ళిపోయిన కొన్ని సంవత్సరాల అనంతరం నాకొక చెల్లెలు పుట్టింది. దాని కిప్పుడు ముప్పయ్యేళ్ళకు లోపుంటాయి. మా అజాపజా లేకుండా నువ్వప్పటినుంచీ దూరానవుండడంవల్ల నీ కా విషయమే తెలియదు. నీగుణముల నసహ్యించుకొని, నాయనగారు కూడా నిన్ను తలపెట్టిన వారు కారు. నీకు జాబులు వ్రాసినవారు కారు. నువ్వెవరవో—మే మెవరమో అంతేగదా!

మంజులాదేవి, అని పేరుపెట్టి యుక్తవయస్సురాగానే ఆమెను కీర్తికాముడనే కుండిననగరాధీశున కిచ్చి పెళ్ళిచేశారు. చెల్లమ్మను చేపట్టిన వేళావిశేషంవల్లనో—అతని అదృష్టం బాగుండడంవల్లనో కొంతకాలాని కతడు మగధసామ్రాజ్యానికే ప్రభుడయినాడు. కాపరానికి వెళ్లిన వెంబడే మంజులాదేవి గర్భవతి కావడము—ఆమె కొక ఆడశిశువు కలగడము జరిగింది. అందాల అప్సరస అనదగిన ఆబిడ్డకు చింతామణి అని పేరుపెట్టారు. అప్పటికే నాకొక మొగబిడ్డమాత్ర మున్నాడు. మంజులాదేవి కుమార్తె, నాకుమారుడూ క్రమంగా పెరిగి పెద్దవారయ్యారు. సమానవయోరూపగుణాలు కలిగిన ఆయిరువురకు వివాహంచేయ నిశ్చయించాము. అంతవరకు అంతా సక్రమంగానే వుంది. ఆపైన జరిగినదే విడ్డూరము—విచిత్రము—మహాఘోరము.

ఎవరో ఒక బైరాగి కీర్తికాముని భక్తివిశ్వాసాలకు పాత్రుడైనాడు. ఆబైరాగే చింతామణికి గురువై, ఆమెకు సమస్త విద్యలు నేర్పాడు. రాజకుమారి ఆబైరాగినే దేవుడుగా యెంచి పూజించడం మొదలుపెట్టింది. బైరాగి ఏవో ఐదు ప్రశ్నలు చింతామణికి చెప్పి, వాటికి సరియైన జవాబులు చెప్పగల రాజకుమారుణ్ణి మాత్రమే వివాహమాడాలి—అని శాసించాడు. ప్రశ్నలకు జవాబు చెప్పలేక అపజయమును పొందిన రాజకుమారుని శిరస్సు ఖండించి, కోటకు వేలగట్టాలని ఆజ్ఞాపించాడు. గురువాజ్ఞలకు బద్ధురాలైన చింతామణి, తలి

దండ్రులు చెప్పినా వినక, అదేప్రకారం చెయ్యడానికి వ్రతమును పూనింది.

మన ఆనందకుమార్ ఆప్రశ్నలకు తానే బదులు చెప్పి, చింతామణిని వివాహమాడతానని, మేమెన్ని చెప్పినా వినక బయలుదేరాడు. కాని, ప్రశ్నలకు బదులు చెప్పలేక చింతామణిచే ఖండించబడి—మాకడుపులో ఆరని చిచ్చుపెట్టాడు. ఈరోజువరకూ ఆ ప్రశ్నలకు బదులుచెప్పి, చింతామణిని వివాహమాడినవా రెవరూ లేరు. కాని అందుకు అనేకమంది రాజకుమారులు తయారై రావడము—చింతామణి ప్రశ్నలకు బదులుచెప్పలేక ఆమెచే ఖండించబడుతుండడము—నేటివరకూ జరుగుతూనే వున్నదట—దీనినిబట్టి యిప్పటి కెన్ని వందలమంది ఉత్తమ రాజకుమారులు హతులై పోయివుంటారో, ఆలోచించండి!

అని ధర్మపాలుడు, చింతామణియొక్క, తమ ఆనందకుమార్ బలవన్మరణముయొక్క వివరములన్నీ చెప్పి ముగించిన తరువాత—

"ఇది ఘోరమైన హింసాకాండ-దీనిని అరికట్టగలవా రెవ్వరూ లేకపోయినారా!"

అని విజయకుమార్ అడిగాడు.

"ఎవరరికట్టగలరు? వారి నిబంధనలకు అంగీకరించి రాజకుమారులు హతులౌతున్నారు."

అని ధర్మపాలు చెప్పాడు.

"ఆబైరాగి యెవరో—ఆప్రశ్న లేమిటో—వాటి జవాబు లెటువంటివో—ఇంతవరకూ ఎవ్వరికీ తెలీకన్నమాట?"

అని ఛత్రపాలు డడిగినమీదట—

"తెలియదు—తెలుసుకోగలవా రున్నారనికూడా ఎవరికీ నమ్మకంలేదు. ఆనాజన్మాంతము కన్యగావుండడము—వివాహమాడ వచ్చిన రాజకుమారుల శిరస్సులు ఖండిస్తుండడము—ఇదే చింతామణి భవిష్యత్తుకూడా! ఆగురువుచే చెప్పబడిన ప్రశ్నలు మహాక్లిష్టతరములై నవట—"

అని ధర్మపాలుడు తిరిగి చెప్పాడు. చింతామణి విషయము నంతటినీ వింటున్నప్పుడు, విజయకుమారు శరీరంలోని రక్తమంతా ఉడుకెత్తి ఉబికి ముఖాని కావరించినట్లై, అది ఎర్రగా దేపురించి శౌర్య

పరాక్రమాలను బుసకొడుతూంది. అతని నోటంట ఎటువంటి భయం కరవార్త వినవలసివస్తుందో అని ఛత్రపాలుడు బేజారయినాడు. కాని అటువంటిదేమీ లేకుండానే గడిచింది.

అనుకున్న ప్రకారం, మునిదంపతులుగా వున్న రాజదంపతులు మార్నాటిఉదయం, ఆశ్రమవాసానికి బయలుదేరారు. ఆత్మీయులెన్నివిధాల నిర్బంధంచేసినా వారుండలేదు. భోగవిలాసాలతోపాటు బంధుప్రేమను సయితం రోసి, వారు కేవలం ఆముష్మికాదృష్టిలో వున్నారనీ, తత్వములు పూర్తిగా మార్పుచెందాయని, ఛత్రపాలుడనుకున్నాడు. ఏది ఏమయినా, సకాలంలో వచ్చి భగవత్స్వరూపుల్లా ఆదంపతులిద్దరూ తనకు ప్రాణరక్షణ చేశారని ఛత్రపాలాదులు వారికి వెయ్యివిధాల కృతజ్ఞతలు తెలుపుకున్నారు. అనంతరం వారి కోరికకు భిన్నంగా నడుచుకోవడం యిష్టంలేక ఛత్రపాలుడు కొందరు పరివారమును తోడిచ్చి, తమ్మునీ, మరదలునూ, నిజాశ్రమంలో వొదిలి రావలసిందని పంపాడు.

వారు వెళ్ళినదగ్గరనుంచీ, విజయకుమారు డెందుచేతనో ఎవరితోనూ సరిగా మాటలాడడంలేదు. మౌనంగావుండి, దేనిని గురించో దీర్ఘాలోచన చెయ్యడం మొదలుపెట్టాడు. ఆరాత్రంతా అతని కంటికి నిద్దరలేదు——మనస్సుకు స్థిమితంలేదు.

"రక్తస్పర్శగల సోదరుడు——దుర్మరణానికి గురి అయ్యాడు! వాడుకూడా వుంటే——ఇద్దరిన్నదమ్ములముగదా! మా కటువంటి యోగంలేకుండా చేసినవాడా బైరాగి——చింతామణి! అంతేగాక సుక్షత్రియకుమారుల నింకా యెందరినో అదేవిధంగా దుర్మరణానికి గురిచేస్తున్నారు. ఈ ప్రకారం మరికొంతకాలం జరుగుతే, ప్రపంచంలో రాజవంశం పేరుకయినా లేకుండా అంతరించిపోతుందే——ఇందుకు కర్తవ్యమేమిటి?"

అని ఆరాత్రంతా అతని కదే ఆలోచన——అదే ఆరాటం——తెల్లవారకముసుపే లేచేడు. కాలకృత్యాలు తీర్చుకున్నాడు. ఉచితమైన దుస్తులు ధరించాడు. తన గుఱ్ఱమును సిద్ధంచేయవలసిందని, పరిచారకులకు చెప్పాడు. వెంటనే తండ్రిగారి దగ్గరకు వెళ్లాడు, నమస్కరించి——

"నన్నాశీర్వదించి పంపండి!" అన్నాడు.

ఛత్రపాలుడు తెల్లబోయాడు. ధరించిన దుస్తులనుబట్టి, యుద్ధ ప్రయత్నంమీద బయలుదేరే యోధుడిలావున్న విజయకుమారుని తిలకించి—

"ఉన్నట్టుండి—ఈ ప్రయాణ మేమిటి నాయనా!"

అని ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమీ అడగొద్దు—ముందర ఆశీర్వదించండి!"

తండ్రీ కొడుకుల సంభాషణను విని—తల్లి రమాదేవికూడా అక్కడి కొచ్చి—

"ఇదేమిటి విజయా! ఎవరిమీదికయినా యుద్ధానికా?"

అని వింతగా అడిగింది.

"ఏమీ కాదమ్మా—ముందర నువ్వాశీర్వదించు—తరవాత నాన్నగా రాశీర్వదిస్తారు."

"విజయీభవ!" అని రమాదేవి ఏమీ ఆలోచించకుండానే ఆశీర్వదించింది.

"మీరు నాన్నగారూ—"

"శుభం కలుగుతుంది—కాని ఎక్కడికో—పనేమిటో చెప్పి మరి వెళ్లు తండ్రీ! లేకపోతే, మేం ఖంగారు పడవలసివుంటుంది."

"చెప్పింతరవాత అడ్డుచెప్పకుండా వుంటారా?" అని కొడుకు,

"అదేమిటో చెప్పు." అని తండ్రి.

"నా ప్రయాణానికి, అమ్మా, నువ్వూ ఎటువంటి తిరుగు చెప్ప రని, ప్రమాణం చెయ్యండి—లేకపోతే చెప్పకుండానే వెళ్ళిపోతాను." అని విజయకుమార్ పట్టుపట్టడంవల్ల—

"సరే—అడ్డుచెప్పం."

అని తలిదండ్రు లిద్దరూ ఒకేసారి అన్నారు.

"చింతామణి ప్రశ్నలకు జవాబు చెప్పి, ఆమె జరిగిస్తున్న హింసాకాండను అరికట్టడానికి—కుండినసగరం పోతున్నాను."

ఆమాట వినేటప్పటికి, ఛత్రపాల రమాదేవిల గుండెలు ఝల్లు మన్నాయి. వారు క్షణకాలం కొయ్యబారి, బదులుచెప్పలేక పోయారు. తరువాత—ధర్మపాలుడు తలమోదుకుంటూ—

"నువ్విప్రయత్నంలో వున్నావని మేమూహించనయినా లేదు. తండ్రీ! నీకిటువంటి విపరీతపు బుద్ధి కలగడం చాలాతప్పు. అనేకవందల

మంది ప్రజ్ఞావంతులయిన రాజకుమారులు అపజయమును పొంది, హతులైపోతున్నారని తెలుసుకొనివుండిన్నీ నువ్వదే ప్రయత్నమా! నువ్వు వారందరికంటే ప్రజ్ఞాశాలివా?"

"ఎందుకు కాకూడదూ?"

"మాకడుపులో చిచ్చుపెట్టడానికి నువ్వు తయారయినావా నాయనా? కండగడిచి, నాయనగారిలాగో బయటపడ్డారని సంతోష పడుతుంటే-ఇంతలో మళ్లీ యీ ప్రళయ మేమిటి?" అని రమాదేవి-

"చేసిన వాగ్దానం మరచిపోకండమ్మా! విషయం చెప్పాను గాబట్టి యిలా అంటున్నారు. చెప్పకుండా వెళ్లిపోతే ఏంచేసేవారు? చిన్నాయన కొడుకే గాకుండా, సాటిరాజకుమారులెందరో ఆదారుణ యజ్ఞానికి బలియైపోతుంటే చూస్తూ వూరుకోవడం ఎలాంటి పౌరషం? ఎటువంటి ప్రజ్ఞ? పుట్టిన ప్రతిజీవికీ చావు సత్యం. అనిత్య శరీరానికి మోజుపడి, పురుషప్రయత్నం మానుకుంటామా? ధీరుడికీ, యోధుడికీ, మృత్యువు అను క్షణం ప్రత్యక్షమవుతూనే వుంటుంది. ప్రజ్ఞావంతుడనయితే, ఆరాజకుమారి ప్రశ్నలకు జవాబు చెప్పి ఆమె గర్వమణిగిస్తాను-రాజలోకానికి జరుగుతున్న అపకృతిని, హింసాకాండనీ, అరికడతాను. లేదా సోదర రాజకుమారుల్లాగ నేను ఆసౌందర్యవతి చేతిఖడ్గానికి బలిఅవుతాను. ఎటయినా, వీరకుమారుణ్ణి కన్నకీర్తి మీకే!"

అని, ఇక తలిదండ్రుల జవాబుకయినా ఎదురుచూడకుండా, విజయకుమార, కార్యనిశ్చయంతో గడపదాటి, అక్కడ సిద్ధంగా వున్న తన గుఱ్ఱము నధిరోహించి కోటకూడా దాటాడు! అటుపైన ఎవరేమైపోయినా అతను లక్ష్యం చెయ్యదలచలేదు.

కొడుకంత సాహసం చేస్తాడని ఛత్రపాలదంపతులు కలలో నయినా ఊహించని విషయం! మనుషులను వెంట పరుగెత్తించి, కొడుకును పిలిపిద్దామా అంటే, అది తామిచ్చిన మాటకు విరుద్ధమవడమే కాక—అతను మళ్ళిరాడు—చెప్పినదాన్ని వినడు. ఆసంగతి వారికీ తెలుసు. పోతే, ఇక చేతనయిందీ, చెయ్యగలిగిందీ, దుఃఖించడము. ఒకరినొకరు ఊరడించుకోవడము—ఆ రాజదంపతులున్నూ అంతే చెయ్యగలిగారు! ఆపైన భగవంతునిపై భారం వేశారు?



వాయువేగ మనోవేగాలను మించి పరుగెత్తుతున్న దాగుఱ్ఱము దానికీ, దాని రౌతుకూ కూడా, శరీరాలు చెమటలు కమ్మాయి. అశ్వమూ అలిసిపోయింది—వాహకుడూ అలసిపోయాడు, పరుగెత్తి, పరుగెత్తి, ఒకకొండ మొదల్లో నిలిచిందా గుఱ్ఱం. విజయకుమారుడప్పుడు కిందకిదిగి, వెనుదిరిగి చూశాడు. తానెంతదూరం దాటి వచ్చాడో—ఆవచ్చిన చోటేమో—అతనికి తెలియదు. నలువైపులా పరికించాడు. కనుచూపు కందినంత మేరలో మనుష్య సంచార మెక్కడా లేదు.

ముఖము నావరించిన చెమటలు తుడుచుకొని, గుఱ్ఱము నొకసారి చేతితో తట్టి, ఆకాశంవైపు చూచాడు. సూర్యాస్తమయాని కింకా ఒకటిరెండు గంటలు వ్యవధివుందని వూహించుకున్నాడు, తన ప్రయాణానికి అడ్డుగా నిలచిన్న కొండను దాటడమెల్లాగా అని ఆలోచించడ మొదలుపెట్టాడు. ఆకొండ అయిదారు ఫర్లాంగుల విస్తీర్ణం కలిగి, దాటడానికి వీలులేనంత ఎత్తుగావుంది. ఆ అయిదారు ఫర్లాంగులూ దాటి, కొండనుచుట్టి పోదామనుకుంటే, ఆ ప్రదేశమంతా చొరశక్యంకాని అరణ్యప్రాంతంగా కనుపించింది. ఇటుకొండ, అటు మహారణ్యము—వెనుకకు మళ్ళడం మరీ అయోగ్యమైనపని అనుకున్నాడతను.

కుండిన నగరమనే పేరును విన్నాడేకాని, అది తమపట్నానికి ఎన్నిమైళ్ళదూరంలోవుందో—మార్గమేటో, అతనికి తెలీదు. ఏమీ చెయ్యడానికీ పాలుపోక, నిలుచుని అటూయిటూ చూస్తున్నాడు. కష్టపడి కొండనెక్కితే, అవతలవైపున ఏమున్నదీ తెలుస్తుంది. అయితే, యెక్కడమెలాగు? ఒకవేళ ఎక్కిచూచి, కొండకవతల వైపు నున్నదికూడా మహారణ్యమయితే? ఏమయితే అవుతుందనీ, ఒకచేత్తో గుఱ్ఱపు కళ్లెమును పట్టుకుని, మెల్లిగా కొండకు ఎగప్రాకడం మొదలుపెట్టాడు. తనకంటే గుఱ్ఱమే సులువుగా పైకెక్కుతున్న విషయమును గమనించాడు. అప్పుడు గుఱ్ఱమును ముందుపెట్టి తానువెనుక నడవడం మొదలుపెట్టాడు. అతని ఊహసరయినదే అయింది. అనుకున్నంత కష్టంలేకుండా గుఱ్ఱం సహాయంతో అతను

పర్వతాగ్రనికిచేరాడు. గుండె పదిలపడింది, కొండకటువయపు కొంచమేటవాలుగా వుండి, దిగగలిగినంత వాటంగానేవుంది. అతి జాగ్రత్తగా, అతిమెల్లిగా, గుఱ్ఱంతో ఎలాగయితేనేమి, కొండ దిగాడు. అదృష్టవశాత్తూ ఆ పేరువలో ఒక నీళ్ళవాగు కనుపించింది. ఆచల్లటి నీళ్ళతో ముఖం, కాళ్లుకడుక్కొని, దాహంతీర్చుకున్నాడు. గుఱ్ఱంచేతకూడా ఆ నీరు తాగించి, ఇకముందు సంగతేమిటా అని ఆలోచించాడు. ఏమార్గము ననుసరిస్తే కుండిననగరం చేరతాడో అతనికి తెలీదు. ఇంతలో ఎటునుంచో, వింటినిసారించి, బాణం వొది లినశబ్దం "ఝమ్" అని వినిపించింది, పావురం గిరున తన్నుకుంటూ వచ్చి కిందపడింది. మొదట వినిపించిన వింటి శబ్దానికీ—పావురం చావడానికీ సంబంధముండివుంటుందని ఊహించుకున్నాడు. అత డూహించుకొన్నట్లే, మరి అయిదునిమిషాలలో ఒక బోయవాడు, తానుకొట్టిన పావురమును తీసుకునే నిమిత్తంవచ్చి విజయకుమారును చూచాడు.

"ఈ పావురమును కొట్టింది నువ్వేనా?"

అని విజయకుమారు డడిగాడు.

"అవునండి—మీరెవరూ? ఇక్కడెందుకున్నారు?"

అని బోయవాడు తిరిగి అడిగాడు.

"నేను నాగపురాధీశుని కొడుకును. ఆపుర మిక్కడి కెంత దూరముంటుందో చెప్పగలవా?"

"వచ్చినవారు—మీకు తెలిదా ప్రభూ?"

"అశ్వారోహణంచేసి అతివేగంగా రావడంవల్ల దూరం తెలి యడంలేదు. అంతేగాకుండా నే నీ ప్రాంతాల కెప్పుడూ వచ్చినది లేదు."

"నాగపురమిక్కడికి నూరామడలకు తక్కువ దూరముండ దండి."

అని బోయివాడు చెప్పగా, విజయకుమారుడు తెల్లపోయి నాడు—అనతికాలంలో ఇంతదూరం ప్రయాణం చేసినందు కాశ్చర్య పోయాడు.

"మీ రేవ్వారు?"

అని బోయవాని తిరిగి ప్రశ్నించాడు.

"బంగారుపల్లి—ఇక్కడి నాలుగామడల దూరంలోవుంది. కాని అది నాగపురరాజ్యంలో చేరలేదు. మీరు అడ్డదారిని తొక్కుకుని కొండదాటి వచ్చివుంటారు. లేకుంటే బంగారుపల్లికీ, నాగపురానికీ నూరున్నర ఆమడ."

అని బోయవాడు వివరంగానే చెప్పాడు.

"అయితే, యీబంగారుపల్లి ఎవరి రాజ్యంలో చేరింది?"

"అదంతా నాకు తెలీకండి—మాబంగారుపల్లె కెళ్లాలంటే తమ గుఱ్ఱంమీద ఒక్కదౌడు—అదుగో ఆ కనిపించే వుంతంటే పోవాలి—"

అని చెప్పి బోయవాడు చచ్చిపడివున్న పావురాన్ని తీసుకొని,

"శెలవండి-పొద్దుగూకుతూంది-పదిపిట్టలన్నా చిక్కలేదు." అని తన పనిమీద తాను పోయాడు. ఆరాత్రి కాచేరువపల్లెలో యెక్కడయినా వుండి, తిరిగి ఉదయమే ప్రయాణమును సాగించవచ్చుననే తలంపుతో విజయకుమారు గుఱ్ఱమెక్కి బయలుదేరాడు. బోయవాడు చెప్పినట్లాగ్రామా మంత ఎక్కువదూరం లేదు. ఒక్కదౌడు గాక పోయినా, రెండు దౌడులలో పోయి ఆగ్రామం చేరుకున్నాడు. పూర్తిగా చీకటిపడలేదు. వెలుగుఛాయలక్కడక్కడా వున్నాయి. గ్రామం చేరిన వెంబడే అతనికొక శిథిలాలయం కనుపించింది. గ్రామంలోకి పోనవసరం లేకుండా, ఆరాత్రికా ఆలయంలోనే యెందుకు గడపకూడదనుకున్నాడు.

గుఱ్ఱమును దిగి, ఆలయప్రాంతమును పరిశీలిస్తుండగా, తమ గ్రామంలో కెవరో కొత్తరాజకుమారు డొచ్చాడనీ, అతన్ని చూడ్డానికీ, అతని గుఱ్ఱన్ని చూడ్డానికీ నలభై యేభై మంది పిల్లలూ పెద్దలూ చుట్టూమూగారు. ఆలయంలోనుంచి పెద్దగడ్డము కలిగిన ఒకవృద్ధుడు యివతలికొచ్చి, విజయకుమారుడికి నమస్కారంచేసి—

"మీదేవూరు బాబూ?"

అని ప్రశ్నించాడు.

"మాది నాగపురము—నేనా రాజకుమారుడను—మార్గవశాత్తూ ఈగ్రామం చేరాలసొచ్చింది. అవకాశముంటే, ఈ రాత్రికిక్కడ బస చేసి, తిరిగి ఉదయమే వెళ్లిపోతాను."

అని విజయకుమారు డనగా—

"అయ్యో బాబూ! అవకాశమేదుకు లేదండీ! నేనీ అమ్మవారి ఆలయానికి పూజారినీ—నా బసకూడా యీ లోపలేవుంది—దయ చెయ్యండి!"

అని ఆ వృద్ధుడు విజయకుమారుణ్ణి వినయవిధేయతలతో ఆహ్వానం చేశాడు. విజయకుమారుడు తన గుఱ్ఱమును బయట ఒక చెట్టుకు కట్టి, తాను వృద్ధునితో లోపలికి వెళ్లాడు.

ఆలయానికి ఆనించివున్న ఒక చిన్న కుటీరంలోకి తీసుకెళ్లాడా వృద్ధుడు విజయకుమారుణ్ణి. నోనపట్టుతో చెయ్యబడిన ఒక మడత మంచమును వాల్చి, విజయకుమారుని దానిపై కూర్చోనియుమించి, అడగకుండానే ఒక గ్లాసులో చిక్కటి మజ్జిగ తీసుకొచ్చి యిచ్చాడు. విజయకుమారుడు దాహం తీసుకుంటూ—

"మీకు అనవసరంగా శ్రమయిచ్చానేమో!" అన్నాడు.

"ఎంతమాట ప్రభూ! మహారాజులు మాయిళ్ళకెందుకొస్తారండి." అని, విజయకుమారుడు తమపల్లె వచ్చినందుకా వృద్ధుడెంతో సంతోషపడ్డాడు.

"నాగపురమంటే నాకు తెలుసునండీ—చాలా గొప్ప పట్నం చిన్నప్పుడెప్పుడో ఉన్నవానికి ఒక్కమారే వెళ్లాను."

"ఈపల్లె-ఎవరి రాజ్యలోదండీ తాతగారూ-మీకు తెల్సునా?"

"అయ్యో! మేముండే రాజ్యం మాకే తెలీకుంటారా? ఎవరిదైనా, యిప్పుడీ రాజులేని రాజ్యమేంది."

"రాజు లేడా?"

"లేడండీ—ఇది తా కరివరం సంస్థానానికి చెందిన రాజ్యం. గజపతి మహారాజు దీనికి ప్రభువు. వృద్ధాప్యంవల్ల ఇప్పటి కయిదు సంవత్సరాల క్రితం ఆ మహారాజు మరణించాడు. వెంటనే యువరాజు శ్రీపతికి పట్టాభిషేకం జరిగింది. గడచిన అయిదు సంవత్సరాలనుంచీ, యువరాజు శ్రీపతి తండ్రిగారికంటె యెక్కువ ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు. బహుబుద్ధిమంతుడు—వివాహం కాలేదు. ఇలా వుంటుండగా, కుండినానగరంలో ఎవరో ఒక రాజకుమార్తె, తానడిగే ఏవో ప్రశ్నలకు జవాబు చెప్పిన రాజకుమారుణ్ణి మాత్రమే వివాహం చేసుకుంటుందనీ—అట్లా తన ప్రశ్నలకు జవాబు చెప్పలేనివారి శిరస్సులు ఖండిస్తుందనీ—ఒక వార్తవచ్చి మా యువరాజుకు చేరింది.

అప్పుడాయన ఆప్రశ్నలకు జవాబు చెప్పి, ఆ రాజకుమార్తెను వివాహం చేసుకొనే కోరికతో బయలుదేరి వెళ్లాడు. తిరిగి రాలేదు. ఆరుమాసా లయింది. రాజోద్యోగులు దరియాప్తులు చెయ్యగా చెయ్యగా, మా యువరాజు ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోయాడనీ—అందువల్ల ఆ రాజకుమార్తె ఖడ్గానికి బలి అయినాడనీ యీమధ్యనే తెలిసినవార్త! ఇదేవిధంగా యింకా యెందరో రాజకుమారులు, ఆవిడ అడిగిన ప్రశ్న లకు జవాబు చెప్పలేక, అకాలమృత్యువు వాతపడ్డారట నాయనా! అందువల్లనే యిప్పుడిది రాజులేని రాజ్యము—మేము ప్రభువులేని ప్రజలము—అయినాము—మంత్రులు తెలాగో పరిపాలనా విధానాన్ని సాగిస్తున్నారు."

అని వృద్ధుడు చెప్పిన దానిని విని విజయకుమారుడు ఒక నిట్టూ ర్పును విడిచి.

"ఆ కుండినపనగర మిక్కడికి ఎంతదూరముంటుందండీ—దాని మార్గ మేమో మీ కేమయినా తెలుసా?" అని అడిగాడు.

"ఎందుకు నాయనా! ను వ్వానగర ప్రాంతానికి మాత్రం పోవద్దు! నీతల్లి కడుపు చల్లగా, నువ్వు చిరకాలం బతుకు."

"లేకండి! అసలా గ్రామ మిక్కడికి ఎంతదూరముందో తెలుసు కోవాలని."

"నూరుయోజనముల దూరమని విన్నాను. కపిలారణ్యమును దాటి—పగడగిరులు దాటి. ఉత్తరదిక్కుగా పోతో ఇరవై యోజన ములు నడిస్తే ఆకుండినపగరముంటుందట—మా యువరాజు భోగట్టా తెలుసుకోడానికి అక్కడకు వెళ్లివచ్చినవారు చెప్పారు.

"మంచిది—తమకు శ్రమకలుగజేశాను. వెళ్లి విశ్రాంతి తీసు కొండి."

"నాకెప్పుడూ విశ్రాంతే—ఏకాకిని—నాకెవ్వరూ లేరు—అమ్మ వారికి సేవచేసుకుంటూ—యిక్కడే వుంటాను."

"ఇది అమ్మవారి ఆలయమా అండి!"

"రాజరాజేశ్వరి—ఏనాడో యిక్కడ వెలిసిందని చెబుతారు. పూర్వ మీగుడి శోభగానే వుండేది-తరిమిలా ఎవరూ దీనిని గురించి యెక్కువ శ్రద్ధ తీసుకోకపోయినందువల్ల, యిలా శిథిలమైవుంది."

"ఒకసారి పోయి చూడొచ్చునా!"

"ఇప్పు డాగర్భగుడి అంధకారబంధురమై వుంటుంది—ఏమీ కనుపించదు—ఉదయమైతే చూడొచ్చు. ప్రయాణ బడలికవల్ల అలసి వుంటావు. ఇక పడుకో నాయనా! రాత్రికి ఏం తీసుకుంటావు. తానా దారుగా ఇంట్లో చెప్పి, భోజనాది ఏర్పాట్లు చేయిస్తున్నా."

"క్షమించండి—నాకీపూట ఏమీ అవసరంలేదు—మజ్జిగ దాహమిచ్చారు. దానితో కడుపునిండిపోయింది."

అని విజయకుమారు డనడంవల్ల, వృద్ధు డతన్ని నిర్బంధం చెయ్యలేకపోయాడు.

"నేనుకూడా యీసాలిట్లోనే పడుకుంటాను. యెప్పు డేది కావల సినా అడుగు నాయనా!"

అని ఆపూజారి విజయకుమారుని అన్నివిధాలా ఆదరించి ఆశ్రయ మిచ్చాడు. కుండినసగరం యెంతదూరమో తెలిసింది—మార్గ మెటో కూడా తెలిసింది. విజయకుమారుని ఆరాత్రి మంచి నిద్దరపట్టింది. తెల్లవారేవరకూ ప్రాణ మెటుపోయిందో యెరగడు. ఉదయమే లేచి, స్నానాదులు నిర్వర్తించుకుని వృద్ధ పూజారితో ఆలయాంతర్భాగానికి వెళ్లాడు. అమ్మవారిని చూడాలని. అది నిలువెత్తున అతి భీకరంగా వున్న దేవీ విగ్రహం. పూజారి చెప్పినట్లది అతి పురాతనమైనదే. విజయకుమా రా దేవి కెదురుగా నిలిచి—

"జగదాంబా! ప్రయత్నారంభంలో నిన్ను దర్శించాను. కరు ణించి నాపనులు నిర్విఘ్నంగా కొనసాగేలా చెయ్యి."

అని తనలో ప్రార్థించుకుని, చేతులెత్తి నమస్కరించాడు. ఆ మీదట ఆశ్రయమిచ్చిన పూజారికి కృతజ్ఞత తెలిపి, అతనిచ్చిన పాలు కొంచం తాగి, యివతలికొచ్చి, తనరాకకై వేచివున్న గుఱ్ఱము నధి రోహించి, ప్రయాణమును సాగించాడు. వృద్ధపూజారి చెప్పిన విష యములు జ్ఞాపకముంచుకొని, కపిలారణ్యా మెక్కడుందో తన కను పించిన వారి నక్కడక్కడ అడిగి తెలుసుకొని, మరికొన్ని పల్లెలు—వనములు—కొండలు దాటి, అలసట కలిగినప్పుడు గుఱ్ఱమును దిగి, చెట్ల నీడల సేదతీర్చుకుంటూ—జలాశయములు తటస్థమయినప్పుడు తాను దప్పిక తీర్చుకుంటూ, గుఱ్ఱమును నీరు త్రాగనిస్తూ, ఐదుదినములు ప్రయాణముచేసి, కపిలారణ్యం చేరుకోగలిగాడు.

అంతటి భయంకారారణ్యమును విజయకుమారు డంతకుముం దెన్నడూ ఎక్కడా చూసివుండలేదు. దానిని దాటడమెలాగో అతనికి తెలియలేదు. ఎటుచూసినా ఆకాశమెత్తు పెరిగిన మహావృక్షములు, వాటికినడుమ, సందులేకుండా అల్లిబిల్లిగా అల్లుకొనివున్న లతలు—తీగెలు. ఎప్పటికప్పుడు అడ్డమొచ్చిన తీగలను, లతలను తెగనరికి—నరికి, తనగుఱ్ఱమునకు మార్గం కల్పించుకుంటూ నడక సాగించాడు. ఆప్రకారం మరి రెండు దినములు ప్రయాణం చేశాడు. అటుపైన అరణ్యమంత దట్టముగాలేదు కాని ముళ్ళ పొదలు, డొంకలు విస్తారముగా వుండడంవల్ల, గుఱ్ఱపు డెక్కలకు ప్రత్యేకించబడిన ఇనప నాడుగులు తగిలించి, చాలదూరం దాటగలిగాడు. మరి మూడురోజులాప్రకారం ప్రయాణంచేసి, బహుకష్టంమీద ఎలాగయితేనేం ఆ కపిలారణ్యమును దాటగలిగాడు.

కపిలారణ్యం దాటినవెంబడే తిరిగి ఒక చిన్నగ్రామం తగిలింది. అయితే ఆ గ్రామమంతా అనాగరికులైన అడవిజాతి మనుషులతో నిండివుంది. వారి రాజకుమారుణ్ణి చూడగానే బెదరి, నాలుగు వైపులకూ పారిపోవడం మొదలుపెట్టారు. అందుచేత ఆగ్రామంలో దిగి బసచెయ్యడానికి గాని, ఎవరితోనయినా మాటలాడడానికి గాని, విజయకుమారుకు అవకాశం కలగలేదు. అశ్వము నాపుచెయ్యకుండానే ఆగ్రామమును దాటిపోయాడు. తరువాత చాలదూరంవరకూ సన్నని కాలిబాట ఒకటుంది. ఆబాటగుండా, ఒకరాత్రి ఒకపగలు- సురక్షితంగా ప్రయాణంచేశాడు. అక్కడికి బహుదూరంలో ఏవో పర్వతశిఖరాలు కనుపించాయి. వృద్ధపూజారి చెప్పిన పగడపు కొండలు అవే అయివుంటాయని, రాజకుమారుడు రెట్టించిన ఉత్సాహంతో గుఱ్ఱమును పరుగెత్తించాడు. పరుగెత్తినకొద్దీ, కొండలు దూరమవుతున్నాయే కాని దారి తరగడంలేదు.

కొండలుదాటితే, కుండినగర మక్కడికి దగ్గరే అన్నఆశతో అతను నిరుత్సాహపడకుండా, మధ్య మధ్య గుఱ్ఱమును హెచ్చరించుకొంటూ, కపిలారణ్యం దాటినతరువాత మరొక అయిదురోజులు ప్రయాణంచేసి, పగడపు కొండలుచేరాడు. అక్కడ కొండజాతులు, యానాదులు నివాసమేర్పరచుకొని వున్నారు. వారు విజయకుమారుని చూచి భయపడకుండా దగ్గరగావచ్చి మాటలాడారు. ఏవయివు

నుంచి వచ్చినా, కుండిననగరం పోదలచివచ్చిన ప్రతిఒక్కరూ, ఆకొండలు దాటిపోవలసిందే తప్ప, వేరుమార్గం లేదు. కొంచమించుమించు అది ఒకరస్తా అనవచ్చు. ఇటువంటి రాజకుమారు లెందరో తమ గుఱ్ఱాలమీందనుంచి పోయి, ఆ పగడపుకొండలు దాటడమును అక్కడి వారనేకసార్లు చూచివున్నారు. అందువల్ల విజయకుమారుడు వారికి కొత్తగా కనుపించలేదు.

"ఈరాత్రి కిక్కడ పడుకోదొరా! అక్కడ చెరువుంది-ఇక్కడ వాగుంది—చారపప్పు—పూచబియ్యము—మేకపాలు యిస్తాం—తాగు."

అని ఆ కొండవారు తమకలవాటయిన మర్యాదతో విజయకుమారుని పరామర్శించారు—వాళ్లు ఉత్త అమాయకులనీ—వాళ్ళ వల్ల తన కేటువంటి అపకారము జరగదనీ. గ్రహించడంవల్ల అలసివున్న గుఱ్ఱంతోపాటు తానుకూడా ఆరాత్రి కక్కడ విశ్రాంతి తీసుకోవచ్చు ననుకున్నాడు. గుఱ్ఱమును మేతకై పచ్చికబయళ్ళపై వొదిలి, తానా కొండ వారుచూపిన చెరువులో బడలికతీరేలాగున స్నానంచేసి, వారు ప్రేమతో యిచ్చిన చారపప్పు—ఊచబియ్యమూ, పాలూ సేవించి—రాత్రిగడిపాడు.

ఉదయమే లేచి కాలకృత్యాలు పూర్తిచేసుకొన్న తరువాత—

"ఈ కొండలకవతల కుండిననగరమింకా యెంతదూరం?"

అని విజయకుమారు డక్కడివారి నడగ్గా—

"కాలినడకనయితే బరువుగా మూడురోజులు ప్రయాణం."

అని వారు బదులుచెప్పారు. గుఱ్ఱమును ఉరుకలెత్తిస్తే, సాయంకాలాని కెలాగయినా కుండిననగరం చేరుకోవచ్చునని అతనూహించి,

"అయితే యీ పగడపు కొండలను దాటడ మేమయినా కష్టమా?" అని తిరిగి వారినడిగాడు.

"ఏమీ కష్టంలేదు, అందరూ వస్తూపోతూనే వుంటారు. ఎగువకొండ, దిగువకొండలుగా ఒకవంద కొండలున్నాయి—గుఱ్ఱపు సవారిగాబట్టి సులువుగానే దాటిపోతావు. కాని ఈ కొండలుదాటి కొంతదూరం పోయావంటే—ఉప్పుటేరు ఒకటుంది. మామూలప్పు

డయితే, మోకాలులోతు నీరున్నా మొక్కవుండదు. అది పొంగిందంటే మాత్రం మాగొప్ప అనర్థం. తాటిచెట్టెత్తున ఉబికి ఊళ్ళకు ఊళ్లే ముంచేస్తుంది. అదిమాత్రం కొంచం కాను."

అని వారు విజయునిమూరుని హెచ్చరించారు. అతను దేవునిపై భారముంచి, పగడపుకొండ నెక్కడం ఆరంభించాడు. అతని గుఱ్ఱం, ముందర కొంచెం జంకింది కాని, పోనుపోను, దానికి కలవాటుపడి క్రమంగా ఎగువకొండలు, దిగువకొండలూ, అన్నిదాటి పగడపు కొండలకు సలాంచేసింది.

ఆమీదట నాలుగయిదామడలు పోయినతరువాత ఉప్పుటేరు వచ్చింది. గుఱ్ఱం వెట్లో దిగబడేవరకూ మోకాలిలోతు నీరు మాత్రమే వుంది. తను బయలుదేరినవేళ మంచిదనుకుంటే నగరపు సరిహద్దులు సమీపించాడని అతను సంతోషపడుతూ, క్రమంగా ఆయేరుమధ్యం వరకూ సురక్షితంగానే వెళ్లాడు. ఇంతలోనే గుఱ్ఱపైనున్న అతని కాళ్లకు నీరు తగిలింది,

"మొకాల్లో యింతనీరు లేదు-ఏరు పొంగుతున్నదేమిటబ్బా." అనుకొని అతను ప్రవాహంవయిపు దృష్టి సారించాడో లేదో—దాటి ప్రమాణాన, భయంకరాటుపోటాలు వేసుకొంటూ, సముద్రతరంగాల్లాగ ఒక్కపెట్టునా యేరుపొంగడమేమిటి. గుఱ్ఱాన్ని అతన్ని ముంచెత్తడమేమిటి-అంతా కనుమూసి తెరచేలోపున అయిపోయింది. అప్పుడిక అతడు చెయ్యగలిగిందేముంది? ప్రాణాలపై ఆశవొదులుకొని, తలిదండ్రులు చెప్పినామాటవినక సాహసం చేసినందుకు పశ్చాత్తాపపడుతూ—ఏమయితే అవుతుందని. గుఱ్ఱపునడుమును, కాళ్లతోనూ, చేతులతోనూ కరచిపట్టుకొని, ధైర్యమును చిక్కబట్టి కూర్చున్నాడు.

ఆ మహాప్రవాహంలో గుఱ్ఱము మొదట మునుగుతూ కిందికిదిగిపోయి, తిరిగి వెంటనే తెప్పరిల్లుకుని, నీటిమీద తేలి—ప్రవాహం ఎటుపోతే అటు ఒడొంగిలినిలిచింది. యెగురుతూ ఈదక గుఱ్ఱం తనకు లొంగి వున్నదని కాబోలు, ప్రవాహం దానిని తనతో యెంతదూరం ఈడ్చుకొని పోయిందో—యెక్కడికి కొట్టుకొనిపోయిందో తెలియదు కాని, యింతలో ఓ మహాభయంకర పెనుకెరటాలు రాను, గుఱ్ఱమును, రౌతునూ కలిసి, ఒక దరికేసి కొట్టడము జరిగింది. తెలివిగలగుఱ్ఱం, తక్షణం, తన గిట్టలను ఇసుకలోగుచ్చి నిలదొక్కుకుంది. అంత వరకు,

గుఱ్ఱపు మూపుమీదనే సొమ్మసిలిపడివున్న జయకుమార్, ఒక పెద్ద గుఱ్ఱపు సకిలింతలో త్రుళ్లిపడి మేలుకున్నాడు. కళ్లువిప్పి చూసేటప్పటికి, తీరము—ఆతీరానికి కొన్ని కోసులదూరంలో యెక్కడో మినుకు మినుకుమని, నక్షత్రాల్లా కనుపించేదీపాలు—కనుపించాయి. అతడు సంతోషమును పట్టలేకపోయాడు. గుఱ్ఱపు మూపుమీదనుంచి గట్టుపై కొక గంతులోయెగిరి, మెల్లిగా గుఱ్ఱమునుకూడా తీరానికి చేర్చాడు. గుడ్డలు పిండుకుని, గుఱ్ఱమును కూడా తుడిచి, సేవనభినందిస్తూ, చేతితో ఒకమారు తట్టాడు.

పొంగినయేరులో కొట్టుకొచ్చిన చేపలు పట్టడాని కప్పుడే కొందరు జాలరులు వలలు పట్టుకొని ఆతీరాన ప్రవేశించారు.

“దీపాలు కనుపించే అదే వూరబ్బా?”

అని విజయకుమారు ఆ జాలరులను ప్రశ్నించగా—

“ఇక్కడింకేవూరుంది? అదే మహాపట్నం, కుండిననగరం-”

అని చెప్పేసి, చేపలెక్కడికిపోతాయో అన్న తొందరలో విస్తారం మాటలాడకుండా, వలల్ని యేట్లోకివిసిరారు.

## ౧౦

తమ నగరానికి అయిదంతలున్న కుండిననగర సౌభాగ్యాన్ని తిలకించి, విజయకుమారు యెంతయినా అబ్బురపడ్డాడు. ఆమేడలు—ఆవిశాలమైన తోటలు—ఆమనోహరమైన ఉద్యానవనాలు, అతి మనోహరంగా వున్నాయి. అన్నిటినీ మించినకోట, దానికి సంబంధించిన ప్రాకారాలు, బురుజులు యెంతసేపు చూసినా తనివితీరడం లేదు తనికి. తానా పట్నంలో ప్రచ్ఛన్నంగావుండి, వివరాలు తెలుసుకోవలసిందే కాని, బంధువయినప్పటికీ, కీర్తికాముని కోటకు పోకూడదనుకున్నాడు. రాజభవనాలన్నింటినీ దాటి, అందందుగల విచిత్రాలను తిలకించుకొంటూ రాజవీధిగుండా నడుస్తున్నాడు. చీకటి పడి యెక్కువసేపు కాలేదు గాబట్టి, పట్నమెక్కడా మాటుమణగలేదు. అటు పురపాలక సంఘాల కరెంటుకక్కూర్తితో కునుకుపాట్లుపడే ఈ నాటి విద్యుద్దీపాలు గాకపోయినప్పటికీ—వాటినిమించి, పట్నాన్ని పట్టపగలు చేస్తున్న బ్రహ్మాండమైన చమురుదీపాలు.

అప్పు డతని కెక్కువ దాహంగా వుండడంవల్ల, ఏం చెయ్యాలా అని ఆలోచించాడు. యెవరిని పలకరించవచ్చో—యెవరిని పలకరించ కూడదో అతనికి తెలియదు. అప్పటికి రాజవీధిని దాటి ఒక చిన్న సామాన్యమైన వీధిగుండా నడుస్తున్నాడు. రాజవీధిలో వున్నంత జన సమర్దం అక్కడ లేకపోయినా, మనుష్యసంచారం అసలు లేకపోలేదు. పట్నంలో నడమాడే చాలామందికి గుఱ్ఱాలున్నాయి. తమ తమ గుఱ్ఱాల మీదనే వస్తూపోతూ, పట్నంలో ఎవరిపనులు వారు చూసు కుంటున్నారు. అందువల్ల విజయకుమారుడూ, అతని అశ్వమునూ చూచి, యెవరూ వింతపొందలేదు.

అప్పు డతను గుఱ్ఱమును దిగి దాని కళ్లెమును మాత్రం పట్టు కుని, కాలినడకనే వెడుతున్నాడు. ఒక అవ్వ బజారువెచ్చాలుకొని పట్టుకెడుతూ, చేతిలోని కొన్ని పొట్లాలు జారి కిందపడిపోవడంవల్ల వాటి నెత్తుకుంటూంది. వయసు మళ్లినది కావడంవల్ల, చూపుసరిగా ఆనక, ఒక పొట్లమును నడివీధిలో వొదిలిపోతూండడమును విజయ కుమారుడు గమనించి,

"అవ్వా! ఒక పొట్లమును దిగవిడిచి పోతున్నావు—చూసుకో లేదా?"

అంటూ ఆపొట్లమును తానే తీసి అవ్వ కందించాడు.

"నికడుపు చల్లగా—నువ్వెంత మంచివాడవు నాయనా! గుడ్డి ముండని చూపానద—ఈ పొట్లంగనక పారేసుకుపోతే, యింటిదగ్గిరినా కూతురుచేత చివాట్లు తగిలేవి—" అన్నదామె పొట్లం అందుకుని.

"అవ్వా! ఈదగ్గిర్లో యెక్కడయినా కొంచం మంచినీళ్లు దొరుకు తాయా?" అని విజయకుమారు డడగ్గా—

"దానికేం భాగ్యం నాయనా! యెక్కడపడితే అక్కడే దొరుకుతాయి. యెవర్నడిగినా యిస్తారు. పాపం! పరదేశీవిలా వున్నావు. మాయిల్లీ చేరువలోనేవుంది-నాతోరా నాయనా! దాహం పుచ్చుకుందువుగాని."

అని వృద్ధురాలు మర్యాదగా అన్నందువల్ల, విజయకుమారుడు దాహం తీర్చుకోడానికి ఆమె వెనువెంటనే వెళ్లాడు. రెండువీధులు దాటించి, మూడోవీధిలో మొదటి యింటి కాలవ్వ విజయకుమా

రను తీసుకెళ్ళింది. అది ఒక సామాన్య కుటుంబీకుల యిల్లులావుంది. విశాలమైనదే గాని, జనమంత యెక్కువగా వున్నట్లు లేదు.

"గుఱ్ఱము నక్కడి స్థంభానికి కట్టి లోపలకురా—కూర్చో"

అని అవ్వ తన సొంత కొడుకుతో మాట్లాడినట్లు మాట్లాడడమును గమనించి విజయకుమారుడు తనలో తానే నవ్వుకొన్నాడు.

ఆమె చెప్పినట్లే గుఱ్ఱాన్ని బయటకట్టి తాను లోపలకెళ్ళాడు. అవ్వ సావిట్లో అతనికో వాలు కుర్చీ వేసి-అతను కూర్చున్న తరువాత-

"ఏమే! రాజనాలూ! ఆ అబ్బాయికి మజ్జిగే కావాలో—మంచినీళ్లే కావాలో—పట్టుకొచ్చి ఇయ్యి."

అని చెప్పి, తాను, తెచ్చిన పొట్లాలను సర్దుకోడానికి లోపలకు వెళ్ళింది అప్పుడొక పడియవస్కురాలు యివతలకొచ్చి—

"ఏమండీ! మజ్జిగ దాహం పుచ్చుకుంటారా?"

అని అడిగింది.

"అసలే జలుబుగావుంది—మంచినీళ్లు చాలమ్మా."

అని విజయకుమారు చెప్పినమీదట, ఆమె ఒక రాగిపాత్ర నిండా మంచినీళ్లు—ఒకగ్లాసు, పట్టుకొచ్చి అతనిముందర పెట్టింది. అతడు దాహం తీసుకుని వెళ్ళిపోబోతు ఉండగా, మొదటి అవ్వ లోపల నుంచి వచ్చి—

"వెడుతున్నవేం నాయనా!"

అని కూతురితో—

"ఈ అబ్బాయి పుణ్యమా అని గాని, లేకపోతే నీచేత చీవాట్లు తగిలేవే—అరరూపాయి పంచదారా, అధ్యాన్నంలో కలిసేది. పాపం—పారేసుకొన్న పొట్లాన్ని చేతికందించాడు." అని చెప్పింది.

"పెద్దవారు కదండీ! పాపం! చూపానలేదు. ఆ వయస్సులో అటువంటి పన్లకు వార్ని పంపడం—"

అని విజయకుమారు అంటుండగా—

"ఇంకెవర్ని పంపాలి బాబూ! ఇంట్లోవున్న దిద్దరం ఆడ కూతుళ్లం—నేను పొయ్యి దగ్గర వంట అఘోరించకపోతే వచ్చే ఆపూటకూలయి రాదు—మొగదిక్కులేని ఈరెండు జీవనాలూ ఎలా గడుస్తాయండీ! అంది అవ్వకూతురు.

ఆ కుటుంబపరిస్థితి విజయకుమారుకు అర్థమైపోయింది. ఆతల్లీ కూతుళ్లు ఇద్దరూ ఏలంటువులనీ—పూటకూళ్ళ వ్యాపారంవల్ల జీవనం చేస్తున్నారని తెలుసుకొన్నాడు.

"మన దేవూరు బాబూ!" అని అవ్వకూతు రడిగింది.

"మాది నాగపురం—"

"పేరయినా వినలేదు. అదెక్కడండీ!"

చాలా దూరానవుంది లెండి. మీకు తెలీదు."

ఈ వూరేదయినా పనిమీద వచ్చారు గాబోలు!"

"నేనాపట్నంలో ఒక రత్నాల వర్తకుడి కొడుకుని-దేశంలో గల పెద్దపెద్ద నగరాలన్నింటినీ చూడాలని సంకల్పంకలిగింది. కొన్ని పట్నాలు చూశాను. మార్గవశాత్తూ ఈపట్నంకూడా చూసి పోదామని వచ్చాను."

"తమ రిక్కడ ఎన్నిదినాలుంటే అన్ని దినాలూ మాయింట్లో బసచెయ్యండి మర్యాదలకుగాని, సౌకర్యాలకుగాని లోపం లేకుండా మీకిష్టమయిన విధంగా వంటకాలు చేసిపెడతాము.

అని అవ్వకూతురు, రాజనాలు చెప్పినప్రకారం, వారింట్లో బస చెయ్యడాని కంగీకరించాడు విజయకుమారు.

"దొడ్లో పెద్ద పాకవుందండీ—అందులో తమ గుఱ్ఱాన్ని కూడా కట్టేసుకోవచ్చు—దానికి మేతవేసి కడిగి, సంరక్షణ చెయ్యడానికి వేరే మనిషివున్నాడు."

అని అవ్వ చెప్పింది. బాగుందనుకొన్నాడు విజయకుమార్ వెంటనే గుఱ్ఱమును దొడ్లోకి తీసుకెళ్లి కట్టేశాడు. ఒక బంగారు నాణెమును తీసి అవ్వకూతురు కిచ్చాడు.

"ప్రస్తుతం దీన్ని తీసుకోండి." అన్నాడు.

"ఇంతకాలంనుంచి పూటకూళ్లు నడుపుతున్నది.

ఎవరిచ్చినా వెండినాణాలే యిచ్చారుగాని, మీలాగయింత విలువగల బంగారున్నాణానిచ్చిన దాతలెవరూ కనుపించలేదండి."

అని ఆమె ఎంతో సంతోషపడింది. తల్లీ కూతుళ్లిద్దరూ అత నిచ్చిన బంగారు నాణాన్ని మళ్ళీమళ్ళీ చూచుకుని మురిసిపోయారు.

"బాబు కెలాచేసి పెడతావో! ఏంచేసిపెడతావో—ఏ దేశం

వెళ్లినా మనభోజనం మరచిపోకూడదు—యెప్పుడు తిన్నాడో యేమో—త్వరగా లేనాయనా! భోజనంచేసి కూర్చుందువు గాని."

అని అవ్వ విజయకుమారుడను హెచ్చరించింది. రాజనాలు కాళ్లు కడుక్కోడానికి నీళ్లు వగైరాలందించింది. విజయకుమారా పూటకూళ్ళయింట్లో రుచ్యములయిన పదార్థలతోను, మీగడతో వున్న గడ్డ పెరుగుతోనూ తృప్తికరంగా భోజనంచేశాడు. రాజధాని వొదిలిన తరువాతఅతని కటువంటి మంచిభోజనం దొరకడం అది మొదటిసారి.

అతను భోజనం పూర్తిచేసేలోపుగా, సావిట్లో ఒకపక్క అమర్చబడింది. అతను దానిమీాద విశ్రాంతిగా పడుకున్నాడు. అవ్వ వచ్చి అతని చేరువలో కిందకూర్చుని—

"పడుకున్నావా నాయనా!" అని అడిగింది.

"నిద్రపోవడం లేదవ్వా—అప్పుడే పట్టదు-నీ భోజనమైందా?"

అని అతనుకూడా ఆమెను సాదరంగా అడిగాడు.

"రాత్రి భోజనం పదేళ్లనుంచీ లేకబ్బాయి! అరగదు. పడుకో బోయే ముందు కసిన్ని పాలుతాగుతా నంతే."

"మొగపిల్లలు లేరా అమ్మా నీకూ?"

"లేరుబాబూ! ఈరాజనా లొక్కతే. చిన్నప్పుడే భర్త పోవడంవల్ల దానికి సంతానమాశ అసలే లేకుండాపోయింది. ఇద్దరం ఈ పూటకూళ్లు పెట్టుకుని కాలక్షేపం చేస్తున్నాం. యెవరయినా పరదేశిలు వొచ్చిననా ఉొస్తారు, లేనినాడు లేదు. ఈదినం నువ్వొక్కడవు తప్ప యెవ్వరూ రాలేదు."

"ఈ పట్నానికి రాజెవరమ్మా! అత నెలాంటివాడు!"

"కీర్తికాముడు—చాలా మంచివాడే—కాని—"

"ఏమి టతనికిలోటు?"

"పెద్ద లోటే వచ్చిందబ్బాయ్! దేశమందరికీ తెలిసినవింత, నీకెందుకు తెలిదూ?"

"తెలీదు—అదేమిటవ్వా?"

"మారాజు, కీర్తికాముడికి ఒక్కత్తే కూతురు. గొప్ప అందగత్తె. ఆమెపేరు చింతామణి. రాజ్యాలూ, రాణివాసాలూ వుంటే మాత్రం అనుభవించడానికి యోగముండొద్దా నాయనా! ఇప్పుడా

రాజకుమారికి పదహారేళ్లుదాటాయి—పెళ్లి కాలేదు—అవుతుందన్న ఆశకూడా యెవరికీ లేదు.''

"అదేం? గొప్ప అందగత్తె అన్నావు—పెళ్లెందుకు కాదు?"

"అందగత్తె అని, మెల్లిగా అంటావా! అప్సరసలు మారాజకుమారి కాలిగోరుకయినా సరిపోరు. వొచ్చి చిక్కేమిటంటే—ఆపిల్లకు బాలమహర్షి అని ఒక గురువుగారున్నారు. ఆ గురువుగారావిడ కేవో కొన్ని ప్రశ్నలు చెప్పారు—వాటికి అర్థం తెలుసుకొని జవాబులు చెప్పగల రాజకుమారుణ్ణే మాత్రమే ఆవిడ వివాహం చేసుకోవాలనీ—చెప్పలేని వారి శిరస్సులామె తన కరవాలంతో ఖండించాలనీ బోధ చేశాడు. రాజకుమారి గురువుగారి యందుండే భక్తివిశ్వాసాలవల్ల, ఆయన చెప్పిన విధంగా చెయ్యడానికి ప్రమాణపట్టింది. ఇప్పటికి ఏణ్ణర్థమయింది. ఒకటి తరువాతగా వెయ్యిమంది రాజకుమారు లిప్పటికి, ప్రశ్నలకు, జవాబు చెప్పలేక ఆవిడచేత ఖండింపబడ్డారు. ఇంతకంటే ఘోరం యింకెక్కడయినా వుంటుందా నాయనా! రాజకుమారి ప్రశ్నలకు జవాబులు చెప్పగలవారూ లేరు—ఆమెకు వివాహమయ్యే యోగమూ లేదు. ఇక తే—''

"ఇదేదో అపూర్వంగానే వుంది. ఆ రాజకుమారి యెవరికయినా కనిపిస్తుందా అవ్వా?"

"త్రినేత్రుడికి కనుపించదు. ఆవిడ ప్రశ్నలకు జవాబు చెబుతానని వెళ్లిన రాజకుమారుడొక్కడికి మాత్రమే కనబడుతుంది. కోటలో కూడా వుండదు—తోటలో శాంతిభవనంలో ఆమె యెప్పుడూ వుంటుంది నరుల కళ్లపడదు."

"ఆ తోటెక్కడ? శాంతిభవనమెక్కడ?"

"కోట కవతలివైపు, సుమారు రెండుమైళ్లదూరంలో ఒక పెద్ద తోటవుంది. ఆ తోటమధ్యంలోనే శాంతిభవనం. రాజకుమారి, ఆమె గురువుగారు, చెలికత్తె—ఆముగ్గురే అక్కడుండేది. అహర్నిశలు, విచ్చుకత్తుల పహారాలు ఆభవనంచుట్టూ గస్తీ తిరుగుతుంటారు, పురుగయినా లోపలచొరడానికి వీల్లేదు. రాజదంపతులు మాత్రం, అప్పుడప్పుడు పోయి కూతుర్ని చూసుకొని వస్తుంటారు. ఇది ఈపట్నానికే కాదు—ఈ దేశానికే ఒకవింత ఒక విడ్డూరమూ అయింది."

అని అవ్వ చెబుతూనేవుంది—విజయకుమారుడు మెదడు తీవ్రంగా పనిచెయ్యడం మొదలు పెట్టింది.

"ఇది, రాజవంశాలకి ఒక పెద్ద అరిష్టం—కాకపోతే, ఇంత మంది రాజకుమారులు ఈపట్నంలో బలికావడ మేమిటి?"

అని, తాను చెబుతున్నదానిని విని, పలకకపోవడంవల్ల, ఆ పరదేశికి నిద్దరొస్తూందేమో అనుకుని, అవ్వ—

"పడుకో నాయనా! ప్రయాణాల్లో అలసివుంటావు."

అని, అక్కడనుంచి లేచి, వంటేం చేస్తున్నదో చూదామని వంటయింట్లోకి పోయింది. కాని విజయకుమారుడుకు నిద్దరపట్టడంలేదు. అతడు మనసు పరిపరివిధాల ఆలోచించడం మొదలుపెట్టింది.

"ఇదేదో మర్మైక్యమయిన తంత్రంలానేవుంది. నేనందరి రాజకుమారులలాగా, తొందరపడి మోసపోకూడదు. నిదానించాలి. ఆ ప్రశ్నలేమిటో—వాటి కర్థమేమిటో తెలుసుకోవడమెలా! ఒకరు తక్కువ వెయ్యిమంది రాజకుమారులు లారాజకుమారి చేతిలో హతులై పోయారు! ఔరా! ఎంత ఘోరము! ఎంత దారుణము! వెయ్యికి తక్కువైన ఆఒక్క శిరస్సునూ పూర్తిచెయ్యడానికి నేనొచ్చానో—లేక ఆచింతామణి గర్వమణిచి, రాజలోకానికి మేలు చెయ్యడానికే వచ్చానో—పరమేశ్వరుడు నానుదుట ఎలా రాశాడో అలా జరుగుతుంది—"

అని విజయకుమారుడు రాత్రంతా ఏమేమో ఆలోచించుకొంటూ నిద్రలేకుండానే గడిపాడు. ఉదయంలేచి కాలకృత్యాలు తీర్చుకొనేప్పటి కాని గుఱ్ఱ కూడా పరిశుభ్రంగా కడిగబడి—దొడ్డిపాకలో మేస్తూంది. అవ్వ చేయించిన యేర్పాట్లకు విజయకుమారుడు చాలా సంతోషించాడు. స్నానాదులు పూర్తిచేసుకుని, ఉచితమయిన దుస్తులు ధరించి, సిద్ధంచెయ్యబడిన గుఱ్ఱంమీద పట్నంలోకి బయలుదేరాడు. సాయంసమయందాకా వీధులన్నీ తిరిగాడు—పట్నమంతా చూశాడు. ఆతరువాత, క్రమంగా కోట నవతలవైపు మార్గంలోకి గుఱ్ఱమును మళ్ళించి శాంతిభవనమును సమీపించాడు. ముఖద్వారం దగ్గరేగాకుండా ఆభవనానికి చుట్టూ ఆయుధపాణులైన సైనికులు కావలివున్నారు. విజయకుమార్ ముఖద్వారం దగ్గర క్షణకాలం నిలుచున్నాడు. ఆ ద్వారానికి పెద్ద వలయాకారంగా వ్రేలగట్టబడివున్న

శిరస్సులు చూచి భరించలేకపోయాడు. తన సోదరుని శిరస్సుకూడా వాటిలో ఒకటై వుంటుందికదా అన్న ఆలోచన మనస్సుకు తట్టినప్పు డతని గుండె నీరయింది—కళ్లు చెమ్మగిల్లాయి. ఇక అక్కడ నిలుచుండ లేక పోయాడు. పోతూపోతూ, అక్కడి ద్వారాని కమర్చబడిన ఒక పలకమీద చెక్కబడ్డ అక్షరాల నీవిధంగా చదివాడు—

—: ప్ర క ట న :—

ఈ భవనంలో వుండే రాజకుమారి, అపూర్వచింతామణిని వివాహమాడగోరి వచ్చినవారు ఈ పలకదగ్గరున్న మీట నొక్క వలెను—తత్ఫలితంగా, లోపల గంట మోగుతుంది—వెంటనే, వచ్చిన వారు, లోపలకు గొనిపోబడతారు. చింతామణి అడిగే ప్రశ్నలను శ్రద్ధగా విని, వాటికి బదులు జవాబులు చెప్పవలసివుంది—ఆజవాబులు సరియైనవయితే, రాజకుమార్తె ఆయువకుని వివాహమాడుతుంది. అతడే యీ మగధసామ్రాజ్య పట్టభద్రుడుకూడా కాగలడు! ప్రశ్న లకు జవాబులు చెప్పలేక, అపజయమును పొందినవాని శిరస్సు రాజ కుమార్తెచే ఖండించబడి, ముఖద్వారానికి వ్రేలకట్టబడుతుంది.

ఇట్లు

సర్వాధికారి, రాజగురువు.

ప్రకటన చదివి, తలపంకించి, వెంటనే గుఱ్ఱమును మళ్లించాడు విజయకుమారు. ఆవనసౌందర్యమును తిలకిస్తూ ప్రహరీవారనే గుఱ్ఱ మును మెల్లిగా నడిపిస్తున్నాడు. మహోన్నతంగా పెరిగి, అతి రమణీ యంగా వున్న ఒక పనసచెట్టు అతని దృష్టి నాకర్షించింది. ఏకొమ్మను చూసినా బ్రహ్మాండమైన పళ్లు—నింగిగా చూస్తుండగా, ఆకొమ్మల సందుల్లోంచి, ఆకుల మెడాల్లోంచి, అతని కొక సుందరీ ముఖపద్మం ఇట్టె తళుక్కున మెరిసి, మెఱుపులా మాయమైంది. అది నిజంగా సుందరీముఖపద్మమో—లేక అప్పటి సంధ్యారాగపు అరుణకాంతో—ఆకాశపుటంచుల అందాల వెలుగో—అమరలోకపు అప్సరస భామ యొక్క నీడో—అతడు నిర్ణయించేసుకోలేకపోయాడు. అయితే ఆ గాజుల గలగల—హారాల ఘలఘల యేమిటి? అంత నాప్రశాంత సాయం సమయాన స్పష్టంగా విన్నదే! తిరిగి తిరిగి ఆకులసందుల్లోంచి, కొమ్మల మాటుల్లోంచి నిక్కినిక్కి చూశాడు. ఆసాక్షాత్కారం తిరిగి కాలేదు.

అది ఆశాంతిభవనపు మేడ ఉపరిభాగమని మాత్రం అతనికి తెలిసింది. ఇంకా నిలుచుంటే, కాపలావారి కనుమాన కారణమవుతుందని, మెల్లిగా ముందుకు సాగిపోయాడు.

ప్రహరీ నంతటినీదాటి, తోట వెనుకతట్టుకొచ్చాడు. అక్కడి సరస్సుచూస్తే ముచ్చటగావుంది. తామరలు, పల్లకలువలతో నిండి—తేటనీటిలో అతి నిర్మలంగావుంది. శుద్ధోదకాన్ని కొంచంతాగి, సేద తీర్చుకుందామని, కిందికిదిగి. గుఱ్ఱమునక్కడి ఓ చెట్టు కొమ్మకు కట్టి—తానా సరస్సులో దిగాడు. ఆచల్లటినీళ్ళతో కాళ్లూచేతులు, ముఖమూ కడుక్కొని, నాలుగుదోసిళ్ళ నీళ్లుతాగి—ఏమనుష్య సంచారం కాని, ఏ అలజడికాని లేక. అతి ప్రశాంతంగా వున్న ఆసరోవరతీరాన, ఉస్సురని కూర్చుంటే, ఎంతో హాయిగా వుందతనికి. నిర్మలాకాశం వేపు—మిణుకు మిణుకుమని వెలిగే నక్షత్రకోట్లవయిపు చూస్తూ, అగాధంగా, అయోమయంగా వున్న తన భవిష్యత్తును గురించి దీర్ఘంగా ఆలోచించడం మొదలుపెట్టాడు. ఆలోచనా పరంపరల్లో ఎంతసేపు గడచిందో అతను గమనించలేదు. ఉన్నట్టుండి అతనికి వెనకతట్టున హఠాత్తుగా అయిన గాజులచప్పుడుకి తను త్రుళ్లిపడ్డాడు. ఇట్టె వెనుదిరిగి చూశాడు. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. విద్యుల్లతో—ఆకాశపుటంచుల అందమో—అప్సరస భామనిదో—అని తాననుకుంటూ పనసచెట్టు ఆకుల సందుల్లోంచి చూసి భ్రమసిన ముఖం—అదే! ఆముఖమే—అతనికి నోటమాటరాలేదు.

"ఖంగారు పడుతున్నావనుకుంటా."

అది, ఆతీయని కంఠంలోంచి వచ్చిన మధురధ్వని.

"భయంలేకుండా—ఒంటరిగా కూచున్నావే! ఎవరికోసం."

అని మరోప్రశ్న. విజయకుమారు దానికిగూడా జవాబు చెప్పలేదు.

"నీసంగతంతా కనిపెడుతున్నా."

అని ఆమె కిలకిల నవ్వింది. ఆనవ్వులో పరాభవమో—ప్రతీకారమో—ఏముందో అతనికి తెలియలేదు.

"నువ్వెవరు?"

"అలా అడుగు—అంతా చెప్తా. కాని నువ్వుగూడా నీసంగతంతా చెప్పాలి. నువ్వబద్ధం చెప్పకూడదు—నేనబద్ధం చెప్పను—ఇదే మనిద్దరికీ నిర్ణయం—సరేనా?"

ఆమె తనతో అంత చనువుగా మాట్లాడుతుందేమో అనుకున్నాడు విజయకుమారుడు. ఏమయినా ఆమెవల్ల కొన్ని వివరాలు తెలుసుకోవచ్చు ననుకున్నాడు.

"సరే—ముందు నీసంగతేమిటో చెప్పు."

"అపూర్వచింతామణి పేరు విన్నావా?"

"ఆ రాజకుమారివి నువ్వేనా?—"

"కాదు లే—తొందరపడకు—నేనావిడ చెలికత్తెని—నాపేరు శోభాదేవి."

ఆమాట వినగానే అతని హృదయం కొంచం పదిలపడింది.

"ఇంతలో గంటక్రితం—కొంచం తీరిక కావడంవల్ల, చల్లగాలి కోసం, శాంతిభవనో పరిభాగాన, డాబామీదికొచ్చాను. అప్పుడు నువ్వు అశ్వారోహణం చేస్తూ, రాజవీధిగుండా మా శాంతిభవనం వైపొస్తుండడము గమనించాను. నీముఖం చూస్తానికెంతో ముచ్చటగావుంది. నీరూపానికి ముగ్ధురాల్నయ్యాను. నువ్వే శాంతిభవనం వైపే రావడంవల్ల, మా రాజకుమారి ప్రశ్నలకు జవాబు చెప్పాలని వొస్తున్నావేమో—అనవసరంగా ఆవిడ ఖడ్గానికి బలవుతావని చాలా బాధపడ్డాను. నాభయానికి తగ్గట్టే, నువ్వు ముఖద్వారం దగ్గిరకొచ్చావు—పలకమీద వ్రాయబడ్డ ప్రకటనకూడా చదివావు—'ఈనవమన్మథమూర్తి రక్షింపబడుగాక!' అని నేను మనసులో భగవంతుణ్ణి ప్రార్థించుకున్నాను—నువ్వు వెంటనే గుఱ్ఱమెక్కి తిరుగుముఖంపట్టావు—నా ఆత్మశక్తికి నాలో నేను చాలా సంతోషపడ్డాను. భగవంతుడు నాప్రార్థన ఆలకించాడని మురిశాను. మేడపైనుంచి నువ్వెలా వెడతావా అని కనిపెడుతూనేవున్నా—అప్పుడే నువ్వు నన్ను చూశావు—నీకళ్లు నాకళ్లు ఒకసారి కలుసుకున్నాయ్—వెంటనే కిందదిగిపోయా—శాంతిభవనంలోంచి, యీ సరస్సు దగ్గిరకొక సొరంగ మార్గముంది—దానిగుండా రహస్యంగా వచ్చా—నిన్ను కలుసుకున్న—అబద్ధం లేకుండా, యిదీ నాసంగతి—"

"ఇంతసేపట్నుంచీ—నిలుచునే వున్నావు పాపం! కూర్చో."

"ఇప్పటికయినా దయకలిగింది—సంతోషం—"

అని ఆమె అతనికి కొంచందూరంలో కూర్చుంది.

"మరి నీసంగతేమిటి? మీదేవూరు! అంతా చెప్పాలి."

"చెబితే యేమిటీ లాభం?"

"ఏం లాభం కావాలి? నేను నీదాన్ని—నావల్ల ఏమవుతే అది చేస్తాను."

"నిజంగానా?"

"నేను అబద్ధమాణ్ణని ముందే చెప్పాగా!"

"అయితే సరే-మాది నాగపురం. దానికి నేను యువరాజును మాతండ్రిగారి పేరు, ఛత్రపాలుడు, మాతల్లిగారి పేరు రమాదేవి. నా పేరు విజయునరాజు. నా పట్నంనుంచి యిక్కడికి అశ్వారోహణం చేసి వస్తే సుమారు పదిహేనురోజులు పట్టింది. మీ చింతామణి అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పాలన్న ప్రయత్నంమీద నేనిక్కడి కొచ్చిన మాట నిజం."

"ఇప్పుడుకూడా, నన్నుచూసిం తరవాతకూడా అదే వుద్దేశ ముందా?"

"ఉంది."

ఆమాట కామె ఒక నిట్టూర్పును విడిచి, మనసులో మితిలేని బాధను పొందడం మొదలుపెట్టింది.

"నాచక్కదనం నీకు నచ్చలేదా?"

"ఎందుకు నచ్చలేదూ?"

"నీదృష్టిలో ప్రపంచంలో చింతామణి నాకంటే ఎక్కువ సౌంద ర్యవతి అనా?"

"చింతామణే కాదు, నిన్ను మించిన అపురూప సౌంద్యవతులు ఏలోకంలోనూ వుండరని నాకు తెలుసు."

"అయితే ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పాలని ఆరాటపడతా వెందుకు? అనవసరంగా చచ్చిపోడానికా? నువ్వు నన్ను ప్రేమించక పోయినా సరే—నన్ను పెళ్లి చేసుకోకపోయినా మంచిదే కాని, నీ దివ్యమోహనరూపం సృష్టికి మచ్చగా యీభూమిమీద చిరకాలం వుండాలి—ఇదీ నాకోరిక. ఇప్పటికి, వెయ్యిమందికి తక్కువగా ఆ ఘోరయజ్ఞంలో ఆహుతి అయిపోయారు. నీకు తెలిసేవుంటుంది."

"తెలుసు.—చింతామణి సౌందర్యసంపదలకు మోజుపడికాదు—ఆమెను వివాహం చేసుకుందామని, తీసుకుపోవాలన్న వ్యామోహంవల్లకాదు. నా సోదరు డొకడు నువ్వు చెప్పినట్లే—ఆఘోరయజ్ఞలోపడి ఆహుతి

అయిపోయాడు. అదేవిధంగా యింకా యెందరో కావడంవల్ల—రాచవంశాలు నశించిపోయే స్థితియేర్పడింది—ఈ హింసాకాండ సహించరాంది. ఈఘోరాన్ని అరికట్టి, రాజలోకానికి మేలుచెయ్యాలని నాసంకల్పం—''

''నీవల్ల కాకపోతే—?''

''భగవన్నిర్ణయం ఎలావుంటే అలా జరుగుతుంది.''

''నామీద నీకెటువంటి అభిప్రాయముంది?''

''నాకు నీపై ఎటువంటి భావముందో—నీమీదకూడా నాకంతే—''

''నాకు—నిన్ను పెళ్ళిచేసుకుని, భూతలస్వర్గం అనుభవించాలని వుంది.''

''సరి—నాకూ అలాగేవుంది.''

''నిజమా?''

''అబద్ధాలాడకూడదనుకున్నంగా.''

''అయితే ముందర నన్ను పెళ్ళిచేసుకుని—ఆతరవాత నువ్వు సాధించాలనుకున్న ఘనకార్యం సాధించకూడదూ?''

''అలాగే చేయొచ్చు. కాని అలోపుగా నామీద నీకెంత ప్రేమ వుందో—నాకోసం నువ్వెంత త్యాగం చెయ్యగలవో—తెల్సుకోవాలి.''

''నీకోసం—కావాలంటే, నవ్వుతూ నవ్వుతూ నాప్రాణాలయినా ధారపోస్తా—''

''అంతవరకక్కర్లేదుకాని—మా చింతామణి అడిగే ప్రశ్నలేమిటో చెప్పు—

''ఎక్కడా చెప్పవుకదూ?''

''నన్ననుమానిస్తున్నావా—? మనయిద్దరమధ్యా జరిగిన సంగతులు బ్రహ్మకయినా తెలియనివ్వను.''

శోభ నాలుగువైపులా ఒకసారి పరికించి చూచింది. చుట్టు ప్రక్కల ఎవ్వరూ లేరని తెలుసుకొని తృప్తిపడింది. విజయకుమారుడు మరి కొంచం దగ్గిరిగా జరిగి—

''నన్ను పెళ్ళిచేసుకుంటానని ప్రమాణపూర్వకంగా చెబుతున్నావు కదూ?'' అని అడిగింది.

"ఆహా! ప్రమాణపూర్వకంగానే చెబుతున్నాను. నేను నిన్ను తప్ప—ఇంకెవ్వరినీ పెళ్ళిచేసుకోను."

అని అతను చెప్పినమీదట ఆమె మనస్సు పూర్తిగా తృప్తి పడింది.

"మా రాజకుమారికి శాలమహర్షి అని ఒక గురువున్నాడు. ఆయన ఆమెకు అయిదు ప్రశ్నలు చెప్పాడు. అవేమిటో నేను నీకు వివరిస్తున్నా—విను—

1. ప్రతిజ్ఞ నెరవేరేతే కాని, పెళ్ళి చేసుకోనని భీష్మించుకున్న ఆ రాజకుమారుడెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అతనింకా జీవించి వున్నాడా?

2. పురుషుడైవుండీన్నీ స్త్రీరూపంతో మహర్షిని మోసంచేసి, అతనిదగ్గరవుండే మంత్రశాస్త్రము నపహరించి, అతనినికొట్టి తరిమివేసిన ఆయువకుడెవరు? అతనింకా బ్రతికివున్నాడా? మృతుడైనాడా?

3. తపోధనమహారాజు ద్వితీయభార్య అయిన రూపసుందరి గతియేమయినది? ఆ తపోధన మహారాజింకా బ్రతికివున్నాడా?

4. ప్రేమించిన వానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ స్త్రీ అయివుండీన్నీ పురుషవేషమును ధరించి, మహర్షి చే కామించబడిన ఆయిరువురు కాంతలనూ అపహరించి, మహర్షిని ఖండింపబూనిన ఆధీరురాలెవరు? ఇప్పుడామె జీవించివున్నదా? మృతి నొందినదా?

5. శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన ఆ భక్తురాలిని మహర్షి కామించిన కారణంవల్ల, ఆయిరువురినీ కారాగృహమున బంధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే తత్తాత్రేయ మహారాజింకా బ్రతికివున్నాడా? భక్తురాలెట్లున్నది?

ప్రశ్నలను వివరించిన తరువాత శోభ—

"విన్నావుకదా—ఇవే ప్రశ్నలు. వీటికి జవాబు చెప్పగలవాడు రాజకుమారిని వివాహమాడ్తాడు—చెప్పచేతగాని వాడు ఆమె ఖడ్గానికి శిరస్సు బలిఇయ్యాడు."

అని చెబుతూనే వుంది కాని, విజయకుమారు మనస్సు ఆప్రశ్నలను గురించే ఆలోచిస్తూంది.

"నిజంగా యివి కష్టమైన ప్రశ్నలే. ఇవి ఒక శాస్త్రానికి గాని, నీతికిగాని సంబంధించినవి కావే!

"కనుక ఒక్కరూ జవాబు చెప్పలేక పోవడం."

"నువ్వు చెప్పగలవా శోభా!"

"చెప్పలేను."

"ప్రశ్నలు చెప్పగలదానికి జవాబులు చెప్పలేవా?"

"నాకే కాదు—మా రాజకుమారికి కూడా వాటి అర్థం తెలీదు."

"ఎవరు నమ్ముతారు?"

"నేను నీదగ్గర అబద్ధం చెప్పను విజయా! చింతామణి నా దగ్గర ఒక్క విషయంకూడా దాచదు మా యిద్దరికీ శరీరాలు వేరు కాని, ప్రాణాలు ఒక్కటే—"

"కావచ్చు—ఏమైనాసరే—ప్రయత్నించి, నువ్వే నాకు వాటి అర్థంకూడా చెప్పాలి—ఆ ప్రశ్నలకు జవాబు తెలుసుకుంటే కాని పెళ్లి చేసుకోనని ప్రతిజ్ఞ పట్టాను."

"అబ్బా! గొప్ప చిక్కు తెచ్చి పెట్టావు జయా!"

"నాకోసం, నవ్వుతూ నవ్వుతూ ప్రాణాలుకూడా యిస్తానంటివే!"

"తప్పక యిస్తాను."

"నేను చెప్పిన పని అంతకంటే కష్టమైంది కాదు."

"సాయశక్తులా ప్రయత్నం చేస్తాను—ఒక వేళ వల్లగాకపోతే నా ప్రేమను శంకించకూడదు సుమా విజయా!"

"శంకించను."

"చాలాసేపయింది—నా రాక ఎవరికైనా తెలుస్తే ప్రమాదం—వెళ్ళిపోతాను రేపు సంధ్యా యిదే వేళకు యిక్కడ కలుసుకుందాము—"

అని అతను ఏమర్గావున్నప్పుడు తటాలున అతని చేతిని తన పెదవుల కందించుకుని, ముద్దాడి, ఒక్క గంతులో తుర్రున పారిపోయింది, తోట ప్రహరీ కావలించివున్న చిన్న ద్వారమును మెల్లిగా తెరచుకుని, లోపల ప్రవేశించి, తిరిగి ద్వారమును బంధించింది.

ప్రయత్నంలో తొలివిడతగా అంత గొప్ప అభివృద్ధి కనుపించినందుకు, విజయకుమారుడు ఎంతయినా సంతోషపడ్డాడు. శోభ

యొక్క పరిచయం, తనభవిష్యత్త్వయిసోపానానికి మొదటిమెట్టనుకున్నాడు. వెంటనే అతనుకూడా లేచి గుఱ్ఱమును పప్పుకుని, దానిపై బసకుపోవాలని, పట్టణాభిముఖంగా బయలుదేరాడు.



మర్నాటి ఉదయం నుంచీ శోభ, యెందుచేతనో మామూలుగా లేదు. ఏపనిలోనూ హెచ్చంక లేకుండా ఖిన్నురాలై కూర్చునివుండడం గమనించి, చింతామణి ఏమీ అర్థంచేసుకోలేక పోయింది. ఎప్పుడు చూసినా, ఛలాకీగా, కిలకిల నవ్వుతూ కేరింతాలు కొడుతూ వుండే పిల్ల, ఆవేళెందుకో చప్పబడి, మన్నుతిన్న పాములావుంటే చూసి సహించుకోలేక పోయింది చింతామణి. మెల్లిగా దాపులోచేరి—

"ఎందుకక్కా ఈవేళ ప్రొద్దుట్నుంచీ అలావున్నావే! అని అడిగింది.

"నే నెలావుంటే నీకేం?"

"నీకేమా? నీ ధోరణేమిటో కొత్తగావుంది శోభా యీవేళ! ఇటువంటిమాట యెప్పుడయినా అన్నావా? ఇంతకాలమైంది—ఇద్దరం ఒకతల్లి బిడ్డల్లా వుంటున్నామే గాని మారుభావం ఎన్నడయినా వుందా?"

"ఇంతకాలమూ అంతే—"

"ఇప్పుడు తేడా ఏమొచ్చింది?"

"ఎందుకులే—అనవసరంగా చెప్పడం—నోరు ఖాళీ కావడం—"

"అలాకాదు—అదేమిటో సరిగా చెప్పు—నువ్విలావుంటే నేను సహించలేను."

"ఇదివరకు ఏ రహస్యమయినా నాదగ్గర దాచేదానవు కాదు. నీమనసూ నామనసూ ఒక్కటి—తేడా ఏమీ వుండేది కాదు."

"ఇప్పుడూ అంతే—"

"ఎందుకొచ్చిన మాటలు. గురువుగారు నీకు చెప్పిన ఆప్రశ్నలు-జవాబులు—నా కెన్నడయినా చెప్పావూ?"

"ప్రశ్నలు నీ ఎదురుగానే చెప్పారు పైగా ఎన్నోవందల సార్లు, వచ్చిన వెంటనే ప్రతిరాజకుమారుణ్ణి బహిరంగంగా అడుగుతు న్నాను. ప్రశ్నలు నీకు తెలిసినవేగా?"

"ప్రశ్నలు తెలుస్తే అయిపోయిందా యేం? జవాబులు?."

"జవాబులు నాకుమాత్రం తెలుసా?"

"ఆఁ! ఇంత కాలనుంచి తెలుసుకోకుండా వుంటావ్! నామీద నమ్మకంలేక, నేనవరితో అన్నా చెబుతానని భయపడి—వాటిని నాకు చెప్పడం మానేశావు. నామీద నీకింత నమ్మకం లేకపోయి నందుకు బాధపడుతున్నగాని, ఆ ప్రశ్నలు, జవాబులు, నేను నూరుకు తాగుతానా? నాకక్కర్లేదు!"

"అయ్యో! చెబితే నమ్మవుకదా! నిజంగా వాటి జవాబులు నాకు తెలియవమ్మా! దేవుడితోడు! ఎప్పటికప్పుడు గురువుగారే, రాజకుమారులు చెప్పే జవాబులు సరయినవప్పునో కాదో నిర్ణయించి, చిరుగంట మోగిస్తున్నారు—నువ్వు చూడ్డ లేదూ?"

"నిజమే అనుకుందాం—ఆ జవాబులు తెలుసుకోవాలని నీ కెప్పుడూ కుతూహలం కలగలేదా?"

"కలుగుతుంది."

"గురువుగారి నడుగు కడిగి తెలుసుకోవూ?"

"వారు చెప్పరని."

"నువ్వు గట్టిగా అడుగుతే యెందుకు చెప్పరు, ఏ రాజకుమా రుడూ కుతూహలంగా వుంది."

అయితే నీ కోసమయినా అడిగి తెలుసుకుంటాలే వమ్మా—నువ్వు ముందర లేచి నలదువ్వుకో—ఎప్పట్లాగా ఖులాసాగా కిరిం తాలు కొడుతూవుండు—"

"ఆ పశ్నలకు జవాబులు తెలుసుకున్న తరువాతగాని, నామీద నీకు నిజమయిన ప్రేమవున్నట్లు అనుకోను—నామీద నీకు ప్రేమలేనప్పుడు, నాకు ఖులాసా ఎక్కడనుంచి వొస్తుందేమిటి?"

"సరే అయితే—ఇప్పుడే పోయి గురువుగారి నడుగుతానుండు—వారేమంటారో—వారి కసలే ముక్కోప —సరే—ఏమయితే అవుతుంది—"

అని ఆనాడు చింతామణి శోభ ను గురించి, కేవలం ఆమెను సంతోషపెట్టడం కోసం గురువుగారి దగ్గరకు వెళ్ళి, దగ్గరికి పోయింది.

"ఏం వమ్మా! ఏం కావాలి?"

అని ఆయన చాలా దయగా అడిగారు. ఆనాడెందుచేతనో గురువుగారు చాలా ప్రశాంతంగా వున్నారు. అవకాశమును పోనియ్యకుండా చింతామణి—

"తమరు నాకు అయిదు ప్రశ్నలు చెప్పారు. ఏ రాజకుమారుడూ అర్థంచేసుకోలేని ఆ ప్రశ్నల భావమేమిటో నాకు తెసులుకోవాలని చాలా కాలం నుంచి కుతూహలంగావుంది. నేను తెలుసుకున్నందువల్ల నష్టమేమీ లేదు కదా!"

"ఆఁ! లేకేమి—అయినా, అనవసరమని చెప్పలేను—తల క్రిందులుగా తపస్సుచేస్తూ, బాలమహర్షిని తిలకించి, పంచాక్షరీ మంత్రమును ముందర జతపర్చుకొన్నవారికీ, పంచమహానగరములు గోచరిస్తాయి—ఆ పంచనగరములకు సంబంధించినవే నీ అయిదు ప్రశ్నలకు జవాబులు—ఇంక నన్నేమీ అడగొద్దు—వెళ్ళిపో—"

అని ఆయన కఠినంగా చెప్పినందువల్ల, చింతామణి బదులాడకుండా ఆతావును వొదిలి వెళ్ళిపోయింది. తనరాకకోసం ఆదుర్దాగా వేచివున్న శోభను కలుసుకుంది—

"ఏమయిందీ?"

అని శోభ అడిగినదానికి చింతామణి చిరునవ్వు ముఖంతో—

"గురువుగారు చెప్పదలచినంత వరకూ చెప్పారు—ఆపైన నీ బుద్ధికుశలతను నుపయోగించాలి."

అని చింతామణి, గురువుగారు చెప్పిన వాక్యాలను, అక్షరం పొరబాటు లేకుండా శోభకు చెప్పింది. శోభ ఆవాక్యాలను నాలుగయిదుసార్లు వల్లించింది. కాని ఎంత బుద్ధిలు కొట్టుకున్నా ఆమెకేమీ అర్థంకాలేదు. తలక్రిందులుగా తపస్సు చెయ్యాలా? బాలమహర్షిని తిలకించాలా?" పంచాక్షరీమంత్రమును ముందర జతపర్చుకోవాలా? అప్పుడు పంచ మహానగరాలు గోచరిస్తాయా? ఆ అయిదు నగరాలకు సంబంధించినవే, ఆ అయిదు ప్రశ్నలకు జవాబులా? ఇవే గడ్డు సమస్యలబ్బా. ప్రశ్నలెంత కఠినంగా వున్నవో—ఈ జవాబులు వాటికిమించి వున్నావే!"

అందుకు నేనేం చెయ్యాలనమ్మా—గురువుగారు అంతవరకే చెప్పి, ఆపైన యింకేమీ అడగొద్దని కఠినంగా ఆజ్ఞాపించారు. ఇప్పుడు చెప్పు—నీమీద నాకు ప్రేమువుందా? లేదా?

అని చింతామణి అడిగిన వెంటనే ఆమెను బిగ్గా కౌగలించుకుని—ముద్దాడి—

"వుంది—వుంది—ముమ్మాటికి నామీద నీకు నిజమైన ప్రేమ వుంది—నా బుర్ర చిన్నది కావడంవల్ల, గురువుగారు చెప్పిందాన్ని అర్థం చేసుకోలేకపోయాను. అందుకు నువ్వేం చేస్తావులే!"

"అమ్మయ్య! బతికాను. ఇహ లేచి, తలనువ్వుకుని—మంచి బట్టలు కట్టుకుని ముస్తాబై — నాకళ్ళకి సంతోషంగా కనుపించాలి."

"ఓ! తప్పకుండా, అయిదు నిమిషాల్లో."

అని శోభ లేచి, చరచరపోయి, చింతామణి చెప్పిన విధంగా, రోజూకంటే ఘనంగా ముస్తాబై వచ్చి, ఆమెకు సంతోషం కలిగించింది.

"నువ్విప్పుడు రోజూకంటే యెక్కువ బావున్నావక్కా—ఇందాకా నువ్వు నన్ను ముద్దు పెట్టుకొన్నావు—ఇప్పుడు నేను—"

అంటూ చింతామణి ఈసారి శోభను కౌగలించి—రెండు చెంపలమీద రెండు ముద్దులు పెట్టుకుంది.

"ఆఁ! ఆగాగు—పెళ్ళంతా ముందరేవుంది—ముద్దులన్నీ ముందరే ఖర్చు చేసేస్తే యెల్లా?"

"హుఁ! పెళ్లి—ఇంకా యేం పెళ్లి శోభా! గురువుగారు చెప్పినా ఆ జవాబులు మనకర్థం కాలేదు—అటువంటి సందర్భంలో ఇక ఏ రాజకుమారుడికి సాధ్యమవుతాయీ జవాబులు?" నాజన్మ యిహానింతే—నా కర్థమైపోయింది. ఒకరు తక్కువగా వెయ్యిమంది రాజకుమారుల్ని ఈ పాపిష్టి చేతుల్తో ఖండించాను—నాకిక ముక్తిలేదు. యౌవనసౌందర్యాలు వ్యర్థం చేసుకుని ఆజన్మాంతం యిలా పుట్టు కన్యనై బ్రతకవలసిందే—వడ్లతోపాటు తట్టకూడా యెండుతున్నదనే సామెతగా, నాతోపాటు నీజీవితంకూడా యెందుకు వ్యర్థం చేసుకుంటావు శోభా! నాన్నగారీసారి వచ్చినప్పుడు చెబుతాను, ఎవరైనా మంచివరుణ్ణి చూడమని. పెళ్ళిచేసుకుని నువ్వయినా హాయిగా వుండు."

"ఒద్దుద్దులే—నీకెందుకంత శ్రమ—"

"ఎవరికీ శ్రమలేకుండా నీ పెళ్లి నువ్వే చేసుకొంటావా యేం కొంపతీసి."

"ఆఆ! వరుడు సిద్ధంగా వున్నాడు నన్ను పెళ్ళిచేసుకోడానికి- నేను అంతకంటే సిద్ధంగా వున్నాను ఆ వరుణ్ణి పెళ్ళిచేసుకోడానికి."

"వేళాకోళమాడకు శోభా! నిజం చెబుతున్నా!"

"నేనూ నిజమే చెబుతున్నా నమ్మా!"

"అబ్బా! పోవే! నీతో నేమాట్లాడలేను."

"లేకపోతే యేమిటమ్మా! అయితే యిద్దరకూ పెళ్ళి కావాలి- లేకపోతే యిద్దరమూ కన్యలగానే వుండిపోవాలి."

"పోనీ—మనిద్దరం కలిసి పెళ్ళిచేసుకుందామా?"

అని చింతామణి ఫకాలున నవ్వింది.

"అలా చేసుకుందా మనుకున్నా—ఆ ప్రశ్నలకు జవాబులన్నా నాకు పూర్తిగా చెప్పావూ? నీ ప్రశ్నలకు జవాబు చెప్పకుండా నిన్నలాగా నేను పెళ్ళిచేసుకునేది?"

"ఓహో! అందువల్లనే గాబోలు, గురువుగారు నాకే జవాబుల్ని సగమే చెప్పి వూరుకున్నారు."

"ఆసగమయినా అర్థమయ్యేటట్లు చెప్పారా?"

"చెప్పకపోవడంతో ఏదో గూఢమైనభావం ఇమడి వుంటుంది శోభా! గురువుగారు మహామేధావులు—మహిమలు గలవారు."

"అవునవును—నే నీపూట అలా తోటలోకిపోయి, కొంచం సేపు తిరిగిరానా అక్కా?"

"వెళ్లు—నీకు నిర్బంధమేముందీ? ఇంతసేపూ హెచ్చరిక లేకుండా ఇక్కడే కూర్చుండి పోయావు. కొంచంసేపు అటూ ఇటూ తిరుగుతే కులాసాగా వుంటుంది."

"నువ్వూకూడా వస్తావా?"

"నన్నెవరయినా చూస్తారు—గురువుగారికి తెలుస్తుంది. మాట వస్తుంది. నువ్వుపోయి, హాయిగా కొంచంసేపు తిరిగిరా."

అని చింతామణి చెప్పేటప్పటికి శోభ అక్కడి కిటికీగుండా, వెలుపలకు చూసింది. సూర్యభగవానుడు తన తీవ్రతను గోలుపోయి- ప్రశాంతుడు కావడం గమనించింది. ఇక ఆమె కాలక్కడ నిలవలేదు.

"అయితే వస్తానక్కా!"

అంటూ లేచివెళ్ళి మేడ పైడాబాయెక్కింది. నాలుగువయిపులా ఆదుర్దాగా తిలకించింది. భవనానికి వెనుకతట్టునున్న సరస్సువైపు కూడా పరిశీలనగా చూచింది. ఎవరూ కనుపించక పోవడం వల్ల—మధ్య మధ్య నిరుత్సాహ పడుతూంది.

“ఆ నవమోహనమూర్తి అనుకున్న ప్రకారం వస్తాడో రాడో-అతని రూప మెంతమనోజ్ఞంగా వుందీ? మాట లెంత తియ్యగా వున్నాయీ? అతను నియోగించిన పనిని కొంతవరకూ సాధించాను. నాప్రేమను స్వీకరిస్తాడు. తనవని తలంపుగా తటస్థమైన ఆసుందరాకారుణ్ణి పెళ్ళిచేసుకుని సుఖించగల జన్మే జన్మ—అతనితో మనసు దీరా మాటలాడగలిగిన నోరే నోరు. అబ్బా! ఇంకా రావడంలేదు.”

అని తనలో అనుకుంటూ ఆమె డాబాపైనుంచి తిరిగి నాలుగువైపులా పరికించింది. దూరాన ఒక గుఱ్ఱము—దానిపైన సహజకాంతులు వెదజల్లుతూ వొస్తున్న ఒక రాజకుమారుడు—శోభ సంతోషం పట్టలేకపోయింది. చరచర డాబాదిగింది.

శోభ చింతామణికంటె రెండు సంవత్సరాలు పెద్ద. సౌందర్యాతిశయాల్లో కూడా ఒకటి రెండాకు లెక్కువ—తెలివితేటల్లో—పట్టుదలలో ఇద్దరూ చెరిసమానం. అయితే చింతామణి గురుముఖతా సమస్తవిద్యలూ నేర్చింది—శోభకు అది లేకపోయినా సహజమయిన తెలివి-విజ్ఞానము, చింతామణి పొందిన సంస్కారాని కెంతమాత్రమూ తీసిపోవు.

శోభ ఆనాడున్నంతటి ఉత్సాహంగా జీవితంలో యెన్నడూ వుండలేదు. ఆనాడు చింతామణి ఆమెకు తాను స్వయంగా ముస్తాబు చేసింది. లేత మబ్బురంగు సిల్కు చీరకట్టి—ముఖమల్ రవికతొడిగి—మితమైన ఆభరణాలు ధరించి, జడగంట నూగాడించుకుంటూ, ఈనాటి నవనాగరీకురాలిలాగ, తళుకుబెళుకుల సింగారింపుతో, విలాస మొలికించుకొంటూ—ఇనప కచ్చడాలు బిగించుకున్న తాపసులను సయితం చలింపజేసేట్లయింది.

ఆమె నెవరంటారు? రాజకుమారికి ప్రియనెచ్చెలి—గారాల కూచి—ఈమె ఒక్క నిమిషం అస్వస్థతగావుంటే ఆమె సహించదు. ఆమె క్షణం ముఖం ముడుచుకుంటే, ఈమె సహించదు. ఆ యిద్దర మైత్రీ ఆదినుంచీ అంత గాఢతరంగా అతుక్కుపోయింది.

సరిగా ఆమె వెళ్లేటప్పటి కతను తయారుగా వున్నాడు. క్రితం రోజుకన్నా మరీ యెక్కువ శోభాయమానంగా వున్న శోభను తిల కించి విజయకుమారు మరింత మురిశాడు.

"రాజరాజ మహారాజ! రాజమార్తాండా! విజయకుమారా విజయీభవా—"

అని కొంటెతనంగా అంటూ, ఆమె అతన్ని సమీపించింది.

"జయము—జయము—శోభాదేవీ—శుభశోభనాల శోభా రాణీ—"

అని అతనుకూడా కొంటెతనంగానే అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆ సరోవరం దగ్గరున్న ఓ మర్రిచెట్టు మొదల్లో యిద్దరూ ఎవరికీ కనపడకుండా నక్కి కూచున్నారు.

"ఈవేళ—నిన్నటికంటే ఎక్కువ అందంగా కనుపిస్తున్నావెందుకో"

"మా రాజకుమారి, చింతామణి, తాను స్వయంగా నన్ను లంకరించింది."

"ఓహో! ఏమిటి విశేషం?"

"నాతలపై ఓ పెద్ద కార్యభారం పెట్టావుగదా-అందుకు చిన్న నాటక మాడాలసి వచ్చింది."

"ఫలితమేమైనట్లు?"

"జరిగింది జరిగినట్టు చెబుతాను—తొందరపడకుండా విను— నిన్న నీ దగ్గర్నుంచి వెళ్లాక, రాత్రంతా నిద్రలేకుండా ఆలోచించాను. ఆ ప్రశ్నలకు జవాబు చింతామణికికూడా తెలియదని నేనరుగుదును. ఏదో ఉపాయంపన్ని గురువుగారి దగ్గర్నుంచే రాబట్టాలి—నేను స్వయంగా గురువుగారి నడిగేదానికి కుండెల్లేవు—అడిగినా ఆయన చెప్పడు—నేను భగంపడ్డం తప్పదు. అందుకో మార్గం కనుపించింది.

చింతామణి మనస్తత్వం నాకు బాగా తెలుసు. నేను క్షణం ముఖం ముడుచుకుంటే ఆమె సహించలేదు. ఇద్దరం ఒకతల్లి బిడ్డలం గాకపోయినా—అంతకంటే యెక్కువగా వుంటాం—

ఆమె రాజకుమార్తె—నేను చెలికత్తెను, అన్నభావం మాలో మాకేగాకుండా, చూచేవాళ్లకుకూడా ఏకోశానా కనుపించదు. నే నీవుదయంనుంచీ, మనసు వికలమై వున్నట్లు ఖిన్నురాలనై కూచు

న్నాను. అంతవరకు ఆమె తన తొందరపనుల్లోవుండి. మధ్యాహ్నం నాదగ్గిరికొచ్చి అడిగింది—ఎందు కలా వున్నావని—"

అంతవరకు వివరించి, శోభాదేవి, తనకు చింతామణికీ జరిగిన యావత్తు సంగతులను తు. చ. లు తప్పకుండా చెప్పిందాన్నివిని—

"నువ్వు చాలా అసాధ్యురాలవుగా వున్నావే—అయితే నన్ను గూడా యెప్పటికయినా బోల్తాకొట్టిస్తావేమో" అన్నాడు విజయకుమారు.

"ఛీ విజయా—నేనసలు నీకేమీ చెప్పనే చెప్పను."

"లేదు లేదు—చెప్పు. అప్పుడు గురువుగారు చింతామణికి ప్రశ్నల జవాబులు యెలా వివరించారు."

"ఆఁ! ఇప్పుడు కనుపించాలి—నీ తెలివి, నీప్రతాపము! విను—గురువుగారు చెప్పిన మాటలు సరిగ్గా యివి—తలక్రిందులుగా తపస్సు చేస్తూ, బాలమహర్షిని తిలకించి, పంచాక్షరీ మంత్రమును ముందు జతపర్చుకోగలవారికి పంచమహానగరాలు గోచరిస్తవి. ఆపంచమహానగరాలకు సంబంధించినవే, నీ ఐదు ప్రశ్నలకు జవాబులు—అని మాత్రం చెప్పి ఇక తన్నేమీ అడగొద్దని చింతామణిని పంపేశాడు. ఇదీ నేను చెయ్యగలిగింది."

అని శోభ చెప్పినదానిని వినగానే విజయకుమారు తల తిరిగి పోయినట్లుంది. అంత జటిలంగా—అంతగూఢంగా వున్న విషయాన్ని విడదీయుట యెలాగా అని మెదడంతా వేడెక్కేలాగ, దీర్ఘంగా ఆలోచించాడు.

"అయిపోయిందా? నీకేమీ అర్థంకాలేదు కదూ!"

అని శోభ హెచ్చరించింది.

"తొందరపడకు—తలక్రిందులుగా తపస్సు చేస్తూ, బాలమహర్షిని తిలకించడమనగా, ఆ అక్షర పంచకాన్ని తలక్రిందులు చెయ్యాలి అని సూచనకావచ్చు."

"అప్పుడు—ర్షిహామలబా—అని వస్తుంది విజయా!"

"అవును—చక్కగా చెప్పావు. అప్పుడు పంచాక్షరీ మంత్రమును ముందు జతపర్చుకోవాలి, అనడంలో—నమశ్శివాయ—అన్న ఐదు బీజాక్షరాలను, ఒక్కటొక్కటిగా, మనం తలక్రిందులు చేసిన, ర్షిహామలబా—అనే అక్షరాలకు ముందుచేర్చి చదవాలన్నమాట.

అప్పుడు రెండేసి అక్షరాలుగల ఐదు పేర్లొస్తాయి. నర్షి, మహా, శ్శిమ, వాల, యబా.''

''ఆఁ! తెలిసిపోయింది—1. నర్షినగరము, 2. మహానగరము, 3. శ్శిమనగరము, 4. వాలనగరము, 5. యబానగరము.''

''ఐదు నగరాల పేర్లూ వచ్చాయిగా—ఆ ఐదు నగరాల్లోనూ వారి ఐదు ప్రశ్నలకు జవాబులు దొరుకుతాయని తేలిపోయింది.''

''అబ్బా! నువ్వెంత తెలివైనవాడవు విజయా! అంత కష్టతరమైన చిక్కును నిమిషంలో విడగొట్టావు. మా చింతామణీ నేనూ తలలుబ్రద్దలు కొట్టుకున్నాం—కాని మాకేమీ అర్థం కాలేదు.''

''నువ్వు తెచ్చిన ఫోటోగ్రాఫ్ వల్లకదా—ఈమాత్రమన్నా తెలిసింది! నీసాయం నేను జన్మజన్మలకూ మరిచిపోను శోభా! ఇప్పుడా ఐదు నగరాలూ యెక్కడున్నాయో తెలుసుకుని—అక్కడికి వెళ్లి ఐదు ప్రశ్నలకు జవాబులు తెలుసుకోవాలి.''

''ఆ నగరాలెక్కడున్నాయో నీకు తెలీదా?''

''తెలీదు సరిగదా, వాటిపేర్లయినా నేనెప్పుడూ వినలేదు.''

''మరెల్లా?''

''ప్రయత్నం చెయ్యాలి—సాధించాలి.''

''నన్ను వొదిలిపోతానంటున్నావా విజయా?''

''తిరిగి రానా?''

''ఆ నగరాలెక్కడున్నాయో—ఎన్నాళ్ళకొస్తావో—నన్ను పెళ్లి చేసుకుంటానని ప్రమాణం చేశావు.''

''చేసిన ప్రమాణం తప్పను. ఎన్నాళ్ళకొచ్చినా నిన్నే పెళ్లి చేసుకుంటా—ముమ్మాటికీ ఖాయం. రాజకుమారుల దుర్మరణాలను నివారించి, రాజకుమారీ, బాలమహర్షి, ఆయిద్దరూ కలిసి చేస్తున్న ఈ హింసాకాండ నరికట్టేవరకు, రాజ్యంలో కానికి జరుగుతున్న అపచారం ఆపేవరకు, నిర్దాక్షిణ్యంగా జరుగుతున్న యీ అక్రమాన్ని అంతమొందించేవరకు నామనస్సుకా శాంతివుండదు. నాకంటికి కునుకుండదు. భగవంతుడు నాప్రయత్నానికి సాయం చెయ్యాలి విజయా!''

''నువ్వు జయం పొంది సత్వరంగా తిరిగి రావాలని, నా దేవిని నిత్యమూ ప్రార్థిస్తుంటూ నువ్వు మళ్లీ కళ్ళబడేవరకు కాలంగడుపుతా విజయా!''

"నీదేవి యెవరు శోభా!"

"రాజరాజేశ్వరి!"

"రాజరాజేశ్వరా!"

"ఏం అలా ఆశ్చర్యంగా అడుగుతున్నావు."

"నా యీ ప్రయాణానికి ముందు ఒక పల్లెలో ఆ అమ్మవారి దేవాలయం చూశాను. ఆ దేవిని ప్రార్థించాను. ఇంతవరకూ కలిగిన విజయాని కాదేవి అనుగ్రహమే కారణం. మనయిద్దర ఆరాధ్యదేవతలూ ఒకటయినారు."

"మనసు లొకటైనప్పుడు, దేవతలు వేరవుతారా విజయా!"

"అయితే శోభా! నిన్నొక్క విషయం అడగాలనుకుని మరిచాను. నువ్వెప్పు డాచింతామణి రాణివాసంలోనే వుంటావా? నీతలిదండ్రులెవరు? వారెక్కడున్నారు?"

అని విజయకుమా రడిగినదాని కెందుచేతనో, శోభ ముఖం వివర్ణమైంది. సర్వలక్షణ లక్షితమైన ఆమె ముఖాన విషాదరేఖలు కమ్ముకున్నాయి.

"విజయా! నేను తలిదండ్రులు లేని అనాథని—వారెవరో కూడా తెలీని ఒక అభాగ్యురాల్ని—ఎవరో కనకసింహమహారాజులు—నేను నెలల పిల్లగా వున్నప్పుడు, ఓడలపై ప్రయాణం చేసే కొందరు వర్తకులకు నన్ను వప్పగించి—'ఈ యభాగ్య శిశువును ఏదూరదేశమైన తీసుకుపోయి, అమ్మివారెయ్యండి'—అని చెప్పినట్లు, వారికీర్తికాముని నగరం, అంటే, యీ కుండినగరం వచ్చినప్పుడు నన్ను అందరికీ అమ్మజూపారనీ—మంజులాదేవికి సంతానంలేని కారణంవల్ల, వర్తకులడిగిన పైకమిచ్చి నన్ను కీర్తికామమహారాజులు వెలకుకొన్నారనీ—అటుపైన, మరొకసంవత్సరం గడచిన తరువాత, మంజులాదేవి గర్భవతియై ఒక ఆడపిల్లను, అనగా, యిప్పటి యీచింతామణిని ప్రసవించిందనీ—అప్పటికెన్నో తరాలనుంచి ఆడసంతుకు ముఖం వాచివున్న వారియింట, నేను ప్రవేశించిన కారణంవల్లనే ఆడపిల్ల పుట్టిందనీ, అందుకు వారు పరమానందంతో, అప్పటినుంచీ నన్ను తమ సొంత కూతురులాగే చూసుకుంటూ, చింతామణికి చెలికత్తెగా వుండడానికి అన్నివిధాలా అర్హురాలనని అందుకు నియోగించారనీ—రాణీ

మంజులాదేవి ఒకరిద్దరితో చెబుతుండగా విని నాకు బాగా జ్ఞానమొచ్చిన తరువాతనే తెలుసుకున్నాను.

ఈ సంస్థానంలో నాకెన్నడూ ఎటువంటి లోపమూ జరగలేదు. రాజదంపతుల దృష్టిలో చింతామణి యెంతో నేనంత. తమ కుమార్తెకెటువంటి వెలగల ఆభరణాలు, దుస్తులు, కొంటారో—నాకూ అటువంటివే కొంటారు. ఆమెతో సమానమైన భోజనం—సమానమైన పడక—నేను అనాధశిశువునైనా నా యీనాటింవరకూ ఒక రాజకుమార్తెలాగనే పెరిగాను. కాని ఉన్నదల్లా ఒక్కటే లోటు—కన్నవారికి కరువుపడ్డమే గాకుండా—కనీసం వారెవరో కూడా తెలీని దిక్కుమాలినదాన్ని—''

అని శోభ చెప్పినదాని నాలకించిన విజయకుమారు, తలను పైకెత్తి దేనినో ఆలోచించడం మొదలుపెట్టాడు.

''ఏమిటి విజయా ఆలోచిస్తున్నావ్! తలిదండ్రులు తెలీని అనాధనెలా పెళ్లి చేవాలా అనా?'' అని శోభ ఖిన్నురాలై అడిగింది.

''అదే కాదు శోభా! నీగుణగణాలలో నాకు సంబంధంగాని—నీతలిదండ్రులతో నాకేమిటి? జన్మనుబట్టి బుద్ధులు నిర్ణయించడం ఒక విధంగా తెలివితక్కువే!''

''నీహృదయం ఎంత విశాలమైంది విజయా! నా అనాధదశలో నీవంటి ఉదారగుణసంపన్నుడు—మనసుతో మనసేకంచేసి, బ్రతుకుతో బ్రతుకును ముడిపెట్టుకోడాని కంగీకరించడం నాపూర్వపుణ్యం కాని, పెద్ద పనిపెట్టుకుని వెడుతున్నావు—మళ్ళీ యెప్పుడు కలుసుకుంటామో—''

''భగవంతుడు చల్లగా చూస్తే ఎంతసేపులే శోభా—మన యీ రెండురోజుల పరిచయం రెండుయుగాల స్నేహంలా అతుక్కుపోయింది.''

''అదే నాకు చాలా ఆశ్చర్యంగావుంది. నేను పుట్టాక ఇంత చనువుగా మాట్లాడింది చింతామణి తరవాత ఒక్కడితో—మాటల సందడిలో చాలాసేపు గడిచినట్లుంది. రాజకుమారి నేనేమై పోయానో అని ఖంగారు పడుతుంది.''

''మంచిది—పోయిరా.''

అని అతనొక్కసారి ఆమెను దగ్గిరగా తీసుకుంటుంటే—

"తిరిగి వచ్చేదాకా జ్ఞాపకముండేలాగ—ఒక తియ్యని—"

అని ఆమె అంటుండగానే అతని పెదవులు, లేతగులాబీవంటి ఆమెను చెక్కిలిపై గాఢంగా హత్తుకున్నాయి.

౧౨

విజయకుమారనంతరం, తాను బసచేసిన పూటకూళ్ల అవ్వ యిల్లు చేరుకుని, ఆరాత్రి కక్కడే గడిపి, ఉదయమే ప్రయాణ సన్నాహమై అవ్వకు మరో బంగారు నాణెమునిచ్చి—

"ఈ రెండు దినాలూ సన్నాదరించినందుకు చాలా సంతోషమవ్వా! పట్నం చూడ్డం అయిపోయింది. మావూరుపోతున్నా."

అని చెప్పాడు.

"మంచిది నాయనా! మళ్ళీ యెప్పుడయినా వస్తే, మాయింట్లోనే దిగాలి సుమా నాయనా!" అన్నదవ్వ.

"తప్పకుండా! మీ ఆదరణ మరచిపోనవ్వా."

అని ఆమెకు తృప్తికలిగించి, అశ్వారూఢుడై బయలుదేరాడు నగరపు పొలిమేరదాటాడు. అయితే అక్కడనుంచి యెటువెళ్లాలి? అయిదునగరాల్లో మొదటిదైన, నర్షనగరానికి మార్గమేటు? ఎవరు చెబుతారు. అతనికనేకసందేహాలే కలిగాయి. కాని వాటిని తీర్చగలవారెవరూ లేరు. జగదాంబమీద భారంవేసి—ముక్కుకు సూటిగా కనుపించిన మార్గంవయిపు గుఱ్ఱమును పరుగెత్తించాడు. ఆ రాత్రంతా ప్రయాణంచెయ్యగా చెయ్యగా ఒక సముద్రప్రాంతం చేరాడు. మళ్ళీ ఒక పెద్ద సమస్యవచ్చింది. తనూ, తనగుఱ్ఱమూ ఆ సముద్రం దాటడమెలా? ఆరాత్రి కిక చెయ్యగలిగిందేమీ లేకపోవడంవల్ల ఆ సముద్ర తీరానదిగాడు. కనుచూపు కందినంతమేర అంతా జలమయం తీరాన కూర్చుని దీర్ఘంగా ఆలోచించాడు. ఆసముద్ర ఘోషలాగునే అతని భవిష్యత్తుకూడా భయంకరంగా వున్నప్పటికీ, ఆకాశంమాత్రం ఒక్క మబ్బు తునకయినా లేకుండా అతి నిర్మలంగావుంది. దానికి తోడు వెన్నెల మల్లెలుపరచినట్టు అతి ప్రశాంతంగావుంది. ఈ వెన్నెల ప్రశాంతతకీ, ఆభయంకర సముద్రఘోషకీ ఏమిటీ సంబంధం? ఇటు చూసి హాయినిపొందే ప్రాణం, అటుచూస్తే భయంవల్ల తల్లడిల్లిపోతూంది. సృష్టిలో సుఖదుఃఖాలు రెండూ ఇదేమాదిరిగా ఒకదాని

మంజులాదేవి ఒకరిద్దరితో చెబుతుండగా విని నాకు బాగా జ్ఞాన మొచ్చిన తరువాతనే తెలుసుకున్నాను.

ఈ సంస్థానంలో నాకెన్నడూ ఎటువంటి లోపమూ జరగలేదు. రాజదంపతుల దృష్టిలో చింతామణి యెంతో నేనంత. తమ కుమార్తె కెటువంటి విలగల ఆభరణాలు, దుస్తులు, కొంటారో—నాకూ అటు వంటివే కొంటారు. ఆమెతో సమానమైన భోజనం—సమానమైన పడక—నేను అనాధశిశువునైనా నా యీనాటివరకూ ఒక రాజకుమార్తె లాగనే పెరిగాను. కాని ఉన్నదల్లా ఒక్కటే లోటు—కన్నవారికి కరువుపడ్డమే గాకుండా—కనీసం వారెవరో కూడా తెలీని దిక్కు మాలినదాన్ని—''

అని శోభ చెప్పినదాని నాలకించిన విజయకుమారు, తనను పైకెత్తి దేనినో ఆలోచడం మొదలుపెట్టాడు.

''ఏమిటి విజయా ఆలోచిస్తున్నావ్! తలిదండ్రులు తెలీని అనాధ నెలా పెళ్లి చేసాలా అని?'' అని శోభ ఖిన్నురాలై అడిగింది.

''అదే కాదు శోభా! నిగుణగతాలలో నాకు సంబంధంగాని—నీతలిదండ్రులతో నాకేమిటి? జన్మనుబట్టి బుద్ధులు నిర్ణయించడం ఒక విధంగా తెలివితక్కువే!''

''నీహృదయం ఎంత విశాలమైంది విజయా! నా అనాధదశలో నీవంటి ఉదారగుణసంపన్నుడు—మనసుతో మనసేకం చేసి, బ్రతుకుతో బ్రతుకును ముడిపెట్టుకోవాని అంగీకరించడం నాపూర్వపుణ్యం కాని, పెద్ద పనిపెట్టుకుని వెళుతున్నావు—మళ్ళీ యెప్పుడు కలుసుకుంటామో—''

''భగవంతుడు చల్లగా చూస్తే ఎంతసేపులే శోభా—మన యీ రెండురోజుల పరిచయం రెండుయుగాల స్నేహంలా అతుక్కుపోయింది.''

''అదే నాకు చాలా ఆశ్చర్యంగావుంది. నేను పుట్టాక ఇంత చనువుగా మాట్లాడింది చింతామణి తరవాత ఒక్కడితో—మాటల సందడిలో చాలాసేపు గడిచినట్లుంది. రాజకుమారి నేనేమై పోయానో అని ఖంగారు పడుతుంది.''

''మంచిది—పోయిరా.''

అని అతనొక్కసారి ఆమెను దగ్గరగా తీసుకుంటుండగా—

"తిరిగి వచ్చేదాకా జ్ఞాపకముండేలాగ—ఒక తియ్యని—"

అని ఆమె అంటుండగానే అతని పెదవులు, లేతగులాబీవంటి ఆమెను చెక్కిలిపై గాఢంగా హత్తుకున్నాయి.

౧౨

విజయకుమారనంతరం, తాను బసచేసిన పూటకూళ్ల అవ్వ యిల్లు చేరుకుని, ఆరాత్రి కక్కడే గడిపి, ఉదయమే ప్రయాణ సన్నాహమై అవ్వకు మరోబంగారు నాణెమునిచ్చి—

"ఈరెండు దినాలూ సన్మానించినందుకు చాలాసంతోషమవ్వా! పట్నం చూడ్డం అయిపోయింది. మావూరుపోతున్నా."

అని చెప్పాడు.

"మంచిది నాయనా! మళ్ళీ యెప్పుడయినావస్తే, మాయింట్లోనే దిగాలి సుమా నాయనా!" అన్నదవ్వ.

"తప్పకుండా! మీ ఆదరణ మరచిపోనవ్వా."

అని ఆమెకు తృప్తికలిగించి, ఆశ్వారూఢుడై బయలుదేరాడు నగరపు పొలిమేరదాటాడు. అయితే అక్కడనుంచి యెటువెళ్లాలి? అయిదునగరాల్లో మొదటిదైన, నర్మనగరానికి మార్గమేటు? ఎవరు చెబుతారు. అతనికన్నసందేహాలే కలిగాయి. కాని వాటిని తీర్చగలవారెవరూ లేరు. జగదాంబమీద భారంవేసి—ముక్కుకు సూటిగా కనుపించిన మార్గంవయిపు గుఱ్ఱమును పరుగెత్తించాడు. ఆ రాత్రంతా ప్రయాణంచెయ్యగా చెయ్యగా ఒక సముద్రప్రాంతంచేరాడు. మళ్ళీ ఒక పెద్ద సమస్యవచ్చింది. తనూ, తనగుఱ్ఱమూ ఆ సముద్రం దాటడమెలా? ఆరాత్రి కిక చెయ్యగలిగిందేమీ లేకపోవడంవల్ల ఆ సముద్ర తీరానదిగాడు. కనుచూపు కందినంతమేర అంతా జలమయం తీరాన కూర్చుని దీర్ఘంగా ఆలోచించాడు. ఆసముద్ర ఘోషలాగునే అతని భవిష్యత్తుకూడా భయంకరంగా వున్నప్పటికీ, ఆకాశంమాత్రం ఒక్క మబ్బు తునకయినా లేకుండా అతి నిర్మలంగావుంది. దానికి తోడు వెన్నెల మల్లెలుపరచినట్టు అతి ప్రశాంతంగావుంది. ఈ వెన్నెల ప్రశాంతతకీ, ఆభయంకర సముద్రఘోషకీ ఏమిటీ సంబంధం? ఇటు చూసి హాయినిపొందే ప్రాణం, అటుచూస్తే భయంవల్ల తల్లడిల్లిపోతూంది. సృష్టిలో సుఖదుఃఖాలు రెండూ ఇదేమాదిరిగా ఒకదాని

వెన్నంటి యింకొకటి వుంటున్నాయనే సత్యాన్ని అప్పటి ప్రకృతి ఋజువు చేస్తున్నది కాబోలు!

రాత్రి ఒకటిదాటింది—రెండుదాటింది. ఏకాకిగా ఆసముద్ర తీరాన కూర్చుని తరగనితంపిగా ఆలోచించడమే కాని—కార్యమును సాధించగల ఒక పద్ధతిగాని, ఒక మార్గంగాని అతనికేమీ కనుపించడలేదు. ఉన్నట్టుండి హఠాత్తుగా సముద్రంలో కొంతదూరాన ఏదో తెరచాప కొయ్యమాదిరిగా కనుపించింది. విజయకుమారు దానిని కొంచం నిదానించిచూశాడు. అది క్రమంగా దగ్గరకు రావడం మొదలుపెట్టింది. ఏదయినా ఓడ అయివుంటుందా అని ఆలోచించాడు. మరికొంతసేపట్లో అది ఇంకా దగ్గరగా రావడంవల్ల, ఓడేనని నిశ్చయం చేసుకున్నాడు. కాని అది రేవుకాదు—చుట్టుప్రక్కల వూరు లేదు. ఓడ అక్కడికెందుకు చేరుతున్నదా అని తెల్లబోయాడు. గాలివిసురు అనుకూలించడంవల్లనేమో ఒకనావ క్రమంగా వచ్చి, అతనికి చాలదూరంలో ఒడ్డుచేరింది.

అందులోనుంచి, ఎవరో అయిదారుగురు మనుష్యులు దిగినట్లు విజయకుమారునకు అస్పష్టంగా కనుపించింది. వారు దొంగలో దొరలో—తన కేమపకారం తలపెడతారో అని భయపడ్డాడు. అప్రయత్నంగా అతనిచెయ్యి నడుమున వ్రేలాడుతున్న కరవాలంపై పడింది. లేచి నిలుచున్నాడు. నావదిగినవారు దూరానవుండి—అతన్ని గమనించినట్టులేదు. వారెక్కడికీ వెళ్ళిపోకుండా—దిగినచోటనే వున్నట్లూహించాడు. కొంచెసేపట్లో ఏవోమాటలు సముద్రఘోషలో కలిసి అస్పష్టంగా వినిపించాయి.

వారెవరో తెలుసుకుందామని, విజయకుమారు సాహసంచేసి కళ్లెమును చేతపట్టి గుఱ్ఱమును నడిపించుకుంటూ, క్రమంగా వారిని సమీపించాడు. సమీపించినకొద్దీ వారిమాటలు స్పష్టంగా వినిపించాయి.

"అయ్యా! నన్నవసరంగా వధించకండి—మీ ప్రయత్నానికి నేనెటువంటి అంతరాయమూ కలిగించను."

అని ఒకవ్యక్తి మిగిలినవారిని వేడుకుంటున్నట్లుగా వూహించాడు విజయకుమారు. దానినిబట్టి ఎవరో కొందరు దుర్మార్గులు వేరొకనిని

హింసించడాని కక్కడికి వచ్చినట్లుగా అర్థమైంది. ప్రార్థించినను వాని ప్రార్థనలు వినకుండా—

"నిన్ను ప్రాణాలతో వొదిలిపెట్టడానికని యింతదూరం తీసుకురాలేదు."

అని అందులో ఒకడు కత్తినెత్తాడు. దానికి బలికావలసిన వాడు సుమారు పదహారేళ్ళ యువకుడై వున్నాడు. విజయకుమారుని శరీరంలోని రక్తం ఉడుకెత్తింది. ఉద్రేకంతో తక్షణం ఒరనుంచి కత్తినిదూసి. వారిమధ్యలో కురికాడు. ఆయుధపాణులైన మిగిలిన వారు ఉపేక్ష చెయ్యకుండా, అనిర్వాణుమ్య స్థలంలో తమ ప్రయత్నానికి అంతరాయం కలిగింపవచ్చిన ఆగంతకుని ఎదుర్కున్నారు.

ఉన్నవారు అయిదారుగురే అయినప్పటికీ యుద్ధవిద్యలో క్రమ శిక్షణనుపొంది, ఆరితేరినవారు కావడంవల్ల. వారును ఒరలనుంచి కత్తులుదూసి, విజయకుమారుని నాలుగువైపులా కమ్ముకొని, అతన్ని హతమార్చడానికి పూనుకున్నారు. విజయకుమారుకునూ జంకక తనపై బడే కత్తివిసురులను కాసుకుంటూ, తిరిగి వారినెదిరించి, పోరాడుతున్నాడు. కత్తుల ఝుళిపింపులతో—హుంకారాలతో నిమిషంలో అది ఒక చిన్న యుద్ధరంగంగా మారింది.

సకాలంలో భగవంతుడిలా అవతరించి, తన్ను ప్రాణరక్ష చెయ్యడాని కవతరించిన ఆ కొత్తయువకు డెవరా అని, బలికావలసిన యువకుడు కొంచంసేపు విస్తుపోయి, తనవారితన్ని చంపినయెడల, తిరిగి తనకపాయిం వాటిల్లుతుందని తెలుసుకొన్న ఆ చిన్నయువకుడు తానునూ, ఒకరనుంచి కత్తినిదూసి, తనకై పోరాడుతున్న యువకునికి సాయంగా నిలిచాడు, కాని అతడొక కత్తిదెబ్బ తిని కింద పడి పోడాని కెక్కువసేపు పట్టలేదు. విజయకుమారుడు రెట్టించిన క్రోధంతో శత్రువులపై బడి, అయిదుగురిలో యిద్దరిని కరవాలాని కెరగాచేశాడు. మిగిలిన ముగ్గురూ మరింత ఉద్రేకంతో విజయకుమారు మీదపడి ప్రబలంగా పోరుసల్పారు. ముగ్గురుకాదు, అటువంటివారిని మూడువందల మందినయినా నవలీలగా జయించగలిగిన విజయకుమారు మరికొంతసేపట్లో మిగిలిన ముగ్గుర్నీకూడా హత మార్చాడు.

కాని, ఆ నావరి రక్షణకోసం ఇంతవరకూ పోరాడాడో ఆయువ కుడు కత్తిదెబ్బతిని నేల పడిపోయినందు కెక్కువగా విచారించి, వెంటనే అతని దగ్గరకెళ్లి పరిశీలించాడు. భుజానికి తగిలిన గాయం నుంచి, నెత్తురు సంతతం ధారాపాతంగా కారుతూంది. విజయకుమారు వెంటనే, తన చొక్కా నుచించి, ఆ గుడ్డతో గాయానికి కట్టుకట్టి రక్తప్రవాహాము నరికట్టాడు. మరికొంతసేపటికి కాయువకుడు కళ్లు విప్పి, తనకుపచర్యలు చేస్తున్న విజయకుమారు పొకసారి—అక్కడ చచ్చిపడివున్న కళేబరాలవైపొకసారి చూశాడు.

"నేను బ్రతికానా?" అని హీనస్వరంతో అడిగాడు.

"ఇక నీకేం భయంలేదు—నీ శత్రువులు హతమయ్యారు."

"దేవుళ్లాగా మీరెవరో సమయానికొచ్చి, నన్ను రక్షిం చారుగాని, లేకపోతే వాళ్ళిపాటికి నా ప్రాణంతీసేవాళ్లు."

"నిజమే—వాళ్లు నిన్ని నిర్మానుష స్థలానికి తెచ్చి యీ ఘోరం తలపెట్టడానికి కారణమేమిటి? అసలు వాళ్లెవరూ? నువ్వెవరు?"

అని విజయకుమారు డడిగినదాని కాయువకుడు కొంచెం ఓపిక తెచ్చుకుని యిలా చెప్పాడు—

"అయ్యా! ఈ సముద్రానికి మధ్యలో వంగద్వీపమని ఒక పెద్ద పట్నముంది. నేనా పట్నపు రాజకుమారుణ్ణి, నా పేరు, బాల చంద్రుడు. ఇప్పటి కొక సంవత్సరం క్రితం ఆ పట్టణానికి ప్రభువైన మా నాయనగారు చనిపోయారు. నేను పదహారేళ్లు నిండని చిన్నవాడ నయిన కారణంవల్ల, మా తల్లిగారే, మంత్రి, కామపాలుని సహా యంతో రాజ్యపాలన సాగిస్తున్నారు. ఇలా వుంటుండగా ఒకనాడా మంత్రి నాదాపు చేరి—

"మేమందరమూ నావమీద పోతున్నాము—మీరు కూడా వస్తారా?" అని నన్నడిగాడు. సముద్రప్రయాణమంటే, ఉత్సాహపడే నేను, వెంటనే వారితో వెళ్ళడాని కంగీకరించాను. ఇప్పటి కెనిమిది రోజులక్రితం ఒకనాటి ఉదయం, కామపాలుడు, మరికొందరనుచరులు, నేను, అందరంకలిసి, నావమీద బయలుదేరాం—సాయంకాలంవరకూ నేనా సముద్రప్రయాణమును ఖులాసాగా అనుభవించాను. చీకటి పడుతుండడంవల్ల నావ నెనక్కు మళ్లించబడుతుందనుకొన్న—కాని

అలా జరగలేదు. ఇంకా ముందుకే సాగిపోతుండడమును గమనించిన నేను—

"చీకటి పడిపోయినా కూడా నావను వెనక్కు మళ్ళించకుండా, ముందుకే సాగనిస్తున్నారేం? మనమిక యిల్లు చేరుకునే దెప్పుడు?"

అని నేనడిగినదానికి, మంత్రి, ముఖం ముడుచుకుని—

"ఇల్లు—చేరుకుందువు గాలికే—మెదలకుండా నోరు మూసుకుని కూచో—" అని గద్దించి పలికాడు.

మంత్రి నాతో అంత కఠినంగా యెన్నడూ పలుకలేదు. అతనికి నాపై వైరముండడానికి ఎటువంటి అవకాశమూ లేదు. అయితే, అప్పు డతనావిధంగా యెందు కన్నాడో నాకేమీ అర్థంకాలేదు. ఆరాత్రికి, వారానావలో భద్రపరచి తెచ్చిన ఆహార పదార్థాలలో కొన్నింటిని తీసి, తాను తిన్నారు. నాకుకూడా పెట్టారు. తరువాత నాకు నిద్దరొచ్చింది. రాత్రంతా నిద్రపోయాను. తెల్లవారక మునుపే మెళుకువ వొచ్చింది. కాని లేవలేదు, కళ్ళు మూసుకుని పడుకునే వున్నాను. అప్పుడు మంత్రి, యింకొకనితో మాటలాడుతుండడం నాకు వినిపించిది.

ఒకడు—ఈ అర్భకుణ్ణి అంత మోసించడాని కింత ప్రయత్నం దేనికీ? నిద్దట్లోవున్నాడు—పీకపిసికి సముద్రమధ్యలో పారేస్తే ఎవరు చూడొచ్చారు?

మంత్రి—అదే తెలివితక్కువ—మనం అలా చేసినప్పుడు—ఖర్మం జాలక ఆ మృతకళేబరం నీటిలో కొట్టుకుపోయి మనతీరాన్నే చేరితే—అందరికీ తెలుస్తుంది.

ఒకడు—మనం చేశామని ఎలా తెలుస్తుంది.

మంత్రి—మనమని తెలియక పోయినప్పటికీ—ముందు ముందు నా చేయబోయే పనులనుబట్టి-యువరాజును నేనే హత్యచేయించానన్న అనామానం కలగడాని కవకాశముంది.

ఒకడు—నిజమే—మంత్రివైనందుకు నీ ఆలోచన అమోఘమైంది.

మంత్రి—అందువల్ల కొంచం శ్రమ అయితే అయింది. నావనేదో ఒక తీరానికి చేర్చి—అక్కడ మనపని కానిచ్చుకొని—శవాన్ని భూమిలో పాతిపెట్టామంటే, మనరహాస్యం బ్రహ్మకయినా తెలీదు.

ఒకడు—మన పట్నంనుంచి బయలుదేరిన నావ ఎనిమిదిరోజులకు
కాని తీరం చేరదు.

మంత్రి—కానియ్యి—మించిపోయిందేముంది? ఈ యెనిమిదిరోజులు, మనం తిరిగి వెళ్లేటప్పుడు మరో యెనిమిదిరోజులు—మొత్తం పదహారురోజులకే గాక, ఎందుకయినా మంచిదని, ఇరవై రోజులకు సరిపోయే ఆహారపదార్థాలను నావలో భద్రపరచే వుంచాను.

అని మంత్రి చెప్పగా, మిగిలినవారు తృప్తిపడ్డట్టుగా, వారి మౌనమునుబట్టి నేనర్థం చేసుకున్నాను. మంత్రి నన్నెందుకు తీసుకెడుతున్నాడో కర్థమైపోయింది. నాగుండెలు వేగంగా కొట్టుకున్నాయి. మృత్యుదేవత అప్పుడే నామీదపడ్డట్లు, శరీరమంతా గజగజ వొణికిపోయింది. నేను వారికి చేసిన అపకారమేమిటో—వారావిధంగా నన్ను చంపబూనటానికి గల కారణమేమిటో నాకర్థం కాలేదు. మాకోలువులో వుంటూ—మా తిండితింటూ—నాప్రాణానికే ముప్పు తలపెట్టిన మంత్రి దుర్మార్గాన్ని తెలుసుకుని సహించలేకపోయినాను. నే నెలాగా వారి చేతుల్లో చావడం ఖాయం—ఇంకా భయమెందుకు? వెంటనే కళ్లు తెరిచి, లేచి నిలుచున్నాను.

"మంత్రీ! నీదుర్మార్గమంతా నాకర్థమైపోయింది—నావ షికారని వంకపెట్టి—నన్నిలా ఎందుకు తీసుకెడుతున్నావో తెలిసింది—"

అని నేను మంత్రి నెదుర్కొని అడిగాను.

"ఊఁ! తెలుస్తే ఏం చెయ్యగలవు?"

అని మంత్రి, కాముపాలుడు నావైపు ఎర్రగా చూస్తూ అడిగాడు.

"నీకిప్పుడు దేవుడు ప్రతీకారం చెయ్యాలిగాని, నాపల్ల ఏమీ కానిమాట నిజం—కాని, నేను నీకు చేసిన అపచారమేమిటి?"

"నువ్వు బ్రతికివుండడమే అపచారం."

"ఎందుకనీ—"

"నువ్వడిగే చచ్చు ప్రశ్నలకి జవాబులు చెప్పవలసిన అవసరం నాకేమీ లేదు."

అనేసి, అత నిక నాయెదుటనుంచి వెళ్లిపోయి, మరొకచోట కూర్చున్నాడు. ఆపరిస్థితిలో వున్న అతనితో మాటలాడికూడా ఏమీ ప్రయోజనం లేదని నేను తెలుసుకున్నాను. నా ఆయువు అంతరికే

వుందని తెలుసుకున్నాను. తరువాత మరి యేడురోజులు సముద్రం మీద ప్రయాణం జరిగింది. నే నా యేడురోజులూ వారు పెట్టింది తిన లేదు—వారితో ఏమీ మాటలాడ లేదు. కళ్లుమూసుకుని భగవంతుణ్ణి తల్చుకుంటూ కూర్చున్నాను. ఏడురోజులూ అయిపోయాక, నావ ఈ తీరం చేరింది. ఆమీదట జరిగిన సమాచారమంతటినీ నీకళ్ళతో నువ్వే చూశావు గదా! భగవంతుడు సాయం చుండబట్టి, అనుకోకుండా నువ్వు సమయానికి రావడము—నన్ను రక్షించడము జరిగింది—నీమేలు జన్మజన్మలకూ మరిచిపోను—నీదేవూరు? ఇక్కడికి కెలావచ్చావు? దయ చేసి నీవివరాలు చెబుతే విని సంతోషిస్తాను.''

అని ఆ బాలచంద్రుడడిగినమీదట, విజయకుమారుడు తన వృత్తాంతము సంతటినీ క్లుప్తంగా అతనికి తెలియపరచి,

''నేనిప్పుడు నర్మినగరం పోవలసివుంది—దానికి దారెటో—ఆ పట్నమెక్కడుందో, నీకేమయినా తెలుసునా?'' అని అడిగాడు.

''నర్మినగరమంటూ ఒక పట్నముందన్న సమాచారమే నాకు తెలీదు. ఆపేరయినా ఎన్నడూ వినలేదు. నాతో మా లవంగపట్నం పోదాం రా—నన్ను మాయింటిదగ్గర మా అమ్మగారికి చేర్చినట్లూ వుంటుంది—నాతో మాయింట కొద్దిరోజులు విశ్రాంతి తీసుకున్నట్టూ వుంటుంది. మాపట్నంలో యింకెవరికయినా, నువ్వడిగిన ఆనర్మినగర వృత్తాంతం తెలుసునేమో దరియాప్తు చేదాం.''

అని బాలచంద్రుడన్నాడు.

''మంచిది. అయితే మనం మీవూరు యెలా పోతాము?''

''ఏం? నన్ను తీసుకొచ్చిన నావ లంగరువేయబడివుంది—దాని మీద మనం పోవచ్చు.''

''దాని నెవరు నడుపుతారు—దారి తెలిసేదెల్లా?''

''నీకా సందేహం అవసరంలేదు. నాకు సముద్రప్రయాణ మంటే చాలా యిష్టమని చెప్పలేదూ? అందువల్ల, చిన్నప్పటినుంచీ, నావలు నడపడంలో మంచి అనుభవం సంపాదించాను. అంతే గాకుండా వచ్చేటప్పుడు మార్గం గుర్తుపెట్టుకున్నా గాబట్టి, వెళ్లేట ప్పుడేమంత కిష్టంలేదు. ప్రయాణంలో మనకు చాలినన్ని ఆహారా పదార్థాలుకూడా నావలో వున్నాయి.''

''నాకు గుబ్బు ముకటుంది గదా!''

"వుంటేయేం? నావ లోపలిభాగం నువ్వు చూడలేదు. అటు వంటి పదిగుఱ్ఱాలకు సయితం జాగావుంది. నువ్వు హతిమార్చిన వారిలో మంత్రి కామపాలుడుకూడా వున్నాడు. వారి శవాలనుకూడా నావలో వేసి తీసుకుపోదామా?"

"అనవసరం—ఆ దుర్మార్గుల మృతకళేబరాల్ని యీసముద్రం లోనే పారేసి, జలచరాలకు ఆహారంగా వేద్దాం."

అని విజయకుమారుడు చెప్పింది బాగున్నదని బాలచంద్రు డంగీకరించాడు. ఇద్దరూ కలిసి, మృతులైనవారిని జలగర్భంలోకి తోసి పారేశారు. తరువాత, గుఱ్ఱమును మెల్లిగా నావలోకి చేర్చి— తాముస్నూ చేరారు. తరువాత బాలచంద్రుడే లంగరును తీసి— చుక్కాని దగ్గరకూర్చున్నాడు. నావ కదిలింది. విసురుగా వున్నగాలి, తమ కనుకూలంగా వుండడంచేత, బాలచంద్రుడు విజయకుమారుని సాయంతో తెరచాపనెత్తి—

"గాలి ఇదేమాదిరి విసిరిందంటే—మూడురోజుల్లో మా దీవి చేరుకుంటాం—" అన్నాడు బాలచంద్రుడు. తెరచాపయెత్తిం దగ్గ ర్నుంచీ నావ జోరుగా పోసాగింది. నీటిని చీల్చుకుని, కెరటాలను కత్తిరించుకుని, అతివేగంగా కొట్టుకుపోయే నావ చుక్కానిని అతి నేర్పుతోపట్టి, నడకను అదుపులో వుంచుకున్నాడు బాలచంద్రుడు. అంత చిన్నతనంలోనే నావ నడపడంలో అంత ప్రజ్ఞను సంపాదించిన బాలచంద్రుడి శక్తిని మెచ్చుకున్నాడు విజయకుమారు.

బాలచంద్రుడు చెప్పినట్లు మూడురోజుల్లో గాకపోయినా, గాలి కొనవరకూ అనుకూలించడంవల్ల, నాలుగురోజుల్లో నావ, లవంగ ద్వీపం చేరుకుంది. బాలచంద్రుడు విజయకుమారు సయితంగా తీరాన దిగి, అతని గుఱ్ఱంమీదనే తానుకూడా యెక్కి, అనతికాలంలో ఇరు వురూ రాజమందిరం చేరుకున్నారు.

బాలచంద్రుని తల్లి, ఇందిరాదేవి, ఎవరో కొత్త యువకుని వెంటబెట్టుకొచ్చిన కొడుకును చూచి తెల్లబోయింది. బాలచంద్రుడు, జరిగిన విషయమంతా తల్లికి వివరించి చెప్పాడు. మంత్రి చేసిన కుట్రను విజయకుమారు తన్ను రక్షించిన విధానమును, బాలచంద్రుడు చెప్పగా విని—ఇందిరాదేవి ఎందుకో అదోమాదిరిగా అయిపోయింది. ఆమె తనభావాలను తనలోనే యిముడ్చుకుని—

"సకాలంలో మాబిడ్డను రక్షించిన మీమేలు మరిచిపోలేనిది." అని చెబుతున్నప్పు డామాటల నామె విధిలేక చెబుతున్నట్టుగా తోచింది విజయకుమారుకు. ఏది యేమయినా అత నొకరి మెప్పులు కోరి ఏమీ చెయ్యలేదు. ఇందిరాదేవియొక్క గౌరవమర్యాదలు విజయకుమారుకు ఏమంత తృప్తికరంగా లేవు. ఆరోజునే అత నక్కడ నుంచి బయలుదేరి వెళ్లిపోవాలని సంకల్పించాడు. కాని బాలచంద్రుని పట్టువల్ల ఆరాత్రినుండి మరునాటి ఉదయం వెళ్లాడాని కేర్పాటు చేసుకున్నాడు.

తమ కతిధిగావున్న విజయకుమారుకు బాలచంద్రుడు స్వయంగా అవసరమైన ఏర్పాట్లు చేస్తూ, ఎక్కువ మర్యాద చేశాడు. తనతో పాటే స్నానపానాదులు చేయించి—భోజనాదులలో లోపం జరక్కుండా ఏర్పాటు చేయించి, రాత్రి తనగదిలో తన చేరువలోనే ప్రక్క వేయించాడు. ఆయిద్దరూ కొంచంసేపు—తమ ప్రయాణమును గురించీ దుర్మార్గము తలపెట్టిన మంత్రి తగిన ఫలితమును పొందిన దానిని గురించీ ముచ్చటించుకొని, ఆతరువాత, ప్రయాణబడలికవల్ల, ఒళ్లు తెలీకుండా పడుకుని నిద్రపోయారు.

విజయకుమారు, ఉదయంలేచి, గతరాత్రి తన కంత గాఢనిద్ర పట్టినందుకు తనలో తా నాశ్చర్యపడుతూ, కళ్లు విప్పాడు. ఆదారుణ మతని కేమీ అర్థంకాలేదు. అతని చేతులకు సంకెలు తగిలించబడి వున్నాయి! నలువైపులాచూసి, తానున్నది ఒక చరసాల అనీ—తానెందుకో చేతులకు సంకెలు తగిలించి, ఖయిదు చేశారనీ అర్థం చేసుకున్నాడు. మంచము—పరుపు—ప్రక్క—తాను గతరాత్రి నిద్ర చేసినవే కావడంవల్ల, నిద్దరలో వున్నప్పుడు తన్ను పాన్పుసయితంగా సాయంపట్టుకొచ్చి ఎవరో తన్నా కారాగృహంలో చేర్చి వుండాలని ఊహించుకున్నాడు. అప్పు డతను తనదుస్థితికిపొందిన విషాదంకంటే—తా నావిధంగా బంధించబడడానికి కారణం తెలుసుకోలేక పొందిన ఆశ్చర్యం ఎక్కువైంది.

"పుణ్యానికి పోయినందుకేనా, యీ పాపం ఎదురు కావడం? ఒక అమాయకుడు దుర్మార్గుల చేతుల్లో హత్యగావించబడుతుంటే చూసి సహించలేకపోయినందుకే నా కీశిక్ష! ఔర! ఏమి ప్రపంచం! ఎంత దుర్మార్గం. కొండంత కార్యమును తలపెట్టుకున్నానే! ఈకారా

గృహంలో బంధించబడిన, నాకింక ఏందారి! దేవీ! జగదంబా! నువ్వు చూడ్డంలేదా! నేనెవరి కెటువంటి హానిచేశాను! చింతామణి జరిగిస్తున్న హింసాకాండ నరికట్టి, నశించిపోతున్న రాజలోకాన్ని పునరుద్ధరించ బూనుకున్నాను. ఒకవేళ అది నానేరమా? తలిదండ్రుల మాట నతిక్రమించి ఇల్లు బయలుదేరిరావడ మపరాధమైందా? మనసు కందిన శోభాదేవిని పెళ్లాడతానని మాట యివ్వడం తప్పిదమవుతుందా! లేక, నే నీప్రపంచంలో బ్రతకడమే మహానేరమా?''

అని విజయకుమారు తన స్థితిని గురించి ఏమీ పాలుపోక, పరిపరివిధాల ఎట్లాలోచించుకొంటున్నాడో—అదే విధంగా అక్కడ బాలచంద్రుడునూ నిద్రమేలుకొని, దాపులో విజయకుమారుడు లేకపోయినందుకు విభ్రాంతుడై ఇల్లంతా గాలించి, పరిచారకుల నందర్నీ అడిగి వివరం తెలీక చివరకు తల్లి ఇందిరాదేవి దగ్గరకెళ్లి—

''ఇదేం ఘోరం అమ్మా!'' అని అడిగాడు.

''ఏం జరిగిందీ?'' అని ఆమె అడిగింది.

''రాత్రి నాగదిలోనే కదా—రెండోపక్క అమర్చి నన్ను రక్షించిన విజయకుమారుణ్ణి పడుకో నియమించానూ! తెల్లవారేసరికి అతనూలేడు—అతని పక్కా లేదు. ఏమిటీ విడ్డూరం?''

''ఎవరి నడుగుతున్నావు? ఆయువకుడెవరో—ఎక్కణ్నుంచి తీసుకొచ్చావో—నాకేమయినా తెలుసా?''

''అది కాదమ్మా! ఈవింత నీకూ్కడా చాలా ఆశ్చర్యంగా లేదూ?''

''ఉంటే ఏంచెయ్యాలీ! దార్నిపోయే అడ్డమైనవాళ్ళనీ లోపల చేర్చుకుంటే యేమవుతుందనుకున్నవూ? పడుకున్న మంచమూ పక్కాగాకూడా యింకాయేం పట్టుకుపోయాడో!''

''అయ్యయ్యో! అత నటువంటివాడు కాదమ్మా! నాకు ప్రాణధానం చేసిన రాజకుమారుడు. మహావీరుడు.''

''వీరుడో—చోరుడో—నాకు తెలీదయ్యా—అతన్ని గురించి నన్నింకేమీ అడగబోకు—నాకసలే చిరాకుగావుంది.''

అని తల్లి అన్నమాటలతో బాలచంద్రుడి కసలే మతిపోయింది. ఇంట్లో పరిచారకులవల్లనే విజయకుమారుడి కేదో అపకారం జరిగివుంటుందని అనుమానించాడు, అత నెవరికీ ఏమీ అపకారం చేసిన

వాడు కాదే! అని మళ్ళీ అనుకున్నాడు. ఎంతగా ఆలోచించినా బాల చంద్రుడి కేమీ తోచలేదు.

పోయి, నగరమంతా గాలించి వచ్చాడు. అగుపించిన ప్రతి ఒక్కరినీ అడిగాడు. అతని గుఱ్ఱం వుంచబడిన శాలకు పోయిచూచాడు. గుఱ్ఱం మామూలుగానే వుంది. అతను స్వయంగా వెళ్ళిపోయినవాడ యితే, తన అశ్వమును వొదులుకుని పోతాడా అనుకున్నాడు.

ఆయింట్లో అతన్ని చిన్నప్పటినుంచీ యెత్తుకు పెంచిన ఆయా బాలచంద్రుడు తన గదికొచ్చిన వెంబడే గమనించి, మామూలు అలవాటు ప్రకారం ఒకగ్లాసులో పాలుపట్టుకొచ్చి యిచ్చింది. బాల చంద్రుడా పాలందుకోకుండా ఖిన్నుడై కూర్చుని వుండడమును గమ నించిన ఆయా, కంటతడి పెట్టుకొంటూ—

"నువ్వు తిరిగి యిలా బ్రతికి బయటపడతావనుకోలేదు బాబూ!" అంది.

"నేను బ్రతికినందు కేమీ సంతోషంగా లేదాయా! నాప్రాణా లను రక్షించిన ఆరాజకుమారుడు ఏమైపోయాడో—కనుపించడం లేదు."

ఆయా నాలుగువైపులా తిలకించి, ఎవరూ లేకపోవడం గమ నించి—

"ఇంకేమైపోతాడు? ఈరాత్రి అతన్ని హత్య చేస్తారు."

"హత్య చేస్తారా? ఎవరు? ఎందుకు?

"మీఅమ్మగారిచేత నియోగించబడ్డ మనుషులు."

"అమ్మగారా! అతనేం చేశాడనీ!"

"చెప్పక తప్పని పరిస్థితి వొచ్చింది గాబట్టి. చెబుతున్నాను. మీనాయనగారు పోయిం దగ్గర్నుంచి మీఅమ్మకు, మంత్రికీ, అవి నీతి సంబంధం ఏర్పడింది. నిన్ను హతమార్చి, మంత్రిని రాజు చెయ్యాలని మీ అమ్మగారి సంకల్పం—అందుకనే నిన్ను సముద్రమీద తీసుకెళ్లాడు మంత్రి. తన వలపుకాడయిన మంత్రిని సంహరించి నిన్ను కాపాడి నందు కా రాజకుమారుణ్ణి అంతమొందించడం మీ అమ్మగారి నిశ్చయం—"

అని ఆయా చెప్పినదివిని, నమ్మకలేక పోతున్నాడు బాల చంద్రుడు.

"నామాటల్లో విశ్వాసంలేక పోతే—చరసాలకు పోయిచూడు. నిన్ను రక్షించిన రాజకుమారు డక్కడ బంధించబడివున్నాడు—నువ్వు ఉపేక్ష చేశావంటే—ఈ రాత్రి అతను నీ కండడు."

అని ఆయా చెబుతూ, ఇంతలో వెనుక, ఏదో అలజడి కావడంవల్ల, చెప్పడము నాపుచేసి, పాలగ్లాసు నక్కడ పెట్టేసి వెళ్ళిపోయింది. బాలచంద్రుడు ఉపేక్ష చెయ్యకుండా, త్వరపడ్డాడు—మూడడుగుల్లో చరసాలకు పరుగెత్తాడు. కాని అక్కడి కావలివారొకరిద్దరతన్ని వారించారు. బాలచంద్రుడు లెక్క చెయ్యకుండా వారి నెదిరించి, వారిదగ్గరి బీగాలతో చరసాల తెరిచాడు. అందులో బంధించబడివున్న విజయకుమారుని చూచి విభ్రాంతుడయ్యాడు. ఆయా చెప్పినదంతా నిజమని తెలుసుకున్నాడు.

"రాజకుమారా! క్షమించు—నాతల్లి కులట అయిన విషయం నాకిప్పుడే తెలిసింది—అందువల్లనే యిటువంటి విపరీతాలు జరుగుతున్నాయి."

అని వెంటనే అతన్ని విముక్తి కలిగించి, ఆయా తనకు చెప్పిన విషయమంతటినీ విజయకుమారుకు వివరించి చెప్పాడు. విజయకుమారు ముక్కుమీద వేలేసుకొని—

"ఔరా! ఏమి పాడు ప్రపంచం—ప్రియుడిమీది తీపిచేత కన్నమమకారమును సయితం గంగపాలుచేసే తల్లులున్నారని నే నిప్పుడు తెలుసుకున్నాను." అన్నాడు.

"అయ్యో! ఇదంతా నేను చేసుకున్న పాపం తప్ప—యింకేమీ లేదు. నాకు ప్రాణదానం చేసిన దాతనువ్వే నాకర్తవ్యమును కూడా తెలిసిపోయింది. కుటుంబ గౌరవాన్ని దుమ్ముపాలుచేసిన ఆకులటను పదిమందిలోను పొడిచి చంపుతాను—అది నాకు తల్లికాదు—"

అని ఉద్రేకంతో పలుకుతున్న బాలచంద్రుడి మాటలు విని—

"బాలచద్రా! నువ్వు చిన్నవాడవు-తొందరపడి ఏపనీ చెయ్యకూడదు. నగరవాసులందరినీ పిలిపించి సభ చేయుంచు. ఆ సభలోని తల్లి దుశ్చరిత్రను వెల్లడిచేసి, వారితో విచారించు—ప్రజలేమి చెయ్యమంటే అదిచెయ్యి. ఆ సభలో నేనుకూడా వుంటాను—నీభవిష్యత్తుకు సుస్థిరమైన పునాదులు వేయిస్తాను."

అని విజయకుమారుడు చెప్పిన సలహాప్రకారం చెయ్యడానికి బాలచంద్రుడు సంతోషంతో అంగీకరించాడు. ఆయిరువురూ కారాగారమునుంచి యివతలికి కొస్తుండగా—

"అయ్యా! ఖయిదీని విడుదలచేసి పోతున్నారు. యువరాజుగారయినందుచేత, మీకెదురు చెప్పలేక వూరుకున్నాము—అందుకు అమ్మగారు మాతలలు తీయిస్తారండి."

అని అక్కడి కాపలావారు మొత్తుకున్నారు.

"ఇప్పుడు అమ్మగారి తలొకటినిలుస్తే మీ తలలు తీయించినంతఫలం—మీ కొచ్చిన ప్రమాదంలేదు—"

అని బాలచంద్రుడు విజయకుమారునితో బయలుదేరి యివతల కొచ్చాడు. తక్షణం ఒక జరురయిన పౌరసభ ఏర్పాటు చెయ్యబడింది. అంతవరకు ఇందిరాదేవి కేమీ తెలియనే తెలియదు. ఆమె ప్రయత్నంమీద ఆమెవుంది.

"పౌరులందరూ కోటవెలుపల సభతీర్చివున్నారు—యువరాజుగారు కోరిన ప్రకారం, పౌరులు మిమ్మల్ని సభలో హాజరు కమ్మంటున్నారు."

అని కొందరు పౌరులే బయటవుండి, ఇందిరాదేవికి వర్తమానం పంపారు. ఆమె తెల్లపోయింది. పౌరసభఏమిటి? యువరాజుగారేమిటి—ఆమె కేమీ అర్థంకాలేదు. అయినా సభకు పోకతప్పదు. ఆమె ప్రాణాల నరిచేత పట్టుకుని సభలో హాజరైంది. అంతకుముందే బాలచంద్రునివల్ల విషయమంతటినీ తెలుసుకొన్నవాడు కావడంవల్ల ఒక ప్రముఖుడు లేచి—ఇందిరాదేవిని కొన్ని ప్రశ్నలు వేశాడు.

"తమ ఆస్థానంలోవుండే మంత్రి యిప్పుడేమయినాడు?"

ఆమె జవాబు చెప్పలేదు.

"మా మహారాజులుంగారు కాలధర్మమును పొంది నప్పటినుండి మీరు మంత్రితో అవినీతిసంబంధమును కలిగివున్నారనీ—అతని ప్రోత్సాహంపై మీ స్వంతకొడుకు, మా యువరాజు అయిన బాలచంద్ర ప్రభువును హత్యచేయించడానికి సముద్రంమీద ఎక్కడికో పంపారని—అక్కడ మాత్రి, యువరాజును హత్యచేస్తుండగా చూసి రక్షించిన రాజకుమారునిపై కక్షసాధించడానికి మీరతన్ని ఖయిదులో వుంచారనీ—మాకు తెలిసింది. ఈ నేరా లన్నింటినీ

మీరు ఒప్పుకుంటే సరి—లేకపోయినట్లయితే సాక్ష్యాలయితంగా విచారించవలసివుంటుంది. ఆవిచారణ మీకు, మీకుటుంబానికి అప కీర్తి కారణమేగాని వేరొకటికాదు.''

అంతా విని ఇందిరాదేవి, తలకిందికి దించుకుని మౌనమును వహించింది. తనరహస్యాలన్నీ ఎలా బయటపడ్డాయా అని తనలో తానే ఆశ్చర్యపోయి, తనకర్తవ్యమును తాను నిర్ణయించుకోలేని పరిస్థితిలోవుంది.

''ఏమంటారు? విచారణ అవసరమా? నేరాలు ఒప్పుకుం టారా?'' అని నగరప్రముఖుడు తిరిగి తీక్షణంగా అడిగాడు.

''విచారణ అవసరంలేదు—నేరాలు ఒప్పుకొంటున్నాను, అని ఆమె తలదించుకొనే బదులుచెప్పింది.

''ఈక్షణంనుంచీ యువరాజే మాకు ప్రభువు—వయస్సులో కొంచం చిన్నవాడయినా మేమంతా అంగీకరిస్తున్నాము కాబట్టి— అతను రాజు కావలసిందే—మీకెటువంటి శిక్ష విధించాలో ఇప్పు డాయనే నిర్ణయం చెయ్యవలసివుంది.''

అని పురప్రముఖుడు తిరిగి అన్నాడు.

''పౌరులారా! ఇంతఘోరాపచారం చేసి, రాజకుటుంబానికి చెరగని మచ్చ తెచ్చిపెట్టిన నీచురాలిని నేనయితే, చిత్రవధ చేసి వుందును. కాని నాకు ప్రాణబిక్షపెట్టిన దాతయు, మహామేధావియు అయిన నామిత్రుడు విజయకుమారుడు అందుకు సమ్మతించలేదు గాబట్టి—అపరాధి ఆజన్మాంతము ఖయిదులో గడపవలసింది,''

అని బాలచంద్రుడు చెప్పినవెంటనే భటులువచ్చి రాజమాత నాతావునుంచి కొనిపోయారు. అప్పుడు విజయకుమారుడు లేచి—

''మహాజనులారా! చిన్నవాడయిన మీ యువరాజు నింతటి నుంచయినా మీరే కాపాడుకోవాలి—అతనికి ఒక సమర్థుడైన మంత్రిని నియోగించి—అతను ప్రాజ్ఞుడయ్యే వరకూ, మీరందరూ అన్ని విషయములలోనూ బాధ్యతకలిగి వుండాలి—''

అని హెచ్చరించి, అప్పటి కంతటితో సభనుముగింపు చేయిం చాడు. మార్గవశాత్తూ పోతున్నవానికి అప్రయత్నంగా తటస్థమైన కార్యభారాన్ని ఆవిధంగా పూర్తిచేసి, ఇక తన ప్రయాణానికి ఏమి చెయ్యాలా అని ఆలోచన మొదలుపెట్టాడు.

"మిత్రమా! మన యిద్దరగండాలూ యిప్పటి కీవిధంగా గడిచాయి. ఇక నాదార్ని నేను ప్రమాణమై పోతాను."

అని విజయకుమారు డడిగినదానికి—

"నువ్వు చెప్పిన నర్షినగర మెక్కడుందో ఎవరికీ తెలియదని, మా పట్నవాసులందరూ చెప్పారు. ఈ లవంగద్వీపాని కవతలొడ్డున, కురంగనగరమనే ఒక మహాపట్నముంది. అక్కడనుంచి ఎటు పోవాలన్న భూమార్గాన అతి సులువుగాపోవచ్చు. నేను రేపే నీకై ఒక ప్రత్యేకమైన ఓడను ఇక్కడనుంచి బయలుదేర చేస్తాను. నావికులను కొంత సిబ్బందినీ కూడా నీకు తోడిస్తాను. నువ్వా ఓడమీద పది దినాలు ప్రయాణం చేశావంటే, ఆ కురంగపురమును సురక్షితంగా చేరగలవు. నేను నీకు చెయ్యగల ఉపకారమింతే."

అని బాలచంద్రుడు చెప్పగా, విజయకుమారు డప్పటికదే పదివేలని, పరమసంతోషంతో అంగీకరించాడు.

## ౧౩

చెప్పిన ప్రకారం బాలచంద్రుడు ఏర్పాటు గావించిన ఓడపై విజయకుమారు పదిదినాలు సముద్రప్రయాణం చేసి, కురంగనగరం సురక్షితంగా చేరుకున్నాడు. నావికులు అతనిని, అతని గుఱ్ఱమును రేవున దించి, శలవు తీసుకున్నారు. బాలచంద్రుడికి తన కృతజ్ఞతను చెప్పవలసిందిగా కోరి, విజయకుమారుడు అశ్వారూఢుడై నగరాభిముఖంగా బయలుదేరాడు.

ఎక్కడ చూచినా జనసమూహాలు—పెద్ద పెద్ద అంగడులు—దివ్యభవనాలతో నిండి-అది ఒక మహానగరమే. విజయకుమారు రెండు రోజులుండి ఆ నగరమంతా కలియదిరిగాడు. అగుపించిన ప్రతివారినీ నర్షినగరమును గురించి అడిగాడు. అడిగిన ప్రతి ఒక్కరూ పెదవులు చప్పరించి, ఆ నగరం పేరుకూడా తామెన్నడూ విన్నదిలేదని చెప్పారు. ఆ నగరంలో తనకు కలిగిన ప్రయోజన మేదిన్ని లేదని నిశ్చయం చేసుకుని, తనకు తోచిన పడమటిదిక్కుగా తిరిగి ప్రయాణమై బయలుదేరాడు.

చా దూరంవరకు ప్రయాణ యోగ్యమైన బాటలు కలిగి, అటుపైన కొంత పర్వతప్రదేశము—కొంత అరణ్యప్రదేశముగా,

మార్గమంతా ఒకే తీరున లేక, అనేక పద్ధతులుగావుంది. విజయ కుమారుడు, దాహమైనప్పుడు అందందుగల జలాశయములలో నీళ్ళు త్రాగుతూ, అప్పుడప్పుడు బయళ్లు కనుపించినప్పుడు గుఱ్ఱానికి పచ్చిక మేపుకొంటూ, తాను అరణ్యంలో లభ్యమయిన దుంపలు, కాయలూ తింటూ, బడలిక కలిగినప్పుడు ఏచెట్టునీడనో—ఏమెట్టమీదనో విశ్రాంతి తీసుకొంటూ సుమారు ఇరవై దినాలు ప్రయాణం చేశాడు. ఆ యిరవై రోజుల ప్రయాణంలోనూ అతని కెక్కడా ఒకపల్లెగాని—ఒక్క మనిషికాని కనుపించలేదు. కురంగనగరం దాటిన తరువాత, యిన్నిదినాలలోనూ తాను ప్రయాణం సలిపిన దెంతదూరమో—ఇంకా ఎంతదూరం ప్రయాణంచేస్తే నర్తినగర సమాచారం తెలుస్తుందో—అసలు తెలుస్తుందో లేదో—ఆలోచించకుండా రోజుల తరబడి, వారాల తరబడి నెలల తరబడి గుడ్డిగా ప్రయాణం చేస్తున్నాడు. లెక్క చూసుకుంటే—తానప్పటికి ఇల్లు బయలుదేరి సుమారు నలభై రోజులకు పైదాటింది. తనకై తలిదండ్రులు ఎంత బెంగపెట్టుకున్నారో—శోభ ఏమనుకుంటూందో—అన్న ఆలోచనలు కలిగినప్పుడు మాత్రం అతని గుండె నీరై పోతూంది. తిరిగి స్థయిర్యం తెచ్చుకుని, సాహసంతో ముందుకు సాగిపోతున్నాడు.

అట్లా పోయి పోయి, ఆనాడొక దుర్గమారణ్యంలో చిక్కుకున్నాడు. గుఱ్ఱ మలసిపోయింది—అత నంతకంటె అలసిపోయాడు. ఎటు చూసినా సింహగర్జనలు, పులుల అరుపులు, ఏనుగుల తీండ్రింపులు, పిట్టల కోలాహలమూ తప్ప యింకేమీ లేదు. ఏఘాతుక మృగమైనా మీదపడితే, తప్పించుకుని పారిపోయే అవకాశమన్నా కనుపించలేదు. ఆరోజుతో తన కాయువు తీరిపోయిందేమోనని కూడా అతను సందేహపడ్డాడు, అయినా చెయ్యగలిగిందేమీ లేక జగదంబను మనసులో తల్చుకొంటూ, చిక్కుదారులను సరిచేసుకుంటూ, అతి కష్టంమీద మరికొంచం దూరం దాటాడు.

అది బల్లపరుపుగావున్న ఒక ఎత్తయిన పీఠభూమిగా తోచింది. మీదికెక్కడం అసాధ్యంగా కనుపించలేదు. గుఱ్ఱము నొకసారి హెచ్చరించుకుని, దానిపై, కొండమీదికెగబ్రాకడం మొదలు పెట్టాడు. అశ్వమును యజమాని భావమును వెంటనే గుర్తించి, ఎంత కష్టమయినా సహించుకొని, నాలుగయిదు గంటలలో కొండ పైభాగ

మును చేరింది. ఆకొండకు దిగువభాగ మెంత భయంకరంగావుందో–యెగువభాగ మంత ప్రశాంతంగా వుంది. కేవల మొక్క ప్రశాంతతే గాక, నానావిధ ఫలవృక్షాలతోనూ, పూజాతులతోనూ ఆ ప్రదేశ మంతా నిండి, అతిమనోహరంగా వుంది. అక్కడి ప్రకృతి రామణీయ కతను తిలకించుకొంటూ అతిసావకాశంగా తిరుగుతున్న విజయకుమా రుని దృష్టి, అప్రయత్నంగా ఒక మహావృక్షం కింద కనుపించిన వింత రూపంపై పడ్డది.

ఆరూపం, చిత్రకారులచే చెక్కబడిన శిలావిగ్రహమో—మాయాకల్పితమైన పిశాచమో—పరులను మోసగించడాని కవత రించిన ఏ కామరూపుడో—ఏదీ గాక తన్ను వంచనచెయ్యడానికై వున్న ఏ రాక్షసుడో–విజయకుమారుడు యెటూ నిశ్చయం చెయ్య లేక, తల్లక్రిందులై అనేక విధాల ఆలోచించాడు. వెంటనే కొండదిగి పోదామా అని ఆలోచించాడు. కాని రూపమేమిటో తెలుసుకో కుండా వెళ్ళడానికి మనస్సు సీకరించలేదు. గుఱ్ఱాన్ని కొంచందూరంలో కట్టి, తాను మెల్లిగా ఆ స్వరూపాన్ని సమీపించాడు. పరిశీలనగా దగ్గరనుంచి చూచాడు.

మొదటనుకున్నదేమీ కాదు! దీర్ఘములైన జడలతో, నార వస్త్రములతో మర్మావయవములను కప్పుకొని, పద్మాసనంపై కూర్చుని కళ్లు మూసుకుని, తపస్సమాధిలో వున్న ఒక యోగినీ రూపమది. తాను పొరబడినందుకు లెంపలు వేసుకుని, ఆ యోగిని కొకసారి సాష్టాంగ నమస్కారంచేసి నిలుచున్నాడు.

"ఆహా! ఏమినిష్ట! ఏమి ప్రశాంతత! స్త్రీ అయివుండి, ఎటు వంటి సమాధి దీక్షలో వుంది!—ఈ విడ కంతరాయం కలిగిస్తే నాకు మహాపాపం చుట్టుకుంటుంది. ఎన్ని దినాలయినా సరే ఈ విడ కళ్ళు విప్పేవరకు, ఈ పవిత్రపదసన్నిధానంలోనే, నిరాహారదీక్షతో పడి వుంటాను."

అని, విజయకుమారు తనలో అనుకుని, ఆ ప్రకారం వచ్చిన వాడు వచ్చినట్లు, ఆదేవి పాదాలకు కొంచందూరంలో మఠం వేసు కుని కూర్చున్నాడు దీక్షగా. ఆయోగిని కళ్లు విప్పాలి–తా నామెతో మాటలాడాలి. ఇదీ అతని కోరిక. ఆరోజు గడిచింది–మర్నాడురాత్రి, పగలు—మరికొన్ని రాత్రులు, మరికొన్ని పగలు—ఈ ప్రకారం

తొమ్మిదిరోజులు నడిచింది. యోగిని, కన్ను విప్పలేదు. అతను కన్ను మయ్యలేదు. తను కన్నుమూస్తే, ఆ సమయంలో యోగిని ఎక్కడ కళ్ళు విప్పుతుందో—తన అవకాశం ఎక్కడ చెడిపోతుందో అని, విజయకుమారు కంటికి కునుకయినా లేకుండా, నోటి కాహారం లేకుండా, దీక్షవహించి అలాగే కూర్చున్నాడు.

తొమ్మిదోనాటి సాయంసమయాన, సూర్యుడస్తాద్రికి దిగక ముందా యోగిని తన ప్రశాంతనయనాలను విప్పింది. కన్నెదుట వున్న యువకుని పరిశీలించి చూచింది. విజయకుమారు వెంటనే యోగినికి ప్రణమిల్లి, నిలుచుని నమస్కరించాడు. కూర్చోవచ్చునని ఆ విడ సాంజ్ఞ చేసింది. అతను కూర్చున్నాడు.

"బిడ్డా! నువ్వు సంకల్పించిన కార్యమసాధ్యమైనది! నిరాహారు డవై తొమ్మిదినాళ్లు నాసాన్నిధ్యంలో పడివున్నావని జాలికలిగింది. కళ్ళు విప్పాను. లేకుంటే, సంవత్సరములయినా నేను కళ్లు విప్పవల సింది లేదు. మాల్యవంతమనే యీ కొండమీద సుమారు వందసంవ త్సరాలనుంచి, యిదేవిధంగా తపస్సు చేసుకుంటున్నాను. నాకర్మ విమోచన మెప్పుడవుతుందో నాకే తెలీదు."

అని యోగిని చెప్పినమాటలు విని విజయకుమారు నిర్ఘాంత పోయాడు. అతని నోటంట మాటలు రావడంలేదు.

యోగిని తిరిగి మాటలాడింది.

"నాగపుర యువరాజువైన నువ్వు, చింతామణిచే జరుపబడు తున్న హింసాకాండ నరికట్టి—రాజలోకానికి మేలు చెయ్యదల్చిన విషయం, సంతోషకరమే—కాని ఆమె కాప్రశ్నలు చెప్పినవాడొక బాలమహర్షి కావడంచేత, వాటికి జవాబులు తెలుసుకోవడం దుస్సా ధ్యమైనపని. దైవ సహాయముండబట్టి, యింతవరకైనా నీప్రయత్న మనుకూలించింది. ఇక వెనుకకు మళ్ళడం మేలు."

ఆవిడ, త్రికాలములను తెలుసుకోగలిగిన మహాతపస్సంపన్ను రాలని విజయకుమారు కర్థమయింది. తాను చెప్పనవసరంలేకుండానే, ఆవిడ తన వివరాలన్నీ తెలుసుకోగలిగినందు కెంతయినా అబ్బురపడి—

"జగన్మాతా! కాలజ్ఞానసంపన్నురాలవైన నీకు నేను చెప్ప గలిగిందేమీ లేదు. చింతామణి ప్రశ్నలకు జవాబు చెప్పి, రాజలోకా నికి యశస్సు తేవడమో—లేక వెయ్యి కొక్కటితక్కువయిన నా

సోదర శిరస్సులకు నాశిరస్సును జతపరిచి, ఆ రాజకుమార్తె యజ్ఞ కుండానికి ఆహుతి కావడమో—ఈ రెండు పద్ధతులకు మించి, మూడవ మార్గముండదని, నాతలిదండ్రులకు చెప్పి యిల్లు బయలుదేరాను. కనక నాకు ప్రాణభయంలేదు. నర్తనగర మనేది అసలీభూమండలంలో వుందా? వుంటే దానికి మార్గమేటు? అనుగ్రహించి, నా కీమాత్రం చెబితే చాలు.''

అని చెప్పిన రాజకుమారుని వైపొకసారి సాదరంగా చూచి, యోగిని అంది.

''నర్తినగరమే కాదు—ఆ ఐదు నగరాలూకూడా భూవలయంలో వున్నాయి. వాటికి మార్గం తెలిసి ప్రయోజనంలేదు. అనేక యోజనముల దూరము—నర్తినగరం మాత్ర మిక్కడికి ఐదువందల యోజనముల దూరంలో వుంది. మిగిలిన నాలుగు నగరాలూ వున్న వనేగాని, ఎక్కడ యెంతదూరంలో వున్నవో నాకు తెలియదు.''

''తల్లీ! ఆ నర్తినగర మెటుపోవాలో—అనుగ్రహించి చెప్పు—సాధించి తీరతాను.''

అని దృఢ నిశ్చయంతో చెబుతున్న విజయకుమారుని జవాబులకు మారుచెప్పలేని యోగిని, లేచి నిలుచుని—

''బిడ్డా! నాతోరా!'' అంది.

అతడు మారుచెప్పకుండా ఆమె ననుసరించాడు. ఆమె అతన్ని దట్టంగా పెరిగివున్న కొన్ని చెట్లమధ్యకు తీసుకునిపోయి, పొట్టిగా చిక్కగా పెరిగివున్న ఒక గున్నమామిడిపంటి వృక్షాన్ని చూపింది. దాని ఆకులు తామరాకులంత పెద్దవిగా వున్నాయి.

''బిడ్డా! ఈవృక్ష మేమిటో తెలుసునా?'' అని అడిగింది.

''తెలియదు—ఎప్పుడూ చూడలేదు.''

అని విజయకుమారు బదులు చెప్పాడు.

ఆమె ఆచెట్టునుంచి ఒక ఆకును తుంచి, దొన్నెగా చుట్టి, ఆ దొన్నెను ఆకు తుంచబడిన దగ్గరపెట్టగా, అందుండి చిటికెనవ్రేలు లావున, చిక్కటిపాలు దొన్నెలోకి ధారాపాతంగా వర్షించాయి. దొన్నె నిండింది—పాలధార నిలిచిపోయింది. ఆ మహాచిత్రమును చూచి, విజయకుమారు తెల్లబోయాడు. యోగిని పాలతో నిండివున్న ఆ దొన్నెను విజయకుమారు కందించి—

"తాగు." అంది.

విజయకుమారు సందేహించకుండా, గోక్షీరాన్ని మించిన మధురంతో వున్న ఆ దొన్నెడు పాలూ తాగాడు.

"నువ్విప్పుడు తాగిన యీ క్షీరశక్తివల్ల, ఆకలిదప్పులుగాని, ఏ యితర అడ్డంకులుగాని లేకుండా ఐదువందల యోజనాలూ సురక్షితంగా ప్రయాణం చేసి, శక్తినగరం చేరుకోగలవు. అప్పైన నీ అదృష్టము! ఇంతవరకే నేను నీకు చెయ్యగల ఉపకారము. నువ్వు తిరిగి వచ్చేవరకు నీ గుర్రం యిక్కడే పచ్చిక మేస్తూ, సురక్షితంగా వుండగలదు. పోయేటప్పుడు వెంట తీసుకుపోవచ్చు. ఈకొండకు తూర్పుగా బయలు దేరు. నువ్వు శక్తినగరం చేరిన తరువాత, నువ్విప్పుడు తాగిన పాల యొక్క శక్తి క్షీణించిపోతుందన్న విషయం మరచిపోకు."

అని యోగిని విజయకుమారుకి చెప్పవలసిన విధం చెప్పగా అతడామె చేసిన మహోపకారానికి కృతజ్ఞతతో నమస్కరించి ప్రయాణమై వెళ్ళబోతున్న విజయకుమారుని పిలకించి—

"వత్సా! ఈమాటకూడా విను—నువ్వింతదూరం యీ రాజ చిహ్నాలతో ప్రయాణం చెయ్యడం, క్షేమకరం కాదు—నీదుస్తులను, ఆభరణాలనూ తీసి మూటకట్టుకో—నేనిచ్చిన నారబట్టలు కట్టుకుని ఒక బైరాగిగా వెళ్లు—"

అని బాలయోగిని. అతని కొక జత నారబట్టల నిచ్చింది. అత నామె చెప్పిన విధంగా వాటిని ధరించి, తన మానుపటి విలువగల వస్త్రాభరణాలను మూటగా కట్టుకొని, చంకలో పెట్టుకుని వెంటనే కొండకు తూర్పుదిక్కుగా, పాదచారియై బయలుదేరాడు. బయలు దేరింది మొదలు అతనిలో ఏదో మహాశక్తి ప్రవేశించి, ఆమడలు, యోజనములు, అతన్ని గాలిలో విసిరేస్తున్నట్లు చేసింది. నడకవల్ల బడలికగాని—ఆకలిదప్పుల బాధగాని అతని కేమీ కనుపించడంలేదు. రాత్రి కావడము—తిరిగి తెల్లవారడము మాత్రమే అతనికి కనుపిస్తున్నది. దివారాత్రుల తారతమ్యమే మరచి, కొండలు, నదులు, అడవులు, పల్లెలు, పట్నములు దాటి, ఎన్ని యోజనాలు జరిగాడో అతనికే తెలియడంలేదు.

ఒక అరణ్యమధ్య మార్గము ననుసరించి వెడుతుండగా విజయ కుమారుని కాళ్లొకపల్లములో దిగబడ్డాయి—పైకి మామూలు నేల

గానేవుండి, గడ్డితోనూ, ఎండుటాకులతోను కప్పబడి, ప్రక్క నేలతో సరిసమంగా కలిసివుండి. తీరా అడుగు పెట్టేటప్పటికి ఆ నేల లోతుగా దించుకుపోయింది. విజయకుమారుడా కలిగిన ఘోరవిపత్తుకు బేజారయినాడు. పాతాళలోకంలో కొంతదూరం దిగబడ్డా, అతని పాదాలకు నేల తగడంలేదు. పైకిరావడానికాధారం లేదు—కింద భూమిలేదు, తిరిగి ఏదో విపత్తే తన్నావరించిందని తెలుసుకున్నాడు. లోతుకుపోయి పోయి, కొన్ని ఆముడలు గడిచిన తరువాత అప్పుడతని పాదాలకు నేలతగిలింది. కీడులో అదొక మేలనుకొని, నాలుగు వైపులా పరిశీలించిచూచాడు. గాలివెలుతురు మామూలుగానే వున్నాయి—అది ఒక సొరంగమార్గమై వుంటుందని తెలుసుకున్నాడు. కాని ఆ మార్గ మతన్నెక్కడికి తీసుకొనిపోతుందో తెలీదు. ఏమయినా అటుపోవడం తప్ప, వేరు దారేముంది.

మెల్లిగా కొంతదూరం ఆసొరంగ మార్గంగుండా నడకను సాగించిన తరువాత ఒక రాక్షసిలాంటి మోటుమునిషి అతని కెదురు పడ్డాడు. విజయకుమారుని చూడగానే, ఆమోటుమనిషి, అపరిమిత మైనసంతోషంతో—"ఆఁ! వొచ్చావా! రా! నీకోసమే చూస్తున్నాం" అని చెయ్యి పట్టుకున్నాడు.

తనుచూడగానే అతని కానందమెందుకో—అతను చెడ్డ వాడో—మంచివాడో—విజయకుమారు కేమీ తెలియలేదు.

"నా కోసమెందుకూ? నే నెవర్నీ?"

అని విజయకుమారు డడగ్గా—

"నీసంగతంతా తెలుసు-నీతోనే మాకు చాలా పనుందరా-"

అని ఆమోటుమనిషి విజయకుమారుణ్ణి ఎక్కడికో లాగుతున్నాడు.

"నువ్వు తీసుకెళ్ళిన చోటుకు తప్పకుండా వస్తాను. నావల్ల కాగల పనంతా చేస్తాను—అయితే నువ్వెవరివో—ఈ సొరంగ మార్గ మేమిటో—నేను నడుస్తూ నడుస్తూ—ఇలా కిందికెందుకు దించుకు పోయానో—ముందుగా చెప్పాలి."

"చెప్పకపోతే రావన్నమాట?"

అని ఆమోటుమనిషి, వికటంగా నవ్వాడు. అత నడిగిందానికి విజయకుమారేమీ జవాబు చెప్పలేదు.

"ఓ పిచ్చిసన్యాసీ! కిక్కురు మనకుండా నాతోరా! అంతా

నీకే తెలుస్తుంది.''

అని ఆమోటుమనిషి విజయకుమారుని తనతో లాక్కు పోయాడు. ఆ సారంగ మార్గంగుండా ఒక ఆమడదూరం నడిచిన తరువాత, ఒక విశాలమైన బయలు కనుపించింది. అక్కడ అదే జాతి మనుషులు సుమారు రొక వందమంది గుమిగూడి, పాటలు పాడు కుంటూ, భజలుచేస్తున్నారు. మధ్యమధ్య మధువుతాగి మత్తెక్కి ఒకళ్ళమీద ఒకళ్లు పడుతున్నారు. వారికి మధ్యంలో ఒక కాళికా విగ్రహం, వేపతోరణాలతోనూ, పసుపుకుంకాలతోనూ మనిషి పుర్రెలతోను అలంకరించబడివుంది.

''ఇప్పుడయినా తెలిసిందా, నువ్వు మాకెందుకు పనికొస్తావో అని, సాధువువేషంలో వున్న విజయకుమారు నడిగాడు అతన్నక్క డకు తీసుకొచ్చిన మొరటి మోటుమనిషి. విజయకుమారు గుండెలు ఝల్లుమన్నాయి. వారందరూ అడవిజాతి మనుషులనీ, మృగాలవంటి వారనీ అతని కర్థమైంది.

''ఒరేయ్! మీ పాటలు పాడుగానూ! రండర్రా! రండి! దొర కలేదనకండి—బలికి బలేపడుచువాడు దొరికాడు.'' అని విజయ కుమారు నక్కడకు తెచ్చినవాడు, మిగిలిన తనవారిని హెచ్చరించగా, వారంతరూ బిలబిలవచ్చి చుట్టూ మూగారు.

''ఈవేళ ఆఖర్రోజు—అమ్మవారి కాహారంలేకుండానే— జాతరై పోతుందనుకున్నాం—ఊఁ! చూస్తారేం? త్వరగా సిద్ధంచేసి, తీసుకురండి.''

అని వారిలో నాయకుడిలా వున్న ఒక భయంకరమైన వ్యక్తి తనవారిని హెచ్చరించిన మీదట, కొందరు, విజయకుమారుణ్ణి తీసు కెళ్ళి, అతని మెడలోకూడా వేపతోరణాలు తగిలించి, ముఖాన పసుపు కుంకాలద్ది అమ్మవారి కెదురుగా తీసుకెళ్లి నిలిపారు.

విజయకుమారుడి కప్పుడు సర్వమూ అర్థమైంది. చింతామణి వంటి ఒక క్షుద్ర స్త్రీ చేతిలోపడి చావడంకంటే—లోకు మాతయైన ఆ మహాతల్లికి ఉపకారం కావడమే జీవితానికి పరమావధి అని అత డప్పుడు తనలోతాను తృప్తిపడంతప్ప, యింకేమీ చెయ్యలేక పోయాడు. ఆ యాటవికులంతరూ, అమ్మవారిచుట్టూ, అతనిచుట్టూ పాటలు పాడుతూ కొంతసేపు తిరిగారు. తరువాత వారికి నాయకు

డయిన వాడొక కత్తినెత్తి విజయకుమారుకెదురుగా నిలుచున్నాడు.

తన కవి తుదిఘడియలనుకొని, విజయకుమారుడాజగదంబనే మనసులో తలచుకుంటూ, ప్రశాంతచిత్తంతో సంసిద్ధుడై నిలుచున్నాడు.

ఇంతలో వారిలో ఒకడు—

"ఆగండాగండి—సాధువు చంకలో యేదోమూటుంది—"

అంటూ విజయకుమారుని చంకలోవున్న మూటను కింద పడగొట్టాడు. అందులో వున్న అతని అమూల్యములయిన వస్తువు—ఆభరణాలు—బయటపడ్డాయి.

"ఇసీ! వీడు దొంగ సాధువులా వున్నాడర్రా! బలికి పనికిరాడు" అని వారి నాయకుడనగా—

"సంగతేవిటో సర్గా కనుక్కోండి—సాధువు గాకపోతే సత్యం చెడిపోతుంది."

అని మరియొకడన్నాడు.

"ఏవయ్యా సాధువూ! నిజంచెప్పు. నువ్వు దొంగ సాదువా? మంచిసాధువా! మంచిసాధువయితేగాని, మా బలికి పనికిరాదు. నియమం తప్పడిపోతుంది. నువ్వు దొంగ సాధువ్వగాకపోతే, నీదగ్గిర దొరవేష మెందుకుందీ?"

అని నాయకు డడిగినదానికి—

"అయ్యా! మీా అమ్మవారి సాక్షిగా నిజం చెబుతున్నాను. నేను నాగపుర యువరాజును, నా పేరు విజయకుమారుడు, నేనొక ముఖ్యమైన పనిమీాద సర్పినగరంపోతూ, మార్గంలో యీ ప్రమాదానికి గురిఅయ్యాను."

అని విజయకుమారుడు బదులుచెప్పగా—

"మరయితే, యీ సాధువు వేషంలో యెందుకున్నావ్?"

అని నాయకుడు తిరిగి ప్రశ్నించాడు.

"నాయదార్థ వస్తులతో ఒంటరిగా ప్రయాణం చెయ్యడం క్షేమకరంకాదని, మాల్యవంత పర్వతంపై వుండే ఒక యోగిని, నాకీ నాంగుడ్డలిచ్చింది, కావాలంటే, మీారక్కడికి పోయి ఆమె నడగొచ్చు."

అని విజయకుమారుడు తన యదార్థ స్వవిషయమును చెప్పాడు.

"నిజం—నిజమే—ఆ యోగిని మాకు తెల్సు—"

అక్కడి వారంతరూ ఏకగొంతుకతో అరిచారు.

"మహారాజా!—నిజం చెప్పి మాకు మేలు చేశావు-లేకుంటే మా నియమం చెడిపోయేది—మాకు మేలు చేసిన నీకేం కావాలో అడుగు."

అని నాయకుడు సాదరంగానే అడిగాడు.

"అయ్యా! నాకేమీ అవసరం లేదు. దయచేసి, నర్తి నగరానికి మార్గమేదో కొంచం చెప్పండి."

అని విజయకుమారు డడగ్గా—

"ఒరేయ్! కొండా! ఈ రాజును తీసుకుపోయి—ధవళగిరి మొదల్లో దిగవిడిచిరా—"

అని నాయకుడు చెప్పినప్రకారం, విజయకుమారు నక్కడికి తెచ్చిన మొదటిమనిషి, అతన్ని తిరిగి వెంటపెట్టుకొని బయలు దేరాడు. అది వారు మొదటవచ్చిన సొరంగమార్గం గాక, మామూలు భూప్రదేశమే అయివుంది.

"ఆ ధవళగిరి యిక్కడికేమాత్రం దూరముంటుంది నాయనా!" అని విజయకుమారు డడగ్గా—

"దూరాలూ గిట్రా నాకు తెలవ్వు—కూడారా—అదే తెలుస్తుంది."

అని కొండడనే ఆమోటుమనిషి విజయకుమారుని వెంటబెట్టుకుని, అనేకములయిన మళుపులు-మాగాణులూ, దాటించి, కొండలు మెట్టలు దాటించి, అయిదురోజుల కొక ఎత్తయిన పర్వతం దగ్గిర దిగవిడిచి—

"ఇదే ధవళగిరి—దీన్ని దాటావంటే—నర్తి నగరం కను చూపుల కందుతూ వుంటుంది."

అని చెప్పి, తిరిగి తనదారిని తాను వెళ్లిపోయాడు. కాని అంత యెత్తయిన పర్వతమును దాటడమెలా? విజయకుమారు తన ప్రయాణ మంతిలోనూ అంత యెత్తయిన పర్వతము నంతకుముం దెక్కడా చూడలేదు. చెయ్యవలసిం దేమిటా అని తనలో తాను తర్కించు కొంటూ, చాలాసేపక్కడే నిలుచుండి పోయాడు. కొండను దాటగల మార్గమేదీ కనుపించడం లేదు.

"సాధనమున పనులు సమకూరుధరలోన"

అన్న పెద్దలవాక్యమప్పుడు జ్ఞాపకమొచ్చిందతకిని. చీమలాగ మెల్లిగా కొండ కెగబాకడం మొదలుపెట్టాడు. పట్టులేదు—ఆధారం లేదు. కాలిబొటనవ్రేళ్ళతో క్రిందిభాగాన్ని బలంగా అదిమి పట్టు కుంటూ, చేతివుణమలతో పైభాగాని కెగబ్రాకుతూ—ఎలాగయితే నేం భగీరథప్రయత్నంమీద, మొత్తమెత్తుగా మూడోవంతు ఎక్కగలిగాడు. అక్కడ కొండ కెడమతట్టున పర్వతం బ్రద్దలైన పగుళ్ళక్కడ కనుపించాయి. ఆపగుళ్ళ సందుల్లో కాలివ్రేళ్ళిరికించి నడవగా, పర్వతాన్ని చుట్టే, అడ్డదారొక టేర్పడింది. ఆదారంట పోగాపోగా, పర్వతమంతా యెక్క నవసరంలేకుండానే, వెనుకతట్టు కొచ్చేశాడు. బ్రతుకుజీవుడా అనుకొని, అక్కడ వెల్లికిలపడుకుని, సునాయాసంగా కిందికి దిగజారిపోయాడు.

అక్కడికి కనుచూపుమేరలో—సౌధోపరిభాగాలూ—కోట బురుజులూ—ఆలయధ్వజస్తంభమూ—మొదలయిన నగరచిహ్నాలు గోచర మయినాయి. చింతామణియొక్క మొదటిప్రశ్నకు అర్థం చెప్పగల నర్తి నగర మదేనని, రెట్టించిన ఉత్సాహంతో ముందుకు సాగిపోయాడు విజయకుమారు.

## ౧౪

అది, చెప్పుకోదగ్గ మహానగరమైనమాట నిజం—ఏగృహం చూసినా రాజభవనంలాగేవుంది—ఏభవనం చూసినా కోటలాగే వుంది. అప్పుడిక ఆ నగరపురాజు నివసించే కోట ఎలావుంటుందా అని? ప్రటలే అంత శ్రీమంతులయితే, ప్రభువింక కుబేరుడై వుండాలి కదా! ఆనగర సౌభాగ్యమే సౌభాగ్యము—ఆ ప్రజలసుఖమే సుఖము!

విజయకుమారు తన కగుపించిన ఆయా విలాసమందిరాలు తిలకించుకుంటూ, అందందుగల వైభవాలు, విచిత్రాలూ గమనిస్తూ, విశాలమై, రమణీయంగా వున్న రాజవీధిగుండా సాగిపోతున్నాడు. అయితే అక్కడ తన ప్రశ్నలకు జవాబులు చెప్పేవారెవరు? ఎవరి నడగాలి? ఎక్కడ రాసివుంటుంది? ప్రతియింటినీ—ప్రతిగోడనూ బహు జాగ్రత్తగా పరిశీలించుకుంటూ వెడుతున్న సమయాన, నలుగురు రక్షకభటులు పరుగు పరుగునవచ్చి, విజయకుమారుని బంధించారు, అతడు విభ్రాంతుడయ్యాడు.

"నేను దొంగతనం చెయ్యలేదు—దొరతనం చెయ్యలేదు: ఎవర్నిగాని మోసం చెయ్యలేదు. నన్నెందుకూ బంధించారు?"

అని భయకంపితుడై విజయకుమారు డడిగిన దానికా రక్షక భటులు మహోగ్రులై.

"తిరిగి జవాబుకూడానా? నోరు మెదిపావంటే తలబ్రద్ద లౌతుంది. కిక్కురుమనకుండానడు." అన్నారు.

"అయ్యా! మీరెక్కడికి తీసుకుపోతే అక్కడికే వస్తాను— మీ రేశిక్ష విధిస్తే, దానినే అనుభవిస్తాను. కాని నేను చేసిన అపరాధ మేమిటో దయచేసి చెప్పండి."

అని విజయకుమారు తిరిగి సవినయంగా అడిగినందువల్ల—

"నువ్వు బైరాగివి కావడమే మొదటినేరం, ఈనగరం ప్రవే శించడం రెండో నేరం. ఈసాధువు, ఏబైరాగి, కనుపించినా పట్టి ఖయి దులో వేయవలసిందని రాజాజ్ఞ." అని రక్షకభటులు చెప్పారు.

"అయ్యా! ఈనగరం పేరేమిటి? మీరాజుగా రెవరు?"

అని విజయకుమారుడు ప్రశ్నించగా—

"ఇది నర్మిసగరము—దీనిని పాలించే మహారాజులు విక్రమ దేవులు." అని, విజయకుమారు డడిగిన దానిని ఒక రక్షభటుడు వివ రించి చెప్పాడు.

"మంచిది. కాని నేను నిజమయిన బైరాగిని కాను—సాధువు నంతకంటే కాదు. కారణాంతరమున యీ వేషంలో వున్నాను."

అని విజయకుమారు డన్న దానికి రక్షకభటులు మరింతకోపించి—

"శిక్ష తప్పించుకోడానికి ఉపాయ మాలోచించావన్నమాట! ఆపప్పులు మాదగ్గర ఉడకవు. నిన్ను వచ్చినా వొదిలిపెట్టము. నువ్వు నిజమైన బైరాగి వవునో కాదో—మా మహారాజులు విచారణ చేస్తారు—ముం దక్కడకునడు."

అని ఆ రక్షకభటులు విజయకుమారుని రాజసదనానికి గొని పోయారు.

"అయ్యో భగవంతుడా! నాబ్రతుకు అడుగడుక్కీ గండమే అయింది. నిముష నిముషానికీ ప్రాణాపాయమే కలుగుతూంది. ఏం చెయ్యను? ఒక రాజ్యానికి యువరాజునై వుండి—ఈ రాజ్యంలో బందీగా కట్టుబడివున్న నాగ్రహచారాన్ని ఏమనుకోవాలి?"

అని తనలో తాను, కలిగిన దుస్థితిని గురించి విచారపడుతూ, చెయ్యగలిగిందేమీ లేక, విజయకుమారుడు రక్షకభటుల ననుసరించి వెళ్లాడు. వారతన్ని అనేక వీధులు, బజారులూ, ఆలయములు, దేవాలయములూ దాటించి, రాజసౌధానికి చేర్చారు. విలువగల వింత వస్తువులతోనూ, రాజోచితమైన సాధన సామగ్రితోనూ, అతిరమణీయంగా అమర్చబడివున్న ఆ దివ్యసౌధంలోని ఒక ప్రత్యేక మందిర ద్వారం దగ్గర నిలిపారు.

అప్పుడొక రక్షకభటుడు ఆ చేరువలోనే వున్న రాజమందిరానికి వెళ్లి తిరిగివచ్చి—

"మహారాజులు గుస్తులు ధరిస్తున్నారు—ఇప్పుడే వస్తారు."

అని మిగిలిన రక్షకభటులతో చెప్పడమునుబట్టి, తాను నిలుపబడిన స్థలము ప్రత్యేకము నేరస్థులను విచారించడానికి ఏర్పరుపబడివుంటుందని విజయకుమారుడూహించుకుని, తానున్నూ, రక్షకభటులతోపాటు రాజుగారి రాకకై వేచివున్నాడు.

మరికొంచంసేపట్లో ఒక కోట పరిచారకుడు పరుగెనవచ్చి—

"ప్రభువులు వేంచేస్తున్నారు." అన్న వార్తను రక్షకభటులకందించి వెళ్లిపోయాడు. రక్షకభటులు వెంటనే బద్ధహస్తులై నిలుచుని, మహారాజులు రావలసిన మార్గంవైపు చూస్తున్నారు.

చేతితో వాడికిన ఒక నూలు పంచాయిని ధరించి, అదేమాదిరి ఒక అంగరఖాను తొడిగి, నడుమున మాత్రి మొకెరవాలం వ్రేలాడుతుండగా, సుమారు నలభై సంవత్సరాల నడివయస్సు కలిగి బంగారుచాయతో మిలమిల మెరిసే ఒక రూపసి, చరచర నడచివచ్చాడు. రక్షకభటులు వెంటనే భయభక్తులతో వొంగి ఆయనకు నమస్కరించారు. అంత నిరాడంబరంతో వున్న వ్యక్తి మహారాజంటే ఎవరూ నమ్మలేరు. ఆతని యెడల రక్షకభటులు కనపరచే వినయవిధేయతలనుబట్టి, ఆ నర్షినగరాధీశు డతనే అయివుంటాడని వూహించుకుని, తదుపరి విజయకుమారుడున్నూ ఆ ప్రభువుకు నమస్కరించి నిలుచున్నాడు. అనంతరం మా ప్రభువు ఉచితాసనంపై కూర్చున్న తరువాత, ఒక రక్షకభటుడు రెండడుగులు ముందరకొచ్చి నిలిచి—

"ప్రభూ! ఈ బైరాగి యెవరో, మాకీదినం నగరవీధుల్లో కనుపించాడు. నియమానుసారం ఇతన్ని బంధించి, ఖయిదులో వెయ్యవలసిందే! కాని. మేమందరూ సంసిద్ధులమైవుండగా, తాను నిజమైన బైరాగి కాడనీ—కారణాంతరం వల్ల ఈ సాధువు వేషంలో వున్నాడనీ మొరపెట్టుకున్నాడు. విచారణకై తమసన్నిధికి తెచ్చాము."

అని సవినయంగా మహారాజుకు మనవి చేశాడు.

ప్రభువు విక్రమదేవు విజయకుమారుని వైపొకసారి పరిశీలనగా చూచి—

"ఇతని చంకలో ఏమిటో వుంది—చూచారా?"

అని భటుల నడగ్గా, వారు భయభక్తులతో, విజయకుమారుని చంకలో వున్న మూట నివతలకు లాగి, విడదీసి రాజసన్నిధిని పెట్టారు. మూటలో వున్న రాజోచితమైన దుస్తులు—ఆమూల్యాలంకరణాలు తిలకించి, విక్రమదేవు డాశ్చర్యపడ్డాడు.

"వీటి నెక్కడయినా అపహరించి తెచ్చావా?"

అని విక్రమదేవు తీవ్రంగా అడిగినదానికి విజయకుమారు డుద్రేకుడై —

"లేదు ప్రభూ! ఆబుద్ధి మా శిసునాగవంశానికే లేదు." అన్నాడు.

"ఆఁ! మీది, శిసునాగవంశమా? ఏవ్వూరు? నీపేరేమిటి?"

"నాగపురాధీశుడు, ఛత్రపాలుడు నాకు తండ్రి. రమాదేవి నాతల్లి. నాపేరు విజయకుమారు."

"ఛత్రపాలుడా? నాగపురమా! ఇక్కడికి బహుయోజనాల దూరముందే? ఎలా రాగలిగావు? ఎందుకొచ్చావు?"

"ప్రభూ! ఒక అపూర్వమైన కథను పురస్కరించుకొని, నే నిక్కడికి రావలసివచ్చింది. కుండినసగరాన్ని కీర్తికాముడనే మహారాజు పరిపాలిస్తున్నాడు. అతనికి చింతామణి ఏకైక పుత్రిక ఆమెకు ఒక బాలమహర్షి గురువు. ఆమె, గురువుపయందుండే భక్తి విశ్వాసములవల్ల, ఆయన చెప్పిన ఐదు ప్రశ్నలకు ఏ రాజకుమారుడు బదులు చెప్పగలడో, ఆ రాజకుమారునే వివాహమాడతాననీ అట్లు చెప్పలేని వాని శిరస్సును ఖండించి భవన ముఖద్వారానికి కటిస్తాననీ వ్రతము

పూనింది. ఎందరెందరో రాజకుమారులు వచ్చి ఆమె ప్రశ్నలకు జవాబులు చెప్పలేక ఆమెచేత ఖండించబడ్డారు. అట్లు ఖండించబడిన వారిలో, నాపినతండ్రి కేకైక పుత్రుడు, నాసోదరుడొకడు. ఇప్పటికి ఒకరు తక్కువగా వెయ్యిమంది రాజకుమారులు ఆ సౌందర్యవతిని వివాహమాడగోరివచ్చి, ఆమె అడిగిన ప్రశ్నల కర్థం చెప్పలేక, హతులైపోయారు. నేనీ ఘోరహింసాకాండను తెలుసుకొని, సహించలేకపోయాను. రాజలోకానికి జరుగుతున్న అపచారాన్ని అరికట్ట సంకల్పించాను. చింతామణి ప్రశ్నలకు జవాబులు తెలుసుకొని ఆమె యొక్క, ఆమెకు గురువైన కాలమహర్షి యొక్క గర్వమణిగించడానికి కంకణం కట్టుకున్నాను. అదే ప్రయత్నంమీద, మా నాగపురంనుంచి బయలుదేరి అతిప్రయాసమీద కుండిననగరం చేరాను. ఆ రాజకుమారి చింతామణి చెలికత్తె సహాయంవల్ల యుక్తిగా ప్రశ్నలనయిదింటనేగాక, వాటికి జవాబులు బడయగల మార్గం కూడా తెలుసుకోగలిగాను. ఒకటి, హర్షిణనగరము; రెండు, మహోననగరము; మూడు, శ్రీమనగరము; నాలుగు, హాలనగరము; ఐదు, యశానగరము — వరుసగా ఈ ఐదు నగరాల్లోనూ, ఐదు ప్రశ్నలకు జవాబులు లభ్యం కాగలవని సూచన దొరికింది. అనేక కష్టనష్టాలకు సహించుకుని, నిద్రాహారాలు మాని, ప్రాణానికి సయితం తెగించి, వందలాది యోజనాలు ప్రయాణం సాగించాను. కాని, యీ హర్షిణనగరానికి మార్గం గాని, దీని ఉనికిగాని నాకెక్కడా తెలియలేదు. కొనకు మాల్యవంత పర్వతంపై వుండే ఒక యోగి అనుగ్రహంవల్ల, ఈపట్నం చేరగల మార్గమును, శక్తిని సంపాదించాను. యువరాజు వేషంతో ప్రయాణాలు సాగించడం క్షేమకరం కాదని— వైరాగివేషంతో వెళ్ళిన మంచిదని చెప్పి, ఆ యోగినే, నాకీ కాషాయవస్త్రాలు ప్రసాదించడంచేత, నేను నాస్వంత దుస్తులను మూటకట్టుకుని, వైరాగి వేషంతో రాత్రింబగలు ప్రయాణాలు సాగించి, ఎలాగైతేనేం, భగవంతుని దయవల్ల మొదటి నగరమైన యీ హర్షిణపురం చేరాను. ఇక్కడ, మొదటి ప్రశ్నకు జవాబెలా తెలుస్తుందా అని, యోచన చేస్తూ, రాజవీధంట నడుస్తుండగా, మీ రక్షకభటులు నన్ను అకారణంగా బంధించి యిక్కడకు చేర్చారు. ప్రభూ! నానిజవృత్తాంతమిది! ఆపైన మీరేమి చేసినా చెల్లుతుంది.”

అని విజయకుమారుడు తన విషయములన్నింటినీ క్లుప్తీకరించి చెప్పగా, విక్రమదేవు ప్రశాంతంగా విని—

"ఇతని నిప్పుడు బధించవలసింది లేదు—మీరు వెళ్ళండి."

అని రక్షకభటులను పంపి—విజయకుమారుని సరసను కూర్చో నియమించి—

"నువ్వు చెప్పినదాని మహా విచిత్రమైన గాథలాతో స్తున్నది. చింతామణి అడిగేవి అయిదు ప్రశ్నలు—అందులో నాలుగింటి ప్రశ్నకు మానకరమైన జవాబు దొరకనై వుండడం—ఇది మరీ విడ్డూరంగా వుంది. అయినా ఆ ప్రశ్నలేమిటో తెలుసుకుందాము—వివరించు."

అని విక్రమదేవు సాదరంగా అడిగిన మీదట, విజయకుమారు, వాటి నీవిధంగా వివరించాడు.—

"ప్రభూ! చింతామణికీ, గురువైన మహర్షి చెప్పినవీ ఆ రాచకన్య తన్ను వివాహమాడగోరి వచ్చిన, ప్రతిరాజకుమారుణ్ణి ప్రశ్నించేవి—ఎవ్వరూ బదులు చెప్పలేనివీ, అయిన, అయిదుప్రశ్నలు ఇవి, చిత్తగించండి.

1. ప్రతిజ్ఞ నెరవేర తేకాని, పెళ్లి చేసుకోనని భీష్మించుకున్న ఆ రాజకుమారుడెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అతనింకా జీవించి వున్నాడా?

2. పురుషుడై వుండీస్నీ స్త్రీరూపంతో మహర్షిని మోసంచేసి, అతనిదగ్గరుండే మంత్రశూలము నపహరించి, అతనినికొట్టి తరిమివేసిన ఆయువకుడెవరు? అతనింకా బ్రతికివున్నాడా? మృతుడైనాడా?

3. తపోధనమహారాజు ద్వితీయభార్య అయిన రూపసుందరి గతియేమయినది? ఆ తపోధన మహారాజింకా బ్రతికివున్నాడా?

4. ప్రేమించిన వానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ స్త్రీ అయివుండీస్నీ పురుషవేషమును ధరించి, మహర్షిచే శాపించబడిన ఆయిరువురు కాంతలనూ అపహరించి, మహర్షిని ఖండింపబూనిన అధీరురాలెవరు? ఇప్పుడామె జీవించివున్నదా? మృతి నొందినదా?

5. శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన ఆ భక్తురాలిని మహర్షి శాపించిన కారణంవల్ల, ఆయిరువురనూ కారాగృహ

మున బాధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే దత్తాత్రేయ మహారాజింకా బ్రతికివున్నాడా? భర్తృహరా లెట్లున్నది?

మహారాజా! ఇవే నేను జవాబులు తెలుసుకోగోరిన అయిదు ప్రశ్నలు—"

అని విజయకుమారుడు చెప్పినదానిని వినేటప్పటికి, విక్రమ దేవునిముఖ మెఱ్ఱగా రక్తపుకుండలాగ తేపురించింది. అతని కళ్ళంట నిప్పులు వర్షిస్తున్నట్లుంది—పట్టలేని మహోద్రేకంతో పళ్లు పటపట కొరుకుతూ, ఒరనుంచి కత్తినిదూసి—

"ఓరీ! కపటబైరాగీ! నిన్ను ఖండ ఖండలుగా చెయ్యనిదే నేను నిద్రపోను. వంచకుడవై, నారాజ్యమున చేసిన మోసములు చాలక, యింకా ఎక్కడో దాగివుండి—అమాయకురాలైన ఆరాజ కుమార్తె ఎవర్నో మధ్యపెట్టి, ఆమె విశ్వాసానికి పాత్రుడవై—ఆమెద్వారా యీ ప్రశ్నల్లి—నా వివరాలు తెలుసుకోవడం—తిరిగి యిక్కడికి రావాలనా? ఇంతవరకూ నీ రాకకోసమే నేనూ వేచి వున్నాను—నీకంఠరక్తం నా కళ్లారాచూసినప్పుడు గాని ప్రతిజ్ఞ నెర వేరదు—స్వర్గధామునిలోని—నా సోదరి ఆత్మకు శాంతిలేదు!"

అని పట్టలేని ఆవేశంతో భయంకర గర్జనలు చేస్తున్న విక్రమ దేవుని కన్నెత్తి చూడ సాహసించలేక పోతున్నాడు విజయకుమారు. వంచినతలను పైకెత్తకుండానే—

"ప్రభూ! తమకింత ఆవేశకారణమైన కార్యమును నేనేం చేశాను? అపరాధమునంటే క్షమించవలె!" అని ప్రార్థించాడు.

"విజయకుమారా! నువ్వు చేసిన అపరాధంకాదు—నీపై ఆగ్రహం ఏమాత్రమన్నా లేదు. రాజకన్యకి ప్రశ్నలు చెప్పిన బైరాగి మహావంచకుడు—దుర్మార్గుడు. వాడు నారాజ్యంలో చెయ్యరాని పనులు చేశాడు—వాడప్పుడే నా కళ్ళబడివుంటే చిత్రవధ చేసి వుందును. కాని వాడు నా చేతినుంచి తప్పించుకుని యెలాగో పారి పోయాడు. బాలసుబ్రహ్మణ్యశర్మ అనే పేరుతో ప్రచ్ఛన్నంగా వుంటూ—నా వివరాలు తెలుసుకోడానికే యీ పన్నాగమంతా పన్నాడు. దానికిసంబంధించిన కథ యీపూటవత్తు చెబుతేగాని నీకర్థంకాదు. నీ మొదటి ప్రశ్నకు జవాబు ఈ కథకు సంబంధించిందే—కనుక సావకాశంగా విను."

అని విక్రమదేవు కొంత ప్రశాంతతను చేకూర్చుకుని విజయ కుమారున కీ విధంగా చెప్పడం మొదలుపెట్టాడు—

"ఇప్పటికి సుమారు యిరవై యేళ్ళక్రితం జరిగిం దీఘోర విషాదకర సంఘటన. దానినే నీకిప్పుడు చెబుతున్నాను.

ఈ మహానగరానికి పరాక్రమదేవులు ప్రభువులుగా వుంటూ అరవైయ్యేళ్లు లక్షణంగా రాజ్యపరిపాలన చేసి, దివంగతులయినారు. ఆయనకు నేనున్నా. నాసోదరి అంబాలిక, తప్ప వేరే సంతానంలేదు. మాతల్లిగారు మానాయనగారికంటే అయిదు సంవత్సరాలు ముందు గానే గతించారు. మా తండ్రిగారయిన పరాక్రమదేవులు గతించే టప్పటికి నా కిరువది రెండేళ్లు నాచెల్లెలు అంబాలికకు పదహారేళ్లు.

అంబాలికకు మానాయనగారు జీవించివుండగానే వివాహం జరుగవలసింది. కాని ఆకన్యకు మనసు కెక్కినవరుడు లభ్యంకానందు వల్ల, అప్పట్లో ఆ కార్యం నెరవేరలేదు. మా తండ్రిగారు చనిపోయే ఆఖరు ఘడియలవరకూ వరాన్వేషణం జరుగుతూనేవుంది. కాని కళ్యాణం తోసుకురానప్పుడు, ఎన్ని ప్రయత్నాలు చేస్తేమాత్రం ఏం ప్రయోజనం? అందువల్ల మా చెల్లికి వివాహం కాకుండానే మా నాయనగారు పోయారు. వారు పోతూ కూడా ఈ జిజ్ఞాసనే మనసులో పెట్టుకొన్నారు. ఇక కాస్సేపటికోకో కాస్సేపటి ప్రాణం పోతుందనగా, వారు నన్ను పిలిచి—

"నాయనా! నేను బ్రతికుండగా దానికి పెళ్ళి చెయ్యలేక పోయాను. నా అనంతరమైనా, దాని మనస్సుకు నచ్చిన వరుణ్ణి యెంచి తెచ్చి, దానికి పెళ్ళి చెయ్యవలసిన భారం నీపైనవుంది." అని చెప్పి. ప్రాణాలు వొదలిపెట్టారు. వారు చెప్పినా చెప్పకపోయినా, ఆకళ్యాణభారం నాపై నేవుంది.

అది లగాయితు రెండు సంవత్సరాలు బ్రహ్మప్రయత్నం చేశాను. వేలాదిగా వరులాకాలంలో తటస్థమయినారు కాని, మా చెల్లి రూపసంపదకు సరిసమానమైన వరుడు లభ్యంకాలేదు. నువ్వు అతిశయోక్తి అని యెంచకుండావుంటే, మాఅంబిక, సౌందర్యం ఏ దేవతా కన్యకకూ వుండదని చెప్పాలి.

మా నాయనగారు బ్రతికున్నప్పటినుంచీ, అనేక సంవత్స రాలుగా, 'నానాదేశ రాజకుమార కత్తిసాములపోటీ' ప్రతియేడూ

మానగరంలో జరుగుతుండేది. దానిని మా నాయనగారే, కొందరు సభ్యుల సహాయంతో ఏర్పాటు చేసేవారు. అది చాలా గొప్పగా జరిగేది. అనేక దేశాలనుంచి రాజకుమారులు వచ్చి ఆప్రదర్శనంలో పాల్గొనేవారు. రెండు చేతులతో రెండుకత్తులు, నాలుగుకత్తులు, ఎనిమిదికత్తులు, పదికత్తులవరకూ పట్టి, మహానిపుణతతో సాములు జరిగేవారు. రెండేసి కత్తులకు పోటీలు జరిగేవి—ఆ పోటీలలో నెగ్గిన వారికి సువర్ణపతకాలు, రజితపాత్రలు బహుమతులుగా ఈయబడేవి.

మా నాయనగారు పోయిన తరిమిలానుకూడా నేనా పోటీల ఆచారాన్ని మాన్పలేదు. వారున్నప్పుడు ఏవిధంగా, ఎంత ఘనంగా జరిగేవో—అదేప్రకారం వారు లేనప్పుడు కూడా జరుగుతుండేవి. తండ్రిగారు పోయిన మొదటి సంవత్సరంగాక, రెండోసంవత్సరం జరిగిన పోటీకి, సువర్ణద్వీపంనుంచి మహీపాలుడనే ఒక రాజకుమారుడు వచ్చాడు. భగవంతు డతన్ని ప్రత్యేకం, మా అంబాలికగురించే సృష్టించాడా అనిపించింది. ఆ సంవత్సరం పోటీలో కూడా అతనే మొదటి బహుమానం పొందాడు. సుమారు ఇరవైయేళ్ళ వయస్సు కలిగి అవతరించిన మన్మథునిలావున్న ఆరాజకుమారుణ్ణి, పోటీల అనంతరం, మాభవనంలో బసచేయించి, సంప్రదాయానుసారం, అతని చిత్రపటాన్ని మాచెల్లెలికి, ఆమె రూపపటమును అతనికి చూపించాను. అతన్ని వివాహమాడ్డానికి అంబాలిక అపరిమిత సంతోషంతో అంగీకరించింది. అతనుకూడా ఆసంవత్సరమే పట్టభద్రుడై సింహాసన మెక్కిన సర్వస్వతంత్రుడు కావడంవల్ల ఇంకెవరితోనూ సంప్రదించవలసిన అవసరంలేకుండా, మా అంబాలిక యొక్క గుణగతాలకు మెచ్చి, వివాహమాడ్డానికి సమ్మతించాడు.

రాజోద్యోగులు, రాజబంధువు లాదిగా సర్వజనులూ వారివి, అన్నివిధముల అనుకూలతగల ఆదర్శ దాంపత్యం కాగలదని వెయ్యినోళ్ల మెచ్చుకున్నారు. నాకిక కావలసిందేముంది? వెంటనే జ్యోతిష వేత్తలను రావించి, ముహూర్త నిశ్చయం చేయించాను. పదిహేను రోజుల గడువులో మంచి ముహూర్త దొరికింది. నాకు కావైవున్న బావమరిది మహీపాలుడున్నూ, దూరనగరాలలోవున్న తనయామ్మనంది బంధుజనాలకు, శుభలేఖల నంపించి, ఆత్మీయుల నందరినీ రావించాడు. నేనున్ను మాబంధుకోటి నందరనీ పిలిపించి, ఏర్పా

టులు మొదలుపెట్టాను. ఎన్ని లక్షలు ఖర్చయినా సరే—మా అంబాలిక పెళ్ళిని అతిఘనంగా చేయ సంకల్పిచాను.

నగరమంతటా పందిళ్లువేయించి, ఘనులయిన సంగీత విద్వాంసులను, నాట్యాచార్యులను, హరిదాసులను దేశదేశాలనుంచి పిలిపించాను. వధూవరులకు, బంధుజనాలకు ఉచితములయిన వస్త్రాలంకరణాలు అన్నిటినీ సిద్ధం చేయించాను. ఆనాటిరాత్రి ఏడుగంటలకు శుభముహూర్తముగా, అయిదుగంటలకు సర్వాభరణాంబరాలతో అలంకరించబడిన పెళ్లికూతురు, అంబాలిక, కొందరు చెలికత్తెలను వెంటబెట్టుకుని, మేనాలో కాళికాలయానికి పూజార్థమై బయలుదేరింది. అది సాంప్రదాయం సిద్ధమేగాకుండా, ప్రతినిత్యము అదేవేళ ఒకసారి కాళికాదేవిగుడికి వెళ్ళడము—అక్కడి అమ్మవారికి పూజలు సల్పిరావడము. అంబాలికకు అలవాటు.

అక్కడ రాజమందిరంలో అతి శోభాయమానంగా అలంకరించబడిన కళ్యాణమంటపం దగ్గర వివిధమంగళ వాయిద్యాలొక వైపున, దేవదాసీల నృత్యగీతాలింకొక వైపున, ముత్తయిదుల కోలాహలధ్వనులు వేరొక వైపున, చెలరేగుతుంటే—బంధుమిత్ర పరివార, సామంతవంధమాగధాదుల పరివారంతో మందిరమంతా కిటకిటలాడుతుండగా, శుభముహూర్తం సమీపించినందువల్ల పురోహితజనం విఘ్నేశ్వర పూజాది కార్యక్రమం ఉపక్రమించడానికి పెండ్లి కుమార్తెను రావించమన్నారు.

ఆలయంనుంచి ఆమె యింకా రాలేదని, బాధ్యతగల కొందరు రాజబంధుగు స్త్రీలన్నారు.

"ముహూర్తం మించిపోతుంది—కబురన్నా పంపండి—"

అని పురోహితులు తిరిగి హెచ్చరించారు. అప్పుడు పరిచారకులందరూ నలువయిపునా త్రొక్కుళ్లాడం మొదలుపెట్టారు. ఆరు దాటింది. పైన అరగంటకూడా అయింది. అప్పుడిక నేను కలుగజేసుకోవలసి వచ్చింది. ముఖ్యమైన ఉద్యోగులనే ఆమెను తక్షణం తీసుకురావలసిందని కాళికాలయానికి పరుగెత్తించాను.

కాళికాలయానికీ రాజమందిరానికి సుమారొక ఆమడ దూరముంది. మనుషులు పోయిరావడానికయినా అరగంటకు తక్కువ పట్టదు. అంత ముచ్చటపడి పెట్టించిన ముహూర్తం తప్పిపోతుందా

అని, నేను ఖంగారు పడ్డాను. సరిగా ఏడు కొట్టేటప్పటికి, ఆలయానికి పంపిన ఉద్యోగులు తెల్లముఖాలతో తిరిగివచ్చారు.

"ప్రభూ! అమ్మాయిగారు కాని, వారెక్కి వెళ్లిన బోయీలు కాని, మేనా కాని, చెలికత్తెలుగాని, మాకెక్కడా కనుపించలేదండి. అంతటా గాలించాము. చివరకు కాళికాలయానికి కూడా వెళ్లి దరియాప్తు చెయ్యగా—రాజసహోదరి, యీనాడు ఆలయానికి రానే లేదని చెప్పారు—"

అని తిరిగివచ్చిన ముఖ్యోద్యోగులు చెప్పేటప్పటికి నా గుండెలో రాయిపడింది. ఆ మహామాయ యేమిటో ఎవరికీ అర్థం కాలేదు. వరుడు, వరుని తాలూకుబంధుగులు, నాస్వజనం, ఈమాట వినేటప్పటికి ఎక్కడి వారక్కడ కొయ్యబారి, నిశ్చేష్టులై నిలుచున్నారు.

ఆమె వొంటిపైగల జవ్హేరీకాశపడి, ఏదుర్మార్గులయినా మోసం తలపెట్టారా అనుకుందామంటే అటువంటిది మారాజ్యాన ఎన్నడూ కనలేదు—వినలేదు. ఒకవేళ అలాజరిగినా, బోయలేమవుతారు, చెలికత్తె లేమవుతారు? మేనా యేమవుతుంది—ఏడు గంటలు దాటింది—కనకముహూర్త మెలాగా దాటిపోయినట్లే! ఎక్కడి వేడుకలక్కడ, ఎక్కడి మంగళ వాయిద్యాలక్కడ—ఎక్కడి నాట్యగానా లక్కడ, చప్పగా చల్లారిపోయాయి. ఎవరి ముఖానా కత్తివాటుకు నెత్తురుచుక్క లేకుండా పోయింది.

నేను వెంటనే సైన్యాధిపతిని పిలిపించి—

"సోదరి విషయంలో ఏదో మోసం జరిగివుంటుంది—నగరానికి చుట్టూ సైన్యాన్ని కాపుంచి—నువ్వు మరికొందరు యుద్ధభటులను వెంటబెట్టుకుని, నగరంలోని, ప్రతియిల్లు, ప్రతికుటీరము, ప్రతి సౌధము గాలించు. ఎదురుచెప్పిన వారినీ అనుమానం కలిగిన వారినీ తక్షణం బంధించు."

అని నేనాజ్ఞలు ఈయడమే తడువుగా సైన్యాధిపతి, సర్వ సేనలను ఆయత్తపరచి, నిమిషాలమీద పరుగులెత్తించాడు.—క్షణంలో నగరమంతా సైనిక కోలాహలాలతో నిండిపోయింది—నాకు మనస్సు మనస్సులో లేకుండా పోయింది. నాయనగారు చేయలేని పని నేను చెయ్యగలిగానని ఎంతో గర్వపడ్డాను. నాచెల్లికి కోరిన వరుడు లభ్యమైనాడని ఎంతయినా మురిసిపోయాను. కాని

నా మురిపెమింతలోనే ముక్కలైంది—నా గర్వాం గంగపాలయింది. పెండ్లికొడుకు స్థితిని తెలుసుకోడానికి కూడా నాకవకాశం లేక పోయింది.

కర్తవ్యం తెలీక—మతిచెడి—నెత్తిని చేతులెట్టుకుని, నేనొక మూల కూలబడివున్న సమయంలో, సుమారు తొమ్మిది గంటల రాత్రివేళ, అంబాలికను ఆలయానికి గొనిపోయిన నలుగురుబోయలు, నలుగురు చెలికత్తెలు, గోలుగోలున యేడుస్తూ, నా దగ్గిరికొచ్చారు. పొంగిపొర్లి వచ్చే దుఃఖంవల్ల వారొక్కమాటయినా మాటలాడలేని స్థితిలోవున్నారు.

“మూర్ఖులారా! ఏడిచి ప్రయోజనమేమిటి? అంబాలిక ఏమ యింది త్వరగా చెప్పండి.”

అని నేను గద్దించిన మీదట, ఒక పరిచారిక కొంత దుఃఖాన్ని దిగమించుకుని—లేనిధైర్యం తెచ్చుకొని—

“ప్రభూ! ఈ ఘోరమైన వార్త నేమని చెప్పాలి? నిండు ముస్తాబులో పెండ్లికూతురు మేనాలోకూర్చుంది. నలుగురు బోయీలో మేనా లెత్తారు. మేనా కిరువైపులా చెరోయిద్దరం చెలికత్తెల రానందు స్తున్నాం. ఇల్లు బయలుదేరాక, సగందూరంలో ఒక బైరాగి మేనాకు ముందర నడవసాగాడు. శిరమున జడలతో నిండినశిగ, ఒక చేతిలో శంఖము, మరొక చేతిలో త్రిశూలమూ పట్టి మేనాకంటే ముందు నడుస్తున్నాడు. అతనెవరో—ఎందుకు నడుస్తున్నాడో గమ నించవలసిన అవసరం మాకులేకపోయింది. కొంతదూరం పోయాక అతనాగాడు, మేనా, మేనాతో మేము, అతనికిదగ్గరయినాము. అప్పు డతను మామీద ఏదోబూడిది చల్లివుంటాడని, ఇప్పుడూహించు కుంటున్నాము.

ఆ తరువాత, బోయీలు కాని, మేముకాని ఒకరితోనొకరం మాట్లాడుకోలేదు. ఆబైరాగివెంబడి కుక్కల్లాగ కిక్కురు మనకుండా నడవడమె తప్ప యింకేమీ లేదు, మేనా లోపలి అంబాలి స్థితి యెలా గున్నదో మాకు తెలీదు. కాళికాలయంగాని, పెండ్లివిషయంగాని, మాదృష్టిలోలేవు. మంత్రముగ్ధులమైన మే మీ ప్రపంచమునే మరి చాము—ఏదారి పోతున్నామో—ఎక్కడికి పోతున్నామో—ఏమీ తెలీదు. ముందరబైరాగి, అతని వెలకాల మేనాతో మేము.

కొంతదూరం పోయాక బైరాగినిలిచాడు—మేనాకూడా నిలిచింది. మేనాతోపాటు మేము నిలిచాము. మేనా దింపండి—అని ఆబైరాగి చేతిలో సౌజ్ఞ చెయ్యగానే బోయీలు కిక్కురుమనకుండా మేనాదించారు. అప్పుడా బైరాగి తన చేతిలోవున్న త్రిశూలమును మా అందరికీ తలోసారీ తాకించాడు. ఏదో మైకం ముంచి, మా అందర్నీ కప్పేసింది. కళ్లు మూతలు పడిపోయాయి. ఒళ్లు తూలి కిందపడిపోయింది. తరువాత ఎంతసేపటికో తెలివొచ్చింది. అందరం ఒకేసారి లేచి కూచున్నాం.

'ఇదేమిటీ యిక్కడున్నాం? మేనాలో అంబాలిక యేదీ?' అని ఒకళ్ళనొకళ్ళం ప్రశ్నలు వేసుకోడమేగాని, జవాబు చెప్పగల వారెవ్వరూ లేరు.

కాళికాలయానికి బయలుదేరడమూ—పెళ్లిసమాచారమూ—అన్నీ జ్ఞాపకమొచ్చాయి. బైరాగి మోసగించాడనీ—అంబాలికనపహరించాడనీ—అర్థం చేసుకున్నాము. గుండెలు బేజారైపోయాయి. ఆ చుట్టుప్రక్కలంతటా గాలించాం—అంబాలిక ఎక్కడా కనుపించలేదు ప్రభూ! ఇందులో మేము తెలిసి చేసింది గోరంతయినా లేదు. బైరాగి మాయచేత మంత్రముగ్ధులమయ్యాము. ఒంటిపైకి తెలివొచ్చాక ఒక్కక్షణమైనా వృథచెయ్యకుండా, ఆ దారుణ సమాచారమును తమతో చెబుదామని పరుగుపరుగున వొచ్చాముండి.''

అని చెలికత్తె చెప్పినదంతా విని ఏంచెయ్యాలా అని ఆలోచించా! ఏంచెయ్యాలి—? ఆబైరాగిని పట్టుకోడమెలా? వాడెవడు?

ఆమాటలే నాబుర్రలో—నాగుండెల్లో—నారక్తనాళాల్లో—అంతటా ప్రతిధ్వనించాయి.

బైరాగిని పట్టుకోడమెలా? వాడెవడు? బైరాగిని పట్టుకోడమెలా—వాడెవడు?

ఇవేమాటలు నానోటంటకూడా వెలువడి, అంతఃపురమంతటా ప్రతిధ్వనించాయి. నాకు పిచ్చిపట్టిందేమో అని అందరూ అనుకున్నారని, నాకు తరవాత తెలిసింది. అప్పుడు తక్షణం గుఱ్ఱము నాయత్తపరచుకొని, ఎవరితోనూ చెప్పకుండా, ఏమీ చెప్పకుండా బయలుదేరాను. అప్పుడు నన్నులకరించడానికూడా ఎవరికీ ధైర్యం లేకపోయింది.

ఆవిధంగా గుఱ్ఱమెక్కి బయలుదేరిన నేను, ఎంతదూరం వెళ్లానో—ఎక్కడ చేరానో తెలీకుండా, ఎవడైనా బైరాగి కనుపిస్తా డేమోనని, అడవులు, కొండలు, పల్లెలు, పట్నాలు దాటి ఆకలిదప్పి కలు మరచి, ఎన్ని యోజనాలు ప్రయాణం చేశానో చెప్పలేను.

విజయకుమారా! ఇన్ని వివరాలెందుకు? కాలమహర్షి పేరుతో వున్న ఆబైరాగి ప్రశ్నలకు జవాబు తెలుసుకోవడం కోసం, ఎన్నెన్ని కష్టాలుపడి—ఎన్ని యోజనాలు ప్రయాణం చేశావో—నేనూ అదే విధంగా ఆబైరాగిని పట్టుకోవాలనీ, తద్వారా నాచెల్లి నుద్ధరించుకో వాలనీ—ఎండనక వాననక, నిద్రనక, ఆహారమనక, మూడువందల రోజులు తిరిగాను—ప్రియసోదరి దూరమైందే అన్నవ్యధ నన్నొక వైపున తినేస్తుంటే—నగరపాలకుడనై వుండి, సమస్తసైనిక బలా లనూ కలిగివుండి—శౌర్యబలపరాక్రమాల్లో పేరుపొందిన నేను క్షుద్రుడైన ఒక బైరాగిచేత వంచనచెయ్యబడి, ముద్దుచెల్లెలిని పోగొట్టుకొన్నానే అన్న అవమానం నన్నాపాదమస్తకము దహించి వేస్తున్నది. ఏమయినాసరే—నాచెల్లెలి సమాచారం తెలుసుకుంటే గాని, తిరుగుముఖం పట్టకూడదని నిశ్చయం చేసుకున్నాను.''

అని అంతవరకు చెప్పిన విక్రమదేవు—

''అయ్యో! పొరపాటు చేశాను. సాటి రాజకుమారుడవైన నిన్ను ఉచితరీతిని మర్యాదచెయ్యడం మరిచి, నాకథలో పడ్డాను. ఎన్నో యోజనాలు ప్రయాణంచేసి అలిసివుంటావు. ఎప్పుడు తిన్నవో ఏమితిన్నావో పాపం!''

అని వెంటనే చేరువలోవున్న ఒక గంటను మోగించాడు.

''ఫరవాలేదు, నన్నుగురించి మీరేమీ ఆరాటపడకండి—మీసోదరి విషయం ఏమయిందో చెప్పండి.''

అని విజయకుమారు డంటున్న వినిపించుకోకుండా, తన గంట పిలుపుకువచ్చిన పరిచారకునికేమో సౌంజ్ఞ చేశాడు. కనుసన్నలతో ఆజ్ఞల నందుకోగల ఆ పరిచారకుడు వెంటనేపోయి, కొన్ని పండ్లు, ఫలహారాదులు—పాలూ, తెచ్చి, విజయకుమారు ముందుపెట్టాడు—విక్రమదేవు నిర్బంధంవల్ల, విజయకుమారు వాటిని తీసుకోకతప్పలేదు.

తీసుకురాబడిన ఫలహారాదుల నతడు తీసుకుంటున్నాడు—విక్రమదేవు తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

౧౫

"ఆ ప్రకారంగా మూడువందల రోజులు ప్రయాణం చేశానని చెప్పానుగదూ!

తరువాత ఒకనాడు అశ్వారూఢుణ్ణై, ఒక కీకారణ్యమార్గము ననుసరించి పోతుండగా, ఒక బ్రహ్మాండమైన మర్రి చెట్టు కనుపించింది. ఆ మహావృక్షంయొక్క మొదలు అరయోజనం కైవారమును కలిగి వుంటుంది. దానిశాఖలును, ఊడలును ఐదు యోజనముల విస్తీర్ణమున వ్యాపించి, నాకమితమైన ఆశ్చర్యమును కలిగించాయి. నేనేగాదు, మరెవ్వరును అటువంటి మహావృక్షమును చూసి వుండరు. చూసినకొద్దీ వింత కలిగిస్తున్న ఆవృక్షమును సమీపించాను. గుఱ్ఱమును దిగి, చెట్టు మొదలు నొకసారి చుట్టివద్దామనుకున్న వుద్దేశంతో ప్రదక్షిణక్రమాన బయలుదేరాను.

దానికి వెనుకభాగాన ఒక తొఱ్ఱ కనుపించింది. అసంభ్రమైనా చిన్నదికాదు. నావంటి ఆజానుబాహువు డొకడు గుఱ్ఱమెక్కి అవలీలగా ఆ తొఱ్ఱలో ప్రవేశించవచ్చు. చెట్టును చూసిన ఆశ్చర్యంకంటే— ఆ తొఱ్ఱను చూసిన ఆశ్చర్యం నాకు మరీ యెక్కువయింది. లోపల ప్రవేశించాలనికూడా బుద్ధిపుట్టింది. కాని కొంచం భయంకూడా కలగకపోలేదు. లోపల ప్రవేశించి చూడాలన్న కుతూహలం, భయాన్ని పారదోలింది. తొఱ్ఱకు మరి కొంచం దగ్గరగా వెళ్లి, లోపలికి తొంగి చూశాను. వెంటనే గుండె లాగిపోయేటంతటి ప్రమాదం జరిగింది. ఒక భయంకర సర్పము, చెట్టు తొఱ్ఱలో సగమాక్రమించుకున్న తన పడగను విప్పి, నామీద బుసకొట్టింది. నేను వెనక్కు తగ్గినా, అది తగ్గక, అంతవరకు తొఱ్ఱలో చుట్టలుగా చుట్టుకున్న తన దీర్ఘశరీరాన్ని పైకి లేపి, తోకపై నిలిచి, నన్ను మింగబోయినట్లు, నాలుకలు చాచి నిప్పులురాలే బుసలుకొట్టింది. నాకేమీ పాలుపోలేదు. ఆ కాలసర్పం నన్ను విడిచిపెట్టదని నిశ్చయం చేసుకున్నాను. శరణంటే, ఎటువంటి పగవానికయినా కనికరంగదా! అందుకని రెండు చేతులూ యెత్తి నమస్కరించి—

"స్వామీ! సుబ్రహ్మణ్యేశ్వరా! ఇది నీ నిలయమని తెలీక, లోపల ప్రవేశించి చూడాలని కుతూహలపడ్డా నంతేగాని, నే చేసిన

అపరాధ మేమీ లేదు. క్షమించు.'' అని వేడుకున్నాను.

నే ననుకొన్నట్లే అయింది. అప్పుడా నాగేంద్రుడు కొంచం శాంతించి, నాకు తెలిసే మనుష భాషలో—

''రాజేంద్రా! ఇది ఒక బైరాగి నివాసం! ఇందు ప్రవేశించడం నీకు వల్లకాని పని—'' అంది.

బైరాగి మాట చెవుల్లో పడేటప్పటికీ, నాలోని రక్తం ఉడికి పొంగింది.

''బైరాగి నివాసమా! అయితే నేను తప్పకుండా లోపల ప్రవేశించాలి. ప్రాణాన్నయినా బలిస్తాను—కాని భయపడను.''

అని నేను ఉద్రేకంతో అన్నమీదట—

''అవివేకుడా! ప్రాణాన్ని బలియిచ్చి, ఆతరవాత నువ్వు చెయ్యగల ఘనకార్యమేమిటి?'' అని సర్పరాజు—

''ఏమయినా సరే—నేను లోపలికెళ్లి తీరాలి.'' అని నేను—

''లోపలకెళ్లే అర్హత నీకేముంది?''

''ఏమర్హత కావాలి?''

''ఆ బైరాగికి ఆయుః ప్రమాణమెంత? నువ్వు చెప్పగలవా? చెప్పగలిగితే లోపల ప్రవేశించు.''

''నాకు తెలియదు.''

''తెలియకపోతే తెలుసుకురా!''

''ఎవర్నడిగి—''

''మీ యమ్మని?''

''మా అమ్మనా?''

''అవును—''

అని మాత్రం చెప్పేసి, సర్పరాజు తొట్టెలో కెళ్లిపోయింది. నాకేమిటో మతిపోయినట్లయింది. మాఅమ్మ చనిపోయి ఏనాడయింది? ఆవిడ యిప్పుడు ఏలోకంలోవుంది? ఆవిషయం ఈ సర్పరాజుకు మాత్రం తెలియదా! అప్పుడామాటలో ఏదో మారుభావ మిమిడి వుందన్నమాట! ఆగూఢార్థమేమై వుంటుందా అని దీర్ఘంగా ఆలోచించాను. నాకేమీ బోధపడలేదు.

అది బైరాగి నివాసమని తెలిసివుండీ కూడా, లోపల ప్రవేశించకుండా ఎలావుంటాను? ఆమోసగాడు, నాసోదరిని అక్కడే

చరపట్టి వుంటాడని నిశ్చయించాగ. ప్రాణానికి తెగించి, లోపల ప్రవేశిస్తానే అనుకో, అప్పుడు చావు ఖాయం. నాగేంద్రుడు చెప్పినట్టు చచ్చి సాధించేదెవరిని? అందువల్ల ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకోవాలి. ఆ బైరాగికి ఆయుఃప్రమాణం మెంతో ఎలా తెలుస్తుంది? ఏ యమ్మనీ అడగడం? ఆఁ! అప్పుడు కొంచం బుర్రపనిచేసింది. ప్రపంచానికంతటికీ అమ్మ యెవరు? నాకు స్వంత అమ్మలేదు కాబట్టి, జగజ్జనని నడిగి తెలుసుకోవలసిందని నాగేంద్రుని గూఢభావమై వుంటుందన్న విషయం తెలిసిన తరువాత, ఆ జగజ్జనని నాకెలా కనిపిస్తుంది? ఎక్కడ కనిపిస్తుంది? అన్న ఆలోచనలు మళ్లీ కలిగాయి. ప్రయత్నమే కార్యసానుకూలతకు కారణమని తెలుసుకొన్నవాడనవడంచేత, వెంటనే గుఱ్ఱమెక్కి తిరిగి బయలుదేరాను. ఎక్కడికిపోవాలో—ఏమిచెయ్యాలో అన్న నిశ్చయ మేమీ లేకుండానే పిచ్చివాడిలాగ మరి కొన్నిరోజులు తిరిగిన తరువాత ఒక గ్రామంచేరాను. అంతవరకు తిరిగి తిరిగి అలసివుండడంవల్ల ఆరాత్రి కాగ్రామంలో నిద్రచేసి, తిరిగి ఉదయమే బయలుదేరాను.

ఆగ్రామపు పొలిమేర దాటుతుండగా, అక్కడ ఒక శిథిలమైవున్న ఆలయం కనుపించింది. అప్రయత్నంగా గుఱ్ఱమునుదిగి లోపల ప్రవేశించాను. అది కాళికాలయము. అంతకుముందే ఎవరో జాతర చేసి వుండడంవల్ల కాబోలు, ఆ ప్రదేశమంతా పచ్చి నెత్తురుతోను. కోడి ఈకలతోనూ నిండివుంది. అయినప్పటికీ నేను అసహించుకోకుండా, దేవీ విగ్రహం చెంతకు వెళ్లాను.

"తల్లీ! నీకంటే జగజ్జనని యీ పృథ్విలో యింకెవరున్నారు. నాగేంద్రుడు తలనిచ్చిన లోకమాతవు నువ్వే! నన్ను కరుణించి, ఆ బైరాగికి ఆయుఃప్రమాణ మెంతో చెప్పు—నాముద్దు చెల్లెలిని రక్షించుకుంటాను."

అని నేను ప్రార్థించానే కాని, రాతివిగ్రహం ఏమని మాట్లాడుతుంది? అది రాతివిగ్రహమన్న భావం నాలోవున్నంతసేపూ అది మాట్లాడనేలేదు. అప్పుడిక నేను దీక్షపూనాను.

"అమ్మా! నువ్వు రాతివిగ్రహానివే అయితే—నిన్ను పూజించే వరులు, పామరులుకారా! నీబిడ్డల్ని పామరుల్ని చేస్తే నీకొచ్చే ఘనతేమిటి? నువ్వు రాతివిగ్రహాని వన్నభావం నాలోంచి తొలిగిపోవ

దానికి బాధ్యురాలవు నువ్వా? నేనా? అర్థమై-నేను! నాలో సంస్కారం కలిగినప్పుడు రాతివి, మాత వెందుకు కావూ?''

అనే ప్రశ్నలకు నాకు నేనే జవాబులు చెప్పుకుని, దృఢమైన ఆత్మవిశ్వాసంతో-కళ్లుమూసుకుని ఆరాతివిగ్రహాని కెదురుగా కూర్చున్నాను. ఆ విధంగా ఎన్ని రాత్రులు, ఎన్ని పగలు గడచినదో నాకు తెలీదు. నాలోని జీవుడు ఉన్నాడో లేడో-ఉంటే ఏంచేస్తున్నాడో-లేకుంటే యెలా వున్నానో—అంతా అగమ్యగోచరం—అయోమయం—సర్వశూన్యం—ఆశూన్యంలోనించి—

''బిడ్డా!'' అన్నశబ్దం వినపడేటప్పటికి తృళ్లిపడ్డాను. విప్పుదామంటే, కళ్లు పెకలిరాలేదు-మళ్ళీ అదేశబ్దం-''బిడ్డా! రాతిని మాతగా చెయ్యగల సంస్కారం నీలో ఏర్పడింది. నిజకుమార్తెను రమింప గోరిననాడు, ఆబైరాగి కాయుఃప్రమాణం పూర్తి అవుతుంది—ఇక నన్నటువంటి ప్రశ్నలూ అడక్క—వెళ్లిపో—''

వెంటనే నేను కళ్లు విప్పగలిగాను—మామూలుగా అమ్మవారి రాతివిగ్రహమే యెదురుగావుంది. నాకు కావలసిన జవాబు ఆతల్లి చెప్పింది గదా అన్న మహాసంతోషంతో, వెంటనే యివతలకొచ్చి, తిరిగి గుట్టమునెక్కి, ముందు వెళ్ళిన ఆమఱ్ఱిచెట్టు మార్గము ననుసరించి బయలుదేరాను.

ఒకసారి వెళ్ళివచ్చినదారి కావడంవల్ల, యెక్కువ ప్రయాస లేకుండానే గమ్యస్థానం చేరుకోగలిగాను. ఆభయంకర సర్పమా చెట్టు తొఱ్ఱలో వున్నదో-లేదో అన్న సందేహంతో తలను లోపల పెట్టి చూచాను—అది యథాప్రకారంగా పడగవిప్పుకొని నాపై కోరలు చాచి బుసలుకొడుతూ—

''బైరాగి నివాసమైన ఈ తొఱ్ఱలో ప్రవేశించగల అర్హత నీకేదీ?'' అని అడిగింది.

''ఉంది.''

అని నేను సగర్వంగా బదులు చెప్పాను.

''అయితే చెప్పు-ఈబైరాగికి ఆయుఃప్రమాణ మెంత?''

''నిజకుమార్తెను రమించగోరినప్పుడు, ఈ బైరాగికి ఆయుః ప్రమాణం పూర్తి అవుతుంది.''

"భేష్! ఇప్పటికి నువ్వొక్కడవు—నేనడిగిన ప్రశ్నకు జవాబు చెప్పగలిగినవాడివి—ఇక లోపలికిపో—నీ కడ్డులేదు. గుఱ్ఱమును మాత్రం బయటవుంచు."

అని చెప్పి, వెంటనే నాగేంద్రుడు పక్కకు తప్పుకుని, నేను లోపలికి పోగల అవకాశమును కల్పించాడు. నా శ్రమ ఫలించింది—నా సోదరిని చూడవచ్చుననుగా అన్న కుతూహలంతో తొఱ్ఱలోపల ప్రవేశించాను. అంతా చీకటిగావుంది. దారి కనుపించడంలేదు. ఒర నుండి ఖడ్గమును తీసి, దానితో ముందరిభాగమును తడుముకుంటూ, ముందుకు నడిచిపోయాను. ఒక మఱ్ఱిచెట్టులోపల అంత నిడుపయిన దారి యెలావుందో నాకర్థం కాలేదు. ఎంత నడచినా తరగనిదూరం—అంధకారబంధురమైన దారి. ముందర కనుపించినలాంటి భయంకర సర్పాలు లోపల యింకా యెన్నుంటవో అని, మొదట భయపడ్డాను కాని భగవంతుని దయవల్ల అటువంటివేమీ లేవు. ఒక్క చీకటి తప్ప యింకేమీ లేదు. అంతటా నిశ్శబ్దంగావుంది. ఆ సొరంగ మార్గానికి కొస యెక్కడో—బైరాగివుండే స్థలమేదో, నాకేమీ తెలీలేదు.

అట్లా సొరంగ మార్గాన అంధకారంలో సుమారొక ఆమడ దూరం నడిచిన తరువాతే, ఒక మందిరభాగం కనుపించింది. మందిరం లోపల యిరువురు వ్యక్తులు మాట్లాడుతున్న మాటలు వినిపించాయి. నేను ముందుకు సాగకుండా అక్కడనే నిలిచాను. ఆ మందిర భాగం, మునుపున్నంత చీకటిగా లేకపోయినప్పటికీ, ఎక్కువ కాంతివంతంగా వున్నదని చెప్పడానికి వీలులేదు. ముఖాలు గుర్తుపట్టవచ్చు—ప్రదేశమంతా స్పష్టంగా కనుపిస్తూంది.

నే నామందిరాని కివతల నిలుచుని, లోపలినుంచి వచ్చే మాటలను క్షణకాలం విన్నాను. ఒకటి స్త్రీకంఠం-రెండోది పురుషకంఠం. స్త్రీకంఠం మా అంబాలికదని గుర్తుపట్టడాని కెక్కువసేపు పట్టలేదు. ఆరెండో కంఠం బైరాగిదే అయివుంటుందని ఊహించాను. ఉద్రేకం ఆపుకోలేకపోయాను. నన్ను నేనే మరచి బైరాగిమీది కురకాలనుకున్నాను. కాని తొందరపాటువల్ల కార్యహాని కలుగవచ్చునని, కొంచం నిదానించాను.

అప్పుడాయిద్దరి సంభాషణ నా కీవిధంగా వినిపించింది—

"సుందరీ! నన్నెందుకింతగా వేధిస్తావు? నీపైవుండే మోహం నన్ను దహించివేస్తూంది. త్వరగా నన్ను దయచూడు."

"ఓరీ! నీచూడా! అమ్మవారి గుడికి పూజకు వెడుతుండగా, నీ క్షుద్రమాంత్రిక ప్రభావంవల్ల నన్ను మోసగించి తెచ్చావు—లేకుంటే నాఒక్క చెలికత్తె చాలు నీతలనరకడానికి—అయ్యో! నా చెలికత్తె లేమయినారో—బోయీలేమయినారో!"

"యెవ్వరూ ఏమీ కాలేదు. మరి కొంతసేపటికి వారు తెలివి పొందివుంటారు—సురక్షితంగా మందిరం చేరివుంటారు. వారెవరి కోసమో తపనపొందకపోతే—యెదురుగావున్న నాపై కనికారం చూపరాదూ! నన్ను నీకౌగిట చేర్చరాదూ?"

"నువ్వు చచ్చినా, నన్ను చంపినా, అటువంటి అవినీతికార్యం జరగదు. ఇకనయినా నీకు నువ్వు బుద్ధిచెప్పుకుని—నన్ను నావారిని చేర్చు."

"నిన్ను నీవారికి చేర్చడానికేనా, ఇంతకష్టపడి యిక్కడికి తీసుకొచ్చింది?"

"నీతలచిన పని కానప్పుడేం చేస్తావు?"

"కాకపోవడ మీజాతికానికి లేదు. ఇదిగో, నాదగ్గర ఈ త్రిశూలమున్నంతవరకూ, నన్నెవరూ ఏమీ చెయ్యలేరు. మంచిగా లొంగుబాటు కొస్తావేమో అని చూస్తున్నానంతేగాని, నిర్బంధంచేసి నిన్ననుభవించడానికి నిమిషంపట్టదు తెలిసిందా! ఇంతసేపూ, శాంతంగా మాటలాడుతున్నానని, చేతకానివాడనుకోకు."

అని వాడంటున్నప్పుడు, తక్షణం మీదికురికి, ఆదుర్మార్గున్ని రెండుగా చీల్చేదామన్నంతటి ఆగ్రహం కలిగింది నాకు. కాని, కావలసింది కార్యసాధన. అందువల్ల తమాయించుకుని, మరి కొంచం ప్రక్కకు తొలిగి ఒక మూలగా నక్కి నిలుచుని, తిరిగి వారి సంభాషణను వింటున్నాను.

"కోమలీ! వృధాకాలయాపన చెయ్యకు—నీ అందము ననుభవింపనియ్యి—నీ అధరామృతము గ్రోలనియ్యి—నారాణివై సర్వసౌఖ్యాలూ అనుభవించు—"

"ఛీ! ఛీ! నీ సౌఖ్యాలు నిప్పుల్లోపొయ్యి—పెళ్లి పీటలమీద కన్యనపహరించి తెచ్చి యింతగా వుసురుపెడుతున్న నీకు పాపభీతిలేదా?"

"హుఁ! పాపము—భీతి—అదంతా చేతకానివాళ్ళ మతం! భగవంతుడు స్త్రీపురుషజాతులను సృష్టించిన దెందుకు? ఒకరి నొకరు స్వేచ్ఛగా అనుభవించి, ఆనందించడానికే!

"పాపీ! నీకు భగవంతుడంటూ ఒకడున్నాడా!"

"సరిసరి—నేను భగవంతుడి సంగతి సందార్భాలన్నీ పూర్తిగా తెలుసుకున్నవాణ్ణి—అందువల్లనే యిటువంటి మహాశక్తి సంపాదించాను."

"సంపాదించిన శక్తినిలా దుర్వినియోగం చేస్తున్నందుకు తగిన ఫలమనుభవిస్తావు.

"నిజం. ఆ ఫలమునాసించే నిన్నటికి తెచ్చాను. ఏదీ ఒక్క ముద్దు."

అని, ఆదుర్మార్గుడు, కావరంతో కళ్లు మూసుకుపోయి, అనాఘ్రాత పుష్పమనదగిన ఆ కన్నె పడుచు మీదపడబోగా. ఆమె భయకంపితురాలై వెనక్కు తగ్గి—

"ఓరీ వంచకుడా! దూరంగానిలు! అవసరమైతే తెగించి, ప్రాణమన్నా బలిస్తాగాని—నీకులొంగను. హైందవ స్త్రీకి శీలమొక్కటే భూషణం."

"ఏమిటీ! ప్రాణానికి తెగించానంటావా! నిన్ను నిర్బంధించయినా నాకోరిక నేను తీర్చుకుంటాను. ఆ తరువాత నువ్వు ప్రాణానికే తెగించు—ఏమయినా చెయ్యి."

"నీకంటే పశుజాతి వెయ్యిరెట్లు నయంకదరా పాపీ! ఇంత ఘోరం తలపెట్టిన నీతల వెయ్యి చెక్కలు కాదేమిరా!"

అని, అంబాలిక, ఆ బైరాగి అంటున్నమాటలకు విని సహించలేక—వలవల యేడుస్తూ నేల కొరిగింది.

"విలపించేకాంతను కలియడం, రసిక లక్షణంకాదని ఇప్పటికి ఊరుకుంటున్నాను. రేపు సరిగా యిదేసమయంలో తిరిగివస్తాను. అప్పటికయినా మనసు మార్చుకుని, ఒప్పుకోకపోతే లాభంలేదు."

అని హెచ్చరించి ఆ బైరాగి ఆ కాపురం వొదలివెళ్లే ప్రయత్నంలో వుండడంవల్ల, నా ప్రాణం కుదుటపడింది. నేను వాడికళ్ల బడకుండా, మెల్లిగా ఆ మంటపానికి వెను తట్టుకు పాకిపోయి, వాడు వెళ్లి పోయేవరకూ అక్కడేవుండి. వాడు పూర్తిగా వెళ్లిపోయాడో

లేదో అన్న సందేహంవల్ల, చప్పుడుకాకుండా మెల్లిగా వాడిని ద్వారంవరకూ వెంబడించి-వాడు ద్వారం దాటిపోవడమును కళ్లారా చూచి—తిరిగి అంబాలిక వున్న దగ్గరికొచ్చాను.

"చెల్లీ!" అని నేనగా, కిందపడి కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తున్న అంబాలిక కళ్లువిప్పి నన్ను చూడగానే—

"అన్నా-" అంటూ నన్ను కౌగలించి, ఘొల్లుమని ఏడ్చింది.

"ఖంగారుపడకు—భయంలేదు. వాడు వెళ్ళిపోయాడు." అని నేనామెకు ధైర్యం చెప్పాను.

"ఎంతసాహసం చేశావన్నయ్యా! ఇక్కడికెలా రాగలిగావు?" అని అంబాలిక అడిగినదానికి—

"అదంతా తరువాత చెబుతా! త్వరగా బయల్దేరు—వెళ్ళిపోదాం."

"సాధ్యమా!" అని ఆమె సందేహించగా!

"నేచెబుతా. ముందర బయల్దేరు." అని నేను హెచ్చరించాను.

నేను ముందర నడుస్తూ, ఆమె చెయ్యి పట్టుకుని వెనుకనడిపించుకుంటూ, క్రమంగా చీకటంతటినీ దాటి, ద్వారం దగ్గర చేరాను. ఇక పాము నోట్లోంచి బయటపడాలి. అదే గొప్పప్రమాదం. నాగేంద్రుడు మేలుకొనివుంటే ఏమయ్యేదో చెప్పలేనుగాని, ఆసమయంలో భగవంతుని దయవల్ల ఆకాలసర్పము చుట్టగా చుట్టుకుని, తల నాబుట్టలో దూర్చుకొని నిద్దరపోతూంది. అదే సమయమనుకుని, నేనూ, నాచెల్లెలూ, మెల్లిగా ద్వారందాటేశాము. అక్కడ సుర క్షితంగా నిలిచివున్న నాగుఱ్ఱంమీదనే అంబాలికను కూడా ఎక్కించుకొని, యిరువురము బయలుదేరాము. అశ్వమును హెచ్చరించగా, అది మేఘాలమీద దూకినట్లు, వాయువేగ మనోవేగాలను మించి ఉరికింది. కనుమూసి తెరచేలోపుగా ఆ పరిసరప్రాంత, మంతాదాటి, వేరొక అరణ్యమార్గాన ప్రవేశించగలిగాము.

అప్పటికి కిద్దర మనుసులూ శాంతపడ్డాయి. విశ్రమించాలని ఒక చెట్టుకింద దిగాము—గుఱ్ఱము నాచెట్టుకుకట్టి, ఇద్దరమూ దాని నీడను కూర్చున్నాము. ఒకళ్ళ సంగతొకళ్ళం చెప్పుకోడాని కప్పుడు మాత్రమే అవకాశంచిక్కింది.

"బుద్ధాన్నఘనుడు—ఉన్నట్టుండి—ఎంత దారుణం తలపెట్టాడో చూశావా అన్నయ్యా?"

"ఆ బైరాగి నీకెలా దాపరించాడమ్మా?"

"ఏమో అన్నయ్యా! జరిగిన విషయాల్లో నాకు కొన్ని జ్ఞాపకం లేవు. మేనాలో ఇల్లు బయులు దేరి చెలికత్తెలూ నేనూ అమ్మవారి గుడిమార్గాన సగం దూరం వరకూ వెళ్ళామనుకుంటా—ఆ మధ్యదార్లో నాకేదో మైకం కమ్మినట్టయింది—నిద్దరొచ్చింది. కూచున్నానో—పడుకున్నానో కళ్లు మూతలు పడిపోయాయి—అలా యెంతసేపో—ఒళ్లు తెలీని నిద్ర—మళ్ళీ కళ్లు తెరిచి చూసేటప్పటికి కదిగో—ఆ మందిరంలో వున్నా—ఎవరుగా, భయంకరాకారుడు బైరాగి దాపురించాడు. గుండె బేజారయింది. ఆమహామాయను అర్థం చేసుకోలేక ప్రాణం తల్లడిల్లిపోయింది. వాడి దుర్భాషలూ—దుశ్చింతలూ, నువ్వు స్వయంగానే చూశావు కదా! అంతకుమించి, యితర సంగతులేవీ నాకు తెలియవన్నయ్యా అది ఒక మహావృక్షమనీ—ఆ బైరాగి నన్ను తీసుకెళ్ళి వుంచిన దా చెట్టుతొఱ్ఱలోని మందిరము అనీ—ఆదారి, అంత నీకెట్లాగావుందనీ—నువ్వు నన్ను వెంటబెట్టుకొని, తీసుకొచ్చేటప్పుడు మాత్రమే తెలుసుకున్నాను. బైరాగి నన్నా మందిరంలో కెలా తీసుకెళ్లాడో—ఎలా వుంచాడో—నాకేమీ తెలీదు. నా మేనా, బోయీలూ, చెలికత్తెలూ, ఏమయినా అంతకంటే తెలీదు."

"వాళ్ళందరూ బాగానేవున్నారు. అమ్మవారి ఆలయానికని బయులుదేరిన నువ్వు, తిరిగి ఎంతకూ రాకపోవడంవల్ల, ముహూర్తం మించిపోతుందని, పురోహితులు తొందర చేశారు. నేను కొందరు పరివారాన్ని నీకోసం పంపాను. నువ్వెక్కడా కనుపించలేదని వాళ్లు తిరిగి వచ్చి చెప్పారు. ఏదో మోసం జరిగివుంటుందనీ—నువ్వేదో ప్రమాదంలో చిక్కుకుని వుంటావనీ, నేనూహించి, తక్షణం పట్నమంతా గాలించవలసిందనీ—పట్నం చుట్టూ సైన్యాలను కాపుంచవలసిందనీ—సైన్యాధిపతికి ఆజ్ఞలిచ్చాను.

వరుడు, పెళ్ళికొచ్చినవారు అందరూ నడుములు విరిగినట్లు ఎక్కడి వారక్కడే కూలబడ్డారు. సుమారు తొమ్మిదిగంటల రాత్రివేళ చెలికత్తెలు, బోయీలు గోలుగోలున యేడుస్తూ నాదగ్గిరికొచ్చారు."

అని నేనా తరువాత జరిగిన యావత్తుసంగతులూ అంబాలి కకు వివరించిచెప్పాను. కొంతిసేపటివరకు విభ్రాతురాలై, తరవాత, మనసును తిరిగి అదుపులోకి తెచ్చుకొని,

"అయితే అన్నయ్యా! ఆచెట్టుతొట్టిలో భయంకరమైన నాగు పామొకటుందే—నువ్వు లోపలకొచ్చేటప్పుడది—నిన్నేమీ చెయ్య లేదా?" అని అడిగింది.

నేనప్పుడానాగేంద్రుడు ఆటంకంకలిగించిన విషయం—అతనడి గిన ప్రశ్న—నేను కాళికాదేవిని ప్రార్థించడము—ఆమె చెప్పిన జవాబు—మొదలుగాగల సర్వవిషయాలూ ఆమెకు సాకల్యంగా చెప్పి తృప్తికలిగించిన తరువాత—

"చెల్లీ! నేను నీకోసం యిల్లుబయలుదేరి మూడువందల రోజు లయింది. వచ్చేటప్పుడు ఎవరికీగాని, ఏమీ చెప్పలేదు. వరుడేమను కున్నాడో—మిగిలిన పెళ్ళివారేమనుకున్నారో తెలీదు. వారింకా మననగరంలోనే వున్నారో—విసిగి వెళ్ళిపోయారో—త్వరగా బయలు దేరు చేరుకోవాలి."

అని నేను చెప్పినదానికి మా అంబాలిక అమితమైన ఆశ్చ ర్యము ననుభవిస్తూ—

"అదేమిటన్నయ్యా! నాకోసం, నువ్విల్లు బయలుదేరి మూడు మాసాలయిందా?"

అని ఆశ్చర్యంగా అడిగింది.

"అవును—ఎన్ని యోజనాలు ప్రయాణంచేశానో—నగరాలూ, కొండలు, అడవులు, ఎన్ని గాలించానో నీకు తెలీదు."

"అయితే—అబ్బై భాగ నివాసం నీకెలా తెలిసింది?"

"కేవలం, దేవుని దయవల్ల తెలిసింది—అందులో నాప్రవేశ కత్వం గోరంతయినా లేదు చెల్లమ్మా!"

"మనం తిరిగి మూడువందలరోజులూ—అన్ని యోజనాలూ ప్రయాణంచేస్తే కాని, మననగరం చేరుకోలేమా?"

"అన్నిరోజు లవసరంలేదు. మొదలువెళ్ళిన కొన్నిజాగాలకు యిప్పుడు తిరిగ వెళ్ళవలసిన పనిలేదు. అయినా కనీసం రెండువందల రోజులయినాపడుతుంది. మనం మననగరం చేరుకోడానికి."

"అయితే, త్వరగా బయలుదేరి పోదాంపద అన్నయ్యా—"

అని అంబాలిక హెచ్చరించినమీదట, నేను గుఱ్ఱాన్ని సిద్ధం చేశాను. ఇరువురము తిరిగి యథాప్రకారంగా ప్రయాణమయ్యాము. అనేక దుర్గమారణ్య ప్రాంతాలు, పర్వత ప్రదేశాలూ, దాటిపోతూ, అక్కడక్కడ కనపించే వింతలనుగురించీ, విచిత్రాలనుగురించీ, అంబాలికకు చెబుతూ—బడలిక కలిగినప్పుడు ఏచెట్టుకిందనో—ఏకొండ మీదనో రాత్రులుగడుపుతూ ఉదయం తిరిగి ప్రయాణమై—జలాశయములు కనుపించినప్పుడు దాహం తీర్చుకుని, ఫలవృక్షాలు తటస్థమైనప్పుడు ఆకలితీర్చుకుంటూ, ఒకవంద దినాలు ప్రయాణంచేశాము. మరొకవందదినాలకు మానగరం చేరుకుంటామనగా, ఒక అడవి మార్గమునసరించి పోతున్నాము—అప్పటికింకా పూర్తిగా చీకటి పడలేదు. మాకెదురుగా దూరాన ఎక్కడో గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపించింది. నేనూ మాచెల్లెలూ ఆశ్చర్యపోయాము. ఆ గుఱ్ఱపు దళాలు ఏమైవుంటవా అని ఆలోచించాము.

"అన్న వాళ్లెవరో-మనకపకారం చేస్తారేమో-మనగుఱ్ఱాన్ని వెనక్కు మళ్లించుకుపోదామా?"

అంది అంబాలిక. కాని వెనక్కుతిరిగి యెక్కడికి పోవడం? వెనుదిరిగినా ఆగుఱ్ఱాలగుంపు మావెనుక రావలసిందే! ఆ అరణ్యంలో వున్నదొక్కటే మార్గం. ప్రక్కదారిగాని, చుట్టుదారిగాని, ఏదీ లేకుండా, అన్నివైపులా మనిషి చొరడానికి వీలులేనంత దట్టంగా పెరిగివున్నాయి వృక్షజాతులు. అందువల్ల పోతే వెనుకకు—లేకుంటే ముందుకు సాగిపోవలసివుంది. వెనక్కుపోయినా, ముందుకుపోయినా ప్రమాదమొక్కటే. ఏమవుతే అవుతుందని, మా గుఱ్ఱమును ముందుకే సాగిపోనిచ్చాను. క్రమంగా అశ్వారోహులు, మేము ఒకళ్లకొకళ్ళం ఎదురుగా దగ్గరగా ఎదురయినాము. వాళ్లెవరో తెలుసుకోకుండా ముందుగానే ఖంగారుపడడ మెందుకని నేను ధైర్యంగానే వున్నాను. పెళ్లి సందర్భంలో అలంకరించుకున్న జవ్హారీ అంతా చెక్కుచెదరకుండా అలాగే వుంది. బైరాగి ఆవస్తువుల నాపేక్షించక పోవడంవల్ల ఆమె ధరించినవన్నీ ధరించినట్లే వున్నాయి. మాకెదురయిన అశ్వారోహులు గుఱ్ఱములనిలిపారు—నేనూ నిలిపాను. వాళ్లు సుమారు పాతికమందుంటారు. అందులో ఒకడు నా గుఱ్ఱంమీద ముందరకూర్చున్న మాచెల్లెమ్మను చూచి—

"అదృష్టమంటే—మనదేరా! బంగారు బొమ్మలాంటి పడుచు—పడుచెత్తునా బంగారం—ఇంకేంగావాలా?" అన్నాడు.

అది ఒక దొంగలగుంపని నాకు వెంటనే అర్థమైపోయింది. వాళ్లు మామీద పడకముందే అంబాలికను గుర్రంపైనుంచి దింపి—

"తల్లీ! భయపడకు—అదుగో ఆ చెట్టు దగ్గర కూచో నేను వీళ్ల సంగతి చూసుకుంటా." అన్నాను.

అంబాలిక వెంటనే ఆదాపులో వున్న ఒక గున్నమామిడి చెట్టుకింద కూచుంది. దొంగలు నామీద కురికారు. నేనున్నా ఆలశ్యం చెయ్యకుండా ఒరనుంచి కత్తిని దూసి, వాళ్ల నెదుర్కున్నాను.

గుర్రమెక్కిన వాళ్లందరూ యుద్ధవీరులౌతారా? వాళ్ళు నాతో తమకు చేతనయినంతవరకూ పోరారు. కాని నాధాటి కాగలేక గుర్రములను మళ్ళించారు. నేనంతటితో వాళ్లని వొదలక, అందరినీ ఒక్కపెట్టున హతమార్చాలన్న తలంపుతో వెంటబడ్డాను. వారు యుద్ధవీరులు కాకపోయినా, మంచి గుర్రపురౌతులు కావడంవల్ల, నాధూకుడు కందకుండా పలాయితులౌతున్నారు. ఎప్పటికదే మేలనుకొని, అంబాలిక దగ్గరకు పోవడానికి గుర్రాన్ని వెనక్కు మళ్ళించాను. ఆమె అక్కడ ఒంటరిగా ఎంత దిగులుపడుతుందో అనుకున్నాను. నేనా దొంగలగుంపుతో పోరుసల్పడం—వాళ్లని దూరంగా తరిమికొట్టడం—తిరిగిరావడం—ఇదంతా రెండుగంటలకాలమన్నా పట్టివుంటుంది.

తీరా వచ్చి చూచేటప్పటికి అంబాలిక అక్కడలేదు. ఆగున్న మామిడి చెట్టుకింద ఎవరూలేరు. నాగుండె గుభేలుమంది—దొంగల గుంపును తరిమేశానన్న సంతోషం తీరకపోగా. అంబాలిక యేమై పోయిందో నన్న దుఃఖం నన్నావరించింది. ఒకవేళ నేను పొరపడ్డానేమో—ఆమెను వుండవలసిందని నియమించిన గున్నమామిడిచెట్టు అదిగాక వేరొకటేమో—అని పరిసరప్రాంతానగల చెట్లన్నీ గాలించాను. అక్కడున్నదల్లా మామిడిచెట్టు ఒక్కటే—మిగిలినవన్నీ యితరజాతివృక్షాలు

పురుషుణ్ణే, ధీరుణ్ణే అయినప్పటికీ నాకు ఆపుకోలేనంత యేడుపు వొచ్చింది. ప్రయత్నం తిరిగి మొదటికొచ్చిందేమో అని ఎంతన్నా దుఃఖపడ్డాను. ఆదుఃఖంతో నే—"అంబాలికా—చెల్లీ—"అని గొంతెత్తి పిలిచాను. నాపిలుపుతో అరణ్యం ప్రతిధ్వనించిందేగాని, బదులు

తిరోగమనం చేయించి నడిపాను. అప్పటికి రాత్రి చాలవరకు పొద్దు గడచి వుంటుంది. చీకట్లో ఎటుపోగలను? ఏమి చెయ్యగలను? అయినా విశ్రమించడానికి మనస్కరించలేదు. పెళ్ళి పేరంటములు కాలేదు— బిడ్డ పాపలగన లేదు, వియ్యములుపొంది, మనమల నెత్తలేదు. అటు వంటి నా చెల్లి నూరేళ్లు బ్రతుకకంటే నా ప్రాణ మెక్కువయిందా?

అందుకని, అర్ధరాత్రి అని చూడకుండా అదేమార్గము ననుస రించి బయలుదేరాను. ఏ యెండుటాకులధ్వని వినిపించినా-ఏఘాతుక జంతు గర్జనలు వినిపించినా, గుఱ్ఱంమాత్రం కొంచెంబెదిరి వెనకడుగు వేసినప్పుడు, దానిమూపున తట్టి సవరించి, బెదురుపోగొట్టి తిరిగి ముందుకు సాగనిచ్చుకొంటూ కొంతదూరంపోయాను. ఏమనిపిజాడ కాని కనుపించలేదు. కొన్నిచోట్ల చీమ చిటుక్కుమనకుండా, గంభీర మైన నిశ్శబ్దము—మరికొన్నిచోట్ల చెవులు చిల్లులు పడేంతటి నానా మృగభీకర కోలాహలము. ఆరెండు పరిస్థితులూ ప్రమాదకరము లైనవే—అంతటి నిశ్శబ్దమైనా భయంకలుగుతుంది—అంతటి విప రీతశబ్దమైనా భయంకలుగుతుంది. ఆశలన్ని వొదులుకొని ప్రాణానికి తెగించిన నేనుమాత్రం రెంటికీజంకక, గుఱ్ఱమును హెచ్చరించు కుంటూ పట్టుదలతో ముందుకు సాగిపోతున్నాను.

అది, తెలతెల్లవారుతున్న వెలుగు చీకటులలో పందు-పక్షుల కలకలధ్వనులతో మిళితమైన ఒక స్త్రీ ఆర్తనాదం అస్పష్టంగా విన పడూతుంది. ఆదెసకు చెవులొగ్గి, కొంచం నిదానంగావిన్నాను. సందేహంలేదు. అది స్త్రీ కంఠస్వరమే. ధ్వనివస్తున్న వేపుకు గుఱ్ఱ మును పరుగెత్తించాను. సమీపించినకొద్ది ఆర్తనాదం మరీ దగ్గర యింది. గుర్తుపట్టానుకూడా! ఆగొంతుక అంబాలిక-మా చెల్లమ్మదే నాశరీరం కంపించింది. గుఱ్ఱంమీద నిలవకుండా కిందెక్కడ పడి పోతానో అని భయపడ్డాను. అతికష్టంమీద ఆతావును చేరాను. గుఱ్ఱంపైనుంచి కిందికుదికాను.

ఇంకా సందేహమేమిటి? ఆమె మా చెల్లమ్మా! కట్టుకున్న పట్టుచీరంతా చినిగి పాలికలైవుంది. ముఖమల్ జాకెట్టు ముక్క ముక్కలైవుంది. జుట్టంతా రేగి భీభత్సమైంది. పైట చెంగుమాత్రం కంఠానికి ఉరిపడి బిగుసుకొనివుంది నేను తొందరగా ఆముడిని సడ లించి విప్పాను. ఆమె శిరస్సును నాతొడపై చేర్చి-కళ్ళనీరు కారుస్తూ,

"అమ్మా! అయ్యో! చెల్లీ! ఏమైందితల్లి-ఈ ఘోరమేమిటి?" అని నేను డగ్గుత్తికతో అడగ్గా, ఆమె లేనిఓపిక నుతెచ్చుకుని—కళ్లు తెరిచి, హీనస్వరంతో—

"అన్నా! వొచ్చావా! నీకోసమే ప్రాణం నిలిచివుంది—ఆ బైరాగి—మళ్ళీ వొచ్చాడు—ఇక్కడికి తెచ్చాడు—మానభంగం చెయ్యాలని పెనుగులాడాడు—నేను సాగనియ్యక—కంఠానికి ఉరిపోసు కున్న—చచ్చానని వాడు వెళ్ళిపోయాడు—వాడి కంఠరక్తంతో నాకు బలితర్పణం వొదలు—నామనస్సుకి—అప్పుడే శాంతి—"

అని చెప్పి బిడ్డ నాతొడపై శిరస్సు వుండగానే—నా జవాబు కెదురైనా చూడకుండానే కళ్లుమూసింది. ఆమె ప్రాణవాయువు లీ అనంతవాయువులో కలిసిపోయినాయి—నాకు లోక మంధకారమైంది. అయినా, నా చెల్లి కడసారి చెప్పిన మాటలు—'వాడి కంఠరక్తంతో నాకు బలితర్పణం వొదులు—' సహస్రకంఠారవమై మారుమోగాయి అప్పటి నాముఖ మొక అగ్నిగోళమైంది—కళ్ళంట మహాజ్వాలలు ప్రజ్వరిల్లాయి—ఒరనుంచి కత్తినిదూసి—

"ఓరీ! బైరాగీ! నూరేళ్ళ కన్నెజీవితం మన్ను చేసిన నీకంఠ రక్తంతో, నా చెల్లి, అంబాలికకు బలితర్పణ మియ్యకపోతే—నా పేరు విక్రమదేవు కాదు—నేను క్షత్రియ బీజానికి పుట్టలేదు. ఈ నా కరవాలంతో నీగొంతుక కోసేవరకు, నేను అవివాహితుడనై బ్రహ్మ చర్య దీక్షవహిస్తాను—నీమరణం నాదీక్షా పరిసమాప్తికి తరుణం— నీచావు నాకు పెళ్లి! విను—ఇదే నాప్రతిజ్ఞ—"

అని పట్టలేని ఆవేశంతో నేను చేసిన భయంకర గర్జనలకు కాననమంతా దద్దరిల్లింది! మా చెల్లి మృతకళేబరంమీదపడి యెంత ఏడ్చానో నాకే తెలిదు—కరకర యెండలొచ్చేవరకు, నాకర్తవ్యమును నేను గుర్తించుకోలేక పోయాను. నాయేడ్చిన యేడుపంతా అరణ్య రోదనమైంది—నేను పొందిన వ్యధంతా వృధాయేకదా—అనుకుని, నా చెల్లెలి కళేబరమును నాగుడ్డపు మూపునకట్టుకుని, మరి కొంత కాలానికి నిజరాజధాని చేరుకున్నాను. బంధుగులు, మిత్రులు, పరి వారజనులు, చెలులు—ఉద్యోగులు, పౌరులాది సర్వజనుల ఏడ్పులతో ఆ నా డీనగరమంతా శోకదేవతకు నిలయమైంది.

విజయకుమారా! ఆనాడే కాదు—ఈ నాటివరకూ నా చెల్లి,

అంబాలిక, కడసారి చెప్పినమాటలు 'వాడికంఠరక్తంతో నాకు బలి తర్పణం వొసంగు—' నాహృదయంలో అనుక్షణమూ ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. ఇంతవరకూ బ్రహ్మచర్య దీక్షలోనే వున్నాను. సన్యాసి, సాధువు, బైరాగి, ఎవరుకాని నానగరంలో అడుగుపెట్టారూ అంటే, వాళ్ళని తక్షణం బంధించి ఖయిదు చెయ్యవలసిందనినా నాతీవ్రాజ్ఞం ఖచ్చితంగా అమలుజరుపబడుతూండడంవల్లనే—బైరాగి వేషంలో వున్న నిన్ను రాజభటులు బంధించడం జరిగింది. ఈనాడు నీరాక, నాకు సుదినమైంది—నా ప్రతిజ్ఞ నెరవేరగల శుభసమయం సమీపించింది కనుక, నువ్వింతటితో నాకు పరమమిత్రుడవైనావు.

త్వరగా చెప్పు! కాలముహూర్తి అనే ఒక దొంగ పేరును తగిలించుకుని, రాజకుమార్తెను ఆప్రశ్నలు కొప్పిన ఆ దొంగ బైరాగి యెక్కడున్నాడు? నేనిదగనమే బయలుదేరి వెళ్ళి వాడి కంఠరక్తాన్ని కళ్ళచూస్తాను.

అని విక్రమదేవు ఉద్రేకపూరితుడై లేచి నిలుచోగా—

"మిత్రమా! కొంచెం శాంతివహించు! వాడిచ్చిన ఐదు ప్రశ్నలలోనూ, నేనిప్పుడు సిల్ల ఒక్క ప్రశ్నకు మాత్రమే జవాబు తెలుసుకోగలిగాను—మిగిలిన నాలుగు ప్రశ్నలకుకూడా జవాబులు తెలుసుకుని తిరిగి వచ్చేటప్పుడు నిన్ను కలుసుకుంటాను. అప్పు డిద్దరము కలిసిపోయి ఆకాలముహూర్తి తల అణిగించవచ్చు."

అని విజయకుమారుడు విక్రమదేవుకు చెప్పి, తాత్కాలికంగా అతనిని శాంతపరచాడు.

"నేనిప్పుడు రెండవప్రశ్నమైన, 'మహా' నగరము పోవలసి వున్నది. ఆనగర మెక్కడుందో—దానికి మార్గమెటో—నీకు తెలిసిన యెడల వివరించి, నాతలచిన కార్యమునకు కొంత సాయంచెయ్యాలి!"

"నాకు వీలయినంత సాయంచెయ్యడానికి సంసిద్ధంగా వున్నాను ఇది నీకార్యమేగాక, నాకార్యంకూడా అయివుంది. కాని ఆమహానగర మెటువైపు వుందో—దానికి మార్గమెటో నాకేమీ తెలియదు. అయినప్పటికీ ఈ నగరపు వర్తకులు కొందరు వ్యాపారనిమిత్తమై, వివిధ నగరాలు తిరుగుతుంటారు. నేను వారిలో కొందరికి కబురుపంపి, ఆ మహానగరమనేది యెక్కడుందో తెలుసుకొంటాను. ఈలోపుగా నువ్వు నాఆతిథ్యంలో వుండి, ప్రయాణముల బడలిక తీర్చుకో—దారి

తెలియక వృథాప్రయాణములతో కాలయాపన చెయ్యడంకంటే, కొద్దిరోజు లిక్కడేవుండి, మార్గమును, దూరమును, వివరంగా తెలుసుకొని బయదేరడం ఉత్తమంకదా!"

"ఆనగరానికి సంబంధించిన వివరాలిక్కడే తెలుసుకోగలిగితే అది ఉత్తమోత్తమనడంలో సందేహ మేమీలేదు"

"ప్రయత్నించి చూదాము."

అని విక్రమదేవు వెంటనే ఒక ఉద్యోగిని రాపించి—

"మన నగరంలోని ప్రముఖ వర్తకులకు నాకబురుగా చెప్పి, వారిని తక్షణం పిలవడంపు—"

అని ఆజ్ఞాపించగా, ఆఉద్యోగి 'చిత్త' మని నిష్క్రమించాడు. విక్రమదేవు, తరువాత, విజయకుమారుని చెంత వుంచబడిన పండ్లు ఫలహారాదు లట్లె వుండిపోవడం గమనించి—

"అయ్యయ్యో! ఇదేమిటి విజయా! నేనిప్పుడు చూశాను. నా ధోరణిలోనే నింతవరకూ గమనించనేలేదు. ఎక్కడివాటి నక్కడే వుంచేశావు—" తినలేదేం?" అని ఆశ్చర్యంతో అడిగాడు.

"ఆఁ! దానికేంలే విక్రమా! నువ్వు చెప్పిన నీచెల్లెలి విషాద గాథను వినడంలో మునిగి, తినడంమరిచా."

అని విజయకుమారు బదులు చెప్పగా—

"ఈపూట మాయింట తలంటిపోసుకుని, ఈబైరాగి దుస్తులు తీసిపారేసి, నాతో హాయిగా భోజనంచేసి, విశ్రాంతి తీసుకుందువు గానిలే—"

అని విక్రమదేవు విజయకుమారుని రెండుచేతులూ పట్టుకుని లేవదీశాడు.

## ౧౬

విక్రమదేవ, విజయకుమారు లిరువురూ చెరొక ఉచితాసనం మీదా కూర్చునివున్నారు. వారికెదురుగా కొందరు వర్తకప్రముఖులు రాజాజ్ఞ లకై వేచివున్నారు. ఎన్నడూ లేని దానాడు మహారాజు తమ్మెందుకు పిలిపించాడో, తాము చేసిన నేరమేమిటో తెలియక, వర్తకులంతరూ తహతహలు పడుతుండగా, విక్రమదేవు, వారి వారిని ఉచితాసనాలపై కూర్చోనియమించి—

"వర్తక ప్రముఖులారా! మీవల్ల ఒక చిన్న సహాయము కావలసివుండి, పిలవనంపాను."

అని చెప్పడమే తడవుగా ఆవర్తకులు, తమ్ము దండించడానికి మహారాజు పిలిపించలేదని తెలుసుకొని, పరమానందభరితులై—

"ప్రభూ! దేవ ఆజ్ఞలు శిరసావహించడానికి పౌరు లెప్పుడూ సంసిద్ధులే! మావల్ల తమకు నెరవేరవలసిన కార్యమేమిటో శెల వియ్యండి—నిమిషాలమీద నెరవేరుస్తాము."

అని ఏకకంఠంతో అన్నారు.

"మరేమిస్నీ లేదు—ఈభూవలయంలో, మహా, శిమ, వాల, యబానగరము లనే నాలుగుపట్నములు యెక్కడున్నాయి—మన నగరంనుంచి వాటి కెంతదూరం? వాటి కేమార్గానపోవాలి? వర్తక సందర్భాలలో మీరనేక నగరాలు తిరుగుతుంటారు గాబట్టి, మీలో యెవరికియినా, నేనడిగిన నగరాల వివరం తెలుస్తే చెప్పండి."

అని మహారాజు అడిగినదానికి ఎవరినోటంట—మాటరాలేదు. అక్కడ చేరిన వందమంది వర్తకప్రముఖులు, ఒకరిముఖా లొకరు చూసుకోవడమేగాని, ఒక్కరూ లేచి జవాబు చెప్పినదిలేదు. విజయ కుమారుడు, చేసిన ప్రయత్నం విఫలమైందని, నిరుత్సాహపడ్డాడు. నర్షి నగరమును తెలుసుకొన్నట్లే, మార్గం తెలీక, అనేక కష్టనిష్ఠురాలకు గురియై, మిగిలిన నాలుగు నగరాలు తెలుసుకోవలసివుందని, తనలో తా ననుకొంటుండంగా, యింతలో—

"మహాప్రభూ! నాకు ఒక్క నగరానికి సంబంధించిన వివరాలు మాత్రం తెలుసు. మిగిలిన మూడు నగరాలను గురించి ఏమీ తెలీదు. వాటిపేర్లుకూడా యెన్నడూ విసలేదు. నాకు తెలిసింది, మహానగర మును గురించి—సముద్రమార్గాన వెళ్లాలి. మన నగరంనుంచి ఆనగ రానికి నూరుయోజనములకు పైగా దూరముంటుంది. ఓడ, ప్రవా హానికి యెదురు ప్రయాణం చెయ్యాలి. ఇతర వాతావరణమంతా సరిగావుంటే—కనీసం ఇరవై రోజులున్న పట్టుతుంది. అయిదారు సంవ త్సరాల క్రితంవరకూ, నే నానగరం వెడుతూ వస్తూవుండేవాడని. దరి మిలా, ఈ అయిదారు సంవత్సరాలనుంచీ, నే నానగరం పోయింది లేదు. అక్కడ నాకు రత్నాలబాపతు కొన్నిలక్షల రూపాయలు బాకీరావలసివుంటేకూడా ఒదులుకున్నా. ఏమంటే, ఆ నగరం బలి

కోరిందనీ—ఏ దేశంనుంచి కాని, ఏనగరంనుంచి కాని, కొత్తగా వెళ్ళిన ప్రతిమనిషినీ, వెళ్ళిననాడే మింగేస్తుందనీ ప్రతీతి. అందువల్ల నేనేగాకుండా, మరెవ్వరుగాని, ఆనగరం పోవడంలేదని వింటున్నా. బ్రతికుంటే బలుసాకన్నా తినొచ్చని, ఆపట్నంతో వర్తకాలే మానుకున్నారు."

అని, ఒక వర్తక ప్రముఖుడు చెప్పినదానిని విని—విక్రమదేవు డాశ్చర్యవిభ్రాంతుడై విజయకుమారుని వైపుచూశాడు. అతనికీ ఏమీ అర్థంకాలేదు.

"కొత్తగా వెళ్లినవారికేగాని, నగరవాసులకేమీ హానిలేదన్న మాట?"

అని విజయకుమారుడడిగినదానికి—

"లేదండి! నగరవాసులకేమీ హానిలేదు. కొత్తవారుమాత్రమే, ఆగడ్డమీద అడుగుపెడితేచాలు, రక్తంకక్కుని చచ్చిపోతున్నారు. ఈ ప్రకారం వెళ్ళినవాళ్లు చాలామంది తిరిగి రాలేదండి."

అని వర్తకుడు బదులుచెప్పాడు.

"మంచిది—మీకు తెలిసిన వివరం చెప్పినందుకు చాలాసంతోషం—పోయిరండి."

అని విజయకుమారుతోపాటు పద్మప్రభుపుకూడా శెలవిచ్చిన మీదట, వర్తకులందరూ, ఒక్కొరొక్కరుగా వెళ్ళిపోయినారు.

అనంతరం విక్రమదేవ, విజయకుమారులానగరవిశేషమును గురించి, తిరిగి ప్రస్తావించుకున్నారు—

"ఈ విడ్డూరమేమిటి విజయా? ఇటువంటి సందర్భంలో నువ్వా నగరమెలా వెడతావు?"

"వెళ్ళితీరాలి."

'అయ్యయ్యో! చూస్తూ చూస్తూ నిండు ప్రాణాన్నలా పోగొట్టుకొంటావు?"

ప్రాణమెప్పటికయినా పోయేదే! అది స్థిరంకాదని అందరికీ తెలుసు! ఏ మానవుడయితే లోకకళ్యాణంకోసం నిజప్రాణాలను బలిచేస్తాడో—వాడే కదా సార్థకజన్ముడు! దేశంకోసం, దేశకళ్యాణం కోసం అసువులుబాసి శాశ్వతకీర్తిని పొందిన మహాత్ములీ భారత దేశంలో ఎందరు లేరు? ప్రాణంపైగల తీపిచేత వారొకవేళ అప్పటికి

బ్రతికినా—ఈనాటివరకూ బ్రతికివుండరుగదా! అప్పుడు జీవాలను సద్వినియోగం చేసుకున్నారో—ఇప్పుడు వారు మూటగట్టుకొన్న కీర్తి చంద్రికలు సుస్థిరంగా వెలుగుతూ, త్యాగమూర్తులకు ఆదర్శప్రాయము లవుతున్నాయి.

హింస—భరించలేనిది, పాపభూయిష్టమైనది. హింసాపూరిత మైన దేశములో దరిద్రదేవత నిత్యతాండవం చేస్తుంది—పిశాచములు కొట్లాడుతవి—అహింసా సిద్ధాంతం శుభమంగళప్రదమైంది. మానవుడికి దేవత్వమును సిద్ధింపచెయ్యగలిగినది ఒక్క అహింసా సిద్ధాంత మొక్కటే! తపస్సు—యజ్ఞము—దానము—ధర్మము—సత్యము సర్వము, ఒక్క అహింసా వ్రతంవల్ల నెరవేరుతవి!

అటువంటి మహోత్కృష్ట మార్గమును వొదిలి, అందరి రాజకుమారులను హతమార్చిన మహాశక్తి చింతామణిని, వంచకుడు, మోసగాడు—అయిన ఆకాలమహర్షిని జయించలేక నేను బ్రతకడ మెందుకు? నశించిపోయే రాజలోకాన్ని పునరుద్ధరించి, దేశకళ్యాణానికి తోడుపడకపోతే, నాప్రాణం బరువుచేటుకదా! ఆచింతామణి ప్రశ్నలకు బదులు చెప్పి సర్వమానవకళ్యాణానికి తోడుపడడమో—లేక, ఆయజ్ఞకుండానికి ఆహుతినై నాశిరస్సునుకూడా కుండిననగర శాంతిభవనానికి వ్రేలగట్టించుకోవడమో—జరగవలసివున్నప్పుడు—అంతకంటే—ఇప్పుడీ మహానగరానికే బలికావడం ఉచితంగదా! సర్వజ్ఞుడవైన నువ్వు నన్నాశీర్వదించి పంపాలేకాని, నిరుత్సాహపరచకూడదు.”

“మిత్రమా! క్షమించు—నీకార్యదీక్ష నాకర్థమైంది! వెళ్లి, శుభములు పొందిరా! నీకై రేపే యిక్కడనుంచి ఒక ఓడను బయలు దేర దీయించి, ఆమహానగరము తెలిసివున్న వర్తకప్రముఖుని, మరి కొందర పరివారమును నీకు సాయమిచ్చి పంపుతాను.”

అని, వెంటనే హరినాయకగుప్త అనే ఆవర్తకముఖ్యుని పిలుచుకురావలసిందని ఒక పరిచారకుని పంపగా, అతడు, అంత వెంట ప్రభుగారు తిరిగి వర్తమానము పంపిన కారణం తెలియక ఖంగారు పడుతూవచ్చి విక్రమదేవ, విజయకుమారుల యెదుట నమస్కరించి నిలుచున్నాడు.

"గుప్తగారూ! మీరు రేపు ప్రయాణానికి సిద్ధంగావుండాలి." అని మహారాజు చెప్పగానే, హరినారాయణగుప్త మరింత తెల్లబోయి—

"నేనాండీ! ఎక్కడికి ప్రభూ ప్రయాణం!" అని యడిగాడు.

"మన రేవునుంచి, రేపుదయం తొమ్మిదిగంటలకు మహానగరం ఒక ఓడ బయలుదేరుతోంది."

"మహానగరమేనా అండీ?"

"అవును."

దానితో హరినారాయణగుప్త గుండెలు జారిపోయాయి.

"పెళ్లాం బిడ్డలుగలవాణ్ణి ప్రభూ!"

"అయితే యేం?"

"ఆమహానగరం, వెళ్ళినవ వాళ్ళని బలిగొంటుందని మనవి చేసుకున్నాగదండీ?"

"భయంలేదు. మీరొక్కరే కాదు. మీతో పాటు మా విజయకుమారు, ఇంకా మరికొందరు పరివారజనం, వుంటారు."

"నేనెందుకు లెండి ప్రభూ! నాకంటే, యింకా గట్టివాణ్ణి మరెవగ్నయినా ఏర్పాటు చేయించండి."

"అబ్బెబ్బె! అలా వీల్లేకండి! మీరానగరానికి మార్గం తెలిసిన వారు కావడంచేత, మిమ్మల్నే పంపవలసివుంది. మా విజయకుమారుణ్ణి అక్కడ దిగవిడిచిరండి—మీరింతకంటే యింకేమీ చెయ్యవలసిందిలేదు."

"ఎప్పుడో అయిదారేళ్ళనాడు చేసిన ప్రయాణమండి! నాకయినా, ఆదారి అంత యెక్కువగా గమనంలేదండి!"

"అసలు తెలీనవాళ్ళకంటే—నువ్వు నయంగదా!"

హరినారాయణగుప్తకు పచ్చివెలక్కాయి గొంతుకను పడ్డట్టుంది. రాజుగారి ఆజ్ఞ నిరాకరిస్తే ఏం ప్రమాదమో—నిరాకరించకపోతే అసలు, ప్రాణానికే మొప్పముంది. యెటూ చెప్పలేక బిక్కముఖం వేసుకుని నిలుచున్నాడు. అతని విషాదకరస్థితిని గమనించిన విజయకుమారుడిగాడు—

"అయితే గుప్తగారూ! ఆమహానగరం గెడ్డమీద అడుగుపెట్టినవాళ్ళకుగదా, ప్రమాదము?"

"చిత్తం, చిత్తం! అంతేనండి!"

"మీరా గెడ్డమీద అడుగు పెట్టనోవద్దు—కిందికి దిగనేవద్దు, ఓడలోనివారు, ఓడలోనుంచే తిరిగివచ్చెయ్యండి! అప్పుడింకేం భయంలేదుగా!"

"ఆఁ! నాకేం భయంలెండి మీరంతా వుంటారు."

అని, వర్తకప్రముఖుడన్నదానికి, విక్రమదేవ, విజయకుమారులు ఒకరిముఖాల్లోకొకరు చూచి, నవ్వుకున్నారు.

"మంచిది వెళ్ళిరండి గుప్తగారూ! రేపుదయం సరిగా ఎనిమిది గంటలకు ప్రయాణసన్నాహామీద యిక్కడకి దయచెయ్యండి."

అని, విక్రమదేవు అతనిని వీడ్కొలిపి, తాను నావికులకు కబురు పంపుట, విజయకుమారు ప్రయాణమునకు అవసరములయిన యేర్పాటులు చేయించుట, సమర్థులయిన పరివారజనమును యెంచి వారికి చెప్పవలసిన విషయములు చెప్పుట—మొదలయిన కార్యకలాపంలో మునిగివున్నాడు. మహానగరం బలికోరుతుందన్న విషయం అంతకు ముందే తెలుసుకొనివున్నవారవడంచేత, ప్రాణభయంవల్ల కొందరా ప్రయాణానికి జంకారు. మహానగరం భూమిమీద అడుగుపెట్టవలసిన పనిలేదనీ, గుప్తగారిలాగునే, విజయకుమారుని ఆనగరం చేర్చిన వెంటనే, మిగిలిన వారందరూ ఓడదిగకుండా, ఓడలోనివారు ఓడలో నుంచే తిరుగుముఖంపట్టవచ్చుననీ—విక్రమదేవుడు భయపడుతున్న వారిని హెచ్చరించి, అమర్చాడు అనుకున్న ప్రకారం, నియమిత కాలంలో ప్రయాణం సాగేటట్లు చేశాడు.

విజయకుమారుని వీడ్కొలపడానికి తానున్నూ ఓడల రేవు వరకు వెళ్ళి, మృత్యుదేవతకు నిలయమైన అటువంటి మహానగరం, సాహసించి వెడుతున్న మిత్రుని భవిష్యత్తు ఏమవుతుందో అని మనసు బితుకు చెందుతున్నప్పటికీ, దానిని పైకిగపడనియ్యక, తన నెరవేర వలసిన ప్రతిజ్ఞకు మూలపురుషుడయి నటువంటివాన్నీ—చింతామణి హింసాకాండను మాన్పి దేశకళ్యాణానికి పాటుపడగలుగుతున్నట్టిన్నీ నశించిపోతున్న క్షత్రియవంశాలను పునరుద్ధరించదలచినట్టిన్నీ, విజయకుమారుని రక్షించవలసిందని, యిష్టదేవతలను మనసులో ప్రార్థించుకుని, ఓడ కదిలి, కనుచూపు కందినంతవరకు అక్కడనేవుండి, అనంతరం, విక్రమదేవు, నిజమందిరాని కొచ్చాడు.

అది, పరిపాలకుని నియామకంపై బయలుదేరిన ఓడ గాబట్టి, నావికులు, తదితరోద్యోగులు, యెక్కువ జాగ్రత్త వహించివున్నారు. అందులోనూ, మహానగరమంటే మృత్యుమందిరమని పేరుపడినందు వల్ల, దాని దాపుకుపోతున్నవారు గాబట్టి, ఓడలోని వారందరూ మహామెళుకువతో వుండవలసిన అవసర మేర్పడ్డది. రాత్రులు నిద్రలు పోక, రామనామస్మరణలు—భజనలూ—చేసుకుంటూ, తమ వోడ కెటువంటి ప్రమాదమూరాకుండా చెయ్యవలసిందని, దైవప్రార్థనలు సల్పుకుంటున్నారు. హరినారాయణగుప్త—మధ్య మధ్య నావికులకు మార్గం తెలుపుతున్నాడు—ప్రయాణం సాగుతూంది.

ఇరవై రోజులు సాగవలసిన ప్రయాణంలో పదిరోజులు మాత్రం గడిచాయి. అంతవరకూ అందరూ సురక్షితంగా వున్నం దుకు ప్రయాణీకులందరూ సంతోషపడుతున్నారు. ఆకాశం అతి ప్రశాంతంగావుంది. గాలికూడా ప్రతికూలంగానూలేక, అనుకూలం గానూలేత, ఎన్నికలపోటీలో ఏ కక్షకూ చెందని తటస్థులు లాగా వుంది. అదికూడా ఒక ఉపకారమేకదా అనుకుని, మిగిలినపది రోజులూకూడా అదేవిధంగా ప్రయాణంసాగిపోతే బాగుండునని ఓడ లోని వారందరూ అనుకుంటున్నారు.

ఇంతలో ఓడ ఎందుకో ఊగులాడడం మొదలుపెట్టింది. గాలి లేదు—వానలేదు—ఆవూపు ఎందుకొచ్చిందా అని అందరూ ఆశ్చర్య పోవడం మొదపెట్టారు. అటుకొడితే యిటు—ఇటుకొడితే అటు నీటి మట్టానికి ఒరిగిపోతూంది. అంతపెద్ద వోడ నెంత గొప్పకెరటమయినా విసిరికొట్టలేదు. అది కెరటాలదెబ్బ కాదని, నావికులేగాక, ఓడలోని సామాన్యులు సయితం అర్థంచేసుకున్నారు. క్రమంగా ఆదెబ్బల తీవ్రత ఎక్కువయింది. ఆ విసురుదెబ్బల భయంకర శబ్దంకూడా విని పిస్తూంది. ఒక్కొక్కదెబ్బకు ఓడ తుత్తునియలవుతుందా అన్నంతటి భీతి కలుగుతూంది. ఎవరిప్రాణాలు వారు రక్షించుకోవలసిన పరిస్థితి యేర్పడ్డది.

''నేను ఆదిలోనేచెప్పాను—మహానగర ప్రయాణం వొద్దండీ అని! నామాట ఎవరూ విన్నారుకాదు. ఇప్పుడింతమందీ ఆనగరంపేరు చెప్పుకుని బలికావలసిందేనా!''

అని హరినారాయణగుప్త, నెత్తీ నోరూ మోదుకొని యేడవ

దం మొదలుపెట్టాడు.

“పిల్లలుగలవాణ్ణి—నన్నొదిలెయ్యండి మహాప్రభో—అని ఎంత వేడుకొన్న మహారాజులు విన్నారుకారు. ఇప్పుడేందారి! ఏ దేవుడడ్డమొస్తాడు. మహానగరంనుండి అప్పుడే ఏదో పిశాచం బయలుదేరింది. మధ్యదార్లోనే మనకడ్డంతగిలింది. ఓడకింద చేరి ఎంత లేసి దెబ్బలు కొడుతున్నదో! ఇందరి ప్రాణాలూ పుచ్చుకుంటుంది-తప్పదు.

ఏ విజయకుమారా! చెబుతేవిన్నావు కాదు. నీతోపాటు మా అందర్నికూడా యీ మృత్యుముఖానికి లాక్కొచ్చావు. కడుపులో చల్ల కదలకుండా మావూళ్లో మేంపడుంటే-మహారాజుకు స్నేహితుణ్ణంటూ వచ్చి—మమ్మల్నందర్నీ ప్రయాణానికి లేవదీశావు. ఇక మా పెళ్లాం బిడ్డల కెవరు దిక్కయ్యా? మా వ్యాపారాలన్నీ ఏంగానయ్యా?”

అని హరినారాయణగుప్త విజయకుమారుణ్ణి ఒత్తిడిచెయ్యడం మొదలుపెట్టాడు.

“అయ్యా! ఖంగారుపడకండి—మన ప్రయాణంలో స్వార్థంలేని సత్ప్రయత్నముంటే—పరమేశ్వరుడు మనల్ని తప్పకరక్షిస్తాడు.”

అని విజయకుమారుడు, గుప్తను కొంచం శాంతిపరచాలని చూశాడు.

“ఓడకిందికి పిశాచాలొచ్చి కొట్లాడుతుంటే, పరమేశ్వరుడంటా వేమిటయ్యా మహాప్రభూ! ఇంతకూ నాబుద్ధి గడ్డితింది—తెలిసుండీ గోతిలోపడ్డాను. నావల్లకాదండీ అంటే—రాజుగారు, తల కొట్టేస్తారా? అయ్యో! దేవుడా! నాకేందార్రా? సుఖాన్నున్న ప్రాణాన్ని దుఃఖపెట్టుకున్నారా! వర్తకులందరూ నోరుమూసుకూరుకుంటే—మా పెద్ద మొగాళ్లాగ మహానగరానికి దారి తెలుసని నేనెందుకు చెప్పానో! అదుగో! మహానగరపిశాచం—మళ్లీ కొడుతూంది—ఓడ బద్దలైంది—”

అని హరినారాయణగుప్త గోల చేస్తున్నట్లే-ప్రమాదస్థితి యేర్పడ్డది. ప్రాణరక్షణకోసం ఎవరిదారి వారు చూసుకోవలసిన సమయం! ఉపేక్ష చేసి లాభంలేదనుకుని, అప్పుడు నావికా నాయకుడు ప్రయాణీకుల దగ్గరకొచ్చి—

“అయ్యా! నాసాయశక్తులా వినియోగించాను. ఇక ఓడ కదలదు. అంతేగాక, కొద్దిసేపట్లో నీరు లోపల కెక్కుతుంది—ఓడ

ముగిసిపోతుంది, ప్రాణరక్షకోసం, ఎవరికే మార్గంతోస్తే దానిని చూచుకోవచ్చు.''

అని చెప్పేటప్పటికి, విజయకుమారుడు తప్ప ఓడలోని వారందరూ మొలుగెత్తి ఏడవడం మొదలుపెట్టారు.

''ఈప్రమాద మెందుకొచ్చినట్లు?''

అని విజయకుమారు డడిగిన దానికి—

''తిమింగలం దెబ్బ—తెలీడంలేదా ప్రభూ? ఇంతకంటే పెద్ద ఓడలుకూడా తిమింగలం దెబ్బకు బద్దలైపోవడం కద్దు. ఖర్మవశాత్తూ, సముద్రప్రయాణాల్లో సర్వతూగా, యిలాంటిది జరుగుతూ వుంటుంది.

అని నావికుడు బదులు చెప్పాడు.

''నౌకా ప్రయాణాల్లో యిలాంటి ప్రమాదాలు తప్పించుకోడానికి మార్గం కనిపెట్టుకో లేదన్నమాట?''

''మార్గమేముంటుంది—ఈ ఓడకు రెట్టింపాకారంగల ఆతిమింగలాన్ని ఎవరేం చెయ్యగలరు. అది తోకతో కొట్టిన ఒక్కొక్క దెబ్బకు ఒక్కొక్క పర్వతంకూడా కూలిపోవచ్చు. అలాంటిదీ ఓడనగా యెంత? త్వరపడండి—త్వరపడండి—చూస్తేలాభంలేదు.

విజయకుమారుడు ఏమీ పాలుపోవడంలేదు. తనమూలంగా అందరు బలికావలసివుండడం గమనించి, సహించలేకపోతున్నాడు. ఇంతలో నావికుడు—

''మీలో యెవరికయినా జలస్తంభన తెలుసునా?'' అని అడిగాడు. ఆమాట కర్థమే తెలియని ప్రయాణీకులు విలపించుకోకుండా, ప్రాణాపాయంవల్ల ఎవరి యేడుపులో వారున్నారు.

''తెలుస్తే యేమిటి?''

అని విజయకుమారు డడిగాడు.

''నీటిలోపుట్టి, నీటిలో బ్రతికే తిమింగలానికి నీటివల్లనే చావు కూడావుంది. అదెట్లనగా—దాని శరీరంమీద బండపాటి కొవ్వు కవచంవుంటుంది. అది గొడ్డళ్లతో కొట్టినా బద్దలుకాదు. తలకు కొంచం క్రిందిభాగంలో దాని శ్వాసేంద్రియ వుంటుంది. ఆ శ్వాసేంద్రియానికి ముక్కురంధ్రంగుండా గాలిపోతుంది—కెరటాలొచ్చినప్పుడాముక్కు రంధ్రాన్ని ప్రక్కగా తిప్పుకోకపోతేగాని, వేనివల్లనయినా ఆముక్కు రంధ్రంప్రక్కన మరోరంధ్రం పడితేగాని, తిమింగలం చచ్చిపడదన్న

మాట! జలస్తంభన తెలిసినవాళ్లు—చిన్న నావలో పలమునిగి—దాని ముక్కురంధ్రం దగ్గర దెబ్బతీశారంటే దానిపని అయిపోయింది.''

అని నావికుడు చెప్పినదానిని వినగా, విజయకుమారునకు ఆశ కలిగింది.

''అయితే ఆ ముక్కురంధ్రం ఎలాకనిపిస్తుంది!'' అని తిరిగి అడిగాడు.

''మాదగ్గర నీటి అద్దమొకటుంటుంది. నీటిలో మునిగినవారు ఆ అద్దములు పెట్టుకుని, దాని ముక్కురంధ్రమును చూడవచ్చు.''

''అయితే, నా కానీటద్దమియ్యి—నాకు జలస్తంభన తెలుసు! తక్షణం నీటిలో మునిగి, ఆతిమింగలాన్ని సంహరిస్తాను.''

''ఎంతమాట ప్రభూ! అది చాలాప్రమాదమైనపని—చావును కోరి తెచ్చుకోవడంవంటిది. మీరు మా రాజుగారికి ప్రాణమిత్రులైనట్లు తెలిసింది. మిమ్మల్ని కార్యానికి పూనుకోమనడానికి సాహసం లేదు.''

''పిచ్చివాడా! ఎటయినా చావుతప్పదుగదా! పరప్రాణరక్షణా ప్రయత్నంలో, నిజప్రాణాలను, కోలుపోవడంకంటే మానవుడు కోరుకోదగింది ంకేముంది? కొద్దిసేపట్లో ఓడ బద్దలవుతుంద—అందరం మునిగి చచ్చిపోతామని, నువ్వేకదా చెబుతున్నావు!

''నిజమే అయినప్పటికీ—అదృష్టమున్నవారు ఏ చెక్కో—ఏ ద్రమానో పట్టుకుని బ్రతుకుతారేమో—అందుని చూస్తూ చూస్తూ, తిమింగలంనోట్లో మెలాపడతారు?''

''నాకై ప్రయాణమైవచ్చిన యింతిమంది, నాకళ్ళయెదుట సముద్రంలోమునిగి చచ్చిపోవడం నేనుచూసి భరించలేను—ఆయువుందా, బ్రతుకుతాను—ఆ తిమింగలాన్ని చంపి మీ అందర్నీ రక్షిస్తాను. లేదా—నా చావు. తరవాత, మీమీ అదృష్టాలు ఎలావుంటే అలాకదండి—ఇక ఆలశ్యం చెయ్యక, ఆనీటద్దమేదో యిచ్చి, నన్నేదో చిన్ననావలో యెక్కించి, నీటిలో ముంచండి.''

అని విజయకుమారుడు నిర్బంధం చెయ్యడంవల్ల నావికుడు గత్యంతంలేక, వెంటనే నీటద్దమును తెచ్చి, దానిని ఉపయోగించే విధానం కూడా చెప్పి, విజయకుమారుని ఒక చిన్ననావలో కూచోబెట్టి యితర

నావికుల సహాయంతో, ఆనావను జలగర్భంలోకి ముంచారు. ఆనావకు కట్టబడిన వెయ్యిగజాల పొడవుగల గొలుసుకొన ఓడ కంటివుంది.

నావికుడు చేతులారా చెయ్యడము-విజయకుమారుడు మనసారా సముద్రగర్భంలోదిగి చావసిద్ధంకావడము—చూస్తూచూసి, యితర నావికులు—ప్రయాణీకులూ విభ్రాంతిలయినారు. అందరూ యేడుపులుమాని, అతడు నావలోదిగినవైపు చేష్టలుడక్కి చూస్తున్నారు. విజయకుమారుడు సముద్రంలో దిగబడిన పదినిముషాలకు ఓడ ఊపు ఆగింది—తిమింగలంకొట్టే దెబ్బలచప్పుడు కూడా వినిపించలేదు. దానినిబట్టి విజయకుమారుడు కార్యము సాధించాడని అందరూ అనుకొన్నారు. నావికులు, నావకు కట్టబడిన గొలుసును మెల్లిగా పైకిలాగారు—నావ తేలింది. అందులో విజయకుమారుడు తిరిగి కళ్లబడగానే, అందరూ ఆనందాశ్చర్యభరితులై అతనిని కౌగలించుకొని-ప్రాణదాతవని పొగిడారు, తడిసివున్న బట్టలను తీసి, పొడి దుస్తులను కట్టిపెట్టిన అనంతరం—

"అందర్నీ రక్షించావు తండ్రీ! ఇదంతా నీ పెద్దలచలవ!" అని హరినారాయణగుప్త, విజయకుమారుని కాళ్ళకు మొక్కాడు.

"మీ పెద్దలందరి చలవాకూడా!"

ఇంటూ అతనిలేవదీసి—

"ఇక ప్రయాణానికి యిబ్బందిలేదు—తిమింగలం, ప్రాణాలు పైకొదిలి—కళేబరాన్ని సాగరానికే దఫనైంది"

అని విజయకుమారుడు హెచ్చరించినమీదట, నావికులు ఓడను వెంటనే బయలుదేరదీశారు, తిమింగలం ఎంత ఎత్తున్నదో—ఎంత పొడుగున్నదో—అతడు దానిని ఏవిధంగా సంహరించాడో—మొదలయిన వివరాలను ప్రయాణీకులూ, నావికులూ, విజయకుమారుని మధ్యమధ్య అడిగి తెలుసుకుంటూ, అతనిసాహసమును మెచ్చుకుంటూ, మిగిలిన పదిరోజులూకూడా ప్రయాణంకూడా సురక్షితంగా సాగనిచ్చి, మహానగరరేవును చేరుకున్నారు ఎవరూకూడా ఓడదిగవలసింది లేదని చెప్పి. విజయకుమారుడు, తానొక్కడూమాత్రం ఓడనుదిగి, అందరకూ నమస్కరించి, మిత్రుడు, విక్రమదేవునకు తన కృతజ్ఞతను తెలుపవలసిందని కోరాడు. తరువాత, విజయకుమారుడు పురోగమనం సాగించాడు—ఓడ, తిరోగమనం సాగించింది.

## ౧౭

కుండినవగరాని కానాడు, మరొక రాజకుమారుడు చింతామణిని వివాహమాడగోరి రావడము—ఆమె అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పలేక, ఖండించబడడము, అతని శిరస్సు శాంతిభవన ద్వారానికి వ్రేలగట్టబడి. వెయ్యి కొకటి తక్కువయిన భర్తీని పూర్తిచెయ్యడము జరిగింది. ఆ నాటితో చింతామణి మనస్సు పూర్తిగా వికలమైంది.

ఖిన్నురాలై తనగదిలో కూర్చుని కంటతడిపెట్టుకుంటున్న చింతామణి దగ్గరకు శోభ వచ్చి—

"ఏమిటి చెల్లీ! దుఃఖించి యేం ప్రయోజనం? పూనిన వ్రతం పూర్తి కావాలిగదా?"

"అవుతుందన్న ఆశ నాకేమీ లేదే శోభా! ఈ రోజుతో, ఖండించబడిన శిరస్సులు వెయ్యి పూర్తయినాయి. ఇంతటినుంచి, గురువుల నియమప్రకారం, తిరిగి ఒకటి దగ్గరనుంచి లెక్క ప్రారంభం కావలసివుంది."

"జరుగవలసిందే కదా!"

"నెలలు, సంవత్సరాలూ గడిచిపోవడమే కాని, ఒక్క రాజకుమారుడయినా జవాబులు చెప్పలేకపోతున్నాడు."

"రాజకుమార్తె, అపూర్వచింతామణి తెలివితేటలతో సమానం కాగల రాజకుమారుడు ఇంతవరకు ఒక్కడూ లేడని తేలిపోయింది."

"అదు కేగదా, గురువుగారు అంత కఠినమైన ప్రశ్నలు నాకు చెప్పారు?"

"అవును. నిన్ను జయించగల వారొక్కరూ లేకపోవడమే గురువుల ఆశయంగా కనిపిస్తుంది."

"అయితే, నే నాజన్మాంతమూ యిలా కన్యగా వుండిపోవలసిందేనా? నా యౌవనసౌందర్యాలు, అడవినికాసిన వెన్నెలగా అంతరించి పోవలసిందేనా?"

"ఈ ప్రశ్నను గురువుగారినే అడగడం సమంజసం."

"నేను గురువుల ఆగ్రహానికి పాత్రురాలను కావాలని నీకోరికా అక్కా?"

"నాకటువంటి కోరికవుంటుందా చెల్లీ! అసమర్థురాల్నయిన నన్నడిగి ఏం ప్రయోజనమని—అలా చెప్పానంతే!"

"లాభంలేదు-వాళ్ళేమీ అడక్కూడదు-అడిగి లాభంలేదు."

అని, ఆయిరువురూ మాటలాడుకొంటున్న సమయంలో, ఒక పరిచారకురాలొచ్చి—

"మహారాజులు వేంచేస్తున్నారు."

అని చెప్పి వెళ్ళిపోయింది.

"నువ్వు కళ్లుతుడుచుకో చెల్లీ! నువ్వు దుఃఖపడుతున్నావని తెలుస్తే, ప్రభువుల మనస్సు మరీ కలతవుతుంది."

అని శోభ చెప్పిన యథార్థ విషయమును గ్రహించి, చింతామణి వెంటనే కన్నీళ్లు తుడుచుకొని తండ్రిగారొచ్చేటప్పటి ముఖాన ఎటువంటి దుఃఖరేఖలూ కనపించకుండా చేసుకుంది. శోభ, వచ్చిన ప్రభువులకు ఉచితాసనము నేర్పాటు చేసింది. కీర్తిశాముమహారాజా ఆసనంపై కూర్చుని—

"ఏంతల్లీ! కులాసాగావున్నారా?" అని అడిగాడు.

"ఉన్నాము నాన్నగారూ! అమ్మ యెలావుంది?"

అని చింతామణి తిరిగి యడిగింది.

"వుంది—ఆమె మనోవ్యాధి క్రమంగా దీర్ఘకాయులాకింద పరిణమించింది. నీజీవిత మిలా అయినందుకే ఆమె మొప్పూనూ, కుమిలి కుళ్ళిపోతున్నది."

చింతామణి అందుకేమీ బదులు చెప్పలేదు.

"ఏమమ్మా శోభా! నువ్వెలా వున్నావ్! మీ మంజులాదేవి, నిన్నడిగినట్లు చెప్పమంది—" అని మహారాజడిగిన దానికి—

"శోభ, రాత్రింబగళ్లు రాజరాజేశ్వరికి పూజలు చేస్తూ-న్నదని చెప్పండి అమ్మకి." అని చింతామణి బదులు చెప్పింది.

"అవునమ్మా? నువ్వుకూడా ఏదన్నా వ్రతం పట్టలేదు గదా?"

అని మహారాజా తిరిగి అడిగినదానికి, శోభ తలవొంచుకుంది బదులు చెప్పకుండా.

"ఈదినం మరియొక రాజకుమారుడు వచ్చాడని విన్నాను—ఫలితం ఎథాప్రకారమే గదా?"

"ఇంతకుముందు వెయ్యికొక శిరస్సు తక్కువ—ఇప్పుడా ఒక్కటీ పూర్తయింది ప్రభూ!"

అని శోభ బదులు చెప్పింది. కీర్తికాము డొక నిట్టూర్పును విడిచి—

"నే నిప్పుడొక ముఖ్యావసరమైన పనికలిగివచ్చాను—అదేమంటే—నాగపురాధీశ్వరుడైన ఛత్రపాలమహారాజు మన శిసునాగ వంశమునకే చెందినవాడట! మన పెద్దలు—వారిపెద్దలు సన్నిహితులె నట. మన బంధుకోటిలోనివాడయిన ఆ మహారాజుకు విజయకుమారు డనే ఏకైకపుత్రుడు కలడట. అతడు రూపమున మన్మథుడు—శౌర్యమున అర్జునుడు—బుద్ధిబలమున బృహస్పతినట. ఆ రాజకుమారుడు నీప్రశ్నలకు బదులు చెప్పి నిన్ను వివాహమాడవలెనన్న తలంపుతో, మన నగరానికి పయనమై వచ్చాడుట..."

అని చెబుతుండగా, శోభ ముఖమెఱ్ఱబారింది—ఆమె నేత్రాలెందుకో జ్యోతుల్లా వెలుగుతున్నాయి.

"ఆపేరుగల రాజకుమారు డింతవర కెవరూ రాలేదే!"

అని చింతామణి బదులు చెప్పింది.

"ఆరాజకుమారుడ కేమయింది ప్రభూ! విజయకుమారా?—అతని కేమైందండి—?"

అని శోభ, తన ఆరాటమును అణుచుకోలేక అణుచుకుని యడిగింది.

"ఏమైందో—మనకె తెలీదు. కుమారునిజాడ తెలియక—ఆ కీర్తికామమహారాజు నాపేర ఒక జాబును వ్రాసి, ముఖ్యమంత్రిని పంపాడు—" అని జాబునుతీసి యోగింగా చదివి వినిపించాడు—

"శ్రీ శ్రీ శ్రీ కుండినపురాధీశ్వర కీర్తికామమహారాజులుం గారి దివ్యసన్నిధికి—నాగపురసంస్థానాధీశుడు ఛత్రపాలుడు వ్రాసుకొనే విన్నపములు—

రూపమున మన్మథుడు, శౌర్యమున అర్జునుడు, బుద్ధికి బృహస్పతి—అయిన, నాయేకైకపుత్రుడు, విజయకుమారుడు, మీ అపూర్వచింతామణి ప్రతిజ్ఞను తెలుసుకుని, తా నామె ప్రశ్నలకు బదులు చెప్పవలెనన్న తలంపుతో—మేము వారించినా వినక, మీ కుండిన నగరానికి బయలుదేరి బహుకాలమైంది. ఇంతవరకూ మాబిడ్డ మా

కళ్ళబడలేదు. అతనుకూడా యితర రాజకుమారులవలెనే—ప్రశ్నలకు బదులు చెప్పలేక, చింతామణిచేత ఖండించబడినాడని మేమూహిస్తున్నాము—అట్లు జరిగినదా? లేక అతనిని గురించి మీకు తెలిసిన వివరము లేమయినావుంటే—దయచేసి తెలుపవలసినది. బిడ్డజాడ తెలీక పుత్రశోకంతో తల్లడిల్లిపోతున్న మా ప్రాణాలు మీజాబుకై ఎదురు తెన్నులు చూస్తుంటాయి. మేమనగా, మీశిసునాగవంశానికి చెందినవాళ్ళమే పూర్వం—మీపెద్దలూ మాపెద్దలూ సన్నిహితులై ఏకకుటుంబానికి చెందినవారే అని గమనించవలెను ఈ జాబును తెచ్చిన మా మంత్రిచేత వెంటనే బదులు వ్రాసి పంపగలందులకు ప్రార్థన.

ఇట్లు,
ఛత్రపాలుడు,
నాగపురాధీశ్వరుడు.''

అని వుత్తరమును సాంతముగా చదివిన అనంతరం—

''ఈజాబును తెచ్చిన మంత్రిని మన మందిరంలోవుంచి—విషయమును తెలుసుకునివస్తానని, అతనికి చెప్పి, యిక్కడికివచ్చాను.''

అని కీర్తికాముడు చెప్పగా

''ఆపేరుగల రాజకుమారు డెవ్వరూ యింతవరకూ లేరండి! సందేహంలేదు—ఏమే శోభా?''

అన్నది చింతామణి.

''అహాహాఁ! లేదు. ఆ రాజకుమారు డెవరో, చింతామణిచేత ఖండించబడలేదు—అతని తలిదండ్రులకు అలాగనే తెలుపండి ప్రభూ!''

అని శోభకూడా చింతామణి చెప్పినదానిని ఖాయపరచడం వల్ల, మహారాజా తావును వీడిపోయాడు.

అక్కడ తనరాకకై వేచివున్న, నాగపురిమంత్రిని కలుసుకుని-

''అయ్యా! మీ రాజకుమారు డిక్కడికి వచ్చాడో—లేదో మాకు తెలియదు. కాని ఆపేరుగల వారెవ్వరుకూ, మాచింతామణిని వివాహమాడగోరి రాలేదు—మాచింతామణిచేత ఖండించబడలేదు.''

అని చెప్పగా—అదికూడా ఒక శుభసూచకమైనదిగానే యెంచి, ఆమంత్రి, కీర్తికాముడు తనప్రభువుకు బదులుగా వ్రాసియిచ్చిన జాబునందుకుని, అతనిదగ్గర శలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

కుమారుని జాడ తెలుసుకొనిరావడానికై పంపబడిన మంత్రి కూడా అంతవరకు నగరం చేరకపోవడంవల్ల, ఛత్రపాల దంపతులు మరింత ఖంగారుపడుతున్న సమయంలో, మంత్రి వారినిచేరి—

“మహాప్రభూ! మన విజయకుమారుని జాడ వారికి తెలియదట- అపూర్వచింతామణి అనేపేరుగల రాజకుమారు నెవరినీ వధించలేదట- ఇదుగో! ఆకీర్తికామమహారాజులు తమకు వ్రాసియిచ్చిన జాబు.”

అని మంత్రి ఒక పుత్తరము నందియ్యగా, ఛత్రపాలు డాశ్చర్య సంతోషాలతో దాని నందుకుని రాణి, రమాదేవి కీవిధంగా చదివి వినిపించాడు—

“శ్రీ శ్రీ శ్రీ నాగపుర సంస్థానాధీశ్వర, ఛత్రపాలమహా రాజుల దివ్యసన్నిధికి—కుండిన నగారాధీశ్వరుడు, కీర్తికాముడు వ్రాయు విన్నపములు—

మీ అమాత్యవరుల వల్లను, మీరు వారిచేత పంపిన జవాబు వల్లను విషయములన్నియు తెలుసుకొంటిని. మీరున్ను మేమున్ను ఒకేవంశములోని వారమని తెలిసి, మిక్కలి సంతోషించితిని. తరువాత, మీ పుత్రుడైన విజయకుమారునికి సంబంధించిన ఎట్టి వివరములు గాని మాకు తెలియవు. అతడు మా చింతామణి ప్రశ్నలకు బదులు చెప్ప ప్రయత్నించుటగాని, ఆమెచేత ఖండించబడుటగాని యింతవరకు జరిగివుండలేదు. ఇది నేను, నాకుమార్తె చింతామణిని స్వయముగా అడిగి తెలుసుకొన్న విషయముగుటవల్ల, మీకెటువంటి సందేహ మున్నూ అవసరము లేదని మనవిచేయుచుంటిని.

ఇట్లు,
కీర్తికాముడు,
కుండిననగరాధీశ్వరుడు.”

ఆజాబు నాలకించిన రమాదేవి, లేచివచ్చిన ప్రాణంతో—

“మనవాడసలు ఆనగరం చేరాడో లేదో జాబులో వివరించ బడలేదు.” అంది.

“వారికసలు మనవిజయకుమారునికి సంబంధించిన వివరాలేవీ తెలియవని స్పష్టంగా రాశారుగారు.”

“అమ్మయ్య ఇప్పటి కొక్క విషయం మాత్రం ఖాయమైంది.”

“ఆఁ! చింతామణికి మాత్రం బలికాలేదు.”

"నాబిడ్డ ఏమైపోయినట్లోగదా! నన్నొదిలి యింతకాల మెప్పుడూ వుండలేదు. వేళకు తింటున్నాడోలేదో—పడక సౌకర్యాలు కుదురుతున్న యోలేదో—ఎక్కడున్నాడో—ఏంచేస్తున్నాడో!"

"తెలియని విషయాలనుగురించి ఎటూ నిర్ధారణ చెయ్య లేము—మంత్రీ! విజయకుమారుని గురించి నీ ఆలోచనమేమిటి?"

అని ఛత్రపాలుడు మంత్రినడగ్గా, అతను కొంచెం ఆలోచించి—

"ప్రభూ! విజయకుమారుని విషయంలో నాబుద్ధికి, మూడు పద్ధతులుతోస్తున్నవి. అవేమిటంటగా, ఒకటి— రత్నపురమార్గమును తెలుసుకోలేక దారితప్పి, యెక్కడెక్కడో తిరుగుతుండడం, రెండు- చింతామణి ప్రశ్నలకు జవాబులు తెలుసుకొనే ప్రయత్నంలో వుండ డం—మూడు..."

అని, మంత్రిచెప్పడానికి కొంచెం సందేహించగా—

"సందేహ మవసరంలేదు మంత్రీ! నీబుద్ధికి తోచినదేమిటో చెప్పు."

అని మహారాజు తిరిగి హెచ్చరించినందువల్ల—

"ఏ అరణ్యమార్గంలోనో—ఏ పర్వతగుహాలోనో—ఏఘాతుక మృగాలవల్ల ఏ ప్రమాదానికయినా గురికావడం"

అని మంత్రిచెప్పాడు.

"నాకాసందేహం ఎప్పుడూ లేదు. నాబిడ్డ చేతిలో ఖడ్గమున్నంత కాలం, ఘాతుకమృగాలేకాదు- ఘోరరాక్షసులయినా ఏమీ చెయ్య లేరు."

అని రమాదేవి కొడుకునిగురించి సగర్వంగా అంది.

"తథాస్తు! అలావుండాలనే కోరిక." అన్నాడు మంత్రి.

"నిజమే—మన విజయకుమారు, పదహారేళ్లు నిండకమునుపే, యుద్ధవిద్యలో పరిపూర్ణుడయ్యాడు—నిర్భయంగా భయంకర రణ రంగాల్లోకురికి, రెండుచేతులతోనూ కత్తులు మెరిపించి—శత్రు సైన్యాలను చీకాకుపరచి—సర్వసేనానినయినా డీల్లపోయేటట్లు విజయంసాధించేవాడు. ఇక క్రూరమృగాల విషయం—వేటంటే వాడికి వేడుక! సింహశార్దూలాది క్రూరమృగాల దెస్తులట్టుకుని చెల గాటా లాడేవాడు."

అని మహారాజు చెబుతుండగా—

"అప్పుడు—వ్యాసపీఠంనుంచి వచ్చిన బ్రహ్మానంద స్వాముల వారు, మన విజయకుమారుని గుణాలు మెచ్చుకుని, జలస్తంభనాది కొన్ని విద్యలు నేర్పలేదండీ?"

అని రమాదేవి జ్ఞాపకం చెయ్యగా—

"అవునవును—వ్యాసపీఠంనుంచి వచ్చిన స్వాములవారు! అందు చేత, విజయకుమారు కిటువంటి ప్రమాదాలు జరుగుతాయని మనం శంకించవలసింది లేదు." అన్నాడు మహారాజా.

"అవుననుకోండి. ఇప్పుడిక. మనబిడ్డనుగురించి, మనం తీసుకో వలసిన చర్యలేమిటి?"

అని రమాదేవి తిరిగి అడిగింది.

"నేనే స్వయంగా బయలుదేరి, నానాదేశాలూ గాలించి, విజయకుమారుడు ఎక్కడ తిరుగుతున్నాడో-ఎందుకు తిరుగుతున్నదో తెలుసుకోవలసివుంది."

"ఎందుకు ప్రభూ! మంత్రివిషయంలో తమకు విశ్వాసం లేకపోతే-ఆకార్యానికి నన్ను నియోగించండి! తమరెటువంటి శ్రద్ధ—బాధ్యత వహించి కార్యసాధనకు ప్రయత్నంచేస్తారో, నేనూ అదేవిధంగా చెయ్యగలనన్న నమ్మకముంది."

"సంతోషం! నీవంటి సమర్థులైన మంత్రులుండడంవల్ల గదా పాలకుల కార్యభారాలు కొన్నితగ్గడం? ఈదినమే బహుదూర ప్రయాణం చేసివచ్చావు. కొద్దిరోజులు విశ్రాంతితీసుకుని, ఆతరువాత, బొక్కసంలోనుంచి, కావలసినంత పైకమును, పరివారము తీసుకుని బయలుదేరు."

"దేవర ఆజ్ఞప్రకారమే చేస్తాను. కాని నాతో యితరమనుషు లనవసరం—కొందరిని వేరువేరు తావులకు పంపించడం మంచిది."

"యోగ్యమైనసలహా! ఏమయినా చెయ్యి—ప్రయత్నలోపం లేకుండావుండాలి—ఆపైన భగవంతుడేం చేయ్యదల్చుచుంటే అలా జరుగుతుంది."

"చిత్తము ప్రభూ!"

అని రాజు ప్రధానులొక నిశ్చయానికొచ్చిన తరువాత—

"ప్రధానీ! అపూర్వచింతామణియొక్క వ్రతం యింతవరకూ పూర్తికాలేదన్నమాట? ఆ వివరాలేమీ చెప్పావుగాదు.

అని రమాదేవి అడిగినమీదట—

"అమ్మా! ఆశ్చర్యం! యింతవరకూ నెరవేరలేదు—నెరవేరుతుందన్న ఆశకూడా ఆనగరంలో యెవరికీలేదు. ఆ రాజకుమార్తె అడిగే అతికష్టతరమయిన ప్రశ్నల కేరాజకుమారులూ బదులు చెప్పలేక హాతులవుతున్నారట! ఈప్రకారం ఇప్పటికి హాతులయిన వారి సంఖ్య సరిగా వెయ్యికి పూర్తి అయినదట!"

అని వివరించగా—

"మహాఘోరం! ఔరా! ఆరాజకుమార్తె కెంత స్వాతిశయం, ఎంత అహంభావం, ఎంత మనోగర్వం ఎంత, అహంకారం లేకపోతే, తన్నుజయించగల ప్రజ్ఞావంతులకోసం సవాల్ చేస్తుందా? తన సౌందర్యాతిశయాలకు, ప్రజ్ఞావిశేషాలకు, మెచ్చిసిగదా, అందరు మహావీర రాజకుమారులు, శౌర్యైశ్వర్యాధి పరాక్రమసంపన్నులు తన్ను వివాహమాడాలని వచ్చి, ఓడిపోతున్నందుకు. ఆమె గర్వం మిప్పటికెన్నోరెట్లు అతిశయించివుండాలి."

అన్నది రమాదేవి.

"అమ్మా! సరిగా మీరన్నమాటలే, ఆరాజ్యంలోని అశేష జనమూ అంటున్నారని, నేను పరోక్షంగావుండి తెలుసుకున్నాను."

"కాని తన్ను మించినవారేలోకంలోనూ లేరని, అంత చేటు విర్రవీగుతున్న కన్యకు పరిభవించబడే రోజు యెప్పుడో ఒకప్పుడు రాకతప్పదు—"

అని, రాణీరమాదేవి, మంత్రితో అన్నదానిని విని—

"ఇతరులగొడవ మనకెందుకొచ్చింది? ఏ కర్రకు నిప్పంటే—ఆ కర్ర కాలుతుందిగదా! ఆ జిజ్ఞాస మనకవసరం! మంత్రీ! ఇక వెళ్లి నీప్రయత్నంమీద నువ్వుండవచ్చు—అనేక కష్టనిష్టూరాలకోర్చి అనేక యోజనాలదూరంలో వున్న కుండినసగరం పోవడమేగాకుండా—ఇప్పటికి మాకొక చల్లనివార్త తెచ్చి పెట్టావు. అదే పదివేలు!"

అని మహారాజనగా—

"ప్రభూ! నా విద్యుక్తధర్మాన్ని నేను నెరవేర్చానంతేగాని మరొకటికాదు, శలవిప్పించండి."

అని రాజదంపతుల అనుజ్ఞనుపొంది, ప్రధాని, నిజమందిరానికి బయలుదేరి పోయాడు.

# ౧౮

ఓడల రేవులో దిగినవారు, సుమారు రెండామడలదూరం ఒక విశాలమైన రహదారీగుండా, నడిచి, లేక వాహనము లెక్కి, లేక అశ్వారోహణం చేసిగాని, పట్టణం చేరుకోవాలి. ఆ రహదారికి రెండు వైపులా దట్టమైన తాటితోపులున్నాయి. బాట నిదానమై నీటుగా వుంది గాబట్టి, ప్రక్కలనున్న తాటితోపులు ఎవరికీ అడ్డు లేవు— ఆటంకం లేవు.

ఓడ రేవు చేరేటప్పటికే సంధ్యాగాగమైంది. విజయకుమారు మిత్రులందరిదగ్గరా శెలవుతీసుకొని, వారిని సాగనంపి, ఆ సముద్రజలంలోనే కాలుసేతులు కడుక్కొని, పట్టణాభిముఖంగా బయలుదేరేప్పటికి, చీకటి కొంచమే అయినా, ఇరుప్రక్కలా వున్నవి. అతిదట్టమైన తాటితోపులు గాబట్టి, మార్గం మరీ యెక్కువ చీకటయింది. అయినా మధ్యలోవున్న దూరం, రెండామడలే, బహుకొద్ది—అని అంతకు ముందే, హరినారాయణగుప్తవల్ల తెలుసుకొన్నవాడవడంచేత, విజయకుమారు చీకటిగావున్నప్పటికీ ఏమీ జంకకుండా బయలుదేరాడు. కాని, కొత్తగా అడుగుపెట్టిన ప్రతిఒక్కరూ ఆ నగరానికి బలి అవుతున్నారన్న విషయం మర్చిపోకుండా అతిజాగరూకుడై—ముందుకు సాగుతున్నాడు.

ఆమడలో అరభాగమయినా నడవలేదు. ఎక్కడనుంచో ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. నాలుగువైపులా పరకాయించి చూశాడు. రహదారికి కుడివైపుగావున్న తాటితోపులోనుంచి, వస్తున్నదా ఆర్తనాదమని తెలుసుకున్నాడు. ఆపన్నులను రక్షించడమే నిత్యనియమంగా గలిగిన విజయకుమారు, రహదారిని వొదిలి—తాటితోపుకు అడ్డపడ్డాడు. ఎక్కడా ఎవరూ కనుపించడంలేదు. కాని, మరి కొంచందూరంలో ఆర్తనాదం మాత్రం వినిపిస్తూనేవుంది. ఆ దెస కతను వడివడిగా నడిచాడు. అప్పుడు తిరిగి నాలుగువైపులా చూశాడు. మనుషులెవరూ కనుపించలేదు. తాటిచెట్లడ్డమువడంవల్ల, విలపించేవారు కనుపించడంలేదనీ, అడ్డం తొలిగించుకుని, మరికొంచం దూరంపోతే, ఆ విలపించే వారెవరైందీ తెలుస్తుందనీ ఊహించి, ధైర్యంగా చెట్లసందుల్లోంచి మరి కొంచందూరం పోయి చూశాడు.

పోయినకొద్దీ ఆర్తనాదం దగ్గరవుతున్నట్లుండే కాని—దూరం మాత్రం యింకా యింకా యెక్కువవుతూంది. అదేమిటబ్బా అని, కొంచంసేపు నిదానించి ఆలోచించాడు. ఏమీ అర్థంకాలేదు. అంత దూరమొచ్చి విషయం తెలుసుకోకుండా వెనక్కి మళ్ళడానికి మన స్కరించలేదు. తిరిగి పట్టుదలతో ముందుకు సాగిపోయాడు. అప్పటికి ఎంతదూరమొచ్చాడో—కొస కామార్గ మతన్ని ఎక్కడికి తీసుకు పోతుందో ఏమీ తెలియడంలేదు. దూరం నడిచినకొద్దీ, అతనికి పట్టు దల యెక్కువయింది. అదేవిధంగా మరి కొంతదూరం పోగాపోగా—దూరాన ఒక మంట కనుపించింది. అది శ్మశానమై వుండవచ్చుననీ—ఏ మృతకళేబరమో దహించబడుతూ వుండడంచేత, చనిపోయిన వారి తాలూకు ఆప్తబంధువు లెవరో ఆవిధంగా కలవిస్తున్నారనీ అత నూహించుకుని, మరి కొంచం చురుకుగా సాగిపోయాడు. కాని ఆ మంటలు తిరిగి ఆదెసను కనుపించకుండా ప్రక్కగా మరొక వైపున కనుపించాయి—మంటలెలా కదుల్తాయనీ—తనునడవడం పొరబాటయి వుంటుందనీ అనుకుని, ఈసారి మళ్ళీ ఆమంటలు కనుపించిన దెసకు నడిచాడు. అక్కడినుంచే ఆస్త్రీ యేడుస్తున్న ధ్వనికూడా వినిపిస్తు న్నట్లయింది. తన సందేహం తీరిపోయిందనుకోవడంవల్ల, ఈసారి మరింత వడిగానడిచి, ఆర్తనాదాన్నీ, మంటల్నీకూడా సమీపించాడు.

తీరా సమీపించేటప్పటికి ఆమంటలూ లేవు——ఆర్తనాదమూ లేదు——మనుషులూ లేరు! అతను విభ్రాంతుడయ్యాడు. నిలిచిన చోట్లో అలా స్తంభించిపోయాడు వీపుమీద ఎవరో పిడీమని ఒక పెద్ద చరుపుచరిచారు! ఆ బలమైన చరుపుకు, విజయకుమారుడుగాక, మరెవ్వరయినా, భూమికంటుకుపోయి, తపసుని చావవలసిందే! విజయ కుమారు తత్క్షణం ఒరనుంచి కత్తిదూసి వెనుదిరిగాడు. యెవరున్నారు? చీకటి——గుడ్లగూబల అరుపులు——అంతే!

హరినారాయణ చెప్పిన విషయమంతా జ్ఞాపకమొచ్చింది. అయినా అతని ధైర్యంసడలలేదు. ఆధైర్యమే అతనికి శ్రీరామ రక్ష అయింది.

"రాజకుమారా!"

అని యెవరోపిలిచారు ఆశబ్దం ఊర్ధ్వభాగనుంచి రావడంచేత,

చాడు. అంతటినుంచి, బైరాగివేషం తనపనుల కనుకూలిస్తుందనీ—అన్నవరూ అనుమానించరనీ ఆవిధంగా వుంటూవచ్చాడు.

దేవత్వంనుంచి భ్రష్టుడనైన నన్ను వశం చేసుకుని, తన త్రిశూలానికి ఆవాహనచేసుకున్నాడని చెప్పానుగదా! అప్పటినుంచీ, నాకు కావలసిన ఆహుతినిస్తూ—నాచేత తనకు కావలసిన పనులు చేయించుకుంటున్నాడు. ఇలావుంటుండగా, ఈదేశపు మహారాజైన చంద్రసేనమహారాజు ఆ బైరాగియొక్క దుండగ చర్యలు తెలుసుకుని, అతనిని కొట్టి, అతనిదగ్గిరవుండే మంత్రశూలమును అపహరించి, తరిమేశాడు. మంత్రశూలం బైరాగి స్వాధీనంనుంచి తప్పిన వెంటనే నేనున్నూ ఆశ్రయంలేని వాడినయ్యాను. అంతేగాక ఆబైరాగి చేసిన దుష్కార్యాలకు సాయపడిన వాడవవడంచేత, మహాపాపం నన్ను చుట్టుకుంది. అందుకే ఈ పదిసంవత్సరాలనుంచీ బ్రహ్మరాక్షసినై ఈ తాటిచెట్టు నాశ్రయించుకుని వున్నాను.'' అని రాక్షసి చెప్పిందానిని విని—

''మంచిది-అయితే నువ్వీవిధంగా మార్గస్థులను హింస చెయ్యడం దేనికి?''

అని విజయకుమారు డడిగాడు.

''అడగవలసిన ప్రశ్నే అడిగావు. నాకు ఆహుతికావాలి—నగరవాసులందరికీ నావునికి తెలిసింది. స్త్రీ కంఠంతోనే నేనుచేసిన ఆర్తనాదంగాని, దానితప్పించడానికి చూపించేమంటలుగాని, వాళ్ళనిప్పుడు మోసంచెయ్యలేవు. కొత్తలో అయిదారుగురుమాత్రం నామోసంలో చిక్కుకుని. నాకాహుతి అయ్యారు. ఇప్పుడు పట్నవాసులు ఒక్కరూ నాకులభ్యంకారు. అందువల్ల ఓడదిగి ఈమార్గంగుండా నగరంలోకి వాళ్ళకోసం చూస్తుటాను. ఒక్కొక్కళ్ళదగ్గర ఒక్కొక్కతంత్రం ప్రయోగంచేస్తాను. నాకు స్థానబలం ఎక్కువగావుంది. నానివాసమైన ఈతాటిచెట్టు దగ్గరకొచ్చిన తరువాతగాని, నేనవళ్ళ ఏమీ చెయ్యలేను. కొందర్ని, నిన్నుచేసినట్లే చేస్తాను. లేదా ఒక్కొక్కరికి అందమయిన యౌవనస్త్రీగాను, ఇంకొకరికి వృద్ధబ్రాహ్మణిలాగను, మరొకరికి సాధువులాగనూ కనుపించి, ఏదో వుపాయంవల్ల మెల్లిగా నానివాసమైన ఈతాటిచెట్టు దగ్గరకు తీసుకొచ్చి, నిన్నుచరిచినట్లే వీపుమీద ఒక్కచరుపు చరుస్తాను. వెంటనే

వాళ్లు నెత్తురు కక్కుకుని చచ్చిపోతారు. నాకు కడుపునిండా ఆహారం దొరుకుతుంది. ఈప్రకారంగా, ఈదారంటపోయిన పరదేశీయులు అనేకమంది నాకాహారమైనారు.

నువ్వు అసామాన్యుడివికాబట్టి, నాచేతుల్లో చావు తప్పించుకున్నావు. అయినా నిన్ను పట్నంలోకి పోనియ్యను. పోనియ్యక ఏం చేస్తావని అడుగుతావేమో—అదంతా యిప్పుడు చెప్తను. చెబుతే నువ్వు ముందుగానే ప్రాణ త్యాగపడగల అసాధ్యుడివి. నువ్వు నాకు సహాయంచేస్తానని వాగ్దానం చేశావు. నీ వాగ్దానాన్ని నెరవేర్చినప్పుడు గాని, నువ్వు పట్నంలోకి పోలేవు. ఏమంటావు? చేసిన వాగ్దానం నెరవేరుస్తావా?''

అని ఆభూతం తీవ్రంగా అడిగింది.

''నేనింతవరకూ ఆడిన మాట తప్పలేదు. నీకు నావల్ల కావలసిన పనేమిటో చెప్పు—తప్ప చేస్తానని యీవరకే మాటిచ్చాను. నువ్వు చేస్తున్న ప్రజాహింస చాలా అన్యాయమైంది—దానిని నేను సహించను—నేనేమైపోయినా లెక్కచెయ్యక, నిన్ను కావులోంచ వెళ్ళగొట్టి తీరతాను.''

అని విజయకుమారుడు ఖండితంగా చెప్పాడు.

''నేనుకూడా యిక్కడనుంచి వెళ్లిపోవాలనే కోరుకుంటున్నాను.''

'నేనేంచేస్తే నువ్విక్కడనుంచి వెళ్లిపోతావు?''

''అదే చెప్పబోతున్నాను, నువ్వు మధ్యలో ప్రశ్న వేశావు. చెబుతున్నా విను—ఇక్కడికి అయిదు యోజనాలదూరంలో వరాకురాంపల్లె, అని ఒక చిన్నగ్రామముంది. ఆగ్రామంలోని పూజారి శివమ్మ రక్తదానంచేసి సంపాదించిన పుణ్యంలో సగం నాకు ధారపోసినట్లయితే—నాకీ పిశాచరూపం పోతుంది.''

అని పిశాచంచెప్పిన దానికి, విజయకుమారుడమితమైయిన ఆశ్చర్యమును పొంది—

''పూజారి శివమ్మ యెవరు? రక్తదానమేమిటి? ఆ పుణ్యవిశేషం ఎలావచ్చింది? నాకు వివరించి చెప్పు.''

అని అడిగినమీదట, తాటిచెట్టు మువ్వలోనుంచి, పూజారి శివమ్మకు సంబంధించిన వివరాల నాభూతం యిలా చెప్పడం మొదలుపెట్టింది—

"రాజకుమారా! ఇది చాలా సంవత్సరాలకు పూర్వం జరిగిన సమాచారం. నేను మొదట చెప్పిన ఆ పరశురాం పల్లెలో ఇద్దరు వృద్ధులైన మాదిగ దంపతులుండేవారు. వాళ్ళకి చిన్నప్ప అనే పదహారేళ్ళ కొడుకు ఒక్కడేవున్నాడు. నూరేళ్లు నిండిన ఆ శతవృద్ధులకు చిన్నప్ప ఒక కల్పవృక్షమనుకో—తలిదండ్రులు కాలుకింద పెట్టనవసరం లేకుండా సేవలు చేసేవాడు రోజుకు ఒకజత చెప్పులు కుట్టుకుని, వాటి నమ్ముకోవడంవల్ల వచ్చే కొద్దిపైకంతో చిన్నప్ప తలిదండ్రుల కేటు వంటి లోటున్నూ రానియ్యక, కంటికి రెప్పలాగ కాపాడేవాడు. చిన్నప్పలాంటి కొడుకు దొరకడం, ఆ తలిదండ్రులు చేసుకున్న పుణ్యమని గ్రామస్థులందరూ అనుకొనేవారు.

అప్పటికి కొద్దిరోజుల క్రితం, చిన్నప్ప తల్లి జ్వరపడింది. వాళ్ళ కులస్థులలోనే వైద్యం తెలిసిన ఒక పెద్ద, ఏదో మందిచ్చి జ్వరం నయంచేశాడు. తన తలిదండ్రులు, కనీసం మరొకవంద సంవత్సరాలయినా జీవించివుండాలని, చిన్నప్పకోరిక, జ్వరపడి లేచింది లగాయితు, చిన్నప్ప తల్లికి కొంచం జిహ్వాచాపల్యం ఏర్పడింది. చిన్నప్ప కష్టపడి చేసిందానిని తల్లి హితవుగా తినకపోవడంవల్ల, చిన్నప్ప నిత్యము మనసులో చాలా బాధపడుతుండేవాడు.

ఒకనాడు తల్లిదగ్గర చేరి ప్రీతితో అడిగాడు.

"ఏమమ్మా! నేను పెట్టిందాన్ని సరిగా తినడంలేదు? నీకు ఏది హితవుగా వుంటుందో చెబితే దానినే చేస్తానుగదా!"

"అయ్యో! కాటికి కాళ్లుచాచుకున్న ఈ వయసులో నాకు రుచులొకటా నాయనా! తల్లినైవుండి నీకు చేసిపెట్టవలసిందాన్ని అవధ్యూరాల్నయి. తే: లేని పరిస్థితిలో వున్నాను. మా పుణ్యమా అని మా కొడుకునైనందుకు గంజికాచి పోస్తున్నావు—ఏలోపమూ రాకుండా కనిపెడుతున్నావు. అది చాలక నారుచులు—నాకోరికలు—నీకు చెప్పాలా! నాకేమీ వొద్దుకాని నాయనా! ఎక్కడయినా తటస్థమైనప్పుడు, నాలుగు చింతకాయ లెక్కడయినా దొరుకుతే తీసుకురా. ఆ చింతకాయల పులుసు తాగాలనివుంది."

అని అప్పుడు తల్లి చెప్పినదానిని మనసులో పెట్టుకున్నాడు చిన్నప్ప, చింతకాయలకోసం గాలించడం మొదలుపెట్టాడు. కాని అవి అప్పటి కెక్కడా దొరకలేదు. తల్లియొక్క ఆచిన్న కోరిక తీర్చ

లేకపోయానే అని మనసులో చాలా బాధపడుతున్నాడు చిన్నప్ప. ఒకరోజు ప్రత్యేకం అదేపని పెట్టుకున్నాడు. చింతచెట్లు ఎక్కడున్నాయో వెదకడం ప్రారంభించాడు. గ్రామంలోవున్న ఒకటి రెండు చెట్లూ, కాయలులేని బోడిచెట్లు కావడంచేత, గ్రామం వొదిలి బయలుదేరాడు. పల్లెకు రెండుమూడు కోసులదూరం పోయేటప్పటికొక చిట్టడవిలో బ్రహ్మాండమైన ఒక పెద్ద చింతచెట్టు కనుపించింది. దానినిండా వున్నాయి కావలసినన్ని కాయలు. చిన్నప్ప పట్టలేని సంతోషంతో చెట్టెక్కాడు. తలకు చుట్టుకున్న గుడ్డతీసి, ఆగుడ్డనిండా కోసిన కాయలు మూటకట్టుకున్నాడు. ఒకచేత్తో చింతకాయలమూట పట్టుకుని, రెండో చేత్తో అందిన కొమ్మలను పట్టుకుని మెల్లిగా చెట్టు దిగుతుంటే, కాలుజారింది—'అమ్మో' అని ఒక్కకేకేసి కింద పడిపోయాడు. దెబ్బయితే ఏమంత ఎక్కువగా తగల్లేదుకాని, భయంవల్ల గుండె జారిపోయినట్లయింది. కొంతసేపటివరకు తెలివి తెచ్చుకోలేకపోయాడు. తరవాత లేచి నిలుచున్నాడు. కాని మామూలుమనిషి కాలేదు. తన చేతుల్లోని చింతకాయలమూట మరో కొంచందూరంలో తూడిపడిపోయిన సంగతికూడా చిన్నప్పకు జ్ఞాపకంలేదు. ఆ మూటనక్కడే వొదిలేసి—'దాహం—దాహం—' అని పెద్ద పెద్ద కేకలేసుకుంటూ గ్రామంలో కొచ్చాడు.

అతన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ముఖం కోళికలు మారాయి—చూపు మారింది. ఎవరితోనూ మాట్లాడ్డంలేదు. 'దాహం—దాహం' అని కేకలేస్తూనే, పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ—తమ పేట చేరాడు.

"ఏం చిన్నప్పా! దాహం కావాలా? మాయింటికిరా—మేమిస్తాం—మాయింటికిరా మేమిస్తాం—"

అని కులస్థులనేకమంది చిన్నప్పను పిలిచారు. కాని చిన్నప్ప, ఎవరింటికీ వెళ్ళలేదు—ఎవరితోనూ మాట్లాడలేదు. అతని తీరు ఎవరికీ అర్థంగావడం లేదు.

"చిన్నప్పకి పిచ్చిపట్టింది." అని కొందరు—

"మతోయింది" అని మరికొందరూ అన్నారు. కొంద రతన్ని వెంబడించి యింటిదాకా వెళ్లారు.

'దాహం—దాహం—"

బయలుదేరి వెళ్లి—ఇప్పుడిలా అయిపోయేచ్చావేంరా బాబూ! మాకేందార్రా చిన్నప్పా?''

అని, తల, గుండెలూ బాదుకుని ఏడుస్తున్న వృద్ధుల్ని పట్టుకోవడం అక్కడివాళ్ళకు మరీ కష్టమైపోయింది. గుండెలు బ్రద్దలై—ముందర ఆవృద్ధు లెక్కడ చచ్చిపోతారో అని అందరూ భయపడ్డారు.

''మీ చిన్నప్పకేం భయంలేదు—ఏదో—పైత్యోద్రేక మొచ్చివుంటుంది—మేం వైద్యం చేయించి నయం చేయిస్తాం! మీరేడవకండి.''

అని కొందరు గ్రామ పెద్దలు ముందుకొచ్చి, చిన్నప్ప తలిదండ్రులకు ధైర్యం చెప్పి, తత్క్షణం కొందరు సమర్థులయిన వైద్యులను పిలిపించారు. వైద్యులు చెయ్యవలసిందంతా చేసి—

''ఇది ఒంటిని పుట్టిన రోగం కాదు—ఏదో గ్రహాలక్షణంలా కనిపిస్తూంది—ఆ బాపతు వైద్యం చేయించండి.'' అని వెళ్లిపోయారు.

''సరి దానికేముంది? మన వాళ్లో నేవున్నాడు భయంకరాచారి—పిలవండి—అతని పేరు చెబితే యెటువంటి దెయ్యాలన్నా పారిపోతాయి.''

అని గ్రామ పెద్ద లనినవెంటనే కొందరు పరుగెత్తుకెళ్ళి, భూత వైద్యంలో పేరెన్నికగన్న భయంకరాచారి పిలుచుకొచ్చారు. అప్పటికికూడా చిన్నప్ప—''దాహం—దాహం.'' అని గొంతుక చించుకుని అరుస్తూనేవున్నాడు. భయంకరాచారి వేసి—ముగ్గులుపెట్టి, పద్మం వేసి, నిమ్మకాయలు తెప్పించి—ఏమిటేమిటో చేసిన అనంతరం చిన్నప్పని ముగ్గులో కూచోమన్నాడు—చిన్నప్ప కూచోనని భీష్మించాడు. పదిమంది బలమైన మనుషులొచ్చి, చిన్నప్పనిపట్టి, పద్మంలో కూచోబెట్టారు. భయంకరాచారి ఒక పేము బెత్తమును పట్టుకుని, చిన్నప్పకు దగ్గరగా నిలుచుని—

''ఓం—హ్రీం—హ్రాం—హ్రీం—హ్రాం—'' అని ఏవో బీజాక్షరాలు పఠిస్తూ—

''నా పేరు భయంకరాచారి! చెప్పు—ఎవరు నువ్వు—మాచిన్నప్పనిలా యెందుకు పీకుస్తున్నావు?''

అని భయంకరాచార్లు గద్దించి అడుగుతున్నాడే గాని—బదులు జవాబేమీ రావడంలేదు.

"ఇది సామాన్యపు దెయ్యంకాదు—బ్రహ్మరాక్షసి—దీని కిది పనికాదు—హోమం చేస్తా—కట్టెలు, పిడకలు వగైరాలు తీసుకురండి."

అని భయంకరాచార్లు అనడమే తడవుగా, అతను కోరినవన్నీ సమకూర్చబడ్డాయి. హోమం ప్రారంభం చెయ్యబడింది. మధ్యలో భయంకరాచారి—

"ఇప్పటికయినా చెబుతావా? ఇంకా గట్టిపని చెయ్యాలా?"

అని యడిగాడు. చిన్నప్ప యధాప్రకారంగా—

"దాహం—దాహం—"

అని గొంతుక చీలిపోయేటట్లు అరుస్తునేవున్నాడు. భయంకరాచారి బెత్తమునెత్తి—

"నీకేం కావాలో చెప్పు—మర్యాదగా చెప్పకపోయావో—నీకు చావు మూడిందన్నమాటే—"

అని చిన్నప్పను చురుక్కు చురుక్కున బాదడం మొదలు పెట్టాడు.

"చెప్తా—చెప్తా—కొట్టొద్దు"

అన్నది చిన్నప్ప నావహించిన దెయ్యం.

"సరి—చెప్పు—ఎవర్నువ్వు? మా చిన్నప్ప నెందుకు పట్టుకున్నావ్!"

"నాతప్పులేదు—నేను నివసించే చింతచెట్టెక్కాడు మీ చిన్నప్ప—ఎక్కడమే గాకుండా, ఆచెట్టుమీదినుంచి కిందపడ్డాడు—జడుసుకున్నాడు. అందుచేత నేను మీ చిన్నప్ప నావహించాను. నేనొక రాచస్త్రీని—చనిపోయేటప్పుడు నాకు గొంతుకలో నీళ్లు పోసిన వాళ్లెవ్వరూ లేకపోవడంవల్ల, దాహంతో చచ్చి, ఇలా దెయ్యము నయినాను."

అని చిన్నప్ప నావహించిన దెయ్యం చెబుతుంటే, అందరూ ఆశ్చర్యపోయారు. దెయ్యము చేత పలికించిన భయంకరాచారి ప్రజ్ఞను మెచ్చుకున్నారు.

"అయ్యో నాచింతకాయలు మాసిపోనూ! నాబిడ్డ నాగురించే యింత నొచ్చుకొన్నాడు—నానోరు పడిపోను—నారుచులు నాశనంగానూ—చింతకాయలు కావాలని నే నెరక్కపోయి చెప్పారా నాతండ్రీ!"

అని చిన్నప్పతల్లి, మరీ గుండెలు బద్దలయ్యేలాగ యేడవడం మొదలుపెట్టింది.

"ఇది గ్రహచారంగాని—నీ తప్పు లేదమ్మా—నువ్వు కొంచం సేపు ఊరుకో—ఈ దెయ్యాన్నిసంగతి నే కనుక్కుంటాగా?"

అని, భయంకరాచారి వృద్ధురాల్ని కొంచం శాంతింపజేసి-చిన్నప్ప నావహించిన దెయ్యంతో—

"నువ్వు దాహంతో చచ్చి దెయ్యమయ్యావు—మా చిన్నప్పను పట్టుకున్నావు. బాగుంది—ఇప్పుడు నీ కేం కావాలి?" అని అడిగాడు.

"నా కేమీ వొద్దు—నా దాహం తీర్చండి—నేను వెళ్లిపోతా."

"నీ దాహం ఎలా తీరుతుంది?"

"కన్నె పడుచు వేడి రక్తంతో గాని నా దాహం తీరదు—పురుషస్పర్శ ఎరుగని ఏ స్త్రీ అయినా సరే—తన శరీరం లోంచి కడవతో కడివెడు రక్తం తీసి నాకిచ్చిందంటే—నాకు దాహం తీరుతుంది—నేను వెళ్ళిపోతాను."

అని చిన్నప్ప నావహించిన భూతం చెప్పగా అక్కడి వారందరూ ముక్కుమీద వేలేసుకున్నారు.

"పురుషస్పర్శ నెరుగని స్త్రీ ఎక్కడుంటుంది? ఒక వేళ ఉన్నా—శరీరం కోసి ఎవరిస్తా రంత రక్తం?"

అని అక్కడి వారందరూ అన్నారు.

"నా దాహం తీరకపోతే—దేవుడొచ్చినా నన్నిక్కణ్ణుంచి కదిలించలేరు—"

అంది చిన్నప్ప నావహించిన భూతం.

"నీ కోరిక సాగనిది. కనీసం, భర్త సంపర్కమయినా కలిగిన పతివ్రతలుంటే వుండవచ్చును కాని—అసలు పురుషస్పర్శ ఎరగని స్త్రీ లెక్కడా వుండరు."

అన్నాడు భయంకరాచారి భూతంతో.

"ఉన్నారు." అందిభూతం.

"ఎవరూ?" అని ఆశ్చర్యంగా అడిగాడు భయంకరాచారి.

"ఈ వూళ్లోనే—కాళికాలయంలో—పూజారిశివమ్మ."

అని భూతం చిన్నప్పనోటిద్వారా పలికేటప్పటికి—అందరూ విభ్రాంతులయ్యారు.

"పూజారిశివమ్మా పూజారిశివమ్మా?"

అని ఆ పేరు అనేకనోళ్ళంట అప్రయత్నంగా వచ్చింది. కాని ఆమెదగ్గరకెళ్లి రక్తందానం చెయ్యమని అడగడానికి ఎవ్వరూ ధైర్యం చెయ్యలేకపోయారు. కొసకు—నేరు గత్యంతరంలేక, వృద్ధులై—లేవలేని పరిస్థితుల్లోవున్న చిన్నప్పతలిదండ్రులే అందుకు సిద్ధమయ్యారు.

"అయ్యలారా! మేమే ఆయిల్లాలి పాదాలమీదపడి ప్రార్థించుకుంటాము కాని కదల్లేకుండావున్న మమ్మల్నెవరయినా అక్కడికి మోసుకుపోండి—"

అని వారుకోరిన ప్రకారం, కొందరు గ్రామస్థులు వృద్ధులైన చిన్నప్ప తల్లిదండ్రుల్ని మోసుకుని శివాలయానికి బయలుదేరారు—మరికొందరు చిన్నప్పను పట్టుకుని తీసుకెళ్లారు. క్రమంగా అందరూ శివాలయం చేరారు.

రాజకుమారా! చెబితే నమ్ముతావో—లేదో—శివమ్మ కప్పటికే ఏభై యేళ్లుదాటాయి. అయినా, పండు తమలపాకువంటి కోమల త్వంలో—చిదిమితే పాలుకారేటట్లుండి—సీలాంటి నవ యౌవన రాజకుమారులు సయితం ఆమెను చూసి, మోహపరవశు లయ్యేటట్లుం దంటే, నువ్వాశ్చర్య పడనక్కర్లేదు. అటువంటి పెద్దవయస్సులోనే అలావున్నప్పుడామె, చిన్నవయసు యౌవనంలో ఎలావుండి వుం టుందో, నువ్వూహించుకోవలసిందేగాని, నేను చెప్పలేను. అంత వరకూ ఆమె పురుషస్పర్శ నెరగదుట! అదీ గొప్పవిషయం.

అంతేగాదు—ఈ ప్రాపంచిక విషయాలలోపడి గింజుకోకుండా—జగన్మాత నాశ్రయించి—ఆమెకు సేవలు చెయ్యడంలో—సేవించిన జీవితం గడుపుతూంది—విన్నావా?

అప్పటికి అమ్మగారిగుడిని, పరిసరప్రాంతమును, తుడిచి పరి శుభ్రంచేస్తున్న శివమ్మ, ఆలయంముందర మూగిన జనసమూహాన్ని చూడగానే, చేతిలోని చీపురుగట్ట నక్కడపడేసి, యివతలకొచ్చి—

"ఏమిటినాయనా! ఏమయిందీ—ఇంతమంది వొచ్చారెందుకు?"

అని ఆమె అడుగుతుండగా—చిన్నప్ప మామూలుగానే 'దాహం—దాహం—' అని అరుస్తున్నాడు.

"అయ్యలారా—మిమ్మల్ని తీసుకుపోయి, ఆ తల్లి పాదాలమీద పడెయ్యండి."

అని చిన్నప్ప తల్లిదండ్రులు చెప్పగా—కూడా వచ్చినవారు అదేప్రకారం, వృద్ధదంపతులిద్దర్నీ నాయంపట్టి తీసుకెళ్ళి, శివమ్మ పాదాలమీద పడేశారు.

"అయ్యయ్యో! ఇదేమిటి? ఆ వృద్ధదంపతులెందుకు నా పాదాలమీద పడేస్తున్నారెందుకు? వారు పళ్లుగడిచిన పూజ్యులు!"

అని శివమ్మ ఏమీ అర్థంచేసుకోలేక, ఆశ్చర్య విభ్రాంతురాలై అడగ్గా—

"అమ్మా! తల్లీ—రక్షించావు—మాకిప్పుడు పుత్రభిక్ష నువ్వు పెడితేవుంది—లేకపోతే లేదు. నూరేళ్ళు నిండి—కాటికి కాళ్ళు చాచుకున్న మాకీవయస్సులో పుత్రశోకం లేకుండా చెయ్యమ్మా!"

అని మాదిగవృద్ధదంపతులు శివమ్మపాదాలు పట్టుకుని, విడవకుండా ప్రార్థిస్తుంటే—

"అయ్యయ్యో! ఇదేమిటి? కేవలం ఆడదాన్ని స్త్రీని—నావల్ల ఏమవుతుంది?—అయినా, మీ చిన్నప్పకి తగిలిన ప్రమాదమేమిటి?"

అని శివమ్మ అడిగినదానికి భయంతో రాచారి, జరిగిన విషయమంతా చెప్పి—చిన్నప్పయొక్క ఇప్పటి స్థితివివరించారు—

"పురుషసంపర్కం ఎరుగని స్త్రీరక్తాన్ని పిశాచం దాహంగా కోరుతూంది. అలా యిచ్చినట్టయితే చిన్నప్పను వొదిలిపోతుందట! అటువంటి పవిత్రమైన స్త్రీని—నువ్వుతప్ప యింకెవ్వరూ లేరని చిన్నప్పను పట్టిన ఆదెయ్యమె చెప్పింది." అన్నాడు.

చిన్నప్ప, యథాప్రకారం, చెవులు చిల్లులు పడేటట్లు, 'దాహం—దాహం' అని అరుస్తుండడమును శివమ్మకూడా వింది.

"అయ్యో! అంతేకదా నాయనా! అదే భాగ్యం! రేపు కాట్లో పెట్టినప్పుడు ఈశరీరము—ఈరక్తము ఏమవుతున్నాయి—పంచభూతాల్లోనూ నిర్మించబడ్డవి—తిరిగి ఆపంచభూతాల్ని చేరుతున్నవే గాని, వాటివల్ల వేరుప్రయోజనమేమీ కలిగేది లేదు కదా! ఇప్పుడు నా రక్తం, అంతకంటె మంచికార్యానికి ఉపయోగపడుతుంటే కాదంటానా! అయితే నా రక్తం ఎంత తియ్యాలి? ఎలా తియ్యాలి?"

అని శివమ్మ అడిగినదానికి—

"ఇదుగో తల్లీ—ఈ కడవతో—చాలు, శరీరంలో ఏభాగంలో నయినా పెద్దగాయం చేసుకుంటే—ఆగాయంనుంచి కారినరక్తాన్ని కుండలో పట్టుకోవాలి—"

అని భయంకరాచారి ఒకకడవను-కత్తిని ఆమె చేతికిచ్చాడు—

"కత్తిని నాకిచ్చి—కడవను మీరు పట్టుకోండి."

అని చెప్పిన శివమ్మ సందేహించకుండా—

"ఓ జగన్మాతా! మానవసేవ-నీసేవా, ఒక్కటి-చిన్నప్పను సేవించడమే నిన్ను సేవించడం! అతని ప్రాణరక్షకు నారక్తం కావాలిట-నా చేత అందు కవసరమైనంత రక్తాన్ని దానంచేయించు తల్లీ."

అని, వెంటనే చేతిలోనికత్తితో కంఠాన ఒక బలమైన పోటు పొడుచుకుని, ఆభాగాన్ని భయంకరాచారి పట్టుకున్న కడవ దగ్గరకు వొంచింది. అందుంచి ధారాపాతంగా ప్రవహించిన రక్తంతో నిమిషంలో కడవనిండిపోయింది. కడవ నిండిన తరువాత, రక్తప్రవాహం దానంతట అదేకట్టిపోయింది. కత్తిపోటు ఆనవాలయినా కనుపించడంలేదు. అవి చూసినవారు శివమ్మ మహాత్మ్యను అర్థంచేసుకోలేక, విభ్రాంతురాలయ్యారు. శివమ్మ చిరునవ్వుముఖంతో—భయంకరాచారి చేతిలోని రక్తభాండము నందుకుని—

"చిన్నప్ప నావహించిన భూతమా! ఇదుగో, నువ్వు కోరిన రక్తం! కడుపునిండా తాగి నీదాహం తీర్చుకునిపో-ఇహ మాచిన్నప్పను హింసపెట్టకు."

అంటూ రక్తభాండాన్ని చిన్నప్ప నోటికందించింది. అందరూ ఆశ్చర్యపడేట్టు చిన్నప్ప ఆకుంటలోని రక్తమునంతటినీ నిమిషంలో తాగి—

"తల్లీ! ఇప్పటికి మూడుసంవత్సరాలనుంచి, నేనీదాహంతో బాధపడుతున్నాను—ఈనాటికి నాదాహం తీర్చగలిగిన మహాతల్లివి నువ్వు కనుపించావు—నీకు పదివేలనమస్కారాలు—ఇక నేను వెళ్లి పోతున్నాను."

అన్నమాటలు చిన్నప్ప నోటినుంచి వచ్చాయి—చిన్నప్ప చూపు, ముఖలక్షణాలు, వెంటనే మారిపోయాయి—అతను మామూలు చిన్నప్ప అయినాడు. అంతమందిజనంలో తానుండడంచూచి ఖంగారుపడుతూ—

"ఏదీ! ఇక్కడ నా చింత కాయలమూట పడింది." అని దాని కోసం వెదుకుల్లాడం మొదలుపెట్టాడు.

"నీ చింతకాయలు పాడయ్యేగదరా! దానివల్లే యింతకొంప మునిగింది—శివమ్మకి మొక్కు—ఇహ ఇంటికినడు—"

అని అక్కడి వాళ్ళన్నారు. చినప్ప తలిదండ్రులేగాక, గ్రామస్తులందరూ శివమ్మనో దేవతగాయెంచి మొక్కారు. అందరూ ఎందుకు మొక్కుతున్నారో-తెలుసుకోకుండానే, చిన్నప్పకూడా శివమ్మ నందరితోపాటూ మొక్కాడు. తరవాత, తనకు జరిగిన ప్రమాదమును, శివమ్మవల్ల తిరిగి ఆప్రమాదం తప్పడము, మొదలయిన వివరాలన్నీ తలిదండ్రులవల్ల తెలుసుకొన్న చిన్నప్ప చాలా ఆశ్చర్యపోయాడు.

ఆనాడు మొదలుకొని ఈనాటివరకూ, శివమ్మ ఆ గ్రామస్థుల దృష్టిలో ఒక దేవత!

రాజకుమారా! విన్నావుకదా! ఆ రక్తదానంవల్ల శివమ్మ సంపాదించినపుణ్యం, ఇంతింత అని చెప్పడానికి శక్యంగాదు. ఆపుణ్యంలో సగం నాకు ధారపోయించినట్లయితే, బైరాగితో కలిసి, నేను చేసినపాపాలు నన్ను వొదిలిపోతాయి—నేనీ పిశాచరూపమును వొదిలి, తిరిగి నాబ్రాహ్మణత్వం నేను పొందగలతాను. ఇదీ నువ్విప్పుడు నాకు చెయ్యవలసిన ఉపకారం. ఏమంటావు?"

అని, తాటిచెట్టు ముప్పులోనుంచి పిశాచమడిగిన దానికి, విజయకుమారు కొంచమాలోచించి—

"అయ్యో! ఇదెక్కటిన్యాయం? ఇదేమిధర్మం! ఎవరెన్ని తపస్సులు చేసినా—ఎన్ని క్రతువులు చేసినా—జన్మ పరంపరలుగా ఎవరెన్ని కష్టములుభరించినా, పుణ్యసంపాదనకే గదా! అంతటి మహా కష్టంతో సంపాదించుకున్న పుణ్యఫలాన్ని ఒకరింకొకరికి ధారపోయ్యడమా? అందులోనూ నేను సిఫార్సు చెయ్యడమా? ఇది జరిగే పనేనా?" అన్నాడు,

"అంత చేతగానివాడవయితే, ముందరెందుకు వాగ్దానం చేశావు?"

"చేసినమాట నిజం-కష్టపడి సంపాదించుకున్న ఒకరి పుణ్యాన్ని యింకొకరికి ధారపోయ్యమని నేను కోరడంలో న్యాయముందా? ప్రపంచంలో యెక్కడయినా యిటువంటిది జరుగుతుందా?"

"అంతంతా నాకు తెలియదు. నువ్వు నాకు సాయం చేస్తానని మాటయిచ్చావు. ఆపూజారి శివమ్మ పాదాలమీదపడి మొక్కుతావో—ప్రార్థిస్తావో—ఏమిచేస్తావో నాకవసరంలేదు. రక్తదానం వల్ల శివమ్మ సంపాదించుకున్న పుణ్యంలో సగంనాకు దారపోయ్యడం జరగాలి—అప్పుడు నేనీ పిశాచరూపాన్ని వొదిలి, నాబ్రాహ్మణ రూపాన్ని నేను తిరిగి పొందాలి. అంతవరకూ నువ్విక్కడనుంచి అడుగు కదపలేవు. నువ్విక్కడే—నేనిక్కడే!"

అని భూతం చెప్పిన దానిని అర్థంచేసుకోలేక, విజయకుమారు, కాలుతీసి. ముందుకో అడుగు వెయ్యబోయాడు. నిజంగానే అతని రెండుకాళ్లు భూమి కంటుకుపోయి—కదల్లేదు.

"ఏమిటనుకున్నావు?—నా మంత్రం మాట తప్పినవాళ్ళ గతి యింతే—"

"అయ్యయ్యో! అలా అయితే నేను శివమ్మ దగ్గిరకయినా ఎలా వెడతాను? సిరాజ్యాన్ని ఎలా సాధించగలుగుతాను."

"ఓ! ఆమాటయితే—నిరాటంకంగా వెళ్ళగలవు."

"సరే! ఆపనిమీదనే వెడతాను."

"నాతో యిలా చెప్పి, మోసంచేసి—మరోపనిమీద వెళ్లావంటే—ఇంకా గొప్పప్రమాదానికి గురి అవుతావు."

"నేనంత నీచుణ్ణి కాను—నీపనిమీదే వెడతాను సాధిస్తాను." అని విజయకుమారుడు చెప్పగానే, అతనికాళ్లు వాటంతట అవే కదిలాయి. పరశురాంపురానికెళ్ళాలో దారి నాభూతంవల్లనే తెలుసుకుని, విజయకుమారుడా పల్లెమార్గము ననుసరించి బయలుదేరాడు.



పూజారి శివమ్మకిప్పటికి. ఐదు పది తక్కువగా నూరేళ్లు నిండివుంటాయి. ఆ వయస్సులో కూడా ఆమె తన మామూలు దినకృత్యాలలో ఒక్కటీ మానలేదు. వేకువఝామునే లేచి, ఆలయప్రాంగణాన్ని తుడిచి శుభ్రంచేసి, కళ్లాపు చల్లి, పిండితో ముగ్గులుద్ది, ఆపైన యితర దినచర్యలోకి దిగడం ఆమె కలవాటు.

అదేప్రకారం మొర్నాడు వేకువఘామున లేచి, చీపురు నీళ్లు వగైరాలు పట్టి, వాకిటకొచ్చి చూసేటప్పటికి ఆమె కెక్కడలేని వింతా కలిగింది.

"ఇదేమిటమ్మా? ఎవరిదీపని? నాకన్నాముందుగా వచ్చి, నేను నిత్యమూ చేసుకునే పనులన్నీ చేసి—ముగ్గులుకూడా ఎంత నేర్పుతో పెట్టారు? ఈ అవసరం యెవరికి కలిగివుంటుంది? శ్రమపడి నాపనులన్నీ చేసి, కష్టపడ్డారే! ఎవరైవుంటారు? ఇటువంటి విచిత్రం యెన్నడూ జరగలేదే! నేను ముసిలిదానిననీ—చేసుకోలేననీ, ఊహించివుంటారా? అయితేమాత్రం, నేను తిరిగి వారి ఋణం తీర్చుకోవద్దూ! ఈ పని చేసింది యెవరయినదీ తెలుస్తే, తప్పకుండా వారిస్తాను."

అని తనలో అనుకొని, ఆనాటికి తన తరువాతి కార్యక్రమంలో నిమగ్నురాలయింది. మర్నాటి ఉదయంకూడా అదేప్రకారం జరిగి వుండడమును గమనించి, మరింత తెల్లబోయింది. తనపనుల నెవరో చేసి పెడుతున్నందుకు మనసులో చాలా బాధపడుతుంది. తెలుస్తే, తానభ్యంతరపెడుతుందని, వారెవరో తనకు తెలీకుండా ఆపని చేస్తున్నారని ఊహించుకుంది. మూడు-నాలుగురోజు లదేప్రకారం, ఆలయ ప్రాంతమంతా పరిశుభ్రం చెయ్యడం, ఒకరోజు పెట్టిన ముగ్గులు మరొకరోజు పెట్టకుండా, రకంకాల, వింతవింతల రంగవల్లుల నా ప్రాంగణంలో అమర్చడం గమనించింది.

ఇక ఉపేక్ష చెయ్యకూడదనుకుంది, వేకువఝామునే, మామూలుకంటే, ముందుగా లేచి, పొంచివుండి, ఆ పనిని చేస్తున్నవారిని తెలుసుకోడానికి పూనుకుంది. కాని తాను ముందుగానే నిద్రలేచినా—అప్పటికే ఆపనంతా జరిగిపోయింది. ఆ ప్రకారం వరసగా మరో నాలుగురోజులు గడిచింది. ఇక లాభంలేదని, ఒకనాడు అసలు నిద్ర పోకుండా, తెల్లవార్లూ మేలుకొనేవుండి—కనురెప్పలయినా వాల్చకుండా—కనిపెట్టి చూస్తూ కూర్చుంది ఈశ్వరమ్మ.

అది, తొమ్మిదోనాటిరాత్రి—పన్నెండుగంటలకు పైబడిన తరువాత, విలువగల దుస్తులు ధరించిన ఒక సుందర రాజకుమారుడు, చీపురు, నీళ్లు, పిండి, వగైరాలతో ప్రవేశించి, యథాప్రకారం పని కుపక్రమించడం ఆమె చాటునుంచి తిలకించి, భయవిభ్రాంతురా

లయింది వెంటనే తలుపు తెరుచుకుని, యివతలికొచ్చి, రాజకుమారుని చేతిలోని చీపురు తానందుకుని—

"అయ్యో! ఇదేంపని? చూస్తే, నువ్వెవరివో—అఖండభూమండలము నేలే రాజకుమారుడివిలా వున్నావు. ఇంతరాత్రివేళ, ఇలా కష్టపడి, నేను చెయ్యవలసిన ఈ ఊడిగపుపనులు నువ్వు చెయ్యవలసిన అవసరమేమొచ్చింది? ఇప్పటికి తొమ్మిది రోజులనుంచి, వరసగా గమనిస్తున్నాను. కష్టపడి, వాకిలంతా శుభ్రపరుస్తున్నావు—పురుషుడవై యుండి, స్త్రీలకంటే యెక్కువ నేర్పుతో ప్రాంగణాన రంగవల్లరి దిద్దుతున్నావు—నిజభుజబలపరాక్రమాల్తో శత్రుసైన్యాల దునుమాడడానికి, కత్తిపట్టవలసిన చేతిలో చీపురు పట్టడం ఇదేం ధర్మమయ్యా? పామరుల తప్పులుదిద్ది, పాపులకు శిక్షాశిక్షాలు వ్రాయవలసిన నీవేళ్లతో ఈయింటి ముంగిట రంగవల్లరి దిద్దుతున్నావా? తప్పు కాదూ?"

అని పుత్రవాత్సల్యంతో మందలిస్తున్న ఈశ్వరమ్మ మాటలు వినిన విజయకుమారు డామెకు నమస్కరించి—

"అవ్వా! తప్పులేదు. నా రేళ్ళవయసులో పురుషస్పర్శ ఎటువంటిదో తెలియని మహాపవిత్రురాలవయిన నిన్ను సేవించడంలో తరించడముందిగాని, తప్పులేదు. నీసేవ కితరమార్గం లభ్యంగాక, ఈ పద్ధతి నవలభించాను. ఈ నాపనివల్ల, నీమనస్సు కేమయినా కష్టం కలుగుతే క్షమించు."

అని ప్రార్థించగా, ఈశ్వరమ్మ అతని వినయవిధేయతలకు మరింత అబ్బురపడి—

"నాయనా! నువ్వేదేశపు రాజకుమారుడివి? ఈపల్లె రావలసిన కారణం నీకెందుకు కలిగింది? నాగురించిన జిజ్ఞాస, నీమనసులో ఎందుకు పడింది—? లోపలికొచ్చి కూర్చుని, అభ్యంతరం లేకపోతే, మాతృసమానురాలినయిన నాతో నీవివరాలన్నీ చెప్పు—" అన్నది.

"అయ్యో తల్లీ! అభ్యంతర మెందుకు? నువ్వు మాతృసమానురాలివేకాదు—దేవతాసమానురాలివి—నావివరాలన్నీ నీకు చెప్పి, నీవల్ల ఒకసాయము నపేక్షిస్తున్నాను."

అని ఈశ్వరమ్మ కోరిన ప్రకారం ఆమెతో లోపల ప్రవేశించాడు, విజయకుమారు.

ఈశ్వరమ్మ అతన్ని మర్యాదగా కూర్చో నియమించిన తరువాత—

"రాజకుమారా! నీరాకవల్ల నేను, నాయిల్లు, పావనమైనాము." అంది.

"అయ్యయ్యో, అది కాదు తల్లీ! నీవంటి పూజ్యురాలి దర్శనం వల్ల నాజన్మ చరితార్థత పొందింది. ఇది యిల్లుగానూ, దేవాలయం గానూ కూడా వున్నదే?"

"నువ్వూహించినది నిజమే నాయనా! అమ్మవారి దేవాలయం ఈయింటికి చేర్చబడివుంది. నేనాదేవికి సేవలు చేసుకుంటూ, ఈ చిన్నయింట్లో వుంటూవుంటాను. కాలం తీరిపోయింది—ఇక దేవి ఆజ్ఞలకోసమే కనిపెట్టుకునివున్నాను. రేపో—నేడో. తెలియదు. ఏదీ, నీవివరాలు చెబుతానన్నావు. ఏదేశంనుంచి వచ్చావు నాయనా!"

"అమ్మా! మాది నాగపురము—నేనాపట్నానికి యువరాజును మాతండ్రిగారి పేరు ఛత్రపాలుడు. తల్లిగారు రమాదేవి. మాతలిదండ్రులకు, నేను ఏకైకపుత్రుణ్ణి మా నాగపురానికి వందలాది యోజనముల దూరముంది. మానాగపురానికి మరొక నూరుయోజనములకుపై దూరంలో కుండినగరమనే ఒక మహాపట్నముంది. ఆ పట్నాన్ని కీర్తికాముడనే మహారాజు పరిపాలన చేస్తున్నాడు. ఆయనకు చింతామణి, అని ఒక మేటిసౌందర్యవతి కుమార్తె. ఆమెను వివాహమాడ్డానికి ఎందరెందరో రాజకుమారులు దేశదేశాలనుంచీ రావడము, ఆమె, తన ప్రశ్నలకే రాజకుమారుడైతే జవాబులు చెబుతాడో—అతనిని తప్ప, యితరులను వివాహమాడనని ప్రతిజ్ఞ పట్టడము—తన ప్రశ్నలకు జవాబు చెప్పలేని రాజకుమారుల శిరస్సులు ఖండించి, తన భవనద్వారానికి వ్రేలగట్టించడము జరుగుతున్నది. అట్లా ఆమెచే ఖండించబడినవారిలో నా పినతండ్రి కుమారుడు అనంతకుమారను వాడుండి, నాలో ఒక పట్టుదలను—దీక్షను రేకెచ్చించాడు. ఆప్రకారం, ఇప్పటికి రాజకుమార్తెచేత ఖండించబడి, ఆమె వ్రతానికి ఆహుతి అయిన రాజకుమారులు వెయ్యిమందున్నారు. ఆదారుణ హింసాకాండను చూచి నేను భరించలేకపోయినానమ్మా! అందరు రాజకుమారులను అంతమొందించి, రాజవంశాలను నిర్మూలనం చెయ్య కంకణం కట్టుకున్న ఆ చింతామణి అత్యాచారాన్ని అరికట్టడానికి

కంకణం కట్టుకున్నాను. ఆమె ప్రశ్నలకు జవాబులు తెలుసుకుని ఆమె గర్వము నణిగించి, హింసనుమాన్ప దీక్షపూనాను. ఆ దీక్షతో నిజ రాజధాని వొదలి యిప్పటికి సంవత్సరందాటిపోయింది. అనేక దేశాలు తిరిగాను—అనేకమంది మహానుభావుల దర్శనం చేసుకున్నాను. ఆరాజ కుమార్తె అడిగే ఐదు ప్రశ్నలలో ఒకదానికి మాత్ర మిప్పటికి జవాబు తెలుసుకొన్నాను. రెండో ప్రశ్నకు బదులు లభించగల మహానగరం చేరాను. మీరాపల్లెకయిదుయోజనాల దూరంలోవున్న ఆమహా నగరం నీకు తెలిసివుంటుంది. నేను అనేక యోజనాలు సముద్రప్రయాణంచేసి, కష్టానిష్టాలకు గురిఅయి యీలాగయితేనేం మహానగరపు పొడలరేవులో దిగి పట్నంలోకి పోతుండగా, మార్గంలో నాకొక తోటి తోపులో స్త్రీ ఆర్తనాదం వినిపించింది. ఏమిటా అని చూడబోయేటప్పటికా దూరం యెంత నడిచినా తరగలేదు. ఇంకా నడిచా నింకా నడిచా—దూరాన అర్థరాత్రి సమయంలో భయంకరమైన మంటలు కనిపించాయి. తరువాత మంటలు మాయమయ్యాయి—స్త్రీ ఆర్తనాదం మూ వినిపించలేదు. నా వీపుమీద యెవరో బలమైన చరుపు చరిచారు. ఒరను చికత్తిమూసి, వెనుదిరిగిచూడగా, యెవరూ కనుపించలేదు. ఆచేరువ తాటిచెట్టు ముబ్బలోనుంచి ఒక ధ్వని వినిపించింది—తానొక బ్రహ్మరాక్షసి అని—ఆనగర మొచ్చిన కొత్తవారినందర్ని నన్ను చేసినట్లుగానే చేసి హతమారుస్తు టాడనీ—ఇప్పటి కనేకమంది తనకు బలి అయ్యారనీ చెబుతూ—పూర్వం తాను, కరకటశాస్త్రి అనే ఒక బ్రాహ్మణకుమారుడై వుండీ, గురుతా పితృ భక్తివల్ల, దేవత్వమును సంపాదించినా, ఒక బైరాగి మాంత్రికశక్తివల్ల అతనికి లోబడి, అతనితో అనేక పాపకార్యాలు చెయ్యడంవల్ల, అటువంటి పిశాచరూపంలో వున్నాడనీ చెప్పాడు.

"మార్గస్థుల నిరిధంగా హింసలు పెట్టడం నీకు బలి చేసుకోవడం తగనిపని—నిన్ను దుర్మార్గమునుంచి మళ్లించపోతే, నావంటివారిలో వుండీ నిష్ప్రయోజనం— ఏంచేస్తే నువ్వొక్కడనుంచి తొలగిపోతావు? నీకేం కావాలి?"

అని నేనడిగినమీదట, ఆభూతం తిరిగి యిలా చెప్పింది.

"నువ్వు అసామాన్యుడవు గాబట్టి, నాదెబ్బకు చావక బ్రతికి వున్నావు—నీవల్లనే నాకు మేలు జరుగవలసివుంది. ఇక్కడికి ఐదు

వయినా వర్ణించలేదు-నీవల్ల భూతానికి బలికావలసిన అనేక ప్రాణాలు సంరక్షించబడగలవు.''

అని వారిసంభాషణ పూర్తి అయ్యేటప్పటి కోడికూత విని పించింది.

''కుమారా! తెల్లవారినై వుంది. నువ్వు నీకాలకృత్యాలు తీర్చుకోవలసిన సమయం——నేనున్నూ నాపనులు పూర్తిచేసుకొని, స్నానమాచరించి, శుచినై అమ్మవారి ఆలయానికొస్తాను. అక్కడ దేవియెదుట ఉదితరీతిని——నాపుణ్యమును ధార పొయ్యగలను.''

అని, శివమ్మ తనపనులమీద వెళ్ళింది. విజయకుమారున్నూ, తన ప్రాతఃకాలకృత్యాలు నిర్వర్తించుకుని. ఆమెచెప్పిన ఆలయా పరిభాగమును ప్రవేశించగా, శివమ్మ అప్పటికే అక్కడచేరి, దేవికి తనమామూలు అలవాటుప్రకారం చెయ్యవలసిన నిత్యవిధులన్నింటినీ నెరవేరుస్తూంది. అవి పూర్తి అయ్యేవరకూ విజయకుమారు డక్కడనే వేచివున్నాడు.

శివమ్మ, గరువాత—— ఒక పంచిపాత్రతో శుద్ధోధకమును పట్టి దేవియెదుట నిలిచి——

''రాజకుమారా! పిశాచరూపంలోవున్న ఆ బ్రాహ్మణ కుమారుని పేరెవరు?'' అని అడిగింది.

''అమ్మా! అతనిపేరు కరకటశాస్త్రి.'' అని విజయకుమారు చెప్పిన మీదట,

''దేవీ! జగన్మాత! కరకటశాస్త్రి అనే బ్రాహ్మణకుమారుడు, స్వయంకృతి పాపభారంచేత, పిశాచరూపమునుపొంది, మహానగర ప్రాంతమున ఒక తాటిచెట్టు మువ్వలో నివాసమేర్పచుకొని, మార్గస్తులను తనకు బలిగాచేసుకుంటున్నాడు. పూర్వమొకప్పుడు నేను మాదిగవృద్ధదంపతుల కుమారుకు, చిన్నప్పుడు జేసిన రక్తదాన పుణ్యఫలితంలో అర్ధభాగం పిశాచరూపంలోవున్న ఆ బ్రాహ్మణకుమారుడికిచెంది అతడు విముక్తిని పొందుగాక! నీసాన్నిధ్యంలో నా పుణ్యభాగాన్ని ఇదుగో! ధారపోస్తున్నాను.''

అని శివమ్మ పంచప్రాతలోని జలమును కుడిచేతిలో పోసుకుని, హాస్తోదకం వొదిలింది. అనంతరం మామె దేవికి మరికొన్ని విధులు నెరవేర్చుకుని, విజయకుమారునితోసాటు యివతలకొచ్చింది.

"రాజకుమారా! నీకోరికప్రకారం, నేను చెయ్యవలసిన దానిని పూర్తిచేశాను. ఈదినం నువ్వు నా కతిథిగావుండి, నేను పెట్టినదా న్నారగించి మరీ వెళ్ళవలసింది."

అని శివమ్మ చెప్పినట్లుగానే చెయ్యడానికి కంగీకరించి, విజయ కుమారుడు ఆనాటి కామెయింట్లో, ఆమె కతిథిగావుండి, ఆమె మనస్సు కు సంతోషమునుకలిగించి, తదుపరి తిరిగి మహానగరమునకు ప్రయాణమై వెళ్లాడు. క్షేమంగా అయిదామడల దూరమూనడిచి, మహా పురమును సురక్షితంగా చేరుకున్నాడు. నగరంలో ప్రవేశించడానికి ముందు, తాటితోపులోని ఆభూత సమాచారమును తెలుసుకోవాలని, అక్కడికి పోయిచూడగా, అతని ఆశ్చర్య సంభ్రమాలు కలిగేటట్లొక పాతికసంవత్సరాలకు లోపువయస్సుగల ఒక బ్రాహ్మణకుమారుడు, ముఖాన విభూదిరేఖల శోభతో—నుదుట కుంకుమతిలకపు కాంతితో మును పటి తాటిచెట్టును నీడను నిలుచున్నవాడు—విజయకుమారుని చూచిన వెంటనే అతనిపాదముల మీదపడి—

"పుణ్యాత్మా! నీ అనుగ్రహముండబట్టి, పిశాచరూపమునుంచి విముక్తుడనయ్యాను—నీమేలు జన్మజన్మాలకూ మరువను."

అని మ్రొక్కగా—

"బ్రాహ్మణకుమారా! తన పుణ్యఫలంలో అర్ధభాగం నీకు ధారపోసిన ఆతల్లికీ అనుగ్రహం! నువ్వు ముందుగాపోయి, ఆయమ్మకు మొక్కి, అనంతరం నీఇనిమీద వెళ్లు."

అని విజయకుమారుడా బ్రాహ్మణకుమారుతో చెప్పగా అతను అవశ్యంగా అట్లే చేస్తానని చెప్పినమీదట—

"అయ్యా! నీముందు కర్తవ్యమేమిటి? తిరిగి నీకు గురువైన ఆబైరాగిని వెనుక్కుంటూ వెళ్లడమా? లేక మరెక్కడికైనా వెళ్ళడమా?"

అని విజయకుమారుడా బ్రాహ్మణయువకుని నడిగాడు ఆమాట వినగానే బ్రహ్మణకుమారుడు తనరెండు చెవులూ మూసుకొని—

"హాం! హరి! తిరిగి ఆదుర్మార్గునిమాట యెందుకు వినపడిందో గదా! రాజకుమారా! ఆబైరాగిమాట తలచినంత మాత్రంలో, పంచ మహాపాతకాలూ చుట్టుకుంటవి—అనుభవించినదిచాలక, నాకింకా ఆపాపితలపులెందుకు ప్రభూ! ముందుగాపోయి ఆతల్లి శివమ్మపాదా

లకు మొక్కి కృతార్థుడనై—తదుపరి హిమాలయ పర్వతప్రాంతానికి పోయి. నిశ్చలంగా కొంతకాలం తపస్సుచేసుకుని ఇప్పటికయినా తరించగలమార్గమును చూసుకోవాలని సంకల్పం.'' అన్నాడు.

''సంతోషం—భూతదయ. అహింస-సర్వశుభదాయకమన్న విషయమును మరచిపోకు.''

అని తనహితవు కోరిచెప్పిన విజయకుమారునకు నమస్కరించి, ఇంకా అతని కనేక కృతజ్ఞతలు తెలిపి, బ్రాహ్మణకుమారుడు తన మార్గము ననుసరించి వెళ్ళిపోయిన అనంతరం. విజయకుమారుడున్నూ మహానగరాభి ముఖంగా బయలుదేరాడు. అక్కడికి బహు కొద్ది దూరంలోవున్న పట్నమును ప్రవేశించి, తన ముందు కర్తవ్యమును గురించి యోచనలు చేసుకుంటూ, ఆ పట్టణవైభవమును—కట్టడముల సొంపునూ తిలకించుకుంటూ, నగరవీధిమార్గమున పోతుండగా, పట్టణవాసులా కొత్తమనిషిని వింతంగాచూసి, గుంపులు గుంపులుగా మూగడం, విజయకుమారు కాశ్చర్యంకలిగించింది.

''నేను తమలాంటి మామూలుమనిషిని కానా? ఒక వింత మృగాన్ని చూసినట్లు నన్నెందుకబ్బా, యీ ప్రజలింత విరగబడి చూస్తున్నారు?''

అని తనలో విభ్రాంతుడౌతున్న విజయకుమారుని తిలకించి కొందరు—

''ఎలాబ్రతికి బయటపడ్డావు నాయనా! అయిదు సంవత్సారాల క్రితంనుంచి—మానగరంలో ఒక్క క్రొత్తవ్యక్తయినా ప్రవేశించింది లేదు పొరబాటున ఎవరయినావస్తే, కాటితోటలోని ఆభూతం పొట్టనిపెట్టుకుంటుంతయ్యే! నువ్వెలావొచ్చావు? ఆభూతం నిన్నుచంపకుండా వొదిలిందా?''

అని ఆశ్చర్యంగా ప్రశ్నలు వెయ్యడం మొదలుపెట్టారు. వారి ఆశ్చర్యకారణమును తెలుసుకొన్న విజయకుమారు—

''అయ్యలారా! మీకింక ఆభూత భయమేమీ అవసరంలేదు-అది తన పిశాచరూపమునుంచి విముక్తిపొంది, తనదారిని తాను పోయింది. ఇక ఏ కొత్తవారయినా మీ నగరంలోకి యథేచ్ఛగా పోవచ్చు—''

అని విజయకుమారుడు చెప్పినదానికి, వారు మరింత ఆశ్చర్య పడి, ఆ అనుభవ వర్తమానమును తక్షణం, తమ రాజుగారైన చంద్రసేనుడి కంతజేశారు. ఆ మహారాజును, భూతమెట్లు తమనగరం వొదిలి పోయిందో తెలుసుకోవాలన్న కుతూహలంతో-భూతమును జయించి తమనగరం ప్రవేశించిన ఆ క్రొత్తవ్యక్తిని తక్షణం తనవద్దకురావించ వలసినదిగా ఆజ్ఞాపించాడు. అప్పుడు కొందరు పరివారజన మరుదెంచి, రాజాజ్ఞను విజయకుమారునకు విన్నవించి, అతనిని సగౌరవంగా రాజసన్నిధికి గొనిపోయారు.

మహానగరపాలకుడైన చంద్రసేనుడు, మంత్రి, సామంత, పురోహిత వంధిమాగధాది పరివారజనంతో కొలువునవున్నప్పుడు, కొందరు పరిచారకులు, తమవెంట గొనివచ్చిన విజయకుమారుని సభామంటమున రాజసన్నిధని నిలిపి—

“ప్రభూ! ఈ యోధుడే, మనసగరమును చిరకాలమునుంచి పీడిస్తున్న ఆభూతమును పారదోలి-యథేచ్ఛగా నగరప్రవేశంచేసిన వాడు—” అని విన్నవించారు.

చంద్రసేనుడు లేచినిలుచుని, విజయకుమారుని సగౌరవంగా తోడ్కొనిపోయి, తనవద్దగల ఉచితాసనంపై కూర్చుండజేసి—

“అయ్యా! నీరూపురేఖా విలాసములనుబట్టి, నువ్వెవరో రాజపుత్రుడవుగా వచ్చునన్న మాయూహా సరియైనదవునా, కాదా?” అని ప్రశ్నించినమీదట—

ప్రభువు లూహించిన పూర్తిగా సరియైంది. మాది నాగపురము. నేనానగరిపు యువరాజను. నా పేరు విజయకుమారుడు. మా తండ్రిగారిపేరు ఛత్రపాలుడు, తల్లిగారిపేరు రమాదేవి.”

అని విజయకుమారుడు చెబుతుండగా—

“నాగపురమా? దానిపేరయినా ఎప్పుడూ వినలేదే! మానగరానికది ఎంతదూరములో వుంది?”

అని చంద్రసేన మహారాజు ప్రశ్నించాడు.

“మీనగరమునకు దక్షిణముగా అయిదువందల యోజనముల దూరంలో సర్పినగరమను ఒక మహాపట్నముంది. దానికి ఉత్తర దిశలో మరొక అయిదువందల యోజనములు ప్రయాణంచేసిన యెడల, మా నాగపురసంస్థానముంది.”

అని విజయకుమారుడు తిరిగి చెప్పాడు.

"సంతోషము! అయితే, రాజకుమారా! ఇంతదూరం ప్రయాణంచేసి నువ్వు మానగరమెందుకు రావలసివచ్చింది? అయిదేళ్ల క్రితంనుంచీ! మానగరాని కెవర్నీ కొత్తవార్ని రానియ్యకుండా, ఎవరొస్తే వార్ని బలిపుచ్చుకుంటున్న ఆభూతాన్ని నువ్వెలా జయించ గలిగావు! నీరాకవల్ల, మా నగరానికి మహోపకారం జరిగింది ఆభూతమును నగరంనుంచి పారద్రోలాలని, ఎన్నో ప్రయత్నాలు చేశాము—హోమాలూ—యజ్ఞాలూ కూడా జరిగించి, విఫలమనోరథుల మయ్యాము—సమర్థులైన మాంత్రికుల ననేకమందిని రావించి, చెయ్యవలసిన పనులన్నీ చేసి చేయించాము—కాని ఆభూతము నెవరూ జయించగలిగినవారు లేకపోయినారు. అటువంటిదీనాడు నువ్వాభూతమును పారద్రోలావంటే, నీధైర్యసాహసా లెంతయినా మెచ్చుకోదగి వున్నాయి. ఆ భూతమును నువ్వెట్లు జయించగలిగావో, ఆ వివరాలు కూడా చెప్పి, మా ఆనందమును రెట్టించవలసిన దని కోరుతున్నాం."

అని చంద్రసేనమహారాజు కోరినప్రకారం, విజయకుమారుడు తాను బడదిగినదిలగాయితు, తాటితోటలో స్త్రీ ఆర్తనాదమును వినడము—భూతమువల్ల దెబ్బతినడము—ఆ భూతము తాటిచెట్టులోనుంచి చెప్పినమాటలు—రక్తదానంచేసిన పూజారి శివమ్మకథ—తన కోరికప్రకారం, ఆమె తన రక్తదాన పుణ్యఫలితంలో అర్ధభాగం ధారపోసి, భూతానికి విముక్తికలిగించడము, ఆభూతం బ్రాహ్మణకుమారుడుగా మారి, హిమాలయప్రాంతాలకు తపస్సుకై పోవడము—మొదలయిన వివరములన్నింటినీ సాకల్యంగా వివరించి, అక్కడివారి కపరిమితసంతోషమును కలిగించిన తదుపరి—

"మహారాజా! నేనీనగరానికి రావలసినకారణమును మనవిచేస్తున్నాను-కుండినవగరాధీశ్వరుడైన కీర్తిధామమహారాజు, అపూర్వచింతామణి అనే ఒక అందగత్తెను కుమార్తెగా కలిగివున్నాడు, ఆకన్య, తానడిగిన ఐదు ప్రశ్నల కేరాజకుమారుడు, బదులు చెప్పగలడో ఆ రాజకుమారుని వివాహమాడతాననీ—అట్లు చేప్పలేనివాని శిరస్సును ఖండించి తనభవనానికి వ్రేలగడతాననీ శపథంపట్టి, ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పలేని రాజకుమారుల నిప్పటికి వెయ్యిమందిని హతమార్చింది. ఆ వెయ్యిమందిలో ఒకవేలు విడిచిన

నాసోదరుడుకూడా వున్నాడు. ఆరాజకుమార్తె కాప్రశ్నలు చెప్పిన దామె గురువైన ఒక బైరాగిఅనీ—ఆ బైరాగి, బాలమహర్షి అనే పేరుతో అక్కడవుండి, రాజకుమార్తెచేత ఆ ప్రశ్నల నడిగిస్తున్నా డనీ తెలియవస్తూంది. రాజకుమార్తెచే జరిగించబడుచున్న ఈహింసా కాండనుచూసి సహించలేక, రాజలోకానికి జరుగుతున్న అప కారాన్ని అరికట్టాలనే పట్టుదలతో, నేను నిజరాజధాని వదలి యిప్పటికి అతికష్టమీద, మొదటిప్రశ్నకు జవాబు నర్మి నగరంలో తెలియగలదని వచ్చాను.''

అని విజయకుమారుడు చెప్పిన దానినంతటినీ విని—

''ఔరా! ఇటువంటి అపూర్వ విషయము నెక్కడా వినివుండ లేదు. చింతామణి అనే ఆ రాజకుమార్తె, గురువయిన ఆ బైరాగి వల్ల నేర్చుకున్న ఆ అయిదు ప్రశ్నలు ఏవి?''

అని చంద్రసేనమహారాజు అడగ్గా, విజయకుమారుడు అయిదు ప్రశ్నలను వరసగా వివరించిన మీదట, మహారాజు పట్టలేని ఆవే శంతో పళ్లు పటపట కొరుకుతూ,

''ఓరీ! వంచకుడా! నీకపటనాటకమంతటితో కట్టుపడ లేదన్న మాట! తయతలచి ప్రాణాలతో నిన్ను వొదిలిపెట్టడం నేరమైంది. నాచావుబ్రతుకులు తెలుసుకుని, తిరిగి నాపట్టణం రాదలచినా వన్న మాట! రా! ఈసారి తప్పక నీతల నీ ఖడ్గానికి బలిఈయక మానను.''

అంటూ, ఒరలోనుంచి కత్తిదూసి ఝుళిపింపగా, విజయ కుమారుడతని ఆగ్రహావేశానికి అర్థం తెలుసుకోలేక—

''ప్రభూ! నావచ్చిన పనినీ—ప్రశ్నల వివరమునూ, తమరడిగి నందువల్ల, వివరించాను—నావల్ల ఏమయినా అపరాధముంటే క్షమించండి.'' అని వినయంగా చెప్పాడు.

చంద్రసేనుడు ఖడ్గమును తిరిగి ఒరలోవుంచి—

''విజయకుమారా! నీపై ఆగ్రహమేమీ కాదు. చింతామణిదగ్గర చేరిన ఆబాలమహర్షి, వంచకుడు—బహుదుర్మార్గుడు. నానగరంలో చేరి, నాచే పరాభవింపబడి, ప్రాణం దక్కించుకుని పారిపోయాడు. తన ప్రశ్నలమూలంగా నా చావుబతుకులు తెలుసుకుని, నేను మర ణించిన వుండినయెడల, తిరిగి యిక్కడకు రావాలనీ—తన దుండగాలు సాగించాలనీ ఆలోచిస్తున్నాడు.'' అని చెప్పాడు.

"ప్రభూ! ఆ బైరాగికిని మీకునూ యెటువటి సంబంధము? వాడు మీ నగరంలోవుండి—చేసిన అపచారమేమి?" అని విజయ కుమారుడి డడిగినందువల్ల—

"ఆ వివరమంతా నీకు తప్పక చెప్పవలసివుంది. అప్పుడు చింతామణిద్వారా ఆ బైరాగివేస్తున్న ఐదు ప్రశ్నలలో రెండవ ప్రశ్నకు అర్థమేమిటో నీకు తెలుస్తుంది, సావధానంగావిను."

అని చంద్రసేనమహారాజు, అప్పటికి కొన్ని సంత్సరాలకు పూర్వం ఒకనొకప్పుడు జరిగిన తన స్వగాధలోని ఒకవిచిత్ర ఘట్టాన్ని యీ విధంగా చెప్పడం మొదలుపెట్టాడు.

## ౨౦

"మా తండ్రి తాతల తరంనుంచీ, మానకుండా వస్తున్న ఆచారం—ఏమిటీ అంటే, మానగరానికేగాదు. చుట్టుప్రక్కల ఏ పట్నంలోకయినా, ఒక సాధువు—ఒక స్వాములవారు—ఒక తత్వవేత్త—ఒక సన్యాసి—ఒక బైరాగి—మొదలయినవారిలో యెవరొచ్చినా సరే—మాపెద్దలు స్వయంగా పోయి వారి నాహ్వానించడము, రాజమందిరానికి తీసుకొచ్చి అట్టివారిని పూజించడము—వారివల్ల తెలుసుకోదగిన మహత్తర విషయాలు తెలుసుకొని, కొంతకాలం మాఅతిథులుగా వుంచుకోవడము, అనంతరం వారికి తగిన విధంగా సత్కారాలు జరిగించి పంపడము ఆచారమైంది.

కాలక్రమవశాత్తూ మాతాతలు గతించారు. తండ్రులు గతించారు. కాని వారి ఆచారంమాత్రం గతించలేదు. నేనుకూడా, నగరంలోకి ఏమహాత్ముడు వచ్చినా, రాజమందిరాని కాహ్వానించడము:—కొన్నిరోజులు అతిధిగావుంచుకొని పూజించడమూ జరుగుతూవచ్చింది.

తండ్రిగారు కాలధర్మమును పొందిన తరువాత, నేను నాఇరవైరెండవయేట పట్టాభిషిక్తుడను కావలసివచ్చింది. తండ్రిగారి పాలనా హయాములో మంత్రిగా వుంటూవచ్చిన, బుద్ధిసాగరుడుకూడా, తండ్రిగారు పోయిన మరుసంవత్సరమే వృద్ధాప్యమొచ్చి విశ్రాంతికోరాడు. వంశానుక్రమంగా, తండ్రి బుద్ధిసాగరుని స్థానమును కొడుకు సుబుద్ధి ఆక్రమించుకున్నాడు. సుబుద్ధికి నాకన్న ఒకటిరెండు సంవత్సరములకన్న యెక్కువ వయస్సులేదు. ఇంకా పెళ్లికాలేదు. తండ్రుల

స్థానములు, కొడుకులమైన మేమాక్రమించి, పరిపాలనా విధానాన్ని సక్రమంగానే జరిగిస్తున్నాము. నాకు ఇరవై రెండేళ్ళయితే—సుబుద్ధికి ఇరవై ఐదు.

మాతల్లిగారయిన సులోచనాదేవి, నాకు త్వరలో వివాహం జరిగించవలసిందని తొందరపడడమే గాకుండా, సుబుద్ధిని ప్రతినిత్యము అంతఃపురానికి పిలిపించి, నా వివాహ విషయమును గురించే హెచ్చరిస్తుండేది. సుబుద్ధికూడా అదే ప్రయత్నంలో వున్నాడు. ఇలావుంటుండగా, మా మహానగరానికి పన్నెండుయోజనముల దూరంలోవున్న జయపురసంస్థానాధీశ్వరుడు, ధనపాలుడు, తనకుమార్తె, నిర్మలాదేవికి స్వయంవరమును చాటించాడు. మాకున్నూ శుభలేఖ నంపించాడు. కాని నేను పోనిచ్ఛపడలేదు. సుబుద్ధిమాత్రం నన్ను ప్రోత్సహిస్తున్నాడు. ఆ విషయమును గురించి మా యిద్దరకూ కొంచం తర్కం జరిగిం దొకనాడు.

"రాజకుమారా! పదిమంది రాజకుమారులతో, తమరున్నూ నిర్మలాదేవి స్వయంవరానికి పోవడ ముచితం. ఆకన్య, రూపురేఖలలో అఖండ విఖ్యాతిని పొందివుంది. అటువంటి అందగత్తెను మనమెన్నడూ ఎక్కడా చూచివుండమని, నేను చారులవల్ల తెలుసుకొన్నవాడనవడంచేత, ప్రభువుల నింతగా నిర్బంధం చేయవలసివచ్చింది."

'సుబుద్ధీ! నువ్వు తెలుసుకున్న విషయం యథార్థమేకావచ్చు. వివాహ సందర్భాలలో—పోటీలు—పరీక్షలు—స్వయంవరాలు మొదలయినవాటిని నే నంగీకరించను. ఎందువల్లననగా—అందరి రాజకుమారులలో, పోటీలోగాని, స్వయంవరంలోగాని విజయమును పొందగలవారు ఒక్కరేగదా! అటువంటి సందర్భం మిగిలినవారి కెంత చిన్నతన మౌతుంది. ఆ మిగిలినవారు, అసమర్థులనీ—అవివేకులనీ—అర్హతలేనివారనీ, కొందరనుకుంటారు గదా! మన మనవసరంగా అట్టి అవమానాల కెందుకు గురికావాలని నావుద్దేశం."

"తమరు చెప్పిందానిని నేను కాదనను. మనం వెళ్ళని సందర్భంలో—'ఒకవేళ వెళ్ళివుంటే అందరిలో మనమే విజయమును పొందేవాళ్ళమేమో—అయ్యో! పోకపోతిమే' అన్న అసంతృప్తి మనస్సు పీడించడం ఒకటి; తరువాత మన అదృష్టాన్ని పరీక్షించుకోడానికి కలిగిన అవకాశాన్ని జారవిడుచుకోవడం రెండవది. ఈ రెండుకారణాల

వల్ల, తమరా స్వయంవరానికి తప్పక పోవాలి. నేను మనవి చెయ్య గల మరొక విషయమేమంటే—పోటీలలోనూ, యిటువంటి స్వయం వర సందర్భాలలోనూ, విజయమును పొందనివారు, అసమర్థులనీ, అర్హతలేనివారని, అనుకొనేవారు, అవివేకులై వుంటారు కాని, వివేకు లెప్పుడూ అయివుండరన్న విషయం తమకున్నూ విదితమే అయి వుంటుంది. అట్టి అవివేకుల భావమును తమరు ఒక లెక్కగా యెంచు తారని నేనెన్నడూ తలంచలేదు.''

మంత్రియొక్క హేతువాదం సమంజసంగానే కనుపించింది. ఆపైన నేనతనితో ఏమనీ వాదించలేకపోయినను.

''సుబుద్ధి! నీవాదమును కాదనలేను. నీయిష్టప్రకారమే జయ పుర ప్రయాణానికి సన్నాహాలు జరిగించు.''

అని నేను స్వయంవరానికి పోనంగీకరించి చెప్పినందుకు, మంత్రి సుబుద్ధే గాకుండా, మాతల్లిగారుకూడా అపరిమితమైన ఆనందమును పొందారు. జయాపజయములు దైవాధీనములు గనుక, నేను సందే హించకుండా, మంత్రి గావించిన యేర్పాటుల ననుసరించి, సపరివా రంగా, స్వయంవరానికి బయలుదేరి, నియమిత కాలానికి, జయపురం చేరుకున్నాను.

ధనపాలుడు పేరుకు తగినంత ధనవంతుడని, అతనా స్వయం వారానికి గావించిన యేర్పాటులవల్ల అర్థమైంది. ఏమి నగరము, ఏమి భవనములు! అభిమానం లేకుండా చెప్పాలంటే—అతని ఐశ్వ ర్యంలో మా ఐశ్వర్యం సగమైనా లేదని ఒప్పుకుతీరాలి! ప్రత్యేకించి, ఆ స్వయంవరమంటపానికి గావించబడిన ఏర్పాటులు—చెయ్యబడిన అలంకరణాలూ చూస్తే, ఏయింద్రసభో-మయసభో జ్ఞాపక మొస్తుంది. పురాణాలలో వర్ణించబడ్డ ఆరెంటిని దృష్టిలో వుంచుకుని, తనకుమార్తె స్వయంవరమంటపం, వాటిని మించేలావుండాలన్న పట్టుదలతో ఆ మహారాజా నిర్మాణం జరిగించి వుంటాడు. సుమారొక వెయ్యి మంది రాజకుమారులా స్వయంవరానికి రావించబడ్డారు.

అందరిలో విజయం మనదిగాక పోయినప్పటికీ, జన్మలో అటు వంటి వేడుకను చూడబోముగదా అనుకుని, నిన్ను నిర్బంధంచేసి, ఆ స్వయంవరానికి తీసుకొచ్చి ఆ కన్నుల పండుగను చూడనవకాశం కల్పించిన మంత్రిమేలును నాలో నేనే మెచ్చుకున్నాను.

నానాదేశ రాజకుమార, శౌర్యోపేత బలపరాక్రమ వీర కుమార, నవమన్మధాకారు లందరితో నిండివున్న, ఆమహాసభలో నేనున్నా ఒకడినై కూర్చుని, ఇక నిర్మలాదేవి సోయగమెలా వుంటుందో—అందాలపాలవెల్లి అని జగత్ప్రఖ్యాతిని పొందిన ఆమె సౌందర్యసంపద నన్నికళ్లుపెట్టుకొని తిలకించాలో—ఆమెచే వరించబడగల భాగ్యశాలి అందరిలో యెవరో—తెలుసుకోవాలన్న తహతహలతో నేనుబ్బిబ్బులవుతున్న సమయంలో, ధనపాలమహారాజు ఉపోద్ఘాతవచనాల అనంతరం—నిజంగా అందాలపాలవెల్లి, అప్సరస కామిని, అపురూపసౌందర్యవతి, అవతరించిన అపరంజిబొమ్మ, అపరరంభ, ఆదిదేవుని అసమానకళాసృష్టి అనుకోదగిన ఆయమ్మలమిన్న, చేతనొక పూమాల ధరించి ఆరితేరిన ఒక చెలికత్తెవెంట, దించినతల నెత్తక, వాల్చిన కనుచూపులను ప్రక్కలకు ప్రసరింపచేసుకుంటూ, చూచీ, చూడని విధాన నటిస్తూ—హంసలకు నడకలు నేర్పిన దీఅలివేణే అని రాజలోక భ్రమపడేటట్లు, మెల్లిమెల్లిగా అడుగులు వేసుకుంటూ, వస్తున్న నిర్మలాదేవిని తిలకించడానికి వెయ్యికళ్ళయినా నాకియ్యలేదని నేను విధాతను నిందించాను.

తన దృష్టి నే రాజకుమారు డపహరిస్తాడో అని భయపడుతున్నట్లు, చెలికత్తెతో ఒక్కొక్క రాజకుమారుని దగ్గరనిలిచి, అతనిని గురించి ఆమె చెప్పినదానిని వినడానికి చెవులిచ్చి కళ్ళనిట్టెత్తి అట్టే దించుతూ—చెలికత్తె కేమని సౌంజ్ఞ చేస్తున్నదో ఏమో క్రమంగా అనేక రాజకుమారులను దాటి, నాదగ్గరకొచ్చింది, నా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి—త్వరగా ఆమె నాదగ్గరనుంచి వెళ్లిపోతే—నాగుండెదడయినా తగ్గుతుందని, నేననుకొంటుండగా, తటాలున ఆమె చేతిలోని పూలమాల నాకంఠంలో పడింది.

విజయకుమారా! నామాటనమ్ము—నిర్భ్రాంతుణ్ణయ్యాను—ఒళ్లు చెమటలుపోసింది—అది కలో యెధార్ధమో నమ్మలేకపోయాను. కల కాదు—నిర్మలాదేవి అందరిలో నన్ను వరించిందని తెలుసుకున్నాక, ఆనందమును పట్టలేకపోయాను. నా కా భాగ్యమును కలిగించిన మంత్రికి వెయ్యి నమస్కారాలు పెట్టాను. ఆ తరువాత చెప్పవలసిందేమంత యెక్కువగా ఏమీ లేదు. అమ్మ, వగైరా, నాబంధుజనం యావన్మందీ అక్కడికి రాపించబడ్డారు-వివాహం అతిఘనంగా జరిగింది.

పెండ్లికుమార్తెను చూచి, దేవలోకంనుంచి దిగివచ్చిన దివ్యకామిని అన్నారు. మాబంధుకోటిలో, నిర్మలాదేవి సౌందర్యమును చూచి, అబ్బురపడనివారు లేరు. ఈడుజోడులలోనే గాక, పోలికలో కూడ, ఆమె మూడుమూర్తులా, నన్నే పోలివుందన్నారు. వయసులో ఆమెకూ నాకు రెండుమూడేళ్ళకంటే యెక్కువ తేడాలేదు. నిర్మలకు పంగొమ్మిదేళ్లయితే, నాకు ఇరవై రెండు ఆయేడే దాటాయి. ఒళ్లు, కళ్లు, ఒడ్డు, పొడుగు, రంగు, ఒకటేమిటి? మూడుమూర్తులా, నేను ఆమేనట—ఆమె నేనేనట—ఈ విషయమును బంధుగులందరూ విడ్డూరంగా చెప్పుకున్నారు.

"బావా! నువ్వాడ వేషం వేసుకుంటే—మా అక్కేమోనని మోసపోతాం సుమా!" అనీ—

"అక్కాయ్! నువ్వు మొగ వేషం వేసుకుంటే—బావగార్లాగే రాజకుమారుడివై పోతావ్!" అనీ—

నాకు వరసయిన బావమరుదులు వగైరాలు, పరాసికమాడి, నవ్వేవారు. అవునేమో నాకేం తెలుసు?

వివాహానంతరం కొన్నిదినాలు అత్తవారింటిదగ్గరనే, వేడుకలతోను, ఉత్సవాలతోనూ గడిపి. అనంతరం మొక శుభదినాన, బంధుపరివార, దాసదాసీజనాలతో నిజరాజధాని మహానగరానికి బయలుదేరాను. అత్తవారి తాలూకు జనము, మా తాలూకు జనము కలిసి, మొత్తం ఒక వెయ్యిమందికి పైగావున్నారు. గుఱ్ఱములు, బండ్లు, మేనాలు, వీటన్నిటితో, మంగళవాయిద్యాల సందడులతో అట్టహాసంగా తరలివస్తున్నాము.

మాకు ముందర కొందరు కాల్బలాలు, ఆ వెనుక కొందరశ్వారోహులు, అటుతరువాత, అంతఃపురస్త్రీలుండే మేనాలు, వాటికి మధ్యలో పెండ్లికుమార్తె నిర్మలవుండే పాలకీ, దానికి వెనుక నేనొక ఉత్తమాశ్వము నధిరోహించి నడుస్తున్నాను. నావెనుక ఏనుగులు, ఒంటెలు మొదలయినవాటిపై సామానులు—వాటికి వెనుక, తిరిగి మరికొంత కాల్బలము. ఈ ప్రకారం ప్రయాణం చేస్తూ, మధ్యమధ్య అనువయిన చోట్లదిగి విడుదులు చేసుకుంటూ, డేరాలు వేయించి వంటలు చేయించుకుని, భోజనాలు—విశ్రాంతి, అయినతరువాత, తిరిగి

ప్రయాణంచేస్తూ, పన్నెండు యోజనాలలో ఆరుయోజనాలు గడిచాము.

అంతకుముందే కొందరు మహానగరంచేరి, దానికి ఉచితమైన అలంకరణాలు, కోట, రాజసౌధములు మొదలయిన వాటిని ముస్తాబులు చేయుట, మొదలగు పనులలో నిమగ్నులైవున్నారు. మంత్రి సుబుద్ధి అత్యుత్సాహంతో, ఎప్పటికప్పుడు ఏర్పాటుల నప్పటి కతిఘనంగా చేయిస్తున్నాడు. ఇహా, అయిదారు యోజనాలు ప్రయాణం చేశామంటే మహానగరం చేరుకుంటా మనగా, ఒక అరణ్యమార్గంగుండా, మా గుఱ్ఱాలు, ఏనుగులు, యుద్ధభటులు, మేమంతరము సాగిపోతున్నాము

ఒక సాధువు ఎండదెబ్బతగిలి కాబోలు ఒడిగొట్టి, మామార్గాని కడ్డంగా పడిపోయివున్నాడు. కొందరు గుఱ్ఱాలు దిగి పరిశీలించివచ్చి—

"ప్రభూ! ఎవరో ఒక సాధువు, వడగొట్టి పడిపోయాడు—కాస్సే పటికో కూస్సేపటికో—అతని ప్రాణాలు పోయేలావున్నాయి." అని చెప్పారు.

"సాధువు, పడిపోయాడు" అన్నామాటలు చెవినిపడిన తక్షణం నేను గుఱ్ఱంపైనుంచి క్రిందికిదిగి—'ఏడీ—ఏడీ' అని అంటూ పరుగెత్తి చూశాను. కేవలం పరమేశ్వరుని అవతారంలాగున, శిరమున జటాజూటము, చేతిలో ఒక త్రిశూలము, శంఖము, మొదలయిన వాటితో ఆ తేజస్వరూపుడు, మార్గానికడ్డంగా పడి, నిజంగానే ప్రాణావశిష్టుడు కానైవున్నాడు. నేను వెంటనే శీతలోదకాన్ని తెప్పించి, అతని ముఖానచల్లి, నోటిలో కొంచం నీళ్లుపోసి ఉపచర్యలు చేయగా తెప్పరిల్లినట్లు కనుపించాడు. నేను చాలా సంతోషపడ్డాను. నీ కాదిలో చెప్పినట్లు, సాధువులన్నా, బైరాగులన్నా, మాకెలుంబాని అధిక గౌరవమన్న విషయం నీకు జ్ఞాపకముండే వుంటుంది. ఆసాధు వడదెబ్బ నుంచి కొంచం తేరుకున్నాడన్న విషయం తెలియగానే—

"ఇతనిని తీసుకుపోయి, ఏమేనా ఖాళీగావుంటే, ఆ మేనాలో విశ్రాంతిగా పరుండ జేయండి—ఇంతకుముందు మేనాలలోవున్న అంతఃపురస్త్రీలను మాత్రం మెవరినీ దింపవద్దు"

అని, నే నాజ్ఞాపించడమే తడవుగా, నాకు సాధువులయెడగల భక్తివిశ్వాసాల నెరిగివున్న పరిచారకులు కొందరు, తక్షణం సాధువును

చేతులమీద పడకోబెట్టి తీసుకుపోయారు. తిరిగి అంతరము ప్రయాణ మును సాగిస్తుండగా, ఒక పరిచారకుడు నాదగ్గరకొచ్చి—

"ప్రభూ! ఏ మేనా చూసినా ఖాళీగాలేదు. పిల్లలు, స్త్రీలు పండుకొనివున్నారు. ఎవరికీ విశ్రాంతి భంగంచేయడ మిష్టంలేక, సాధువును అతివిశాలమైన పెండ్లికుమార్తెగారి మేనాలో పరుండ జేశాము. ఆమేనా అయిదారుగురికయినా విశాలంగా సరిపోతుందని తమతో చెప్పాలని వచ్చాము."

"మంచిపని చేశారు—భగవత్స్వరూపుడయిన సాధువు ఎక్కడున్నా పూజింపదగినవాడే—"

అని నేను వెంటనే—

"అసుకుమారి కేమాత్రమయినా అంతరాయం కలుగుతుందని తోస్తే—కొంతదూరంపోయిన తరువాత, సాధువును మరియొక మేనాలోకి మార్చవచ్చు." అన్నాను.

"లేదు ప్రభూ! మేము సాధువు నందులో చేర్చడానికి సందేహిస్తుండగా—రాజకుమార్తెగారే మమ్మల్ని హెచ్చరించి—అతివిశాలమైన తమ మేనాలో సాధువును పరుండజేయవలసిందని నిర్బంధం చేశారు." అని పరిచారకులు తిరిగి చెప్పినమీదట—మాకుటుంబ సాంప్రదాయంతోనూ, మా అభిరుచులతోనూ, ఇంత అచిరకాలం లోనే తానున్నా కలసి, నిర్మలాదేవి, సాధుసజ్జనుల విషయంలో చూపిన భక్తిభావానికి నాలో నే నపరిమితమైన ఆనందమును పొంది ఆమె మాకుటుంబ గౌరవాన్ని నిలిపి, మాకు కీర్తితేగల యిల్లాలు కాగలదని మురిసాను.

తిరిగి యథాప్రకారంగా రథగజతురగపదాదులన్నీ ప్రయాణ మును సాగించి, ముందుకు సాగుతున్నాయి. ఆనాడు పౌర్ణమయిన కారణంవల్ల, వెన్నెల పిండిఆరబోసినట్లుంది. నానావిధ ఫలపుష్ప భరితములయిన వృక్షజాతుల నడుమనుంచి ప్రయాణం సాగుతూంది. ఏవైపుచూచినా అతిరమణీయంగావుంది. నేను మామూలు ప్రకారం, రాత్రికాగానే ఎక్కడో ఒకచోట విడిదిచేసి, తిరిగి ఉదయమే ప్రయాణమును సాగించవలెనని అనుకున్నాను. కాని ఇతర పరివారజనాలూ, బంధుగులు, ఆ రాత్రి అతిమనోహరంగానూ, హెచ్చరికగానూ వున్నందువల్ల, ప్రయాణమును ఆపుచెయ్యకుండా,

సాగించి, ఉదయానికి నగరం చేరుకుందామని కుతూహలపడ్డారు. వెన్నెల్లో ప్రయాణం నాకు ఖులాసాగా నేవుంది గాబట్టి, నేను నాపరిజనాల కోరికను భిన్నం చెయ్యకుండా, ప్రయాణమును సాగించడానికే అంగీకరించాను.

అనుకున్న ప్రకారం ఆరాత్రంతా అత్యుత్సాహంతో ప్రయాణం చేసి, తెల్లవారకముందే నిజనగరం చేరాము. ఎక్కడచూచినా మంగళతోరణాలు—ముగ్గువల్లరులు—ముత్తయిదుల హారతులు—శుభాంగనల నృత్యగీతాలు—గాల్లుల నామసంకీర్తనలు—మంగళవాయిద్యపు ఉల్లాసాలతో మాకెదురయిన నగరవాసుల కోలాహలధ్వనులు నగరమంతా కిన్నెలపడుతున్నాయి. కోటవాకిట నేనూ నాపరివారజనమూ నిలిచాము. మేనాలు దించబడ్డాయి, ముందర యితర అంతఃపుర కాంతలందరూ యివతలకొచ్చి పెండ్లికుమార్తె మేనాదగ్గర మూగారు. హారతులు పట్టిన కాంతలంతకుముందే వరసగా నిలిచి పాటలు ప్రారంభించారు. నగరస్త్రీలు, తమ రాణి యెటువంటి అందాలబరిణో చూడాలన్న కుతూహలంతో ముందుకు తోసుకు తోసుకు పోతున్నారు. అప్పుడు మా అమ్మ సులోచనాదేవి, మరికొందర స్త్రీలతో నాదగ్గరకొచ్చి, నేను గుఱ్ఱమునుంచి దిగడానికి చేయూతనిచ్చి—

"రానాయనా! నువ్వొచ్చేవరకూ నీరాణి యివతలకిరాదు—ఇరువురూకలిసి కోటలో ప్రవేశించాలి."

అని, నన్ను తనతో వెంటబెట్టుకుని, పెండ్లికూతురున్న మేనా దగ్గరకు తీసుకొనిపోయింది. మా అమ్మ తానే ముందుగా తెరలు తొలగించి

"రాపెళ్లికూతురా! నీ మొగుడొచ్చి నిలిచాడు." అంటూ చేతులు లోపలి కదిలించింది.

ఎవరూలా లేదు—చేతులందుకోలేదు.

"ఇంతసిగ్గయితే యెలాగునమ్మా? రాజుగారి కెంతసేపూ యీ నిలువుజీతం—?"

అని కొందరు, చనువయిన పడుచుపిల్లలు మేనాలో దూరారు పెండ్లికూతుర్ని లాక్కురావాలని.

"ఏదీ? ఎవరూ? ఎక్కడా? పెళ్ళికూతురు లేదే!"

అంటూ మేనాలో దూరినవారందరూ ఘొల్లుమంటూ యివతల పడ్డారు

"ఆఁ! పెళ్ళికూతురు లేదా!"

అంటూ మా అమ్మ మేనా లోపలికిపోయింది—తిరిగివచ్చింది.

"ఇదేం ఘోరమమ్మా? నిర్మలాదేవి లేదే! ఏమైనట్టు?"

అంటూ నిర్ఘాంతపోయి నిలిచింది. అప్పుడు మాత్రమే నాకు సాధువుసంగతి జ్ఞాపకం వొచ్చింది.

"సాధువున్నాడా?" అని డగ్గుత్తికతో అడిగాను.

"సాధువూ లేడు—సన్యాసీ లేడు."

అంది మా అమ్మ నిస్పృహతో. విజయకుమారా! అప్పటి నాస్థితి యెలావుంటుందో నువ్వూహించుకోవాలిగాని, నేను చెప్పలేను. తలతిరిగి పోతున్నట్లయింది—కళ్లు చీకటికమ్మాయి—ఏమనుకోవాలో—ఏం చెయ్యాలో ఏమీ అర్థంకావడంలేదు. ఈవార్త నిమిషంలో ప్రతి ఒక్కరికీ చేరింది.

"పెళ్ళికూతురు పరారి అయింది." అని ఒకరు—

"ఎవరో సాధువులు—" అని యింకొకరు—

"ఏం పాపమో—" అని మరొకరు—

"మహామాయ" అని వేరొకరు—

ఇలాగా, వ్యంగ్యంగానూ, గూఢార్థంగానూ, సానుభూతికర పరచేటట్లుగాను—ఎంతో తోచినట్టు వారు, కొందరు గుసగుసలు—కొందరు బహిరంగంగానూ మొదలుపెట్టారు. అంతవరకూ ఉత్సవపు ఏర్పాటుల్లో నిమగ్నమైవున్న మంత్రి, సుబుద్ధికూడా యీ దుర్వార్తను తెలుసుకొని. వడివడిగా మేమున్నదగ్గరికి పరుగెత్తుకొచ్చి—

"దేవ, నిర్మల కనిపించడంలేదా?"

అని నిర్ఘాంతపోతూనే అడిగాడు. ఇక్కడ అవసరమైన ఏర్పాటులు చేయించడానికిగాను, ఉదయంనుంచి, సుబుద్ధి అందరికంటే ముందుగానే మానానగరం వొచ్చెయ్యడంవల్ల, మార్గంలో మాకూ సాధువు తటస్థపడడము—మేము వాగుదగ్గర పడిపోయిన బైరాగిని భగవత్స్వరూపుడుగా యెంచి, పెళ్ళికూతురు మేనాలో యెక్కించి తీసుకొచ్చిన విషయము అతనికేమీ తెలియదు. అందువల్ల నేను తడబడుతున్న గొంతుకతో సుబుద్ధికి విషయమంతా వివరంగా చెప్పి—

"సుబుద్ధీ! తిరిగి నగరం చేరుకునేవరకూ నాకా వైరాగి జిజ్ఞాసే లేకపోయింది. ఏమో, సాధువు వొడగొట్టి పడిపోయాడు— రక్షించవలెనన్న ఉద్దేశమే తప్ప, ఆ తరువాత అతన్ని గురించి ఆలోచన కలగలేదు. తీరా యిక్కడికొచ్చాక చూస్తే ఆమె లేదు. బోయీల నడుగుతే, తమకేమీ తెలియదని—మేనా, ఎక్కడా దించ లేదని చెబుతున్నారు." అన్నాను.

ఆదినుంచీ, నాకేగాక, మా కుటుంబానికంతకూ, సాధు సజ్జనుల యందుండే భక్తి గౌరవాలు తెలిసిన వాడవడం చేత, సుబుద్ధి నేను చేసిన పని కేమంత ఆశ్చర్యపడలేదుగాని, జరిగిన ఘోరాన్ని గురించి కొంచంసేపు తీవ్రంగా ఆలోచించాడు, నాకేమో మతి పోయింది. బుద్ర పని చేయడం లేదు," తనహాని, లోకనిందా!" అన్నట్లయింది నా బ్రతుకు. ఆ మహామాయయేమిటో నాకర్థం కాలేదు.

వేయిమంది రాజకుమారుల స్వయంవరలో, అపరంజి బొమ్మ అనుకోదగిన రాజకుమార్తెచే వరించబడి, మందిరంలో అడుగు పెట్టక మునుపే ఆమెను పోగొట్టుకున్న దిర్భాగ్యుడ నయినందు కోవయిపున విచారము—అసేమజనమూ అనుకొనేమాటలకు అభిమానము— ఈ రెంటితో నాతలను పైకెత్తలేకుండా వున్నాను. ఆసమయంలో—

"ప్రభూ! ఆలోచించి ప్రయోజనం లేదు. అనుమతియ్యండి— నేనిప్పుడే సైనికబలాలతో పోయి, ఆమె యెక్కడున్నా సరే—ఎందర రాజులను జయించి అయినాసరే—మీసతిని మీకు చేర్చి తీరతాను,"

అని మంత్రి సింసిద్ధుడు కాగా—

"ఎవరితోనూ చెప్పనయినా చెప్పకుండా, మధ్యమార్గంలో మాయమైన వధువును పట్టి తీసుకురావడ మేమంత గౌరవప్రదమైన పనికాదేమో—"

అని మా అమ్మగారన్నదానికి, నాతల నేలకేసి కొట్టుకుని చచ్చిపోదామా అన్నంతటి అభిమానం కలిగింది.

"అవును సుబుద్ధీ! ఆ రాజకుమార్తెను గురించి మనం ప్రయత్నం చెయ్యడం అనవరం, అమ్మగారు చెప్పింది సత్యం."

అని నేనన్నాను. పెండ్లికుమార్తె తాలూకు ఆత్మీయులు కొందరు ముందుకొచ్చి—

"నిజానిజాలు తెలుసుకోకుండా, ఆయిల్లాలిపై అభాండాల వెయ్యడం అక్రమం—ఆమెకోసం ప్రయత్నం చెయ్యడం మీ కనవసరమైతే, మాకవసరమవుతుందా? మాకు మాత్రం సైనికులు లేరా? యుద్ధబలాలు లేవా?'' అన్నారు.

"ప్రభూ! నామనవి కొంచెం చిత్తగించండి."

అని మంత్రి తిరిగి అన్నదానికి, అత్తవారన్నదితోడై, నాకాగ్రహాకారణమైంది.

"ఒద్దొద్దు—నువ్వేమీ చెప్పొద్దు మంత్రీ! మనకాయువతి ప్రమేయం ఎంతమాత్రం అవసరంలేదు.'' అన్నాను.

"ప్రభువులు ఆగ్రహం తెచ్చుకోవలసిన సమయం కాదు. విషయమును పూర్తిగా తెలుసుకొన్నతరువాత, తమరేమిచేసినా చెల్లుతుంది. పెండ్లికుమార్తె కనుపించక పోవడ మిప్పుడు ఉభయవంశాల కీర్తికి భంగం.'' అని మంత్రి సుబుద్ధి తిరిగి అన్నాడు.

"అయినాసరే—దానికి బాధ్యులయినవారు వేరువున్నారు. నువ్వీందును గురించి అధికంగా చెప్పొద్దు. ఇది నా ఆజ్ఞ."

"రాజకుటుంబానికి అపకీర్తి రానున్నసమయంలో, మంత్రి స్వతంత్రించి ఏమయినా చేయొచ్చునని చట్టం చెబుతుంది. కనుక, ప్రభువుల కనుగ్రహం కలిగినాసరే—రాజకుటుంబ గౌరవోద్ధరణకోసం, రాణీగారి రక్షణకోసం నేను రాజాజ్ఞను ధిక్కరిస్తున్నాను—సైన్య సమేతంగా యిప్పుడేపోయి, పెండ్లికూతు రేమయిందో తెలుసుకుంటాను—నే తలచిన కార్యమును సాధిస్తాను.''

అని సుబుద్ధి, నాబదులు కెదురుచూడకుండా, ఆతావును వొదిలివెళ్లాడు. అత్తవారు, ఆత్మీయుల సహితంగా ఒక్కరొక్కరుగా, మౌనమును వహించి వెళ్లిపోయారు. నేనున్ను ఎవరితోనూ పలుకకుండా ఏకాంతమందిరానికి పోయిచేరుకున్నాను. ఎక్కడివేడుకలక్కడ, ఎక్కడి ఉత్సాహాలక్కడ, చప్పగా చల్లారిపోయాయి.

నామనసు వికలమై పోయింది. ఏ పనిచెయ్యడానికిగాని, ఏమాలోచించడానికి గాని బుద్ధిపుట్టలేదు. చివరకు తిండిపైకూడా మనసుపోలేదు. నాబుద్ధి అనేక విధాలపోయింది—

"తలవని తలంపుగా యెంత విపరీతం జరిగింది? ఆ సౌందర్యవతి, స్వయంవరంలో నన్ను వరించడము. నాకు స్వర్గాధిపత్యమిచ్చినట్లు

కావడము, ఎంత తలవనితలంపో—ఇప్పు డాసుందరి మాయింకిరావడం కూడా అటువంటి తలవనితలంపే అయినా, ఈ తలంపులు భరించడం దుస్సాధ్యం. ఆ స్వయంవరానికి ఒద్దనుకునీ కూడా యెందుకుపోయాను? పోతేమాత్రం, ఆమె నన్నెందుకు వరించాలి—వరించి యీ వంచన యేమిటి? అందరు రాజకుమారులామె చక్కదనమును మెచ్చి, ఆమెను కోరివచ్చి, అపజయమును పొందారు-వారిలో ఎవరయినా, ఈ దుర్మార్గమును తలపెట్టివుంటారా? అవకాశమెక్కడిది? అనే సైనికబలాల మధ్య—విచ్చుకత్తుల పహరాలనడుమ—నేనున్నాను. నా పరివార మున్నారు. ఇందరుండగా పెదవారు చొరడానికవీలేదే? ఒకవేళ యెవరయినా యెలాగో సాహసానికి ప్రయత్నించినప్పటికీ—ఆమె బుద్ధిమంతురాలయితే ఎంతగోలచేస్తుంది? యెంత అలజడి జరుగు తుంది? నాబలాలకుగాని, నాకుగాని ఆవిషయం గోరంత తెలుస్తే, కరకుకత్తులతో ఆ వచ్చినవారినిదరికి, ముక్కముక్కలు చెయ్యమా?

దీనినిబట్టి ఈపని ఆమె అంగీకారంమీదనే జరిగివుంటని అను కోక తప్పదు. భగవత్స్వరూపుడని భావించి, వడకొట్టిపడిపోతే, తీసు కొచ్చి ఆమెనాలోచేర్చిన సాధువేమయినాడు? నిర్మలాదేవి కనుపిం చక పోవడానికీ—సాధువు కనుపించ పోవడానికీ ఏమైనా సంబంధ ముంటుందా?''

అని నేను అనేకవిధాల తలపోస్తున్న సమయంలో మా అమ్మ గారు స్వయంగా ఒక గ్లాసుతో పండ్లరసమును తెచ్చి, నా కందిస్తూ-

''ఈ దినమంతా ఏమీ తినకుండావున్నావు—ఈ రసమయినా తీసుకుని విశ్రాంతిగాపడుకో నాయనా!'' అంది.

''నాకేమీ వొద్దులే అమ్మా—నన్ను తొందర చెయ్యకు.''

''ఇప్పటికే చాలా రాత్రిగడిచింది. ఈ శాస్త్రరసమన్నా తీసు కుని, పడుకోకపోతే ఆరోగ్యం చెడుతుంది నాయనా! దైవికంగా జరి గినదానికెంత విచారించి ఏలాభం? నీవివాహమెటువంటి దైవికమో— ఇదికూడా అటువంటి దైవికమేనని మనసును సరిపెట్టుకోవాలి! మనం కోరితే, అటువంటి రాజకుమార్తెలెందరువచ్చి నిన్ను వరించరు?''

''నాకిప్పుడా మాటలేమీ చెప్పకమ్మా! వెళ్ళి నువ్వుపడుకో— మంత్రి సుబుద్ధి నగరం వొదిలిపోయాడటనా!''

"అతనొక్కడే కాదు. వెయ్యిమంది సాయుధులయిన యుద్ధ భటులతో బయలుదేరి వెళ్లాడు, ఆ సైన్యంతో కలిసి, ధనపాల మహారాజు సైన్యాలుకూడా కొన్ని బయలుదేరాయి. మనకు కలిగిన యీ ఘోరవిపత్తునుగురించి నగరం నగరమంతా అట్టుడికినట్టు ఉడికి పోతూంది.

అని మా అమ్మ చెప్పినదానికి నేనొక వేడినిట్టూర్పును విడవడం కంటే యింకేమీ చెయ్యలేకపోయాను.

"సుబుద్ధి చెప్పినమాట వినకుండా, వెళ్లాడు."

"కానియ్యి. విషయమైనా తెలుస్తుంది. వచ్చిన అపవాదెలాగా పోదు."

"సుబుద్ధికి మనసు నొప్పించేమాటలు నేనేమయినా అన్నానా అమ్మా! అతన్నెప్పుడూ ఏ సందర్భంలోనూ అలా తూలనాడలేదు."

"ఏదో అయిపోయిందిగదా, నువ్వీరసంతాగకపోతే, నే నిక్కడనుంచి వెళ్లేదిలేదు."

అని మా అమ్మ నిర్బంధం చెయ్యడంవల్ల, నాకిష్టంలేక పోయినా ఆమెయిచ్చిన రసము తాగకతప్పలేదు, నేనుతాగాను—తరవాత ఆమె నామందిరం వొదిలి వెళ్ళిపోయింది. మిగిలిన రాత్రికూడా నాకు నిద్దరపట్టలేదు. నాకు నిద్దరపట్టలేదని తెల్లవారడం మానుతుందా? క్రమంగా తెల్లవారిపోయింది. ఆరాత్రేగాదు, ఆ తరువాత అటువంటి రాత్రులు అనేకం తెల్లవారాయి. కాని సుబుద్ధిజాడగాని, అతనితో వెళ్లిన సైనికులజాడగాని ఏమీ తెలియలేదు. వారాలుగడిచాయి—నెలలుకూడా గడిచాయి, ఆరుమాసాలయింది, అంతవరకూ ఎలాగో సహించి వూరుకున్నగాని, ఇక ఓపిక పట్టలేకపోయా, సుబుద్ధిలేకపోతే నాకు ఒక్కదినంగడవదు. సుబుద్ధి నాకు మంత్రిగా మాత్రమే గాకుండా, ప్రాణమిత్రునిగా వుంటున్నాడు. అతనులేకుండా ఆరు మాసాలుగడపడమే అతికష్టమైంది. ఇకపై గడపడం అసాధ్యమైంది. నాకప్పుడు నిర్మలాదేవి విషయానికితోడు, మంత్రి జిజ్ఞాస మరీయెక్కువయింది. నాబాధ యిలావుండగా, అతని ఆత్మీయులు తమ సుబుద్ధి జాడ ఏమైనా తెలిసిందేమోనని—నా దగ్గరకువచ్చి—నాముఖ భావమును గమనించి, నిలువునాకుంగి వెనక్కి పోతున్నారు. అతను కూడా ఏమైనట్లు? అతను వెంటబెట్టుకు పోయినవెయ్యిమంది యుద్ధ

భటులు ఏమయ్యారు? వీరుగాక, అత్తవారి తాలూకు పరివారం కూడా తిరిగి రాలేదనివిని, మరింత కెల్లబోయాను, సుబుద్ధిలాంటి మంత్రి నాకు వెయ్యి జన్మలెత్తినా దొరకడు, నా ఆజ్ఞనతిక్రమించి వెళ్లాడు—నిర్మలాదేవికోసం ఆరుమాసాలు తిరిగాడు-ఇంకా యెన్ని మాసాలుకి తిరుగుతాడు, ఆమె నెక్కడా కానరానప్పుడికనయినా తిరిగి రాకూడదూ? పట్టుదలమనిషి, యెన్నిసంవత్సరాలయినా, అలాగే తిరుగుతాడు. ఉపేక్ష చేసి ప్రయోజనం లేదనుకున్నాను. నాకిక ఒక్క క్షణమైనా రాజధానిలో కాలునిలవలేదు.

సుబుద్ధుని వెదికి తీసుకొస్తానని అమ్మగారితో చెప్పి, అప్పుడిక నేను స్వయంగా బయలుదేరాను. అయితే, అతనెక్కడుంటాడు? ఎటువెళ్లాలి? ఏమీ తెలియకుండా, కంటికగుపించిన మార్గము ననుసరించి అశ్వారోహణం చేసుకుంటూ బయలుదేరాను.

అనేకములయిన పల్లెలూ, పట్నాలూ గాలించాను. అడవులు కొండలుదాటాను, ఎక్కడా సుబుద్ధి కనుపించడంకాని, అతని జాడ నయినా చెప్పినవారుగాని యెవ్వరూ లేరు. ప్రాణం విసిగిపోయింది. నా సుబుద్ధిజాడ తెలుసుకోకుండా వెనక్కు మళ్ళడానికి మనస్కరించదు-ఏం చెయ్యాలి? అలాగే మరి కొంతకాలం, మరికొన్ని యోజనాలు ప్రయాణంచేశాను, చివరకు, నా ప్రయాణానికొక అర్థము—ఒక అంతూ లేకుండాపోయింది—ఎన్ని మాసాలు ప్రయాణం చేశానో-ఎన్నివందల యోజనాలు దాటానో అన్నగమనిక లేకుండా, సుబుద్ధుని కలుసుకోకుండా తిరుగుముఖం పట్టేది లేదు—అన్నదీక్షతో ఏమయినాసరేనని ప్రయత్నం వొదలకుండా-రాత్రింబగళ్లు ప్రయాణం చేస్తునేవున్నా.

అలాచెయ్యగా చెయ్యగా, ఒక అరణ్య సమీపాన బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టు కనుపించింది. దానిశాఖలు ఊడలూ కొన్ని యోజనములదూరంవరకూ వ్యాపించివున్నాయి. దానిమాను విపరీతమయిన లావును కలిగివుంది. అటువంటి మహావృక్షం మీ భూమండలంలో వుంటుందనికూడా యెవరూ ఊహించలేరు. ఆ విడ్డూరపు మాను చూదామని, నేను గుఱ్ఱమునుదిగాను. మరొక అద్భుతం ఏమిటంటే-ఆ చెట్టుపైన రెమ్మ కొకచిలుక—ఆకు కొకచిలుకగా, కొన్నివేల చిలుకలు నివాసమేర్పరచుకొని వున్నాయి. అన్ని చిలుకలు కలిసి ఒక కోరంగు-

ఒకే సైజు—ఒకటే ఆకారము—అన్నీ ఒకే అచ్చులో పోతపోయ్య బడినట్లుండడం, నాకు మరింత ఆశ్చర్యమును కలిగించింది. రెప్ప వాల్చకుండా కంటలతరబడి చూశాను. వృక్షానికి చుట్టూతిరిగి ఆచిలుకల సౌందర్యమును తిలకిస్తున్న సమయంలో—దానినిమించిన సౌందర్య మింకొకటి కనుపించింది. అదేమిటంటే, ఆచెట్టుకు, అవలీలగా ఒక ఆజాను బాహువైన మనిషి ప్రవేశించగలిగినంతటి పెద్దతొఱ్ఱవుంది. దానిని చూడడంతో నాకు మతి పూర్తిగా భ్రమించినట్లయింది—అది ప్రకృతిలోగల అన్ని వృక్షజాతుల వంటిదిగాక, దానినెవ్వరో ప్రత్యేక దేవతలు నిర్మించి వుంటారేమోనని తోచింది. తొఱ్ఱలోపలకు పోయి చూడాలన్న కుతూహలంకలిగింది, ఒక అడుగుపెట్టి—రెండో అడుగు పెడుతున్నాను. ఇంతలో ఒక బ్రహ్మాండమైన నాగుపాము—సుమారు ఇరవై గజాల పొడుగుగలిగి, అందుకు తూకమైన లావున్నూ కలిగి, తన భయంకరమైన పడగను విప్పుకుని, బుసలుకొడుతూ నామీదికొచ్చింది. నేను తక్షణం వెనక్కు తగ్గి నిలుచున్నాను.

"ఓయీ! అవివేకుడా! నా ప్రశ్నకు జవాబు చెప్పగలవారు మాత్రమే యిందులో ప్రవేశించగలరు. నీకటువంటి అర్హతవుందా?"

అని ఒక సర్పము మానవభాషలో నన్నడుగుతుంటే, నేను మరింత తెల్లబోయి—

"ఏమిటి నీ ప్రశ్న?"

అని సాహసించి అడిగాను.

"ఈ మహావృక్షంపై ఎన్ని చిలుకలున్నవో చూశావా?"

"చూశాను—చాలావున్నాయి."

"అవి నిజమైన చిలుకలుకావు—శిలా నిర్మితములయిన సాలభంజికలు—"

"శిలా నిర్మితములయినవా?"

"కావాలంటే—తిరిగి పోయిచూడు."

నేనట్లే వాటిని తిరిగి పరీక్షగాచూశాను, అవి నిజమైన చిలుకలలాగునే వున్నాయి, సర్పరాజు చెప్పినమాటలో నాకు విశ్వాసం కలుగక పోయినందువల్ల—ఒక రాతిబెల్లను తీసి వాటిపై విసిరాను—ఒక్కటి చలించలేదు. తిరిగి అదేప్రకారం నాలుగయిదురాలు

రున్నాను, ఒక్క చిలుకకూడా చలించలేదు—పలుకలేదు, అప్పు డర్థం చేసుకున్నా—సర్పరాజు చెప్పింది నిజమేనని.

"నిజమే—అవి యథార్థమైన చిలుకకావు. నువ్వు చెప్పింది సత్యం." అని నాగేంద్రుడితో అన్నాను.

"తెలిసిందికదా! ఆ చిలుకలేమిటి?" అవి అలా శిలాప్రతిమ లుగా యెందుకున్నాయి? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పగలుగుతే, లోపల ప్రవేశించు— లేదా, ప్రాణం దక్కించుకుని పారిపో."

ఒక పెద్ద గుహావంటి ఆతోట్ట ప్రవేశించకుండా, లోపల యెలా వుంటుందో చూడకుండా పోవడానికి నాకు మనస్కరించలేదు. కాని తామడిగిన ప్రశ్నకు జవాబు తెలియదు, ఏంచెయ్యాలి?"

సర్పరాజునే అడిగాను ధైర్యంచేసి—

"నువ్వడిగిన ప్రశ్నకు జవాబు తెలియదు—తోట్టలో ప్రవేశించి అంతా చూడాలని పట్టుదలగావుంది—ఏంచెయ్యాలి?"

"ఏంచేస్తావ్? పోయి, ప్రయత్నంచెయ్యి—నాప్రశ్నకు ఎప్పుడు జవాబు చెప్పగలిగితే, అప్పుడు తిరిగిరా—లోపలికి పోయిచూదువు గాని."

"ఇప్పుడు వీల్లేదా?"

"ముందిక్కడనుంచి పదగెత్తు—కాటువేశానంటే చచ్చి పోతావు." అని నాగేంద్రుడు తిరిగి బుసకొట్టగా, నేనిక అక్కడ నిలుచోకుండా గుఱ్ఱమెక్కి తిరుగుముఖం పట్టాను. కాని మనస్సు వెనక్కులాగుతూనేవుంది. ఏమయినా సరే—ఆచెట్టు తోపులో ప్రవే శించాలి—లోపల యేముందో చూడాలన్న పట్టుదల యేర్పడింది. ఆ కార్యం సానుకూలపడే దెట్లాగా అని ఆలోచించుకుంటూ, ముం దుకు సాగిపోయాను. కాని, యెన్నడూ అన్ని యోజనములదూరం ప్రయాణం చేసినవాణ్ణి కాకపోవడంవల్ల, ఎక్కువగా అలిసిపోయాను. ఓవైపు, దాహంవల్ల నాలుక పొడారిపోతూంది. నాగుఱ్ఱం పరిస్థితి కూడా అలాగేవుంది. ఆప్రాంతంలో ఏదయినా జలాశయముందేమో నని నాలుగువైపులా పరకాయించి చూచాను. భగవంతుడు నాయం దుండబట్టి, అనతిదూరంలోనే ఒక కొలను కనుపించింది. నేను గుఱ్ఱం దిగి, ఆసరస్సులో కాలుసేతులు కడుక్కుని, కడుపుపట్టినన్ని నీళ్లు

తాగి, గుఱ్ఱమునుకూడా నీటి కొదిలి—అది నీరుతాగేంతవరకూ, ఆగట్టుమీద ఓపొన్నచెట్టుంటే, దాని నీడను కూర్చున్నాను.

హఠాత్తుగా ఎవరో మనుషులు మాట్లాడుకోవడం వినిపించింది. ఆమాట లక్కడి పొన్నచెట్టుమీదినుంచి లావుంటే, తలను పైకెత్తి చూశాను. ఆ చెట్టుమీద మనుషు లెవరూ లేరుకాని, ఒక పావుర ముల జంటమాత్రముంది. అవే మనుషులు మాట్లాడినట్టు మాట్లాడు తుంటే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది—

"చెలి! ఈచెట్టుకింద కూర్చున్న మహారాజెవరో నీకు తెలు సునా?" అని ఒక పావుర మింకో పావురాన్నడిగింది. నన్ను గురించే అనడానికి సందేహ మేముంది? అంచేత వాటి సంభాషను మరింత శ్రద్ధతో వినవలసివచ్చింది—

"ఈ మహారాజెవరో నాకు తెలియదు—నీకు తెలిసివుంటే చెప్పరాదా ప్రియా!"

"మహాపురాధీశ్వరుడు—చంద్రపాలుడు."

"అలాగే—అయితే ఈ నిర్మానుష్యప్రాంతాని కితడురావల సిన కారణమేమిటి?"

"రాణీ, నిర్మలాదేవి కొరకు మంత్రి బయలుదేరితే—ఆమహా మేధావి మంత్రి సుబుద్ధికోసం, యీ మహారాజు బయలుదేరి, అడవుల బడి తిరుగుతున్నాడు!"

"అయ్యో పాపం!"

"మంత్రీ, అతని పరివారజనులందరూ, శిలాప్రతిమలై చిలు కలుగా, ఈచేరువ మఱ్ఱి నాశ్రయించిన వివయ మితనికెలా తెలు స్తుంది? ఇదంతా దుర్మార్గుడైన ఆ బైరాగి తంత్రం కదా!"

అనేసి, ముందొక పావురము, దానివెంబడే రెండవ పావురము పొన్నచెట్టుపైనుంచి, తుఱ్ఱన ఎగిరి పారిపోయినాయి. నేనాశ్చర్య విభ్రాంతుడ నయ్యాను.

ఆ మఱ్ఱిచెట్టుపై శిలాప్రతిమలుగా వున్న చిలుకలన్నీ—సపరి వారంతో నామంత్రేనా? ఏమిటీ ఘోరం! వాళ్ళందరూ అలా రాతి చిలుకలుగా ఎందుకయ్యారు? ఈ దుర్మార్గమంతా చేసిన ఆ బైరాగి యెవరు? ఈ వివరాలన్నీ తెలుపకుండా యెగిరిపోయినయే పావు

రాలు! సుబుద్ధి ఇంతకాలానికి యినా తిరిగి రాకపోవడానికిదే కారణం కాబోలు!''

అని నాలో నేను కొంతసేపు విచారించి, ఆసమాచరమన్నా తెలిపిన పావురాలకు నాలో నేనే కృతజ్ఞత తెలుపుకుని, అంతలో గుఱ్ఱం నీళ్లుతాగడం పూర్తికావడంవల్ల, దాని నధిరోహించి, తిరిగి ఆమఱ్ఱి చెట్టుగల తావుకు బయలుదేరి పోయాను.

"నాగరాజా! నేనొచ్చాను."

అని ఆచెట్టు తొఱ్ఱ కివతలగా నిలుచుని నే ననేటప్పటికా కాల సర్పము తిరిగి యథాప్రకారం బుసలుకొట్టుకుంటూ యివతలకొచ్చి—

"వొచ్చావుగానీ, నా ప్రశ్నకు బదులు చెప్పగలవా?" అని యడిగింది.

"ఆ చెప్పగలను?"

"ఈ మఱ్ఱిచెట్టుపై శిలాప్రతిమలుగా వున్న చిలుకలన్ని యెవరు? అవి అలా ఎందుకున్నాయి?"

"ఆ చిలుకలన్నీ చంద్రసేనమహారాజుయొక్క సైనికబలాలు అతని మంత్రి సుబుద్ధి. బైరాగి మాయాజాలంవల్ల అవి అలా అయ్యాయి."

అని నేను పావురాలవల్ల వినిన విషయమును చెప్పిన వెంటనే—

"బేష్! సరిగా చెప్పావు—ఇక నీకడ్డు లేదు—లోపల ప్రవేశించు—"

అని సర్పరాజు తా నొకప్రక్కకు తప్పుకుని, నాకు మార్గ మేర్పరచింది. గుఱ్ఱము నివతలచెట్టుకు కట్టి నేను లోపల ప్రవేశించాను. అది ఒక సొరంగమార్గంగావుండి—ఎంతదూరం నడిచినా తరగకుండా వుంది. చీకటిగా వున్నప్పటికీ లెక్కచెయ్యకుండా, నేను ధైర్యంతో ముందుకు సాగిపోయాను.

చీకటిని చీల్చుకుని దూరంపోయిన కొద్దీ, వెలుతురు దగ్గరవు తున్నట్లుగా తోచింది. అందువల్ల ఆ సొరంగ మార్గానికి ఏదో ఒక గమ్యస్థానం వుండివుంటుందని వూహించుకున్నాను. రేట్టించిన ఉత్సాహంతో ముందుకు నడిచాను. అది సుందరమైన ఒక మందిరమై వుండడం చూచి మరింత ఆశ్చర్యపోయాను. అంత మఱ్ఱిచెట్టేమిటి— ఆ మఱ్రిలో అంత పెద్ద తొఱ్ఱ వుండడమేమిటి? ఆ తొఱ్ఱగుండా యీ

సారంగ మార్గమేమిటి? కొసకు ఈ సుందరమయిన మందిర మేమిటి—నాకదంతా ఏదో కలలా కనుపిస్తూంది.

చివరకు నేనేదయినా ప్రమాదంలో చిక్కుకుంటానేమోనని భయం కలిగింది. నా మంత్రికి, సైనికజనాలకు పట్టిన దుస్థితే నాకూ కలుగనై వుందా అనుకున్నాను. ఏమయినా అంతదూర మొచ్చాక, విషయం తెలుసుకోకుండా మళ్ళడం జరగదు గాబట్టి, మెల్లిగా ఆ మందిరంలో ప్రవేశించాను. నాలుగయిదు విశాలమయిన గదులు కలిగివుండి——నేలపై రమ్యమైన తివాసులు పరువబడి, ఆతివాసులపై అమర్చబడిన సోఫాలు——సోఫాల కిరువయిపులా మనోహరమైన పూలకుండ్లు, పూలకుండ్లకు దగ్గరి గోడలకు నిలువుటద్దాలు—శృంగార పటాలు——ముఖమల్ పరుపులతోను——దిండ్లతోనూ అమర్చబడిన మృదుపాన్పులు—అదంతా ఓ విలాసమందిరంలావుంది. అది ఏరాజాధి రాజులో, ఏ విలాసపురుషులో నివసించే ఏ కాంతస్థలమై వుంటుందని గ్రహించాను. కాని ఎక్కడా మనుష్యుల అలికిడి లేకపోయినందువల్ల రెండుమూడు గదులు దాటిపోగా, ఏదో గదిలో ఒక స్త్రీ ఆర్త నాదము——ఆమె గద్గదస్వరము వినిపించింది. నా గుండెలు ఝల్లు మన్నాయి. నేనక్కడివారి కళ్ళబడితే, తప్పక ప్రమాదం జరుగుతుం దని తెలుసు. ఏమిచెయ్యాలా అని ఆలోచిస్తుండగా, ఇంతలో రెండవ మనిషి గొంతుకకూడా వినిపించింది. తక్షణం వెనకు తగ్గాను. ఆగదికి ప్రక్కగా వున్న ఖాళీస్థలంలో కొన్నిచెట్లు గుబురుగా పెరిగివున్నాయి మెల్లిగా ఆగదిదాటి——నే నాచెట్లమాటున గుబురులో నక్కి కూర్చు న్నాను.

ఆ గదిలో వున్నవారు ఒక స్త్రీ—ఒక పురుషుడు అని, గొంతు కలనుబట్టి అర్థమైంది——చెవులావైపు నిగిడించి, వారి సంభాషణ నీవిధంగా వినడం మొదలుపెట్టాను.

## ౨౧

"నేను భోగించిన స్త్రీలు వందలాదివున్నారు—అందరిలో నీవంటి సుందరాంగి ఒక్కతెకూడా లేదు. కనకనే అంతశ్రమపడి, నినిక్కడికి తెచ్చుకోవలసివచ్చింది. విజయపురంలో, నువ్వు మీ తండ్రిగారైన ధనపాలమహారాజుగారి దగ్గరవుండగానే, చెలులతోకలసి, నువ్వు

పూలతోటలో విహరిస్తున్నపు డొకసారి నీ జగన్మోహన రూపమును చూడడం జరిగింది. ఆనాటినుంచి నీపై మనసుంచి, తపించి, తపస్సులు ధారపోశాను సావకాశం చిక్కలేదు, నీ స్వయంవర సమయంలో, నేనుకూడ ఒక మహారాజు వేషమునుధరించి, రాజలోకంలో ఒకడనై కూర్చునివుండడం ఎవరికీ తెలియదు, కాని ఏంలాభం? నీ వలపు చూపులు నాపై బడలేదు. ఆ చంద్రసేనునివరించావు. అంతమాత్రం లోనిరాశ పొందుతానా? నిన్నా చంద్రసేనుడికి దక్కనిస్తానా?

వెంటనే రాజకుమారు వేషమును తీసిపారేసి, నానిజరూపమైన యీ బైరాగివేషమును ధరించి, నగరవీధుల్లో తిరుగుతూ, మార్గము నాలోచించుకొంటుండగా, నీపతి నిన్ను సపరివారంతో నిజరాజ ధానియైన మహానగరంతిరలించుకు పోనై వున్నాడని తెలుసుకున్నాను, అంతకంటే అవకాశం దొరకదని ఊహించుకున్నాను. చంద్రసేన మహారాజుకు సాధువులన్నా, బైరాగులన్నా అమితప్రీతి అని అంతకు ముందే తెలుసుకున్న వాడనవడంచేత—మీరుపోతున్న అడవిమార్గం వరకూ అనుసరించివచ్చి, అనుక్షణము నిన్నపహరించుకపోగల మార్గ మునన్వేషించు కొంటునేవున్నాను. అంతమంది జనంలోవున్న నిన్ను వేరుచెయ్యగల వేరుమార్గంతోచక, వడదెబ్బతిన్నవానిలాగ పడిపోవ డము—మీఅందరి దృష్టినీ ఆకర్షించడము—తరువాత, నీమేనాలోనే స్థావరం చిక్కించుకునేవరకు విజయమునే పొందాను...''

ఆ మాటలువినగా సర్వమూ అర్థమైపోయింది. మనషుల చూడ నవసరంలేకుండానే, ఆయిద్దరిలో ఒకడు నాభార్య నపహ రించిన బైరాగి అనీ—రెండవది నానిర్మల అనీ సులువుగా తెలుసు కున్నాను. అయినా ఉద్రేకమును పట్టలేక గుబురుగాపెరిగిన ఆచెట్ల మాటునుంచి కొంచ మివతలగావచ్చి తలనెత్తి, ఆగదికిగల ఒకచిన్న కిటికీగుండా లోపలచూశాను. నిర్మలాదేవి ఆ దుర్మార్గుడు చెప్పే మాటలను వినిపించుకోకుండా కిందపడి దుర్లుతూ ముఖము నింకో వైపుకతిప్పి, కంటికీమంటికీ నేకధారగా ఏడుస్తున్నట్లు కనుపించింది. మా ప్రయాణపుమార్గంలో వడగొట్టినవానిలాగ నటించి మోసగిం చిన ఆ బైరాగిని స్పష్టంగా చూశాను.

''ఓరీ! వంచకుడా! మోసం చెయ్యడానికి నేనా దొరికాను— అందరిలో నన్నువరించి—నాతో భూతలస్వర్గము నేలగంపెడాశతో

వున్న యీ పడుచా నీకు చరబట్టానికి దొరికింది—నీ ఆయువింతటితో సరి—ఒక్క వ్రేలుతో నీతల నేలపడుతుంది చూసుకో—''

అని నేను ఆపుకోలేని ఆవేశంతో కత్తిని విసరబోయే సమయాన నిర్మలాదేవి గొంతు వినిపించింది. ఆమె ఏమీ చెబుతుందో వినాలని, నిదానించాను.—

''పాపీ! నువ్వు భగవత్స్వరూపుడవన్న భక్తితో నాథ ర్త చేసిన దానికి ప్రత్యుపకారమిదా! భగవంతుడంటూవుంటే—తగిన ఫలితాన్ని పొందుతావు—''

''భగవంతుడూ లేడు—ఫలితమూ లేదు—ఇదుగో! చూడు! ఈత్రిశూలం నాచేతిలో వున్నంతవరకు, నన్ను త్రినేత్రుడయినా ఏమీ చెయ్యలేడు—మీ మంత్రి—మీ సైనికబలాలూ ఏమైనవో తెలుసుగదా?—నా మట్టిచెట్టున చిలుకలై వ్రేలాడుతున్నారు. నా మీదికొచ్చిన ఎవరికయినా అదేగతి పడుతుంది—హరిహరాదులొచ్చినా, నిన్నక్కడనుంచి కదల్పలేరు.''

ఆమాటలన్నీ విన్నమీదట, నేను తొందరపడితే కార్యహాని అని తోచింది—చప్పుడుగాకుండా తిరిగి కత్తి నొరలోదూర్చాను. నిదానించి విషయమంతటినీ పూర్తిగా తెలుసుకుని, ఆపైన కార్యాలోచన చెయ్యడం మంచిదని నిశ్చయించుకుని-నాతనికి తెలియకుండా నిశ్శబ్దగా నక్కికూర్చున్నాను.

''విషయమంతటినీ తెలుసుకున్నాక సయితం నువ్విటువంటి మూర్ఖపు పట్టుపట్టడం మంచిదికాదు. నేను నీచెక్కులముద్దాడి—నీయౌవన సౌభాగ్యాన్ననుభవించగల అర్హత నా ఒక్కడికి మాత్రమే వుంది,''

''ఛీ! నీచుడా—ఒళ్లు తెలియని మైకంలో ఏమేమో పేలుతున్నావు, నన్నుస్పృశించగలయోగ్యత ఒక్క చంద్రసేనమహారాజునకు మాత్రమే వుంది. కనకనే అందరి రాజకుమారులలో నేను సుందరమూర్తిని వరించడమైంది, నేనతని సొత్తును, నాహృదయ మతని ఆధీనం, అనవసరంగా మాదంపతులను విడదీసి ఉసురులు కట్టుకున్నావు,ఇకనయినా నన్ను నాపతిని చేరనియ్యి.''

''అది కలలోమాట—నేనే నీ పతిననుకోవడం నీకు శుభం.'

"నోరుముయ్యి! బైరాగిననీ-సాధువుననీ-వేషం వేసుకున్నది, అమాయకులను మోసం చెయ్యడానికా?"

"ముమ్మాటికీ అవును, ఈవేషం లేకపోతే, నాకు ఒక్క కార్యంకూడా సానుకూలపడదు—ఒక్క అంతగ త్తెకూడా లభ్యం కాదు. ఈవేషము—ఈత్రిశూలమూ వుండడంవల్లనే—నీవంటి రాజ కుమార్తెల నెందరినయినా అవలీలగాపట్టితే గలుగుతున్నాను."

"మహాఘనకార్యం చేస్తున్నావు నీచుడా! సిగ్గులేక చెప్పు కుంటున్నావుకూడా—నీవేషానికి తగినట్లు, ఈశ్వర ప్రీతికరములయిన పనులుచెయ్యాలి—అప్పుడు చెప్పుకోవాలి."

"నాదృష్టిలో ఇదికూడా ఈశ్వరప్రీతి కనువైన కార్యమే—ఇక అనవసరప్రస్తావన చెయ్యక నా కోరికను తీర్చు-నిర్బంధవిధానము నవలంభించడం రసికలక్షణంకాదని, విశాలహృదయంతో యింత కాల మోపికపట్టి చూశాను, ప్రయోజనంలేదని తోచినప్పుడు నామార్గమును నేనవలంభించవలసిందే! ఇక్కడనేనేమిచేసినా యిక్కడ నన్నడ్డుపెట్టగల వారెవ్వరూ లేరు."

"నువ్వు తలబద్దలు కొట్టుకుని చచ్చినా—నీకోరిక నెరవేరదు. పరిస్థితి విషమించిందంటే—ప్రాణం తీసుకోవడానికి నిమిషం పట్టదు. నువ్వు నన్నిక్కడకు తెచ్చిన ప్రథమక్షణంలోనే, నే నానిశ్చయం చేసుకుని, ఎప్పటికప్పుడు సంసిద్ధంగా వున్నాను."

"పిచ్చిదానా—ప్రాణం తీసుకుని యెవరిని సాధించగలవు—నీచావెవరికి నష్టము—"

"ఒకరికి నష్టంలేకపోవుగాక—ఉత్తమస్త్రీకి మానరక్షణ కదొక్కటే కోరిన మార్గము—"

"నీతో తర్కమెందుకొచ్చింది కాని—ఈ ఒక్కరోజు గడు విస్తున్నాను. రేపీపాటికి తిరిగివస్తాను. అప్పటికయినా నువ్వీమనసు మళ్ళించుకోలేక పోయావంటే—చాలా చిక్కులు పడతావు. నాకోరి కను తీర్చావంటే, నాకు రాణివై సకలభోగాలూ అనుభవిస్తావు—రేపీలోపుగా బాగా ఆలోచించుకో."

అని చెప్పి, ఆ నీచు డప్పటి కా తావును వొదిలి పోయాడు. ఎక్కడికి పోతాడా అని నేను మెల్లిగా చీకట్లో దూరంనుంచి వాడి ననుసరించాను. వాడు క్రమంగా సొరంగమార్గమునంతటినీదాటి—

తొట్టిలోవున్న నాగరాజు కేమో హెచ్చరిక చేసి, వడివడిగా వెళ్ళి పోయాడు. అప్పటికి నేను హృదయం పదిలపరచుకొని మెల్లిగా వెనకు ్కతిరిగి నిర్మలాదేవి వున్నదగ్గరి కొచ్చాను.

విన్నావుకదా విజయకుమారా! తాను ప్రచ్ఛన్నంగావుండి—చింతామణిచేత ఆ ప్రశ్నల నడిగిస్తున్న బైరాగి వీడేనని నువ్విప్పటి కయినా అర్థంచేసుకుని వుంటావు.''

అని చంద్రసేనమహారాజు తొలితంలో బైరాగికి సంబంధించిన ఘట్టమునంతవరకు చెప్పినమీదట—

''సందేహం లేదు. మీనగరంలో మిమ్మల్ని మోసంచేసినట్లే నేను మొదటి ప్రశ్నకు జవాబు తెలుసుకున్న నర్తినగరంలోకూడా చేశాడు. ఆ నగరాధిపతి, విక్రమదేవుడున్నూ, ఈ బైరాగిచేత చెర పట్టబడిన నిజసోదరిని రక్షించుకోడానికి అనేక కష్టాలుపడి—మీరు చూచిన ఆ మర్రిచెట్టును అతనూ చూశాడు. అయితే అక్కడున్న నాగరాజు అతనిని ఒక ప్రశ్న అడిగింది—నిన్ను వేరేమరియొక ప్రశ్న యడిగింది. తరువాత, అతనుకూడా ఆ సొరంగముగుండా లోపల ప్రవేశించాడు. సోదరిని చెరవిడిపించాడు—కాని ఆమె తిరిగి ఆబైరాగిచే వంచించబడి, నిజమానసంరక్షణార్థం ప్రాణత్యాగం చేసుకుంది. అదే విషాదకరఘట్టం. ఇక నీవు నిర్మల నేవిధంగా బైరాగి చెరనుంచి విడిపించుకొన్నదీ వినవలసివుంది.''

అని విజకుమారుడు హెచ్చరించినమీదట, చంద్రసేనుడు, తిరిగి యీవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు—

''నిర్మలాదేవిని గురించి మేము పడిన ఊహాలన్నీ అపోహాలయినాయి—అందరూ ఆమెపై వేసిన అభాండాలు భిన్నమయినాయి—మంత్రి, నా అజ్ఞను ధిక్కరించి ఆమెకై బయలుదేరడం మంచిదయింది. అతను బయలుదేరడంవల్లగదా, అతనిని వెదుక్కుంటూ నేను బయలుదేరడము—విషయమును తెలుసుకోవడము, జరిగింది! సుబుద్ధికూడా అందరిలాగునే అనుకొని ఉపేక్షచేసినట్లయితే, నిర్దోషురాలయిన నిర్మలగతి ఆబైరాగి చేతుల్లో ఏమయ్యేదో అని, నేనెంతయినా దుఃఖపడ్డాను. కాని మాకుటుంబానికంత మేలుచేసి సుబుద్ధి శిలారూపంలో చిలకగావున్నాడే—ప్రాణసమానుడైన నాసుబుద్ధి తిరిగి నాకెలావస్తాడు? అన్నదొక పెద్ద ఆలోచన!

ఆబైరాగి వెళ్ళిపోయిన అనంతరం, నేను వడివడిగా నిర్మల వున్న దగ్గరకు వెళ్లాను. పొంగిపొర్లివచ్చే దుఃఖంతో నేలబడి పొర్లాడుతున్న నిర్మలాదేవి నన్నుచూసి—పట్టలేని సంతోషంతో లేచి నన్ను కౌగలించి—

"ఈ జన్మకిక మిమ్మల్ని కలుసుకుంటానన్న ఆశలేక, బలవన్మరణానికి సంసిద్ధంగా వున్నాను. ఈ ప్రమాద స్థలానికి మీరెలా వచ్చారు? ఎప్పుడొచ్చారు?"

అని ఆనందబాష్పాలు రాలుస్తూ యడిగింది.

"ఎలాగయితేనేం, వచ్చాను—ఇంతవరకు ఆదుర్మార్గుడు నీతో సంభాషించినదంతా విన్నాను. అయితే యిప్పుడు ప్రమాదమును తప్పించుకోగల మార్గమేమిటో అదొక్కటే ఆలోచించవలసివుంది."

"వాడిమాటలన్ని విన్నానంటున్నారు గాబట్టి, నేను మీకు ఎక్కువగా చెప్పవలసిందిలేదు. వాడిదగ్గరున్న త్రిశూలంతో వాడెన్ని పనులయినా చెయ్యగలడు. అది మాంత్రికశూలం. దానితోనే నాకు మైకం తెప్పించి, ఒళ్లు తెలియని స్థితిలో ఇక్కడి కెలాగో చేర్చాడు. తరువాత, సుబుద్ధి సైన్యసమేతంగావచ్చి, బైరాగి సమాచారం ఎలా తెలుసుకున్నాడో నాకు తెలీదు. అతను సాయుధపాణులతో సొరంగ మార్గాన నీతావు చేరనైవున్నాడని తెలుసుకుని, యీవంచకుడు తన మాంత్రికశూల ప్రభావంతో మంత్రి సయితంగా అందరినీ రాతిచిలుకలుగా మార్చి మర్రిచెట్టున నిలిపాడు. మన మిప్పుడు ఏమాత్రం అడుగు తప్పువేసినా వారి మాయాజాలానికి గురిఅవుతాము."

అని నిర్మల చెప్పిందాని నంతటినీ విని దీర్ఘంగా ఆలోచించాను మోసానికి మోసమే ప్రతిక్రియగాని, పౌరుషంవల్ల ప్రయోజనంలేదని తెలుసుకున్నాను. వెంటనే ఆబైరాగిని జయించగల సూక్ష్మమార్గ మొకటి నాకు తోచింది. దానిని నిర్మలకు చెవిలో చెప్పాను. ఆమె నవ్వింది.

"సందేహం లేకుండా, యీమార్గంవల్ల మన మాబైరాగిని జయించి దాటిపోవచ్చు." అంది.

అప్పుడు ఇద్దరి మనస్సులూ కొంతవరకు శాంతపడ్డాయి. బైరాగిని జయించగలమన్న ధైర్యం చిక్కింది.

"అయితే వాడు తిరిగి రేపీపాటికివస్తానన్నాడు. అది నిజమేనా?"

"నిజమే—యీలోపల రాడు. ఆడినమాటను తప్పని నియమం ఒక్కటుంది వాడి దగ్గర."

అంతవరకూ మనం ధైర్యంగా వుండవచ్చు నన్నమాట?"

"ఆహా! రేపీపాటివరకూ మనకేం భయంలేదు, నాకు ఆక లయినప్పుడు తినవలసిందని, కొన్ని మధుర ఫలాలు—రొట్టెలూ—తీసుకొచ్చి, ఒకసారే అవతలగదిలో నింపాడు—చావు బ్రతుకుల ఇరుకులోవున్న నేను ఒక్కదానినికూడా ముట్టుకోలేదు. అందర రాజులలో నావరాలపంటగా—నా నోముల ఫలితంగా—వరించు కుని—మీతో అపరస్వర్గము నేలవచ్చునని మురిశాను. పట్టలేని ఆనందంతో నన్ను మించిన సౌభాగ్యవతులుండరని గర్వించాను. నామురిపెం—నాగర్వం—అన్నీ యీ బైరాగిచేతుల్లో పడ్డాయేమోని—అధోలోకంలోకి కృంగిపోయాను, భగవంతుడు నాయందున్నాడు. సర్వసంగపరిత్యాగి, బైరాగి అనుకున్న—తండ్రి సమానుడు—దైవసమానుడు, వడగొట్టిపడివున్నాడు, కొంచంసేపు నామేనాలో వుంటే పోయిందేమనుకున్నా—"

"నాదికూడా అదేభావం! వాడిటువంటి మోసగాడని అప్పుడే తెలుస్తే, కత్తుసందునపడి తుత్తునియలు కామా?"

"అతివిశాలమైవున్న ఆమేనాలో వాడొకమూలగా పరుండి చెయ్యపడ్డాడు. ఆనాటిరాత్రి ప్రయాణం చాలా ఉత్సాహకరంగా వుంది గదా! నేను మేనా పరజాలను కొంచం తొలగించుకుని, ఆవెన్న లను, వెన్నెట్లో వింతవింత వృక్షజాతుల ప్రకృతినీ ఆనందంగా చూస్తూ చాలాసేపు మెళుకువగానే వున్నాను. ఎప్పుడు పట్టిందో ఓచిన్నకునుకు పట్టింది అంతే నాకు తెలుసు. కళ్లువిప్పిచూసే టప్పటికి—ఇదుగో యిక్కడున్నాను. గుండె బేజారయిపోయింది. ఆరోజు మొదలుకొని, యీరోజువరకూ, ప్రతినిత్యమూ ఒకసారొచ్చి, ఇదుగో, మీకుచూసిన విధంగానే ఏమేమో పేలుకుని పోతుంటాడు."

అని, నిర్మలాదేవి బైరాగివల్ల తనకుకలిగిన అనుభవమంతంత టినీ నాకు చెప్పింది. మేము కోటచేరింది లగాయితు, ఆమె కనుపించక పోయినందువల్ల జరిగినవిపయాలు—అందరూ అనుకున్న విధానాలు—నాఊహలు—అమ్మగారిమాటలు—సుబుద్ధియొక్క సాహసము—మొదలయిన సంగతులన్నింటినీ ఆమెకు వివరించి చెప్పి, పొరపాటుగా

భావించినందుకు క్షమాపణ వేడుకున్నాను. మర్నాటి ఉదయంవరకూ యిరువరము విశేషాలు చెప్పుకుంటూ ఖులాసాగా గడిపాము. ఉదయం కాగానే, మేమనుకున్న యేర్పాటు ప్రకారం, బైరాగిని జయించ డానికి ఏరు ఎట్లన్నమాట గించుకుని—యెవరుండవలసిన తావుల్లో వాళ్లం తయారుగావున్నాం. నియమిత కాలానికి బైరాగి సరిగా వచ్చి చేరాడు.

"ఏమాలోచించావ్! ఇప్పటికయినా మనసు మార్చు కున్నావా, లేదా?"

"మీరంతగా చెప్పాక-యెందుకు మార్చుకోనూ?" ఆమాటలు వినేటప్పటికి బైరాగి తబ్బిబ్బియ్యాడు. తనకోరిక నెరవేరనైవుంది కదా అని ఆనంద పరవశుడయ్యాడు.

"బుద్ధిమంతురాలివి గాబట్టి దారికొచ్చావు."

"మొదట్నుంచీ మీదార్లోనే వున్నాగానండీ—మీమనస్సు పూర్తిగా తెల్సుకోవాలని—ఇంత జాగు చేశాను."

"నామనస్సును ఇప్పుడయినా పూర్తిగా తెలుసుకున్నావా?"

"ఇంకా కొంచం తెలుసుకోవాలండీ!"

"అబ్బా! ఈవేళ నీమాట లెంతతియ్యగా వున్నాయ్! జన్మతరించింది—ముఖం అటుతిప్పుకుని మాట్లాడతావేం—నిండుజాబిల్లిలాంటి ముఖం—ఇటు తిప్పు మరీ—"

"ఈమాత్రమైనా తెలుసుకోలేకపోయారు—అందుకే విచారం."

"మనిద్దరికీ అటువంటి తేడాలేదు—నేను తెలుసుకోలేక పోయిం దాన్ని వివరంగా చెప్పరాదా ప్రేయసీ!"

"నేను ముఖం అటుతిప్పుకుని మాట్లాడుతున్నాందుకయినా తెల్సుకోవచ్చునే—"

"నాజడలు—ఈబైరాగివాటము—చూడ్డాని కసహ్యంగా వుంది కదూ?"

"ఆఁ! అదే! అదే! ఇప్పటికయినా కనిపెట్టారు—ఆజేగురు గుడ్డలు, శంఖం, త్రిశూలం—వాటన్నింటినీ నాదగ్గరున్న కాస్సే పయినా దూరంగా పడేస్తే బాగుంటుంది. స్త్రీపురుషుల సంయోగ సమయంలో అవన్నీ దగ్గరుంటే, ఎంత అసహ్యంగావుంటుందండీ—చెప్పండీ!"

"ముమ్మాటికీ సత్యం—మూర్ఖుణ్ని, నువ్వు చెప్పేదాకా ఈ మాత్రం గ్రహించలేకపోయాను. ఇప్పుడు చూడు—నువ్వు చెప్పినట్లు చేసి, నీకెంత సంతోషం కలిగిస్తానో!"

అని బైరాగి వెంటనే తన చేతిలోవున్న శంఖమును, త్రిశూలమును ఒక మూలపడేసి, అక్కడేవున్న ఒక కఱ్ఱపెట్టెలోంచి, ఊత్తే గాలి కెగిరిపోయేలాంటి అతిసున్నితములయిన పట్టుదుస్తులు తీసి, తన ముందుటి బైరాగి దుస్తులు తీసిపారేసి, ఆ సరికొత్త పట్టుదుస్తులు ధరించాడు. పట్టలేని కామోద్రేకంతో దగ్గిరకొచ్చి—

"నా అందాలరాణీ! నా ముద్దులగుమ్మా! ఈసారి నన్ను చూడు—ముఖ మిటుతిప్పు."

అంటూ మీదపడి గట్టిగా కౌగలించి, ఒళ్లు తెలియని ఆవేశంతో ముద్దు పెట్టుకున్నాడు!

ఎవర్ని? విజయకుమారా! ఖంగారుపడకు! ఆ కామాంధుడు ముద్దుపెట్టుకున్నది—నన్ను గాని, నిర్మలాదేవిని కాదు. మేము చేసిన మంత్రాంగమే అది! నిర్మల చీరవగైరా దుస్తులు నేను ధరించివేసి ముసుగులోని ముఖాన్ని అటుతిప్పుకుని, ఒయ్యారంగా నిలుచుని మాటలాడుతుంటే, నేనే నిర్మలననుకున్నా డామూర్ఖుడు! నేను నటించడంలోనూ నేర్పులేకపోలేదనుకో—ఎలాగయితే నేమి మోసానికి ప్రతిమోసంచేసి, బైరాగిని బల్టీకొట్టించాను. వాడు స్త్రీ వేషంలో వున్న నాదగ్గిర ఇలా ప్రేమచేష్టలు జరుపుతున్న సమయంలో, నా దుస్తులు ధరించి, మూడుమూర్తులా నాలాగే తయారయిన నిర్మల, బైరాగి పడేసిన త్రిశూలమును సంగ్రహించి, ఒక యెత్తయిన కుర్చీమీద ఖడ్గపాణియై తయారుగా నిలుచుంది. నామీదపడి నన్ను ముద్దుపెట్టుకుంటూకూడా ఆ మూర్ఖుడు నేను పురుషుడని గమనించలేక పోయాడు-కాముకులు అంధులు అనడంలో ఎంత సత్యముందో, నాకప్పుడర్థమైంది. అంతవరకూ చీరమాటున దాచివుంచిన కరవాలమును పైకితీసి, వేలుముసుగును తొలిగించి—

"ఓరీ! మూర్ఖుడా! నేను నిర్మలనుగాను—నీప్రాణం తియ్యడానికొచ్చిన వీరుడు, చంద్రసేనుణ్ణి! కళ్ళకు కమ్ముకొన్నపొరలు విడగొట్టుకుని చూడు!"

అంటూ నేను వాడి కంఠమును తెగటార్చడానికి ఖడ్గమును ఝుళిపిస్తుంటే—వాడు విభ్రాంతుడై గజగజ వొణికిపోయాడు—

"నిర్మలా—నిర్మ—ఎక్కడా?" అన్నాడు తడబడుతున్న గొంతుకతో—

"చావుకు సిద్ధంగావు డికూడా—ఆ పవిత్రనామాన్ని ఉచ్చరిస్తున్నావా! నిర్మల—అదిగో—నిన్ను మింగడానికి తయారుగావుంది—అటుచూడు!"

అని నేను వాడికి నిర్మల, పురుషవేషంలో ఖడ్గపాణియై నిలుచున్నదెసకు చూపాను. వాడు తిలకించి, మరింత తెల్లబోయాడు, నిర్మల వాడికంఠానికి కత్తినిగుచ్చిపెట్టి—

"పాపీ! ఈనోజుతో నీ కండగాలుసరి—ఇప్పుడు నీతల మారెండు కత్తులకూ నడుమవుంది—నీతెచ్చిపు ప్రాణం తియ్యడానికి కరవాలంచాలు—నా కరవాలమును వరిస్తావో—నాథ రక్తకరవాలమును వరిస్తావో—వరించు!"

అని, తోకతొక్కిన ఆడతాచులాగ—వింటిదెబ్బతిన్న ఆడసింహములాగ, ఆ సుందరి గర్జిస్తుంటే—

"అయ్యో! అయ్యో! మోసం—మోసం—నాత్రిశూలం!" అంటూ ఆ కపటబైరాగి, ప్రతీకారప్రయత్నమును మానక, తన త్రిశూలానికై వెనుకుళ్లాడబోయాడు—

"కపటబైరాగీ! అడుగు కదిపావంటే—హతమైపోతావ్! ఇంకెక్కడి త్రిశూలం! నీకింకెక్కడిబ్రతుకు! మంత్రిక త్రిశూలాన్నొక దాన్ని సంపాదించి, దానిసహాయంతో ఎందరి ఉత్తమాంగలను చరబడతావురా? ఎందరి ఆలుమగలను విడదీసి ఉసురులుకట్టుకుంటావురా? నీత్రిశూలం నాహస్తగతమైంది—ఇదుగో! ఖడ్గం విసురుతున్నా—కాసుకో—ఇప్పుడయినా ఇష్టదైవాన్ని ఒక్కసారి ప్రార్థించుకో—దేవుడు లేడన్నావు—నీ దుండగాలు పరమేశ్వరుడికి ప్రీతన్నావు—ఇప్పుడేమంటావు? దేవుడున్నాడా? నీ దుర్మార్గాలకు ఫలితమేది?"

అని నిర్మల కసిదీరేలాగ వాడిపై నిజంగా కత్తిని విసరబోతుంటే—

"నిర్మలా! కొంచమాగు! ఈ దుర్మార్గుకితో మనకింకా పనుంది—" అని ఆమెను వారించి, బైరాగిని చూచి—

"ఓరీ! నామంత్రి, సుబుద్ధి మొదలయిన పరివారాన్ని ఏంచేశావురా?" అని అడిగాను.

"రాజకుమారా క్షమించు! నాకు ప్రాణదానంచెయ్యి! నీ మంత్రి వగైరాలను రాతిచిలుకలుగా మార్చాను, అదుగో వారందరూ శిలాప్రతిమలై మఱ్ఱిచెట్టుపైవున్నారు—నాకు ప్రాణదానంచేస్తానని వాగ్దానంచేస్తే, నీవాళ్ళందర్నీ యథాప్రకారం నీవాళ్లుగాచేస్తాను, నాప్రాణంతీస్తానంటావా—అంతకాడికి నీకుపకారం చెయ్యడందేనికి? చంపుకో—"

అని వాడు చచ్చేముందుకూడా యుక్తినే ప్రయోగించాడు నాసుబుద్ధి మొదలయినవారు తిరిగి యథాప్రకారం కావడం ముఖ్య కార్యం గనుక—

"సరే—నీకు ప్రాణభిక్షపెడతాను—నావాళ్ళను యథాప్రకారం నాకు వప్పగించు."

అని నేను మాటయిచ్చినమీదట, వాడు నన్ను, నిర్మలాను యివతలకు తీసుకొచ్చాడు.

"త్రిశూలం పైకితియ్యండి—దానితో ఒకసారి ఈ చెట్టు మొదలుతాకండి—" అన్నాడు. నిర్మల త్రిశూలమును పైకితీసి, వాడు చెప్పినట్లుగా చేసింది, తక్షణం, మాకాశ్చర్యం కలిగేటట్లు, చిలుకలన్నీ మనుషులుగామారి, చెట్టుదిగివచ్చారు. సుబుద్ధి నన్ను చూచి ఏమీ అర్థంచేసుకోలేక—

"ప్రభూ! మనమందరమూ యింకా బ్రతికివున్నామా? నిర్మలా దేవి క్షేమమా?" మీరెందుకిలా అర్థనారీశ్వర వేషంలో వున్నారు?"

అని విభ్రాంతుడై అడిగిన సుబుద్ధి ప్రశ్నలకు నేను నవ్వి—

"అందరం క్షేమంగా వున్నాము—అదుగో నిర్మలకూడా యిక్కడనే సురక్షితంగావుంది—మా అర్థనారీశ్వర అవతారాల సంగతి తరువాత మాటలాడుకొందాము—అన్నిటికీ కారకుడయిన యీబైరాగిని ముందర పరామర్శించు,"

అని నేనన్నమీదట సుబుద్ధి పట్టలేని ఆవేశంతో ఒరనుంచి కత్తినిదూసి—

"ఓరీ! మాకిన్నితిప్పలు తెచ్చిన కపటబైరాగివి నువ్వేనా! నీ తలకోసమే నా కరవాలం తహతహలాడుతూంది—కాసుకో—"

అంటూ కత్తిని విసరబోయాడు, బైరాగి తొందరపడి—

"మహారాజా! నీ వాగ్దానం!" అని కెవ్వున అరిచాడు.

"సుబుద్ధీ! ఆగు! ఈ నీచుడికి ప్రాణభిక్ష పెడతానని మాట యిచ్చాను, ఆడినమాట తప్పడం, మన వంశాన లేదు"

అని నేను సుబుద్ధిని వారించగా, అతడు ఎత్తిన కత్తినివాల్చి-

"ప్రభూ! ఇంత చేసిన మహాపాపికి ప్రాణదానమా?" అని అడిగాడు.

"కానియ్యిలే—కోఱ లూడబెరికిన పాములాగ, పిడికెడు కుక్క బ్రతుకు బ్రతకవలసిందేగాని ఎందుకూ పనికిరాడు."

అని మంత్రికిచెప్పి, బైరాగితో—

"ఓరివంచకుడా! మేమాడినమాట తప్పము. కనక నువ్వు బ్రతికిపోయినావు—ఇక యెన్నడుగాని, మానగర ప్రాంతంలో నీముఖం యెవరికయినా కనుపించిందంటే—అప్పుడికి నీబ్రతుకు కల్ల—ఈమాట మాత్రం గుండెల్లో పెట్టుకొని బ్రతుకు పో!

అని నేను హెచ్చరించిన మీదట, వాడు బ్రతుకుజీవుడా అను కొని సంతోషపడుతూ—మా అందరికీ నమస్కారంచేసి—ఆతావును వొదిలి వెళ్ళబోతుండగా, అంతవరకూ చెట్టుతొఱ్ఱలోవున్న నాగు పాము సర్పము నిపతలపెట్టి

"రాజకుమారా! మీకు శుభములు కలుగుగాక! ఇంతటిని కాపాడి—మహాక్రోధియైన బైరాగికి సయితం ప్రాణభిక్ష పెట్టిన నీకు, నన్ను రక్షించడం కష్టమైందా? నేను నీకు ఉపకారం చెయ్యలేదా?" అని అడుగుతుంటే, నాకాశ్చర్యమయింది.

"నాగరాజా! నావల్ల నీకు కావలసినదేముంది?"

అని నేనడగ్గా—

"ముందర, ఆ వెళ్ళిపోతున్న బైరాగిని పిలవండి," అని నాగేంద్రుడనగా, కొందరు పరుగెత్తిపోయి, వెళ్ళిపోతున్న బైరాగి రెక్కలుపట్టి లాక్కొచ్చారు.

"నాకేమి ఉపకారం చెయ్యాలో—ఆ బైరాగినే అడగండి చెబుతాడు—" అని సర్పరాజంది.

"ఓరీ! ఈ సర్పరాజు వృత్తాంతమేమిటి? దీనికి మేము చెయ్య గల ఉపకారము చెప్పి మరీ వెళ్లు."

అని నేను బైరాగితో అన్నాను,

"మహారాజా! ఈకాలసర్పముకూడా ఒకప్పుడొక రాచకన్య. ఈమె తన స్వీయచరిత్రను మరియొక స్త్రీతో చెప్పుకొన్న తరువాత, ఆవినిన స్త్రీ—'ఓబసవరాజా! బైరాగి బ్రతికినా, చచ్చినవాడితోనే జత—నువ్వొక నీయథారూపమును పొంది—యథేచ్ఛగాపో—' అని అంటే—ఆక్షణం. ఈ సర్పరాజుకు విముక్తి కలుగుతుంది."

అనిచెప్పి బైరాగి తిరిగి వెళ్ళిపోబోతుంటే—

"ఆగు! నువ్వు చెప్పినది నిజమో కాదో—తెలుసుకోవాలి," అని నేనా బైరాగిని వెళ్ళనియ్యకుండా నిలిపాను.

"రాజకుమారా! నేనింతవరకు అబద్ధంచెప్పలేదు, అయినా నీయిష్టప్రకారం వుంటాను." అని, పోవడంమానాడు.

"సర్పరాజా! బైరాగిమాటలు విన్నావుగదా! నీ స్వీయచరిత్రను మా నిర్మలాదేవికిచెప్పు—ఆమె విని—బైరాగి చెప్పమన్న వాక్యములు చెబుతుంది, అప్పుడు నీ పూర్వరూపమును నువ్వు పొందవచ్చును."

అని నేను హెచ్చరించిన వెంటనే ఆకాలసర్పము, మాఅందరి సమక్షమున, నిర్మలాదేవికి తనవృత్తాంతము నీ విధంగా చెప్పడం మొదలుపెట్టింది.

## ౨౨

"సౌభాగ్యవతీ! నేనుకూడా నీలాగునే ఒకప్పుడు ఒక రాజకుమార్తెను. నాతండ్రిగారయిన విజయసారధిమహారాజు, మాణిక్య ద్వీపానికధిపతి. నా పేరు సూర్యప్రభ. దురదృష్టవశాన, నన్నుకన్న తల్లి అకాలమరణమును పొందిన కారణంవల్ల, మా నాయనగారు అలివేణి అనే రాజకుమార్తెను, ద్వితీయ భార్యగా స్వీకరించారు. ఆ విడకు నాగబలుడనే సోదరుడున్నాడు. అతను, చదువు సంధ్యలులేక చిన్నతనంనుంచీ దీర్ఘాయిగా తిరిగినవాడంచేత, తండ్రిగారు పోయిన తరువాత, రాజ్యపాలనముకూడా చెయ్యలేక సర్వసంపదలూ పోగొట్టుకుని, అక్కగారయిన అలివేణిని ఆశ్రయించాడు. ఆమె సోదరుని యందు అత్యధికమైన ప్రేమకలది కావడంవల్ల, తనతోపాటు మా

యింటనే వుంచుకుని, అతని కెటువంటిలోటున్నూ కానియ్యకుండా చూస్తూంది.

అంతేగాక, నేను యుక్తవయస్కురాలనై వివాహానికి అర్హత కలిగివుండడమును గమనించి, నన్ను తనసోదరుడు. నాగబలుడి కిచ్చి పెళ్ళిచేయాలని సంకల్పించింది. తన అభిప్రాయమును మా నాయన గారికికూడా చెప్పింది. నావంటి సౌందర్యవతిని నాగబలుడు వంటి మూర్ఖుడికి, రాజ్యపదభ్రష్టుడికీ ఈయడానికి మానాయనగారు మొదట ఇష్టపడలేదు. కాని అలివేణియందుగల అత్యధికప్రేమవల్ల, ఆమెకు సంతోషం కలిగించడానికి ఆమె చెప్పిందాన్ని అంగీకరించారు. తా మంతవరకు నాగురించి చేస్తున్న వివాహప్రయత్నాలన్నింటినీ విర మించుకున్నారు. నన్ను నాగబలుడికిచ్చి వివాహం చెయ్యడానికే నిశ్చయంచేశారు—నేనా నాగబలుణ్ణి వివాహం చేసుకోనని, మా నాయనగారిని, సవతితల్లిఅయిన అలివేణినీ, ఎదిరించగల సాహసం నాకులేదు. ఒకవేళ ఎదిరించినా ప్రయోజన ముండదని తెలుసు. నాయనగారు, అలివేణి మాటకు అడుగుదాటరు! నేను చేసుకున్న పూజ అంతేనని, నాలో నేను కుమిలికుమిలి ఏడవడంకంటే యింకేమీ చెయ్యలేకపోయాను.

ముహూర్తనిశ్చయం కాలేదు కాని, పెళ్ళికి ప్రయత్నాలన్నీ జరుగుతున్నాయి. ఒకనాడు రాజాస్థానానికి ఒక ప్రజ్ఞావంతుడయిన దైవజ్ఞుడు వచ్చాడు. ఆ జ్యోతిష్కుడు మహామహా పండితుడట. ఆ విద్యలో అతనిని మించగలవారు ఏదేశానా లేరట! రాజసభలో అనేకమంది అతను చెప్పినదానిని గురించి తృప్తిపడడమేగాకుండా, అతడు భూతభవిష్యత్వర్తమానకాల విషయాలు ఖచ్చితంగా చెప్పగల మహాప్రజ్ఞావంతుడని, అనేక యోగ్యతాపత్రాలుకూడా యిచ్చారు. సభ ముగిసిన తరువాత మానాయనగారు దైవజ్ఞపండితుణ్ణి రాణివా సానికి తీసుకొచ్చారు. అలివేణికి అతని యోగ్యతలనుగురించి వివరిం చారు. ఆమె కాశాస్త్రమందు అధికవిశ్వాసముండడంచేత, ఆ పండి తుని గౌరవించి—తన కవసరమైన కొన్ని విషయాలు అడిగి తెలుసు కుంది. అతను చెప్పినదానిని గురించి అమితంగా తృప్తిపడింది—మా నాయనగారుకూడా, రాజ్యాంగ విషయాల భవిష్యత్తును గురించి దైవజ్ఞు నడిగి తెలుసుకున్నారు.

అప్పుడు నేనుకూడా అక్కడనే వున్నాను. ఆద్వైవజ్ఞ పండితు డెందుకో నాముఖంలో కొకసారి తేరి పారిచూశాడు. చూచిన అనంతరం—

"సర్వలక్షణ లక్షితురాలయిన ఈకన్యను చేపట్టిన పురుషుడు మహాభాగ్యశాలి, కీర్తివంతుడు కాగలడు."

అని ఆ జ్యోతిషవేత్త ఎవరూ అడక్కుండానే నన్ను గురించి చెప్పాడు.

ఆ కీర్తివంతుడు—ఆభాగ్యశాలి—తన తమ్ముడేగదా అని, అలివేణి అపరిమితానందము ననుభవిస్తుండగా—

"ఈ శుభాంగనకు ఇంతలో వివాహయోగంలేదు. మహానగ రాధీశ్వరుడు, చంద్రసేనమహారాజుకు మంత్రిగా వుండబోవు, సుబుద్ధికి ఇల్లాలు కావలసివుంది. గ్రహకూటం ఆయిద్దరికి మాత్రమే అనుకూ లించింది. ఇతరు లెవ్వరు ఈమెను వివాహమాడినా, మూడుదినములు దాటకుండా మృత్యువాత బడతారు."

అని, ఆకాలసర్పము చెబుతుంటే, నేను విభ్రాంతుడనయ్యాను నాతోపాటు, సుబుద్ధి మిగిలినవారు, మరింత తెల్లబోయారు. నావైపు సుబుద్ధి—సుబుద్ధివైపు నేను—తెల్లబోయి చూసుకున్నాము.

"అప్పుడే తొందరపడి ఏమీ మాటలాడకండి—నాగేంద్రుడు చెప్పిందాన్ని సాంతంగా వినండి."

అని నాభార్య నిర్మలాదేవి హెచ్చరించినందువల్ల, మేమంత రము మానమును వహించి, సర్పరాజు చెప్పిందాన్ని వింతగా వింటున్నాము.

అని కాలజ్ఞాని తిరిగి చెప్పినమీదట, మానాయనగారు, అలివేణీ కూడా తెల్లబోయి, ఒకరిముఖాల్లోకొకరు వింతగా చూసుకున్నారు. అలివేణి ముఖం ముడుచుకుని ఆతావును వొదిలి వెళ్ళిపోయింది. మా నాయనగా రనంతరం పండితునికి ఉచితసత్కారాలు జరిగించి, సాగ నంపారు. పరిస్థితు లీవిధంగా తారుమారుకావడం అలివేణికి ప్రాణ సంకటంగావుంది. నాపై ముఖం కండలుచించుకుంటే నేనేంచెయ్యను? ఆమహానగర మెక్కడుందో—మంత్రికుమారు డెవరో—నాకే గాకుండా, మానాయనగారికికూడా తెలియదు. తెలుసుకోవాలని, ఆయన యెన్ని ప్రయత్నాలయినా చేశారు. కాని, తెలియలేదు.

సుబుద్ధి అనే ఆ పేరుగల మనిషిగాని, మహానగరమని ఆ పేరుగల పట్నంగాని, భూమండలంలో వుందన్న నమ్మకంకూడా యెవరికీ లేదు. అయినప్పటికీ ఆ రోజులగాయితు అలివేణి, నాపై అపరిమితమైన అసూయను కలిగివుంది.

నా వివాహమును గురించి ఆమె ఒకటిరెండుసార్లు మానాయన గార్ని హెచ్చరించడం నేను విన్నాను.

ఎవరో మంత్రి మొగుడవుతాడని—ఆపిల్లకి పెళ్లి చెయ్యకుండా ఎంతకాలముంచుతారని, ఆమె మానయనగారి నడిగింది. మానాయనగా రందుకు, ఆమె యిష్ట మెలావుంటే అలా చెయ్యవలసిందని చెప్పారు. నన్ను తనతమ్ముడికి చేసుకోవాలనివుంది—కాని, చూసి చూసి పెళ్ళిపేరుతో తమ్ముడికి మృత్యువును తెచ్చిపెట్టడమవుతుం దేమోనని ఆమెకు భయంలేకపోలేదు.

"ఆమహానగర మెక్కడో—అసలు అది వుందో లేదో అని నాకు సందేహం—ఆజ్యోతిష్కుడు ఏదో చెప్పిపోయాడని, మన మదే పట్టుక్కూచోవడం మంచిది కాదు."

అని ఒకనాడు మానయనగారంటే—

"అందుకేంచేస్తా మంటారు?"

అని అలివేణి యడిగింది.

"నాగబలుడికిచ్చి చేదామంటినిగదా!"

'ఒద్దులెండి—వాడెలాగో పదికాలాలు బ్రతికివుండనియ్యండి—తెలిసివుండి, పెళ్ళిపేరుతో చావునెలా చూడగలం? కావాలంటే మరోవరుణ్ణి తెచ్చుకుని, మీ కూతురుకు చేసుకోండి."

అని ఆమె కొసనిశ్చయంతో చెప్పింది. అందును గురించి మా నాయనగారయినా విశేషం మాటలాడలేదు. నెలలు గడిచాయి—సంవత్సరాలుకూడా జరుగుతున్నాయి. అప్పటికే నాకు పదహారుదాటి పదిహేడో జన్మదినం నడుస్తూంది. జ్యోతిష్కుని మాటపై అందరికీ అవిశ్వాసం ఏర్పడింది అయినా, మానవతితల్లి నన్ను తనతమ్ముడికిచ్చి పెళ్ళిచెయ్యకూడదని ఒకసారే నిశ్చయం చేసుకుంది.

అప్పటిక మానాయనగారు, నానా దేశములనుంచీ, రాజ కుమారుల చిత్రపటములను తెప్పించి, నావివాహానికి అవసరమైన ప్రయత్నాలు తీవ్రంగా చెయ్యడం మొదలుపెట్టారు. అదికూడా అలి

వేడికి అసూయ కారణమే అయింది—నన్ను తనతమ్ముడికి చేసుకో గల సాహసం లేదు—నాన్నగారు వేరు ప్రయత్నాలు చేస్తున్నందుకు అసూయ! ఏమి చెయ్యమంటుందో—ఆమె వుద్దేశమేమిటో ఎవరికీ తెలీదు.

ఆనాడు మహార్ణవమి పండుగ. మా మాణిక్యద్వీప ప్రజలందరూ అత్యుత్సాహంతో ఆయుధపూజ జరిగిస్తున్నారు. ఎక్కడ చూసినా ఆనందకోలాహాలాలు—అధికాట్టహాసాలు! మా రాజమందిరంకూడా కన్నులపండువుగా వుంది. పూజానంతరం నేను కొందరు చెలులతో కలసి, రాజభవనానికి కొంతదూరంలోవున్న ఉద్యానవనంలో కత్తి సాములు చేస్తున్నాను. ఖడ్గవిద్యలో ఎవరు ఆరితేరినవారో తెలుసు కోవాలని, నా చెలికత్తెలు, నేను పందాలు వేసుకుని, సాములు చేస్తున్నాము. ఆ సమయంలో నాగబలు డక్కడి కొచ్చాడు. నాగ బలుడు దుష్టుడని, అతనంటే అందరూ భయపడతారు. అతని రాకను గమనించగానే, నా చెలులు చేతుల్లోని కత్తులక్కడ పారేసి, ఎవరి మటుకు వారు పారిపోయారు. నేను మాత్రం పారిపోకుండా, ధైర్యంగా నిలిచాను.

"సూర్యప్రభగారికి అందరికంటే యెక్కువ ధైర్యం."

అని నాగబలు డొకసారి వికటంగా నవ్వాడు. నేనతని కేమీ బదులు చెప్పలేదు.

"కత్తిసాములు చేసే పద్ధతి యిదికాదు—కళ్లకు గంతలు కట్టు కుని, కత్తితిప్పాలి—అప్పుడూ ప్రతాపం!" అన్నాడు.

"ఓ! నేను తిప్పుతాను—చూస్తావా?" అని నేను పంకితనంగా జవాబు చెప్పాను.

చెయ్యవలసిందే—కళ్లనిండా కాటుక—కాళ్ళనిండా బురద—" అని అత నసడంతోనే, నాకు మరికొంచం పౌరష మెక్కింది—

"నీలాగ, చేతకాదనుకున్నావా?"

అంటూ అతనిదగ్గరున్న ఓ గుడ్డనులాగి, కళ్లకు గట్టిగా కట్టు కుని కత్తిపట్టాను. కళ్లకెక్కడయినా సందులున్నాయేమోనని, నాగ బలుడు నాకళ్లకా గుడ్డను మరింత గట్టిగా బిగించాడు. ఆవిద్యలో నే నంతకుముందే ఆరితేరినదాన్ని కావడంవల్ల, అతని ముఖానికి సిగ్గు కలిగేటట్లు—అతిచాకచక్యంగా సాముతిప్పాను.

"బేష్! ఆడదానివైనా అద్భుతంగా సాముచేశావు!"

అని నాగబలుడు నన్నభినందించాడు, సాము చాలాసేపు చెయ్యడంవల్ల, నాకలసటకలిగింది—అందువల్ల కత్తినక్కడపడేసి, కింద చతికిలబడ్డాను. అదను కనిపెట్టి ఆదుర్మార్గుడు నాదగ్గరకొచ్చి, ముందుగా నాచేతులను బలమైన తాళ్లతో బంధించాడు. ఆవెంటనే ఎవరో పదిమంది దృఢకాయులొచ్చి, నన్ను సాయంపట్టుకుపోయారు. నేను గిజగిజ తన్నుకున్నాను—పెనుగులాడాను—కాని ఆ దృఢకాయుల చేతుల్లో నలిగిపోయానేగాని, కట్లు తెంచుకోలేకపోయాను, ఆ తరువాత వాళ్లు నన్నో గుఱ్ఱంమీద పడేసి—ఎక్కడికో తీసుకుపోతున్నట్లు తెలిసింది—కళ్ళకు గంతవుంది—చేతులకు కట్లువున్నాయి. అటువంటి నిస్సహాయస్థితిలోవుంచినన్నా దుర్మార్గులుచాలాదూరంతీసుకుపోయారు వాళ్లెవరో—నన్నలా యెందుకు బంధించి తీసుకుపోతున్నారో—తెలుసుకోలేకపోయాను. ఎంతదూరం తీసుకుపోయారో—అంతకంటే తెలీదు.

రెండున్నరరోజులయింది. ఆలోపుగా నన్ను ఒక గుఱ్ఱంమీద నుంచి దించారు—మరోగుఱ్ఱం ఎక్కించారు. తిరిగి యెక్కడికో తీసుకెళ్లారు—ఎక్కడో వుంచారు—మళ్ళీ తీసుకెళ్లారు. కాని కళ్లు, చేతులు బంధించబడి వుండడంవల్ల నేను ఏమీ తెలుసుకోలేని పరిస్థితిలో వుండిన్నీ—నన్నలా ఎవరు బాధిస్తున్నారనీ—ఎందుకు బాధిస్తున్నారనీ అడిగాను. కాని నాప్రశ్నల కెవరూ జవాబు చెప్పకపోవడంవల్ల, నాదుస్థితికి నేను ఏడిచేడిచి—భగవంతుణ్ణి స్మరించుకుంటూ—బ్రతికి వుండీ, చచ్చినదానిలాగ పడివున్నాను. అప్పు డెవరోవచ్చి ముందర నాచేతికట్లను విప్పి, ఆతరువాత కళ్లగంతలుకూడా విప్పారు. నేను ఖంగారుతో నాలుగువైపులా కలయజూచాను.

ఒక సముద్ర మధ్యలోని ఓడలో నేనున్నానని అర్థమైంది. ఆ వోడలో యింకా కొందరున్నారు. వారందరూ పెద్దమనుషులయిన వర్తకుల్లా కనుపించారు. వారటువంటివారయితే, నా కిటువంటి దుర్మార్గమెందుకు తలపెడుతున్నారని తిరిగి సందేహం కలిగింది.

"అయ్యా! మీరెవరు? నన్నిలా సముద్రంలో ఎక్కడికి తీసుకు పోతున్నారు? నాగబలు డెక్కడ?"

అని, నాకట్లు విప్పిన మనిషి నడిగాను.

"నాగబలు డెవరో మాకు తెలీదు. ఎవరో కొందరు నిన్ను మాదగ్గిరికి తీసుకొచ్చి—'ఈకన్య నెవరు వివాహమాడితే వారు చచ్చిపోతారు—అందువల్ల కాసికగా విక్రయిస్తున్నాము—' అని చెప్పారు. మాకటువంటి వర్తకముంది గాబట్టి, నిన్ను తెచ్చినవారికి లక్షవరహాలు, నీసౌందర్యానికి తగిన వెలనిచ్చి, నిన్నుకొన్నాము—మా వెలకు పైన మరికొంత లాభమొచ్చిందంటే, నిన్ను మరొకరికి విక్రయిస్తాముగాని, వేరేనికెటువంటి అపకారమున్నూ చెయ్యము."

అని ఆవర్తకుడు చెప్పగా, ఇదంతా ఆ నాగబలుడే అప్పగారు అలివేణి ప్రోత్సాహంవల్ల చేసివుంటాడని నేనూహించుకుని, కలిగిన దుస్థితిని గురించి, విచారించి—కర్తవ్యమును గానక—

"నన్నిలా ఏదేశం తీసుకుపోతారు?"

అని తిరిగి ఆవర్తకు నడిగాను.

"ఒక దేశమేమిటి? వర్తకులు వ్యాపారనిమిత్తం, అనేక నగరాలు—అనేక దేశాలూ తిరుగుతారు. ఎవరికయినా తిరిగి అమ్ముడుపోయావరకూ నువ్వు మాతోనే వుంటావు."

అనిచెప్పి, వర్తకుడు నాదగ్గరనుంచి వెళ్ళిపోయాడు. భగవంతుడు, కీడులోమేలుచేశాడు. అదే ఏదుర్మార్గులయినా అయితే—మానభంగాని కేప్రయత్నంచేస్తురో—మరేహింసలు పెడుదురో—అని మనసులో తల్చుకుని—అప్పటి కటువంటిదేమీ లేకపోవడమే—ఒక మేలనుకుని తృప్తిపడ్డాను. కడుపులో ఆకలిమండిపోతూంది. ఎవరయినా ఏమయినా పెడితే తిందామనిపించింది. ఇంతలో వర్తకుల తాలూకు పరిచారకు డనుకుంటాను, ఒక డొక పళ్లెంలో కొన్ని రొట్టెలు-పళ్లు—తీసుకొచ్చి నాముందర పెట్టి—

"తిను—" అన్నాడు. నేను వాటిలో కొన్నిటినితిని, ఆకలి తీర్చుకున్నాను. తరువాత ఆవోడ, మరికొన్నిరోజులు ప్రయాణం చేసింది. వారికి, చేరవలసిన గమ్యస్థానం ఏదోవుంటుంది. కాని నాకెవరూ చెప్పలేదు. నాకెందుకు? ఏనగరమైనా ఏపట్నమయినా నాకొక్కటేగదా! యెక్కడికో తీసుకెడతారు—యెవరికో అమ్ముతారు, నాభవిష్యత్తు అంతేగదా అనుకున్నాను. కాని, నే నెటువంటి వాళ్ళ చేతుల్లోపడతానో—వాళ్లు నన్ను ఎంత హింసపెడతారో అని భయంకలుగకపోలేదు. ఒళ్లువంచి, చెయ్యిపట్టినంత పనిచేస్తాను,

కానిపనయినందుకు శరీరకష్టం ఎంతయినా చేస్తాను, కాని, మానభంగం చెయ్యడము—ఇష్టంలేనివాళ్ళను పెళ్ళిచేసుకోమని నిర్బంధం చెయ్యడము— మొదలయిన దుర్మార్గులు నన్నవరూ చెయ్యకుండా వుండాలని, మార్గం పొడుగునా వెయ్యిదేవుళ్ళకు మొక్కుకున్నాను.

ఇంతలో సముద్రంలో ఒకపెద్దతుపాను బెలరేగింది, గాలివాన సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తూంది—ఓడ తబ్బిబ్బులవుతూంది. ఓడలో వాళ్ళందరూ చాలాభయపడ్డారు, సోదరి సమానురాలవు నీతో చెప్పకపోవడమేం? నాది పాపపుతలంపే కావచ్చు. అయినా ఆవోడ మునిగిపోతే! బాగుండునని—నేనా జలగర్భంలో చచ్చిపోతే బాగుండునని ఆలోచించాను. నా బ్రతుకుమీద నాకే అంత అసహ్యం కలిగిందన్నమాట! ఓడని, ఓడలోని వర్తకుల్ని రక్షించాలని నావికులు తమ సాయశక్తులూ వినియోగిస్తున్నారు. కాని మనుషులవల్ల ఏంజరుగుతుంది? కార్యం వాళ్ళశక్తికి మించిపోయింది. ఓడ నావికుల అదుపులో వుండకుండా కెరటాలు, గాలి, ఎటువిసురుతే అటుపోవడం మొదలుపెట్టింది? ఇంతలో నావికులలో ముఖ్యమైనవాడు వర్తకులందరూ వున్నదగ్గిరికొచ్చి—

"అయ్యా! మాకు ఎంత శక్తివుందో అంత శక్తీ వినియోగించాము. కాని ప్రయోజనం లేకపోయింది. అదుగో! అటూచూడండి"

అని అందరికీ, సముద్రంలోనే వున్న ఒక యెత్తయిన కొండ వేపు చూపించాడు, అందరితోపాటు నేనుకూడా ఆ పర్వతంవైపు చూశాను, చాలాయెత్తుగావుంది. ఓడకు అట్టే, ఎక్కువ దూరంలో లేదు.

"ఒక్క గాలివాన, అయితే ప్రమాదమును ఎల్లాగయినా దాటేవాళ్ళం, ఇప్పుడా కనుపిస్తున్న కొండవల్లనే మనమంతరం ప్రాణాలమీద ఆశవొదులుకోవాల్సివచ్చింది. అది మామూలు కొండ కాదు, అయస్కాంతపుకొండ. ఇనుమును అది ఆకర్షించుకొంటుంది, అందువల్లనే ఇంత తుపానులోకూడా ఓడనాకొండ తనవయిపు లాగేస్తూంది. ఇంకొద్ది సేపట్లో మనవోడ ఆకొండకుపోయి గుద్దుకుంటుంది. మరలు, సీలలు అన్ని వాటంతట అవి ఊడిపోతాయి. కనక, ఎవరికి తోచినవిధంగా వారు భగవత్ప్రార్థనలు చేసుకోండి" అని హెచ్చరించాడు.

బతుకులో తియ్యదనం లేని, నాకుమాత్రం ఎటువంటి దుఃఖమూ కలుగ లేదు కాని, ఓడలోనివారందరూ, నావికునిమాటలువిని, యేడవడం మొదలుపెట్టారు. అతను చెప్పినట్లుగానే అయింది, అందరూ చూస్తూనేవున్నారు. అంత పెద్దవోడ, ఓ చిన్న గాలిపటంలాగా, ఆ కొండకుపోయి తాసుకుంది. నావికుడు చెప్పినట్లు దానిసీలలు, మరలు అన్నీ వూడుకుపోయివుంటాయి. ఓడ ఏ చెక్క-కా చెక్క-ఏముక్క కాముక్కగా వాడిపోయింది. మరుక్షణంలో అందరితో పాటు, నేను కూడా ఆ సముద్రగర్భంలో మునిగిపోయాను. జీవితానికిక ఏవిచారాలు, ఏ దుఃఖాలూ వుండవుకదా అని, చాలా సంతోషపడ్డాను. సముద్రతరంగాలు నన్నెంతదూరం ఈడ్చుకుపోయాయో—యెక్కడికి కీడ్చుకుపోయాయో చెప్పలేను—అప్పుడు నా శరీరంలో ప్రాణముందో లేదో కూడా తెలీదు. చాలా సేపటికి నేనొక తీరాన ఇసకలో పడివున్నట్లుగా తెలిసింది. దానిబట్టి నేనింకా బ్రతికివున్నాననీ-సముద్రకెరటాలే నన్నెదో తీరానికి విసిరివుంటాయనీ ఊహించుకుని కళ్లువిప్పాను. నిజంగా నావూహాసరియైందే! అది ఒక తీరం—నేనున్నాభాగం ఇసుకప్రదేశం. అక్కడికి కూడా చిన్న సముద్రకెరటాలు విసురుతునేవున్నాయి. ఏదయినా పెద్ద కెరటమొస్తే, నన్ను తిరిగి సముద్రగర్భంలోకి ఈడ్చుకుపోగల అవకాశముంది. అప్పుడటువంటి అదృష్టాన్నే నేను కోరుకున్నాను. కాని ఎంతసేపు కాచుకున్న, అటువంటి దేమీ జరుగ లేదు. అంతవరకూ ప్రళయంలా వొచ్చిన తుపాను, గాలి, ఎక్కడివక్కడ చప్పగా చల్లారిపోయాయి. సముద్రం ఇంకా యింకా లోపలికి వెళ్ళిపోయి-నాకు మరీ దూరమౌతూంది. నేనింకా బ్రతికివుండడం పరమేశ్వరుని ఉద్దేశం కాబోలునని, మెల్లిగా లేచి కూర్చున్నాను. గుడ్డలు, కురులు, పిండుకున్నాను. అప్పుడప్పుడే ఉదయిస్తున్న సూర్యభగవానునికి మొక్కుకుని, ఆయెండలో చలితీర్చుకుంటూ కూర్చున్నాను. యెటుచూచినా విశాలమైన బయలు-ఒక్క మానిషికాని, ఒక్క పిట్ట, చెట్టు ఏమీ కనుపించడంలేదు, నేనేం చెయ్యాలి? యెక్కడికిపోవాలి? అంతా అగమ్యగోచరం!

"కన్నతల్లేమో కాలగర్భంలో కలిసిపోయింది. ఉన్నతండ్రేమో రెండో భార్య వ్యామోహంలోపడి, ఆమెచేతి కీలుబొమ్మ అయినాడు. ఆసవతితల్లి కెందుకో నాపై అకారణవైరం! అయ్యో!

భగవంతుడా! నాలాంటి అభాగ్యజీవుల్ని ఎందుకు పుట్టిస్తావు? పుట్టించినా, మంచి అవకాశం దొరికినప్పుడు గిట్టించకూడదా! మహారాజుకు కుమార్తెనై పుట్టికూడా, కానిబ్రతుకు గడుపుతూ, ఒకరికి ఊడిగం చెయ్యాలిగాబోలునని, కుమిలి కుమిలి యేడ్చాను, కాని అటువంటి అవసరం లేకుండా తప్పిపోయింది. అందుకు సంతోషపడాలనా? లేక అంతకంటే హీనదశ మరొకటేదయినా నాకోసం కనిపెట్టుకుందని భయపడి ఏడవాలనా? తద్రక్షీ! భగవంతుడా! నేనేమీ చెయ్యలేను—నాకేమీ చేతగాదు. నన్నేమిచేసినా ఆభారమంతా నీదే!"

అని, నేనా భగవంతుణ్ణి తల్చుకుంటూ ఆతీరాన చాలాసేపు అలాగేకూర్చున్నాను. యెండలు కరకర నశిన త్రిదాపుల కొస్తున్నాయి. అప్పుడు దూరాన, యెవరో వ్యక్తి వడివడిగా నడుచుకుని, నాదగ్గరకే వస్తున్నట్లు కనుపించింది. నిర్మానుష్యమైన యెడారిలో యెవరబ్బా, ఆవ్యక్తి అని ఆవేపుకే తేరిపారిచూస్తూ కూర్చున్నాను. క్రమంగా ఆమనిషి నాకు దగ్గరవుతున్నాడు. తీరా, దగ్గిరకొచ్చాక చూస్తే అతను మనిషిలా లేడు. భగవంతుడే నామొరలాలకించి, నానిస్సహాయస్థితిని గమనించి, నన్నుద్ధరించడానికే వస్తున్నాడనుకొన్నాను, చేతిలో ఆ త్రిశూలము—శంఖము, శిరమున జటాజూటము—పెరిగిన బవిరిగెడ్డము—ఈశ్వరుడే నాకు ప్రత్యక్షమైనాడనుకొని, పొంగిపొర్లివచ్చే సంతోషంతో ఆ జటాధారికి సాగిలమొక్కి—

"పరమేశ్వరా! నువ్వు యెంత దయామయుడివి-కనకనే నన్నీ నిస్సహాయస్థితిలో కాపాడడానికి వచ్చావు, నాకాజ్ఞలనియ్యి—నన్ను పాలించు." అని ప్రార్థించగా, ఆ పరమేశ్వరరూపుడు, చిద్విలాసం, ముఖాన తాండవించ—

"అవును—నీకు ఆజ్ఞలు ఇయ్యడానికీ—నిన్ను పాలించడానికీ వచ్చాను-నాతోవస్తావా? నేను చెప్పినట్లు వింటావా?" అనిఅడిగాడు.

"మహాదేవా! నీకంటే నాకెవరు దిక్కున్నారు? నన్ను పాలముంచినా, నీటముంచినా నువ్వేగదా!" అని నేనన్నమీదట, అతడు తనచేతిలోని త్రిశూలమును నాకు తాకించాడు. అప్పటికి నేను నాలోలేను-యెక్కడున్నానో చెప్పలేను—ఉన్నానన్న తెలివికూడా లేదు. ఎంతసేపటికో చెప్పలేను—కళ్ళమూతలు విడివడ్డాయి—రాజకుమారీ! ఇంత

వరకూ నువ్వనుభవించిన చర లేదూ? ఈ మఱ్ఱిచెట్టు గుహాలోని మందిరం! నేను అక్కడ పడివున్నాను, యెదురుగా మహాత్ముడు! ఇదుగో! ఈ బైరాగి నిలుచుని—

"కోమలాంగీ! నీ అందమును ఆదిశేషుడయినా వర్ణించలేడు. నాముద్దుల గుమ్మా! బంగారు బొమ్మా! నావైపు రమ్మా!"

అంటూ, నీకూ తెలిసిందే! తనవూహాలు పైత్యధోరణిని ప్రారంభించాడు. నాకు అరికాలు మంట తలకెక్కింది.

"ఓరి దౌర్భాగ్యుడా! ఇదిరా నీ చరిత్ర? నీవెవ్వరో ఈశ్వరావతారుడవనీ—నన్ను కాపాడ అవతరించావనీ—భ్రమపడ్డాను. నీ పిచ్చి వేషాలు నాదగ్గర సాగవు—ఒంటిమీద తెలివుంచుకుని మాట్లాడు! ఇందుకా నన్నిక్కడికి తీసుకొచ్చావు?"

అని నేను గర్జిస్తుంటే, వాడు చలించక

"సుందరీ! నువ్వు తిడుతున్నా కూడా నాకానందంగానే వుంది—ఇన్ని కాదు—మరోయిన్ని తిట్టు—యెన్ని తిట్టినా సరే—నాతో కూడి, నన్ను పరవశుణ్ణి చెయ్యి—నా కోరిక తీర్చి నన్ను తరింపజెయ్యి—నాకు కావలసిందే—"

అని వాడు తన ధోరణిని మానకుండా నామీది మీదికి రావడం మొదలుపెట్టాడు. ముట్టుకున్నాడో—దవడ ఊడగొట్టడానికి చెయ్యి సవరించుకుని తయారుగా వున్నాను.

"ఇక జాగు చేస్తే—సహించలేను—ఎవరయినా వచ్చి నిన్ను రక్షిస్తారని భ్రమపడుతున్నావేమో—అదంతా సర్వకల్ల—ఈవృక్ష గుహాంతర్భాగంలోకి త్రినేత్రుడైనా రాలేడు—ఒకవేళ వచ్చినా, నా చేతిలో యీ త్రిశూలమున్నంతవరకు బ్రహ్మదేవుడయినా నన్ను జయించలేడు. ఇక భ్రమలన్నీ వొదిలి—నన్ను కౌగిలిచేర్చు—రతిక్రీడల దేలించి, స్వర్గరుచులు చవి చూపించు—"

అంటూ నాకు మరీ దగ్గరగావచ్చి ఒళ్లు తెలియని మైకంలో నన్ను తాకబోయినాడు. నేను పట్టలేని ఉద్రేకంలో పళ్లుకొరుకుతూ, బలంకొద్దీ చెయ్యి విసిరాను. నావిసురు దెబ్బకి వాడితల గిర్రున తిరిగి పోయింది. నవరికంటను తగిలిన దెబ్బేమో—ప్రాణం జిల్లార్చుకు పోయి చచ్చాడే అనుకున్నా. చేతుల్తో దవడపట్టుకుని నేలకూలిన వాడు—"అమ్మయ్యో" అంటూ మళ్ళీ లేచి—

"నీకింతటి సాహసముందన్నమాట! సరే—నీకు తగిన ప్రాయశ్చిత్తంచేసి, నిన్నుపయోగించుకునే విధానం నాకు తెలియకపోలేదు."

అంటూ, కళ్లంట నిప్పులు రాలుస్తూ తనచేతిలోవున్న త్రిశూలాన్ని నాకు తాకించాడు. నేను వెంటనే, ఇదుగో యిప్పుడు మీ అందరికళ్లకూ కనుపిస్తున్న ఈ సర్పరూపంలోకి మారిపోయాను.

"అణిగిందా నీ పొగరు? ఈరోజు గాయితే, నువ్వీ సర్పరూపంతో, నాగుమ్మానికి కావలి కాస్తూ పడుంటావు." అన్నాడు. ఆవెంటనే నేను చరచర పాకిపోయొచ్చి, బైరాగి నివాసానికి వాకిలి అయిన ఈ చెట్టుతొర్రలో ఆరోజు గాయితే, ఈరోజువరకు పడుంటున్నాను. ఈదినం పుణ్యాత్ములైన మీరాకవల్ల నాకు విముక్తి కలుగనైవుంది."

అని నాగరూపంలోవున్న కన్య చెప్పడమును ముగించగానే నిర్మలాదేవి, బైరాగి చెప్పిన విధంగా—

"ఓ బసవరాజా! బైరాగి బ్రతికినా, చచ్చినవాడితోనే జత—నువ్విక నీయథారూపమును పొంది—యథేచ్ఛగాపో—"

అనడమే తడవుగా, ఆ సర్పరూపంలోంచి మాకళ్లకు మిఱ్ఱుమిట్లు కలిగించేటట్లు ఒక నవమోహనరూపం, సుమారిరవైయ్యేళ్ల ప్రాయం గలిగిన రాచకన్యగా వెలువడి, మా అందరకు నమస్కరించి నిలుచుంది. బైరాగికూడా అంతవరకు అవమానంవల్ల తలదించుకుని అక్కడే నిలుచునివున్నాడు. చిలుకల రూపాల్లోంచి వెలువడిన నా సైనికులు, నాఅత్తవారి బలాలూ అందరూ సుమారు రెండువేలకు పైగా వున్నారు. అందరూ నాగరూపంలోవుండి రాచకన్య చెప్పినదంతా విన్నారు. నామాటగనక అడ్డులేకపోతే, ఆబైరాగి నీపాటికి ఖండఖండలుగా దునుమాడి కాకులకు విసిరేవారు. నేను వాడికి ప్రాణదానం చేస్తానని మాట యిచ్చివుండడంచేత, సైనికబలాలు అందుకు కట్టుబడ్డాయి. కాని వారు బైరాగిపై కసిదీరక—వాడిముఖాన అందరు తలోసారి ఉమిసి—

"నీచుడా! ఇకపో—బ్రతికి మాకిళ్ళబడక—"

అని తరిమికొట్టారు. వాడు బ్రతకడమే పదివేలనుకొని ఆ తావును వొదిలిపోయాడు. అనంతరం నేను సుబుద్ధివైపు చూడగా, అతడు నా భావమును గ్రహించి, చిరునవ్వుముఖంతో తలను కిందికి దించాడు.

నవయౌవ్వనరూపవిలాసినిగా నిలుచున్న సూర్యప్రభతో—

"సోదరీ! నీ కాబోవు జ్యోతిషవేత్త చెప్పిన సుబుద్ధి—ఇదుగో ఈ సుందరుడే—ఆ చంద్రసేనమహారాజును నేనే! మహానగరపురాణి నిర్మలాదేవి నీదాపులోనేవుంది—నామంత్రి సుబుద్ధి నొకసారి కన్నెత్తి చూనుకో—"

అని నేననేటప్పటికి కాబోచకన్య ఆశ్చర్య విభ్రాంతులతో ఒక్కసారి యిట్టె తలనెత్తి సుబుద్ధిని తిలకించి, తిరిగి అట్టె తలను కిందికి దించుకుని, నిర్మలాదేవి చాటుకు తప్పుకుంది. నిర్మలాదేవి ఆమెను బుజ్జగించి—

"ఇది—సిగ్గుపడవలసిన సమయం కాదమ్మా! ఆజ్యోతిష పండితుని వాక్యాలు అక్షరాలా యథార్థములయ్యాయి—నువ్వు చిరకాలం నుంచి కాసుకొనివున్న నీప్రియుడు సుబుద్ధి నీకు లభ్యమైనాడు—నీకంగీకారమైతే, మనమంతరం ఇప్పుడే మహానగరం పోతాం." అన్నది.

"చేసిన తపస్సులు ఫలించినప్పుడు—నోచిననోములు పండినప్పుడు—ఎవరయినా కాదంటారా?"

అని సూర్యప్రభ మాటలాడుతుంటే, ఆమె నోటంట ముత్యాలు రాలినట్లయింది.

"నీ అభిప్రాయంకూడా చెప్పు మంత్రీ! మాదంపతులం, మీదంపతుల కిప్పుడు మధ్యవర్తులం కావాలి—ఈసుందరిని చేపట్టడం నీకున్నూ అంగీకారమేకదా!" యని నేను స్పష్టంగా యడిగినదానికి సుబుద్ధి నవ్వుతూ—

"దైవజ్ఞు చేసిన నిర్ణయం కాదంటే తప్పౌతుందా? అటు దైవజ్ఞుల నిర్ణయం—ఇటు ప్రభువు ఆజ్ఞ—ఎవరు మీరగలరు." అన్నాడు.

"మంత్రివై నందుకు చతురత మానలేదు."

అని నేన్నాను. అందరం కలిసి నవ్వుకున్నాం. నేను వెంటనే మంత్రి చెయ్యినీ—సూర్యప్రభ చేతినీ కలిపి—

"మనల నందర్నీ హింసలుపెట్టిన ఆకపటబైరాగి యిక లేడు. ఇకనుంచయినా భగవంతుడు మన అందరికీ శాంతి సౌఖ్యాలు ప్రసాదించును గాక!" అన్నాను. వెంటనే సూర్యప్రభ, నిర్మలాదేవులతో సుబుద్ధి—నేనున్నూ సైనికబలాలను నడుపుకుని, కొంతకాలం ప్రయాణాలు జరిగించి, నిజరాజధానియైన మహానగరం చేరుకున్నాం.

మా అమ్మగారు, వగైరా ఆత్మీయులకందరకు, ఆ బైరాగియొక్క తంత్రములన్నీ వివరించి చెప్పినమీదట, వారంతకుముందు నిర్మలాదేవిని గురించి తా మింతకుముందుపడ్డ అపోహకు మిక్కిలి విచారించారు. ఏమయినా కష్టములన్నీ గడిచి అంతరం తిరిగి సురక్షితంగా వున్నందు కపరిమితానందమును పొందారు. ఆతరువాత ఒక శుభ ముహూర్తమును నిర్ణయించి, సుబుద్ధీ సూర్యప్రభల వివాహ కార్యమును అతిఘనంగా జరిగించాము. నాకు మొదలు నేటివరకు, సూర్యప్రభ సుబుద్ధికీ, నిర్మలాదేవి నాకు, అనన్యపత్నులై—మా జీవితాలను సార్థకంచేస్తున్నారని నీకు వేరే చెప్పవలసింది లేదు.

విజయకుమారా! నాటికి నేడు, దుర్మార్గుడైన ఆబైరాగి మాట తిరిగి వినిపించింది. బాలమహర్షి అనే దొంగ పేరుతో వాడు, కుండిన నగరాన చేరి, చింతామణిచే అడిగించే ప్రశ్నలద్వారా, నాఉనికిని, నా చావుబ్రతుకులను తెలుసుకొని—తిరిగి యిక్కడికొచ్చే ప్రయత్నంలో వున్నట్లు అర్థమైంది. వాడడిగించే ప్రశ్నలలో రెండవది నాకు సంబంధించిందని నిశ్చితమై వుంటుంది. వాడినా నాడు క్షమించి వొదలడం అపరాధమైంది! శత్రుశేషముండకూడదు. ఓరీ దొంగ బైరాగీ! ఇక నువ్వెక్కడున్నా తప్పించుకోలేవు! నీతల నాకరవాలానికి ఎరకావలసిందే! విజయకుమారా! ఇక ఆలస్యం చెయ్యకూడదు—నేడే మనం నేడే బయలుదేరిపోయి—కుటీరా. బైరాగిని శిక్షించాలి.

అని చంద్రసేనమహారాజు ఒరనుంచి కరవాలమును తీసి, పట్టలేని ఆవేశంతో ప్రయాణానికి ఉద్యుక్తుడు కాగా—

"మహారాజా! కొద్దికాలం శాంతి వహించవలసివుంది. ఆ బైరాగి—మునలనుంచి దాటి ఎక్కడికీ పోలేడు. నేను వాడి ఐదు ప్రశ్నలలో ఇప్పటికి, సర్పనగర, మహానగరాలకు సంబంధించిన రెండు ప్రశ్నలకు జవాబులు తెలుసుకున్నాను. ఇక శిమ-వాల-యబా-నగరములకు సంబంధించిన మూడు ప్రశ్నలకు జవాబులు తెలుసుకోనవలసివుంది. అప్పటికిగాని నాకార్యకలాపం పూర్తికాదు—వాడు చేసే హింసాకాండకు అంతంలేదు. దయచేసి కొద్దికాలం ఓపికవహించి వున్నట్లయితే, నేను మిగిలిన మూడు ప్రశ్నలకు కూడా బదులు తెలుసుకుని, తిరిగి వచ్చేటప్పుడు, తమ్ము కలుసుకుంటాను. అప్పుడందరము కలిసి, కుండిననగరం పోవచ్చు."

అని విజయకుమారుడు చెప్పిన ప్రకారం చెయ్యడానికి చంద్ర సేనమహారాజు అంగీకరించి—

"రాజకుమారా! మేమున్నా నీసాటివారి మవడంచేత, కొద్ది రోజులు మాకతిథిగావుండి—విశ్రాంతి తీసుకుని, తరువాత, నీప్రయాణ మును గురించి ఆలోచించవలసినదని మాకోరిక!" అన్నాడు.

"చెయ్యవచ్చును. కాని ఆమూడు నగరాలూ, ఎక్కడున్నవో—ఎటుపోవాలో నాకేమీ తెలియదు. మీకుగాని మీనగరంలో వున్నవారికి ఆపట్నాల వివరం తెలుస్తే, చెప్పి, నాప్రయత్నానికి కొంచం సాయం చెయ్యాలి."

అని విజయకుమారు డన్నదానికి—

"ఇంతవరకు నే నానగరాల పేర్లయినా వినివుండలేదు. నువ్వు బయలుదేరే లోపుగా ప్రయత్నించి, నాకు చేతనయిన సాయమును తప్పక చేస్తాను. నువ్వు మన రాజలోకానికీ-రాచవంశాలకు చేస్తున్నా సేవ అమోఘం! దేశకళ్యాణానికి, అహింసా సిద్ధాంతానికీ సర్వశక్తులూ ధారపోస్తున్న నీకుగాక, మరెవ్వరికి మేము సాయం చెయ్యాలి?"

అని, చంద్రసేనమహారాజు, అనంతరం, విజయకుమారుని భార్య నిర్మలాదేవికీ, సుబుద్ధి దంపతులకు, పరిచయంచేసి, వారికికూడా అమితమైన ఆశ్చర్య సంతోషాలు కలిగించాడు. విజయకుమారుని వివరాలు తెలుసుకొన్నవారు అతన్ని అనేక విధాల అభినందించి—తుచ్ఛుడయిన ఆబైరాగిని వెయ్యివిధాల శపించారు.

మహానగరాధిపతి, విజయకుమారుని భోజనాది సదుపాయము లకు, విశ్రాంతికీ, అవసరమయిన ప్రత్యేకపు టేర్పాటులను చేయించి అనంతరం అతని ప్రయాణమును గురించి మంత్రితో ఆలోచించాడు.

ఆ మూడు నగరాల వివరం నాకు తెలియదుగాని, నేను నిర్మలా దేవిని గురించి, సైన్యసమేతంగా, సంచారం జరిపిన రోజుల్లో-శిమనగర మును గురించి ఎక్కడో విన్నజ్ఞాపకముంది, హారావళీపర్వతములను దాటి-మరికొంతదూరం పోయినయెడల ఆనగరం తగులుతుంది."

అని మంత్రి చెప్పినదానికి—

"అప్పుడు మన మారాజకుమారునికి కొంత పరివారమును యశ్వములను యిచ్చి, హారావళీపర్వతములవరకు పోగల యేర్పా టులు చేయవచ్చు గదా!"

అని చంద్రసేను డన్నదానికి—

"ఓ! నిరాక్షేపణగా చేయవచ్చు—మన నగరంనుంచి హారావళీ పర్వతాలవరకు భూమార్గమున్నది. సుమారు ఏభై యోజనములకంటే, యెక్కువకూడా వుండదనుకుంటా."

అని మంత్రి సుబుద్ధివల్ల తెలుసుకొన్న చంద్రసేనుడు, విజయకుమారునకు కొంత సహాయం చేయవచ్చును గదా అని సంతోషించి అతని ప్రయాణానికి అవసరమైన సిబ్బంది వస్త్రాలను ఏర్పాటు చేయించవలసిందని, మంత్రి కాజ్ఞాపించాడు.

## ౨౩

మహానగరపు మంత్రి, సుబుద్ధి సూచించిన ప్రకారం హారావళీ పర్వతమార్గం ఏమంత దుర్గమంగా లేదు. చంద్రసేనమహారాజుచే ఈయబడిన గుఱ్ఱము నధిరోహించి, అతని పరివారజనం తోడురాగా, విజయకుమారుడు కొన్నిదినాలు ప్రయాణాన్ని నడిపి, హారావళీ పర్వతప్రాంతమును క్షేమంగానే చేరుకున్నాడు. అచ్చట వారి గుఱ్ఱమును, పరివారజనమును వొదిలి—తన ప్రయాణమున కొంతమాత్రం సహాయంచేసిన, చంద్రసేనమహారాజుకు తన కృతజ్ఞతను తెలుపవలసిందిగా కోరి—తనతో వచ్చిన వారినందరినీ, వెనుకకు మళ్ళవలసిందని హెచ్చరించి, అందరూ పూర్వాభిముఖులుగా పోయిన అనంతరం, విజయకుమారుడు ఆపర్వతపంక్తులను తిలకిస్తూ క్షణకాలం నిలుచున్నాడు.

అది ఒకపర్వతంగాక, కొన్నిపర్వతాలతో పంక్తిగా యేర్పడి, అవతలి ప్రపంచానికీ యివతలి ప్రపంచానికీ అడ్డుగోడ నిలిచాయి, వాటిని దాటడమెలాగ? దారిగుండా వెళితే శిఖరం అవతల యింకా యే రాజ్యంలో వుంటుంది—అన్న వివరాలతనికేమీ తెలియవు. సుబుద్ధికయినా తెలిసినదంతవరకే గనుక, విజయకుమారునికికూడా ఆపైన తెలియలేదు. కిందకూర్చుని, పైకెగసివున్న పర్వతపంక్తుల వయిపు పారవశ్యంగా చూస్తూ, విజయకుమారుడు తనలో తానాలోచించుకోవడం మొదలుపెట్టాడు—

"ఇప్పటికి కతిప్రయాసవల్ల రెండుప్రశ్నలకు జవాబులు తెలుసుకున్నాను. ఇంకా మూడు ప్రశ్నలున్నాయి. వాటిని తెలుసుకోవడం

సాధ్యమవుతుందా? నేనా చింతామణిని జయించి, ఆమెచే జరిగించ బడుతున్న హింసాకాండను అరికట్టగలనా? నా తల్లిదండ్రులు ఇంత కాలనుంచి నాకై ఎంతగా కుంగిపోయివుంటారో—ఇంతవరకూ తిరిగి పోనందుకు. శోభాదేవి నన్నొక మోసగానికింద, వంచకుడుగాను యెంచుతుందేమో! ఏది ఏమనుకున్నా-ఎన్నికష్టాలు కలిగినా, కార్య మును కొనవరకూ సాధించడంగదా ధీరలక్షణం? కష్టాలకు జంకి— ప్రేమపాశానికి కట్టుబడినవాడు యెవడుమాత్రం ఏపనిని సాధించ గలడు...''

అని విజయకుమారుడు పర్వతపంక్తులవైపు చూస్తూ, యోచించుకుంటున్న సమయంలో, అతని కాశ్చర్యంకలిగేలాగ, ఒక మృతకళేబరం పర్వతాళాపై నుంచి చరచర దొర్లుకుంటూ వచ్చి, సరిగా అతను కూర్చున్న దగ్గరపడింది, విజయకుమారుడు తెల్లబో యాడు, అతనికేమీ అర్థంకాలేదు. మృతకళేబరమును కొంచం పరి శీలించి చూడగా, అది ఒక యుద్ధభటునిదిగా గ్రహించాడు. తిరిగి పైకిచూడగా, మరొకమృతకళేబరం అదేమాదిరిగా దొర్లుకుంటూ వచ్చిపడింది, అది యుద్ధభటునిదే! మరునిమిషంలో తిరిగి మరొకటి— ఆపైనయింకొకటి—దానివెనుక వేరొకటిగా, కనుతెరిచేలోపుగా, సుమారువంద మృతకళేబరాలు, ఒకదానివెంబడి మరొకటిగా కొండ లపైనుంచి దొర్లుకుంటూ వచ్చి విజయకుమారుని సమీపంలో పడ్డాయి. ఇంతలో ఆస్థలమంతా పీనుగులపెంటతో నిండిపోవడం చూస్తే, అతనికళ్లు చెదిరిపోయాయి! ఆతరువాత, మరికొన్ని శిర ములులేని మొండెములు—మొండెములులేని శిరస్సులు, మరికొన్ని దొర్లుకుంటూవచ్చి పడ్డాయి—రక్తపుకాలవ—శవములపోగు! అన్ని కళేబరములూ యుద్ధభటులవే! దానినిబట్టి ఆ కొండప్రాంతంలో ఏదో ఘోరయుద్ధం జరుగుతూవుంటుందనీ-ఆయుద్ధంలో మృతులయిన సైనికుల కళేబరాలే, ఆ ప్రకారం కొండలపైనుంచి దొర్లి కిందపడు తున్నాయనీ ఊహించుకొన్నాడు. అటుపైన కొంతసేపటివరకూ మృతకళేబరాలు కొండపైనుంచి దొర్లడం మానేశాయి—కాని దూరంలో అశ్వారోహుల అలజడి వినిపించింది. అత నాశ్చర్యంతో ఆదెసకుచూచాడు.

వందలుకాదు—కొన్నివేల సైనికబలాలు గుఱ్ఱాలపై నడుస్తు న్నాయి. అవి, క్రమంగా విజయకుమారుడున్న దెసకే వచ్చి—అతన్ని సమీపించాయి. సైనికబలాలను, యుద్ధవీరులను చూడడం ఆరాజ కుమారుడికి కొత్తలేదు. అక్కడ అంతకుముందు పడివున శవముల వెంటకు—అప్పుడు వస్తున్న సైనికబలాలకు సంబంధ ముండివుంటుం దని ఊహించుకోగలిగాడు. ఎటువంటి భయమూలేకుండా వాటికెదు రుగా నిలుచున్నాడు. అతన్నిచూడగానే సైనికదళాలు నిలుపు చెయ్య బడ్డాయి.

"వీడెవరో—శతృపక్షానికి చెందినవాడై వుంటాడు—బంధిం చండి—"

అని వారి నాయకు డాజ్ఞాపించగా, కొందరు వీరులు వెంటనే దిగివచ్చి నన్ను పట్టుకున్నారు.

"అయ్యా! నాది నాపక్షమేగాని, నేనేపక్షానికీ చెందిన వాడనుకాను."

అని విజయకుమారుడు యెన్నివిధాల చెప్పినా వారు నమ్మ కుండా—అతన్ని సైన్యాధిపతివున్న దగ్గరకు తీసుకొనిపోగా, అతడు విజయకుమారుని అడిగాడు,

"నువ్వెవరు? సైనికవేషంతో యిక్కడెందుకున్నావు?"

"నేనొక రాజకుమారుణ్ణి—కాబట్టి యీవేషంలో వున్నాను."

"ఇక్కడున్నవి రెండేరాజ్యాలు—మాకు తెలియని మూడో రాజకుమారుడివి—నువ్వెక్కడనుంచి వచ్చావు? అబద్ధం—నీమాటలు నమ్మదగినవిగాలేవు—మాజాడలు తెలుసుకోడానికే, శతృపక్షంనుంచి వచ్చి, యిక్కడ దాగివుంటావు. వీడిని తక్షణం బంధించండి."

"అయ్యా! మీరీ సైనికదళానికి నాయకులుకాబోలు! ఇంత మాత్రం తెలివిగలవానికి, సైన్యాధిపత్యమిచ్చిన ఆరాజెంత వెర్రి వాడో గదా!"

అని విజయకుమారు డనేటప్పటి కాదళాధికారి, గుఱ్ఱంపై నుంచి కిందికురికి, కోపంగా—

"ఏమంటున్నావు? నీకు నా తెలివిని కొలవగల తాహతుకూడా వుందన్నమాట?"

అంటూనే ఆ దళాధికారి తనకత్తిపైకి చెయ్యిని పోనిచ్చాడు.

"నీకత్తి ఝుళిపింపులకు నేను బెదరనుకానీ—నీ తెలివిని కొలవడానికేమంత తాహాతు అవసరంలేదని చెబుతున్నాను."

"ఎందుచేత?"

"నేను నీజాడలు తెలుసుకోడానికి దాగివున్న శృతిపత్రుం వాడివని బంధించమంటివే!"

"అవును,"

"అయితే—నీ దళాలనుచూచి పారిపోకుండా ఎదురుగావచ్చి యెవడయినా నిలుచుంటాడా? అందుకే నీ తెలివి మహాగొప్పదన్నాను."

"నువ్వేదేశపు రాజకుమారుడివి?"

"అలా సక్రమంగా అడుగుతే, ముందుగానే చెప్పనా? నేను నాగపురాధీశ్వరుడు, ఛత్రపాలుని కుమారుణ్ణి-నా పేరు విజయకుమారుడు."

ఆ మాటలువినగానే, దళాధికారి, విజయకుమారుని రెండు చేతులూ పట్టుకుని—

"క్షమించాలి—అపరాధంచేశాను. నేను ఛత్రపాలమహా రాజుల సైన్యాలలో చాలకాలం యుద్ధభటునిగా పనిచేశాను. నా పేరు, పెదపట్నాయిక్. నేను కత్తిపట్టడం దగ్గరనుంచి—వారి దళంతోవుండే నేర్చుకుని—అనంతరం, అదృష్టవశాత్తూ, ఈ దళానికి అధిపతినయ్యాను, అయితే, ప్రభూ! తమరింతదూరంనించి యింతదూరం యెలావచ్చారు? రావలసిన అగత్యమెలా కలిగింది?"

అని సగౌరంగా అడిగినమీదట—

"నావిషయమంతా తరువాత చెబుతాను-ముందర, ఈదళాలే మహారాజువో—అతని శృతరాజులెవరో—ఈ పర్వతంనుంచి, దొర్లుకుంటూ పడిన సైనిక మృతకళేబరాలేమిటో—నాకు వివరించి చెప్పాలి!" అని విజయకుమారుడడిగాడు.

"ప్రభూ! వ్యవధిలేదు—ప్రయాణం చెయ్యవలసిన దూరం చాలావుంది—మేమతి జరుగుకుగా, మా రాజుగారి సైన్యాలను చేరుకోవాలని ఆజ్ఞలున్నాయి, తమకభ్యంతరం లేకపోతే—నాగుఱ్ఱం మీద నాతోరండి—మార్గంలో మనమన వివరాలు మాటలాడుకోవచ్చు,"

అని దళాధిపతి చెప్పినప్రకారం చెయ్యడానికి విజయకుమారుడంగీకరించినందువల్ల, దళాధిపతి, అతనిని తనగుఱ్ఱంమీద ముందర

కూర్చోబెట్టుకుని, సాగిపోవలసిందిగా, తనదళాని కాజ్ఞాపించాడు. వెంటనే సైనికులు బయలుదేరారు. మార్గంలో దళాధికారి విజయ కుమారుని కిలా చెప్పాడు.

"ప్రభూ! ఈ హారావళీ పర్వతాల కివతలతట్టు కొన్ని యోజనాలలో మా రాజధాని అయిన శుమనగరమున్నది, దానికి త్యాగధన మహారాజు ప్రభువు—పర్వతాలకవతలి వైపున కొన్ని యోజనాలదూరంలో శిమనరమున్నది. దానికి తపోధన మహారాజుపాలకుడు. ఇద్దరూ దాయాదికుటుంబాలకు చెందినవారే."

అని దళాధికారి చెప్పగా, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు—తాను పోదలచిన శిమనగరానికే పోయిచేరుతున్నందుకు, తనలో తానపరిమితానందమును పొందాడు. దళాధికారి తిరిగి చెప్పడం మొదలుపెట్టారు—

"నేను శుమనగరాధిపతి, త్యాగధనమహారాజు దళాలలో, ఈ వాయవ్యదళానికి అధిపతిని, ఇప్పటికే పదిహేనుదినాలనుంచి యిరుపక్షాలకు ఘోరయుద్ధం జరుగుతూంది. నువ్వుచూసిన సైనిక మృతకళేబరాలు—మాకు సంబంధించినవే. శిమనగర సైన్యాలు గెలుపులో వున్నవి—మాసైన్యాలు ఓటమిలో వున్నవి—మాసైన్యాలు రమారమీ, హారావళీపర్వత ప్రాంతాలవరకు వెనక్కుతరుమబడ్డవని, పర్వతాలపైనుంచి దొర్లిపడిన సైనికమృతకళేబరాలనుబట్టి తెలుసుకోవచ్చు. కనుకనే రణరంగాన పోరుతున్న మా రాజు అధికసైన్యాలకై, నిజరాజధానికి వర్తమానము నంపాడు. ముందర మేము బయలుదేరాము—మా వెనుక మరొక అయిదుదళాలు బయలుదేరుతున్నవి. ఈయుద్ధ మింతటితో అంతమయ్యేది కాదు.

"యుద్ధకారణ మేమిటి?"

"పెద్దకారణ మేమీ లేదు. శిమనగరాధిపతియైన, తపోధన మహారాజు దగ్గర, 'పంచకళ్యాణి' అను పేరుగల ఒక ఉత్తమాశ్వ ముంది. దాని నామహారాజు ఎక్కువగా ప్రేమించాడు. అశ్వజాతిలో అంతమేలురకపు గుఱ్ఱాన్ని మన మెక్కడా చూడము. సూర్యరథానికి అమర్చబడిన కాపతు గుఱ్ఱ మాజాతిదే అని పరీక్షకు లనేకమంది నిర్ణయం చేశారు. దాయాదిదగ్గర అంత మేలురకపు గుఱ్ఱమున్నందుకు మా మహారాజు ఆదినుంచీ అసూయపడుతున్న మాట నిజమే!

కాని దానిని తాను పొందాలని, ఎటువంటి దుర్మార్గపుటాలోచనా యెన్నడూ చేసివుండలేదు. ఇలావుండగా, ఒకనొక గుఱ్ఱాల సంతలో, ఆపంచకళ్యాణి గుఱ్ఱమే అమ్మకాని కొచ్చింది. అది, తన దాయాది, తపోధనమహారాజుదని తెలిసివుండిన్నీ, మామహారాజు, రెండు లక్షల వరహాలనిచ్చి, ఆగుఱ్ఱమును క్రయమునకు కొన్నాడు. గుఱ్ఱమా సంత లోకి దానంతట అది దారితప్పి వచ్చిందో—లేక ఎవరయినా అపహ రించుకొచ్చి అమ్మ జూపారో ఎవరికీ తెలియదు.

తపోధనమహారాజు, తాను ప్రాణతుల్యంగా చూసుకొనే పంచ కళ్యాణి యెక్కడవుందో తెలుసుకురావలసిందని, సమర్థులైన గూఢ చారులను, దేశదేశాలకు పంపించాడు. కొంతకాలాని కాగుఱ్ఱం, మా మహారాజు దగ్గరవుందని తపోధనమహారాజు తెలుసుకున్నాడు. తక్షణం రాయబారులను పంపి, తన గుఱ్ఱమును తన కీయవలసిందని, మా మహారాజు నడిగించాడు. తాను తగిన మూల్యమునిచ్చి, సంతలో కొన్న గుఱ్ఱమును ఈయడం అసంభవమని, మహారాజు ఖచ్చితమైన జవాబు పంపాడు. అది విని, తానిచ్చిన మూల్యానికి రెట్టింపు మూల్య మును ఇస్తాననీ—తన పంచకళ్యాణిని తనకు వాపసు పంపవలసిందనీ, తపోధనమహారాజు తిరిగి రాయబారమును పంపాడు. మారాజు అందుకుకూడా అంగీకరించక పోవడంవల్ల, తపోధనమహారాజుచే, యుద్ధం ప్రకటించబడింది—ఇరుపక్షాలూ నాశనమవుతున్నాయి.

ప్రభూ! ఇదీ ఈ యుద్ధానికి సంబంధించిన వివరం—ఇక—మీ రంతదూరంనుంచి యింతదూరం రావలసిన కారణమేమిటి? నే నొక ప్పుడు సేవించిన ఛత్రపాలమహారాజులు సుఖంగావున్నారా!

అని పెదపట్నాయిక్ తాను చెప్పదలచిన దానిని ముగించి, విజయకుమారునికి సంబంధించిన వివరాలను ఆదరంతో అడగ్గా—

"పట్నాయిక్! మానాయనగారైన ఛత్రపాలమహారాజులు సుఖులై వుండి రాజ్యపాలన స్వయంగా నిరవేరుస్తున్నారు. మాకొలు వులో చిరకాలముండి పనిచేసిన నిన్నీదినం కలుసుకో కలిగినందుకు చాలా సంతోషమైంది."

అనిచెప్పి, తదుపరి, తానిల్లు బయలుదేరుటకుగల కారణము—అపూర్వచింతామణిచే జరిపించబడుతున్న హింసకు సంబంధించిన వివరాలు—తానామె అడిగే ఐదు ప్రశ్నలలో రెండింటికి ఏవిధంగా

జవాబులు తెలుసుకున్నదీ—ఏయేరాజులతో తనకు పరిచయం కలిగినదీ— మొదలుగాగల అన్ని విషయాలనూ సక్రమంగా చెప్పి తాని ప్పుడు శివనగరమే పోవబయలు దేరినట్లు, చంద్రసేనమహారాజు పరివారం, తన్నాహారావళీ పర్వత ప్రాంతం చేరినట్లు, అక్కడనుంచి, కొండలుదాటి శివనగరం చేరేవిధానం తెలియక, అక్కడ యోచనలు చేస్తున్న సమయంలో సైనికస్మృతక శిబిరాలు, కొండలపై నుంచి దొర్లుతుండడం కనుపించినట్లు ఇంతలో వారి సైనికదళం వచ్చినట్లు—మొదయిలన అన్ని సంగతులు చెప్పిన తరువాత—

"మిమ్మల్ని కలుసుకున్న కారణంవల్ల, మీతో శివనగరం రాగలుగుతున్నాను, లేకుంటే దారి తెలియక తికమకలు పడివుందును. ఈకొండలు దాటకుండా శివనగరం ఎట్లా చేరతారు?"

అని విజయకుమారు డడిగినమీదట—

"ఇంత ఎత్తయిన కొండలను ఎవరూదాటలేరు, అది అసంభవం! మన మింక రెండామడలదూరం దాటామంటే, అక్కడ ఒక యిరుకయిన కనుమమార్గముంది— ఆకనుమమార్గం దాటామంటే— అక్కడనుంచి అంతా శివనగరమే,"

అని దళాధికారి పట్నాయిక్ చెప్పాడు.

"మీ పుణ్యమా అని, నేను సులువుగా శివనగరం చేరుతున్నాను, కాని ప్రయోజనముండదు. ఆ మహారాజు యుద్ధపు హడావిడిలో వుండంచేత, నేనతన్ని కలుసుకోవడానికిగాని, మాటలాడడానికిగాని, సావకాశముండదు—ఇక చెయ్యవలసిన పనేమిటో తెలియదు."

"యుద్ధంలో మాకు సహాయపడి, మా మహారాజులకు విజయం చేకూర్చకూడదా?"

"ధర్మ మెవరిపక్షంలో వుందో తెలుసుకోకుండా నేను యుద్ధంలో పాల్గొనడం న్యాయంకాదు. అంతేగాక యుద్ధాలు హింసాకాండకు సంబంధించినవి—యుద్ధాలవల్ల ఎందరు స్త్రీలు భర్తలను గోల్పోతారు? ఎందరు పసిపాపలు తండ్రులు లేనివారవుతారు? ఎందరు జననీజనకులు పుత్రినాశమునుపొంది క్షోభిస్తారు. ఎంత ప్రజానష్టం? ఎందరు రాజకుమారులు పీనుగుల పెంటగా మారతారు! దేశాభ్యుదయానికి వినియోగించబడవలసిన అనేక శక్తులు వినాశనాని

కుపయోగపడ్డం ఖండింపదగిన విషయం! క్షోభా సంకులితమైన ఇటువంటి హింసాకాండ ఎక్కడ జరిగినా నేను సహించను.''

''అవసరం కలిగినప్పుడు భయంకరరణరంగాని కురికి శత్రుసైన్యాల శిరస్సులు పుంఖానుపుంఖాలుగా తెగనరికి, మృత్యుదేవతకు అపరావతారుడై తాండవించవలసిన రాజకుమారుడిటువంటి అహింసామార్గము నవలంభిస్తే-రాజ్యరమా విభవాలు దక్కుతావా?''

''ఎందుకు దక్కవు?''

అని విజయకుమార, దళాధిపతు లిద్దరూ మాటలాడుతుండగా, హారావళీకోట కనుములమార్గమొచ్చింది. సైనిక బృందమంతా, తమ గుఱ్ఱముల నామార్గానపోనిచ్చారు. ఒకసారి, రెండశ్వములు మాత్రము పోగలిగినంత వెడల్పును గలిగిన ఆయిరుకుమార్గం ప్రవేశించడానికి, దళమంతా అందు కనువైనట్లు ఇద్దరేసి సైనికు లొకజంటగా యేర్పడి—ఒకజంట తరువాత మరియొకజంటగా లోపల ప్రవేశించారు.

కనుములు దాటినది లగాయితూ అదంతా భయంకర రణరంగమే! ఇరుపక్షాలూ ఒకరికొకరు తీసిపోని పరాక్రమంతో ఘోరంగా పోరాడుతున్నారు. ఎటుచూచినా సైనికు ఝాంకారాలు—కత్తుల ఝుళిపింపులు—కాతుల హుంకారాలు—నిమిషనిమిషానికీ తెగిపడుతున్న మానవశిరస్సులకు అంతులేదు—హద్దులేదు. అంతటా రక్తపుగోల్లు—పీనుగులపెంట! విజయకుమారుడు చూసి భరించలేకపోయాడు.

''దళాధిపతీ! నువ్విప్పుడొక్కపని చెయ్యాలి!''

''ఏమిటిప్రభూ?''

''విరామజండాయెత్తి—యుద్ధము నాపు చేయించాలి!''

''మహారాజుల అనుజ్ఞ లేకుండా అదెలాసాధ్యం?''

''తప్పదు—నేను చెప్పినట్లు చెయ్యి.''

''ఆజ్ఞ తీసుకునే చేస్తాను.''

అని దళాధికారి, పట్నాయిక తన గుఱ్ఱమును హెచ్చరించి, యుద్ధపురంగపు మధ్యలోకురికి, కనురెప్పపాటులో తమ ప్రభువెక్కడున్నదీ గమనించి—వెంటనే దాపుకుపోయి—

"ప్రభూ! నాగపురాధీశ్వర రాజకుమారుడు మనదళాలలో వున్నాడు—అత్యవసర కార్యమట! కూనకాలం, విరామపు చిహ్నమును ప్రకటన చేయించమని కోరుతున్నాడు!"

అని తమ దళాధిపతి చెప్పినమాటలు విని, త్యాగధన మహారాజు అమితమైన ఆశ్చర్యమును పొందెను.

"నాగపురాధీశ్వరుడా! అయితే అతను కోరినట్లు చెయ్యి," అని ఆజ్ఞయిచ్చాడు. వెంటనే విరామపుగుర్తుగా ఎర్రజండా ఎత్తబడింది. ఎక్కడి సైనికు లక్కడ, ఎక్కడవా లక్కడ కత్తులుదించి నిలిచిపోయాయి. కాని, అందుకు కారణమును తెలుసుకోలేక అందరూ విభ్రాంతులవుతుండగా—విజయకుమారుడు అశ్వముపై నిలిచి—

"వీరులారా! రణాధికులారా! ప్రభువులారా! ప్రతాపశాలురయిలారా! దయచేసి కూనకాలం, మీమీ మనస్సులు నామాటలపై నిలపండి!

ఇప్పటికి ఇరుపక్షాలలో యెందరు నాశనమయ్యారో—యెంత రక్త ప్రవాహమో—ఎన్ని వ్రతకకేబరాలో—తల్పలితంగా ఎంత సంక్షోభమో, కొంచెం గమనించండి! మడిసిన వీరులెందరు! చచ్చిన సేనలిక యుద్ధానికి లేవు! వారి వారి ఆలుబిడ్డల ఉసురులకు—తలిదండ్రుల క్షోభకు బాధ్యులెవరు? మీరిచ్చే ధనరాసులు మరణించినవారి ఆత్మలకు శాంతిలేదు! వారి ఆత్మీయుల దుఃఖాగ్నుల జ్వాలలు చల్లారవు. పాలకులారా! మీ పట్టుదలకోసం—మీ విలాసంకోసం—ఇందరి ప్రాణాలు బలిచేస్తారా! ఈ హింసాకాండ మహాపాపమని తెలుసుకోలేరా? ఉత్పత్తి శుభదాయకము, వినాశము సంక్షోభకారణముకదా? ఇంతటి వీరాధివీర మహాశక్తుల్ని ఇలా దుర్వినియోగం చెయ్యక పోతే—వాటిని దేశక్షేమానికి, దేశసౌభాగ్యానికి పురోభివృద్ధికి, సద్వినియోగం చెయ్యరాదా! పీనుగుల పెంటలతో-రక్తపుకాల్వలతో ఈ పవిత్ర భూమాత నిలా అపవిత్రం చెయ్యకపోతే—ఆ తావుల్లో సేద్యం చేయించి—రాజ్యాన్ని సుభిక్షం చెయ్యరాదా?"

అని, విజయకుమారుడు చెబుతున్నదాని నాశ్చర్యంగా ఆలకించిన ఇరు రాజ్యాధిపతులూ, తపోధన, త్యాగధన మహారాజులిద్దరూవచ్చి విజయకుమారుడు నిలిచివున్న అశ్వానికి చెరోవైపునా నిలిచారు. విజయకుమారుడు తిరిగ ఉద్వేగంతో చెబుతున్నాడు.

"యుద్ధములు జరక్కపోతే—హింసచెయ్యకపోతే పనులు సానుకూలపడవనుకోవడం పొరపాటు. హింసా కావడంవల్ల కలిగేఫలితం అదిగొప్పదైనా తాత్కాలికమై తెరవెనుక సంక్షోభంతో పతనానికి హేతువవుతుంది. అహింసామార్గానపొందిన ఫలిత మతికొద్దిదైనా, సుస్థిరమై శుభమంగళ ప్రదమవుతుంది. ఇప్పుడు మీ రీ యుద్ధంలో పోగొట్టుకున్న శక్తుల్ని పునర్నిర్మించుకోడానికి యెంతకాలం పడుతుంది—యెంత శ్రమకలుగుతుంది? కలిగినా, ఒక్కవీరుణ్ణి, ఒక్క మేధావిని సృష్టిచెయ్యడం, యెందరురాజులు తలక్రిందులుగా తపస్సులుచేస్తే జరుగుతుంది?"

"జరగనిమాట నిజమే కాని, మాలోమాకు విభేధాలు, వ్యత్యాసాలు, యెలాగసిస్తాయి? న్యాయమెలా జరుగుతుంది?"

అని, తపోధన, త్యాగధనమహారాజులిద్దరూ ఒకేసారి విజయకుమార్ణడిగారు.

"న్యాయం—యెవరిబుద్ధి వారికి తప్పక చెబుతుంది. దాని పాటించి, పరిపాలించగలవారే మానవుడని పిలిపించుకోడానికి అర్హత కలిగి వుంటారు."

అని విజయకుమారుడు తిరిగిచెప్పాడు. ఇద్దరురాజులూ కొంచం సేపు మౌనమును వహించిన తరువాత.

"మా యుద్ధానికిగల కారణం నీకు తెలుసునా?"

అని తపోధన మహారా జడిగినదానికి, తెలుసునని విజయకుమారుడు బదులుచెప్పాడు.

"పంచకళ్యాణి నాగుఱ్ఱం చిరకాలంనుంచి నాపోషణలో నాకు ప్రాణసమానంగావుంది. నాసమస్త రాజ్యసంపదలూ పోయినా సరే—నేను నాశనమైనాసరే—నాగుఱ్ఱాన్ని నేను పొందవలసివుంది. అదినాది."

అని తపోధనమహారాజనగా—

"నేను దానిని సంతలో రెండులక్షల వరహాలవెలయిచ్చి, కొన్నాను. కనుక అదినాది."

అని త్యాగధన మహారాజన్నాడు.

"గుఱ్ఱం—యిద్దరిలో ఒకరిదై వుంటుందికాని, యిద్దరిదీ అయి వుండదు కదా!" అని విజయకుమారు డడిగాడు.

"అవును, అదినాది,"

అని త్యాగధనుడు—

"వీల్లేదు—అదినాది."

అని తపోధనుడు అంటుంటే తగాదా యెలా పరిష్కార మవుతుంది? వారి తగాదాను పరిష్కారంచేసి, యుద్ధము, తత్ఫలితంగా హింసాకాండ, నిలుపుచెయ్యాలని విజయకుమారుని సంకల్పం.

"నిజంగా గుఱ్ఱ మెవరికి చెందవలసివుందో మీమీ అంతరాత్మలు తెలపడంలేదా?" అని విజయకుమారు డడిగినదానికి—

"నాకు చెందాలని, నా అంతరాత్మ చెబుతూంది."

అని తపోధనుడు—

"నాకు చెందాలని, నా అంతరాత్మ చెబుతూంది."

అని త్యాగధనుడు—ఇద్దరూ ఒకేలాగ అన్నారు.

"అప్పుడు ఒకమధ్యవర్తి చెప్పిన విధంగా నడుచుకోవడం ధర్మం." అని విజయకుమారు చెప్పాడు.

"మాకు మధ్యవర్తు లెవ్వరూ అవసరంలేదు. యుద్ధంతప్ప మాతగాయిదాను మరోమార్గం పరిష్కారం చెయ్యలేదు."

"పాలకులారా! యుద్ధ మెటువంటి అరిష్టదాయక మో—తెలుసుకున్న తరువాతకూడా, మీరు దానినే కోరడం వివేకంకాదు."

అని విజయకుమారుడు—

"వేరు మార్గంలేనప్పు డేంచెయ్యాలి?"

అని త్యాగధన, తపోధనులు—

పట్టు విడవకుండా మాటలాడుతున్న వారి మాటల నాలకించి, విజయకుమారు కొంచ మాలోచించాడు.

"గుఱ్ఱము—'నాది'—అని యిరువ్వురు ఒకేరకంగా చెబుతున్నారు గదా? అప్పుడు నిజంగా తానెవరిసొత్తో మీలాగునే ఆ గుఱ్ఱంకూడా తెలుసుకొనివుంటుంది."

అని విజయకుమారు డడిగిందానికి అవునని యిరువురు రాజులూ అంగీకరించారు.

"కనుక, గుఱ్ఱం తన యజమానిని తానే నిర్ణయించుకుంటుంది. దాని నిర్ణయాన్నంగీకరించడానికి మీలో ఎవరి కభ్యంతరం?"

అని విజయకుమారు తిరిగి ప్రశ్నించగా—

"ఓ! దాని నిర్ణయం ఖాయం—ఆ ప్రకారం చెయ్యడాని కేమీ అభ్యంతరముండదు—"

అని యిరువురు ప్రభువులూ ఏకగ్రీవంగా అంగీకరించినందుకు విజయకుమారుడు సంతోషపడి—

"పంచకళ్యాణిని తెప్పించండి. తన నిజమైన యజమాని యెవరో—దానిచేత నేను చెప్పిస్తాను."

అన్న దాని కిరువురు రాజులేగాకుండా, మిగిలిన వారందరుకూడా అమితమైన ఆశ్చర్యమును పొందారు. పంచకళ్యాణి తన యజమానిని ఎలా నిర్ణయం చేస్తుందో తెలుసుకోడానికి కుతూహలపడుతున్నారు. వెంటనే, కొందరు భటులుపోయి పంచకళ్యాని తీసుకొచ్చారు.

పంచకళ్యాణి ఒకచోట నిలువబడింది. బంగారు వర్ణమును కలిగి—శుభ్రమై వుండిన్నీ ఏనుగంత ఉదాత్తంగా అశ్వరాజమని చెప్ప తగివుంది. అది నిలువబడ్డచోటు కొక వందగజముల దూరంలో ఒక వైపు తపోధనమహారాజును రెండవవైపు అదేదూరంలో త్యాగధన మహారాజును నిలుచుండవలసినదిగా కోరాడు విజయకుమారు. వారా విధంగా నిలుచున్న తరువాత—

"నేనిప్పుడే అశ్వరాజమును ఒక శరణాకోలతో బెదిరిస్తాను—అప్పుడది ఏ మహారాజును చేరబోతే అతడు దాని స్వంతదారని నిర్ణయం. ఈ నిర్ణయం మీ కంగీకారమవునో కాదో—యిప్పుడే చెప్పండి."

అని విజయకుమారు హెచ్చరించగా, ఆ యేర్పాటు ధర్మబద్ధముగా వున్నదనీ—ఆనిర్ణయానికి తాము బద్ధులవుతామనీ—రాజు లిద్దరూ అంగీకరించారు. సైనికులు—సైన్యాధిపతులూ, అందరున్నూ ఆ యేర్పాటు బహుచక్కగావున్నదని విజయకుమారుని అభినందించారు. వెంటనే విజయకుమారు, ఒక చిన్న శరణాకోలను తీసుకుని, పంచకళ్యాణిని ఇట్టే బెదిరించాడు. తోడనే అది ఒక్కదాడులో పోయి తనకు నూరుగజముల దూరంలోవున్న తపోధనమహారాజు దగ్గర నిలుచుంది. ధర్మబద్ధమైన ఏర్పాటుకు కట్టుబడిన త్యాగధనమహారాజు మారుపలుకకుండా, అశ్వమును తపోధనమహారాజుకు వశంచేసి, నిజ సైన్యాలతో మరలిపో సంసిద్ధుడైవుండగా, తపోధనమహారాజు, అతి

నికి చెల్లించిన మూల్యమును ఈయబోగా, త్యాగధనమహారాజు నిరాకరించి—

"అది మీ అశ్వమని తెలిసివుండీస్నీ దానిని క్రయమునకు కొనడం నాది పొరపాటు! అందువల్ల నేను దానికై చెల్లించిన మూల్యము దండుగపడవలసిందేగాని, తిరిగి మీదగ్గరనుంచి తీసుకోను."

యుద్ధమును విరమించుకుని సైనికబలాలను మరలించుకుని వెళ్లిపోయాడు. అంతటితో యుద్ధము నాపుచేయించి, రక్తపాతంతో కూడిన మహాసంక్షోభము పరిహరించి, ఆయుద్ధంతో సర్వనాశనం కావలసిన ఉభయరాజ్యాలనూ రక్షించిన విజయకుమారుడు మహామేధావి అని, తపోధనమహారాజతన్ని అనేకవిధాల కొనియాడి, తన మందిరానికి దయచెయ్యవలసిందని ప్రార్థించాడు. విజయకుమారుడు అందు కంగీకరించి, తపోధనమహారాజుతో అతని భవనానికి వెళ్లాడు. తపోధనమహారాజతనికి ఎంతో ఘనంగా మర్యాదలు చేసి, ఉచితాసనంపై కూర్చుండజేసిన తరువాత—

"రాజకుమారా! నీవంటి బుద్ధిశాలినికన్న ఆ పుణ్యభూమి యేది? నీవంటి అహింసావ్రతుని ప్రభువుగాగల ఆ భాగ్యశాలులైన ప్రజలెవ్వరు? నువ్వు మా భూమిని పునీతం చెయ్యవలసిన అవసరమేమి కలిగింది? నీవివరాలను తెలుసుకోగల అవకాశం నాకిప్పుడు కదా కలిగింది—? దయచేసి చెప్పు—"

అని, వినయవినమ్రుడై అడిగిన తపోధనమహారాజుతో—

"ప్రభూ! నేను నాగపుర యువరాజును—మా తండ్రి ఛత్రపాలుడు—నా పేరు విజయకుమారుడు."

అని చెప్పి, విజయకుమారుడు తరువాత. కుండినగరాధీశ్వరుడైన కీర్తికాముని విషయము. అతని కుమార్తె అపూర్వచింతామణి ప్రశ్నల విషయము. ఆమెకు గురువైన శాంతమహర్షి నిశేషమాదిగా సర్వవిషయములు వివరించి, తానప్పటికి రెండుప్రశ్నలకు జవాబులు తెలుసుకొన్నట్లు, మూడవ ప్రశ్నకు జవాబా తీమనగరమున లభించుట తెలిసి, అందుకై అక్కడికి వచ్చినట్లు చెప్పి, ఆమూడవ ప్రశ్న నీ విధంగా వివరించాడు—

"తపోధనమహారాజు ద్వితీయ భార్య అయిన రూపసుందరి గతి యేమయినది? ఆతపోధనమహారాజింకా బ్రతికివున్నాడా?

ఆప్రశ్నను వినిన తపోధనమహారాజు మహోగ్రుడై—

"ఓరి కపటబైరాగీ! రూపసుందరి సమాచార మింకా నీకు కావలసివచ్చిందా? ఆతుచ్ఛురాలు నీరాకకోసమే ఎదురుచూస్తూంది-సత్వరంగా బయలుదేరికా—ఈసారి తప్పక నాకరవాలం, నీకంఠ రక్తాన్ని చవిచూస్తుంది."

అని ఒరనుంచి కత్తినిదూసి, ఘూంకారాలు చేస్తుండగా, అంతకుముం దిరువురహారాజులవద్ద, అటువంటి అనుభవమే జరిగినందు వల్ల, విజయకుమారు డాశ్చర్యపడక—

"ప్రభూ! ఆబైరాగిప్పుడు మీయెదుట లేడు—వృథా ఉద్రేకపడి ప్రయోజనమేమిటి? ఆ బైరాగి మీకు చేసిన అపకృతి యేమిటో చెప్పండి."

అని శాంతిపరచినమీదట, తపోధనమహారాజు, తిరిగి కత్తి నొరలో వుంచుకుని, కొంత స్థిమితపడి—

"వాడు నాకు చేసిన అపకృతి ఇంతింత అని చెప్పడానికి కాదు అదిచాలక. చావు తప్పించుకుని, నానుంచిపరారియై—ఇప్పుడా కుండిన నగర రాజకుమార్తె, చింతామణి దగ్గరచేరి, ఆమె విశ్వాసానికి పాత్రుడై—ఈప్రశ్నల ద్వారా రూపసుందరి క్షేమమును—నావునికినీ తెలుసుకొనగోరుతున్నాడు. నేను మృతుడనైనయెడల, తిరిగి నా రాజ్యమున ప్రవేశించి, యథేచ్ఛగా, తన నుండగాలు సాగించవచ్చు నని వాడియూహ. రూపసుందరి వృత్తాంతమును—బాలమహర్షి పేరుతో వున్న ఆదొంగ బైరాగి దుశ్చరిత్రను, నీకు విపులంగా చెబు తాను విను—"

అని, ఉద్రేకమును కొంత ఉపశమింప జేసుకుని, తపోధనమహా రాజు తిరిగి యీవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు.

## —౨౪

"రాజకుమారా! ఇది ఒకరికి చెప్పుకోదగిన విషయంగాదు— ఇతరులు వినదగిన సమాచారమున్నూ కాదు. నాకుటుంబానికీ— నాకూ అవమానమును కలిగించిన కథ—అయినప్పటికీ నువ్వు నా కాత్మీయునివంటి వాడవని యెంచి చెబుతున్నాను. నువ్వు సాధించ తలచిన మహాత్కార కార్యానికీగాథ ముఖ్యాంగము కనక చెప్పకతప్పదు

కాని—నాగుండె తరుక్కుపోయేటంతటి విషాదం—కడుపు తరుక్కుపోయేటంతటి దుఃఖం-అబ్బ! తలుచుకుంటే కడుపు చెరువై పోతుంది-"

అని చెబుతుంటే. ఆమహారాజు కంఠం శోకంతో పూడుకుని పోయింది-కళ్లు చెమ్మగిల్లాయి. అప్రయత్నంగా ఒకటి రెండశ్రుబిందువులుకూడా రాలడమును విజయకుమారుడు గమనించాడు—

"ప్రభూ! నావల్ల తమ కేదో బాధ కలిగినట్లుంది-క్షమించండి-"

అని విజయకుమారుడనగా—

"నీవల్ల కాదు—నా బాధకు కారకులు, నాకడుపులో ఆరని చిచ్చుపెట్టిన మహాపాపులు వేరొకరున్నారు. నాతో రా—వాళ్ళనొక సారి కసితీరా తిట్టివస్తేగాని, నాకు దుఃఖోపశమనం కాదు. ఆ మహాపాపిని నువ్వుకూడా చూడవలసిన అవసరముంది."

అని తపోధనమహారాజు, కూర్చున్న చోటులోనుంచి లేచాడు. దుఃఖభారంవల్ల మాటలాడలేక, తనతో రావలసిందని విజయకుమారునికి సౌజ్ఞ చేశాడు. విజయకుమారుడు బదులు చెప్పకుండా మహారాజు ననుసరించాడు. తపోధనుడు, విజయకుమారుని, రాజమందిరం దాటించి, చుట్టూ ఎత్తయిన ప్రహారీగల ఒక విశాలమైన ఆవరణలోకి తీసుకెళ్లాడు. ఆవరణ ద్వారందగ్గర విచ్చుకత్తులు ధరించిన కొందరు కావలివారున్నారు. వారు మహారాజుకు సవినయంగా నమస్కరించి. గేటుతాళముబుతీసి, ఆయిద్దర్నీ లోపలికి పోనిచ్చారు. ఆవరణలో సుమారొక ఫర్లాంగు నడిచిన తరువాత బలమైన ఇనపద్వారముతో కట్టబడిన ఒక గుప్తమైన నాలుకట్లుడంలోకి మహారాజు విజయకుమారుని తీసుకెళ్లాడు. అక్కడ ప్రతిఒక్కరూ సాయుధపాణులై వుండడంవల్ల, వారు ధరించిన ప్రత్యేకదుస్తులవల్ల, అది చెరసాల అయివుంటుందని విజయకుమారుడు సులువుగా గ్రహించగలగాడు. కాని తానక్కడికి కెందుకు తీసుకొనిరాబడ్డాడో మాత్రమూహించుకోలేకపోయాడు. తినబోతూ రుచడగడమెందుకని, మౌనంగా అతని ననుసరించాడు. మహారాజు విజయకుమారుని కొన్ని అరలు దాటించి ఒక అరదగ్గరకు తీసుకెళ్లి నిలుచున్నాడు. ఆయర ఇనుపద్వారాని కిటిద్దరు—అటిద్దరు సాయుధపాణులయిన పహరావారున్నారు. వారున్నూ మహారాజుకు నమస్కరించి ఆజ్ఞలకై వేచి వున్నారు. మహారాజు వారికేమో సౌంజ్ఞ చెయ్యగా—వారా ద్వారా

నికి కట్టబడిన నల్లని తెరను ప్రక్కకు తొలిగించారు. బలమైన తాళ్లలతో బిగించబడిన ఆయినుపస్తూంచల గదిలో సుమారు నల్భై య్యేళ్ల వయస్సుగల ఒక స్త్రీ రూపమును మహారాజు విజయకుమారునకు చూపించాడు. శిథిలమై, మలినంగావున్న దుస్తులను ధరించి, తైల సంపర్కంలేక చిరాకుపడిన జుట్టుతో పరమ అసహ్యంగావున్న ఆస్త్రీ ముందు ఒక మట్టి మూకుడులో కొంచం గంజిమాత్రముంది. మహారాజును, నన్ను, చూడగానే, ఆ స్త్రీ లేచి నిలుచుని, తలను వాల్చుకుంది.

"రాజకుమారా! ఇదే చూడు! భయంకర భూతం. ఘోర రాక్షసి—మహిళాలోకానికి మచ్చ తెచ్చి, నాకడుపున చిచ్చుపెట్టిన నారీపిశాచి—రూపసుందరి—అవతారం, చూశావుగదా! ఇక పోదాం—పద."

అని మహారాజు ఆస్త్రీ ముఖాన ఒకసారి ఉమిసి, తిరుగుముఖం పట్టగా, విజయకుమారునున్నూ అతని ననుసరించాడు. క్రమంగా ద్వారాలన్నీ దాటి, యథాప్రకారం, మునుపటి రాజమందిరాని కొచ్చి చేరారు. ఇరువురూ కూర్చున్న అనంతరం—

"మహారాజా! కారాగృహంలో ఆవిధంగా బంధించబడివున్న ఆస్త్రీ యెవరు? రూపసుందరి ఆమే నంటిరిగదా! ఆమెకును మీకును గల సంబంధమేమిటి? ఆస్త్రీ చేసిన ఘోరాపరాధ మెటువంటిది?"

అని విజయకుమారు డడగ్గా—

"రాజకుమారా! ఆ వివరాలనే ఇప్పు డిక నీకు చెప్పదలుచుకున్నాను. సావధానంగా విన్నట్లయితే—నీమూడవ ప్రశ్నకు జవాబును సులువుగా గ్రహించగలవు."

అని, ఆమహారాజు అంతవరకూవున్న తన దుస్తులు మార్చుకొచ్చి కూర్చుని, తాను చెప్పదలచిన దానిని ఈవిధంగా చెప్పడాని కుపక్రమించాడు.

సంసారజీవితంలో—స్వర్గమును కాని, నరకమునుగాని కల్పించ గలిగినదీ—ఆకుటుంబానికి కీర్తిగాని, అపకీర్తిగాని, తేగలిగినదీ—అభివృద్ధికి, నాశనానికీ కారకురాలయిందీ—ఇల్లాలు కదా! అమృతభాండంలో హాలాహలము—యమయాతనలలో—ఇంద్రభోగాలు, చేదులో

పాపి—తీపిలో చేదు—ఆశక్తిలో విరక్తి—విరక్తిలో ఆశక్తి—సృష్టి చెయ్యగల మహాశక్తి ఇల్లాలు కదా!

ఏనాడో చేసిన పూజలకు ఫలితంగా నాకు అంజలీదేవి భార్యగా లభించింది. రూపసంపదలో, గుణాధిక్యతలో, ఆమెను చెప్పి, మరి యొకరిని చెప్పవలసిందే! పతిసేవ పరమాత్ముని సేవ అనీ—స్త్రీకి, వ్రతాలు, తపస్సులు సమస్తము, ఒక్క భర్తృసేవవల్ల లభించగల వన్న ఆత్మవిశ్వాసం ఆమెకు నిండుగావుంది. అటువంటి యిల్లాలును పొందిన నాస్వర్గసౌఖ్యాలుగాక, తక్కువేముంటాయి? నాకు తల్లిగా, మంత్రిగా, దాసిగా, రంభగా చరిస్తూ నేనే లోకమని సహచర్యం సాగిస్తున్నది. రమారమి ఒకదశకుపైగా మేమిద్దరమూ, నరలోకంలో స్వర్గనిర్మాణం చేసుకుని, అంతకుమించిన ఆనందమిక, ఏలోకం లోనూ, ఏజీవీ అనుభవించలేడన్న నిశ్చయాని కొచ్చేవరకు, దాంపత్య సౌఖ్యాల ననుభవించామంటే అతిశయోక్తి కాదు.

అయితే—అంతకాలం గడిచిన తరువాత, ఒక్కటే లోపం కనుపించింది. అదేమిటంటే—సంతానం కలుగకపోవడం! అది లోపా లలో చిన్నది కాదు. వంశము నుద్ధరించడానికీ—నా అనంతరం నా సింహాసనము నాక్రమించి ధరాపాలన చెయ్యడానికీ—సంతానం లేక పోవడం పెద్దలోపమే. సంసారజీవితంలో పదిసంవత్సరాలు గడిచి పోయిన తరువాత అప్పుడిక సంతానయోగం కలుగుతుందంటే—ఆశయేముంటుంది. ఇరవై, పాతికేళ్ళు దాటిన తరువాతకూడా సంతాన వతులయినవారు లేకపోలేదు. ఆవిశ్వాసమైనా వుండాలికదా! అందు కని, సమర్థులయిన అనేకమంది భిషగ్వరులను సలహా చేశాను. జ్యోతిష వేత్తలతో ఆలోచించాను. అందరూ ఒకేమాట! సంతానయోగం లేదని!

ఆ నిశ్చయమైందగ్గరనుంచీ, ఇద్దరిలో ఒక అసంతృప్తి ఒక ఆవేదన-బయలుదేరాయి. జీవితంలో మునుపటిశాంతిసౌఖ్యాలు సన్న గిల్లాయి. నేను మాత్రం కొంతకాలానికి గుండెరాయిచేసుకున్నాను. భగవంతుడీయని దానిని గురించి ఎంతగా విచారించి ప్రయోజన మేముందనీ—ప్రపంచంలో బిడ్డలులేని వారనేకమందుండగా, వారి తోనే మనమూ సమమనీ—బిడ్డలు లేకపోయినా, మన సత్కర్మలవల్ల మనం ఉత్తమగతులు పొందవచ్చుననీ—నేను తృప్తిపడడమేగాకుండా,

నా భార్య అంజలీదేవికికూడా నచ్చచెప్పి, ఆమెకుకూడా మనస్సుకు శాంతి కలిగించాలని ప్రయత్నం చేసేవాడిని—ఒక్కొక్కప్పు డామె, నేను చెప్పినదంతా విని, నిజమేనని తృప్తిపడేది. ఒక్కొక్కప్పుడు మాత్రం—

బిడ్డలులేని జీవితాలు వ్యర్థమనీ—బ్రతికిన బ్రతుకు సంతానం వల్లనే సార్థకమయ్యేది అనీ—ఏమేమో అని, తాను అశాంతిగా వుండేది—నాకశాంతిని తెచ్చిపెట్టేది.

అయితే, అంతకని చెయ్యగలిగిందేముంది? అక్కడకూ ఎవరేది చెబితే అది చేశాము. నోములన్నారు—వ్రతాలన్నారు—జపాలన్నారు—తపాలన్నారు. యాత్రలు సేవిస్తే సంతానం కలుగుతువన్నారు. ఒక్కటయినా మిగల్చకుండా అన్నీ పూర్తిచేశాము. కాని ప్రయోజనం శూన్యం. ఒకనాడు అంజలీదేవి నాప్రక్కనుచేరి ప్రారంభించింది. ఆమె కోరిక నాకు చాలా ఆశ్చర్యమును కలిగించింది.

"ప్రభూ! మన కిక సంతానయోగం లేదని ఖాయమయింది కదా?"

"భగవంతుడు చేసిందాన్ని గురించి మనం విచారించి లాభం లేదు కదా అంజలీ!"

"అవుననుకోండి—పుత్రులు లేనివారికి పున్నామనరకమని చెబుతారు. అంతేగాకుండా, మనవంశం మీతోనే నిలిచిపోవడం, భరించలేని విషయం. తరువాత, సింహాసనానికి అర్హులయినవారు లేకపోతే, రాజ్యం పరులపాలవుతుంది."

"నువ్వు చెప్పినదంతా నిజమే—నేను కాదనను."

"అందుకు నేనొక వుపాయ మాలోచించాను. మీరలా చెయ్యాలి."

"ఏమిటది దేవీ?"

"వేరొక కన్యను ద్వితీయ భార్యగా స్వీకరించండి!"

అని అంజలీదేవి చెప్పేటప్పటికి నేను తెల్లబోయాను. ఆ వూహను మొదలంటా అసహ్యించుకున్నాను.

"అంజలీ! అది నామనస్సుకు అంగీకారం కానిపని. స్త్రీకి పాతివ్రత్య మెటువంటిదో, పురుషుడికి ఏకపత్నీవ్రతమున్నూ అటువంటిదే! బహుభార్యలను కలిగిన పురుషుడు నాదృష్టిలో జారుడు!"

"లేదు. పురుషుడు అందులో, ధరాపాలకుడు ఎందరి భార్యల నయినా స్వీకరించవచ్చు—ఇది శాస్త్రసమ్మతమయిన విషయము—ధర్మము—అయివుంది. నామాటయందు తమకు విశ్వాసంలేకపోతే—ధర్మాధర్మాలు తెలిసిన పండితులతో విచారించండి!"

"ధర్మశాస్త్ర లంగీకరించినా, నామనస్సంగీకరించదు. నా కీజీవితంలో నువ్వొక్కతవే యిల్లాలివి. నీవల్ల నేను భూలోకమున స్వర్గసౌఖ్యాల ననుభవించాను. నీపై శాశ్వతంగా నిలిచిన నామనస్సు ఇతరులపైకి మళ్ళదు."

"నామాట వినరా!"

"వద్దు దేవీ! ఆయాలోచనే నాకు అతిభయంకరంగావుంది. ఇప్పటంటే అన్నావుగాని—నే నీమాటలు నీ నోటంట యింకెప్పుడూ వినగోరను—నాకు చెప్పొద్దు."

అని నేను ఖండితంగా చెప్పినందువల్ల, అంజలీదేవి అప్పటి కేమీ మారుపలుకలేదు. కాని అదే విషయం ఆమె బుర్రలో తీవ్రంగా పనిచెయ్యడం మొదలుపెట్టింది. మంత్రులచేత, మిత్రులచేత, ఆప్తులచేత, నాకు బోధలు చేయించింది. కాని, ఎవరిమాటలు నాతలకెక్కలేదు. ఆ విషయ మెవరెత్తినా, నేను తీవ్రంగా మాటలాడడంవల్ల, ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారు.

అంజలీదేవి నాహృదయాధిదేవత-నా వరాలపంట-నా ప్రాణంలోని ప్రాణం, అటువంటి ప్రేమరాసిపై యింత కాలం నిలిపిన మనస్సు-అంకితంచేసుకున్న హృదయం, ఈనాడు భగవంతుడు మళ్ళిస్తేమాత్రం మరోవేపుకు మళ్లుతుందా? కొసకు అంజలీదేవికూడా ఆ విషయమును గమనించింది.

అదొకరాత్రి—జన్మలో మహాపర్వదినంవంటి రాత్రి, కాళరాత్రికూడా అదే! అధికసంతోషకరమైంది, మహాదుఃఖకరమైందీ కూడా అదే! స్వర్గనరకాల ద్వంద్వము—సుఖదుఃఖాల మిళితము—చావుబ్రతుకుల కలయిక—మరచినా మరపురాని దారాత్రి!

భోజనానంతరం, నేను మామూలుగా శయ్యామందిరం చేరాను. అంజలీదేవి నా డెందుకో అత్యుత్సాహంగావుంది. ఆమె సహజసౌందర్య మానాడు వెయ్యిరెట్లధికమైంది. ఎన్నడూ లేనిదప్పుడు తనకుగలిగిన వెలలేని ఆభరణాలన్నింటినీ పిచ్చుగాధరించింది. రత్నాల

హారాలు ముత్యాలపీటలు ఒకదానిపై ఒకటి, మణిమాణిక్యాది నవ రత్నఖచితములయిన గాజులు, గొలుసులు, మురిడీలు-అబ్బ! అన్నింటిని ఎలా మొయ్యగలుగుతున్నదో ఆ సుకుమారశరీరం అని నా కాశ్చర్యం కలిగింది. ఆమె ప్రత్యేకము మోజుపడి—కాశీకళాదుల చేత జరిపువ్వు లతో ఒకప్పుడు తాను కట్టించుకున్న బనారసు చీరను ధరించింది. పాన్పుపై ఒత్తుగా సన్నజాజలను, మల్లెలను పరిపించింది. మందిరాన అడుగుపెట్టడమే తడవుగా, అగరు, జవ్వాజి, పునుగు, అత్తరుల పరిమళాలు గుప్పున గుబాళిస్తున్నవి. ఏమిటబ్బా ఆ విశేషమంతా అని నేను విభ్రాంతుడనయ్యాను. మా ప్రథమ సమాగపు తొలిరాత్రి అంతా అదే మాదిరని నాకు జ్ఞాపకమొచ్చింది. ఆమె నారాకను గమనించకుండా, తన అతి ప్రియమైన కృతినిపాడుకుంటూ వీణా గానంలో నిమగ్నురాలయింది. నేనున్నూ ఆమెపాట నాలకిస్తూ ముగ్ధుడనై-అట్టే నిలుచుండిపోయాను. ఆమె మైమరచిపాడుతూంది- నేను విభ్రాంతుడనై వింటున్నాను

అలా యెంతసేపు గడిచిందో తెలీదు-ఇంతలో ఒక పరిచారకు రాలు పలహారముల పళ్లెమును తెచ్చి అక్కడపెట్టి వెళ్ళడంలో అయిన చప్పుడువల్ల ఆమె కతితరాయం కలిగింది. తపోభంగమైన యోగిని లాగ, వీణాతంతులవులపై నున్న దృష్టినిట్టె మళ్ళించి ఒకసారి పరి చారికవైపు—ఆ వెంటనే నావైపు పూతిలకించి, వీణను కిందపెట్టి లేచి నిలుచుంది. పరిచారిక వెళ్ళిపోయి, తలుపుల నవతలమూసుకుంది.

"ఎంతసేపయిందండీ మీరొచ్చి."

అంటూ, అపర రంభలావున్న అంజలీదేవి నా చేయిపట్టుకుని పూలపాన్పుదగ్గరకు తీసుకెళ్ళి నన్ను కూర్చోబెట్టి, తానున్నూ నా శిర స్సుకు తన శిరస్సునానించి, ఎదురుగావున్న నిలువుటద్దములో మా ప్రతిబింబాలను తిలకించి—ఎందుకో ఒక వేడినిట్టూర్పును విడిచి, తిరిగి వెంటనే—

"నేనీవేళ యెక్కువ ఖులాసాగావున్నా కదండీ?" అని అడిగింది.

"ఏమిటీ విశేషమంతా, అని నే నడగాలనుకుంటున్నా."

"తొలిరాత్రి—తుదిరాత్రి—రెంటిలో ఏది అత్యధికానందము నిస్తుందో చూచుకోవాలని—"

అని ఆమె పరవశురాలై నవ్వడం మొదలుపెట్టింది.

"తుదిరాత్రా? అంటే—?"

"పిచ్చిదాన్ని, ఏవో పిచ్చిమాటలు—దానికేంగానీ—మన మొదటిరాత్రి—మీకు జ్ఞాపకముందికదండీ?"

"ఎందుకు లేదూ?"

"ఆరోజున ఇన్ని ఆభరణాలూ పెట్టుకున్నాను—ఇదే చీర కట్టుకున్నాను. ఇంత సంతోషంగానూవుంది. మన మీనాడు అదే ప్రకారంగా వుండాలని కోరికపుట్టింది, మీరేమీ అనుకోరుగా?"

"నీ కోరికలు తీర్చడానికి కదా నేను బ్రతికింది?"

"ఒక్క రాత్రేనా? లేక మీరెప్పుడూ నేను కోరిందాన్ని నెర వేరుస్తుంటారా?"

"ఎప్పుడూ?"

"అబ్బ! ఈ ఇప్పుడెంతహాయిగా వుందండీ!"

అంటూ ఆమె అరమోడ్పు కన్నులతో నా హృదయంమీద వాలి—ఈ ప్రపంచమునే మరచిన స్వర్గీయానందంలో మునిగింది. అలా యెన్నిగంటలు నడిచాయో—ఎంత రాత్రిగడిచిందో—ఏమేమి చేశామో—ఎప్పుడు నిద్రపట్టిందో! అది ఒక స్వప్నమయజగత్తు.

తెల్లవారింది, నేను పాన్పుదిగాను. అంతకు ముందెప్పుడూ ప్రతినిత్యమూ నాకంటేముందుగా అంజలి నిద్రలేచి, గదివొదిలి వెళ్ళి పోయేది. ఆనాడామె యింకా లేవలేదు. గతరాత్రి జరిగిన ఆనందానుభవాన్ని జ్ఞాపకంతెచ్చుకుని, నిద్రలేపోవడంవల్ల, ఆమె అలిసిసొలిసి మేలుకోలేదని ఊహించుకుని, నాలో నేనొకసారి నవ్వుకుని, ఆమెకు నిద్రాభగం కలుగచెయ్యకుండా, మెల్లిగా గదివొదిలి వెళ్లాను.

ప్రాంతఃకాలకృత్యాలన్నీ పూర్తిచేసుకుని, దుస్తులువేసుకుని, నిత్య రాచకార్యాలను నెరవేర్చుకునే నిమిత్తం, సభకు బయలుదేర బోతుండగా, ఇద్దరు పరిచారకులు, పరుగు పరుగున నేనున్న దగ్గరకు పరుగెత్తుకొచ్చి—

"ప్రభూ! ఘోరం! ఘోరం! దేవిగారు—" అని ఘొల్లున ఏడ్చారు.

"ఆఁ! దేవిగారికి—ఏమయిందే?" అని నేను ఆశ్చర్యంగా అడిగాను.

"త్వరగారండి ప్రభూ—వచ్చి చూడండి."

అని, వారిసంగమునుపే నేనొక్క పరుగులోపోయి శయనమందిరంలో పడ్డాను. శయ్యపై ఏముంది? ఆ పువ్వుల పాన్పుమీద—అవే ఆభరణాలు—అదే చీరతో—అంజలిదేవి మృతకళేబరం! పోయిన ప్రాణాలతో విప్పారిన ఆ కళ్ళనుచూచి నేను వెంటనే అర్థం చేసుకున్నాను. అయినా ఆశపోక కదిపాను—పలుకరించాను—వైద్యుల రావించాను. విషప్రయోగంవల్ల ప్రాణత్యాగం చేసుకుందని వారి నిర్ధారణ! విజయకుమారా! ఇంకేముంది? నాకీజగత్తు శూన్యం! జీవములు కలిగీ, శవములాగ వ్రేలాడిపోయాను. నరాలు పట్లుతప్పాయి. కళ్లు చీకట్లు కమ్మాయి, తలతిరిగిపోయింది—పాదాలకింద నేల కరిగి నన్నేదో లోతులోకి తీసుకుపోతూ అనిపించింది—యెవరెవరో మాటాడారు-ఏమేమో అన్నారు. ఒకరును కళ్లకక్కనపడ్డంలేదు-ఒక్కమాట నాచెల్లోపడ్డంలేదు. హృదయంలో చెప్పలేనంత బరువు అప్పు డాబరువుకు గుండె బద్దలై పోయినా, హాయిగా నాదేవిని నేను చేరగలిగే వాణ్ణి!

"దేవీ! నేను పాపిని! ఈపాపితో సంపర్కం తెగతెంపులు చేసుకోవాలని యింత చేశావా! రాత్రంతా స్వర్గసౌఖ్యాల్లో ముంచి తేల్చావు ఇందుకేనా? తొలిరాత్రి, తుదిరాత్రి—అన్నావు. మూర్ఖుణ్ణి, నేనే అర్థంచేసుకోలేకపోయాను. విషప్రయోగం చేసుకుని ప్రాణత్యాగం చేసుకోవలసిన అవసరం, నీకేమొచ్చిందీ? నీ గుండెల్లో ఇంత గూఢాలోచన యెందుకుచేరింది? నా జీవితాని కిక వెలుగులేదు—నా ప్రణయజ్యోతి చల్లారింది, దేవీ! అంజలీ! నీవంటి గుణవతిని భార్యగా పొందానని ఎంతగా గర్వించాను?—నాతో నీహృదయమంతా నింపుకున్నావే! నన్నే లోకంగా యెంచావే! అటువంటి దృఢమైన ప్రేమబంధాన్ని యెలా తెంచుకున్నావు?—అయ్యయ్యో! నాకింకేందారి?—"

అనినే నామె మృతకళేబరంపై పడి—హృదయం వ్రీలిపోయేటట్లు ఏడిచాను. బంధుపరివారా లెవరికీకూడా ఆమె చావు అర్థంకాలేదు. నే నెటువంటి అఘాయిత్యమూ చెయ్యకుండా, కొందరు పట్టుకున్నారు, కొంద రంతఃపురస్త్రీలు దేవి మృతకళేబరాన్ని పాన్పుపైనుంచి దించుతుండగా—ఆమె పయటమాటునుంచి ఒక కాయితంమడత కిందపడింది, దానిని నాకిచ్చారు. నేను తొట్రుపాటుతో దానిని విప్పి చూడగా, అది దేవి స్వహస్తలిఖితమైన ఒక వుత్తరం. తడబడుతున్న చేతుల్తో నేను దానిని విప్పి చదివాను—

"మనోహరా! ఈనాపని, మీకు వింతగానూ, విషాదకరం గానూ వుంటుందని నాకు తెలుసు. అయినప్పటికీ, వంశోద్ధరణకోసం, ఈ పని చేశాను. శివసగిరి ప్రభువు నిస్సంతుగా కతించకుండా వుండాలని యీపని చేశాను. తిరిగి వివాహం చేసుకుని ఆ భార్యవల్లనయినా సంతానం పొందవలసినదని, నే నెన్నివిధాల చెప్పినా మీరు విన్నారు కాదు, కార్యమును సాధించడానికి నాకిదొక్కటే మార్గం కనుపించింది. గతరాత్రి మనం ఆనందంలో మునిగి తేలిన అనంతరం, మీరు నిద్రపోయారు. అంతకుముందే నూరి సిద్ధంగా పెట్టుకున్న రత్నమును మింగి ప్రాణత్యాగం చేసుకున్నాను. మీరు నన్నత్యధికంగా ప్రేమించారు నన్నేలోకంగా యెంచారు. మీరు యిదంతా స్వర్గంలో అర్హురాలయిన మరొక కన్యను వివాహమాడి, నన్నెంతగా ప్రేమించారో ఆమెనుకూడా అంతగానే ప్రేమిస్తూ, ఆమెవల్ల సంతానమును పొందవలసిందని నాకోరిక. మీరు నాకోరికను నెరవేర్చి, నా ఆత్మకు శాంతి కలిగించవలసినదని ప్రార్థన! ఇట్లు,

అంజలిదేవి."

ఆవిధంగా అంజలిదేవిచే వ్రాయబడిన ఉత్తరమును చదివి, తల మోదుకున్నాను, గుండెలు బాదుకుని యేడ్చాను.

"నేనెంత నిర్భాగ్యుణ్ణి! బ్రతికివున్నప్పుడే నువ్వు చెప్పినట్లు విని వుంటే యీఘోరం జరిగేది కాదు గదా! అంజలీ! రాజవంశోద్ధరణకోసం నీ తనువును చల్లార్చుకున్నావా? నీ నవమోహనరూపాన్ని బలిదానం చేశావా! నువ్వులేని యీ ప్రపంచ మూన్యంగదా! ఆసూన్యంలో నే నే ఆశపెట్టుకుని బ్రతకాలి? యెవరికోసం బ్రతకాలి? ఎన్ని జన్మలెత్తితే మాత్రం నీవంటి ఉత్తమయిల్లాలు లభ్యమవుతుంది! లభ్యమయితే మాత్రం నేనామెనేలా ప్రేమించ గలుగుతాను?-నీపై నిలిపినమనసు నామెపై పేలా మళ్ళించగలను? నీ మధురవాక్కులు నాకిక వినిపించవుగదా—నీ సుందరరూప మిక కనుపించదుగదా!"

అని నేనెంత యేడ్చినా కలిగిన ఫలిత మింకేటుగదా! అంతఃపుర స్త్రీలు, పరిచారికలు, రాజబంధుగులు—అనేకజనము, అంజలీదేవి దుర్మరణానికి యెంతగా దుఃఖించారో చెప్పలేము. అటువంటి రాణి తమకెన్ని జన్మలెత్తినా లభ్యం కాదని ఏడ్చారు. యెవరెంతగా యేడుస్తేమాత్రం ఆమె వింటుంది! జరగవలసిన కార్యక్రమం ఎలాగో

జరిగిపోయింది. రాజమందిర మేగాకుండా, ఆనాడు నగరమంతటా శోక దేవత విజయ విహారం చేసింది. రాణీ అంజలీదేవి దుర్మరణానికి అసేషజనం అలమటించారు. దేవి మృతకళేబరానికి యథావిధిగా దహనచర్యలు జరిగించబడ్డాయి.

అనంతరం కొంతకాలంవరకూ నేను ఎటువంటి రాచకార్యాలూ నిర్వహించడానికి అసమర్థుడినయ్యాను. దేవి చిత్రపటాన్ని ముందర పెట్టుకుని, ఆమె మందిరంలోనే అహర్నిశలు గడిపేవాడిని. మంత్రి, మొదలయినవారు నాకు పిచ్చి పడుతుందేమోనని భయపడ్డారు. నా దేవి ఆజ్ఞను పరిపాలించి, స్వర్గధామంలోని ఆమె ఆత్మకు శాంతి కలిగించవలసిన బరువొకటి నాతలపై వుంది. బ్రతికివుండగా ఆమె కోరికను నెరవేర్చలేకపోయినాను—ఏకారణంవల్ల ఆమె దుర్మరణం పొందిందో—ఏ ఆశయాన్ని మనసులో పెట్టుకుని కాలగర్భంలో కలిసిపోయిందో—ఆ ఆశయాన్ని ఆమె అనంతరమైనా నెరవేర్చవలసిన బరువు నాతలపై వుంది. ఇష్టమున్నా, లేకపోయినా, ఆమె ఆత్మశాంతికోసం, ఆమె ఆజ్ఞను పాలించడంకోసం, ఆపని నేను తప్పక చెయ్యాలి.

ఆపైని, మంత్రులు, ఆత్మీయులు నన్ను ఒత్తిడిచేశారు. ధారానగరపు రాజకుమార్తె రూపసుందరని, నాకెల్లవిధముల తగిన కన్య అని నిర్ణయించారు. రూపసుందరిని నేను ద్వితీయభార్యగా స్వీకరించాలి. నేనొక నిర్జీవపదార్థంలా అయ్యాను. బాధ్యతగలవారెలా నడిపిస్తే అలానడవడుచుకోవడం తప్ప యింకేమీ చెయ్యలేక పోతున్నాను. నావ్యక్తిత్వము—నా ప్రతిభ—అన్నీ అంజలీదేవితోనే అంతరించినవని యెవరికి తెలుసు? నేనింకా ఒకమనిషినేననీ—వ్యక్తిత్వంగల మహారాజునేననీ—వివాహ ప్రయత్నాలన్నీ జరిగించారు—ఆత్మీయుల చేతుల్లో నేనొక కీలుబొమ్మనై—మంత్రుల చేతుల్లో ఒక గుడ్డపేలికనై—వారెలాచెబితే అలా—వారేది చెయ్యమంటే అది—చేస్తున్నాను. వివాహమైంది.

రూపసుందరి పేరుకు తగినట్లుండే రాజకుమార్తె. సుమారు ఇరవై సంవత్సరాల యీడుగల నవయౌవ్వనవతి. రూపసంపదకు తక్కువలేదు—విద్యలకు తక్కువలేదు, ఆమెభార్యగా నన్ను చేర వచ్చినప్పుడల్లా, అంజలీదేవి నాకళ్ళలో మెసిలేది—నా హృదయాన్ని

చెయ్యిపెట్టి, కలచివేసేది. అప్పుడు రూపసుందరితో మాటలాడలేక పోయేవాణ్ణి—ఆమెను ప్రేమించి లాలించలేక పోయేవాణ్ణి—కాని అది స్వర్గధామంలోని అంజలి ఆజ్ఞ—అన్నవిషయం స్ఫురణకు వచ్చి నప్పుడు, అంతవరకున్న నామనోభావాల్ని అతి ప్రయత్నంమీద దూరంగా పారదోలి—రూపసుందరిని దగ్గరగా తీసుకుని గౌరవించే వాడిని. నానిత్యకృత్యమేమిటో నాకోవిధమైన బరువుగావుంది, ఎవరి కోసమో—ఎందుకో—నేను దినకృత్యాలు నెరవేరుస్తున్నట్లుంది కాని, ఆశక్తికలిగి, ఆనందంగా ఒక్కపని చెయ్యలేక పోతున్నాను.

పిచ్చి! నా కింకెక్కడి ఆనందం! అంజలీదేవితోనే నాఆశక్తులు-నా ఆనందాలూ అన్నీ తరలిపోయాయి. బహుశః, నా అంతరాత్మ కూడా ఆదేవినే అనుసరించిపోయి, కేవలం ఒక్కకట్టె మాత్రం ఖర్మసూత్రానికి కట్టుపడి, యీ భౌతిక ప్రపంచాన్నింకా అంటిపెట్టు కుని వుందనుకుంటాను!

## ౨౫

దినదిన గండంగా ఏడాది గడిచింది. స్వర్గధామంలోని అంజలీ దేవి ఆత్మశాంతికో అన్నట్లు—ఆమె ఆశయ ఫలితమో అన్నట్లు—రూపసుందరి గర్భవతి అయింది. నవమాసపూర్తి కావడము—పుత్రసంతానం కలగడము జరిగింది. నగరమంతటా, వేడుకలు ఉత్స వాలు జరిగించబడ్డాయి. తమకు యువరాజు కలిగినందుకు ప్రజల ఆనందానికి మేరలేకపోయింది. అంజలి ఆత్మకప్పుడు గదా శాంతి! అప్పటికయినా అది కలిగినందుకు నాలో నేను కొంచం తృప్తిపడ్డాను. పుత్రజననంవల్ల, నాజీవితంలో కొంతమార్పు కలిగిందనుకుంటాను. ఆపాపకు అంజలీకుమార్, అని నామకరణం చేయించాను. దిన దిన ప్రవర్థమానుడవుతూ, ఆబిడ్డ క్రమంగా పెరిగి ఐదేళ్లవాడయ్యాడు.

జనముద్దయిన అంజలీకుమార్ ఆటపాటలు తిలకించడంలో, ముద్దుపలుకులు వినడంలో నేను పరవశతానందమును పొందేవాణ్ణి, జీర్ణించిన దుఃఖం పైకుబకకుండా, ఆబిడ్డ నాకళ్ళకొక అంజనమయి నాడు. హృదయతాపం చల్లార్చగల ఒక దివ్యౌషధమయినాడు.

రూపసుందరితో యింతకాలం గడిపానేగాని, ఆమె మన స్తత్వంగాని, ఆమె అభిరుచులుగాని, గమనించదగిన అవకాశంగాని,

అవసరంగాని, నాకెప్పుడూ కలుగలేదు. నామానసిక ప్రవృత్తుల కను గుణంగానే ఆమెకూడా నడుచుకొనేదనుకుంటా. ఒక వారంలో ఏఒకటి రెండుసార్లో తప్ప ఎక్కువసార్లు మేమిద్దరం కలిసి మాటలాడు కొనేవాళ్ళంగాదు. ఇలాగ్గా కొంత కాలం గడిచిన అనంతర మొకనాడు నేను రూపసుందరి మందిరానికి వెళ్లాను. అంజలీకుమార్ అక్కడ ఆడుకుంటుంటే, నేనుకూడా అబిడ్డతో కొంచంసేపు అక్కడ గడిపి, తిరిగి వస్తున్న సమయంలో, అక్కడ రూపసుందరి గదిలో నాకొక శంఖం కనుపించింది. అదేమిటా అని, ఆశ్చర్యంగా పట్టుకుని చూశాను.

"ఇదేమిటి? ఎక్కడిది?"

అని, నే నామె నాశ్చర్యంగా నడిగాను.

"ఏమో—పిల్లాడు ఆడుకునేదానికి యెక్కడనుంచయినా పట్టు కొచ్చాడేమో—నాకు తెలీదు."

అని ఆమె తొట్రుపడుతూ, తడబడే గొంతుకతో చెప్పింది. అది నిజంగా పిల్లవాడు తెచ్చినదవుతే, ఆమె ఖంగారుపడవలసిన అవ సరమేముంటుందో నాకు తెలిసిందికాదు. ఆమె ఖంగారు నాకు కొంచం అనుమానకారణమైంది. శంఖాన్ని అంజలీకుమారు దగ్గిరికి పట్టుకెళ్లి—

"ఇదెవరిది బాబూ? నువ్వు తీసుకొచ్చావా?" అని అడిగాను.

"అది గెడ్డం తాతయ్యది—నాదికాదు—"

అన్నాడు, ఒచ్చీరాని మాటల్తో. గెడ్డం తాత య్యెవరబ్బా అని నేను మరింత తెల్లబోయాను.

"గెడ్డ తాత యెవ్వరు నాయనా! నాకు చెప్పవా?"

అని నేను అంజలీకుమార్‌ను బుజ్జగించి నడిగాను. కాని వాడు ఆటల సందడ్లోపడి, నాకు చెప్పకుండా-గెంతుకుంటూ పారిపోయాడు.

"వాడలా అంటాడేమిటి? గెడ్డం తాతయ్య ఎవరు?"

అని, నేను రూపసుందరి నడగ్గా, ఆమె ముఖం చిట్లించుకుని,

"గెడ్డం తాతయ్యలు—మీసాల తండ్రులూ—నా కెవరూ తెలీదు. వాణ్ణే అడగండి." అంది.

ఇందులో ఆమెకు కోపకారణ మేముందో నాకర్థంకాలేదు. తనకు తెలియకపోతే తెలీదు పోవచ్చు. అందుకు ముఖం చిట్లించుకోవడం దేనికి? ఆగ్రహపడడం దేనికి? అందువల్ల ఆగెడ్డం తాతయ్య విషయంలో నిగూఢత యిమిడివుందని నేననుకున్నాను. ఇష్టంలేని విషయాన్ని

గురించి, ఆమెను తరిచి తరిచి అడగడమెందుకని, అప్పటికి మెదల కుండా, నాపనులమీద నేను వెళ్ళిపోయాను.

పసిపిల్లలెప్పుడూ నిజం చెబుతారు. కల్లకపటము తెరుగని వారి నోటంట అసృతవాక్యాలు వెలువడవు. రూపసుందరికి నాదగ్గిర దాచవలసిన రహస్యమేముంటుంది? ఆ గెడ్డం తాతయ్యెవరు? అనే విషయాలు నాబుర్రలో తీవ్రంగా పనిచెయ్యడం మొదలు పెట్టాయి. అయితే చంటివాడు చెప్పినదానికి అంతప్రాముఖ్యతయిచ్చి ఆలోచించవలసిన అవసరం వుండా అంటూ—రూపసు దరి గనక సరిగా ప్రవర్తించివుంటే— ఆవిషయం నామనస్సునుంచి అప్పుడే తొలగి పోయేది. ఆమె మనోవిరుద్ధంగా ప్రవర్తించిన కారణంవల్ల, నా విషయాని కంతప్రాముఖ్యతయిచ్చి ఆలోచించవలసివచ్చింది.

అదే ఆలోచనతో ఆసాయంకాలం తిరిగి రూపసుందరి మందిరానికి వెళ్లాను. అంజలీకుమారా చెప్పుడూ నాకెదురై గెంతుకుంటూ వచ్చేవాడానాడు నాకసలు కనపడనేలేదు. నాలుగువయిపులా పరికించిచూచి—

"ఏడీ! అంజలీకుమారెక్కడ?" అని రూపసుందరి నడిగాను.

"ఆటలకెక్కడి కెల్లాడో నాకు తెలీదు." అన్నదామె.

నాకు ప్రతినిత్యము ఆమె రాణివాసానికి పోయే అలవాటులేదు. అంజలీకుమారుని నేనున్న దగ్గరకే పిలిపించుకొని, నాకు నావకాశ మున్నంతవరకు వాడితో ఆడుకొని, అనంతరం తిరిగి తల్లిదగ్గిరికి పంపే వాణ్ణి—అటువంటిది అవుకాశంవచ్చి—తిరిగి సాయంకాలంకూడా నేను రావడం, రూపసుందరికి కొంచం ఆశ్చర్యం కలిగించివుంటుంది.

"ఈదినం రాచకార్యాలంత ఎక్కువగా లేవనుకుంటాను."

అని ఆమె నన్నడిగింది.

"లేకకాదు—మనస్సు సరిగా లేకపోవడంవల్ల—అంజలీకుమారుతో కొంచంసేపు గడుపుదామని వచ్చాను."

అని నే నామెకు బదులు చెప్పాను.

"వాడితో ఆడుకుంటే మీకు ఖులాసావుంటుందా?"

"వుంటుంది."

"అవును—వాడితోనేగాని, నాతో ఆడుకున్నప్పుడు మీకు ఖులాసాగా వుండదు. ఆసంగతి నాకు తెలుసు."

నే నామె మాటకు బదులు చెప్పకుండా—

"పరిచారకులను పంపించి-కుర్రాడెక్కడున్నాడో పిలిపిస్తావా?"

"ఆపని మీరే చెయ్యవచ్చుగదా!"

అని ఆమె అన్నమాటకి నాకు చాలా ఆగ్రహం కలిగింది. అయినా ఏమీ అనలేదు.

"ఎవరక్కడ?"

అని నేను పిలవడంతోనే ఒక దాసీ వచ్చింది.

"అంజలీకుమారు డెక్కడాడుకుంటున్నాడో—తక్షణం పోయి తీసుకురా."

అని నేనాజ్ఞాపించిన వెంటనే, చిత్తమని, పరిచారిక వెళ్ళిపోయింది. నే నంజలీకుమారు కోసం ఎదురు తెన్నులు చూస్తూ కూర్చున్నాను. అంజలీకుమారూ రాలేదు—వాడికోసం వెళ్లిన పరిచారికా రాలేదు. క్రమంగా చీకటిపడుతూంది. నాకు హృదయవేగం యెక్కువయింది. వెంటనే మరియొక పరిచారికను పిలిచి పంపించాను. క్రమంగా రాత్రి తొమ్మిదిగంటలుకూడా అయింది. పిల్లవాడు కాని, పిల్లవానిని వెదుకబోయిన పరిచారికలుగాని తిరిగి రాకపోయినందువల్ల, నామనస్థిమితం మరింత చెడిపోయింది.

రూపసుందరున్న దగ్గిరికెల్లాను.

"బిడ్డ రాలేదు."

ఆమె జవాబు చెప్పలేదు.

"పరిచారికలుకూడా రాలేదే!"

"ఎందు చేతనో మరి."

"పిల్లాడెక్కడికి వెళ్ళివుంటాడు?"

"ఏమో—దుడుకు పిల్లాడు! ఐదేళ్లు నిండినయో లేదో—అన్నీ అల్లరిపనులే—వాడికెవరు చెప్పగల్రూ?"

"చిన్నతనంలో అందరూ అలాగే వుంటారు. నువ్వూ—నేనూ కూడా అలాగే వుండివుంటాము."

అని నేను రూపసుందరితో మాటలాడుతుండగా, వెళ్ళిన పరిచారిక లిద్దరూ వచ్చారు.

"చిన్నబాబుగారెక్కడా కనుపించలేదండి—దేవిడీ—తోట—అంతా గాలించి వచ్చాము."

అని వారు చెప్పేటప్పటికి నాకు ఖంగారు పుట్టింది.

"ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లేవారు కాదండి—ఈ దినమే—"

అని, ఒకపరిచారిక చెబుతుంటే రూపసుందరి వారించి—

"ఎప్పుడూ వెళ్ళకపోవడమేమిటి? నీముఖం—ఒక్కొక్కప్పుడు వాడింతే—ఎవరికీ చెప్పకుండా చెయ్యకుండా—పోతాడు."

అన్నదానికి, పరిచారిక మళ్ళీ నోరెత్తలేదు.

"ఇప్పుడింతకీ బిడ్డ ఏమైపోయినట్లు?" నాకెవరూ జవాబు చెప్పరు. వారి జవాబులకోసం నిరీక్షించి ప్రయోజనం లేదనుకున్నాను. వెంటనే ఒక పరిచారికను నా మందిరానికి పంపించి, వెంటనే మంత్రిని పిలుచుకురావలసిందని పంపాను. మంత్రి వచ్చేవరకూ కూడా నాహృదయముండ బట్టలేదు.

"మీరే స్వయంగా వెళ్ళి—పిల్లవాణ్ణివెదికి తీసుకొస్తే కాగలుంటుందేమో—" అని రూపసుందరి చెప్పినమాట సమంజసంగా వుందని తోచింది. వెంటనే లేచి నేను బయలుదేరబోతున్న సమయంలో, మంత్రి యిరువురు భటులతో ప్రవేశించాడు.

"మంత్రీ! నేను అయిదుగంటలకీమందిరానికి వచ్చాను. ఇప్పటివరకూ అంజలీకుమారు జాడ తెలియడంలేదు. పరిచారికలను పంపుతే కనుపించలేదని, తిరిగి వచ్చారు. నువ్వు వచ్చేలోపుగా నాహృదయముండబట్టలేదు—నేనే స్వయంగా బయలుదేరబోతున్నాను."

అని నేను చెప్పినదానిని విని—

"అయ్యో! మేమంతా యెందుకున్నాము ప్రభూ! ఇంత చిన్న పనికి తమరు బయలుదేరాలనా? తమరు స్థిమితపడండి—సమర్థులయిన వార్ని పంపించి, నగరమంతా గాలింపచేస్తా—నేనుకూడా స్వయంగా బయలుదేరి—యువరాజుగార్ని వెదికి తీసుకొస్తాను."

అని మంత్రి చెప్పినదానికి నే నెదురు చెప్పలేదు. అతను వెంటనే అదే ప్రయత్నమీద బయలుదేరి వెళ్ళాడు. నా హృదయమెందుకో కీడును శంకిస్తూంది. చిరంజీవి విషయంలో నాకటువంటి దుశ్చింతలు కలుగకూడదని, ఆలోచనలు అంటుపోకుండా అరికట్టుకోడానికి ప్రయత్నించాను. స్థిమితంచెడి, ఎదురు తెన్నులు చూస్తూ, అటూయిటూ పచారులు చేస్తున్నాను. భోజనానికి లేవవలసిందని,

రూపసుందరి నన్ను రెండుమూడు పర్యాయములు హెచ్చరించింది, చిరంజీవి కళ్ళబడేవరకూ నాకేమీ తోచదని నిరాకరించాను.

పది, పదకొండు, పన్నెండుకూడా నగారా కొట్టింది. మంత్రిగాని, మరెవ్వరుగాని వచ్చి, నాకు చిరంజీవి సమాచారమును చెప్పినవారు కారు. తల్లి ప్రాణమైన రూపసుందరికి నాకంటే యెక్కువ ఆదుర్దాగానే వుండివుంటుంది, కాని ఆమె ఆదినుంచీ లోతు గుండెగల మనిషి కావడంవల్ల, చలించకుండా వుండివుంటుందని నేననుకున్నాను. సుమారు ఒంటిగంట ప్రాంతానికి ఎవరో మెల్లిగా నడిచివస్తున్నట్లు అలికిడి కావడంవల్ల నేను, చిరంజీవిని తీసుకొని ఎవరయినా వస్తున్నారేమో నని ఆదెసకు పరకాయించి చూచాను. అతనెవరో ఒక గెడ్డంతో కాషాయాంబరాలు ధరించిన బైరాగిలా కనుపించాడు. కాని సగందూరంలో వాడు, సగందూరంలోనే మాయమయ్యాడు. ఎవరబ్బా—అని నేను నాలుగడుగులు ముందుకుపోయి చూచాను, నాకెవరూ కనుపించలేరు, ద్వారందాకా వెళ్ళాను, కావలసినవారి నడిగాను—ద్వారంగుండా లోపలికెవరూ రాలేదని వారు జవాబు చెప్పడంవల్ల, నేను తిరిగి యథాస్థానానికి వచ్చేశాను.

భ్రమకాదు—నిజంగానే అటువంటి వ్యక్తి యెవరో కనుపించాడనుకున్నా, అయితే ఆ చీకట్లో భ్రమేమోకూడా అని, నాలో నేనే ఉపసంహరించుకున్నాను. కావలివారు కూడా లోపలికెవరూ ప్రవేశించలేదన్నారు. అయినా, నా చిరంజీవి జాడ తెలియకనే నలమటించి పోతున్న సమయంలో ఈ గొడవకూడా యేమిటని చిరాకుపడ్డాను. చిరంజీవిని వెదుకబోయిన మంత్రి యింకారాలేదని, అతనిపైకూడా ఆగ్రహంకలిగింది.

మరికొంతసేపటికి, మంత్రి, కొందరు రాజభటులచే బంధించబడిన ఒక బైరాగీ, నాసమక్షమున కొచ్చి నిలుచున్నారు. ఆబైరాగి నాకంతకుముందు కనుపించి అదృశ్యుడైనవాడే. భటులతన్ని ఎందుకు బంధించి తీసుకొచ్చారో నాకర్థంకాలేదు. అంతకంటే ముందుగా తెలుసుకోవలసింది నాచిరంజీవి విషయం—

"ప్రభూ! సుమారు పదమంది అనుచరులతో పోయి—నగరమంతా గాలించాను. కాని రాజకుమారులజాడ లేమిన్నీ తెలియలేదు. వెదకడంలో లోపంజరగలేదు—ఇక వెదకడంకూడా అనవసరం.

"ఇదుగో ఈ బైరాగి, రాణివాసపు ప్రహరీగోడను దూకు తుండగా రాజభటులు బంధించారు. వీడెవడో కపటబైరాగిలా వున్నాడు—చిరంజీవి కనుపించకపోయిన దానికిన్నీ వీడికిన్నీ ఏదో సంబంధముండి వుంటుంది, కనుక ప్రభూ! వీడిని వొదలకూడదు."

అని మంత్రి చెప్పగా, నాకున్నూ అదే ప్రకారం తోచింది. అంతకుముందర వాడు కోటలోకి రాబోయి, నన్ను చూచి పరారి అయి వుంటాడు, వాడు గోటదూకి పరారి అవుతుండగా రాభటులు బంధించివుంటారు. ఇంతకూ చిరంజీవి ఏమయినట్లు? మంత్రి సూచించినట్లు ఆబైరాగికీ, చిరంజీవి కనుపించకపోవడానికీ సంబంధముందా? అనిపించింది. ఆ వుదయమే నాకొక శంఖం కనుపించడము—చిరంజీవి—'అది గడ్డం తాతయ్యది' అని చెప్పడము, నాకన్నీ ఒకదానివెంబడి ఒకటిగా జ్ఞాపకం రావడం మొదలుపెట్టాయి. అన్నీ ఒకదానితో ఒకటి సంబంధంకలిగినవిగా స్పష్టమౌతున్నది.

"ఎవరు నువ్వు? మా చిరంజీవి సమాచారం నీకేమయినా తెలుసునా?"

అని నేను తీక్షణంగా అడిగినదానికా బైరాగి కళ్లుమూసుకుని—

"జై! శంకర! మేము సర్వసంగపరిత్యాగం చేసిన బైరాగులము—మాకేమీ తెలియదు." అన్నాడు.

"అయితే-రాణివాసపు కోట దూకవలసిన అవసరం నీకెందుకు కలిగింది?"

అని, మంత్రి మరింత తీవ్రంగా అడిగాడు.

"మేము దూకలేదు—దూకినవాడు—దూకించినవాడు—ఆజై శంకర్! పరమాత్మ!"

అని చెబుతున్నప్పుడా బైరాగి చేతిలోగల శంఖమునుచూచి, నేనాశ్చర్యపోయాను. దానిని పరిశీలించి చూడగా, నేనావుదయం చూసినదదే!

"మంత్రీ! ఈ శంఖమునే నేనీవుదయం—మావసుందరి గదిలో చూశాను—చిరంజీవినడగ్గా—గడ్డతాతయ్యదని చెప్పాడు—ఆగడ్డ తాతయ్య వీడే అయివుంటాడు."

అని నేను చెప్పగా—మంత్రి.

"ఇదంతా యేదో నిగూఢరహస్యంతో కూడకున్న విషయం! ప్రభువులు క్షమించాలి! నేనిప్పుడు రూపసుందరి మహారాణీగార్ని బంధించవలసివుంది!" అన్నాడు.

"అందు రూపసుందరి నేరమేముంటుందో నాకర్థంకాలేదు. అయినా, మహామేధావిమంత్రి చెప్పిందానికి తిరుగు చెప్పడానికి నాకు సాహసం లేకపోయింది.

"మంత్రీ! ఈ రాజ్యంలోని ఆజ్ఞల కెప్పుడయినా అడ్డుందా?" అని నే ననడమే తడవుగా, మంత్రి, భటులకు, దాసీలకు సౌంజ్ఞ చేశాడు. వెంటనే వారు వెళ్లి, లోపలవున్న రూపసుందరిని బంధించి తీసుకొచ్చారు.

"ప్రభూ! మీకు ఇల్లాలినై వచ్చినందుకు—మీ సమక్షంలోనే నాకిటువంటి అవమానమా?"

అని రూపసుందరి నన్నడిగింది. కాని నేనామెకు బదులు చెప్పకుండా మంత్రివైపు చూశాను.

"దేవీ! మీ రడుగవలసిందంతా నన్నడగండి-ప్రభువు లిప్పుడు కర్తవ్యం తెలియని పరిస్థితిలోవున్నారు." అని మంత్రి ఆమెకు బదులు చెప్పాడు.

"నేనేం నేరం చేశానని?

"క్షణకాలం ఓపికపట్టండి-మీరు తప్పు చెయ్యలేదని తెలుస్తే మాపొరపాటుకు క్షమించమని వేడుకొంటాము — మిమ్మల్ని వొదిలేస్తాము. దయచేసి, నేనడిగినవాటికి బదులుచెప్పండి. ఈ బైరాగితో మీకు పరిచయముందా?"

"వుంది."

"ఎలా?"

"నాకు ఉపదేశాలు చెయ్యడానికి గురువుగా ఏర్పాటు చేసుకున్నాను."

"ఎంతకాలంనుంచి?"

"షుమారొక సంవత్సరంనుంచి."

"ప్రభువులకావిషయం ఎప్పుడయినా చెప్పారా?"

"లేదు."

"ఎందువల్ల?"

"అది వారికి సంబంధంలేని విషయంగాబట్టి."

"ప్రభువు లీవృదయం మీ మందిరంలో ఈ బైరాగి శంఖమునే చూశారు?"

"అవును."

"వారడిగినప్పుడు మీరు యదార్థము నెందుకు చెప్పలేదు.?"

"ఈ బైరాగివల్ల నేను ఉపదేశాలు పొందడం వారికిష్టముండదేమో అని—"

"మీ కటువంటి అనుమానం ఎందుకు కలిగింది?"

ఆమె బదులు చెప్పలేదు.

అనంతరం మంత్రి, బైరాగిని కొన్ని ప్రశ్నలు వేశాడు.

"నువ్వు రాణీగారి అంతఃపురానికి అప్పుడప్పుడు వస్తుంటావా?"

"నేనవన్నీ వచ్చేవాడ్ని-రాలించబడేవాడు-సర్వంబైశంకర్!"

"అదే! రహస్యంగానా? బహిరంగంగానా?"

"తెలియనంతవరకూ రహస్యం-తెలిసింతరవాత, బట్టబయలు, సూన్యం—ఆ శూన్యంలోనే పరంజ్యోతి—అదే పరిపూర్ణం."

మంత్రి ఆగ్రహమును పట్టలేకపోయాడు, భటులను సౌంజ్ఞ చేశాడు, వారాబైరాగి కాళ్లుచేతులుకట్టి తోలుకొరడాతో—వీపు చిట్లిపోయేలా కొట్టడం ఆరంభించారు.

"నిజం చెప్పేవరకూ—నికిదే గతి—ఇనపకడ్డీలను నిప్పుల్లో కాల్చి తీసుకురండి—వీడి శరీరంమీద వాతలు పెట్టండి."

అని, మంత్రి కొందరు భటుల కాజ్ఞలు ఈయగా, వారావిధంగా చెయ్యడానికి వెళ్లారు. బైరాగి దెబ్బలతోనే జంకిపోయాడు.

"నన్ను కొట్టకండి—నిజం చెప్పేస్తాను." అన్నాడు హీన స్వరంతో, భటులుకొట్టడం నిలిపారు. బైరాగి చెప్పడం మొదలు పెట్టాడు—

"నేను హిమాలయప్రాంతమంతన్నీ తిరిగి—మూలికా సేవవల్ల కాయసిద్ధినిపొందిన కాముకుణ్ణి. దానికితోడు కొందరసన్యాసుల సహవాసంచేసి, మాంత్రిక బలాన్నికూడా సంపాదించాను, నా మాంత్రిక శక్తుల్ని ఒక స్త్రీసూత్రానికి ఆహ్వానింపచేసుకుని, దాని సహాయంవల్ల, ఎక్కడెక్కడలేని అందగత్తెలను, రాజకుమార్తెలను, చెరబట్టి నా కామతృష్ణను తీర్చుకునేవాడిని. ఈవిధంగా నాప్రభ చాలాకాలం

వెలిగింది. ఒకప్పుడు మహానరాధీశ్వరుడైన చంద్రసేనమహారాజుసతి, నిర్మలాదేవిని చెరబట్టిన సంధర్భంలో, ఆ రాజకుమారుడు స్త్రీ వేష మును ధరించి, నన్ను మోసంచేసి, నామంత్రశూలము నపహరించి, నన్నుకొట్టి తరిమివేశాడు. నామంత్రశూలం గనక వున్నట్లయితే—మీరుగాదు మిమల్ని పుట్టించనవాళ్లు కూడా నన్నేమీ చెయ్యలేరు. ఇప్పుడది లేకపోవడంవల్ల నేనొక సామాన్యుడనై పోయాను. అయి నప్పటికీ నాలోని కామతృష్ణ అంతరించలేదు. కేవలం తెలివిని ఉప యోగించి, లభ్యమైన స్త్రీలతో భోగిస్తున్నాను.

ఇలావుంటుండగా, బిక్షకై వచ్చిన నేను రూపసుందరిని చూడ డం జరిగింది. ఆమె సౌందర్యానికి ముగ్ధుడనయ్యాను. ఆమె ననుభ వించాలని కోరిక పుట్టింది. నేనేదో మహాత్మునల బైరాగినని, ఆమె నన్నాహ్వానించింది. నన్నేవో కొన్ని ప్రశ్నలడిగిన తరువాత—

"నాభర్త అల్లప్పుడూ తనచనిపోయిన మొదటిభార్య అంజలీ దేవిపైనే మనస్సు పెట్టుకునివుంటాడు—అందువల్ల నాకు భర్తృ సౌఖ్యం సన్నగిల్లిది. అందు కుపాయం ఏమిటి?" అని అడిగింది.

నేనా అవకాశమును పోగొట్టుకోకుండా—

"కొంతకాలం గురుసేవ చేసినట్లయితే—నీకు భర్తృ సౌఖ్యం అపరిమితంగా కలుగుతుంది".

అని నేనామెకు విశ్వాసంకలిగేటట్లు చెప్పాను, ఆరోజు మొదలు కొని, నన్నామె తన మందరానికి రహస్యంగా రావలసిందని కోరింది. నేనదేప్రకారం చేస్తున్నాను. క్రమంగా నేనామెను వంశంచేసుకుని, ఇష్టవాంఛలను తీర్చుకోడానికి ఎక్కువ కష్టపడలేదు. నామీద ఆమెకే యెక్కువప్రీతి కలిగింది. ఆమె నన్ను వొదిలిపెట్టలేని పరిస్థితి కూడా యేర్పడింద. ఇప్పటికి సంవత్సరంపైనుంచి, మాయిద్దరికీ అదేప్రకారంగా, అవిచ్చిన సాంగత్యం సాగిపోతూంది, ఈదినం కాల ఖర్మవశాత్తూ పట్టుపడవలసివచ్చింది."

అని బైరాగి చెప్పినదంతావిని—రూపసుందరి తలను కిందికి దించుకుంది, ఆమెతోపాటు నేను తల, దించుకోవడమేగాకుండా నేల కేసి కొట్టుకుని అవమానంతో చావవలసిన పరిస్థితిగదా?

మంత్రి బైరాగిని తిరిగి ప్రశ్నించాడు,

"అయితే చిరంజీవి ఏమైనట్లు?"

ఆవిషయం మాత్రం నాకు తెలీదు. నేను రోజూ రాత్రులు ఒంటిగంట ప్రాంతాలకు రాణివాసపు గోడదూకి, లోపల ప్రవేశిస్తుంటాను, అప్పటికి రాజకుమారుడు గాఢనిద్రలో వుంటుంటాడు, ఈమధ్యనే ఒకటి రెండుసార్లు ఆసమయంలో ఆబిడ్డ నిద్రమేలుకో వడము—నన్నుచూచి—''ఆ గెడ్డంతాత యెవరమ్మా?'' అని తల్లి నడగడము—ఆమె ఆబిడ్డకుకొట్టి నిద్రబుచ్చి నాదగ్గరకు రావడము జరిగింది. గతరాత్రికూడా అలా జరిగింది—నేను పోతూ పోతూ నా శంఖము నక్కడ మరచిపోవడము—దానికై తిరిగివచ్చి తీసుకెళ్లడము జరిగింది. నన్ను కాల్చినా—చంపి, నానుంచి యితర వివరాలు మీకు రావు—నాకు తెలియవు.''

అని బైరాగి చెప్పినదానిని, మంత్రి, నేనుకూడా నమ్మాము. చిరంజీవి సమాచారం వాడికి తెలియదనే నిర్ధారణ చేసుకున్నాము.

''దేవీ! ఇప్పుడిక తేలవలసింది ఒక్క చిరంజీవి విషయం మాత్రమే—అదే చాలాముఖ్యమయినది. బైరాగికి పట్టినగతి మీకు పట్టకముందే—మీకు తెలిసిన విషయం చెప్పండి.''

అని మంత్రి, రూపసుందరిని హెచ్చరించాడు.

''చిరంజీవి విషయం నాకు తెలీదు.''

అని ఆమె ఖండితంగా చెప్పింది.

''ప్రభూ! ఈ పాపులనిద్దర్నీ కారాగృహంలో వేయడానికి ఆజ్ఞలియ్యండి.''

అని మంత్రి నన్నడగ్గా—

''అంతేనా? ఇంకా పెద్ద శిక్ష అడుగుతావనుకున్నా.'' అని నేనంటే—

''ప్రస్తుతం—ఇంతే జరగవలసివుంది.'' అని మంత్రి అన్నాడు.

''చిరంజీవి విషయం నాకేమీ తెలియదని నమ్మితే—నన్ను బంధించడం అనవసరంగదా ప్రభూ?''

అని కపట బైరాగి అడిగినమీదట—

''చేసిన యితర నేరములన్నీ?''

అన్నాడు మంత్రి.

''అందు నా అపరాధమంతగాలేదు, దేవి నన్ను ఆహ్వానించి, తనంతట తాను నాకు వశమైనప్పుడు-నన్ను శిక్షించడం అవివేకం-''

అని బైరాగి తిరిగి అన్నది సమంజసమే అని నాకుతోచింది.

"చిరంజీవి విషయం నీకు తెలియదని పూర్తిగా నిర్ణయమైనప్పుడు—నీ విడుదలను గురించి ఆలోచిస్తాము, అంతవరకూ నువ్వు కూడా కారాగృహంలో వుండి తీరవలసిందే!"

అని బైరాగికిచెప్పి, మంత్రి "ఈ యిద్దర్నీ వేరువేరుగా బంధించండి."

అని భటుల కాజ్ఞలీయగా, వారు రూపసుందరినీ, బైరాగినీ బంధించి, ఆ చోటునుంచి తీసుకుపోయారు.

## ౨౬

"మంత్రీ! నాబిడ్డ—నాచిరంజీవి ఏమైనట్టు? ఆకుచ్ఛితురాలు కులటయై చెడిపోయినందుకు నాకు విచారంలేదు. నాబిడ్డను ఎవరో ఏమో చేశారు. నాచిరంజీవి లేకపోతే నేను బ్రతకలేను. అంజలి ఈసంతానంకోసమే తాను తనువును దగ్ధంచేసుకుని—బ్రతుకును బలిచ్చింది! ఇప్పుడేందారి? నాబిడ్డ నాకెలా దొరుకుతాడు."

అని నేను, వికలమైన హృదయంతో మంత్రిని తొందర చెయ్యగా—

"ప్రభూ! కొంచం శాంతి వహించండి. నిగూఢ అంతఃపుర రహస్యాలను కొన్నింటిని ఛేదించాముగదా! ఇక చిరంజీవి విషయం దాగదు—దానంతట అదే బయటపడుతుంది." అన్నాడు మంత్రి—

"ఎలా బయటపడుతుంది మంత్రీ! నాకు తల తిరిగిపోతూంది, రాత్రంతా నిద్రలేదు—ఆహారంలేదు. కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి."

అని నేను కుర్చీలో కూడా కూర్చోలేని పరిస్థితిలో క్రిందికి పడిపోగా, మంత్రి వగైరాలు నన్ను పట్టుకుని, మెల్లిగా తీసుకెళ్లి పాన్పు మీద పరుండజేశారు.

"నాబిడ్డ—నాచిరంజీవి—ఏడీ! ఎక్కడున్నాడు—"

అని నేను ఆవేదన భరించలేక అలమటిస్తుంటే—

"ప్రభూ! తమరు కొంచంసేపు విశ్రాంతి తీసుకోవాలి!"

అని, మంత్రి నన్నూరడించడానికి ప్రయత్నించాడు.

"అయ్యో! నాకింకెక్కడి విశ్రాంతి! నాబిడ్డ—నాచిరంజీవి ఏమైనాడో—దేవీ! అంజలీ—నీపేరుగదా పెట్టుకున్నాను నాబిడ్డకి."

అంటూ, నే నాచేరువలోనే వున్న అంజలి చిత్రపటంవైపు అప్రయత్నంగా దృష్టిని మళ్లించాను. నేను పడుకున్న పాన్పుకు ప్రక్కగానే గదిగోడవుంది. ఆ గోడలో అమర్చబడిన బీరువాకు ప్రక్కగా అంజలి చిత్రపటం తగిలించబడివుంది. నే నంజలి చిత్రపటం నుంచి దృష్టిని మళ్ళించలేక, అటేచూస్తుండగా, బీరువాసందుల్లోంచి కిందికి కారిన ఏదో యెర్రని పదార్థం, తెల్లటిగోడపై చాలికలుగా కనుపించింది.

"మంత్రీ! బీరువాకింద ఆగోడకేమిటో? చూడు." అని నేను చెప్పడమే తడువుగా, మంత్రి దగ్గిరగాపోయి, చేతితో తాకిచూశాడు.

"రక్తం! రక్తం ప్రభూ!"

అని కెవ్వున అరిచాడు. నాకు గుండెలు ఆగిపోయినట్లయింది. మంత్రి, బీరువాతలుపులను తెరవాలని ప్రయత్నించేశాడు. కాని, అవి బలమైన తాళంతో బంధించబడివుండడంవల్ల, మంత్రి తియ్యలేక పోయాడు. అది రూపనుందరి బట్టల బీరువా, దాని తాళాలు ఆమె దగ్గరనే వుంటాయి. అయినా యెక్కడో పెట్టివుంటుంది కాని, దగ్గర వుంచుకోదుగదా అన్న వుద్దేశంతో, మంత్రి, అనుచరులతో కలసి, బీరువా తాళాలకోసం, మందిరమంతా గాలించాడు. కాని అవి యెక్కడా కనుపించలేదు.

"తాళం బద్దలుకొట్టి-లోపలేముందో త్వరగా చూడు మంత్రీ!" అని నే నన్నవెంటనే, మంత్రి ఏవో రెండు పనిముట్లు తీసుకొచ్చి, తానే స్వయంగా తాళాలు బద్దలుకొట్టి, బీరువా తలుపులు తెరిచాడు. గుడ్డలమయంలో రక్తంతో తడిసివున్న ఒక మూటను తీశాడు. నా ఒళ్లు పాన్పుమీద నిలవలేదు. లేచి కూచున్నాను, మంత్రి మూట విప్పి చూస్తే ఏముంది?

అబ్బ! భరించలేకపోయాను! నాచిరంజీవి ముఖము—కాళ్లు—చేతులు—ఖండఖండలుగా ఖండించబడిన తుండ్లు! మంత్రికి శరీరం వొణికింది—నాకళ్లు చీకట్లు కమ్మాయి. అక్కడి అనుచరులు—

"దారుణం-మహాఘోరం! అయ్యో! విజయకుమారా! బిడ్డా!"

అని యెలుగెత్తి యేడవడం మొదలుపెట్టారు. నాపరిస్థితిని నేను చెప్పలేను. ఖండించబడిన ఆముఖమునే—ఆచేతులనే—ఆముఖమునే ఎత్తి హృదయానికి హత్తుకున్నాను.

"నాతండ్రీ! నిన్నాలా ఖండించడాని కారాతుసికి చేతులెలా వచ్చినైరా! ప్రియుడి వ్యామోహంలోపడి, తన రహస్యాన్ని ఎక్కడ వెల్లడి చేస్తావో అని ఇంతదారుణం చేసిందిగదరా! అయ్యో! బిడ్డా! నువ్వాపాపిష్టి గర్భాన యెందుకు పుట్టావురా? కులటయితే, కన్న మమకారంకూడ చస్తుందని, నాకిప్పుడు గదరా తెలిసింది? కామాంధులు కడుపుతీపిని మరచి కన్నవారినే కోసుకుంటారు గాబోలురా! అయ్యో! మంత్రీ! నాఅంజలికి నేనిప్పుడేమని చెప్పాలి? నావంశోద్ధరణకు తానాహుతియై—యీ అంకురమును ప్రసాదించిన దేవితో ఎలా చెప్పను! మంత్రీ! నాదేవితోనే చావలసిందింకా బ్రతికున్నాను—బిడ్డపై ఆశవల్ల రోజులు గడిపాను. ఇక నాఆశ తీరిపోయింది. నువ్వు నాకు మంత్రివి—నాప్రాణా లెంత త్వరగా పోతాయో సలహాయిచ్చి—నా కేబాధాలేకుండా చెయ్యి. నీకు పుణ్యముంటుంది."

అని నేను స్త్రీకంటే హీనంగా ఏడుస్తుంటే—మంత్రి నాచేతిలోని రక్తపుఖండలను తీసి, వాటిని తిరిగి యథాప్రకారంగా మూటగట్టి—

"ప్రభూ! సర్వజ్ఞులైన తమ రింతగా వాపోకూడదు. ప్రతి జీవికీ విధికృతమని ఒకటుందిగదా! దానిని దాట, దేవతలకే శక్యంకా లేదు. అటువంటిది, మానవమాత్రులం, అల్పులం, మనమనగా యెంత చెప్పండి! దేవీ అంజలిని యెవరు హత్యచేశారు? నూరేళ్లు బ్రతుకవలసిన నిండు ప్రాణంగదా! అటువంటిది, ఆమె తన హత్యను తానే చేసుకుంది! దానికి బాధ్యు లెవరు? నేరస్తు లెవరు? దండించబడినవా రెవరు? అది ఆమె విధికృతం! మానవప్రయత్నాని కతీతమైన విధికృతానికి వాపోవడం, విజ్ఞులపనికాదు."

అని మంత్రి చెప్పేటప్పటికి, నాకేమిటో కొంచం కళ్ళు విడివడ్డట్టయింది.

విజయకుమారా! ఇటువంటి పరిస్థితులలో ఆర్యుల వేదాంత భాగంలోని కర్మసిద్ధాంతం, అలమటించే హృదయాలకు ఊరట కలిగిస్తుంది సుమా! మంత్రియుక్తిగా చెప్పిన ఆమాటలే నన్నిప్పటి దుఃఖమహాసముద్రంనుంచి ఒడ్డున పడేశాయి. లేకుంటే, పిచ్చిపట్టేదో—ఆత్మహత్య చేసుకునేవాణ్ణో! కాని, అంత దారుణంచేసిన ఆ నారీపిశాచిని శిక్షలేకుండా వొదలడం నావుద్దేశంకాదు. మంత్రి సలహా ననుసరించి, ఆమరునాడే ప్రత్యేక సభ నేర్పాటుచేయించి, నగరప్రముఖ

లను, న్యాయాధికారులను, మంత్రులను రావించి, అక్కడకు రూపసుందరిని, ఆదొంగ బైరాగినీ హాజరుచేయించి, విచారణ జరిపించాను.

సభలో పాల్గొన్న ప్రతిఒక్కరూ, జరిగిన ఘోరవిషాదకర ఘట్టానికి నిర్విణ్ణులయినారు. రూపసుందరి కుక్కబుద్ధిని నిందించనివారు లేరు. కుచ్ఛితుడు—మోసగాడు—అయిన బైరాగిని శపించనివారు లేరు. ఆదుర్మార్గు లిరువురకు మరణదండన విధించడం యుక్తమని మొదట నిర్ణయించారు. కాని తన్ను క్షమించి వొదలిపెట్టవలసిందనీ—రూపవాణి ప్రోద్బలంవల్లనే తానటువంటి నీచకార్యం చెయ్యవలసివచ్చిందని సభకు నచజెప్పడంవల్లనూ, చిరంజీవి కాత్యా విషయంలో వాడికెటువంటి సంబంధమున్నూ లేకపోయినందువల్లను, వాడు తిరిగి శివనగర సరిహద్దులు త్రొక్కకుండావుండే నిర్ణయంపై విడుదలచెయ్యబడ్డాడు. రూపసుందరికి మరణశిక్ష విధించడంలో నాకున్నూ, మంత్రికినీ తృప్తికరంగా లేదు. కామంతో కైపెక్కి, కన్నకొడుకును సైతం చేతులారా ఖండించిన ఆమహాపాపి, ఆనారీపిశాచి—బ్రతికివుండగానే నరకబాధలు పొందాలని మాకోరిక. అందు కామెకు జన్మాంతర కారాగార శిక్ష విధించబడింది. ఆ శిక్షా కాలంలో దినమున కొక్కసారి మాత్రం ఉప్పులేని గంజిని ఆహారంగా ఈయడం, ఆమెను చూడవచ్చిన వారందరూ ముఖాన ఉమ్మడం. ఇదీ, రూపసుందరి నేరానికి విధించబడిన శిక్ష.

ఏది యెలా జరిగినా, నాబిడ్డ నాకు తిరిగి రాలేదు. బ్రతికినంత కాలమూ నాబిడ్డకోసం నేను తరుక్కు తరుక్కు యేడవ్వాలసిన యోగముంది. ఇతరులను నేపపెట్టడంకన్న, నాపాపానికి నేను ఏడవడం ఉచితమని కొనకు నిర్ధారణ చేసుకున్నాను.

విజయకుమారా! విన్నావు కదా! ఇదీ నావిషాదగాధ! కుండిన నగరపు రాజకుమార్తె అపూర్వచింతామణి దగ్గర చేరి, బాలమహర్షి అనే దొంగపేరుతో వర్తిస్తున్న ఆ దుర్మార్గుడే కపటబైరాగి. తన ప్రశ్నలద్వారా నావివరాలు తెలుసుకోను కల్పించాడు నేను చనిపోయినట్లయితే, తిరిగివచ్చి—రూపసుందరితో కులకవచ్చునని వాడి వుద్దేశం! దయదలచి, అప్పుడు వాడిని విడిచిపుచ్చడం నేరమయింది. నాకుటుంబ విచ్ఛిత్తికి కారకుడు వాడు—నావంశాంకురాన్ని కూకటివెళ్ళతో కూలదోసిన ద్రోహి వాడు! ఇన్ని చేసి, యింకా నాచావును

కోరుతున్నవాడిని ఉపేక్ష చెయ్యను! రాజకుమారా! బయలుదేరు! నాకరవాలానికి వాడి శిరస్సును బలిచేసినగాని, నాకు తృప్తిలేదు.

అని తపోధనమహారాజు ఉద్రేకుడై పలికినదానికి—విజయకుమారుడు—

"ప్రభూ! తమరిప్పుడు కొంచం శాంతి వహించవలసివుంది. నేను మీ నగరమొచ్చి, మీ ఇల్ల, చింతామణి మూడవ ప్రశ్నకు జవాబు తెలుసుకోగలిగాను. ఇంకా రెండు ప్రశ్నల కర్థం తెలుసుకో గలిగినప్పుడుగాని, నా కార్యక్రమం పూర్తికాదు. అప్పుడుగాని, ఆ కపటబైరాగియొక్క, ఆ చింతామణియొక్క, గర్వమణిచి, వారిచే జరిగించబడుతున్న హింసాకాండను అరికట్టలేను. నే నానగరంనుంచి బయలుదేరినప్పటికే వేయిమంది రాజకుమారుల శిరస్సులు ఖండించబడినవి. ఇప్పటికింకా యెందరు రాజకుమారులు హతమైవుంటారో—నేను కొద్దికాలంలోనే మిగిలిన రెండు ప్రశ్నలకుకూడా బదులు తెలుసుకుని, తిరిగివచ్చేమార్గంలో మిమ్మల్ని కలుసుకుంటాను. అప్పుడిరువురము, కుండినగరం పోయి, ఆ కపటబైరాగి గర్వమణిగించవచ్చు. అంతవరకు, తమరు ఓపికపట్టవలసింది." అని చెప్పాడు.

"రాజకుమారా! నువ్వింతశ్రమపడి, రాజలోకానికి మేలు జరిగింపనై వున్నప్పుడు నేను విఘ్నం కలిగిస్తానా! నీయిష్టప్రకారమే చెయ్యి. నీప్రయత్న మెంతయినా శ్లాఘనీయం. మానవమాత్రుల కలివికానిపనికి పూనుకున్న నీకు విజయము కలుగుగాక! జీవచ్ఛవంగా వున్న నావంటివానివల్ల ఏమీ కానేకాదు. సద్గుణఖనియైన భార్యను, ముద్దులమూటగట్టే మురిపిపుసుతుణ్ణి పోగొట్టుకున్న దుఃఖంతో కుంగి కృశించిన నేను భగవంతుని ఆజ్ఞలకు యెదురుచూస్తూ, దినాలుగడపడంకంటే. యింకేమీ చెయ్యలేకపోతున్నాను."

అని తపోధనుడు విషాదంతో చెప్పాడు.

"అయితే ప్రభూ! ఇప్పుడీ శిమనగరానికి మీ అనంతరం సింహాసనార్హు లెవ్వరు?" అని విజయకుమారుడడగ్గా—

"దేవుడు—ఇంకెవరున్నారో! ఎవరో అంతరబాంతరవాళ్లొచ్చి ఆక్రమించుకుంటారు. నా పంచకాళ్యానికై పేచీపడిన త్యాగధన మహారాజుగాని, అతని సంతతిగాని నా అనంతరం, నాసింహాసనము నాక్రమించుకోవచ్చు. ఎంతో శ్రమపడి, వివేకము నుపయోగించిన

నీమూలాన నా ప్రాణప్రదమైన పంచకళ్యాణి నాకొచ్చిందిగాని, లేకుంటే—యుద్ధపరిసమాప్తి జరక్కపోవడము—జననాశనము—నాకు మరొక కొత్త మనస్తాపము, ప్రాప్తమయ్యేవి! రాజకుమారా! నీవుపకారమును జన్మజన్మలికీ మరువను.''

''మహారాజా! ఈసందర్భంలో, తమకు మనవి చెయ్యవలసిన నాకోరిక ఒకటుంది—ఏమంటే—లోకంలో ప్రజలనేకమంది కూడు గుడ్డలకు కరువుపడివున్నట్లు నాకు తోస్తూంది. పాలకులు ఎక్కువమంది భోగలాలసులై ప్రజల యిబ్బందులు గమనించడం లేదని నేనూహిస్తున్నాను.''

''నువ్వూహించిన దాంట్లో పొరపాటులేదు. అందుకు నారాజ్యంలో నే నేదయినా ప్రజాహితకార్యమును చెయ్య సంకల్పించాను.''

''సంకల్పించారా! సంతోషం! నేను మనవి చెయ్యదల్చుకున్నది కూడా ఆసందర్భంలోనే! ప్రపంచమంతటా ప్రజాప్రభుత్వములు నెలకొల్పవలసిన ఆవశ్యకత యెంతయినావుంది. ప్రభుత్వం ప్రజలకొరకు—ప్రభుత్వం ప్రజది—ప్రజలే ప్రభువులు—అన్న సిద్ధాంతంపై తమరు పరిపాలనా విధానాన్ని ప్రజలకు స్వాధీనంచేసినట్లయితే, ముందు ముందు, ప్రజాప్రభుత్వములు నెలకొల్పదలచినవారికి తమరాదర్శప్రాయులు కావచ్చు.

''విజయకుమారా! నా మనస్సును కనిపెట్టి, బహుచక్కని సలహా యిచ్చావు. నాకు భోగభాగ్యాలమీదకాని, రాజ్యసంపదల మీదగాని మోజువంటి వ్యామోహమున్నూ లేదు. పై రాజు లెవ్వరో వచ్చి, రాజ్యము నాక్రమించుకోవడంకంటే—నా ప్రజలే నాసంపదల ననుభవించడం నాకెంత హితకరమైనది. దయచేసి నువ్వే ఆ ఏర్పాటు లన్నింటినీ జరిగించవలసిందని ప్రార్థిస్తున్నాను. ఈ దినమే నాచేత ఒక వీలునామాను వ్రాయించి, ప్రజాప్రభుత్వ ప్రకటన చేయించు. నాపంచకళ్యాణిని నాకిప్పించి మహోపకారం చేశావు. ఇప్పుడిదిన్నీ, నాకున్నూ నాప్రజలకున్నూ మరొక మహోపకారం కాగలదు.''

అని, తపోధనమహారాజు అధికసంతోషంతో చెప్పగా, విజయకుమారుడు, మంత్రులను, యితర రాజోద్యోగులను రావించి, మహారాజుయొక్క సత్సంకల్పమును వారి కెరుకపరచి, ఆదినమే తపోధన

మహారాజుచేత వీలునామా వ్రాయించి, ప్రజాప్రభుత్వ ప్రకటన చేయించాడు. దానివల్ల నగరప్రజల కెంతటి ఆనందంకలిగిందో, విజయకుమారుడును, ప్రభువును, వారెన్నివిధాల కొనియాడారో చెప్ప తరంగాదు. ప్రజాప్రభుత్వ దినమునకై, వేడుకలు, ఉత్సవాలు, ఎన్నెన్నో జరిగించబడ్డాయి. తపోధనమహారాజు కోరికపై విజయ కుమారుడు మరి రెండుదినాలు అక్కడనే వుండి విశ్రాంతి తీసుకొని, తా నప్పుడు పోదలచిన నాలుగవ పట్నమయిన వాలనగరమును గురించి, మహారాజు నడగ్గా, అత డా నగరపు పేరయినా అంతకుముందు విని వుండలేదనీ, వాలనగరమును గురించిగాని, యశానగరమును గురించి గాని, తన కేవిధమైన వివరాలూ తెలియవనీ. అందుకు తాను మిక్కిలి విచారిస్తున్నాడనీ తెలిపి, నగరంలో యింకెవరికయినా తెలుసు నేమోనని కూడా దరియాప్తులు చేయించాడు. కాని, ఆరెండు నగర ముల వివరాలూ తెలిసినవా రొక్కరూ లేకపోయినందువల్ల, విజయ కుమారుడు దతని దగ్గర శెలవుతీసుకుని, భగవంతుడు చూపించిన మార్గము ననుసరించి బయలుదేరాడు.

అప్పటికి, నర్షి, మహా, శివ, నగరాలు మూడింటిని కష్టపడి యెలాగో కనుక్కుని, ఆ మూడు నగరాలకూ సంబంధించిన మూడు ప్రశ్నలకు జవాబులు తెలుసుకుని, యిక మిగిలిన రెండు నగరాలనూ తెలుసుకోలేకపోతాడా అన్న ఆత్మశక్తితో బయలుదేరాడేగాని, ఆ రెండు నగరాలూ యెక్కడున్నయో—వాటికి మార్గమెలాగో అతని కేమీ తెలియడ లేదు. కాలినడకను, యెంతదూరం ప్రయాణం చెయ్యాలో—ఎన్నిబాధల కోర్చవాలో అత నూహించలేదు. "సాహసేలక్ష్మి" అన్న సూత్ర మొక్కటే అతన్నంతవరకు శ్రీరామ రక్షగా కాపాడి, అటుపైన కాపాడకుండా వుంటుందా?

ఆదినానికి నగర సరిహద్దులు మాత్రం దాటగలిగాడు. తాను ముందువచ్చిన హారావళీ కనుముల మార్గంగుండాగాక, దాని కెదు రుగా దక్షిణపుదిక్కుగా బయలుదేరాడు. ఆమార్గాన పది, పదునై దామడలు దాటిన తరువాత, ఒక యేరు అతని మార్గాని కడ్డంగా ప్రవహించడం కనుపించింది. దానిని దాటేవుపాయం తోచక, విజయకుమారుడు దిక్కులు చూస్తూ నిలుచున్నాడు. ఆయేటిమయంలో ఒక చిన్న నావమాత్రం నీటిలో తేలుతూవుండడం కనుపించింది.

దానిని నడిపేవారు లేరు. తాళ్లు లేవు— తెడ్లు లేవు. ఆ ఒక్క నావమాత్ర మే నీటిమధ్యలో వుండడం అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది.

"నావికుడు లేడు! తాళ్లు లేవు— తెడ్లు లేవు—నావ ఒక్కటే ఏటి మధ్యాన ఎందుకున్నట్లు? దానివల్ల యెవరికి ప్రయోజనం?"

అని విజయకుమారు తనలో తాను పలుమారు లాలోచించాడు. కాని అతని కేమీ తెలియలేదు. అక్కడ లంగరు వేయబడివున్న దేమో అనుకుంటే, ఏటి మధ్యలో యెవరు లంగరువేస్తారు? నావ నిలిచిన ఏటి మధ్యంవరకూ ఈదుకుపోయి అక్కడ నావ సహాయాన, దరిచేరతారా అనుకోడానికి, అంతవరకూ ఈదుకెళ్ళినవాళ్లు—మిగిలిన సగందూరమూ ఈదుకెళ్ళి గట్టుచేరలేరా, అనుకోవలసివస్తుంది. ఏది యేమయినా తానప్పుడా యేరు దాటాలెలాగా అని, మరికొంచంసే పాలోచించి, దిగి ఏటిగట్టం పడడమే కర్తవ్యమనుకున్నాడు. అయితే ఏరు యెంతలోతుంటుందో—మధ్యంలో పొంగుతుందో—అని సందేహించి, ఏమయినా సముద్రలోకంటే ఎక్కువ ప్రమాదం జరగదు గదా అని సరిపెట్టుకొని, అంతగా వచ్చిందంటే, తాను నేర్చివున్న జలస్థంభన విద్యను ఉపయోగించాలన్న ధీమాతో యేటిలో దిగాడు. దిగుతేగాని లోతు తెలియదు గదా! ఆయేటిలో నీరు, అతని నీలమండలవరకన్న రాలేదు. పాదాలు పూర్తిగా తడవలేదు. అయితే ఆనీటి రంగు, లోతు తెలియనియ్యకుండా మోసం చెయ్యడంవల్ల, ఆది నత నంతగా బెదిరిపోయాడు. తనకు కలిగిన అకారణ భయానికి తనలో తానే నవ్వుకున్నాడు. నిరాఘాటంగా నావవరకూ నడిచిపోయాడు. నావను చేతితో తోసి కదిలించాడు. అది, ఇసుకలో కూరుకుపోయి, ఎటూ కదలలేని పరిస్థితిలో వుండడంవల్లనే ఏటికి మధ్యలో నిలిచి పోయిందని అర్థం చేసుకుని, క్రమంగా యేరుదాటి, దరిచేరుకున్నాడు. ఈత చేతకానివాళ్లు, ఆయేటి సమాచారం తెలియని కొత్తవాళ్లూ అయితే, అది యెంతలోతుగా వుందో అని భయపడి వెనక్కు మళ్ళవలసిందే కదా! ఏది యేమయినప్పటికీ తాను సురక్షితంగా ఒడ్డు చేరుకున్నందుకు సంతోషపడి, ముందుకు సాగిపోవడం మొదలుపెట్టాడు.

అట్లు మరికొన్ని యోజనములదూరం దాటినతరువాత, విజయకుమారొక దట్టమైన అడవీమార్గంగుండా పోవలసివచ్చింది. అత నా అరణ్యమార్గమున పడిపోతుండగా, కొందరు స్త్రీ పురు

షులు ఏకకంఠాలతో ఏడుస్తున్నరొద వినిపించింది కొంతదూరంలో. పరిశీలించిచూడగా, ఆరోద తనకెదురై తనవేపే వస్తున్నట్లు తోచింది. క్రమంగా ఏడుపుధ్వను లతనికి దగ్గరయినాయి, విజయకుమారు, వార్ని కలుసుకున్నాడు. స్త్రీ పురుషులు కలిసి, సుమారొక పది మంది ఒక ఇరవైయేళ్ళ ప్రాయపుయువకుని నడిపించి తీసుకొస్తు న్నారు. ఆ యువకుడెవరో—వారతన్ని పట్టుకుని యెందుకేడుస్తు న్నారో విజయకుమారునకేమీ అర్థం కాలేదు.

"మీరందరిలా యేడుస్తున్నారెందుకు? ఈ అడవిలో ఈ యువ కుణ్ణి పట్టుకుని ఎక్కడికి తీసుకుపోతున్నారు."

అని విజయకుమారు అడిగినదానికి వారిలో ఒక వృద్ధురాలు మరింత పెద్దగా యేడుస్తూ—

"అయ్యో! ఏం చెప్పేది నాయనా! మానగరానికో మహాప్రళ యం దాపరించింది. దానికి నగరమంతా బయలుపోతూంది." అని చెప్పగా—

"అంటేయేమిటి? నగరమంతటికీ సంబంధించిన విపత్తుకు, మీరు పదిమంది మాత్రమే యిలా దుఃఖించడం దేనికి?"

అని విజయకుమారుడడగ్గా ఆవృద్ధురాలు తిరిగి యిలా చెప్పింది.

"అయ్యో! నాయనా! ప్రళయమంటే నీరు కాదు—నిప్పుగాదు—గాలికాదు! అదో మహారాక్షసి, ఒకనాడు మానగరంమీదపడి, వరసగా ప్రజలనందర్నీ మింగేస్తుండగా, మా మహారాజు దానిని చేరి—

"ఒక్కరోజులో నగరమంతటినీ ధ్వంసం చేస్తే మరునాటికి నీకే ఏమీవుండదు, కనుక రోజుకొక్కర్ని చొప్పున నీకు ఆహారంగా పంపుతాను—ఇలా అయితే నువ్వు చాలాదినాలు మానగరంవల్ల జీవించవచ్చు-అని చెప్పగా, ఆరాక్షసి, తన నివాసమయిన ఈ అడవి లోకి రోజుకొక్కర్ని తన ఆహారానికై పంపుమంది. ఆ యేర్పాటు ననుసరించి, మాలో రోజుకొక్కరుగా వెళ్ళి ఆ రాక్షసికి ఆహారం కావలసిందని మహారాజు మాకాజ్ఞాపించాడు, ఇప్పటికి నెలరోజుల నుంచి యీ జాతర జరుగుతున్నది. ఈరోజు, నాకుమారుడయిన ఈ యువకుడు పోవలసినవంతు వచ్చింది. నాకుగల ఏకపుత్రుడు ఆరాక్షసికి ఆహుతి కావలసివచ్చింది. తీసుకుపోతున్నాము. వీరం దరూ ఆత్మీయులు. అందువల్లనే యేడుస్తున్నాము."

"వెనుకముందుల తేడాగా, మీ అందరూ రాక్షసికి ఆహారం కావలసివుందిగదా?"

అని విజయకుమారుడు తిరిగి అడిగాడు.

"అవును నాయనా! వంతులువారీగా మేమేగాదు--నగరవాసులందరూకూడ రాక్షసి కాహారం కావలసిందే."

అని వృద్ధురాలు బదులు చెప్పింది.

"అటువంటప్పుడీయువకునిగురించి మీరందరూ విచారించడం దేనికి? రేపు మీరుకూడా ఇంతేగదా!"

"ఈదినంతో ఈబిడ్డ ఆయువుపడి-మేము కొన్ని దినాలు-అనగా మావంతు వచ్చేవరకూ బ్రతుకుతాముగదా!"

"మీరెంత అమాయకులు! రోజులు తేడాగా అందరూ ఆరాక్షసికి ఆహారంకాబోతూ, ముందుపోయిన వారినిగురించి, వెనుక పోవలసినవారు దుఃఖించడమా! మంచిది—మీ నగరంలోని ప్రజలందరూ అయిపోయినాక, మీ మహారాజుకూడా ఒకనాడారాక్షసికి ఆహారం కావలసిందేగదా!"

"ఏమోనాయనా! ఆ విషయమెవళ్ళూ అడిగి తెలుసుకున్నవాళ్ళుంకాదు—అయివుంటుంది. నాగరవాసులందరూ అయిపోయినాక, ఆఖరున మహారాజువంతు రావచ్చు, ఎక్కువరోజులు వ్యవధి వుంటుంది."

అని వృద్ధురాలు చెప్పినమీదట—

"ఆ రాక్షసి ఎక్కడవుంటుంది?"

అని విజయకుమారుడడిగాడు?"

"ఈ అడివికి ఎడమప్రక్కగా మళ్ళి పోయినట్లయితే ఒక ఆమడదూరంలో పాడుపడిన కాళికాలయ మొకటుంది. ఆకాళికాలయానికి వెనుకతట్టున పెద్ద వేపవృక్ష మొకటుంది. ఆ వృక్షముపై రాక్షసినివాసం. సరిగా ఆహారంవేళ చెట్టుదిగుతుంది. ఆవేళ కక్కడ ఎవరూ లేకపోయినట్లయితే—నగరంమీద పడిపోతుంది. ఇప్పటికే ఆలస్యమైంది—వొస్తాము నాయనగా!"

అని వృద్ధురాలు తనవారితో ముందుకు సాగబోతుండగా—

"అవ్వా! నిలు! ఈరోజుకు నీ కొడుక్కుబదులుగా నేనారాక్షసి కాహారమవుతాను—మీరు వెనక్కి వెళ్ళిపొండి."

అని విజయకుమారు డన్నదానికి వారాశ్చర్యపోయి—

"అయ్యో! నిన్నేతల్లి కన్నదో నాయనా! మాకై నువ్వెందుకు ఇంత త్యాగం చేయ్యాడ ?" అన్నారు

"ఫరవా లేదు—సందేహించకుండా మీరు వెనక్కి మళ్లండి." అని విజయకుమారు నిర్బంధం చెయ్యడంవల్ల వారపరిమితానందంతో-అప్పటికి మృత్యుముఖమునుంచి తప్పించబడిన తమ బిడ్డతో తిరుగు ముఖంపట్టారు. విజయకుమారు రాక్షసివుండు తావుకై ముందుకు సాగిపోతూ—

"రాక్షసు డేమిటి! నగరవాసులనందర్నీ మింగబోవడమేమిటి? ఆనరపతి, రాక్షసితో చేసుకున్న ఈ ఏర్పాటేమి! ఎంతచూసినా ఆశ్చర్యంగానేవుంది! నేనా రాక్షసి కాహారమైనప్పటికీ—తాత్కాలికంగా నావల్ల ఒకరు రక్షించబడ్డారు. అతని ఆత్మీయు లపరిమితానందము ననుభవించారు. ఇదికదా, ఒక మానవుడింకొక మానవుడికి చెయ్యవలసిన వుపకారము. ఒకవేళ ఆ రాక్షసితో పోరి, నేను బ్రతుకుతానా, తిరిగి మరికొన్ని జీవుల్ని బ్రతికించి, వార్ని సంతోషపెట్టవచ్చు."

అని విజయకుమారు తనలో తాననుకొంటూ, నగరవాసులు చెప్పిన గుర్తుల ననుసరించి వెళ్లాడు. కాళికాలయమునకు వెనుక తట్టున వేపచెట్టుంది. విజయకుమారు ఆ చెట్టును సమీపించేటప్పటికి ఒక భయంకరశబ్దం కావడము—ఆశబ్దంతోనే ఒక ఘోరాకారుడు చెట్టుపైనుంచి కిందికి దూకడము—

"ఆ! నా బిడ్డ లేనాడో నాకు మంచి ఆహారమును పంపారు—హుం—" అంటూ విజయకుమారుపై కురకబోవడము—విజయకుమారు జారిక. తక్షణం ఒరనుంచి కత్తినిదూసి, ఆఘోరాకారుని హస్తమును మొదలంట ఒక్క వేటుతో ఖండించి, రెండవ చేతిని ఖండించడానికి కరవాలము నెత్తగా—

"అమ్మో! చచ్చాను—బిడ్డలారా! రండర్రోండి!" అని విలపిస్తూ రాక్షసి కింద పడగానే, దాని సంతానం, దాని రూపాలతోనే వున్న వారొక పదము దివచ్చి, విజయకుమారుని పాదాలమీదపడి—

"విజయకుమారా! క్షమించు! మాతల్లిని వొదిలిపెట్టు—నీప్రతాపం తెలియక నిన్ను మోసగించబోయి, మేమే మోసగించబడ్డాము—"

అని వారు ప్రార్థించగా, విజయకుమారు తెల్లబోయి, ఎత్తిన కరవాలమును దించి—

"ఏమన్నారూ? నన్ను మోసగించబోయి—మీరే మోసగించబడ్డారా? అదెట్లా—"

అని విజయకుమారడగ్గా—చెయ్యి తెగి, కిందపడిపోయిన రాక్షసి మెల్లిగా లేచి—

"మహాప్రభూ! క్షమించు. వీరందరూ నాబిడ్డలు కామరూపులై నీమార్గాని కడ్డుతగిలారు. నగరవాసుల్లాగా నటించి నిన్ను మోసగించి నా కాహారంగా పంపారు. వారు చెప్పిన కథంతా వొట్టిది. నేను నరమాంసమును తప్ప, యింకదేనినీ భక్షింపను. నాబిడ్డలదేవిధంగా నా కాహారాన్వేషణానికి బయలుదేరి, తిరిగి తిరిగి, యెక్కడన్నా నరుడు కనుపిస్తే, ఏదోవిధంగా మాయ చేసి, వారిని నాదగ్గరికి పంపుతూ వుంటారు—నేను కడుపునింపుకుంటూ వుంటాను. అదే ప్రకారం మీనాడు నువ్వు లభ్యం కాగా, నీ ప్రతాపం తెలుసుకోలేక—మోసపోయారు. నాకడుపాకలి దీర్చబోయి—చెయ్యినిపోగొట్టారు. ఇదీ వాళ్ళ అవివేకం." అని చెప్పింది.

"అయితే—నాకా అడవిలో కనుపించిన వృద్ధురాలు—నగరవాసులూ—ఆయువకుడు, అందరూ బిడ్డలన్నమాట—నగరవాసుల్లాగా నన్ను భ్రమింపజేశారన్నమాట! ఎంత మోసము! ఇక నిన్ను క్షమించకూడదు—నిన్నూ నీపిల్లల్నీ, ఒక్క దెబ్బతో నా కరవాలనికిప్పుడే బలియిచ్చి, ఇకముందయినా, మీవల్ల మార్గస్థుల కెటువంటి మోసం జరక్కుండా చేస్తాను."

అంటూ విజయకుమారు తిరిగి కత్తినెత్తి నరుకబోగా, అందరూ అతని పాదాలమీదపడి, ప్రాణభిక్ష పెట్టవలసిందని అనేక విధాల బ్రతిమాలడంచేత, విజయకుమారుకు కనికారం కలిగింది.

"ఆ అందర్నీ రక్షిస్తాను—కాని మీరిక ఈ ప్రాంతంలో వుండకూడదు—నరుల నిలాహింసలు పెట్టకూడదు. ఏం?"

అని విజయకుమారు హెచ్చరించినమీదట, తల్లిరాక్షసి పరమానంద భరితురాలై—

"రాజకుమారా! నువ్వు చెప్పినట్లు చేస్తాను. అంతేగాక నాకు

సజీవనరమాంసం దొరకడంకూడా చాలా కష్టంగావుంది. కనుక ఇక అటువంటి ఆహారమును మానుకుంటాను.'' అనగా—

''మరి నువ్వెలా బ్రతుకుతావు?'' అని విజయకుమారు డడిగాడు.

''ప్రాణభిక్ష పెట్టినవాడవు—నువ్వే నాకాహారసమస్యను కూడా పరిష్కారం చెయ్యవలసివుంది.'' అన్నదా రాక్షసి.

''సంతోష —అయితే నేను చెప్పినట్లు చెయ్యి—పరిపక్వ ఫలాలను—దుంపలను—ఆకుకూరలను నువ్వెప్పుడయినా తిన్నావా?''

అని విజయకుమారుడనగా, తల్లి రాక్షసేగాకుండా—దాని సంతానంకూడా విరగబడి వికటంగా నవ్వడం మొదలుపెట్టారు.

''ఎందుకలా నవ్వుతారు?''

అని విజయకుమారు ఆశ్చర్యంగా అడిగాడు.

''కాయలు ఆకులు—పశువులు తింటాయిగాని—మేము తింటామా?''

అని తల్లిరాక్షసి అంది.

''అంతవరకే మీకు తెలిసింది! నామీద విశ్వాసముంటే— ఈ అడవిలో సమృద్ధిగావున్న కొన్ని పళ్లు కోసురండి—దుంపలు తీసుకురండి—నా ఎదురుగా తినిచూడండి—అవి ఎంత తియ్యగా వుంటాయో—ఎంత రుచిగావుంటాయో మీకే తెలుస్తుంది?''

అని అతడు చెప్పగానే రాక్షసి సంతానంలో కొందరుపోయి ఆ చేరువులోవున్న కొన్ని సపోటాలు-దోసలు-గుమ్మడి- మొదలయిన వాటిని కోసుకొచ్చారు.

''నేను తింటాను—మీరుకూడా తినండి.''

అని విజయకుమారు తాను తినడం మొదలుపెట్టగానే—రాక్షసులు కూడా రుచిచూశారు.

''అచ్ఛా! అచ్ఛా! చాలా బావున్నాయమ్మా—ఎంతో తియ్యగా వున్నాయి—ఛీ! నరమాంసం—ఏం బావుండదు మేమిప్పుడూ యివే తింటాం. నువ్వుకూడా యివే తినమ్మా!''

అని ఒకరి నొకరు హెచ్చరించుకున్నారు.

''మీరందరూ ఏనాడో మహాపాపం చెయ్యబట్టి, ఇప్పుడిలా రాక్షసులుగా పుట్టారు. లేకుంటే, మాలాగ నరులుగానే పుట్టేవారు.

హింసచెయ్యడం మహానేరం! మాంసభక్షణ మాని—ఇటువంటి మధురాహారం ఇంతటినుంచి మీరు తీసుకోవడం మొదలుపెట్టారంటే—మీకు బుద్ధి పెరుగుతుంది—బలం హెచ్చుతుంది—హింసచెయ్యా నవసరం లేనందువల్ల, పుణ్యంకూడా సంపాదించగలుగుతారు! ఆడినమాట తప్పవద్దు. ఇష్టంలేకపోతే, యిప్పుడే చెప్పండి."

అని విజయకుమారు వాళ్ళని తిరిగి హెచ్చరించగా—

"అయ్యయ్యో! ఎంతమాట ప్రభూ! నాకు ప్రాణభిక్ష పెట్టిందే గాక, మాహితవుకోరి చెప్పిందాన్ని కాదంటామా? అంతేగాక, యిటువంటి ఆహార మిదివరకు రుచిచూచింది లేము కనుక, పనికిరాదను కున్నాము, ఇప్పుడిదే మాకు చాలాబాగుంది—ఆకలితో బాధపడ వలసిన అవసరంలేనంత సమృద్ధిగా దొరుకుతుంది. నాబిడ్డలు సాక్షిగా చెబుతున్నాను. ఇది లగాయితు, మేమిక నరమాంసమును ముట్టము—ఇటువంటి సాత్వికాహారమునే తింటాము."

అని రాక్షసి పెద్ద ప్రమాణపూర్వకంగా చెప్పినమీదట విజయకుమారు తృప్తిపడ్డాడు.

ఔరా! నరమాంస భక్షకులైన రాక్షసులకు అహింసా సిద్ధాంతమును బోధించి, అపక్వాహారదీక్షను మప్పిన విజయకుమారుని ప్రజ్ఞావిశేషాలను మనమేమిగా పొగుడుకోవాలి? అతని కశేయమైన కార్యమేముంటుంది.

అనంతరమా తల్లి రాక్షసి, అతనిదగ్గర శెలవుతీసుకుంటూ—

"విజయకుమారా! నువ్వు నన్నీవిధంగా క్షమించక పోయినట్లయితే, నాబిడ్డలు తల్లి లేనివాళ్ళయ్యేవారు. మాకింత ఉపకారం చేసిన నువ్వెవరివి? ఇలా నిర్మానుష్యమైన అడవులగుండా యెక్కడికి పోతున్నావు? నీ వివరాలు చెబితే, నాకు చేతనయిన సాయం చెయ్యగలను."

అని చెప్పగా, విజయకుమారు, తనగాధ నంతటినీ తల్లి రాక్షసికి క్లుప్తంగా వివరించి—తానిప్పుడు వాలనగరము పోతున్నట్లును, ఆదారి తెలియక కొట్టు మిట్టాడుతున్నట్లు విశదీకరించినమీదట—

"ఆహా! రాజకుమారా! నువ్వెంతి పుణ్యాత్ముడవు? నువ్వు మాకేగాక, లోకానికే మేలుజరుపుతున్న త్యాగమూర్తివన్నమాట? వాలనగరమార్గం నాకుతెలుసును—ఆపట్న మిక్కడికి తూర్పుగా నూరున్నర యోజనముల దూరంలోవుంది. అక్కడికి నువ్వుపోలేవు.

ఒక పాతాళ సొరంగమార్గముదాటి, ఆపైన ఏబదియోజనాలు, కంటకావృతము, మహాభయంకరము, క్రూరమృగ నివాసము అయిన ఒక మహారణ్యమునుదాటి, అక్కడి కొండజాతులను జయించినగాని, వాలనగరము పోశక్యముకాదు. ఇక్కడనుంచి ఒక ఏబది యోజనములు గడచిన వెంటనే, నేను చెప్పిన పాతాళ సొరంగ మార్గము రాగలదు. ఆ సొరంగము పొడుగునా, నాగపాములు, మండ్రగబ్బలు—మొదలయిన విషజంతువులు నివాసమేర్పరచుకొని వుంటవి—నరవాసన వాటికి సోకినవెంబడే మీాదపడిపోతవి. ఆసొరంగ ద్వారమును కనిపెట్టుకుని, ఒక భయంకర రాక్షసివుంటుంది. అది నాకు అక్కగారు. నేనిప్పుడు నీకొక అంజనమునిస్తాను. నువ్వా అంజనమును ధరించిపోయినయెడల, నా అక్కగారికి నువ్వు నా మిత్రుడవని తెలుస్తుంది. నిన్నామె ఆపాతాళ సొరంగమార్గమును నిరపాయముగా దాటించగలదు. అంతేగాక, నువ్వీ అంజనమును ధరించిన కారణంవల్ల, ముళ్లు గుచ్చుకోవు—క్రూరమృగముల భయముండదు.''

అనిచెప్పి, ఆ తల్లిరాక్షసి, తనసిగలోనుంచి ఒకచిన్న డబ్బీని, తీసి, అందులోని అంజనమును తానే స్వయంగా విజయకుమారుని కళ్ళకుపెట్టి—

''ఈ యంజనము నీకు మార్గాయాసముకూడా కలగనివ్వదు—నీకు నేను చెయ్యగల ప్రత్యుపకార మింతమాత్రము—ఇక శెలవు.''

అని రాక్షసి తన బిడ్డలతో ఆతావును వొదిలి వెళ్ళిపోయింది. విజయకుమారు డా రాక్షసిచేసినదే అప్పటికి మహోపకారమని సంతసించి, అది సూచించిన మార్గము ననుసరించి ముందుకు సాగిపోయాడు.

## ౨౨

విజయకుమారు ధరించిన అంజనంలో అతను ఊహించనంతటి మహాత్తు కనుపించింది. అడవులో ముళ్లపొదలు, డొంకలు, క్రూరమృగసంచారం—అన్నీ కనిపిస్తూనే వున్నాయి. కాని ఒక్కదానివల్ల అతనికి హాని కలగడంలేదు. క్రూరమృగాలు సయితం భయంకరాట్టహాసాలు చేసుకుంటూ దగ్గిరిగా రావడము—ప్రక్కనుంచి తొలగి

పోవడము! ఒళ్లు బెరడులా మహా తేలికపడింది. తానంతదూరమూ గాలిలో యెగురుతున్నాడా అనిపించింది. నడిచిన శ్రమ కనుపించదు దూరమనిపించదు.

రెక్కలు కట్టుకుని వాలినట్లుగా ఏభై దియోజనాల దూరమునూ అవలీలగా గడిచి, రాక్షసి చెప్పిన సొరంగమార్గ ముఖద్వారమును చేరాడు. అడుగుల చప్పుడు విన్నదో—లేక నరవాసన పసిగట్టిందో—వెంటనే ఒక భయంకర రాక్షసి, నిశుడకోరలతో—బెదరు చూపులతో భీకరాట్టహాసాలు చేసుకుంటూ, ఆసొరంగనుంచి యివతలికొచ్చి—

"ఎంతకాలానికి దొరికిందిరా నరమాంసం!" అంటూ విజయకుమారుమీదపడబోయి, వెంటనే వెనక్కుతగ్గి, అతని కళ్ళవైపు పరిశీలనగా చూచి—

"అరరే! పొరబడ్డాను. క్షమించు నాయనా! నువ్వు మాచెల్లికి ప్రాణమిత్రుడవగుటవల్ల నాకున్నూ ప్రాణమిత్రుడవే—అతల్లీ పిల్లలూ ఏవుపద్రవమూలేక సుఖులై వున్నారుగదా!"

అని సాదరంగా నడిగిన రాక్షసికి—

"ఆహా అందరూ సుఖులైవున్నారు. అంతేగాక మరొక విశేషమేమంటే—మీచెల్లెలూ, పిల్లలందరు మాంసభక్షణ మానేశారు." అన్నాడు విజయకుమారు.

"అయ్యయ్యో! అయితే వాళ్లెలా బ్రతుకుతున్నారు? అక్కడ నరమాంసం కరువైందా? లేక, వాళ్లకి పిచ్చిపట్టిందా?"

"రెండూకాదు. అంతకంటే మంచి ఆహారమును కనిపెట్టారు. దానివల్ల, మునుపటికంటే యెక్కువ బలంగాను, ఎక్కువ ఆరోగ్యంగానూ వుంటున్నారు."

"అలాగా నాయనా! అదేమిటో నాక్కూడా చెప్పి, పుణ్యం గట్టుకోరాదా?"

"నన్నిప్పుడు, మీచెల్లెలు అందుకే ముఖ్యంగా యిక్కడికి పంపించింది. వారు కనిపెట్టిన ఆహారమేమిటంటే, పళ్లు, కాయలు, దుంపలు, ఆకులూ—ఇవి అక్కడిలాగే యీ అడివిలోకూడా సమృద్ధిగా వున్నాయి."

"అవునవును, ఉన్నాయి. అవి రాక్షసులం తింటామా?"

"లక్షణంగా తినొచ్చు. ఇంతకాలమూ, వాటిల్లో వుండే విలువ తెలీక—అనారోగ్యకరమైన నరమాంసాని కలవాటుపడ్డారు. మీ చెల్లెలు మహాకష్టపడి, వాటిల్లోవుండే శక్తిని కనిపెట్టింది. ఇకనుంచి నిన్నుకూడా వాటినే తినవలసిందని మరీ మరీ చెప్పి పంపింది మీ చెల్లెలు."

"అవునవును. మా చెల్లికి నేనంటే మహాప్రేమ."

అని ఆరాక్షసి గెంతుకుంటూపోయి, ఆప్రాంతాల్లోగల చెట్ల కాయలు—పళ్లు—దుంపలు, ఆకులూ కొన్ని మోసుకొచ్చి, తినడం ప్రారంభించింది.

"నరమాంసంకంటే, యివి చాలా తియ్యగావున్నాయే!"

"వుండవా మరి? అందుకే మీ చెల్లెలు వీటిని తింటూ ఇప్పుడు చాలా బావుంది."

"దాని పిల్లలో."

"పిల్లలు అంతకంటే బావున్నారు."

"నేనిక నరమాంసం ముట్టుకొనే ముట్టుకోను."

"నరమాంసమే గాదు—ఇంకేమాంసమూ ముట్టుకోకూడదు."

"ఇతర మాంసాలు అంతకుముందే ముట్టుకొనేది లేదు." అంటూ ఆరాక్షసి, తెచ్చినవాటిలో సగం తినడం పూర్తిచేసి 'బేవ్' అని ఒక తేనుపు తేన్చి—

"కడుపు నిండిపోయింది—ఇకతిన్లేను. అయితే నువ్వెవరు? యిలా యెక్కడికి కెడదామని?"

"వచ్చిన ముఖ్యమైనపని, నీతో యీ ఆహార విషయం చెప్ప డమే—అది అయిపోయింది. ఈపాతాళ సొరంగాని కవతల, వాల నగరముందికదూ, అక్కడి కోసారి పోయిరావాలని."

"ఓ! దానికేముంది? నాతోరా—కాని, అక్కడ భయంకర మైన పాములు, మండ్రగబ్బలూ వుంటాయి, వాటిని చూసి భయ పడకు—అవి నిన్నేమీ చెయ్యలేవు. ఇదిగో ఈ చెప్పులు మాత్రం తొడుక్కో—"

అంటూ, ఆమె, అదోమాదిరి వేరుతో తయారు చెయ్యబడిన ఒక చెప్పుల జతను పట్టుకొచ్చి అతని కిచ్చింది. అతను వాటిని ధరించి ఆమె వెనువెంటనే వెళ్లాడు. కొంతదూరం మెట్లుగావుం—మరికొంత

దూరం మామూలుగావుంది. అంతవరకూ ఆ ప్రదేశమంతా అంధకారబంధురమైవుంది. పాములూ లేవు—ఏమిలేవు. అది కొద్దిపాటి దూరమే—అది దాటాక, పట్టపగలుకంటే, ఎక్కువ ప్రకాశవంతమై వెలిగిపోతున్న మార్గమొచ్చింది. ఆవెలుతురులో, రెండుబారలకు పైగా పొడుగును కలిగిన విషసర్పాలు లెక్కలేనన్ని పడగలు విప్పుకుని, ఆడుతున్నాయి.

"ఈవెలుతురంతా యేమిటో తెలుసునా?"

అని విజయకుమారుని తీసుకెడుతున్న రాక్షసి అడగ్గా, తెలియదని అతడు బదులు చెప్పాడు.

"ఈ వెలుతురంతా, ఆ సర్పరాజుల శిరస్సులపైగల మాణిక్యాలది—"

సర్పాల శిరస్సులపై మణులుంటాయనీ, అవి అధికప్రకాశవంతంగా వుంటాయనీ, విజయకుమారు కంతకుముందే తెలుసు. కాని అవి అంధకారాన్ని పట్టపగలు చెయ్యగలిగి సూర్యకాంతిని మరిపిస్తాయని, అతడనుకోలేదు. రాక్షసి చెప్పినమీాదట మరింత అబ్బురపడి.

"మన కొక మణి దొరుకుతుందా?" అని నడిగాడు.

"కావాలా?"

అంటూ ఆరాక్షసి, తిమ్ముచూచి, పక్కపక్కలకు పారిపోతున్న ఒక సర్పాన్ని పట్టుకుంది. ఆమె దానిని ఏంచేసిందో విజయకుమారుకు తెలియదుగాని, రాక్షసి ఒక మణిని అతని చేతుల్లో పెట్టింది. దానికాంతి కతని కళ్లు రెట్టుకోలేకపోయి. అత డామణిని వెంటనే ఒక గుడ్డకుచుట్టి భద్రపరుచుకున్నాడు. తిరిగి రాక్షసి వెంబడి ముందుకు నడవడం మొదలుపెట్టాడు. ఆపొరంగ మార్గం పొడుగునా వున్న భయంకర సర్పాలుగాని, మండ్రగబ్బలుగాని, విజయకుమారుని ఏమీా చెయ్యకపోగా, అతను రాక్షసితో అల్లంతదూరాన వుండగానే, ఆ విషజంతువులు, పక్కపక్కలకు పారిపోవడము—అందుకు వ్యవధిలేకపోతే తలలు ముడుచుకుని పడుకోవడము. ఆవశీకరణమంతా తన కీయబడిన చెప్పులలోవుందని ఊహించుకుని రాక్షసి నడిగాడు—

"నువ్వుకూడా లేకపోయినప్పటికీ, నువ్విచ్చిన ఈచెప్పులు ధరించి, నేను నిరపాయకంగా, యీా మార్గమును దాటి పోగలుగుదునా?"

"ఓ! ఇప్పటిలాగే పోవచ్చు. మా చెల్లికి మిత్రుడవుగదా అని, సావాసంగా వొస్తున్నానంతే."

అని చెప్పి, రాక్షసి క్రమంగా అతనిని ఆసారంగ మార్గము నంతటినీ దాటించి—

"ఇక నువ్వు పోవచ్చు—మార్గంలో కొండజాతి మనుషు లుంటారు జాగ్రత్త! వార్ని దాటావంటే-వాలనగరం చేరుకున్నట్లే."

అని హెచ్చరించి, అతని దగ్గర శెలవుతీసుకుని, రాక్షసి వెనక్కి మళ్ళింది. విజయకుమారు ముందుకు సాగాడు. దూరం ఎక్కువగా వున్నప్పటికీ, అక్కడనుంచి ప్రయాణ మెనికి కష్టంగానేవుంది. శరీరంలో తేలికదనం పోయింది—నడిచినకొద్దీ బడలిక యెక్కువకావడం మొదలుపెట్టింది. దానినిబట్టి, ఆరాక్షసి పెట్టిన అంజనబలం అంత వరకే వుందనీ—ఆపైన దానిశక్తి హరించిపోయివుంటుందనీ అత నూహించుకున్నాడు. ఏమయినా జరుగవలసిన ప్రయాణం తప్పదు కదా! కలిగిన బడలికను గమనించకుండా, ఉత్సాహమును తెచ్చు కుని, ప్రయాసమీద, మరికొంతకాలానికి కొండజాతులుండే అడవి మార్గం చేరాడు.

రాక్షసు లిద్దరూకూడా, ఆ మార్గమును గురించి, అతనిని హెచ్చరించివున్నారు. తదనుగుణంగా ఎక్కడినుంచో హఠాత్తుగా ఒక యీటెపోటొచ్చి అతని శిరస్సుకు తగిలింది. అమ్మయ్యా—అని శిరస్సు నొక్కసారి చేత్తో పట్టుకొని, ఆ బాధ తగ్గినతరువాత, తిరిగి తలను పైకెత్తి చూశాడు. మరొక పోటొచ్చి, చంపను దూసుకు పోయింది. అది ప్రమాదకరమైన మార్గమేననీ—దానిని దాటడం కష్టమేననీ అనుకుని-వెంటనే ఒక చెట్టుమాటున నక్కి నిలుచున్నాడు. ఈటెపోటులు తిరిగివచ్చాయిగాని, చెట్టు అతనికడ్డంగా వుండడంవల్ల, ఈటెలు అతన్ని తాకకుండా, ఆ చెట్టుకు తగిలి పడిపోయినాయి. తిరిగి యీటెలుపడలేదు.

విజయకుమారు తలెత్తి నాలుగువైపులా పరిశీలించి చూశాడు. అది చుట్టూ కొండలుకలిగి, మధ్య అరణ్యప్రదేశంగలతావని తెలి సింది, కొండలమీదినుంచే అతనిపై ఈటెలు పడ్డట్లుకూడా అర్థ మయింది. దైవవశాత్తూ చెట్టుమాటొకటి లభ్యమైందిగాని లేకుంటే ఈటెలవర్షంతో అతని శిరస్సీపాటికే భిన్నభిన్నాలుగా అయ్యేది.

అయితే ఎంతసేపనీ ఆ చెట్టుమాటున దాగివుండడం? కొండజాతుల వార్ని తప్పించుకోవడమెలాగు? అతని కేమీ అర్థంకావడంలేదు. ఎదుటపడి పోరడ్డానికి మనుషులయినా కనిపిస్తే బలాబలాలు, శౌర్యాశౌర్యాలూ కనుపించేవి కాని—ఎవరూ కనుపించరు—ఏంచెయ్యాలి?

అదేవిధంగా అత నా చెట్టుమాటున మరికొంతసేపు దాగివున్నాడు. ఇంతలో కొండలపైనుంచి ఎవరో కొందరు దిగుతుండడం విజయకుమారు చూశాడు. మొదట, వారు తనకోసమే వస్తున్నారని అనుమానించాడు. కాని, అది కాదు. వారొక స్త్రీని జుట్టుపట్టుకుని కింది కీడ్చుకొస్తుంటే—ఆమె, తా నేపాపమూ యెరుగనని మొరపెట్టుకుంటూంది. వా రామె మొరల నాలకించకుండా, కొండలుదింపి,అరణ్యమధ్యప్రదేశానికి తీసుకొచ్చారు. అక్కడ, మరోచెట్టుకింద ఏదో రాతి విగ్రహ మొకటుంటే—ఆస్త్రీని విగ్రహాని కెదురుగా నిలిపి—

"ఏడిచి లాభంలేదు—నీపాపానికి ప్రాణం బలికాక మీయాల్సిందే—"

అని అందులో ఒకడు కత్తినెత్తి ఆస్త్రీ కంఠంబును నరకడానికి తయారుగావున్నాడు. చెట్టుమాటునుంచి విజయకుమారు ఇదంతా చూస్తున్నాడు.

"కాళీ! మహాతల్లీ! నీపాదాలుసాక్షిగా నే నేపాపమూ ఎరగను గదా! నిండుచూలుతో వున్న నన్నీవిధంగా నీయెదుట నరకడం, నువ్వెలా సహిస్తావమ్మా?"

అని ఆస్త్రీ, కంటతడిపెట్టుకుంటూ, అమ్మవార్ని ప్రార్థిస్తుండడంకూడా విజయకుమారు గమనించాడు. ఆ స్త్రీకూడా ఆ కొండజాతికి సంబంధించినట్లుగానే కనిపిస్తూంది. ఆమె ప్రార్థనపూర్తి అయిన వెంటనే, ఎత్తబడిన కత్తి ఆమె కంఠమును తెగనరకడానికి సిద్ధంగా వున్న సమయంలో, విజయకుమారు జాగుచెయ్యక, ఒరనుంచి కరవాలమును లాగి, రెండురకలలో ఆతావునుచేరి, ఎత్తినకత్తితో స్త్రీ కంఠాన్ని నరుకబోయేవాడి చేతిని ఒక్కవ్రేటుతో తెగనరికాడు తమవా డావిధంగా ఒకకొత్తమనిషిచే ఖండించబడి, నేలగూలడమును గమనించిన మిగిలిన కొండవారు, ఒక్కగుంపుగావచ్చి విజయకుమారు మీదపడ్డారు—కత్తులతోను, ఈటెలతోనూ తన మీదికొచ్చిన వార్ని లెఖ్కచెయ్యకుండా విజయకుమారు, తన ఖడ్గచాతుర్యమును

కనపరచి, ఒక్కొక్కరి నొక్కొక్క వ్రేటుకు నేలబడగొడుతున్నాడు. రాజకుమారుని ధాటికి తాళలేక బ్రతికినవారు, చచ్చినవారిని చూచి బెదిరిపోయారు. వారిలో ఒకడు నోటితో ఈలను వూదడమే తడువుగా, కొండలపై నుంచి కొత్తవారు కొండయీగినట్లు గుంపులు గుంపులుగా దిగిపోయారు. వెనుకముందు లాలోచించక, విషయమును తెలుసుకోక, విజయకుమారుపై విఝృంభించారు. తన రక్షణకై అవతరించిన ఆనూతన పురుషు డెవరో, తనవారి చేతుల్లో పడి నిష్కారణంగా చావనున్నందు కామెవిచారపడుతూ, తీసిపోని పరాక్రమంతో గుంపుల నెదుర్కొంటున్న వానిని విస్ఫారంగా తిలకిస్తూంది.

క్షణంలో ఆస్థల మొక భయంకర రణరంగంగా మారింది. తనపై విసరబడుతున్న యీటెదెబ్బలను కాసుకుంటూ—కత్తిపోటుల కందక, విజయకుమారు ఎక్కడచూచిన తానై ఒక్కవ్రేటు కొక్క గుంపును పడగొడుతూ——శత్రుజనాలకు భీభత్స కలిగించాడు. అతడు మధ్యందివమార్తాండుడో——అవతరించిన అర్జునుడో—అని అసమాన పరాక్రమంచూచి కొండజాతులవారు డిల్లపోతున్నారు. మూడువంతులకు పైగా తమవారు హతులుకావడమును గమనించినవారి దొర పోరు నాపవలసిందని తనవారికి సాంజ్ఞ చేసి, తాను వెంటనేవచ్చి, విజయకుమారు పాదాలమీదపడి——

"దొరా! నీపరాక్రమం తెలిసిందిగాదు——మామూలు మనిషి వనుకున్నాంగాని, అవతారపురుషుడ వనుకోలేదు. అపరాధం క్షమించు." అని వేడుకున్నాడు.

"మంచిది-ఇప్పటికైనా వివేకం తెచ్చుకున్నందుకు సంతోషం."

అని విజయకుమారు, తన పాదాలమీదవున్న వానిని లేవదీశాడు.

"దేవరా! తమ రే దేశానికి ప్రభువులు? మా కొండదేశానికి రావలసిన పనేమొచ్చింది? తమ వివరాలు శలవియ్యవలసింది."

అని ఆజాతి నాయకు డడిగినదానికి——

"దొరా! నేను నాగపుర యువరాజును. మాతండ్రిగారి పేరు ఛత్రపాలుడు. ఒక అవసరమైన పనిమీద, వాలనగరం పోతూ, మార్గంలో యీవిధంగా మిమ్మల్ని కలుసుకోవలసివచ్చింది."

"అన్నీ తెలిసిన మహాప్రభువులే—మేము మీకే మపకారం చేశామని, మాతో యుద్ధం చేశారు?"

"మీరు నాకే మపకారం చెయ్యలేదు—చెయ్యలేరుకూడా. కాని, నిండు చూలాలుగావున్న ఆస్త్రీ నెవరో వధిస్తుంటే చూచి సహించలేకపోయాను. అందుకని యెదిరించాను."

అని, విజయకుమారు, జరిగిన యదార్థమును చెప్పాడు.

"బాబయ్యా! ఆస్త్రీ యెవరో కాదు—నాభార్య! అది చేసిన తప్పు తెలుసుకుంటే—మీరే దాన్ని చిత్రవధ చెయ్యమంటారు."

"తప్పులు చెయ్యనివారుండరు—తప్పులు క్షమించడంలో వున్న ఘనత, శిక్షించడంలో వుండదు. అందులోనూ—స్త్రీ చూలాలుగదా!"

"ప్రభూ! మరోతప్పు—మరోతప్పు అయితే ఎలాగయినా కడుపులో పెట్టుకుందును. కానిపని చేసింది. కులాని కపకీర్తి తెచ్చే పని చేసింది. ఈకొండ ప్రాంతానికి నేను రాజును. నాపెళ్లా మటువంటి పనిచేస్తే, ననెలా సహించుకుంటాను? మారు మగనికి కడుపుతెచ్చుకున్న కులటను, మీజాతిలో క్షమిస్తారండీ?"

అని, తనకు భర్తఅయిన కొండరాజు, విజయకుమారునితో చెబుతుండగా ఆస్త్రీవచ్చి, విజయకుమారుని పాదాలుపట్టుకుని,

"దేవరా! నాకు ప్రాణదానంచేసిన దాతవి—నీపాదాలంటి అబద్ధం చెప్పను—నే నేపాపమూ యెరుగనిదాన్ని."

అని, వలవల యేడ్చింది.

"అయ్యా! కొండకిరా—కులస్థుల నందర్నీ అడుగు—నిజం నీకే తెలుస్తుంది." అని కొండనాయకుడు తిరిగి అనగా—

"సూర్యదేవుడి సాక్షి దేవరా—అంతా నాసవితిచేసింది—కిట్టక పన్నిన పన్నాగం!"

అని ఆస్త్రీ తిరిగి మొరపెట్టుకుంది.

"నీకిద్దరు భార్యలున్నారా?"

అని, విజయకుమారా కొండనాయకుణ్ణి ఆశ్చర్యంగా అడిగాడు.

"మాపేటకుతా దొరా! నీకన్నివివరాలూ తెలుస్తాయి."

అని చెప్పి, కొండనాయకుడు విజయకుమారుని, తన పరివారంతో వెంట తీసుకెళ్లాడు. తనపాలిట భగవంతుడిలా అవతరించిన ఆకొత్తమనిషి మూలాన, తనయొక్క, తన సవతియొక్క సత్యా

సత్యాలు బయటపడతాయన్న ఆశతో, నాయకుడి భార్య ఉత్సాహంగా వారి ననుసరించింది.

కొండరాజు విజయకుమారుని కొండపై గల తమ పేటకు తీసుకెళ్లి, ఉచితమైన మర్యాదలు చేసి, తేనెలో ముంచిన మధుర ఫలాలను, పాలను, ఆరగింపజేసి, తనకులస్థుల నందర్నీ సమావేశపరచి, వారందర సమక్షంలోనూ తన కుటుంబగాథ నీవిధంగా చెప్పడం మొదలు పెట్టాడు—

"ఈప్రజలందరూ నాకులస్థులు—నే నీప్రాంతానికి రాజును, నాకిద్దరు భార్యలు. అయితే నే నాయిద్దర్నీ ఒకేసారి పెళ్ళి చేసుకోలేదు. మొదట శబర్ని కట్టుకున్నాను. దానితో ఐదేళ్లు కాపరం చేశాక, కాదంబని కట్టుకోవాల్సి వచ్చింది. అదెలాగంటే—

నే నొకనాడు నేస్తగాళ్లతో కలిసి, పందులవేటకి అడివికెళ్లా. పందుల్ని వేటాడ్డమంటే నాకు మామంచిసరదా. ఒక్కొక్క పంది ఏనుగంతకూడా వుంటుంది. దాని కొమ్ములు మహావాడిగావుండి, పదిమంది నొకసారి పొడిచి చంపగలవు. అడివిపందులు అన్ని అడువులోనూ వుండవు, ఇక్కడికో నాలుగామడలదూరంలో దేవదారడివి వుంది. మేం, పందులు వేటకెప్పుడెళ్ళినా ఆ అడివిలోకే వెడతాం. పొద్దంతా వేటాడినా, ఒక్కపందికూడా గిట్టలే దావేళ. విసిగి—ఇక వేట చాలించుకుని పేటకి పోదామనుకుంటుంటే—సందెచీకటి సమయాన ఓపంది కనపడింది. నలుగురం నాలుగువేపులా కాశాం. అప్పుడాపంది నోటితో మరోజంతువును దేన్నో కరుచుకొస్తూందనుకున్నాం. ఒక్కదెబ్బకి రెండుజీవాలు దొరుకుతాయన్న సంబరంతో—నేను గురితప్పనియ్యకుండా ఈటెవొదిలా—ఒక్కయీటితోనే అది నేలబడింది. వెంటనే పదిమందిమీ మూగి చూస్తిమిగదా, దొరా! నువ్వు నమ్ముతావో లేదో—పందినోట కరుచుకొచ్చిం దేజంతువూ గాదు. అందమైన ఆడకూతురు. ఆశ్చర్యపోయాం! నా నేస్తగాళ్లు పడిపోయిన పందిని గొడ్డళ్ళతో కొట్టి చంపుతుంటే—నేను కిందపడిపోయున్న స్త్రీని కదిలించి చూశాను. బతికుంది! కాని తెలివిలేదు. మాతో ఆనపబుర్రలో తెచ్చుకున్న చన్నీళ్ళ నా ఆడదాని ముఖాన కొట్టి—తెలివొచ్చేలా చేశా. అది మాజాతి కూతురవడంవల్ల, భయం పోగొట్టి—

"నువ్వెవరి దానివి? పందినోట్లో పడ్డావెందుకు?"

అని నే నడగ్గా, అది బితుకుచూపుల్తో నన్నుచూసి—

"నేను బదికానా మాఁవా! పందినోట్లోంచి నువ్వేనా నన్ను కాపాడింది?" అని అడిగింది.

"అవును—అదిగో—నిన్ను కరుచుకొచ్చిన పందిని చంపేశా."

అని నేను చచ్చిన పంది నాపడుచుకు చూపా. చూసి, ఆ పడుచు సంతోషంతో లేచి కూచుంది.

"నువెక్కడిదాని వేంటి? నీపేరు?"

అని నే నా అంతగ త్తినడిగా.

"నాపేరా? కాదంబి—మాది తెల్లకొండకోన. అమ్మ, అబ్బ, లేరు. అన్న భీమన్న మాత్రమున్నాడు, అడవుల్లో మూలిక లేరుకుని-వాలనగరంపోయి అమ్ముకుంటాడు."

అని కాదంబి చెప్పిన వివరాల్ని, కొండరాజు చెబుతుండగా వాలనగరం పేరు వినగానే విజయకుమారు—

వాలనగర మిక్కడికి దగ్గిరలోనేవుందా?" అని అడిగాడు.

"మాకొండకి, దేవదారడివి నాలుగామడల దూరమని చెప్పా, ఆ దేవదారడివికి తెల్లకొండకోన, ఇరవై ఆమడలు. తెల్లకొండకోన కీవాల పట్నానికీ అయిదామడలుంటుంది."

"అయితే, వాలనగరమన్న దిక్కడికి సుమారుప్పయ్యామడ లుంటుందన్నమాట?—సరే—తరవాత ఏమయింది?"

అని విజయకుమారు డడిగినదానికా కొండనాయకుడు తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు—

"కాదంబి, తనది తెల్లకొండకోన అనీ, అన్న భీమన్న తప్ప, తప్ప కింకెవరూ లేరనీ—మళ్ళీ యిలా చెప్పింది.

"ఈదినం పొద్దు పొడవగానే, చద్దితిని, అన్నా నేనూ, మూలిక లేరుకోడానికి అడివికెళ్ళాం. కొంతసేపు అన్నా నేనూ కలిసి ఒక్క చోటనే మూలిక లేరాం. తరవాత, భీమన్న ఆ పక్కతోపులో ఏరుకుంటుంటే—నేనీ పక్కతోపులో ఏరుతున్న, ఇంతలో మొక్కణ్ణుంచి వొచ్చిందో యేమో—మాయదారి పంది! నావెనక నుంచే వొచ్చి, వొంగుని మూలిక లేరుతున్న నానడుం కరుచుకుని, పరుగెత్తింది.

"అన్నా—భీమన్నా—చచ్చా."

అని నేను చాలాసార్లు కేకలెట్టా, కాని నా కేకలు అన్న కంఠ లేదు వాడుతా లేదు. ఇంతదూరం పారొచ్చిన పంది, నీ యీటెతో చచ్చిందన్న మాట! నీమేలు మరవను—నీకు పుణ్యముంటుంది లే మావా!"

అని కాదంబి నావైపోసారి తనకళ్లకొసల్లోంచి అదోమాది రిగా చూచింది. ఇరవైయేళ్లనిగారింపు నిండుయవ్వనంలో కాదంబి, నా మొదటిభార్య శబరికన్నా చాల అందంగా వుండడంచేత, నాకన్ను చెదిరింది.

"నీకు పెళ్లయిందా?"

అని అడిగా—

"లేదుమావా! నీలాంటి మొగుడు దొరుకుతే చేసుకుందామని వూరుకున్నా."

అంటూ కాదంబి పెదవిసందుల్లోంచి లేత వెన్నలాంటి ఓచిన్న నవ్వును నా మీదికి విసిరింది. దాంతో నేను మరింత డిల్లయిపోయా, నాఒళ్లు మంచుకప్పినట్టయింది.

"నాలాంటి మొగుడు దొరుకుతే చేసుకోవాలని వుందన్న మాట?"

"ఆఁ! చెప్పాగా?"

"మరయితే నన్నే చేసుకోరాదూ!"

"అంతకంటే యింకేంగావాలి మావా?"

వెంటనే కాదంబి నాచెయ్యి పట్టుకుని ముద్దాడింది. ఇంతలో నా నేస్తగాళ్లొచ్చెయ్యడంవల్ల కాదంబి నాచెయ్యి వొదిలేసి, తల కిందికి దించుకుకూచుంది.

"పందుల్నేగాకుండా, పడుచుల్నికూడా వేటాడతాడు మా దొర." అని మావాళ్ళలో ఒకడంటే, మిగిలిన వాళ్ళందరూ విరగబడి నవ్వడం మొదలుపెట్టారు.

"నన్ను పెళ్లాడతానని, నావెంట తరుముతుంటే నేనేం చేసేదీ?" అని నేను మావాళ్లతో అన్న.

"అయితే యింకేం? ఒక రాణికి ఇప్పుడిద్దరు రాణులయ్యారు. పాలకి తీసుకొచ్చి పేటకి తీసుకుపోదాం."

అని, వెంటనే కొందరుపోయి, పాలకీ తీసుకొచ్చారు. కాదంబి నా పాలకీలో కూర్చోబెట్టి నాకంటే ముందుగానే పేటకు తీసుకుపోయి చేర్చారు. నేనావెనుక పందిని మోయించుకుని వెళ్లాను. నేను వెళ్లేటప్పటికే పేటంతా ముస్తాబుచేశారు. పెళ్లికవసరమైన ఏర్పాట్లన్నీ చేశారు. శబరితో యీ విషయం చెప్పాలని వెళ్లాను నాపెళ్లి కామె అందరికంటే ఎక్కువ ఉత్సాహంగావుంది. తనకున్న వాటిలో మంచిదుస్తులు—ఆభరణాలు, శబరి, కాదంబికిచ్చి ముస్తాబుచేస్తుండడమును నేనూ కొంచం దూరంనుంచి గమనించాను. అప్పుడు కాదంబి, శబరితో ఏమో మాటలాడుతూంది. విందామని పొంచి నిలుచున్న,

"నువ్వు మా మావ కేమవుతావు?"

అని కాదంబి—

"మీ మావెవరూ?"

అని శబరి—

"ఇప్పుడు పెళ్లాడ్తంతే? అతను."

"ఓహో! అర్థమైంది. ఆ దొరకి నువ్వేమవుతావో—నేనూ అదే అవుతాను."

"పెళ్ళానివా?"

"ఆఁ!"

కాదంబి ఆశ్చర్యపడ్డట్టుగా నాకగుపించింది,

"తనకో పెళ్ళాముందని, మావ నాకు ముందర చెప్పలేదేం?"

"చెప్పలేదా?"

"లేదు—నీ పేరేఁటి?"

"శబరి"

"ఎన్నాళ్లయింది."

"అయిదేళ్లయింది."

కాదంబి ముఖం ఆలోచనగాపడితే, శబరి అంది.

"నువ్వు నాకు చెల్లివవుతావు. ముందునక, ముందుబట్ట ముందు తిండి—నీది! నీ సంతోషానికీ—నీ సౌఖ్యానికీ నేనెప్పుడూ అడ్డుంరాను కాదంబీ! దొరా, నువ్వూ ఆనందంగావుంటే—చూసి, మురిసేదాన్ని

నేను. తెల్సిందా? నేనున్నాననీ—నాసంగతి, దొర చెప్పలేదనీ బెంగ పెట్టుకోకు.''

అని శబరి చెబుతుంటే, కాదంబి మౌనంగా వింటూంది. ఇప్పుడు తప్పుచేసిందని, శబరిమీద నేనబద్ధాలు చెప్పలేను, శబరి, కనకికానున్న సవితితో అంత మంచిగా మాట్లాడుతుందని నేననుకోలేదు. తన విలువగల దుస్తులు, నగలు, ఆమెకు ముందుగానే యిచ్చేసింది. పైగా తనసౌఖ్యాలన్నీ కూడా యిస్తానంటూంది, నాకు చాలా ఆశ్చర్యమే కలిగింది. ఇంకా విన్నాను.

''దొర యెలాంటివాడు?''

అని కాదంబి అడిగింది.

''దొరలాంటి మంచివాళ్లు ఎక్కడావుండరు. ఈ ప్రాంతానికి రాజు—చాలా పరాక్రమంగలవాడు, నీకోరికలన్నీ తీర్చగలవాడు. ఇంకా యేంకావాలి?''

''నన్ను మళ్ళీ పెళ్ళిచేసుకోడం, నీకు కష్టంగాలేదూ?''

''మనస్సులోకూడా లేదు. చాలా సంతోషంగా వుంది. మన మిద్దరం చాలా ఖులాసాగా వుండొచ్చు, దాసీలున్నారు, నౌఖర్లున్నారు. నువొక్కపని ముట్టుకోవలసిందిలేదు. వాళ్లు చెయ్యకూడని పనులేమయినావుంటే నేను చేస్తాను. నీకేం కావలసినా నాతో చెప్పు నీ ఒంటిమీద ఈగ వాలనియ్యను, కంటికి రెప్పలాగ చూస్తాను, ఏబెంగాలేకుండా నువ్వు సంతోషంగావుండు—దొరని సంతోషపెట్టు.''

కానున్న తన సవితితో ఎవరన్నా అలా చెబుతారని నాకు వింతకలిగింది. శబరి మంచిమనస్సుని, అప్పుడు నాలో నేను వెయ్యి విధాల పొగుడుకున్నాను. దేవతలకుండే గుణాలు—భూమాతకుండే సహనం, నాకామెలో కనుపించాయి. ఆమెకు ఎదట పడకుండా వుండలేకపోయాను. మాటునుంచీ, ఆ యిద్దరూవున్న దగ్గిరికెళ్ళి నిలుచున్నా. శబరి, కాదంబి నింకా అలంకరిస్తూనేవుంది.

''పందులవేటకెడితే—పిల్లకూడా దొరికింది శబరీ!'' అన్నా నేను.

''లక్షణమైన పడుచు—బుద్ధిమంతురాలుకూడా, నాకు చాలా సంతోషంగావుంది దొరా!'' అన్నది శబరి.

''నీ సొమ్ములు—నీదుస్తులు—అన్నీ ఆ పడుచుకిచ్చేశావా?''

"అవును—ఇచ్చాశాం దొరా! ఆనందాలు కొంతవరకూ అనుభవించిందాన్ని నేను—అనుభవించడానికొచ్చింది కాదంబి. అందువల్ల, ముందర కాదంబి—ఆతరవాత నేను."

అని శబరి తిరిగి అంది. అటువంటి యోగ్యురాలయిన శబరికిటువంటి పాడుబుద్ధి పుట్టింది. ప్రభూ! కులానికి మాయని మచ్చ తెచ్చిపెట్టింది. ఆరోజే కాదంబకీ నాకూ ఘనంగా, కులాచారం ప్రకారం పెళ్లయిపోయింది. పందిమాంసంతో విందులు జరిగాయి, నాప్రజలు వేడుకలు చేశారు, అమ్మవారికి జాగరలు జరిగించారు. ఆతరువాత చాలాకాలంవరకూ కూడా శబరిలో నాకెటువంటి అసూయగాని, లోపాలుగాని కనుపించలేదు. కాదంబి ఆమెనుగురించి అప్పుడప్పుడు ఏమేమో చెబుతుండేది కాని, నేను నమ్మలేదు.

తరువాత కాదంబి కోరికమీద, ఆమె అన్నగారయిన భీమన్ననుకూడా కొల్లకొండ కోనలోంచి మా రాజ్యానికి పిలిపించాను. అంతవరకూ తన చెల్లెలు పందినోట్లోపడి చచ్చిపోయిందే అనుకున్నాడుట. ఆమె నాచేత రక్షింపబడడమూ—నన్ను పెళ్ళి చేసుకోడమూ తెలిసి, చాలా సంతోషపడ్డాడు, అప్పటినుంచీ అతనుకూడా మాదగ్గిరేవుంటున్నాడు, ఇప్పుడుకూడా వున్నాడు. తానుండడం, శబరికిష్టంలేదనీ—పైకిమాత్రం తియ్యనిమాటలు మెప్పుకోసం చెబుతుందనీ—కాదంబి అనేకసార్లు నాతో చెప్పింది. ఆమె అలా చెప్పినప్పుడల్లా నేను కాదంబినే మందలిస్తుండేవాణ్ణి, శబరిలాంటి అటువంటిది కాదనీ—ఆమె చాలామంచిదనీ చెబుతుండేవాడిని, దానినిబట్టి, నాకు శబరిమీదనే మొక్కువప్రేమ అనీ—తనమీద విశ్వాసంలేదనీ కాదంబి అలుగుతుండేది. నేనామె అలక తీర్చడానికి చాలా కష్టపడుతుండే వాడిని,

ఇలా కొంతకాలం జరిగి, తరవాత ఒకనాడు—

కాదంబిఅన్న, భీమన్న శబరిని కొట్టుకొస్తుంటే నేను చూచి అడ్డుకున్నాను.

"శబరి నెందుకలా కొడతావు?"

అని నేను భీమన్నను తీక్షణంగా నడిగి, కాదంబరి గనక అడ్డంరాకపోతే చంపి రక్తం కళ్ళచూసేవాణ్ణి. కాని కాదంబి, తమ్ముడికడ్డమొచ్చి—

"అటువంటి రంకులాడితో కాపరం నీకిష్టమైతే మాదేం పోయిందీ?" అని నన్నడిగింది. నేనేమీ అర్థం చేసుకోలేక నిర్ఘాంతపోయా!

"శబరినా? ఎవరంటారు?"

అని నేను తిరిగి తీవ్రంగా అడిగాను.

"కళ్ళారా చూసినవాణ్ణి—నేనంటాను! కొండ మొదల్లో ఒక బిల్లుడితో రహస్యంగా మంతనం చేస్తుంటే నేను స్వయంగా చూశాను. పట్టుకోండకుండా ఆపడుచు బిల్లుడు పారిపోయాడుగాని, లేకుంటే-నీకు వప్పగించి వుందును-నిజం నిలకడమీాద నీకే తెలుస్తుంది."

అని భీమన్న అంటుంటే, ఆగలభాకు పరిచారకులు, మరికొందరు కులస్థులు మూగారు, నేను తలకిందికిదించుకో వలసివచ్చింది.

"పెద్ద పెళ్లామంటే మోజుకొద్దీ, నువ్వు తప్పు సహించుకుంటావు—కాని కులమేమంటుంది?"

అని కాదంబి తిరిగిలేచింది, అప్పుడు నాకర్తవ్యమేమిటో నాకర్థంకాలేదు. నేను శబరి పక్షం ఒక్కమాట మాట్లాడినా అది నేరమే అవుతుంది. ఆమెలో అటువంటి చెడుబుద్ధి వుందంటే నమ్మలేక పోయాను. కాని ఆడదాని గుండెలోతును తెలుసుకున్న వారింత వరకూ ఎవరూ లేక పోయినందువల్ల—

"సరే-ఇందునుగురించి విచారించి శబరిని శిక్షించే హక్కును కులస్థులకే వొదులుతున్నాను." అన్నాను.

రాజు నాయనా, నేను కులకట్టుబాటులకు లొంగవలసిందే గదా?

"విచారణ అవసరంలేదు. శబరి నింతమాత్రంలో అనుమానించే దానికి అవకాశంలేదు. శబరి, కులానికి దీపంవంటిది."

అని కులపెద్దలు ఏకగ్రీవంగా అన్నమీాదట ---

"అయితే— మీమిదందా కల్పించామా?"

అని భీమన్న అడిగాడు,

"ఆసంగతి మాకుతెలీదు. శబరిగుణం అనుమానించాలంటే యింకా పెద్ద నిదర్శనాలు కావాలి! దొరా! ఈమాట పుచ్చుకొని, నువ్వు శబరి విషయంలో ఏచర్యా తీసుకోకూడదు. నిజనిజాలు నిదానించాలి."

అని కులపెద్దలన్నదానికి అప్పుడు తృప్తిపడ్డాను—కాని మనసులో ఒక విధమైన సంకోచ మేర్పడక పోలేదు. కాదంబి ముఖం ముడుచుకుని అన్నగారితో గుహలోపలికి పోయింది. మిగిలిన వారం

దరూ కూడా ఎవరిమట్టుకువారు వెళ్లిపోయారు. శబరినిపిలిచి, అదేమని గాని—తప్పుచేశావా అనిగాని, భీమన్న చెప్పినది నిజమా, కాదా. అనిగాని ఒక్కరూ అడగలేదు. అందుకు, శబరివిషయంలో అందరికీ గల విశ్వాసమే కారణం. అందరూ వెళ్ళిపోయిన అనంతరం నేను శబరిని పలకరించాలని చూశాను. ఆమెకు కలిగిన అవమానానికి వల వలయేడుస్తూ, నాపాదాలమీదపడి,

“దొరా! నాకిని పెద్దరోజులు—కాదంబి కాలిమీద కురుపు లేచిందికదా! దానివల్ల రెండురోజులనుంచి ఎక్కువగా బాధపడుతూంది. పచ్చకురుపాకు దానికి పెట్టింది పేరు. నాచిన్నప్పుడు మానాయన ఎవరికేటువంటి కురుపులు లేసినా ఆపచ్చకురుపాకు తీసుకొచ్చి అతికించే వాడు. ఎటువంటి మహావ్రణములయినా అయిదునిమిషాల్లో చితికి పోయేవి—బాధంతా చేతితో తీసి పారేసినట్లయ్యేది. ఆసంగతి నాకు జ్ఞాపకమొచ్చి, పచ్చకురుపాకును తీసుకురావలసిందని, మనవాళ్ళందరికీ చెప్పాను. ఎవ్వరూ తీసుకురాలేకపోయారు. ఎక్కడా దొరకలేదని తిరిగివచ్చారు. అప్పుడు నేను స్వయంగా బయలుదేరాను. ఆపచ్చకురుపాకు సానకొండ మొదట్లో విస్తారంగావుంది. నేనక్కడ ఆకును కోస్తుండగా, మార్గానపోయే భిల్లుడొకడు చూచి—‘అమ్మా! ఈయాకు దేనికిపనికివస్తుంది?’ అని అడిగాడు.

“నాయనా! ఇది రాచకురుపులాంటి, మహావ్రణములు వేటి నయినా నిమిషాలమీద మాన్పుతుంది. అని నేను చెప్పగా, వాడు, తనతల్లి ఒక రాచకురుపువల్ల బాధపడుతూందని, తనకు నాలుగాకులు ఈయవలసిందనీ, బ్రతిమాలగా, నేను వాడికి కొన్ని ఆకులిచ్చి, రాచ పుండకయితే, ఆకును తిరగవేసి వెయ్యాలని చెప్పి పంపాను. ఇదీ— అసలు జరిగిన యథార్థవిషయం. ఇంతకంటే నేనే పాపమయినా యెరిగివుంటే, భగవంతుడు నన్ను క్షమించడు.”

అని శబరి చెప్పినదంతా పూర్తిగావిని—

“నిన్నెవరూ, ఏమీ అడగలేదే! దేనికిదంతా చెబుతావు?”

అని నేనడగ్గా—

“వచ్చిన అపవాదు, చచ్చినాపోదు. అది వేయిరంపాలై నాహృదయాన్ని కోస్తున్నది దొరా! ఇటువంటి నీచపుబ్రతుకు బ్రతికేదానికంటే—తలను నేలకేసికొని చచ్చిపోవడం మంచిదిగదా!”

అని శబరికంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది. కాదంబికి కురుపు లేచినమాట నిజం—కొండ మొహట్లో పచ్చకురుపాకులు వున్న మాటనిజం. మిగిలిన సత్యాలు భగవంతుడికి తెలియాలి ప్రభూ! నేను శబరిని ఒక్కమాట అనలేను. కులస్థులు చేసిన నిర్ణయానికి కట్టుబడి వున్నాను.

ఆరోజులగాయితు, కాదంబి శబరితో మాటలాడడం మానుకొంది, శబరిమాత్రం అప్పుడప్పుడు ఆమె గుహకు రావడం పోవడం నేను చూస్తున్నాను. అందును గురించి నేను శబరి నొకనాడడిగాను.

"కాదంబి స్త్రీపై అటువంటి ఘోరమైన అపవాదు వేసింది—నీతో మాటలాడడం మానుకుంది. నువ్వెందుకు ఆ దగ్గరికిపోతావు?"

"కాదంబి అమాయకురాలు! ఆమె చేసిందానికి నాకామెపై యెటువంటి క్రోధమూ లేదు. ఆమె మాటలాడక పోయినా సరే—కురుపు మానేవరకూ పోయి చూస్తుంటాను."

"కురుపు పూర్తిగా మానిపోయింది గదా!"

"పైకి మానిపోయినట్లే వుంటుంది కాని, లోపలయింకా పచ్చిగానే వుంటుంది."

"నీ కపకారం చేసిన కాదంబిమీద నీ కెందుకూ యింత వాత్సల్యం?"

"చెప్పానుగా స్వామీ! కాదంబి అమాయకురాలు! భీమన్న ఎలా చెబితే అలా నడుచుకోవడం తప్ప, యింకేమీ తెలియనిది!"

"అదిమాత్రం తప్పుకాదా?"

"మనతప్పు లెరుగక—మనవాళ్ళ తప్పులుకూడా అంతే అనుకుని క్షమించడంలో దైవప్రీతివుంది."

అని కొండనాయకుడు శబరి ఎప్పుడో అన్నమాటలన్నీ జ్ఞాపకం పెట్టుకుని చెబుతుంటే, విజయకుమారుడు నివ్వెరపోయాడు. నేరస్తురాలుగావున్న శబరిని తిలకించి—

"తల్లీ! నువ్వు కులటవు కా! కులీనవు కా! నీకు నేను—చెయ్యెత్తి నమస్కరిస్తున్నాను. ఇంతవరకూ నీఉదార చరిత్రవిని, మనసులో కలిగిన సంతోషాన్ని పట్టలేక, పైకి తేలిపోయాను. నీలో దైవత్వముంది—మాతృత్వముంది—ఏ మహిళలో కానిక నువ్వాదర్శప్రాయురాలివి! ఇంతవరకూ నాచేత నమస్కరించబడిన స్త్రీమూర్తివి—

నువ్వొక్కదానివి! నీవల్ల నీపుట్టినజాతి—మెట్టినజాతి—దేవత్వమును పొందుతాయి."

అని విజయకుమారుడామె రెండుపాదాలూ కళ్ళకద్దుకుని, నమస్కరించాడు. అతని చేష్టలు చూచి, అక్కడ మూగినగుంపులు తెల్లబోయాయి. కొండరాజు కేమీ అర్థంకాలేదు.

"ప్రభూ! తమరే దేశానికో ప్రభువులై వుంటారు. అపరాక్రమంతో మా సర్వసైన్యాన్నూ ఓడించి నాకు ప్రాణభిక్ష పెట్టింది చాలక—ఇదంతా ఏమిటి? లోకం దృష్టిలో—ఇందరి ప్రజల దృష్టిలో—నాభర్త దృష్టిలో, నేనొక కులటని—చెడిపోయినదాన్ని! నావంటి ఒక క్షుద్రస్త్రీని ఈవిధంగా స్తుతిచెయ్యడం తగదు. మీచేత నమస్కరించే అర్హత నాకులేదు.

అని పలికి, తన్ను నమస్కరిస్తున్న విజయకుమారుణ్ణి వారించింది శబరి.

"నాచేతగాదు! నన్ను, నిన్నూ, ఇక్కడున్న ఈగుంపుల్నీ సృష్టిచేసిన, పరమేశ్వరుడి చేతకూడా, నమస్కారం పొందగల సౌభాగ్యం నీకున్నది—నిలకడమీద అసత్యాన్ని, లోకాలికి వెల్లడి కాగలదు—అః! దొరా! నువ్వు చెప్పేదానికి అడ్డు కలిగించాను. శబరి సమాచారం తరవాత ఏమయిందీ?"

అని విజయకుమారుడు హెచ్చరించినమీదట, కొండరాజు తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

"ప్రభూ! మరి కొద్దికాలానికి శబరి గర్భవతి అయినట్లుగా మాకు తెలిసింది. శబరికి కలిగిన గర్భం నావల్ల కాదనీ—అది ఆమెకు వలపుకాడయిన భిల్లునివల్ల కలిగిందనీ—కాదంబి ప్రచారం చెయ్యడమే గాకుండా నాతోకూడా చెప్పింది. ఋజువులేని మాటలు నేను నమ్మనని నేను కాదంబిని మందలించాను, ఋజువు చూపుతానని, కాదంబి నాతో సవాల్ చేసింది.

అటుపైన కొద్దిరోజుల్లోనే, భీమన్న నేనున్న దగ్గిరికి రహస్యంగా వచ్చి—

"దొరా! శబరిగుణం ఋజువు చూస్తువుగాని రా!" అన్నాడు. నేను, పట్టలేని ఆవేశంతో వాడివెంట వెళ్లాను. మనం యుద్ధంచేసిం దగ్గిర ఓఅమ్మవారి చెట్టులేదూ? నన్ను భీమన్న అక్కడికి తీసుకెళ్లాడు.

దూరాన నిలుచోబెట్టి చూపించా... ప్రభూ! నాకళ్ళతో నేను చూశాను—శబరి అభిల్లుణ్ణి తన ఒడిలో పడుకోబెట్టుకునివుంది—ఇది కులట అని చెప్పడాని కింతకంటే, వేరు నిదర్శన మింకేకావాలి? ఘోరమైన అదృశ్యం చూసి, నేను ఆవేశం పట్టలేకపోయాను—

"ఓసి కులటా— తెలిసింది నీగుణం!"

అని గర్జించి నేను ముందుకురికేలోపుగా బిల్లుడు పారిపోయాడు. నేను శబరిజుట్టు పట్టుకున్నాను. భిమన్న బిల్లుని పట్టుకోడానికి వెంట పరుగెత్తాడు. కాని, బిల్లుడు భీమన్న పరుగుకందకుండా పారిపోయాడు. కుణమతాపులుతంతూ శబరిని పేటకి తీసుకొచ్చాను. కులస్థులందర్నీ పోగుచేశాను. నేను నాస్వంతకళ్ళతో స్వయంగా చూసినదంతా వాళ్ళకి చెప్పాను. నేను చెప్పినప్పుడు, కులస్థులు నమ్మకేం జేస్తారు? అంతకంటే వేరు నిదర్శనమేం కావాలి? దీనినిబట్టి లోగడ కొడంబి చెప్పినదంతా యదార్థమేననీ—శబరి చెప్పినవన్నీ దొంగకథలనీ తేలి పోయింది. అటువంటి నీచురాలికి శిరస్సు ఖండించడంకంటే, వేరు శిక్ష వుండకూడదని అందరం నిశ్చయించాం. అది చెట్టుకింద—ఏ అమ్మవారి విగ్రహాందగ్గిర, రంకు మొగుణ్ణి ఒళ్లోపడుకోబెట్టుకుని, నాకళ్ళబడిందో—అక్కడే దాని శిరచ్ఛేదం జరగాలని, శబరిని తలారులకు వప్పగించాం. ఆపని జరగబోతుండగానే, మీరు రావడము—శబరి ఉత్తమ స్త్రీ అనుకుని, దాన్ని కాపాడ్డానికి మాతో యుద్ధం చెయ్యడము జరిగింది. తమరు చేసినపని పొరబాటని, యిప్పటికైయినా గమనించగలరను కుంటా. శబరి నడుగుతే కల్పితకథ లెన్నయినా చెబుతుంది. ఇప్పుడా తుచ్ఛురాలి మాట లొక్కరు నమ్మరు. మీరున్నా నమ్మరని మా వుద్దేశం!

అని కొండరాజు తాను చెప్పదలచినదానిని ముగించగా—

"నమ్మతాను—శబరి చెప్పిందే సత్యమని నేను నమ్మతాను."

అని విజయకుమారు డనగా—కొండరాజే గాకుండా, అక్కడ మూగిన జనమందరూకూడా తెల్లబోయారు.

"ప్రభువులకు మతిచెడివుంటుంది—అయిందేదో అయింది. మీ దారిని మీరు వెళ్ళండి—మాపని మేము చూసుకుంటాం."

అన్నాడు కొండరాజు కోపంతో.

"మాదొర కిల్లారా చూసిందాన్నే మీరు నమ్మరంటే—తప్ప కుండా మీబుర్రలో లోపముండాలి."

అన్నాడు భీమన్న ముందుకొచ్చి.

"ప్రభూ! వారితో మీకెందుకొచ్చిన వాదన! వారు నాప్రాణం తియ్యకుండా యెలాగా వొదలరు. ఇప్పటికే నాగురించి చాలా శ్రమ పడ్డారు. ఇకనయినా పోయి, మీపని మీరు చూసుకోండి." అని శబరికూడా అంది.

"విషయము నంత తేలిగ్గా వొదిలేవాణ్ణయితే—ఇంతదూరం రానేరాను. మీరందరూ కోరినట్లు నే నెప్పటికయినా వెళ్లిపోయే వాణ్ణే కాని, ఇంతిశ్రమపడి సత్యాన్వేషణంచేసిన కాదంబిని చూడ కుండా వెళ్ళడానికి మనస్కరించడ లేదు."

అని విజయకుమార్ అనగా—

"తుచ్ఛరాలయిన ఈపాపిష్టి శబరిముఖం చూడడానికి ఇష్టం లేక మాకాదంబి, యువతలకు రాకుండా, గుహలోనే వుండిపోయింది." అన్నాడు భీమన్న.

"అవును, శబరిముఖం చూడవలసిందని నేను కోరడం లేదు. ఆపుణ్యవతి దర్శనంకూడా నాకు కావాలని కోరుతున్నాను."

అని విజయకుమారు తిరిగి అన్నమాటట—

"అప్పుడు—పదిమనుషులు శబరి పాపిష్టిముఖానికి అడ్డుగా నిల వండి—కాదంబివచ్చి, ప్రభువుల కోరిక తీర్చి వెళ్ళిపోతుంది."

అని కొండరా ఇచ్చినసలహా బాగావుందని అందరూ ఆమో దించారు. అతని సలహా ప్రకారమే జరిగింది. కాదంబి, రావించ బడింది. విజయకుమారు ఆమెతో సంభాషించాడు—

"నువ్వు చాలా మంచిదానివని విన్నాను."

"నిజమేనండి."

"నీకు సంతానం కలగలేదు కదూ?"

"లేదండి."

"అప్పుడు—శబరికి కలుగబోయే బిడ్డ—కొండరాజు తరువాత ఈప్రదేశానికి ప్రభువవుతాడు గదూ?"

"అదెలా జరుగుతుందీ? శబరిని ఇప్పుడే హతమారుస్తారుగా?"

"అందుకేగదూ? నువ్వీపన్నాగమంతా పన్నావు?"

"నా కేం తెలీదు—కావాలంటే మాభీమన్న నడగండి."

"ఏమయ్యా! భీమన్న—శబరికి ప్రియుడంటివే—ఆభిల్లుడితో నీకంతకుముందు పరిచయముందా?"

"లేదండి."

"లేకపోతే—వాడు భిల్లుడని నీకెలా తెలిసింది."

"కొంచం పరిచయ ముందండి."

"వాడి యిల్లూవాకిలీ నీకు తెల్సు నన్నమాట?"

"తెల్సునండి. వాడు భిల్లుడే!"

"అప్పుడు వాణ్ణి పరుగెత్తి పట్టుకోవాలని పోయావే! వాడు నీకు దొరకలేదు కదా?"

"మేఘాలమీాదవుంటుంటే నాకెక్కడ దొరుకుతాడండీ."

"పోనీ తరవాత, వాడింటికయినా పోయి పట్టి తీసుకురాలేక పోయావ్వా?"

"అదేమో—వారిల్లు నాకేం తెల్సు?"

"ఇప్పుడేగా, తెల్సునంటివి—"

భీమన్న నాలుక కరుచుకుని, జవాబు చెప్పలేక తెల్లముఖం వేశాడు.

"సరి—విన్నారు కదా! ఇదంతా, కాదంబీ—భీమన్న కలిసి చేసినపని, శబరికి పుట్టబోయే బిడ్డ రాజవుతాడన్న అసూయకొద్దీ, వాళ్లే యీకుట్రంతా పన్నారు."

అని విజయకుమారు డనగా—

"కళ్లారా చూస్తే—కుట్రంటారేమండీ!"

"నువ్వు కళ్లతో చూసిందికూడా మోసమే! కులపెద్దలారా! ప్రజలారా! మీారాలోచించండి! శబరియొక్క గుణం మీాకు తెలియదికాదు. ఆమె చెప్పబోయేదాన్నికూడా వినండి!"

అని విజయకుమారు అందరినీ వుద్దేశించి అనగా—

"ఆమె చెప్పిందాన్ని మేము వినదలచలేదు. చేతనయితే ఆమె సత్యం చూపమనండి—ఒప్పుకుంటాం?"

అని కొందరు పెద్దలు లేచి అన్నారు.

"సత్యమును ఎలా చూపాలి?"

అని విజయకుమారు తిరిగి నడిగాడు.

"అగ్నిలో ఉరుకుతుందా!" అని ఒకరు—

"ఆకాశాని కెగురుతుందా?" అని వేరొకరు—

"గరళంతాగి బ్రతుకుతుందా?" అని యింకొకరు—

"ఏమీ వొద్దు—మద్దుతియ్యమనండి. దాని సత్యం బయటపడు తుం." అని మరికొందరూ అంటూండగా, శబరి—

"మీరేది చెప్పినా చేస్తాను. నాలో సత్యముందా బ్రతుకు తాను! అపవాదు పోగొట్టుకుంటాను. లేదా చస్తాను. మద్దుతియ్యడానికి నేను సంసిద్ధంగా వున్నాను. ఏర్పాటు చేయించండి!" అంది.

"అలాగయితే మేం నమ్ముతాము. నువ్వు నిర్దోషివని తేలు తుంది—దొర నిన్ను మామూలుగా యేలుకొంటాడు."

అని ఐక్యకంఠాలతో అందరూ అన్నమీదట—

"మద్దుతియ్యడమంటే యేమిటి?"

అని విజయకుమారుడడిగాడు. అందులో ఒక కులపెద్ద లేచి—

"ఒక పెద్దగోలెంనిండా చమురుపోసి, ఇరవై యొక్క రోజు రాత్రింబగళ్లు మరిగిస్తాం. ఇరవై రెండో రోజున ఆగోలెంలో ఒక సూది పడేస్తాం. సత్యం చూపదలచినవారు, ఆమరిగిన మద్దులో చెయ్యిపెట్టి సూది తియ్యాలి. అప్పుడు వారిచెయ్యి కసుగందకూడదు మామూలుగా వుంటే—వారు తప్పు చెయ్యనట్టు అర్ధమవుతుంది." అని చెప్పాడు.

ఘోరమైన ఆపరీక్షా విధానం వింటుంటే విజయకుమారుడికి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. శబరి ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

"ప్రభూ! నాకెటువంటి సంకోచమున్నూ లేదు. మద్దుతీస్తాను-నాసత్యం చూపుతాను."

అని శబరి చెబుతుంటే, విజయకుమారుని గుండెలు ఘుల్లు మన్నాయి. కట్టు తియ్యడానికి అవసరమైన యేర్పాట్లన్నీ చెయ్య వలసిందని, కొండరాజు ఆజ్ఞలుయిచ్చాడు. ఒకరు చంపనవసరం లేకుండా, మద్దుతియ్యడంలో శబరి, తనంతట తానే చచ్చిపోతుందని కాదంబి భీమన్నలు, తమలో తాము మురిసిపోతున్నారు.

అవసరమైన పనులు పెట్టుమని, తన పరిస్థితులో తానక్కడే అన్నిరోజులూవుండి-శబరియొక్క విషయం పూర్తిగా గమనించడమా

లేక తనపనులమీద తాను వెళ్ళిపోవడమా? అని యోచించి, చరిత్ర ప్రసిద్ధి కానున్న శబరి వృత్తాంతకూడా మహోత్కృష్టమైనదనీ— దానిని పూర్తిగా తెలుసుకోవాలనీ నిశ్చయం చేసుకుని, విజయ కుమారు అన్ని రోజులూ అక్కడనే వుండిపోయాడు. ఇరవై యొక్క రోజులు గడిచాయి—సిద్ధుతియ్యడానికి అవసరమైన యేర్పాట్లన్నీ జరిగించబడ్డాయి.

ఇరవై రెండో నాటి ఉదయం—

శబరి సిద్ధుతీస్తుందన్నవార్త ఆప్రాంతంలో నేగాక, చుట్టు ప్రక్కలగల యితర కొండరాజ్యాలలోకూడా పాకిపోవడంవల్ల, కొండ జాతులవారు వేలాదిగావచ్చి అక్కడచేరారు. ఆ యిరవై యొక్క రోజులూ, యెన్నివంకలు పుట్లు కర్రకాల్చారో—ఒక పెద్దగోలెంలోని చమురు మరిగి మరిగి మడ్డుతేలింది—శగలు జిమ్ముతూ, పొగలు పొంగుతూ, సముద్రకెరటాలవంటి అలలతో—గంగాళాన సలసల గుద్దుకుంటూంది. నేరస్తురాలయిన శబరి, ఆతావుకు గొనిరాబడింది. కొండరాజు స్వయంగావచ్చి, గోలాన ఒక చిన్నసూది పడేసి—

"శబరీ! సూదిని తీసి, నీసత్యంచూపు!" అన్నాడు.

విజయకుమారాది సర్వజనులూ శబరి సత్యం చూడ్డానికి రెప్ప వాల్చకుండా కాసుకున్నారు! శబరి మడ్డుగంగాళానికి ముమ్మారు ప్రదక్షిణం చేసింది.

"ఓ అగ్ని దేవుడా! నాలో యెటువంటి మచ్చాలేకపోతే— నేను నాభర్తను తప్ప అన్యపురుషుణ్ణెరగని పతివ్రతనైతే—నాసత్యం చూపించు—"

అంటూ చేతిని మడ్డులోకిపోనిచ్చి, అడుగున నంటివున్న సూదిని తీసి, నక్కడివారికి చూపింది! ఆమె చేతులు కందలేదు—పొంగలేదు. యథాప్రకారంగా, మొగలిపువ్వులా నవనవలాడుతుండడము నందరూ చూచారు—విభ్రాంతులయ్యారు.

"శబరి పతివ్రత—మచ్చలేని మహాయిల్లాలు!"

అని కరతాళధ్వనులు చేశారు! శబరిమెడ పూలహారాలతో నింపారు—కాదంబి చిన్నబోయిన ముఖంతో, అన్నగారిని వెంటబెట్టు కొని పోతుండగా, కొండరాజాయిద్దర్నీ పట్టుకున్నాడు.

"ఎక్కడికి పోతారు? మీవల్లనే యింత జరిగింది. మచ్చలేని మహాయిల్లాల్ని రచ్చకెక్కించారు. యుద్ధానికి కారకులయ్యారు. విజయకుమారుడి చేతులో సైన్యాలెన్నో నాశనమయ్యాయి—మీ తలలు రెండూ నరికి ఉప్పుపాతర వేయిస్తాను."

అని కొండరాజు ఉద్రేకంతో నంటుండగా, ఒక బిల్లుడు జన సమూహాన్ని తోసుకుని, ముందుకొచ్చి—

"దొరా! వీళ్లే నన్ను మోసంచేశారు. శబరి నాకు పచ్చకురు పాకులిచ్చి, నాతల్లి ప్రాణం రక్షించింది. అది లగాయతూ మా గూడెంలో ఎవరికి ఎటువంటి రణాలున్నా, నేనొచ్చి కొండమొదలోని ఆ పచ్చకురుపాకులు పట్టుకుపోయి అనేకమందిని రక్షిస్తున్నాను. ఇలా జరుగుతుండగా, ఒకనాడు కొండమొదలో ఆకులు కోసుకుం టున్న నాదగ్గిరికి, ఈ ఆడదీ, యీ మొగాడూవచ్చి, ఇలా చెప్పారు— 'మాదొర పెళ్లాం శబరి, నిన్ను వలచిందిరా బిల్లూ! నీ అదృష్టమే అదృష్టం!' నన్నారు. నేను మూర్ఖుణ్ణి కావడంవల్ల నమ్మాను. 'అయితే ఆమెను కలిసేందు కేంచెయ్యాలి?' నని నడిగాను.

'మేం చెప్పినట్లు చేశావంటే—సిరొట్టె నేతిలో పడుతుంది. శబరిని అనుభవించగలుగుతావు—శబరి కొండపై వృక్షప్పుడు, ఆమె చూస్తుండగా—'అమ్మో! పాము కరిచింది—చచ్చిపోయా! నని గిలకిల తన్నుకుంటూ పడిపో—అంతే—ఆతరవాత ఏం జరుగుతుందో— నీకే తెలుస్తుంది.'

అని చెప్పారు—నేను వీళ్లమాటలు నమ్మాను. వీళ్లు చెప్పినట్లు గానే, ఒకనాడు శబరి ఒంటరిగా కొండదిగుతూండడం చూశాను. 'అమ్మో—పాము కరిచింది' చచ్చానంటూ కిందపడి గిలగిల తన్ను కుని దొంగనాటకమాడాను—శబరి వెంటనే నాదగ్గిరికి పరుగెత్తుకొచ్చి 'అయ్యో! తండ్రీ! పాము కరిచిందా—నే పసరుపిండగలను—భయం లేదు—నంటూ ఏదో ఆకును తెచ్చి, నాతలను తన ఒళ్లో పెట్టుకుని, నానోట ఆకుపసరు పిండబోతుండగా—దొరా! అప్పుడు 'ఓసీ! కులటా నీగుణం తెలిసింది' అన్న నీభయంకర గర్జన నాచెవులో పడింది. హడిలిబేజారై—పరుగెత్తా—తరవాత శబరి మద్దులీస్తుందంటే, వింత చూదామని, నందరిలో నేనూ వొచ్చా—

అని ఆభిల్లుడు, జరిగిన యధార్థ విషయమును చెప్పగా వినిన కులస్థులందరూ, కర్రలూ, బల్లేలూ పట్టుకుని ఉద్రేకంతో, కాదంబినీ—భీమన్ననీ పొడవడాని కొచ్చారు.

శబరి—చెయ్యెత్తి సందర్శ్న వారించింది.

"అన్నలారా! ఆగండి—వాళ్లని క్షమించడం నాకు సంతోషం."

అంది. అందరూ ఆగారు. కాని, కొండదొర ఆగ్రహావేశంతో—

"వీళ్లు దుర్మార్గులు—క్షమించడానికి వీల్లేదు. తలలు నరికి ఉప్పులో పాతిపెట్టండి!" నన్నాడు.

"దొరా! నాకోసం, వాళ్లని క్షమించాలి—"

అని శబరి తిరిగి వేడుకుంది.

"సరే నీకోసం క్షమించినా, వాళ్ళని బ్రతికినంత కాలం గుహాలో బంధించి—ఉప్పులేని గంజితో ముప్పూటదుపుతాను."

అని కొండరాజన్నాడు.

"అప్పుడిక క్షమించడ మేముంది దొరా! నా చెల్లి ఉప్పులేని గంజితో గుహాలో బంధించబడితే—నేను కూడుతింటూ కులుకుతానా?"

"సరి—నీయిష్టం—నాకు మాత్రం ఆయిద్దరి ముఖాలూ కనిపించడానికి వల్లకాదు—వాళ్లెప్పుడు నాకళ్ళబడితే అప్పుడే వాళ్ళ శిరస్సులు ఖండిస్తాను."

అని కొండరాజు, శబరి కోరిన ప్రకారం కాదంబి, భీమన్నలను క్షమించాడు. అప్పుడాయిద్దరూవచ్చి, శబరి పాదాలు కళ్ళకద్దుకున్నారు.

"అక్కా! సత్యందాగదు—అసూయలో మండి మేమేదగ్ధమయ్యాము. నీసత్యం నిన్ను కాపాడింది. నీపుణ్యాన మేమింకా బ్రతకడం కలిగింది—" అంది కాదంబి.

శబరి, విజయకుమారుని దగ్గరకొచ్చి నమస్కరించి—

"ప్రభూ! మీనోటంటవచ్చిన ప్రతి అక్షరంలోనూ భగవంతుడున్నాడు. మీ ఆశీస్సులే నన్ను శ్రీరామరక్షగా కాపాడి నా సత్యాన్ని బయటపెట్టాయి!" అంది.

"తల్లీ! నేనెంతటవాణ్ణి! పంచభూతాల్ని శాసించగల మహోత్తర పతివ్రతాశక్తి నీలోవుంది—కనకనే, నీచెయ్యి తగలగానే, అంతటి మడ్డుచమురూ పన్నీరయింది! సర్వలోకాలూ నీచరిత్ర చెప్పు

కుంటాయి—నిన్నాశీర్వదిస్తాయి—నీకు కలుగబోయే బిడ్డ చిరంజీవిగా వర్ధిల్లి విశ్వవిఖ్యాతిని పొందుతాడు! అమ్మా! ఇక నువ్వే నన్ను దీవించి పంపాలి.''

అని విజయకుమారు చేతులు జోడించి, తలవంచి, శబరి కెదుట నిలవగా—

''ప్రభూ! అర్హతలేని దాన్ని ఆశీర్వదించమంటున్నారు. అయినా మీరు కోరిన దాన్ని కాదనలేను. లోకానికి మేలు జరిగించే మీ సర్వప్రయత్నాలకు భగవంతుడు తోడుపడతాడు!''

అని శబరి దీవనపొందిన తరువాత, విజయకుమారు, కొండ రాజు దగ్గర శెలవుతీసుకొని, తన ప్రయాణమును సాగించాడు. కొండ రాజువల్ల, అంతకుముందే వాలనగర మార్గమును తెలుసుకొని వుండడంచేత, ఎటువంటి తికమకలూ పడకుండా ప్రయాణమును సాఫీగా జరిగించి, కొంతకాలానికి సురక్షితంగా వాలనగరం చేరుకున్నాడు.

## ౨౮

''వాలనగరపు సరిహద్దు.''

అని ఒక ఎత్తయిన రాతిపలకపై చెక్కబడివున్న అక్షరములను చదివాడు విజయకుమారు. తాను తెలుసుకొనవలసిన నాల్గవ ప్రశ్నకు జవాబు అక్కడ స్పష్టంగా లభ్యమవుతుందా అన్న ఆలోచనతో మరికొంతదూరం ముందుకు సాగిపోయాడు. అక్కడ వివిధ రకముల నగిషీపనులతో, వింత వింత రంగులతో, అమర్చబడిన ముఖద్వారమును చూచి, ఆ మహారాజుయొక్క కళాభిరుచి అటువంటిది గాబోలునని అబ్బురపడుతూ ఆ ద్వారమును ప్రవేశించబోగా, యుద్ధభటాకృతులలో వున్న ఇద్దరు స్త్రీలు చెరొకవైపునుంచీ ఖడ్గములుచాచి, విజయకుమారుకు నిరోధం కలిగించడమేగాక, ఆ ద్వారమునకే అమర్చబడివున్న ఒక గంటను మోగించారు. సుమారొక పదిమంది స్త్రీలు యుద్ధవీరుల వేషంలో విచ్చుకత్తులు ధరించి రాను, వచ్చిన వెంటనే విజయకుమారుని బలమైన త్రాళ్ళతో బంధించడము జరిగింది. విజయకుమారుడు విస్తుపోయాడు, ఆ స్త్రీలెవరో తన్నెందుకు బంధిస్తున్నారో అర్థంచేసుకోలేక పోయాడు. పలక్కుండా ఉలక్కుండా, తానెవరో కనుక్కోకుండా—తన నేరమిటో విచారించ

కుండా, ఆనిగంటుకే మేమిటా అనుకున్నాడు. వారే పురుష భటులై వుంటే, అప్పటికే ఒరనుంచి కత్తినిదూసి, తన ప్రతిజ్ఞ చూపేవాడు—కాని వారు స్త్రీలైపోయారు!

"ఇంత నిరకుశంగా పరిపాలిస్తున్న ఈ నగరపాలకు డెవరు? మీరు నన్నెందుకు బంధించారు? నేను చేసిన నేరమేమిటి?"

అని విజయకుమారు తీక్షణంగా అడిగినమీదట, అందులో ఒక స్త్రీ—

"నువ్వు పురుషుడవై పుట్టడమే మహానేరం—మా మహిళా రాజ్యమున అడుగుపెట్టడం, మరొక నేరం. పురుషజాతి కీరాజ్యంలో ప్రవేశంలేదు."

అని చెప్పగా విజయకుమారు, మరింత విభ్రాంతుడై,

"అయితే మీపాలకులు స్త్రీలా?" అని తిరిగి అడిగాడు.

"పిచ్చివాడా! పాలకులేగాదు-మంత్రులు, ఉద్యోగులు సైనిక దళాలు-పరిచారకులు, కవులు, గాయకులు, వీరు వారనడమెందుకు? అందరూ స్త్రీలు, ఈరాజ్యంలో ఒక్కపురుషుడైనా మచ్చుకు కన పడడు."

"అయితే నన్నిప్పుడు బంధించి ఎక్కడికి తీసుకుపోతారు? ఏంచేస్తారు?"

"ఏంచేస్తారు? కారాగృహానికి తీసుకుపోతారు—ఖయిదు చేస్తారు."

"నన్నా?"

"ఆఁ! లేకపోతే ననుకున్నావా? అనవసర ప్రస్తావన చెయ్యక, నడు ముందర."

"మీ యిష్టప్రకారమే చెయ్యండి కాని నా దొక్కమనవి."

"ఏమిటది?"

"వచ్చినవాణ్ణి రానే వచ్చాను—బంధింపదలచిన వారెలాగా బంధిస్తారు. మీ కడ్డులేకు—నాకు దిక్కులేదు. కాని నేనిక్కడి కొచ్చిన పనేమిటో కొంచం వినండి."

"అదే చెప్పమంటున్నా."

"మీయేలిక పేరేమిటి?"

"రాణీ ప్రమీల."

"ఆవిడకీయాలని, ఒక అమూల్యమైన కానుక తెచ్చాను. నన్ను దాన్ని ఆవిడకు సమర్పించనియ్యండి. అటుపైన మీరు నన్ను ఖయిదు చెయ్యండి—ఉరితియ్యండి. మీ శిక్షను సంతోషంతో అంగీకరిస్తాను"

"సరి, అయితే నీమాటలు తీసుకుపోయి, మారాణికి చెబుతాం, అప్పుడావిడ ఎలా ఆజ్ఞాపిస్తే అలా. అంతవరకూ నువ్విక్కడేవుండు,"

అనిచెప్పి ఒక స్త్రీ లోనికిపోయింది. విజయకుమారు, మిగిలినవారి అదుపులోవున్నాడు.

"మీరాణికి దేనియందెక్కువ ప్రేమ?"

అని విజయకుమారు అక్కడి స్త్రీభటుల నడిగాడు.

"మారాణికి దేనిమీద ప్రేమలేదు. కాని—మరకత, మాణిక్యాలంటే మాత్రం కొంచం మోజుపడుతుంది."

"అంతేనా?"

"అంతే."

"మీరాణికి భర్తవున్నాడా?"

"నీకు బుర్ర చెడ్డట్టుంది—మా రాజ్యంలో మొగపురుగయినా లేదయ్యా అంటే—మళ్ళీ, రాణికి భర్తున్నాడా, అని అడుగుతావేమిటి?"

అని వారు మాటలాడుతుండే సమయంలో, లోనికి కబురు తీసుకొని పోయిన స్త్రీ తిరిగివచ్చి—

"నువ్వొచ్చినవేళ బహుమంచిదయ్యా! మారాణి ఏపురుషుణ్ణిగాని, లోనికిరానిచ్చి దర్శనమివ్వడం, యిది మొదటిసారి, రా—కాని నువ్వు బంధనలోనే వుంటావు."

అనిచెప్పి, ఆమె తన అనుచరులతో విజయకుమారుని, కట్లు విప్పకుండానే నగరద్వారమును దాటించింది.

విజయకుమారు తన సంచారంలో అనేక మహానగరాలు చూచి వున్నాడు—అనేక వింతలను పరిశీలించాడు. కాని యీవాల నగరమువంటి సౌందర్యోపేతమైన పట్నాని ఎక్కడా చూచివుండ లేదు. వినసయినాలేదు. పాలుపోసి ఎత్తగలిగినంతటి నునుపైన వీధులు, ఆవీధుల కిరుప్రక్కల రమ్యమై మనోహరాకృతిగల పూల చెట్లు కాతికుండ్లలో అమర్చబడి, సువాసనలను విరపిమ్ముతున్నాయి.

ఆపూలకుండ్ల వరసల కవతల, వీధులకు రెండుప్రక్కలా, కొంత విశాలస్థలము, ఆస్థలములకానించి నిర్మించబడిన దివ్యభవనాలు— ఆభవనపు గోడల నిగారింపులో, ప్రతిబింబాలు, అద్దంలోకంటే స్పష్టంగా కనబడుతున్నాయి, ఒకభవనం మీాదనుంచి మరియొక భవనంమీాదికి, రాకపోకలకనువుగా డాబాల కట్టడము లేర్పడ్డాయి ఈప్రకారం ఒక వీధికాదు—ఒక భవనంకాదు, స్త్రీభటులు విజయకుమారుని నడిపించి తీసుకుపోయిన ప్రతివీధి—ప్రతిభవనము—ఒకే మాదిరిగా, చూడవేడుకగా వున్నాయి.

ఎటువినినా—గాజుల గలగలలు—కోమలకంఠాల కిలకిలలు—జడగంటల టింగుటంగులు—మట్టెలచప్పుడులు—బంగారు గొలుసుల ఒరిపిడిధ్వనులు—ముత్యాలహారాల మురిపింపులు! ఎటుచూసినా—జీరాడు వాలుజడలు—కురుల నిగనిగలు—పూలచెండుల అలంకరణాలు—జలతారుచీరల తళతళలు—పట్టురవికల గుట్టులో నిక్కిచూచే మెట్టలు—తాకిన మాసిపోతివన్నట్లుండే చెక్కులుటద్దముల నిగారింపులు—అబ్బ! చూసినకొద్ది సౌందర్యము! అయితే! చూసి ఆనందించేవారేగాని అనుభవించే వారేరీ?

అంగళ్ళలో అమ్మేవారు స్త్రీలు—కొనేవారు స్త్రీలు! వీధులో నడిచేవారు స్త్రీలు—నిలుచున్నవారు స్త్రీలు. సేవకులు స్త్రీలు—యజమానులు స్త్రీలు—కోటమీాదనడిచే గుఱ్ఱములాడవి—కుక్కలాడవి! గాలిలో ఎగిరే తూమ్మెదలాడవి—ఈగలాడవి! పక్షులాడవి పశువులాడవి. అంతటా ఆడపుట్టు! ఆడరాజ్యం! అగరే! ఏమివింత! ఏమిచిద్దూరం! మచ్చుకి ఒక్క మగపురుగుగన్న మాటయినా లేదే!

పాలకులు స్త్రీలు—పాలితులు స్త్రీలు. మంత్రులు స్త్రీలు—భటులు స్త్రీలు. వైద్యులు స్త్రీలు, పద్యాధిపతులు స్త్రీలు! బండ్లలో స్త్రీలు-బండ్లునడుపువారు స్త్రీలు-యుద్ధములలో చచ్చువారు స్త్రీలట! చంపువారు స్త్రీలు! శిక్షించువారు స్త్రీలట శిక్షలననుభవించు వారు స్త్రీలేనట! అది ఒక వింతరాజ్యము—విపరీత పరిపాలన!

అంతటిధీరుడు, ప్రతాపశాలుడు అయిన విజయకుమారుడు, ఆయా వింతలను చూస్తూ, ఆడవారివెంబడి, వారు నడిపించినట్లల్లా నడిచినడిచి, చివరకు, రాజమందిరము—కాదుకాదు రాణి మందిరమును చేరాడు. అది రాణీ ప్రమీాలాదేవి దివ్యభవనమట! ఆకాశము

నంటుకొనే ఆదివ్యభవనానికి తల ఎంత పైకెత్తిచూసినా, కొస కను పించలేదు విజయకుమారుడు. ఎన్ని అంతస్తులో లెక్కపెడదామన్న అవకాశం చిక్కలేదు. అది లోహనిర్మితమో—శిలానిర్మితమో—కుడ్య నిర్మితమో—నిర్మించినవారికే తప్ప, అన్యులకు తెలియనట్లుగా వుంది. భవనంపై చెక్కబడిన సూక్ష్మపనులుగాని, ఇతర కళాప్రదర్శనముగాని, మానవనిర్మితాలు గాక, దేవతాసృష్టి అయివుంటుందని, విజయ కుమారు డనుకొన్నాడు.

అతన్ని బంధించిన స్త్రీభటులు కొన్ని ఆవరణలు దాటించి, ఒక ప్రత్యేక సభామంటపానికి తీసుకెళ్లారు. అక్కడ ఒక ఎత్తయిన నవరత్నఖచిత సింహాసనంమీద, సుకుమారు పాతికేళ్ళకు లోపువయస్సు కలిగినస్త్రీ—స్ఫురద్రూపి—నవయౌవనసుందరి—పోతపోసిన అప రంజి బొమ్మలాగ, శిరస్సున కిరీటము, నడుమున జీరాడేకరవాలము, సుర్వాబిగింపుమీద బంగారు జలతారుగల వలెవాటును అమర్చుకుని, ఠీవిగా కూర్చునివుంది. ఆవిడే రాణీ ప్రమీల అయివుంటుందని, విజయకుమారు ఎవరూ చెప్పనవసరం లేకుండానే వూహించుకున్నాడు. ఆమెకు రెండుప్రక్కలా మరిద్దరు స్త్రీలు, సుమారు దేవయస్సులో— అదేఫాయిలో కూర్చునివున్నారు. మరి కొన్నివందలమంది సమా వేశమై, అందరూ ఉచితాసనాలమీద కూర్చొనివుండగా, సభకు మధ్యగా అమర్చబడిన వేదికపై కొందరు భామలు వివిధ భంగి మాలలో నృత్యం చేస్తున్నారు. నర్తకులు స్త్రీలు—ప్రేక్షకులు స్త్రీలు—ప్రభువులు స్త్రీలు—ఎక్కడా మొగపురుగుగాని, మొగవాసన గాని, మొగగాలయినా లేని ఆ దర్బారులో బంధించబడిన విజయ కుమారు హాజరుపెట్టబడ్డాడు. నృత్యకార్యక్రమం ముగిసేవరకూ, అత నిని కొంచం యివతలగా నిలుపుచేసి, అనంతరంలోపల ప్రవేశ పెట్టారు.

ప్రమీల అతని నొకసారి నఖశిఖపర్యంతమూ పరిశీలించి— కళ్ళెంట నిప్పులురాలే తీక్షణభావంతో—

"ఈ స్త్రీరాజ్యంలో అడుగుపెట్టగల సాహసం నీకెక్కడిది?" అని అడిగింది.

"తెలియక వచ్చాను—వచ్చినందుకు మీకొక కానుక సమ ర్పించుకోవాలన్న కోరికకలిగింది."

"లంచమిచ్చి శిక్ష తప్పించుకోవాలనా? రాణీ ప్రమీల అంత అవివేకురాలు కాదు."

"దేవీ! నాకటువంటి సంకల్పం లేదని, ముందుగానే మీ భటులకు విన్నవించాను. నా అపూర్వ కానుకను స్వీకరించి, ఆపై మీ ఆచారమును అనుసరించి, ఏ శిక్షనయినా వెయ్యండి—శిరసావహిస్తాను—"

అంటూ విజయకుమారుడు, తానంతకముందు సారంగ మార్గము గుండా ప్రయాణం చేసినప్పుడు రాక్షసివల్ల పొందిన అపూర్వ మణిని, తన గుడ్డల మడతలలోనుంచి తీస్తుండగా, అప్పటి పట్టపగలును సయితం రెట్టించి, కోటిసూర్యుల ప్రభతో వెలిగే ఆ విద్యుత్కాంతుల కక్కుడి వాకిళ్లు జగాలు ముసన్ను! రాణీ ప్రమీల, ఆవెలుగు చూచి వెలవెలబోయింది. ఒక పరిచారిక, విజయకుమారుని చేతులనుంచి దాని నందుకుని, తమ రాణికి అందించింది. సుమారొక రూపాయి నాణెమంత ఉరువుకలిగి, లోకాలను కాంతిమయం చేస్తున్న ఆ మణి ప్రభావానికి రాణి విభ్రాంతురాలై—

"నువ్వెవరు? నీదేశము? ఇటువంటి అపూర్వమణి నీకెక్కడిది."

అని కొంత ఆగ్రహమును తగ్గించుకుని అడిగింది. కలిగిన అవకాశమును జారవిడవక, విజయకుమారుడు తన వివరాల నీవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు—

"మహారాణీ! నేను నాగపురయువరాజును. మా తండ్రిగారి పేరు ఛత్రపాలుడు, నాపేరు విజయకుమారుడు. కుండినపురాధీశ్వరుడైన కీర్తికాము మహారాజుకు, అపూర్వచింతామణి అని ఒక అందాల కూతురుండె. ఆకన్య, తన ప్రశ్నల కేరాజకుమారుడయితే బదులు చెప్పలడో—అతన్నే వివాహమాడతానని—అట్లు చెప్పలేక అపజయమును పొందినవారి శిరస్సులు ఖండించి, మందిరద్వారానికి వ్రేలగడతానని ప్రతిజ్ఞ పూనింది. ఆమె ప్రశ్నలకు బదులు చెప్పి, ఆమెను పెళ్లిచేసుకోవాలన్న ఆశతో, ఆమె దగ్గరకు రావడము, ఆమె అడిగిన ప్రశ్నలకు బదులు చెప్పలేక భంగపడి, ఆమెచేత ఖండించబడడము, జరుగుతూంది. ఆవిధంగా ఖండించబడిన వారిలో నా ఆత్మీయుడున్నూ వున్నాడు, నే నా నగరం వాదులుసరి కారాజ

కుమార్తెచేతుల్లో ఆవిధంగా హతులయినవారు వెయ్యిమందున్నారు—పురుషజాతి అంతరిస్తూంది—రాజలోకం నాశనమవుతూంది,..."

అని అంతవరకూ విజయకుమారుడు చెప్పినమాటలు విని రాణీ ప్రమీల, పట్టలేని సంతోషంతో లేచి నిలుచుని, ఒరనుంచి కత్తిని దూసి—

"జై! వీరాంగనా! జై! అపూర్వచింతామణీ! శుభం! శుభం! వెయ్యికాదు—కోటి శిరస్సులు ఖండించు—పురుషజాతిని మొదలంట నాశనం చెయ్యి! స్త్రీశక్తిని సమస్తలోకాలకూ చాటు! మహిళల ప్రతిభను పెంచు!!"

అని కత్తిని తిరిగి ఒరలో ముణిచింది. విజయకుమారుడికి ఆమెచేష్ట లపరిమితమైన ఆగ్రహమును కలిగించాయి! అవతరించిన అహంభావమూ—రూపొందిన ఆహంకరుడు—మూర్తీభవించిన ఆదురహంకారమునూ చూచి అతను భరించలేకపోయాడు, తక్షణం తానున్న ఒరనుంచి కత్తినిదూసి—

"ఏదీ నీస్త్రీశక్తి? ఏదీ నీప్రతాపం? ఏదీ నీప్రతిభ? చూపించు!" అని ఆమెపై కురకాలనుకున్నాడు. కాని ఆవేశానికది అదను కాదను కొని, అహంకారమును తనలోనే అణుచుకుని,

"దేవీ! పురుషజాతిపై నీకింత ద్వేషమెందుకు కలిగింది? ఆజాతి వల్ల నీకుకలిగిన అపకృతియేమిటి?"

అని అడగ్గా, రాణీ ప్రమీల చెప్పింది—

"స్త్రీలు, ఇంత అధోగతి పాలుకావడానికి కారకులెవరు? మహిళలు అస్వతంత్రులై బానిసలుగా మారడానికి కారకులెవ్వరు? స్త్రీలు, పిల్లలుకనే యంత్రాలుగా—వంటలుచేసే పరిచారకులుగా—నాలుగు గోడలమధ్య బంధించబడిన ఖయిదీలుగా—చేసినవారెవరు? స్వార్థపరులయిన పురుషులుకారా?

స్త్రీలు, విద్యనేర్వరాదట! భర్త తప్ప పరపురుషుల కంటబడ రాదాట! తామెన్ని విద్యలయిన నేర్వవచ్చునట; ఎందర భార్యలనైనా స్వీకరించవచ్చునట! స్త్రీ మాత్రము ఒకే భర్తను కలిగివుండుట, పాతి వ్రత్యమట! ఓహో! ఏమిధర్మము ఏమిన్యాయము. ఒకరికన్నము మరొకరికి సున్నమూనా? విలాసవిహారాలన్నీ తమవట, వంటశాలలు మాత్రము స్త్రీలవట! పురుషులుకొట్టినా, తిట్టినా, ఎన్ని హింసలు

పెట్టినా స్త్రీలు ఎదురాడకూడదట! చచ్చినట్టు పడివుండాలట! యజ్ఞ యాగాది పుణ్యక్రతువుల నాచరించడానికి, పురుషులకేగాని స్త్రీలకు హక్కు లేదట! ఉన్నత విద్యల నభ్యసించి ఉద్యోగాలుగల అధికారము పురుషులొక్కరే గుత్తకు కొన్నారట! స్త్రీలు ఆమాటకూడా తల పెట్టకూడదట! పిల్లలనుకని, జీర్ణించి, క్షీణించి స్త్రీ అకాలమరణ మును పొందుతే, తక్షణం పురుషుడు మరొకభార్యను స్వీకరించడం ధర్మ సమ్మతమట! అదే భర్తను పోగొట్టుకున్న స్త్రీ చేస్తే మహా పరాధమట!

సృష్టికి ఆది దేవుడు తానట! ఏం? స్త్రీ లేనిదే సృష్టిమాత్రం జరుగు తుందా? పురుషుడికా గొప్పతనం దేనికి? పురుషులకంటే స్త్రీలు ఎందులో తీసిపోతారు? విద్యలనభ్యసించి, ఉద్యోగాలుగల తాహతు వారికి లేదా? అవసరమయినప్పుడు కత్తిపట్టి కదనరంగాన కురకగల ప్రతా పం వారికిలేదా? పురుషులను శాసించగల అధికారం స్త్రీలకు మాత్ర మెందుకుండరాదు? పురుషులు వంటలుచేసి, స్త్రీలను విలాసవిహారా లకు ఎందుకు పంపరు? గాలి, వెలుతురూ లేని చీకటికొట్లాల్లో బం ధించబడడానికి స్త్రీలుచేసిన అపరాధమేమిటి? పురుషుడికి బహు భార్యలుండడం శాస్త్ర సమ్మతమైనప్పుడు—అదేశాస్త్రం స్త్రీలపట్ల ఎందుకు విరుద్ధంగావుండాలి! అంతా పురుషుల స్వార్థపరత్వం—పురు షుల దురహంకారం—దురాక్రమణ సహించరానిది.''

''దేవీ! స్వార్థరహితులు-తపస్సంపన్నులూ అయిన మహా ఋషులు రాసిపెట్టిన శాస్త్రగ్రంథాలు—ధర్మసూత్రాలూ—ఎవరు కాదంటారు?''

''నేనంటాను! తపస్సంపన్నులు స్వార్థపరులుకారని ఎవరు చెప్పగలరు? వారుచేసే తపస్సులకు ఫలితంగా రంభా సంభోగం కావాలి! స్వర్గసౌఖ్యాలు కావాలి! శాశ్వతానందాలు కావాలి! అవునా! ఆధర్మసూత్రాలూ—ఆశాస్త్రగ్రంథాలు, నాలాంటిస్త్రీలు రాసివుంటే-అంతా తారుమారయ్యేది. స్త్రీని అణచడానికి, స్త్రీ జాతిని పతనం చెయ్యడానికి, పురుషులు తమ శక్తిసామర్థ్యాలన్నీ వుపయో గించారు.''

''మహారాణీ! నువ్వు పొరబడుతున్నావు—స్త్రీలను గౌరవించ డానికీ, స్త్రీజాతిని పూజించడానికీ, భూమండలంలో భారతదేశం

అగ్రస్థానం వహించింది. స్త్రీని నాలుగు గోడలమధ్య వుంచి బయటికి రావద్దనడంలో ఆమెకు గోప్యతవుంది గాని హీనత లేదు. విద్యలభ్యసించి ఉద్యోగాలు చేయడానికి స్త్రీలకు లేదని కాదు—వారా కార్యకలాపాల్లో మునిగివుంటే, సృష్టిక్రమం సక్రమంగా జరగదు. దేశరక్షణ కవసరమైన సుసంతానాన్ని వారు కనాలి—పోషించాలి—సృష్టిని పెంచాలి—మహిళలు మాతలైనప్పుడేగదా ఆ ఘనకార్యం జరిగేది? కుటుంబమును పోషించి పెంచగల అర్హత ఒక్క మాతృదేవతకు మాత్రమేవుంది. ఆమె కటువంటి శక్తిని ప్రసాదించినవాడు పరమేశ్వరుడు—ఈశ్వరసంకల్పానికి విరుద్ధంగా ఎవరు సంచరించగలరు? ఇప్పుడు మీరాజ్యంలో అందరూ స్త్రీలు—పురుష సంపర్కం లేదుగదా! కొంతకాలానికి జనసంఖ్య తగ్గిపోదా! తిరిగి ఉత్పత్తి కాగల ఆధారమేముంది?''

''మాకవసరంలేదు—మా రాజ్యంలోని జనసంఖ్య తగ్గిపోకుండా, ప్రతిసంవత్సరమూ, ఇతర దేశాలనుంచి, స్త్రీ శిశువులను, కన్యలను, మా రాజ్యానికి రావించుకుంటాము. వారు మా దేశపుపౌరులుగానే పరిగణింపబడతారు.''

''ఆదేశాలలోనయినా, పురుషసంపర్కం లేకుండా ఆస్త్రీజాతి వుత్పత్తి కాదు గదా!''

అని విజయకుమారుడన్న దాని కారాణి, ముఖం ముడుచుకుని,

''ఇప్పటికే అనవసరప్రస్తావన చాలా జరిగింది. అపూర్వచింతామణి విషయమేమో చెబుతున్నావు. తరవాత ఏమయింది?'' అని అడిగింది.

విజయకుమారు తిరిగి చెప్పడాని కుపక్రమించాడు—

''దేవీ! చెప్పడం మరచాను. అపూర్వచింతామణి అనే ఆరాజకుమార్తెకు, బాలమహర్షి అనే ఒక గురువు వున్నాడు. ఆమె కాగురువంటే భక్తివిశ్వాసాలు మెండు. మహాకష్టతరములైన ఆ ప్రశ్నల నాగురువే ఆమెకు చెప్పి, వివాహమాడగోరి వచ్చిన రాజకుమారుల నడిగిస్తున్నాడు. గురువాజ్ఞవల్లనే ఆమె తన ప్రశ్నలకు జవాబు చెప్పలేనివారి శిరస్సులు ఖండించడం జరుగుతూంది. హింసాపూరితమైన ఈదుష్ట యాగమును నేను చూచి భరించలేకపోయినాను. ఎన్ని కష్టములయినా అనుభవించి, ఆప్రశ్నలకు జవాబులు తెలుసుకుని,

ఆ బాలమహర్షికి అపూర్వచింతామణికీ గర్వభంగంచేసి, వారివల్ల జరుగుతున్న హింసాకాండను అరికట్టడానికి కంకణం కట్టుకున్నాను. ఇప్పటి కామె అడిగే ఐదు ప్రశ్నలలో మూడింటి కెలాగో జవాబులు తెలుసుకోగలిగాను. నాల్గవప్రశ్నకు జవాబు తెలుసుకొనే ప్రయత్నం మీద, మీరాజ్యం రావడము—మీచేత బంధించబడడము జరిగింది.''

అని విజయకుమారు చెప్పగా—''ఎటువంటి ప్రజ్ఞావంతుడూ జవాబు చెప్పలేని ఆగడ్డుప్రశ్న లెటువంటివి? వాటిని నేనుకూడా విని, సంతోషపడతాను.'' అని రాణీ ప్రమీల కుతూహలంతో నడిగి నందువల్ల, విజయకుమా రా ఐదుప్రశ్నలను ఆమె కీవిధంగా వివరించి చెప్పాడు—

1. ప్రతిజ్ఞ నెరవేరతేకాని, పెళ్లిచేసుకోనని భీష్మించుకున్న ఆరాజకుమారుడెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అత నింకా జీవించి వున్నాడా?

2. పురుషుడై వుండికూడా స్త్రీరూపంతో మహర్షిని మోసంచేసి, అతనిదగ్గరుండే మంత్రశూలము నపహరించి, అతనినికొట్టి తరిమి వేసిన ఆయువకుడెవరు? అత నింకా బ్రతికివున్నాడా? మృతుడైనాడా?

3. తపోధనమహారాజు ద్వితీయభార్య అయిన రూపసుందరి గతియేమయినది? ఆతపోధన మహారాజింకా బ్రతికివున్నాడా?

4. ప్రేమించిన వానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ స్త్రీ అయివుండికూడా పురుషవేషమును ధరించి, మహర్షిచే కామించబడిన ఆయిరువురు కాంతలనూ అపహరించి, మహర్షిని ఖండింపబూనిన ఆధీరురాలెవరు? ఇప్పు డామె జీవించివున్నదా? మృతి నొందినదా?

5. శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన ఆ భక్తురాలిని మహర్షి కామించిన కారణంవల్ల, ఆయిరువురనూ కారాగృహమున బంధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే తత్త్రాత్రేయ మహారాజింకా బ్రతికివున్నాడా? భక్తురా లెట్లున్నది?

ఆ ప్రశ్నల నాలకించిన రాణీ ప్రమీల తోకతొక్కిన తాచులాగ బుస్సున లేచి—

''వకుళా! సరళా! ఇంకా చూస్తారేం! తలారి నాయత్తపర చండి—సైనికుల హెచ్చరించి, యుద్ధానికి సంసిద్ధంకండి!''

అని ఆమె కిరువైపులావున్న అధికారులను హెచ్చరించగా, అక్కడి దర్బారులో వున్న స్త్రీజనాలందరూ లేచి నిలుచుని, ఒరల నుంచి కత్తులదూసి—

"జై! ప్రమీలా రాణికి జై! మహిళా రాజ్యానికీ జై!" అని యుద్ధచిహ్నంగా అట్టహాసధ్వనులు చేస్తుంటే, విజయకుమారు తెల్ల బోతున్నాడు.

"ఓరీ సరాధముడా! పంచకుడా! ఇప్పుడే చూడు! నీశిరస్సును వెయ్యిప్రక్కలు చేసి, నాకసి తీర్చుకుంటాను."

అని ప్రమీల భయంకర గర్జనలు చేస్తూ కత్తి మెరిపిస్తుంటే—

"దేవీ! ఇందు నా అపరాధమేముంది? మీరు చెప్పవలసిందని కోరినందువల్లగదా, నే నాప్రశ్నల నయిదింటినీ చెప్పాను? నాపై అకారణ వైరమెందుకు?"

అని విజయకుమారు సహజ శాంతి వచనములతో అడగ్గా—

"రాజకుమారా! నాక్రోధమంతా నీమీద కాదు. కాలమహర్షి అని దొంగపేరు పెట్టుకుని, చింతామణిని మోసం చేస్తున్న వాడొక దుర్మార్గుడు—కపటబైరాగి—నా చేత చావు తప్పించుకుని పరారియైె. యింకా నావిషయమై, తన ప్రశ్నలద్వారా తెలుసుకో గోరుతు న్నాడు. ఒకవేళ నేను చచ్చిన, తిరిగి నా రాజ్యమును చేరి తన ఆటలు సాగించాలని పూహగా తెలుస్తూంది. ఓరీ! దొంగబైరాగీ, నువ్వె క్కడ దాగినా సరే—నావనితా సైనికదళాలను పంపి, నీశిరస్సును నారాజ్యం తెప్పిస్తాను—వాలనగర సరిహద్దులో దానిని వ్రేలగట్టి స్తాను. ఈసారి నీకు చావు తప్పదు. రాణీ ప్రమీల ప్రతాపం నువ్వు తెలుసుకోగల సమయమొచ్చింది. రాజకుమారా! ఇక ఆలస్యం చెయ్యకు దుర్మార్గుడైన ఆదొంగబైరాగి వుండే నగరమెక్కడ? మార్గ మేది? జరురూగా చెప్పు, నాసైనికదళా లక్కడికిపోయి, ఆదొంగ బైరాగి శిరస్సు ఖండించి తెస్తారు. అప్పుడుగాని, నాఉద్రేకం చల్లా రదు. అప్పుడుగాని నాకసితీరదు."

అని, రాణీ ప్రమీల ఉద్రేకపూరితురాలై తిరిగి అంది.

"దేవీ! ఆబైరాగి మసలను దాటి యెక్కడికీపోలేదు—నువ్వు మాత్రం కొంచం శాంతం తెచ్చుకుని, ఆబైరాగికీ నీకూగల సంబంధ

మేమిటో—వాడు నీఆగ్రహానికి ఏందుకు గురిఅయినాడో—ఆవివరాలు దయచేసి నాకు కొంచం చెప్పాలి.''

అని విజయకుమారుడు కోరినందువల్ల, ఆమె ఆవేశము నంతటినీ అణుచుకుని,

''అవును. అవసరమే. వాడి ఐదు ప్రశ్నలలో నాల్గవ ప్రశ్న నాకు సంబంధించినది—దానిని నీవు తప్పక తెల్సుకోవలసివుంది. సావధానంగా విను—''

అని, అంతవరకూ ఆదర్బారులోనేవున్న తన మంత్రి, సేనాధిపతి మొదలయిన పరివార కాంగులందరనూ వారి వారి పనులమీద సాగనంపి, విజయకుమారుని బంధనాలను తాను స్వయముగా విప్పి, అతనినికూడా సమర్యాదగా కూర్చుండ నియమించి, తనగాధ నీవిధంగా చెప్ప నుపక్రమించింది.

౨౯

''నా మాతామహుడు, ప్రతాపగజపతి ఈవాలనగర సామ్రాజ్యాని కధిపతియై వుండగా, అతడు పుత్రసంతానంలేక దివంగతుడైనాడు. సింహాసనార్హతగల యితర వారసులుకూడా లేకపోయినందువల్ల, మాతల్లిగారయిన విక్రమరాణి పట్టాభిషిక్తురాలయింది. నాజనకుడు బలవర్ధనుడు. నా తలిదండ్రులకుకూడా నేనొక్కతెనే కుమార్తెను. వారు బ్రతికివుండగానే, నా అర్హతలు గమనించి, నన్నీ వాలనగర సింహాసనానికి రాణిగా చేశారు. నా పదునెనిమిదోయేట నేను రాణి నయ్యాను. నాతలిదండ్రు లిద్దరూ ఎక్కువ అన్యోన్యంగా వుండేవారు. నన్ను వీలయినంత త్వరలో రాణిగాచేసి, తాము తీర్థయాత్రాది దేశసంచార కార్యక్రమంలో శేషించిన జీవితాన్ని గడపాలని ఎప్పుడూ కుతూహలపడుతుండేవారు.

అందుచేత నాకు పద్ధాలుగేళ్లు వయస్సు వచ్చేటప్పటికి, గుఱ్ఱపుస్వారి—కత్తిసాములు—రాజ్యపరిపాలనాక్రమము—మొదలయిన అవసర విద్యలేగాక, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము, ధర్మసూత్రములు, నీతిశాస్త్రము, మొదలయిన సమస్తవిద్యలు, పూర్తిగా నేర్పించారు. అన్నిటిలో యుద్ధము నా అభిమానవిద్య. ఆ విద్యలో నన్నోడించగల ధీరు డింతవర కొక్కడూ పుట్టలేదు.

ఆమాట వినేటప్పటికి విజయకుమారునికి ఒళ్లు మండింది.

"అలా చెప్పకూడదు—విద్యలలో ఒకరిని మించినవారు ఒక రుండొచ్చు—మీకు సమిలయిన వీరులు మీకు తటస్థపడలేదనడంలో సభ్యతవుందిగాని, పుట్టలేదనడంలో అర్థంలేదు."

"నీవిద్యను పరీక్ష చెయ్యకుండా నిన్నిక్కడనుంచి బయటపడ నిస్తా ననుకున్నావా?"

అని ఆమె నవ్వుతూ ననగా—

"దేవీ! నేను కోరుకొనేదికూడా అంతమాత్రమే—ముందు చెప్పదలచిన గాథను పూర్తి చెయ్యి." అన్నాడు విజయకుమారు.

"సరే—ఒకటిగాకుండా నాపద్ధాలుగేళ్ల వయస్సులో నేనన్ని విద్యలలో పరిపూర్ణురాలినయ్యాను. ఎప్పుడూ అంత అన్యోన్యంగా వుండే మాఅమ్మ, నానగార్లకు ఒక్క విషయంలో మాత్రం అభిప్రాయ బేధాలు కలిగాయి. అదయినా, నావిషయంలోనే!

మా నాయనగారికి, ఒక వితంతు అప్పగారుంది. ఆ విడపేరు జగదాంబ. ఆమెకో కొడుకు అతని పేరు కాళిదాసు—అతని కాపేరు ఎందుకు వచ్చిందంటే, అతను గర్భంలో వుండగా, అతని తల్లికి చచ్చే టంతటి ప్రమాదం జరిగిందిట! ఆమె సుఖంగా ప్రసవించి బ్రతికినట్ట యితే, ఆడబిడ్డ పుట్టినట్టయితే, కాళికాదేవి అనీ, మొగబిడ్డ పుట్టి నట్లయితే కాళిదాసు అని, పేర్లు పెట్టుకుంటామనీ, అమ్మవారికి ఉత్స వాలు చేయిస్తామనీ మొక్కుకున్నారట. ఆపైన. ఆవిడ సుఖంగా ప్రసవించడము—మొగబిడ్డ కలగడము, జరిగిందిట. ఆ కాళిదాసుకు నాకంటె రెండేళ్లు ఎక్కువ వయస్సట!

ఇప్పుడింతకూ చెప్పొచ్చేదేమంటే, తమకు మొగసంతానం లేదు గాబట్టి మేనల్లుడయిన కాళిదాసుకు నన్నిచ్చి వివాహం చేసినట్ల యితే, అనుకూలంగా వుంటుందనీ—ఇల్లరికముండి, బాధ్యతగల మొగ దిక్కుగా వుంటాడనీ మానాయనగారి వాదన. కాళిదాసు నావిద్యా సౌందర్యాలకు తగిన వరుడుకాదనీ—వేరొక అర్హుడైన రాజకుమారుని నిర్ణయం చేయవలసిందనీ మా అమ్మగారి పట్టు. వారిలో వారికి తెగ తెంపులుగాక, కొన కాయిద్దరూ నాదగ్గిరికొచ్చారు. మా నాన్నగా రంటె నాకెందుకో అమితమయిన భక్తో—భయమో తెలీదుకాని— వారు చెప్పిందాన్ని ఆలోచించకుండా అంగీకరించడమే ఆదినుంచీ

నామతం! వారి కెదురు చెప్పగల సాహసం ఏ సందర్భంలోనూ, ఎన్నడూ లేదు. అందువల్ల వారు నన్నేమీ అడక్కముందే మా అమ్మగారితో చెప్పేశాను.

"అమ్మా! నాన్నగారి మాటకు నేనెదురు చెప్పను—నువ్వు కూడా చెప్పొద్దు. వారి అంగీకారంతో మనం ఏకీభవించాలి."

అని నేను ఒక్కమాటతో విషయనిర్ణంచేశానని, మా నాన్నగారెంతయినా సంతోషపడ్డారు. కాని మా అమ్మగారు—

"తల్లీ! ప్రమిలా! అనాలోచితంగా మాటిచ్చినందుకు ఆనక విచారపడతావు సుమా! ఆజన్మాంతమూ అనుభవించవలసినది, దాంపత్యవిషయం."

అని మా అమ్మ నన్ను బెదిరించింది. నేను అప్పటికే మాటిచ్చానుగా? అందువల్ల మా అమ్మకు తిరుగు జవాబు చెప్పలేదు. కాని, మా అమ్మ అలాయెందుకందా అని దీర్ఘంగా ఆలోచించడం మొదలుపెట్టాను. మా మేనత్తలవ్వూరు, భీమపట్నం. మా వాలనగరానికి సుమారు వందయోజనముల దూరంలోవుంది. వారు తరుచు మానగరం వచ్చే అలవాటులేదు. మేమున్నూ పోయిందిలేదు. అందువల్ల, నాకు జ్ఞానమొచ్చిన తరువాత, ఆ కాళిదాసన్న యువకుణ్ణి నేను ఒక్కసారికూడా చూసివుండలేదు. నాన్నగారు చెప్పిందాన్ని అంగీకరించాలన్న నియమం తప్ప, యింకేమీ లేదు.

నిమిషాలమీద పెళ్ళి ప్రయత్నాలు జరిగాయి. శుభలేఖలు బంధు పరివారాల కందజెయ్యబడ్డాయి. ప్రయత్నాలు బ్రహ్మాండంగా జరిగించబడ్డాయి. ముహూర్తదినానికి ఒకరోజు ముందుగా భీమపట్నంచి మా మేనత్త జగదాంబ, పెళ్ళికొడుకు కాళిదాసు వగైరా పెళ్ళివారందరూ వచ్చి చేరుకున్నారు. రాజకుటుంబాలలో, అందులోనూ వాలనగరంవంటి విఖ్యాతనగర రాజకుమార్తె పెళ్లికి జరిగే ప్రయత్నాలెంతఘనంగా వుంటాయో—వేడుక లెంత అద్భుతంగా వుంటవో--అవన్నీ నువ్వూహించుకోగలవు. నేను చెప్పడమనవసరం! వంశసాంప్రదాయము ననుసరించి కత్తికి భామ్యం కట్టబడింది. పునస్సంధానపు మొదటిరాత్రే తెలుసుకున్నాను, నాపాపం బద్ధలయిందని. అమ్మమాట విననందుకు కుళ్ళి కుళ్ళి కుళ్ళి యేడ్చాను. కేవలం,

సోదరియందుండే ప్రీతికొద్దీ, నాన్నగారు అవివేకపుపని చేశారని, గ్రహించుకున్నాను.

ఎందుకంటే, కాళిదాసు కేవలం మూర్ఖుడు—విద్యావాసనలేని పశువు! సంస్కారంలేని ఒక జంతువు. ఇంకా యేమనాలో నాకు తెలీదు. నీతోకూడా యితర వివరాలు చెప్పడం నాకిష్టంలేదు. నామనస్తాపం ఒక్కరికి తెలియనియ్యలేదు. నాపడకటింటి రహస్యం నాటికీ నేటికీ రహస్యంగానే వుండిపోయింది. నేను మాత్రం ఆ జంతువును తాకలేదు—ఆపశువు నన్ను నిర్బంధం చెయ్యలేదు. ఆ అంతరార్థం నా అంతరాత్మకి మాత్రమే తెలుసు. ఆ మూడురోజులూ సక్రమంగానే జరిగిందని అందరూ అనుకున్నారు. మరోలా అనుకొని ఒకరు చేసేదేముంది? అనంతరం కాళిదాసును మానగరంలో, నాతోనే వుండవలసిందని కోరడానికి సిద్ధంగా వున్నప్పుడు—

"ఇప్పుడెవరూ యిక్కడుండవలసిన పన్లేదు. నేను కొంతకాలం ఒంటరిగానే వుండాలని కోరుకుంటున్నాను. నామనస్సెప్పుడు భర్తపై మళ్లితే అప్పుడు పిలిపించవచ్చు—అంతవరకూ, యీ విషయంలో మాత్రం మీరు కల్పించుకో నవసరంలేదు."

అని నేను మానాన్నగారికి స్పష్టంగా చెప్పేశాను. దానికి వారే గాకుండా మా అమ్మకూడా తెల్లబోయింది. మానాయనగారికి నే నెదురుమాట చెప్పిన మొదటిసారి, ఆఖరు సారీకూడా అదే! తరువాత కాళిదాసు సయితంగా ఎక్కడి పెళ్లివారక్కడికి వెళ్ళిపోయారు నామనస్తాపమంతా నేను చెప్పకపోయినా, మా అమ్మకు మాత్రం తెలుసు. ఆమెకూడా నాలాగే, పైకెవరితోనూ ఏమీ అనకపోయినప్పటికీ, లోలోపల కుళ్ళి కుళ్ళి యేడ్చింది. నా యౌవనసౌందర్యాలు వ్యర్థమని నిరాశచేసుకుని, అధోలోకంలోకి కుంగిపోయింది. ఆమె మంచం పట్టడానికికూడా అదేకారణ మనుకుంటా.

నాకు వివాహమయిన దగ్గర్నుంచీ ఆమెకు స్వస్థత చెడిపోయింది క్రమంగా ఆమనోవ్యాధి తీవ్రతరరూపం ధరించింది. ఎన్ని వైద్యాలు చేయించినా ప్రయోజనం లేకపోయింది. ఒక సంవత్సరం ఎలాగో మంచంమీద తీసుకుంది. ఒకనాడు నన్ను చేరబిలిచి—

"తల్లీ! మొదట్లో చెబితే విన్నావుకావు. కాళిదాసు విషయం నాకాదినించీ తెలుసు. వాణ్ణి చేసుకుంటే, నీజీవితం అడివిని కాసిన

వెన్నలవుతుందని నే నెరుగుదును. తెలిసివుండే నీకేమీ వుపకారం చెయ్యలేకపోయాను. నాన్నగారాజ్ఞ సుగ్రీవాజ్ఞగా పాటించావు. దాని విపరీత ఫలితాలు నువ్వు చెప్పకపోయినా, నాకు తెలుసు. తెలుసుండీ, చెయ్యగలిగిందేముంది. నారోజులుకూడా అయిపోయి నాయి—రేపో నేడో, తెలియదు.''

అని మా అమ్మ చెబుతుంటే నా కేడుపొచ్చింది. పసిపిల్లలాగా ఒక్కసారి భావురుమని, ఆసంవత్సరంనుంచీ కరుడుకట్టిన కన్నీళ్లన్నం టినీ ఒక్కసారి దిమ్మరబోసాను. అమ్మ నన్ను తన గుండెలకు హత్తు కుంది.

''ఏడవకు తల్లీ—ఏడవకు, తల్లినైవుండీ నీగీతను చెరపలేక పోయాను. మీ నాన్నగారికయినా నీమీద కక్షలేదు—కార్పణ్యం లేదు. తోబుట్టువు మీదవుండే మమకారంకొద్దీ యిలా చేశారు. నీజీవిత మింత చేటు వ్యర్థమవుతుందని వారనుకుని ఊహించలేదేమో-నీకయ్యా మందిరపు సందుల్లోంచి, కళ్ళారా చూసిందాన్ని గాబట్టి నాకంతా తెలుసు. హంసతూలికాతల్పము నోగు నువ్వామూడురోజులూ కటిక నేలమీద పడుకోవడం నాకు తప్ప యింకెవరికి తెలు...''

అని అమ్మ యింకా యేమో చెప్పబోతుంటే నే నామె నోటికి నా చేతులడ్డం పెట్టాను.

''ఒద్దమ్మా! ఒద్దు—ఆభయంకర కాళరాత్రులు తిరిగి యెందుకు స్ఫురణకు తెస్తావు?'' అన్నాను.

''అంతా గతజలసేతుబంధనం. నాప్రాణం పోయేలోపుగా ఒక్కమాట చెప్పాలనుకుంటున్నా తల్లీ! వింటావా?''

''ఇకకూడా నీమాట వినకుండావుంటానా అమ్మా?''

అమ్మ నాలుగువైపులా చూచి, ఎవరూ లేకపోవడం గమ నించి, మెల్లిగా నాతో అంది.

''నువ్వు అనాఘ్రాతపుష్పానివి—నీకన్యాత్వాని కేటువంటి కళం కమూ రాలేదు—తిరిగి నీకొచ్చిన మరొక వరుణ్ణి స్వీకరించి, జీవితం సార్థకంచేసుకో అమ్మా! వంశాన్ని నిలుపు! ఇదీ నాకడసారికోరిక—''

అని అమ్మ యిక మాటలాడలేదు. కళ్లుమూసుకుంది. ఆయాసం గావుందేమోనని కసిన్ని నీళ్లు గొంతుకలో పోశాను అయిదారు గుక్కలు మింగింది. ఇక మింగలేదు. పళ్లు గిట్టకరుచుకున్నాయి—

"అమ్మా! అని నేనొక పెనుకేక వేసి మీదపడ్డాను. నాన్నగారే గాకుండా, మందిరంలోని అశేషజనమూ, నా కేకవిని, మూగారు. ఎందుకు? ఎవరేం చెయ్యగలరు? అమ్మకీ భూమిమ్మీద ఋణం తీరిపోయింది ఆమె ప్రాణవాయువు లీ అనంతవాయువుల్లో అంతకుముందే లీనమై పోయాయి. అందరికీ విషయం స్పష్టమైంది. మా నాన్నగారే గాకుండా, కోటలోని అశేషజనమూ కంటనీరు పెట్టుకున్నారు. అదంతా మా మామూలే—చచ్చినవారితో చావగలవారెవ్వరు? విధివిధాయకంగా అమ్మకు ఉత్తరక్రియలు జరిగించబడ్డాయి. ఆరి ఆరుమాసాలవరకూ నాకు మనస్థిమితం చేకూరలేదు అంతపైన క్రమంగా మనుషుల్లో పడ్డాను. లేకపోతే సృష్టి జరగదని గాబోలు, చచ్చినవారి దుఃఖాన్ని తగ్గించే చికిత్స ప్రకృతిలోనే యిమిడ్చబడివుంది. మొదటిరోజు దుఃఖం రెండోరోజున, మొదటివారం దుఃఖం రెండోవారాన, మొదటి మాసంలోవుండే దుఃఖం రెండోమాసంలోనూ, వుండక క్రమంగా తగ్గుతూవచ్చేందుకు కారణం. కాలంలో వుందా? కాలాన్ని నడిపించే పరమేశ్వరుడి లీలలో వుందా?

తరువాత, మరికొన్నాళ్ళకు కాళిదాసు విషయమై నాన్నగారు ఒకటి రెండుసార్లు నన్ను హెచ్చరించారు.

"నాభర్తతో కాపరంచేసే విషయం నాకు తెలిదా నాన్నా! మీరు మాత్రం యింకెప్పుడూ, అందును గురించి హెచ్చరించకండి!"

అని నేను ఖండితంగా చెప్పినందువల్ల, వారిక అందును గురించి నాకు మరెప్పుడూ చెప్పలేదు. మనసులో ఏమనుకున్నారో నాకు తెలీదు—నాకనవసరంకూడా, అక్కగారి దగ్గరనుంచి. ఏమేమో వార్తలొస్తుండేవి—జాబులు నడుస్తుండేవి. వాటి వివరాలుకూడా, నేనెప్పుడూ తెలుసుకోవాలని ప్రయత్నం చెయ్యలేదు. దరిమిలా నాలుగు సంవత్సరాలూ, నావిద్యలో, ముఖ్యంగా యుద్ధవిద్యలో మరీ యెక్కువ సాధన చేశా. నాకు పద్దెనిమిదేళ్లొచ్చేవరకు మాత్రమే నాన్నగారు రాజధానిలో నన్ను కనిపెట్టివున్నారు. చిరకాలంనుంచీ వున్న యాత్రలు సేవించాలన్న కోరిక నప్పుడు తీర్చుకోవాలని నిశ్చయం చేసుకున్నారు. దేశసంచారాని కవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకున్నారు. అప్పుడిక నాకు పట్టాభిషేక మహోత్సవమును జరిపి, అమ్మగారి సింహాసనానికి నన్ను రాణిగాచేసి, సమర్థులయిన మంత్రి

పరివారాలను నియమించి, తాము తమ సంచారక్రమము ననుసరించి బయలుదేరారు.

అప్పటినుంచి నాతలపై యెన్ని బాధ్యతలు, యెన్ని బరువులు! నాన్నగారు, యాత్రకులకు వెళ్ళినతరువాత, మా అత్తగారి దగ్గర నుంచి నాకెటువంటి ఒత్తిడికలుగలేదు, నాన్నగారు వాళ్ళ కేమని రాశారో—ఎటువంటి ఏర్పాటు చేశారో నాకు తెలియదు, వాళ్ళు మాత్రం నా ప్రస్తావన పూర్తిగా విరమించుకున్నారు, పరమసంతోషం మనుకున్నా! కాని, నేను రాణినై సింహాసనము నాక్రమించిన వెంటనే ఒక విపరీత పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది.

నువ్వీనగరం ప్రవేశించేటప్పుడు 'వాలనగరపు సరిహద్దు' అని ఒక పలకపై చెక్కబడి వుండడమును నువ్వు తిలకించివుంటావు. ఆసరిహద్దుకానించి కుడిప్రక్కగా అమృతసరోవరమనే ఒక చక్కటి సరస్సువుంది, చూశావా?''

అని రాణీ ప్రమీల అడగ్గా—

''వాలనగరపు సరిహద్దు—అని పలకమీద చెక్కబడి వుండడమును చూచానుకాని, సరోవరమును మాత్రం చూడలేదు.''

అని విజయకుమారు జవాబు చెప్పాడు.

''ఆసరిహద్దు నిర్ణయం ఎప్పుడు నిర్ణయించారో—ఎవరు నిర్ణయంచారో తెలిసినవారులేరు. ఆ సరస్సు గట్టుమీదగల గున్న మామిడులవల్ల, ప్రయత్నించినవారికి గాని, సరస్సు కనపడదు. అటువంటి సరస్సు భూమండలంలో ఎక్కడాలేదట! దానిని చూడ్డానికి దూరదేశాలనుంచి ఎందరో వచ్చిపోతుంటారు. దానిచుట్టూ అహర్నిశలు సాయుధపాణులు కావలికాస్తుంటారు. ఆ అమృతసరస్సుయొక్క విశేషమేమిటంటే—దానిలోని నీరు ఇంకదు—తరగదు—వెయ్యి సూర్యుల ఎండరానియ్యి—ఆసరస్సులో ఒక చుక్క తరగదు, అందులో నీరు కరిగించిన మేలిమిబంగారం లావుంటుంది, చేతితో తాకవచ్చు—తాగవచ్చు, చూపులకు మాత్రమది కరిగించినా బంగారపునీరు! రుచికి, వాసనకు, లేతకొబ్బరి నీరు–అతిమధురము, ఆనీటిలో యెప్పుడూ సుమారొకవంద బంగారు హంసలు తేలి ఆడుతుంటాయి! ఆ హంసలు నీరుమాదిరి కేవలం రంగు మాత్రమేగాక, నిజమైన మేలిమి బంగారమని, పరిశోధనలుచేసి తెలుసుకున్నారు. వాటిని

మన మివతలకులిసి, మామూలు బంగారముగా చలామణీ చేసుకో వచ్చునట! అవి బంగారు విగ్రహాలుగాక, సజీవములు—ఊతలాడు తవి—పలుకుతవి! అదే గొప్పవిశేషం! ఆవింతను చూడడానికే దేశ దేశాలనుంచి జనంరావడం!

మన ప్రస్తుత కథా విషయమేమిటంటే, అమృతసరస్సు సగ భాగం వాలనగరం సరిహద్దులోకి—మిగిలిన అర్థభాగం అవతలి రాజ్యపు సరిహద్దులోకి వుంది. అవతలి రాజ్య మెవరిదంటే—అది, శృంగార పట్నపు మహారాజు శ్రీమంతుడిది. ఆ సరస్సును గురిం చిన తగాదాలు, వాల, శృంగార నగరాలనడుమ, ఎప్పుడూ వున్నవి. అమృతసరస్సు తమ సరిహద్దుల్లో చేరవలసిందనీ—దానిచుట్టూ బల మైన ప్రహరీకట్టించుకుని, తమరాజ్యంలో కలుపుకుంటామనీ, శృం గార పట్న సంస్థానాధీశులంటారు. అలాకీల్లేదు—అమృతసరస్సు వాలనగరాధిపతుల హక్కు అని మావాళ్లూ, చిరకాలంనుంచీ పేచీ పడుతూనే వున్నారు—కాని ఎటూ పరిష్కారంకాలేదు,

సరిగ్గా నేను సింహాసనానికి రాగానే ఆపేచీ ప్రబలరూపం దాల్చింది. అమృతసరస్సు తమహక్కు భుక్తాల్లోదని అంగీకరించి, తక్షణం తమవశం చెయ్యకపోయినట్లయితే—యుద్ధం ప్రకటిస్తున్నా మని, శృంగారనగరాధిపతి మాకు అత్యవసరలేఖ పంపాడు.

మా అమ్మ నాన్నగార్లు రాజ్యపాలన చేస్తున్న సమయంలో, బుద్ధిసాగరుడు అని ఒకమంత్రి వుండేవాడు. మా అమ్మగారి పట్టాభి షేకము పరిడెరుగునట! అతనికి వకుళ, సరళ అనే యిద్దరు కవల పిల్లలు. ఆ యిద్దరూ సుమారు నావయస్సే కలిగి, నాతోనే చదువు కున్నారు. మేముగ్గురం ఒక తల్లి బిడ్డల్లాగ, అతిప్రేమతో వుండే వాళ్ళం. మా అమ్మగారు పోవడము, నాయనగారు నన్ను రాణిగా చేసి, తాము, యాత్రలకు బయలుదేరడము జరుగుతున్న సమయంలో అప్పటికే వృద్ధాప్యంలో వున్న మంత్రి, బుద్ధిసాగరు—

"నావయసు నూరు సమీపించింది—ఇక కొలువు చెయ్యలేను. రాణీ ప్రమీలాదేవికి మరొకమంత్రిని నియామకంచేసి, నాకు విశ్రాంతి నీయవలసిందని కోరుతున్నాను."

అని చెప్పగా, మా నాయనగారు, నాకు తగిన మంత్రియెవరా, అని యోచనలు మొదలుపెట్టారు. అప్పుడు నేను చెప్పాను—

"మంత్రికుమార్తెలయిన, వకుళ సరళాదేవులు అధిక బుద్ధిమంతులు, వివేకంలో, వారు తండ్రికి తీసిపోరు, విశేషించి నాకు ప్రాణ సఖులు. ఆయిద్దర్నీ నాకు మంత్రులుగా నియమించడం మంచిది."

నాసలహాను అభినందించడమే గాక, మా నాయనగారు తక్షణం ఆ యిద్దరు కవలబిడ్డలనూ రావించి నాకు మంత్రులుగా నియమించారు. తన పదవిని తనకుమార్తెలు పొంగలిగినందుకు, బుద్ధిసాగరుడుకూడా అమితమైన సంతోషమును పొందాడు. అనంతరం మా నాయనగారు, తీర్థయాత్రల కార్యక్రమము ననుసరించి బయలుదేరడం నేనిదివరకే నీకు చెప్పాను. నాకు మంత్రులయిన వకుళా సరళను నువ్వు చూచివుంటావు. నువ్విక్కడకు గొని రాబడినప్పుడు, నాట్య సమావేశంలో, నాకిరువయిపులా కూర్చునివున్న ఆయిద్దరే వకుళా సరళలు, నా మంత్రులు.

శ్రీమంతుడు పంపిన అత్యవసర రాయబారమును గురించి యోచనలు జరపడానికి, వకుళా సరళను రావించి, ఆ మహారాజు పంపిన లేఖను వారిచేతికిచ్చి, కర్తవ్యము నాలోచించవలసినదని చెప్పాను.

"తండ్రి తాత పరిపాలనా కాలంనుంచి, మనహక్కు భుక్తములోవున్న అమృతసరస్సు నిప్పుడామహారాజు వశంచేసి, మన పెద్దలకీర్తికి మచ్చతేవడానికి, మనమేమంత చేతకాని వాళ్లము కాదుగదా!" అన్నది వకుళాదేవి.

"రాణీ ప్రమీల స్త్రీ—ఆమెకు మంత్రులుగా వున్నవారు స్త్రీలు—ఇదేనసమయంలో ఆడవాళ్ళను బెదిరిస్తే, అమృతసరస్సు తన వశమవుతుందని శ్రీమంతుడనుకొంటున్నాడు కాబోలు—సింహశార్దూలలలో ఆడవున్నవి, అందుకవి మేకలకు వశమవుతవా? స్త్రీల పౌరుష ప్రతాపాలను చవి చూడవలసివుందని, తక్షణం ఆమహారాజుకు వార్తా పంపవలసివుంది." అన సరళాదేవి ముఖకండల నెరుపు చేసుకుంది.

"దేవా! అమృతసరస్సును పరుల ఆధీనం చెయ్యడానికి వీల్లేదు. యుద్ధమే కర్తవ్యం."

అని వకుళాదేవి తన తుదినిర్ణం తెలిపింది.

"మంచిది. అయితే యిప్పుడే మహారాజులేఖకు బదులు వ్రాయండి! యుద్ధానికి సంసిద్ధులమై యున్నామని తెలుపండి!"

అని నేను మంత్రుల అభిప్రాయాలతో ఏకీభవించి, సైనిక దళాలను సిద్ధంచేసి, యుద్ధానికి సంసిద్ధం కావలసిందని ఆజ్ఞలు చేశాను. నాచేవ్రాలుతో, మంత్రులు, శ్రీమంతుడి లేఖకు బదులు వ్రాసి పంపారు. ఆక్షణంనుంచి, యెల్లరూ యుద్ధప్రయత్నాలలో వున్నారు.

అమృతసరస్సుకు చుట్టు రెండామడలమేర ప్రత్యేక సిబ్బంది వుంచబడింది. అటుపైన రథ, గజ, తురగపదాది దళములు తయారుగా వుంచబడ్డాయి. నేను ప్రత్యేకించి, అమృతసరస్సు రక్షణకై నియోగించుకున్నాను. వకుళా సరళలు సరిహద్దు సైన్యాలకు నాయకులుగావుండి—నగర సింహద్వారమును సంరక్షించడానికి నియోగించబడ్డారు—వాలనగర సరిహద్దు మొదలుకొని, అటు శృంగారనగరం వైపు మరికొన్ని సైనికదళాలు పురోగమిస్తున్నసమయంలో, మధ్యమార్గమున సంధ్యావళీ అను ఒక కొండప్రాంతంలో శ్రీమంత మహారాజు సైన్యాలు మాసైనాలకు ఎదురు సన్నాహమై తలబడ్డవి. రెండుపక్షాలకు పోరు ప్రారంభమై ఐదుదినాలవరకు ఘోరయుద్ధం జరిగింది. ఏ పక్షమూ జంకలేదు. ఎవ్వరూ ఒక్క అడుగయినా వెనక్కు తగ్గలేదు.

నేను కొన్ని ప్రత్యేకదళాలను చేతికిందవుంచుకొని అమృతసరస్సును కాపాడ్డానికి సిద్ధంగా వున్నాను. ఆరవనాడు కూడా సంధ్యావళీ కొండప్రాంతంలో రెండుపక్షాలూ తీసిపోని పరాక్రమంతో పోరు జరుపుతున్నారు. ఆసంధ్యా కొండప్రాంతానికీ అమృతసర్సుకూ సుమారు పదిరాళ్ళ దూరముంటుంది. ఆపదిరాళ్ళ దూరమూ మా సైన్యాలు ఆవరించుకునే వున్నాయి. అంతదూరందాటి, ఆపొడుగునా వున్న సైన్యాలను ఓడించినపప్పుడుగాని, అమృతసరస్సును ముట్టడించడం జరగదు. అందుకని నేను చాలా ధైర్యంగా వున్నాను. నా ప్రత్యేక గుడారంలో కొంచం ఏమరి, నిద్రపోతున్నాను. ఒక రాత్రివేళ కత్తుల ఝుళిపింపులు—గుఱ్ఱముల పరుగులు, యుద్ధభటుల హుంకారాలూ విని ఉలికిపడి లేచాను. అమృతసరస్సు ముట్టడి జరుగుతూంది. నా ఆశ్చర్యానికి మేరలేకపోయింది. ఐదురోజులలో

మాసైన్యాలను ఒక్క అడుగు వెనక్కు కదిలించలేని శ్రీమంతుని సైన్యాలు ఒక్కరోజులో పదిరాళ్ళదూరము నావరించిన దళాల నెలా నోడించి, యింతలో అమృతసరస్సు నెలా ముట్టడిస్తున్నాయా అని తెల్లబోయా. విచారించగా అక్కడ సంధ్యావళీ కొండప్రాంతంలో యుద్ధం యథాప్రకారంగానే జరుగుతున్నదనీ—మన సైన్యాలు జంకనేలేదనీ—మరికొన్ని దళాలు మాత్రం మరొక రహస్యమార్గాన వచ్చి అమృతసరస్సును చుట్టుముట్టాయనీ తెలిసింది. నేనిక ఆలశ్యం చెయ్యక వెంటనే కదనరంగాని కురికాను. మాసైన్యాలు శత్రు సైన్యాలకు లొంగిక, ఎదిరించి, మహాపరాక్రమంతో పోరుతున్నాయి. నేనున్నూ విరోధి సైన్యాల మధ్యలో కురికి, రెండుచేతులా రెండు కత్తులూపట్టి యెదురైనవారి శిరస్సులు పుంఖాను పుంఖాలుగా తెగ టారుస్తూ, ఒళ్లు తెలియని ఆవేశంతో విజృంభిస్తున్న సమయంలో, ఒక శత్రువీరుడు హఠాత్తుగావచ్చి, నారెండు కరవాలములలో ఒక దానిని, తన కత్తితో పడగొట్టాడు. నేను జంకక, ఆవీరు నెదుర్కు న్నాను. మాయిరువురకు రెండు గంటలసేపు ఘోరమైన పోరు జరి గింది. ఆరెండు గంటలలో మాసైన్యాలు చాలా పల్చపడిపోయినట్లు కనుపించింది. దానివల్ల కొంచ మధైర్యం కలిగింది—అయినా జంకక, నన్నెదుర్కొంటున్న వీరుని పడగొట్టడానికి ప్రబలప్రయత్నాలు చేస్తున్నాను. కాని సాధ్యంకావడంలేదు. నాదెబ్బను కాసుకుంటూ, తిరిగి దెబ్బ తీస్తున్న వీరుడు, నేనతని దెబ్బకు కాసుకుని, తిరిగి కత్తిని విసిరేలోపుగా అతని గుఱ్ఱం ఛంగునగెంతి నావెనుకవైపు కురుకు తూంది. నాతో పోరడానికొచ్చిన ఆయోధుడు, సామాన్యమైనవాడు కాదని అర్థమయింది. ఇంతలో మాసైనికులలో ఒకడు నారెండవ చేతికి బల్లెము నందించాడు. నేను ఒక చేతిలో కత్తిపట్టి పోరుతూ, గుఱ్ఱం నావెనుకకు గెంతినప్పుడు అదనుచూసి బల్లెమును వెనక్కు విసిరాను—నేను విసిరిన బల్లెం సరిగా యోధుడికంఠంలో గుచ్చు కుందేమో, అతను తత్క్షణం గుఱ్ఱంపైనుంచి క్రిందపడిపోయాడు. నా అనుచర సైనికులు వెంటనే అతన్ని బంధించి గుడారంలోకి తీసుకు పోయారు. మిగిలిన దళాన్ని యెదిరించడానికి నాకెక్కువకాలం పట్ట లేదు. ఒక్కవ్రేటు కొక్కగుంపుగా పడగొడుతూ, ఎక్కడచూచినా నేనై, శత్రుసైన్యాలను చిందరవందరచేసి పారేశాను. చావగా మిగి

లిన కొద్దిమంది శత్రుభటులు పలాయనమై, సంధ్యావళీ కొండదగ్గరి, తమ యితరసైన్యాలను చేరుకున్నారు.

నేను అమృతసరస్సును భద్రంగా సంరక్షించుకోమని, నా సైన్యాలను హెచ్చరించి, నేను సంధ్యావళీ కొండప్రాంతం చేరేటప్పటికి, అక్కడ నాదళాలు శత్రుమూకలను చాలాదూరం వెనక్కునెట్టాయి. నేను మరింత ఉత్సాహంతో నాసైన్యాలకు సహాయపడ్డాను. నేను పోరులో పాల్గొన్న మరి కొంత సేపటికి, విరోధి సైన్యాలు తిరోగమనం ఆరంభించాయి—వారిని పూర్తిగా పారద్రోలింతరవాత, మమ్మల్ని ఎదిరించి పోరడానికి ఒక్కడూ లేకపోవడం గమనించి, అప్పుడు నేను మాసైన్యాలతో వెనక్కు మళ్లాను.

నేను సింహాసనానికి వచ్చాక, అది తొలియుద్ధం! ఎనిమిది రోజులు ఘోరమైన పోరు సలిపినా, అమృతసరస్సు శత్రువులవశం కానందుకు, నాలో నాకు చాలా సంతోషం కలిగింది. నాకది మొదటి యుద్ధం మొదటి విజయం!

## 30

ఆ వుదయం నాకు చాలా ఉత్సాహంగావుంది—ఎనిమిదిరోజులు యుద్ధం జరిగిన బడిలికగాని, అలసటగాని ఏమీ లేదు. మామూలు కాలకృత్యాలు తీర్చుకుని దుస్తులు ధరించి, దర్బారుకు బయలుదేరే సమయంలో ఒక పరిచారిక వచ్చి—

"మహారాణీ! గతరాత్రి యుద్ధంలో పట్టుబడిన యోధుడు, చావుబ్రతుకుల్లో వున్నాడు. వానిని ఏమి చెయ్యవలసిందిగా చెబుతారో అని, కారాగృహాధిపతులు తమ ఆజ్ఞలకై వేచివున్నారు." అని చెప్పింది.

నాతో పోరిన ఆయోధుని పరాక్రమంతా నాకప్పుడు స్ఫురణకు వచ్చింది. ఆ అమూల్య ప్రాణాన్ని రక్షించడం అవసరమని నాకు తోచింది.

"అతన్ని తక్షణం నామందిరానికి చేర్చవలసివుంది—ఆస్థాన ఘనవైద్యులను రావించి చికిత్స చేయిస్తూవుండండి! నేను దర్బారు నుంచివచ్చి, అతన్ని చూస్తాను."

అని నే నాజ్ఞాపించిన వెంటనే పరిచారిక, నా ఆజ్ఞలను అమలు జరిపించడానికి వెళ్ళింది. నేను దర్బారును చేరుకొనేటప్పటికి, వకుళా సరళలు హాజరుగా వుండడం మామూలు. కాని ఆనాడు వారు లేరు. గత యెనిమిదిరోజులనుంచీ జరిగిన యుద్ధంవల్ల, బడలికపొందివున్నారేమో అని, నామందిరానికి చేరువలోనే వున్న వారి భవనానికి వర్తమానము పంపాను. గత యెనిమిదిదినాలనుంచీ వారు ఇంటికే రాలేదనీ, వారి భోగట్టాను తక్షణం తెలియచెయ్యవలసిందని వారి తండ్రియైన వృద్ధమంత్రి ఖంగారు పడుతూ తిరిగి వర్తమానం పంపాడు.

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆకన్యల విషయం ఏమయిందీ ఊహించడానికి కూడా ఆధారాలు కనుపించడంలేదు.

ముఖద్వార రక్షణకై నియమించబడ్డ, వారు కాలుకదుపవలసిన అవసరం కలుగలేదే! జరిగిన యుద్ధమల్లా సంధ్యావళీ కొండప్రాంతంలోను—అమృతసరస్సు దగ్గర—అంతేగదా! వకుళా సరళలు యుద్ధం చెయ్యవలసిన అవసరమే కలుగలేదే! అటువంటి వారేమైనట్లు? ఒకరుగాక, యిద్దరూ కనుపించడంలేదే!

ఒకవేళ, అమృతసరస్సు ముట్టడి జరుగుతూందని తెలిసి—నాకు సహాయంగా అక్కడికొచ్చి, ఆయుద్ధంలో హతులై వుంటారా! యుద్ధంలో వారంత తేలిగ్గా హతమయ్యేవారుకారే! ఆటలలో ఒక్కొక్కప్పుడు నన్నుకూడా ఓడించగల చాకచక్యంగలవారే! బుద్ధిచతురతలో ఎంత దిట్టమైనవారో—యుద్ధరంగంలోకూడా అంత గట్టివారేనే! మంత్రిపదవుల కెంత అర్హులో, సర్వసైన్యాధిపత్యం వహించడానికికూడా అంత అర్హతగలవారేనే! వారేమయినట్లు? ఇప్పుడు నాకర్తవ్యమేమిటి?

అని నేను పరిపరివిధాల ఆలోచించాను. అది ఊహాకందని విషయమైంది. వకుళా సరళలు నాకు మంత్రులేగాక, ఆదినుంచీ ప్రాణతుల్యులు. వారిజాడ తెలియడంలేదనగానే, యుద్ధ విజయంవల్ల కలిగిన సంతోషమంతా మటుమాయమైంది. ఆయిద్దరు కవలలూ, ఒక్కరోజు కనుపించకపోతే, నారెండు భుజాలూ తెగినట్లుంటుంది. నాకు మతిపోయింది. ఏంచెయ్యాలో—ఏందారో తెలియడంలేదు. వెంటనే సైనిక ముఖ్యులను రావించి, వకుళా సరళల జాడ తెలుసుకోవలసిందనీ, అమృతసరస్సు—సంధ్యావళీ ప్రాంతము, ఆరెండుతావుల్లోనూ,

సైనికభట మృతకళేబరాలన్నింటినీ గాలించవలసిందనీ అప్పటి కాజ్ఞా పించి, నేను వెంటనే చావుబ్రతుకుల్లో వున్నాడన్న ఆయోధుని చూడానికి వెళ్లాను.

నామందిరంలో ఒక గదిలో చేర్చబడిన ఆ యోధుడికంతకు ముందే సంస్థాన వైద్యులువచ్చి, కట్టుకట్టడం ముగించారు. నేను వెళ్లేటప్పటికి చేతులు కడుక్కుంటున్నారు.

"ఆయోధుడి పరిస్థితి యెలావుంది?"

అని నేను ఆదుర్దాగా అడిగినదానికి ఆస్థాన ప్రధానవైద్యుడు.

"కంఠంలో చాలా బలమైన గాయమొకటి బల్లెమాకృతిలో లోతుగావుంది. రక్త స్రావ మెక్కువయింది. ఒంటిమీద, ఒకటి రెండు చిన్నగాయములున్నవిగాని, అవి యేమంత ప్రమాదకరమయి నవి కావు—ఇప్పటికి జీవించివున్నాడు. కాని సాయంకాలవరకూ చూచి గాని, బ్రతుకు ఖాయమని చెప్పలేము."

అని చెప్పినమీదట, నేనతను పరుండ చెయ్యబడ్డ పక్కకు సమీపంగావెళ్లి చూచాను. కళ్లు మూసుకుని వున్నాడు. అతని కంఠానికి చుట్టూ కట్లు కట్టబడివున్నాయి. ముప్పయి సంవత్సరాలకు లోపు వయస్సున మంచి స్ఫురద్రూపిగా వున్నాడు. రాత్రి చీకట్లో అతని ఆకారము నంతపరిశీలనగా లేదుగాని, అతడు గొప్ప అంద గాడని చెప్పుకోవచ్చు. ముఖాన పౌరుష పరాక్రమాలు విరజిమ్ముతూ, వీరలక్షణాలు చిందులాడుతున్నాయి. అంతటి ప్రతిభాశాలి యెవరో నాచేత గాయపడ్డాడుగదా, తనదళానికి విజయంకలగాలనీ-తాను తన ప్రభు మన్ననలు పొందాలనీ కదా, ప్రాణాన్ని తృణ ప్రాయంగా యెంచి అంత సాహసంచేశాడు! అన్న ఆలోచనలు నాహృదయంలో తట్టినప్పు డాతనిపై నాకోవిధమయిన సానుభూతి, జాలీకలిగాయి. అతను బ్రతుకుతే బాగుండుననిపించింది. అటువంటి వీరశిఖామణి నిర్జీవుడు కాకూడదనిపించింది! పలకరించాలని చూశా కానీ, అతను పలికేస్థితిలో లేడు. ఇద్దరు పరిచారికలను మాత్ర మతని ఉపచర్యలకు నియమించి, అతడు మాటలాడగల స్థితివచ్చినప్పుడు నాకు కబురు చెప్పవలసిందిగా ఆజ్ఞాపించి, నాపనిమీద నేను వెళ్లాను. కాని, మనస్సంతా వికలమైవుంది. వకుళా సరళలు కనుపించడం

లేదన్న విషయ మంతకుముందే నన్ను బాధపెడుతుంటే, ఇప్పుడీ యోధుని కొత్త విషయమొకటి నన్ను వేధించడం మొదలుపెట్టింది.

అతన్ని చూడకమునుపు నాకెటువంటి బాధాకలగలేదు. చూచింతరవాత మాత్రం నాకెందు కాతని జిజ్ఞాస? రణరంగంలో విజయసాధనకోసం ఎందరు వీరులు గాయపడరు? ఎందరు యోధులు హతమవరు? వారందరూ ఎవరిచేతుల్లోనో అలా అయినారు గాబట్టి నాకే విచారమూ లేకుండా పోయిందనుకున్నా? అది సహేతుకంగా కనుపించలేదు. స్వయంగా నేను యుద్ధం చేస్తున్నప్పుడు నా కరవాలానికి ఎందరు గురికాలేదు? ఎందరు గాయపడలేదు? వారినిగురించి నాకే విచారమూ లేదే! ఇప్పుడీ యోధుడు మాత్ర మటువంటివాడు కాడా? ఇతన్ని గురించి మాత్రం నామనస్సెందుకు బాధపడాలి? అతను సజీవుడు కావాలన్న తహతహ నా హృదయాని కెందుకుకలగాలి? ఈ ప్రశ్నలన్నిటికీ నాకు తృప్తికరమయిన జవాబు రావడంలేదు. అతను నాశత్రుపక్షంలోవాడు—చస్తే నాకెందుకు బ్రతుకుతే నాకెందుకు? అని ఒకటి రెండుసార్లు మనస్సును మళ్లించుకోవాలని చూశాను. ఊఁ హుఁ! సాధ్యపడలేదు. నామనసు నా అదుపులో లేకుండా పోయిందన్నమాట! అతను కళ్లు విప్పాడేమో—అతను మాటలాడతాడేమో—పోయి చూదామా అని, మనసు వేగిర పడింది.

నే నటువంటి వేగిర పాటులోవుండగా, వృద్ధమంత్రి తన కుమార్తెల జాడ తెలుసుకురావలసిందని, తిరిగి మనషులను పంపాడు. నామనస్సు తిరిగి వకుళా సరళలవైపు మళ్లించింది. వారిజాడలు తెలుసుకోడానికే నేను ప్రబల ప్రయత్నాలు చేస్తున్నాననీ—తెలియగానే వర్తమానం చేస్తాననీ వృద్ధమంత్రికి చెప్పిపంపాను. మరి కొంత సేపట్లో, వకుళా సరళను వెదుకబోయిన, సైనిక బృందాలు తిరిగి వచ్చాయి. యుద్ధంలో హతమైన ప్రతి మృతకళేబరాన్ని పరిశీలించి పూడ్పించాననీ-ఎక్కడా వకుళా, సరళల జాడ తెలియలేదనీ ప్రధాన సైనికాధిపతి స్వయంగావచ్చి నాకు మనవి చేసుకున్నాడు. నాకు తల తిరిగిపోయింది. కర్తవ్యం గోచరంకాలేదు. ఒకవేళ శత్రుకూటంలోని వారెవరయినా అందగత్తెలు గదా అని భ్రమించి, ఆకన్యలను చెరబట్టలేదు గదా అన్న అనుమానం కలిగింది. అదొక్కటి తప్ప,

వారు కనుపించక పోవడానికి వేరు ఆధారమేదీ కనుపించడంలేదు వకుళా సరళలు బయటపడేవరకూ ప్రధాన సైన్యాధిపతి, ప్రతాప భానుని తాత్కాలిక మంత్రిగా వుండవలసిందని నియమించి, శృంగార నగరానికి గూఢచారులను పంపవలసినదిగా ఆజ్ఞాపించాను. శ్రీమంతుల సైన్యాలవల్లనే ఆకన్య లిద్దరూ తప్పక భంగపడి వుంటారని, నాకు పూర్తి నమ్మకం కలిగింది. ఎటువంటి అభేద్యరహస్యాలయినా సునాయాసంగా ఛేదించగల సమర్థులైన గూఢచారులు మా ఆస్థానంలో వున్నారు. ఆనిపుణులవల్ల తప్పక వకుళా సరళల వివరాలు తెలుస్తాయన్న ధైర్యం చిక్కిన తరువాత, మనస్సుకు గోరంత కుదుట పర్పడ్డది.

ఇంతలో—"దేవీ! ఆయోధుడు కళ్లు తెరిచాడు! ఆకలిగా వుందంటున్నాడు—"

అని ఒక పరిచారిక వచ్చి చెప్పిన వెంటనే నేను ఉత్సాహంతో ఆతావుకు పోయాను. యువకుడు లేచి, దిండు కానుకొని కూర్చున్నాడు. నన్ను చూడగా తలను క్రిందికి దించుకున్నాడు. నాచేత ఓడినందుకు బిడియపడుతున్నాడని, అతని భావమును గ్రహించాను.

"యుద్ధం చెయ్యడమే కాని—జయాపజయాల కాయుద్ధవీరులు బాధ్యులు కారు—అంచేత నువ్వు బిడియపడవలసిందేమీ లేదు."

అని నేనతనికి హెచ్చరిక కలిగించి అక్కడ పరిచారికతో—

"వైద్యులొచ్చారా? ఏమన్నారు?" అని అడిగాను.

"మీరొచ్చేముందే ప్రధానవైద్యు లొచ్చి వెళ్లారు దేవీ! యోధునికి ప్రమాదం తప్పిందని—ఆకలిగా వుంటే—పండ్లరసము-పాలూ ఈయవలసిందనీ చెప్పారు."

అని పరిచారిక చెప్పింది.

"వైద్యులు చెప్పినప్రకారం ఆహారమిచ్చారా?"

అని నేనడిగిన మాటకు—

"దేవీ! యుద్ధ ఖయిదీలకు ఆహారమిచ్చే సందర్భంలో రాణిగారి ఆజ్ఞలు పొందడం, మునుపటినుంచీ ఆచారం." అన్నదా పరిచారిక,

"సరే—ముందరపోయి. పండ్లరసము—పాలు—తీకొనుచ్చి, ఇతని ఆకలితీర్చు."

అని నేను చెప్పడమే తడవుగా, అంతకుముందే సిద్ధంగా వుంచిన వాటిని తీసుకొచ్చి, ఆమె ఆయోధుడుకిచ్చింది. అతను వాటిని తృప్తికరంగా తీసుకుని,

"దేవీ! విజయమెవరిదైంది?"

అని వేగిరపాటుతో అడిగాడు. బ్రతుకు ఖాయమైన వెంటనే అతనికి కావలసింది తమ ప్రభులవిజయం! అతని స్వామిభక్తిని నాలో నేనెంతయినా మెచ్చుకున్నాను.

"మీ ప్రభువుల కపజయమంటే నువ్వు విచారపడతావా?"

"జయాపజయములు దైవాధీనములని మీరిప్పుడే కదా శల విచ్చారు. అయినా, అడగడం నాది పొరపాటు. విజయం శృంగార నగరాన్ని వరిస్తే నేను మీ ఆధీనంలో యెందుకుంటాను?"

"వుండకూడదా?"

"అహఁ!"

అది అహంకారమా? ఆత్మాభిమానమా! ఏదయినా వీర లక్షణమే కదా, అని నాలో నేనే అతని గుణాన్ని అభినందించు కున్నాను.

"శృంగార నగరసైన్యాలలో నీపదవిఏమిటి?"

"ఓడినవారి పదవి ఏదయినా ఒకటే!"

"చెప్పకూడదా?"

"నేను ప్రధాన దళాధిపతిని."

తగినవాడు—అని నాలో అనుకున్నాను.

"నీ పేరు?"

"జయసారథి."

"మీ సైన్యాలన్నీ సంధ్యావళి కొండప్రాంతంలో యుద్ధం చేస్తుంటే—మధ్యలోవున్న దళాలన్నింటినీ దాటి, అమృతసరస్సుకు ఏలా రాగలిగావు."

"ఇప్పుడు మీ కా విషయాలన్నీ అనవసరంగదా దేవీ! శత్రు పక్ష సైన్యాధిపతి మీకు చిక్కినంతమాత్రంలో, గతించిన యుద్ధ రహస్యాలన్నింటినీ మీరడగవచ్చునా? నేను చెప్పవచ్చునా? మీ సైన్యాధిపతే మాకు చిక్కినప్పుడు, అతను మీ యుద్ధరహస్యాలను మాకు వెల్లడిచేస్తే, మీరతన్ని ఏమంటారు? స్వామి ద్రోహి అనరూ?"

అని జయసారథి అడిగిన ప్రశ్నకు నేను తల దించుకోవలసి వచ్చింది. అంతవరకూ అతడు నావైపుచూడక, నేను తలదించి నప్పుడు మాత్రమే తనకళ్లను నాముఖంలోకి గుచ్చుతున్నట్లు, నేను హఠాత్తుగా తలనెత్తడంవల్ల తెలిసింది. ఇద్దరి కళ్లు క్షణేకం ఎదుర్కొన్నాయి. నా జన్మతరించినట్లు మురిశాను.

కొంచంసేపాగి—"నేను విశ్రాంతి తీసుకోడానికి వీలవుతుందా?" అని అడిగాను.

"మారాక నీవిశ్రాంతికి భంగకరంగా వుండననుకుంటాను."

అతడు జవాబు చెప్పలేదు. పరిసరప్రాంతంలో పరిచారిక లెవరయినా వున్నారేమో అని పరికించాను. ఎవరూ లేకపోవడం గమనించి—

"జయసారథీ!" అని వేగంగా కొట్టుకొనే హృదయంతో పిల్చాను. అతను నాముఖంలోకి చూశాడు.

"మీ—మా—ఉభయరాజ్యాలకూ వైరముంది గాని, నా వుభయులకూ వైరంలేదు."

అతనేమీ జవాబు చెప్పలేదు.

"నువ్వు నా హృదయాన్ని ఆక్రమించుకున్నావు."

"అంతటి అర్హత నా కెక్కడిది?

"నీ అర్హత నా మనస్సుకు తెలుసు. కనకనే నా మనస్సు నీకు వశమైంది."

అతను విభ్రాంతుడై తిరిగి నాకళ్ళలోకి చూశాడు. అతను చూసినప్పుడల్లా, నాశరీరమెందుకో పరవశత్వం పొందింది. అతని జవాబుకై ఎదురు చూశాను—కాని జవాబులేదు. అతనికి నాభావ మర్థం కాలేదా? అయివుండీ, అంగీకారంలేక వూరుకున్నాడా? నా కేమీ తెలియలేదు. స్త్రీనై వుండి, ముందుగా నా హృదయమును విప్పినందువల్ల కలిగిన అనర్థమదిగావించాను. తొందరపడి తేలిపోయి నందుకు నన్ను నేనే నిందించుకున్నాను, అతని దృష్టిలో అంత చుల కనై పోడానికి నాలో వ్యక్తిత్వంలేదా! ఆత్మాభిమానంలేదా అని తర్కించుకున్నాను. ఇహ అక్కడ నిలవ బుద్ధికాలేదు—గిరుక్కున మళ్లి, ఆతావును వొదిలిపెట్టాను.

రాత్రివరకు ఏవేవో పనులు చేశాను. కాని మనస్సు స్థిమితం చెడి వుంది. ఒకవయిపున వకులా సరళల విషయము, మరోవయిపున జయ సారధి విషయము, ఒకదానిని ఒకటిమించి, నా మెదడును తినెయ్యడం మొదలుపెట్టాయి. వకుళా సరళల విషయంలో నేను వేగిరపడి, చెయ్యవలసిందేమీ లేదు. నిపుణులయిన గూఢచారులు శృంగార నగరం వెళ్లారు, నావారక్కడ వున్నట్లు తెలుసుకుంటారు. వెంటనే యుద్ధం ప్రకటించి, ఈసారి ఆపరిపాలన్ని కూకటివేళ్లతో కూల దోస్తాను. వకుళా సరళను విడిపిస్తాను. అందునుగురించి సందేహమేమి లేదన్న ధీమాతో మనస్సుకు కొంచం కుదుట యేర్పడింది. కాని యీ జయసారధి సమస్య నన్ను మరింత వేధించడం మొదిలుపెట్టింది. రాత్రి పడుకున్నాను-కాని, ఎంతప్రయత్నించినా, నిద్దరపట్టింది కాదు. కన్ను మూసేటప్పటికి ।అతనిమాటలే—అనితరూపమే—

"ఎన్నడూ లేనిది నాకీనాడిలా పిచ్చి పట్టిందెందుకు చెప్మా? నిగ్రహించుకోడంలో నన్ను మించినవారు లేరని గర్వపడేదాన్ని. జయసారథి విషయంలో నా నిగ్రహమేమయింది? హృదయంవిప్పి, అతనిముందర ఎంత చులకనై పోయాను? అతనేమనుకుంటాడు? వాలనగర సామ్రాజ్యానికి రాణినై వుండి, నిజశౌర్య బలపరాక్రమాల్తో శత్రుసేనల నెదుర్కొని, విజయమును సాధించిన నేను. విరోధిసేనాధి పతిని, అందులోనూ, నా చే స్వయంగా ఓడించబడిన వాడిని ప్రేమిం చడమా? ప్రేమించి భంగపడడమా? భంగపడి యింకా అతన్ని క్షమించడమా?

అమ్మచనిపోతూ చెప్పింది—నేను అనాఘ్రాత పుష్పాన్నని— నచ్చిన వరుణ్ణి పెళ్ళిచేసుకుని జీవితం సార్థకం చేసుకోమని—వంశాన్ని వృద్ధిచెయ్యమని-అటువంటప్పుడు నేను జయసారధిని ప్రేమించడంలో తప్పులేదు. అయితే అతడు నన్నెందుకు నిరాకరించాడు? అతని కిం తకుముందే వివాహమై వుంటుందా? నేనుతగినదాన్ని కాదనుకున్నదా? లేక నా ప్రధమ వివాహవిషయం అతనికి తెలుసునా? తెలుస్తే మాత్రం? నేను అనాఘ్రాతపుష్పాన్నిగదా! నాలో కళంకమేముంది? అయితే మరెందుకు నిరాకరించినట్లు?

అతను నిరాకరించాడని నేనెందు కనుకోవాలి! అతను నోరు విప్పలేదే! మౌనం అంగీకారమనుకోకూడదా? అంగీకారమయితే

అవమానమెందుకు? ఆడది కాదుగా? ఆడదాన్ని నేనే ధైర్యంగా నా హృదయభావం వెలిబుచ్చగలిగినప్పుడు, పురుషుడై వుండి, తానింకా యెంత ధైర్యంగా నాకు బదులుచెప్పవచ్చును. నేను కోపగించి వచ్చెయ్యకుండా, యింకా అక్కడేవుండి, అతన్ని రెట్టించి అడుగుతే యేమయ్యేది?"

అనే మొదలయిన ఆలోచనలతో మొదడు వేడెక్కడమేకాని, పర్యవసానం తేలలేదు, కోటలోని నగరా పన్నెండుకొట్టింది, నాశరీరం నాకు తెలియకుండానే పాన్పుదిగింది, కాళ్లు వాటంతట అవినడిచి పోయాయి, జయసారథి వుంచబడిన గదిలో ప్రవేశించాను, పరిచారకులు, భటులు, కావలివారు ఎక్కడివారక్కడ గాఢనిద్రలోవున్నారు, మెల్లిగా జయసారథి మంచం సమీపించాను. అతను వెల్లికిల పడుకుని గాఢనిద్రలో వున్నాడు. నాకాకను గమనించడు ఫరవాలేదను కున్నాను, అతని ప్రక్కలో కూర్చున్నాను తనివి తీరేంతవరకూ అతని ముఖం చూడాలనుకున్నాను—చూశాను, కాని తనివి తీరిందికాదు, నాచేతు లప్రయత్నంగా అతని ముంగురులుతాకాయి—వేగంగా కొట్టుకొనే గుండెలతో, కంపిస్తున్న నాచెయ్యి అతని ముంగురులపై నుంచి, చెంపలమీదికి జారింది. రెండు చెంపలను, తృప్తితీరా స్పృశించాను—కట్టుతోవున్న కంఠమును తడిమాను, అతనికి నొప్పి కలిగిందో యేమో—గబుక్కున కళ్లు తెరిచాడు, నాగుండెలు నాకే వినిపించేటంత తీవ్రంగా కొట్టుకున్నాయి, అతడు నాకళ్ళలోకి వింతగా చూశాడు.

"దాహం కావాలేమో అని అడగడాని కొచ్చాను,"

అన్నాను కంపించే గొంతుకతో, అతను నేను చెప్పిందాన్ని నమ్మినట్లులేదు. అతని పెదవులపై అంకురించిన చిన్ననవ్వు అప్పటి కప్పుడే మాయమయింది.

"ఇందరు పరిచారికలుండగా—నా దాహమును గురించి దేవీ! నువ్వు స్వయంగా రావాలా?"

"పోనీ, నా దాహమును గురించి వచ్చావనుకో."

నాభావము నతడు గ్రహించాడు.

"నీ దాహాన్ని తీర్చగల తాహతు నాకుందా?"

మొదటిసారి కలుసుకున్నప్పుడు నన్ను 'మీరు' అని మన్నిం

చిన మనిషి-యిప్పుడు 'నువ్వు' అని సంబోధిస్తున్నాడు, అది నా కొక శుభసూచకంగా కనుపించింది, కాబట్టి మరికొంచం ధైర్యం చేశాను.

"నీకేవుంది నాదాహం తీర్చగలతాహుతు! నువ్వు బ్రతకాలని దేవుళ్లకు మొక్కాను, ఈయుద్ధం మనయిద్దర కలయికకే వచ్చిందను కుని మురిసాను. నీరూపం నాహృదయాన హత్తుకుపోయింది. నీశౌర్య ప్రతాపాలు నా మనస్సు వశంచేసుకున్నాయి."

"నేను దళాధిపతిని—నువ్వు మహారాణివి."

"ప్రేమకు దృష్టిలో ఏ వ్యత్యాసాలూ వుండకూడదు."

ప్రేమికుల దృష్టిలో వుండకపోయినా, లోకం దృష్టిలో వుంటవి గదా?"

"ఆలోకాన్ని నేను పాటించను."

"నేను పాటిస్తే?"

"పాటించు."

అని నేను వెంటనే ఆవేశంతో లేచాను—అతను నా చెయ్యి పట్టుకున్నాడు.

"దేవీ! క్షమించు—"

"దేనికీ?"

"ఇంతసేపట్నుంచీ, నీకు అలసట కలిగించాను."

"చేసిన తప్పుకు శిక్ష విధిస్తే?"

"భరిస్తాను."

అంటూ అతను నాచేతిని, తన పెదవుల కందించుకున్నాడు. నాజన్మ తరించిందనుకున్నాను. ఆ రాత్రి నాజీవితంలో మొదట పర్వ దిన మనిపించింది. ఆ తెల్లవార్లూ అతని దగ్గిరేవుండి పోయా—ఇహ పరి చారకులకుగాని, మరెవ్వరికిగాని తెలిసినా భయంలేదనుకున్నా. అతను తన మనస్సు నామనస్సుతో ఏకంచేసి. అన్నీ చెప్పాడు. నన్ను పెళ్ళిచేసుకోడానికి హృదయపూర్వకంగా అంగీకరించాడు. కాని నే నతనికి నా వకుళా సరళ విషయమంతా చెప్పి, నావారు నాకు తిరిగి లభ్యమయ్యేవరకూ పెళ్ళిచేసుకోవద్దని చెప్పా. అత నంగీకరించాడు. ఇహ నేనే అతను—అతనే నేను.

మరి నాలుగురోజుల్లో జయసారథికి పూర్తి స్వస్థత యేర్పడింది—గాయం చాలావరకు మానిపోయింది. అత నిప్పుడు నానగరంలో బందీ

కాదు—నా ప్రేమబంధాల్లో ఖయిదీ. ఈమాటను గమనించి, కోట లోని కొందరాశ్చర్యపడ్డారు. కొందరు విషయము నర్థం చేసుకుని, తెలివిగా వూరుకున్నారు. అయితే విజయసారథి భవిష్యత్తును గురించి అతను నన్ను ప్రశ్నించాడు. తాను తన కొలువు కెప్పుడు వెళ్లాలి? అసలు వెళ్లడమా మానడమా? మా స్తే శ్రీమంతమహారాజుకు ఏమని వర్తమానం చెయ్యాలి? ఇవీ అతని సందేహాలు నేను చెప్పాను వకుళా సరళ విషయం తెలినవెంటనే, అతని విషయం తెలుతుందని. గూఢచారులు తెచ్చే సమాచారంపై ముందు సంగతులు ఆధారపడి వున్నాయని. అందుకుగల కారణాకారణాలనుకూడా అతనికి వివరించి చెప్పినమీదట తృప్తిపడ్డాడు. శృంగారనగరం పోయిన గూఢచారుల రాకకై నేను నిరీక్షిస్తుండగా, ఆ శ్రీమంతమహారాజు దగ్గరనుంచి ఒక రాయబారివచ్చి, దర్బారు హాలులో వేచివున్నాడని నేను పరి చారకులవల్ల తెలుసుకుని, వానిని మందిరానికి తీసుకునిరావలసిందని ఆజ్ఞాపించాను

అతను, వచ్చిన వెంటనే నాకు నమస్కరించి—

“మహారాణీ! నేను శృంగారనగరాధిపతి శ్రీమంతమహా రాజులు పంపగావచ్చిన రాయబారిని, మా ప్రభువులు తమ కీవిధంగా మనవి చెయ్యమన్నారు—

మన వుభయులకు జరిగిన గత యుద్ధంలో, మాదళాధిపతి జయ సారథి, అమృతసరస్సువద్ద మీసైన్యాలచే హతుడయినాడని మొదట వూహించాము. కాని అతను హతుడు కాలేదనీ—మీచే బంధించ బడి, ఖయిదులో వున్నాడనీ, ఈమధ్యనే మాగూఢచారులవల్ల తెలియవచ్చినది. ఆవిషయం వాస్తవమని నేను నమ్ముతున్నాను. కనుక, మీరు తక్షణం మాఖయిదీని విడుదలచేసి, మారాజధానికి సుర క్షితంగా పంపవలసివుంది. వెంటనే మీరాప్రకారం జరిగించనియెడల రెండవసారి ఉభయరాజ్యాలకు యుద్ధం తప్పదు. ఈపర్యాయము కూడా, మీరే విజయమును పొందగలరన్న దురాశను వొదిలిపెట్టి, సక్రమపద్ధతిలో వ్యవహారమును పరిష్కరించండి!

అని రాయబారి తన యేలికమాటలు చెప్పగా వినిన నాకు అపరిమితమయిన ఆగ్రహం కలిగింది. రాయబారి దగ్గర నా ఆవేశ

మును ప్రకటించడం అనవసరమనుకుని, మీమహారాజుతో మా మాటలుగా చెప్పు—

'వాలనగర పరిపాలన పుట్టినది లగాయితు, ఆ ప్రభువులు యుద్ధాల కెన్నడూ జంకలేదు. మీసేనాపతి, జయసారధి మాబందీగా వున్నమాట నిజమే! కాని మాకు మంత్రులు, ప్రియసఖులూ అయిన వకుళా సరళలనే యిద్దరు సౌందర్యవతులయిన కన్యలు మీసైన్యాలచే చెరబట్టబడినట్లు మాకనుమానము కలిగినది. మాకన్యలను మాకు సురక్షితముగా చేర్చిన వెంటనే—మీసైన్యాధిపతిని మీకు చేర్చడానికి మాకెటువంటి అభ్యంతరమున్నూ వుండదు.'

అని నేను చెప్పిన వెంటనే రాయబారి సవినయంగా నాకు నమస్కరించి, వెళ్లిపోయినాడు. అనంతరం నేనీవిషయాలను జయసారధికి వివరించి చెప్పగా, నేను చేసినదానిలో అక్రమమేదీ లేదని అత నంగీకరించాడు. శృంగారనగరంనుంచి రాయబారివచ్చి వెళ్లిన మరునాడు, ఆపట్నంపోయిన మా గూఢచారులు తిరిగివచ్చారు. వకుళా సరళలు ఆ రాజ్యంలో లేరనీ—ఆసైన్యాలు వారిని చెరబట్టి వుండలేదనీ గూఢవార్తలు తెచ్చారు నా ఆశ నిరాశ అయింది—నావూహా పొరబాటయింది. ఇన్ని రోజులనుంచీ, వా రా రాజ్యంలో వుండివుంటారనీ—ఎలాగయినా రప్పించుకోవచ్చుననీ ఆశపెట్టుకుని వున్నాను. అది గూఢచారుల సమాచారంవల్ల అది కాస్తాపోయింది. నేను తిరిగి అధోలోకంలోకి కుంగిపోయాను. వృద్ధమంత్రి కొంతకాలమూ ధైర్యం చెప్పాను. అతని కుమార్తెల కెటువంటి ప్రమాదమూ జరగదని హామీయిచ్చాను. పుత్రికాశోకంవల్ల కుంగిపోతున్న అతని నెలా ఓదార్చాలి? నా వకుళా సరళలు నాకంటి కెలా కనుపిస్తారు? నాకు ప్రాణతుల్యులైన, వారిగతి యేమయినట్లు? ఈ ఆలోచనలతో నా బుర్ర తిరిగిపోవడం మొదలుపెట్టింది. ఉన్నవారిలో నాకు ప్రాణసమానవాడు, జయసారధి. వెంటనే తన్ని సంప్రదించాను. శృంగార నగరంనుంచి గూఢచారులు తెచ్చిన సమాచారమును వివరించి చెప్పాను.

"జయా! ఈసమయంలో నాకు నువ్వుతప్ప నాకింకెవరూ ఆప్తులు లేరు. ఆకన్యలను గురించి ఏంచెయ్యాలి? వారేమైపోయినట్లు వకుళా సరళలు లేకుండా నేను క్షణం బ్రతకలేను."

"ప్రేయసీ! శృంగారనగర సైన్యాలచేత ఆసుందరాంగులు చెరబట్టబడ్డారంటే, నేను నమ్మలేదు. ఆసంస్థానంలో అటువంటి అత్యాచారణలు జరగడాని కవకాశంలేదు. నువ్వు గూఢచారులను పంపానంటే కాదనడ మెందుకని వూరుకున్నాను. గూఢచారులు తెచ్చిన సమాచారం సత్యమైంది."

"అయితే యిప్పుడు నాగతియేమిటి జయా! కుమార్తెల జాడ తెలియక తల్లడిల్లిపోతున్న వృద్ధమంత్రి నెలా వూరడించగలను? చిన్నప్పటినుంచి నాకు ప్రాణంలో ప్రాణమైన నాసుఖులను నేను తిరిగి యెలా పొందగలను?"

జయసారథికూడా ఈవిషయమును గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కాని అతని కేమీ పాలుపోయినట్లులేదు. అప్పుడు నేనన్నాను.

"జయా! ఇక కాలయాపనచేసి ప్రయోజనంలేదు. నేనే స్వయంగా బయలుదేరతాను. దేశదేశాలూ గాలిస్తాను. నగరనగరాలూ వెదుకుతాను. నాచెలు లెక్కడున్నారో తెలుసుకొనేవరకు నాహృదయముండబట్టదు."

"అంతకంటే వేరు కర్తవ్యమేదీ కనుపించదు. నీతో నేను కూడా వస్తాను. ఇద్దరం కలిసి అన్వేషణం చేదాం!"

"చాలా సంతోషం. కాని, మీశృంగారనగరాధిపతి విషయం? అతడు నిన్ను వెంటనే తమ నగరం పంపకపోతే యుద్ధం ప్రకటిస్తామని తాయబార మంపాడుగదా? రావలసిన విపరీత పరిస్థితులన్నీ ఒకేసారి వచ్చాయి."

"అందును గురించి యేమంత ఖంగారుపడవలసింది లేదు. నువ్వంగీకరిస్తే నేనీదినమే బయలుదేరి శృంగారనగరం పోతాను. ఆ మహారాజుకు చెప్పవలసిన విధంగా నచ్చచెబుతాను. తిరిగి వెంటనే బయలుదేరి వస్తాను. అప్పుడు మన మిద్దరము వకులా సరళల నన్వేషించే ప్రయత్నంలో పోవచ్చును."

"మహారాజుకు లొంగడంగాని, ప్రాధేయపడడంగాని నేనంగీకరించను. ఇన్నిగాదు. ఇంకోయిన్ని విపరీత పరిస్థితులు నన్నెదుర్కొన్నా, శత్రుపక్షానికి వంగే స్వభావం నాకులేదు."

"వకులా సరళలు ఆరాజ్యంలో చెరబట్టబడ్డారని అనుమానించి గదా నువ్వు, వారిని నీవశంచేస్తే నన్నతని వశంచేస్తానని వ్రాశావు?"

"అవును."

"నీ అనుమానం వట్టిదయినప్పుడు, అంగీకరించిన ప్రకారం నువ్వు నన్నా మహారాజు వశం చేస్తావుగదా! అందులో లోంగడ మేముంది? వ్రాధేయపడడమేముంది?

"నిజమే—అమృతసరస్సు విషయము?"

"దానిదేముంది? యుద్ధంలో నువ్వు విజయమును పొందావు? అది వాలనగరపు హక్కు—అందును గురించి వివాదమేముంది?"

"అంతేగదా!

"కాక? నేను తిరిగి రావడము—మన యిరువుర ప్రేమ—మొదలయిన విషయాలు రాజ్యాంగ కార్యాలతో ఎట్టి సంబంధమునూ లేనివి. కేవలం నావ్యక్తిగత స్వంత కార్యాలు: వాటితో ఆమహారాజు కెట్టి సంబంధమున్నూ వుండదు. రేపొక వేళ, అమృతసరస్సును గురించి తిరిగి యుద్ధమే సంభవించినవాడు—నే నా రాజ్యానికి దళాధిపతిగానే వుంటే-ఆ యుద్ధానికీ మనప్రేమకీ ఏమి సంబంధముంటుంది? యుద్ధరంగంలో నేను నీకు శత్రువుని—నువ్వు నాకు విరోధివి—కాదా?"

"అయినా యిప్పుడాచర్చ కవసరమేముందిలే! ఆవిషయం తల్చుకుంటేనా చాలా భయంకరంగావుంది జయా! నువ్వు తిరిగి వచ్చేలోపుగా నేనిక్కడ అవసరమైన యేర్పాట్లన్నీ చేసుకుని సిద్ధంగా వుంటాను."

అని చెప్పి అనుకున్న ప్రకారం జయసారధిని ఆదినమే శృంగార నగరం పంపించాను. అతను వెళ్ళినవెంటనే నేను స్వయంగా పోయి, వృద్ధమంత్రిని కలుసుకున్నాను. అతను నన్నుచూడగానే కంట తడి పెట్టుకుంటూ—

"దేవీ! నాబిడ్డలగతి యేమయింది? వాళ్లు నీకు మంత్రులుగా వున్నందుకు మురిశానేగాని, యింతఘోరం జరుగుతుందని వూహించ లేదు. అవసానకాలంలో నే నీ కూతుళ్ల దుఃఖాన్ని ఎలా భరించ గలను తల్లీ." అన్నాడు.

"నాకు, మీారు పితృసమానులు—వకులా సరళలు ప్రాణ సమానులు. వారులేనిది ఒక్కక్షణం నేను బ్రతకలేనన్న విషయం

మీకున్నూ తెలిసిందే! కాల ఖర్మవశాత్తూ జరిగిన యీ ఘోరసంఘట్టనను ఎదుర్కోవలసిందేగాని వేరుకర్తవ్యం లేదు. ఇక్కడ చెయ్యవలసిన ప్రయత్నాలన్నీ చేసి, పారిజాత తెలియక, శృంగారనగర సైన్యాలచే ఆకన్యలు చెరబట్టబడ్డారన్న అనుమానంకొద్ది, గూఢచారుల నా పట్నం పంపాను, వారు తిరిగివచ్చి, నా అనుమానం వట్టిదనీ—వకులా సరళ లారాజ్యంలోనే లేరనీ—నిఃరమైన భోగట్టాను తెచ్చారు."

"అప్పుడిక కర్తవ్యమేదేవీ? తల్లి లేని బిడ్డల్ని యింతవరకూ సాకాను. నా అవసానదశలో, కొడుకులయినా, కూతుళ్లయినా వారే నని ఆశపెట్టుకున్నాను. ఆశనిరాశ కాగా, వారు కంటికే దూర మయ్యారు గదా తల్లీ! నాకేందారి?"

అని వృద్ధమంత్రి తిరిగి కంట తడిపెట్టుకుంటుంటే, నాకున్నూ గుండె చెరువయింది, దుఃఖమును ఆపుకోలేక పోయాను, ప్రయత్నం మీద ఆదుఃఖాన్ని కొంత నిగమించుకొని—

"రెండుమూడు దినాల్లో నేను స్వయంగా వారి నన్వేషించ బోతున్నాను, ఆ విషయంతమతో చెప్పడానికే వచ్చాను. నేను తిరిగివచ్చే వరకూ సయిన్యాధిపతి, ప్రతాపభానును స్వరాధికారిగా వుండవలసిందని యేర్పాటుచేశాను. అతడన్నివిషయాలోన్నూ ఆరితేరినవాడు. నేను నిశ్చింతిగా యెన్నిదినాలయినా వకులా సరళ అన్వేషణంలో గడపవచ్చు, మీకున్నూ యివే చెప్పడం...నాసఖులను కలుసుకోగలిగా, తిరిగివచ్చి మీకళ్ళబడతాను—లేదా నన్ను కూడా మీకుమార్తెల లెఖ్ఖలోనే వేసుకుని—నారాజ్యాన్ని దగ్గిర వారుసుల కెవరికయినా దానంచెయ్యండి! ఇదే నా ప్రతిజ్ఞ."

అని చెబుతుంటే—వృద్ధమంత్రి నన్ను పుత్రికా వాత్సల్యంతో కౌగలించి మరింత యేడ్చాడు.

"అయ్యోబిడ్డా! మనకెన్ని తిప్పలుకలిగాయి? వీటన్నింటినీ చూడ్డానికేనా నేనిలాబ్రతికున్నది? మీ అమ్మగారిలాగ పరలోకానికిపోక, మీ నాయనగారిలాగ దేశాంతరములూ పోక, జీవచ్ఛవమునై పడివున్నాను. నువ్వు తిరిగి వచ్చేవరకూ, నాబిడ్డలు తిరిగి నాకళ్లబడేవరకూ, నేను మాత్రం బ్రతికివుంటానాతల్లీ! నూరేళ్లు నిండిన

పండు—ఏ నిమిషంలో రాలిపోతుందో—కానియ్యమ్మా! భగవంతు డేంచెయ్య దల్చుకున్నాడో—''

అని వాపోయే వృద్ధమంత్రికి ఇంకా కొంచంసేపు నేనక్కడే వుండి—ధైర్యవచనాలు చెప్పి, అనంతరం నిజమందిరానికి పోయి చేరుకున్నాను. ఇహ అక్కడనుంచి, వకులా సరళకై ఏదేశంవెళ్లాలి? ఏనగరం వెళ్లాలి? ఎక్కడ గాలించాలి? అనేవి ముఖ్యమైన ఆలోచనలు! మానగర పరిసర గ్రామాలూ నగరాలూ ముందర పరిశీలించి, ఆతరువాత దూరదేశాలు తిరగడమూ, లేక ముందర దూర దేశాలే గాలించి, అట్నుంచి చూసుకుంటూ క్రమంగా, మానగరం చేరడమూ అని ఆలోచించడంతో—వారు కనుపించనప్పుడు, తిరిగి మానగరం చేరడందేనికా అన్న సందేహం కలిగింది. అందువల్ల, ముందర సమీపప్రాంతాలు చూచుకుని, అటుపై క్రమంగా వారి సమాచారం తెలిసంతవరకూ తిరగడమేగాని, తిరుగుముఖం పట్టకూడదని నిశ్చయం చేసుకున్నాను.

జయసారథిని, నియమితకాలానికే శృంగారనగరంనుంచి తిరిగివచ్చాడు. తానుబ్రతికి బయటపడ్డందుకు తమ ప్రభువు అపరిమితానందమును పొందాడనీ—యుద్ధఫలితంగా, వకులా సరళలు కనుపించక పోవడాన్నిగురించి, అతనెక్కువ ఆశ్చర్య పడ్డాడనీ—వార్కి ఏదికే సందర్భంలో జయసారథిని వీలయినంత సహాయం చెయ్యవలసిందని, కీర్తికాముడే కోరాడనీ, మొదలయిన విషయాలింకా జయసారథ నాతో ఏమేమో చెప్పాడుగాని, వకులా సరళలకై తహతహ లాడుతున్న నామనస్సు కతను చెప్పినవేమీ అంతగా పట్టలేదు.

సంస్థానంలో ఎవరెవరికేవిధంగా చెప్పాలో, అందరికీ ఆవిధంగా చెప్పి, ప్రమాదించిన పరిస్థితేమయినా కలిగినప్పుడు, వృద్ధమంత్రి సలహాలను తీసుకొంటుండ వలసినదిగా హెచ్చరించి, ఆమర్నాడుదయమే జయశారధి నేనూ, రెండుత్తమాశ్వాలను సిద్ధంచేసుకొని, వాటి మీఁకనే అవసరమైన కొన్నివస్తులు—ఆహారపదార్థాలూ తోలు సంచులలో కట్టుకొని, బయల-దేరాము. అన్నిదిశలలో తూర్పు శ్రేష్ఠమైనదని వినివుండడంచేత, ముందుగా ఆదిక్కు ననుసరించి పోయాము. ఆయిద్దారు దినములకు తరువాత, కొన్నిపల్లెలు, పర్వత

ప్రాంతాలూదాటి, ఒకనగరం చేరుకున్నాము, ఆనగరవిశేషాలన్ని తెలుసుకొని, అక్కడకూడా, మా వకులా సరళల భోగట్టాయేమీ తెలియక పోవడంవల్ల, ముందుకు సాగిపోయాము. అటుపైన, మరొక యిరవై యోజనాలదూరం ప్రయాణం చెయ్యగా ఒక రేవు పట్టణము తటస్థమైంది. ఆ నగరపురాజును కలుసుకుని, మా వకులా సరళ విషయం చెప్పగా అతడెక్కువగా విచారించి. తమ రాజ్యమున బానిస వ్యాపారం విరివిగా జరుగుతున్నదనీ-తమకు ఇద్దరు మా బానిసలు కావాలన్న నెపంతో, వర్తకుల నందరినీ పిచారించి, తమకన్యల జాడ తెలుసుకోవడం ఒక మార్గమని ఆరాజు చెప్పినదానికి మేము చాలా సంతోషించి, ఆ ప్రయత్నంతో పట్నమంతటా గాలించాము. ఆయావర్తకుల దగ్గరగల కన్యలనందర్నీ పరిశీలించాము—కాని మా వకులా సరళ లెక్కడా కనుపించక పోవడంవల్ల, తిరిగి మా ప్రయాణమును సాగించాము.

అటుపైన మరికొంతదూరం ప్రయాణం చెయ్యగా చెయ్యగా ఒక కీకారణ్య ప్రాంతం తటస్థమయింది, అది క్రూరమృగాలతో చాలా భయంకరంగా వుండడంవల్ల, పగలుమాత్రమే ప్రయాణం సాగించి, రాత్రులు కొంచం సురక్షితమైన స్థలమును చూచుకుని, అక్కడ బసచేసేవాళ్ళం. ఆప్రకారం ఎంతకాలం ప్రయాణం చెయ్యాలి? నా వకులా సరళ లెప్పటికి కనుపిస్తారు?

అది ఊహా కందని విషయమైంది!

## ౩౧

మా వెంట గొనిపోయిన ఆహారపదార్థాలు పద్దెనిమిరోజుల కాఖరై పోయాయి. అటుపైన ఏంచెయ్యాలి? అడవుల్లో అక్కడక్కడ ఫలవృక్షాలేవయినా కనుపించినప్పుడు వాటిని తినడము—జలాశయములు కనుపించినప్పుడు, మాగుర్రాలు, మేము, దప్పిక తీర్చుకోవడము—ఈప్రకారం అరణ్యమార్గాన ఇరవై దినాలు ప్రయాణం సాగించాము. కాని అడవిదాటే దెప్పుడో—ఆప్రకారమది యింకా యెన్ని యోజనా లాక్రమించుకొనివుందో మాకు తెలీదు. అసలా అడవి మార్గానికి అంతముందో లేదో నన్న సందేహం కలిగింది.

ఒకరాత్రి—గుఱ్ఱాలను దిగాము. చేరువలో జలాశయముంటే, నీళ్లు తాగాము. ఆజలాశయ ప్రాంతమే కొంచం సురక్షితంగా వుందను కొని, గుఱ్ఱాలను మేతకొదిలి—జయసారథి నేనూ అక్కడ విశ్ర మించాము. మార్గంలో అంతవరకు జరుగుతూన్న దేమంటే—రాత్రులు అడవులో బసచేసినప్పుడు, మేమిద్దరమూ ఒకేసారి నిద్దరపోకూడదను కున్నాము. జయసారథి నిద్దరపోతున్నప్పుడు, నేను మేలుకొనివుండి, ఏప్రమాదమూ రాకుండా కాపాడ్డము—నేను నిద్దరపోయినప్పు డతను నావిధంగా చెయ్యడము.

అది పున్నమో—లేక ఒకటి రెండురోజులు అవతల—యివ తల అయివుంటుందో—ఇద్దరకు నిద్దరపట్టలేదు. వెన్నెల పిండి ఆరబోసి నట్టుండి—ఆప్రాంతం పట్టపగలుగావుండి—మనస్సుల కెంతయినా ఆహ్లాదం కలిగిస్తూంది. మేము నగరం బయలుదేరిం తరవాత, ఒక్క రవ్వ ప్రశాంతత యేర్పడిం దారాత్రే!

"అడివిని కాసిన వెన్నెలంటారు—ఇదేగాబోలు!"

అన్నా నేను జయసారథితో—

"అలాగని యెందుకంటారో?"

అని అతను తిరిగి నన్నడిగాడు.

"ఏముంది? అనుభవించేవారు—ఆనందించేవారూ లేనందువల్ల, ఈవెన్నెల ఎంతమనోహరంగావున్నా నిష్ప్రయోజనం కదా!"

"మన జీవితాల్లాగే? కదూ?"

అని అతనంటే, నిజంగా నా కేవేదన కలిగింది. ఒక నిట్టూ ర్పును విడిచి, కొంచంసేపు మౌనంగా వూరుకున్నాను. అతను తిరిగి అన్నాడు.

"వకులా సరళలు—కనుపించాలి—"

"అవును—అప్పుడు గదా—మన మేవిచారమూ లేకుండా సుఖంగా వుంటాము!"

ఈసారి అతను నిట్టూర్పు విడిచాడు.

"నాతోపాటు నువ్వుకూడా యీ అడవులో యిడుములు పడు తున్నావు. మీ శృంగారనగరంలోనే వుంటే, నీకు తగిన మరొక కన్యను పెళ్ళిచేసుకుని, హాయిగా వుండేవాడివి కదా! అందుకే బాధ పడుతున్నా వనుకుంటా—ఏంజయా?"

"ఎన్ని తపస్సులు చేసి—ఎన్ని జన్మలెత్తితే మాత్రం, నీవంటి భార్య దొరుకుతుంది?"

అని అతనంటే, నేను తిరిగి పొంగిపోయాను. విజయకుమారా! నువ్వు పురుషుడివి—నేను స్త్రీని—నా ప్రేమానుభవాల్ని నీతో పూర్తిగా చెప్పలేను. కొన్నికొన్ని ఘట్టాలు నువ్వే ఊహించుకోవాలి. ఆవెన్నెల రాత్రి మాకు తెలియని స్వర్గసౌఖ్యాల్లో తేలిపోయాం! మా శరీరాలు మమ్మల్ని మరిపించి, మాకేదో మత్తుకలిగించాయి. ఆతరువాత, ముందుగా జయసారథి నిద్రపోయాడు. నియమప్రకారం నేను మేలుకొనివుండి ప్రమాదమేదీ జరక్కుండా కాపాడుకోవలసి వుంది. కొంతసేపటివరకు అలాగే వున్నా. కాని ఆతరవాత నాకళ్లు నాస్వాధీనం తప్పింది—కళ్లు బరువులై వాలిపోయాయి. నాకు తెలియకుండానే నిద్దరపట్టిపోయింది. అలా ఎంతసేపో తెలీదు.

"అమ్మయ్యో! చచ్చాను."

అని జయసారథి అరుపు విని త్రుళ్ళిపడిలేచాను. ఒక భయంకరమైన తాచుపాము, పట్టపగల్లాంటి ఆవెన్నెలలో చరచర పాకిపోతూ కళ్ళుతెరిచిన వెంబడే ముందర నాకళ్ళకగుపించింది. నే నాలస్యం చెయ్యకుండా ఒరనుంచి కత్తినిదూసి, ఒక్కవ్రేటుతో దాని శిరస్సును ఖండించాను. అది రెండుతుండ్లుగా పడి చచ్చింది. అయితే జయసారథి పరిస్థితిని గమనించేటప్పటికి, నాగుండె బేజారయింది. అతను నోటిమాటలేక నురగలు కక్కుతున్నాడు. సందేహమేముంది ఆ విషసర్పం ఎప్పుడు వచ్చిందో—ఎప్పుడు కాటువేసిందో—అప్పుడిక నేను చెయ్యవలసిం దేమిటి? జయసారథి నాకుదక్కుతాడా? లేదా? అప్పటికి తుణ్ణక్రితంవరకు ఎంత ఆనందంగావున్నాము? శరీరాలు కూడా మరిచి స్వర్గసౌఖ్యాలలో తేలిపోయామే—అటువంటి చింతిలో ఎంతఘోరం? నాశరీరం వణకడం—గుండెలు వేగంగా కొట్టుకోవడమే కాని, కర్తవ్యం సూన్యంగావుంది. ఆడవిలోగాని, ఆసమీపంలో గాని, ఎవరయినా పాము మంత్రగాళ్లుంటే తీసుకురావడం కర్తవ్యమని తెలుసుకున్నా. ఇక ఆలశ్యం చెయ్యలేదు. గుఱ్ఱంకోసం చూశా ఒకటి కాదు—రెండు గుఱ్ఱాలూ కనుపించలేదు. మేతకై ఒదలబడినవి ఏమైనట్లు? పోయిపోయి, అడవిలో మార్గంతప్పాయేమో—వాటికోసం ఆలోచిస్తూ కూచుంటే, యువతిల, నా బహిప్రాణాన్ని,

మృత్యువు మింగేస్తుంది. ఎలాగ? కాలినడకనే పరుగెత్తాలని నిశ్చయించా—మరి అక్కడ అతన్ని ఒంటరిగా వొదిలి యెలావెళ్లను? వెళ్లక తప్పదు. ఆ చేరువలోనే ఏవేవో—ఆకులు, వేళ్లూవుంటే, వాటన్నింటినీ పోగుచేసి, జయసారథి శరీరమంతటా కప్పాను. కనుపించిన మార్గంవైపు కాలికొద్దీ పరుగెత్తాను. నిర్మానుష్యమై అతిభయంకరంగా వున్న అర్ధాన్నపు అడవిలో నారొద యెవరు వింటారు! నాదుస్థితి నెవరు గమనిస్తారు. ముళ్లు—పొదలు—డొంకలు, వేటినీ లెక్కచెయ్యకుండా, కాళ్ళలో బలమున్నంతవరకు పరుగెత్తాను—నోట్లో శక్తి వున్నంతివరకు అరిచాను. వినేవారెవరు? పరుగెత్తగా పరుగెత్తగా భగవంతుడే సాక్షాత్కరించాడేమో అనుకున్నా—

ఒక కాషాయాంబరధారి—పెద్దగెడ్డము—శిరస్సున జడలు—ఒక చేతిలో శంఖము—రెండో చేతిలో కమండలముపట్టి, నాకెదుట సాక్షాత్కారమయినాడు.

"అయ్యా! అయ్యా! మీరు కేవలం భగవంతులే అయివుండి, నన్నుద్ధరించడానికి అవతరించారు—త్వరగా రండి బాబూ! నాభర్తను రక్షించండి!"

అని కాళ్లమీదపడి ప్రార్థించాను. అత నావెన్నెలో నాముఖం వైపొకసారి తేరిపారిచూచి—

"నీకిప్పుడొచ్చిన ప్రమాదమేమిటి!" అని నడిగాడు.

"నాభర్త సర్పదష్టుడై పడిపోయాడండి—త్వరగావచ్చి, మీకు చేతనయితే, మంత్రంవేసి బ్రతికించండి—పుణ్యం కట్టుకోండి!"

అని నేను హృదయవేగంతో చెప్పాను.

"ఇంత సాధనచేసిన నాలాంటి బైరాగికి, పాముమంత్రం ఒక లెఖ్ఖా? పాముకరిచి ఎంతసేపయినా సరే—నే నాకట్టెకు ప్రాణం పోస్తాను—విన్నావా?"

అని ఆబైరాగి చెప్పిన మాటవినగానే నాకు ప్రాణం లేచివచ్చి నట్లయింది. నాజయసారథి అప్పుడే బ్రతికినట్లు మురిశాను.

"బాబూ! త్వరగారండి—దైవవశాత్తూ లభ్యమైన ప్రాణదాతలు—"

"సరే పద—ఆతోవకు మార్గమేటు? నీభర్త ఎక్కడున్నాడు?"

"రండి స్వామీ—నా వెనువెంటనే రండి—చూపిస్తాను." అని నేను దారితియ్యగా, ఆబైరాగి నన్ననుసరించాడు. నేను నడిచినంత వడిగా నతను నడవలేకపోతున్నాడు. ఇక పరుగెత్తి ప్రయోజనమేముంది? అతని శక్తి ననుసరించి నేను ముందుకు సాగాను. కాని, వచ్చేటప్పు డాఖంగారులో గుర్తుపెట్టుకోనందువల్ల, మార్గం మరిచిపోయాను. ఎంతసేపు నడిచినా మేము దిగిన ప్రదేశం కనుపించదే!

"ఇంకా యెక్కడ?"

అని ఆబైరాగి ఒకటి రెండుసార్లు విసుగుకో అన్నాడు. నేను దారి మర్చిపోయానంటే, అప్పుడే వెనక్కుతిరిగిపోతాడేమో నన్న భయం కొద్దీ—

"వొచ్చేశాం స్వామీ! ఇదే—యిక్కడే—"

అంటూ నేనతన్ని యింకా యింకా తీసుకుపోవాలసొచ్చింది.

"తిరిగినచోటే మళ్ళీ తిప్పుతున్నావు—దారి తప్పావా?"

అని అత నడిగేటప్పటికి, నాగుండెలో రాయిపడింది.

"లేదు స్వామీ లేదు—ఇదుగో—ఇక్కడే! ఈప్రాంతంలోనే నా భర్త వుండివుంటాడు. వొచ్చేశాం దయచేసి, కొంచం ఓపికపట్టండి."

అని నేను మధ్య మధ్య నతని బ్రతిమాలుకుంటూ—ఇంకా యింకా తీసుకెళ్లాను. క్రమంగా తెల్లవారిపోయిందేగాని, నాభర్త వున్న జాగా తెలిసిందికాదు. నాదురదృష్టాన్ని నేనే తిట్టుకున్నాను. అసలు ఆమార్గమే కాదు—ఆప్రాంతమే కాదు. అప్పుడు తిరిగిందంతా, ఏవో కొత్తమార్గము—కొత్త వాతావరణము.

"ఏం సుందరీ! నన్నింకా తిప్పదల్చుకున్నావా?"

అని బైరాగి కొంచం తీక్షణంగా నడిగాడు.

"మార్గం మరిచా స్వామీ క్షమించండి!"

"నీభర్త వున్నచోటుకు గుర్తు లేమన్నా చెప్పగలవా?"

"ఒక జలాశయముంది—గున్నమామిడి చెట్లున్నాయి."

"మంచి పనిచేశావు. ఈప్రాంతంలో జలాశయమూ లేదు—గున్నమామిడిచెట్లూ లేవు—నాతోరా నేను చూపిస్తాను."

అని అంటే, నాప్రాణం లేచివచ్చింది. ఈసారి అతను చూపించిన మార్గాన అతని ననుసరించాను. ఎండ తీక్షణరూపం దాల్చింది. అతను జంకకుండా, మునుపటికంటే, ఉత్సాహంగా నడుస్తున్నాడు.

రాత్రంతా పరుగెత్తి పరుగెత్తి, నడిచి నడిచి, అరిచి అరిచి, వున్న నేను నిజంగానే అలిసిపోయా, అయినా లేనిసత్తువ తెచ్చుకుని బైరాగి నడక నందుకుంటూ, వడివడిగానే పోతున్నా. క్రమంగా సూర్యుడు నడినెత్తిమీది కొచ్చాడు. దాన్నిబట్టి, అదంతా నేను దారితప్పి బైరాగిని నడిపించిన తప్పుడు మార్గమనుకున్నా. బైరాగి ముందు—నేను వెనకాల, మరికొంతదూరం పోయాక, మా గుఱ్ఱాలలో ఒకటి కనుపించింది. నాకు కొంచం ధైర్యం చిక్కింది. ఆప్రాంతాల్లోనే నా భర్తకూడా వుంటాడని ఆశపడ్డాను, గుఱ్ఱానికి కట్టబడ్డ మాదుస్తుల సంచులు— జీనువగ్గరా చెక్కుచెదరకుండా, మేమెలా కట్టినవలాగే వున్నాయి. నే నాగుఱ్ఱం కళ్లెంపట్టుకుని బైరాగితో నడుస్తూ—

"మీ కీఅరణ్యప్రాంతమంతా తెలుసుననుకుంటూ—నాకోసం చాలా శ్రమపడ్డారు స్వామీ! ఆజలాశయమూ—మామిడిచెట్లూ యెక్కడా కనుపించవే!"

అని నేనతివినయంగా నడిగిన దానికా బైరాగి—

"కనిపిస్తాయి—కనిపిస్తాయి—కొంచం చురుగ్గానడు!" అని విసుగ్గా అన్నాడు. సహజమే, నావల్ల తన కంతకష్టం కలిగినందువల్ల చిరాకుపడుతున్నాడని ఊహించుకొని, తిరిగి ఏమీ ప్రశ్నించకుండా, గుఱ్ఱపుకళ్లాన్ని ఒక చేత్తో పట్టుకుని అతని ననుసరిస్తున్నాను. క్రమంగా పొద్దు వాలిపోయింది. మే మొక చిన్నకొండప్రాంతానికి చేరాము. బైరాగి నిలిచాడు. అతనితో నేనూ నిలిచాను.

"చూశావా! నువ్వు దారితప్పిపోవడంవల్ల కలిగిన ఫలిత మిదంతా! రాత్రినుంచి నడుస్తున్నాను. ఇక నడవలేను. సర్పదష్టుడైన నీభర్త వున్న ఆజలాశయప్రాంతం చేరాలంటే—చీకటి పడుతుంది. నాకోపయిన కడుపులో ఆకలి మండిపోతూంది. ఈ కొండ గుహలో నాకు తెలిసినవాళ్లున్నారు. లోపలికిపోయి, కొంత ఆహారము—విశ్రాంతి, తీసుకుని తిరిగి బయలుదేరదాం?"

"స్వామీ నాభర్త?"

"నీభర్తకేం భయంలేదు. పాముకరిచి ఎంతసేపయినా సరే—నే నాకట్టెకు జీవం పోస్తానని చెప్పాగా?"

"అవును—చెప్పారు."

"మరి నీకెందుకూ భయం-యి? రా—లోపలికి—గుఱ్ఱం లోపలికి రాలేదు. దాన్ని బయట కట్టేసి, నువ్వు నాతోరా. కత్తులువగైరా ఆయుధాల్నికూడా లోపలికి తేకూడదు. వాటినికూడా యివతలే వుంచాలి."

అని అతను హెచ్చరించిన ప్రకారం చెయ్యడంకంటే, నాకు వేరే మార్గమేముంది? గుఱ్ఱాన్ని బయట ఒక చెట్టుకు కట్టాను. దాని పైవున్న రెండు తోలుసంచులు మాత్రం చెరో చేత్తోనూ పట్టుకుని నా ఆయుధాలన్ని గుఱ్ఱపు జీనులో దూర్చాను."

"ఆసంచులో యేమున్నాయి?"

అని బైరాగి నన్నడిగాడు.

"ఆఁ! ఏమున్నాయి? ప్రయాణంలో అవసరమైన వేవో దుస్తులువగైరా." అని నేను చెప్పిన తరువాత, నన్ను తనవెంట కొండలో వున్న ఒక చిన్న గుహాద్వారంలోకి తీసుకెళ్లాడు. ఆ భాగమంతా చాలా చీకటిగావుంది.

"చీకటయినా మార్గం సక్రమంగానే వుంటుంది. ఏంభరవా లేదు—నాతోరా—"

అని బైరాగి నన్ను హెచ్చరించాడు. అతను చెప్పిన మాట నిజమే. ఆమార్గ మెటువంటి ఒడుదుడుకులూ లేకుండా సాఫీగావుంది. కొంతదూర మా మార్గంగుండా నడిచిన తరువాత—ఒక విశాలమైన బయలు కనుపించింది. అక్కడ మామూలుగా చెట్లు, గాలి, వెలుతురు. అన్నీ వున్నాయి. కాని అది యేమంత యెక్కువ మేరలేదు. అరగంటకంటే యెక్కువ పట్టలేదు. ఆమార్గం దాటడానికి. ఆపైన, మొదట చూసిన కొండకంటే, చాలా పెద్దకొండవుంది. దానికికూడా ఒక గుహాద్వారముంది. బైరాగి వెంటనే లోపల ప్రవేశించాడు. నేను అతనితోనే అని వేరే చెప్పనవసరంలేదు గదా! ఆమార్గం మొదటి మార్గంలా సాఫిగాలేక, ఎగుడుదిగుడులుగానూ, వలయాకారంగానూ వుంది. ఆతిరుగుడు మార్గాలు చాలా చాలా దాటిం తరువాత, ఒక విశాలమైన మందిరం కనుపించింది. కొండ గుహాలో మందిరాలుంటాయా అని, నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆమందిరం మామూలుగానే, కిటికీలు, ద్వారాలు, గదులు మొదలయినవాటిని కలిగివుండి చూడడానికి రమ్యంగానేవుంది.

అక్కడ, తనకు తెలిసినవాళ్లెవరో వున్నారని, బైరాగి నా కంతకుముందు చెప్పివున్నాడు—కాని నాకు మలుషులెవ్వరూ కనుపించలేదు. సోఫాలు, కుర్చీలు, మంచాలూ మాత్రమున్నాయి. అతడు నన్నొక గదిలోకి తీసుకెళ్లి.

"నువ్విక్కడ విశ్రాంతి తీసుకోవచ్చు. మంచినీళ్లు, పండ్లు రొట్టెలు—అదుగో ఆబీరువాలో సమృద్ధిగావుంటాయి—నీకు కావలసినన్ని తీసుకో."

అంటూ అతను ఆగదిలోవున్న ఒక బీరువాను తెరచి, అందులో వున్న వాటిని నాకు చూపించి, కొన్నింటిని నాముందర పెట్టి తినవలసిందని సౌంజ్ఞ చేశాడు.

"తిరిగి మన మిక్కడనుంచి, నాథ_ర్త కోసం యెప్పుడు బయలు దేరతాము?"

అని నే నడిగిన దాని కతను—

"వెడతాము—ఇప్పుడేగదా యిక్కడ చేరింది?"

అని చిరాకుగా అన్నాడు. చాలాదూరం రాత్రంతా నాతో నడచి వుండడంవల్ల, అలా అంటున్నాడని నేనూహించుకుని, అతని కెక్కువగా కోపం తెప్పించకూడదనుకున్నాను.

"పాము కరిచి యెంతసేపయినా సరే—నే నాకట్టకు జీవం పోస్తానని చెప్పాను."

"అవును—చెప్పారు."

"మరి నీకెందుకు అనవసరమైన ఖంగారు—కొంతసేపు విశ్రాంతి తీసుకో—నేను తిరిగివస్తా."

అని అతను అక్కడనుంచి వెళ్ళిపోయాడు. మనస్సేమో మరో వైపుకు లాగుతూంది. అయినా ఆకలి యెక్కువగా వుండడంవల్ల, బైరాగి నాకోసం పెట్టినవాటిని కొన్నింటిని తిని—నీళ్లుకూడా తాగి, బైరాగి తిరిగి యెప్పుడువస్తాడా—జయసారథి వున్నచోటు కాబైరాగి నన్నెప్పుడు తీసుకెడతాడా అని, అతని రాకకోసం యెదురు తెన్నులు చూస్తూ కూర్చున్నాను. క్రమంగా రాత్రయింది—కాని బైరాగి తిరిగి రాలేదు. అంతకుముందల్లా కష్టపడి వుండడంవల్ల, ఆరాత్రి కక్కడ పడుకుని నిద్దరోతున్నాడనుకున్నా, ఉదయమైనా తప్పక పోవచ్చు ననుకున్నా.

సర్వదష్టుడైన ప్రియుణ్ణి అడవిలో ఒంటరిగా వొదిలివచ్చినందుకు నాప్రాణం అనుక్షణమూ కొట్టుకుంటూంది. కాని ఏంచెయ్యను? బైరాగి పెట్టింది భిక్ష, అతను రావాలి—తీసుకెళ్లాలి. తలవని తలంపుగా, క్షణక్షణానికీ తటస్థమవుతున్న అడ్డంకుల కెంత విచారించాను. హృదయంలో మోయలేనంత బరువుంటే—నాకెక్కడి విశ్రాంతి—నాకెక్కడి నిద్ర? చాలారాత్రి గడిచేవరకూ ఆగదిలో అలాగే కూర్చుని నాదురవస్థను గురించి విచారించాను. కొంతసేపటికి కవతల అడుగుల చప్పుడు వినిపించింది. అంతవరకూ చీకటిగదిలోనే కూర్చున్నాను. అప్పుడు బైరాగి ఒక దీపమును తెచ్చి నేనున్న గదిలో పెట్టి, నాకెదురుగా నిలుచున్నాడు.

"నిద్దరపోలేదా?"

"నాకెక్కడి నిద్దరలేస్వామీ! నాభర్త బతికి బయటపడాలి—నాకు స్థిమితం కలగాలి."

"నీభర్త బ్రతకాలని—తిరిగి నువ్వతన్ని కలుసుకోవాలనీ-నీకు నిజంగా కోరికవుంటే—"

"అదేంస్వామీ! మీ మాటలు నాకర్థం కావడంలేదు. నాభర్తకోసం నాప్రాణాన్నయినా సమర్పించడానికి సంసిద్ధంగావున్నా."

"అంతవర కవసరంలేదుగాని, నీసౌందర్యం మమ్మల్ని ఆకర్షించింది—మాకోరికను తీర్చావంటే—నీకు శుభమవుతుంది—"

అని ఆ బైరాగి అనడమేతడువుగా, నేను ఒళ్లు తెలియని ఆవేశంతో లేచినిలుచున్నాను.

"ఓరీ! దొంగబైరాగీ! ఇదుకా నన్నిక్కడికి తెచ్చింది? ఒళ్లు దగ్గిరపెట్టుకుని మాట్లాడు-లేకుంటే నీతల వెయ్యి ముక్కలవుతుంది-"

అని నేను తీవ్రంగా అన్నదానికి వాడు వికటంగా నవ్వుతూ—

"శపిస్తావా?" అని అడిగాడు.

నాకత్తి నందుకేగాబోలు బయటనేవుంచి రమ్మన్నాడు. అయినా నాపైటమాటున ఎప్పుడూ ఒక కైజారుంటుందన్న విషయం ఆమూర్ఖుడికి తెలీదు. తక్షణం దాని వివతలికిలాగి, ఆతుంటరి బైరాగిని పొడిచి చంపేదామనుకున్న-కాని వాడుచస్తే నాకార్యంకొనసాగదు. అందుకని కొంచం శాంతంవహించి—

"పామమంత్రం తెలుసుననీ—నాభర్త వున్నచోటుకు తీసుకు పోతాననీ—ఎవరో తెలిసిన వారున్నారనీ—యిక్కడికి తీసుకొచ్చి—ఇప్పుడిదా నీప్రయత్నం?"

"నాకు పాము మంత్రమూ తెలుసు—నీభర్త దగ్గరకూ తీసుకెడతా? కాని నువ్వు నా కోరిక తీర్చాలి, తప్పదు-కాదని తప్పించుకు పోవడానికయినా నీ కెటువంటి అవకాశమూ లేదు. ఈగుహాలో కొచ్చినవారు తిరిగి బయటికిపోలేదు."

"నీచుడా! నీపేలాపనలు కట్టిపెట్టు—నీకు చేటుకాల మొచ్చి వుంటుంది. లేకపోతే యిటువంటి దుర్బుద్ధిపుట్టదు."

"నీవంటి అందాలరాణి లభ్యం కావడం నాఅదృష్టంగాని, చేటు కాల మెప్పుడూ కాదు. మోహానాంగీ! ఎందుకింతకోపం! నేను మాత్రం మనిషిని కానా? నీసౌందర్యము ననుభవించడం నాకు చేతగాదా?"

"తుచ్ఛుడా! నోరుముయ్యి! నా కంఠంలో ప్రాణముండగా, నీకోరిక నెరవేరదు."

"నెరవేర్చుకొనే శక్తి నాలోవుంది. నువ్వు నీభర్తను కోరినదానవయితే నాకోరికను తీర్చడంకంటే నీకు వేరు దారిలేదు. నా అధీనంలోవున్న నిన్ను ఏమైనా చెయ్యగలను—"

"దుర్మార్గుడా! నువ్వు నన్నేమీ చెయ్యలేవు. నీలాంటి క్షుద్రులు ఎందరేకమైనా నన్ను కన్నెత్తి చూడలేరు—నాదగ్గిరికి రాలేరు."

"నా ప్రగల్భాలు నేను—నీప్రగల్భాలు నువ్వు—చెప్పుకొన్నందువల్ల ఏమీ ప్రయోజనంలేదు. లక్షణంగా నన్నుకూడి, నన్నానందతరంగడోలికల్లో వూగించి, నీభర్తను రక్షించుకోడమో—లేక భర్త ఆశ వొదులుకుని, ఆ జన్మాంతమూ నాకు బందీగా వుండడమో నిర్ణయించుకో—తొందరలేదు—నిదానంగా ఆలోచించు. మళ్ళీ కలుసుకుందాము."

అనిచెప్పి, ఆ దుర్మార్గు డప్పటి కాతావును వొదిలి వెళ్ళి పోయాడు. నాకు కలిగిన దుస్థితికి నేనెంత యేడ్చినా యేంప్రయోజనం?

"అరరే! అనుకోకుండానే నెంత హీనదశలో కొచ్చిపడ్డాను? అమృతసరస్సు యుద్ధం యింతకీ కారణం. యుద్ధంలో విజయంకలిగినా

జీవితంలో పతనమొచ్చి పడింది, వకుళా సరళలు కంటికనుపించక పోవడమేమిటి? వారికోసం ప్రియుడి సయితంగా నేను బయలుదేరడమేమిటి? మార్గంలో జయసారథి సర్పదష్టుడు కావడమేమిటి? ఈదొంగ బైరాగి మోసంలో చిక్కుకోవడ మేమిటి? కామాంధుడై పేలుతున్నవాణ్ణి, కైజారుతో ఒక్కపోటు పొడిచి చంపడానికి అవకాశం లేకుండా, భర్త విషయంలో వాడేదో సాయంచేస్తాడన్న ఆశ నన్నావరించడమేమిటి? నాగ్రహచారం నన్నింకా యెన్ని బాధలు పెట్టనైవుందో—భగవంతుడా! నా కేందారి? నేనిప్పుడేం చెయ్యాలి?''

అని నేను తరగనితంపిగా యోచనలు చెయ్యడమేకాని, మార్గమేదీ కనుపించడంలేదు. ఒక్కటే ఆలోచనతోచింది. ఎలాగో ఒకలాగ, ఆచెరనుంచి దాటి బయటపడితే, ఆతవాత నాఖర్మం యెలావుంటే అలా అవుతుంతని నిశ్చయించాను. ఆబైరాగి నారూపము మోహించడం వల్లగదా అంతజరిగింది, అందువల్ల వాడికా రూపంతో కనబడకూడ దనుకున్నా, వెంటనే నాదగ్గరున్న తోలుసంచిని విప్పిచూడగా, అందులో జయసారధి దుస్తులున్నాయి. నేను వెంటనే వాటినిధరించాను. పురుషవేషం నిరపాయకరమైందనడంలో సందేహంలేదు. మెల్లిగా గదినిదాటి యివతలకొచ్చాను. అంతటా నిర్మానుష్యం—నిశ్శబ్దం! బైరాగికూడా యెక్కడాలేడు. ముందు వచ్చిన మార్గంగుండా నడవడం మొదలుపెట్టాను. వలయాకారంగా వున్న ఆతిరుగుడుమార్గం ఎంతనడిచినా తరగదు. చివరికి బయలు దేరినచోటుకే తిరిగి వచ్చిచేరాను. అదేం చిత్రమో—ఎన్నిసార్లు తిరిగినా—తిరిగి తిరిగి బయలుదేరిన చోటుకే అందుకే కాబోలా బైరాగి, ఈగుహలో ప్రవేశించినవారు తిరిగి బైటికిపోలేరు—'' అన్నాడు.

ఆప్రకారం నాలుగైదుసార్లు జరిగింది. ఈసారి మార్గం తప్పకుండా, గుర్తుపెట్టుకొని పోదామనుకొని బయలుదేరడము—తిరిగి, తిరిగి, చివరికి బయలుదేరినచోటుకే వచ్చి చేరడము. ఆమార్గంలో గల మహామాయ యేమిటో నాకర్థంకాలేదు. ఇక ఆప్రయత్నమునే విరమించుకున్నాను. ఈసారి మరోదిక్కుగా పోయి ప్రయత్నించాలని బయలుదేరా. ఒక గదిలోనుంచి, మరియొక గదిలోని పోయే మార్గాలగుండా నడిచా. ఎక్కడా మనుషులు కనుపించరు—అలికిడి

వినిపించదు. అయిదారు గదులు దాటినట్లుదాటా. అక్కడ బైరాగి గొంతుక వినిపించింది. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అతనెవరి తోనో తీవ్రంగా మాటలాడుతున్నాడు. ఊపిరయినా విడవకుండా నిశ్శబ్దంగా నిలిచి విన్నాను.

మీ మనస్సులు మీరే మళ్ళించుకుంటారని, యింతకాలమూ సహించి వూరుకున్నాను. కాని మీ మొండిపట్టు మీరు వొదలడం లేదు. త్రినేత్రుడువచ్చినా, మిమ్మల్ని యిక్కడ్నుంచి రక్షించి తీసు కెళ్ళలేడు.''

నాకు చాలా ఆశ్చర్యంకలిగింది. బైరాగి యింకా యెవర్నో నాలాగే మోసంచేసి తీసుకొచ్చి నిర్బంధం చేస్తున్నాడని తెలుసు కున్నాను.

''ఇదుగో! ఈ మృదుతల్పంమీద, నాకు మీయిద్దరూ చెరో వైపునావుంటే—నేను గోపాలకృష్ణున్ని కానా—? మనం అపర సౌఖ్యం అనుభవించమా?''

''ఓరీ! పశువా! నువ్వింతగాదు—ఇంకోయింత నిర్బంధంచేసి నప్పటికీ—చివరకు మాప్రాణాలు తీసినప్పటికీ—నువ్వనుకున్న పని జరగదు. మారాజ్యంనుంచి మమ్మల్ని మోసంచేసి యింతదూరం తెచ్చావు. ఈసంగతి మారాణీ ప్రమీలాదేవికి తెలుస్తుంది. ఆమె సైన్యసమేతంగా వచ్చి నీతల వేయి ప్రక్కలుచేస్తుంది—ఆమె ప్రతాపం నీకు తెలీదు. సక్రమంగా మమ్మల్ని వొదిలిపెట్టి, మా దారి పోనియ్యి.''

అని ఒక స్త్రీకంఠం వినిపించింది—సందేహమేముంది? అది నా వకుళగొంతుక, ఆ యిద్దరి కన్యలను చెరబట్టి ఆదొంగ బైరాగే అక్కడికి తెచ్చాడని అర్థమైపోయింది. నాదుస్తుల మాటున దాచి వుంచుకున్న కైజారును తక్షణం యివతలకి లాగాను. ఎంత అదుము కున్నా ఉద్రేకం ఆగడంలేదు. ఆలశ్యంచేసినకొద్దీ ప్రమాదమేనని తోచింది. ఒక్క ఉరకలో పరుగెత్తి—ఆ బైరాగిజడలు పట్టు కున్నాను—కైజారు కంఠానికి గురిపెట్టాను.

''ఓరీ! దౌర్భాగ్యుడా! నీ వ్యాపారమిదేనా! మహా తపస్సం పన్నుడిలాగా కాషాయిగుడ్డలు ధరించావు-జడలు గెడ్డమూ పెంచావు

ఇలా యింకా యెందర కన్యలను మోసం చేస్తావురా! నీ ఆయువు ఈ రోజుతో సరి—నా చేతుల్లో వుంది నీప్రాణం—"

అని నేను పట్టలేని క్రోధంతో పొడిచెయ్యబోయాను.

"రాజకుమారా! క్షమించు—నన్ను చంపకు—నువ్వు చెప్పినట్లు వింటాను."

అని వాడు, నేను నిజంగా పురుషుడినని భ్రమపడి కాళ్ళమీద పడ్డాడు. వాడివల్ల సర్వదష్టుడైవున్న నాభర్త కేదయినా వుపకారం జరుగుతుందేమోనని కొంచమాశగా వుండడంవల్ల—

"ఈ నీచుణ్ణి బంధించండి—"

అని నేనా కన్యలకు చెప్పగా, వారపరిమితానంద సంభ్రమాలతో—ఎక్కడి నుంచో కొన్ని బలమయిన త్రాళ్లు తెచ్చి, కపట బైరాగిని కక్షదీరా—నరనరాలూ బంధించి పడేశారు. అంతవరకూ నేను కైజారును వాడి కంఠానికి గురిపెట్టి వుంచడంవల్ల, వాడేమీ చెయ్యలేక పోయినాడు. అనంతరం మాకన్యలిద్దరూ నన్ను పురుషునిగానే భ్రమించడంవల్ల, నా పాదాలనంటి—

"ప్రభూ! తమరెవరో–ఆపత్సమయంలో భగవంతుడిలా వచ్చి మా మానప్రాణాలు రక్షించారు, మీ మేలును జన్మ జన్మాలకూ మరచిపోము." అన్నారు.

"అయితే మీ యిద్దరూ నన్ను పెళ్ళిచేసుకుంటారా?"

అని నానవ్వును నాలోనే అణుచుకుని అడిగాను.

"మా దేవి, ప్రమీలారాణి—ఆమె అంగీకారమును పొంది–మేము నీ వారమవుతాము."

అన్నది వకుళ—

"మా దేవి అంగీకారము లేనిదే–మేము గాలికూడా పీల్చము."

అన్నది సరళ —

"ఓ! అలాగా! అయితే—మీ దేవి యిక్కడేవుంది."

అంటూ నేను పురుషవేషమును తీసి పడేసి, మామూలు చీరతో నిలుచుంటే, వకుళా సరళలు సంతోష సంభ్రమాలతో—

"ఆఁ! దేవీ—ప్రమీలా!"

అంటూ వచ్చి నన్ను కౌగలించారు. కపటబైరాగి కళ్లు పెద్దవిచేసి విభ్రాంతుడౌతున్నాడు.

"దేవీ! యిక్కడికెలా రాగలిగావు? ఈ దుర్మార్గుడి తంత్ర మంతా ఎలా తెలిసింది?"

అని వకుళ—

"అమృతసరస్సు ఎవరి వంశమైంది—విజయమెవరిది?"

అని వకుళ, ఆదుర్దాగా అడిగింది.

"అమృతసరస్సు మనదే—విజయమూ మనదే—విషయాలన్నీ సావకాశంగా మాటలాడుకుందాం. ముందర ఈదొంగ బైరాగి సంగతి కనుక్కుందాం."

అని నేను వకుళా సరళలకు చెప్పి—

"ఇప్పుడేమంటావురా కపటయోగీ! దొంగబైరాగీ! నా సంగతి నీ కిప్పటికయినా అర్థమైందా?" అని బైరాగినడిగాను.

"అయిందమ్మా—అయింది! నాకివి చెడ్డరోజులు గాబట్టి నువ్వు జయించగలిగావు, లేకుంటే నేను నీలాంటి వెయ్యిమందికయినా లొంగను, బ్రతికి, చచ్చిన వాడిలా అయ్యాను."

"ఇప్పుడయినా సక్రమంగా ప్రవర్తిస్తావా?"

"చచ్చినట్టు ప్రవర్తిస్తాకాని, నాకు ప్రాణదానం చెయ్యాలి-"

"నిజంగా నీకు పాముమంత్రం తెలుసా?"

"తెలుసు—పాముకరిచి ఎంతసేవయినా సరే—నేను ఆకట్టుకు జీవంపోస్తా—అందులో అబద్ధంలేదు."

"అయితే ముందురా."

"నరాలన్నీ బంధించారు—ఎలానడవను?"

"కాళ్లకున్న కట్లుమాత్రం విప్పండి—రెండు చేతులకూ కట్లు అలాగేవుంచి—మీ యిద్దరూ పట్టుకొండి—వీడితో మనకింకా కొంచం పనుంది."

అని నేను వకుళా సరళకు చెప్పగా, వారావిధంగా చేశారు. అందరమూ కలసి, గుహనుంచి యివతలకొచ్చి చూసేటప్పటికి తెల్ల వారివుంది.

"పారిపోవడానికి ప్రయత్నించినా—తిరిగి మాకేటువంటి అప కారమైనా తలపెట్టినా, నీప్రాణాలు నీకు దక్కవు—ఆసరస్సు ఎక్క డుందో—నడు."

అని నే నాబైరాగిని హెచ్చరించాను. అంతవరకు అక్కడ కట్టివుంచిన, నాగుఱ్ఱాన్ని నేను నడిపిస్తుండగా—వకుళా సరళలు బైరాగినిపట్టి నడిపిస్తున్నారు. మార్గంలో వకుళా సరళలకు, మాకు కలిగిన యుద్ధ విజయము—దళాధిపతి జయసారథి వివరాలు—యుద్ధానంతర మాకన్యలు కనుపించకపోయినందువల్ల, మేమిద్దరము వారి కోసం చేసిన ప్రయత్నాలు—మార్గంలో నాకు ప్రేమపాత్రుడైన జయసారథి సర్వకష్టుడు కావడము—నేను బైరాగివల్ల వంచించబడడ మాదిగా. సర్వవిషయాలూ వివరంగా చెప్పాను.

వకుళా సరళలు బైరాగి చేతుల్లో ఎలాపడ్డారని నే నడిగిన మీఁదట, వారు నా కావిషయం చెప్పబోయేలోపుగా—

"ఇదే నువ్వు చెప్పిన ఆసరస్సు ప్రాంతం. సర్పదష్టుడయిన నీప్రియు డెక్కడో చూపించు."

అని బైరాగి నన్ను హెచ్చరించాడు. నేను నాలుగువైపులా పరిశీలించి చూశాను. నిజంగా అది మేము బసచేసిన ప్రాంతమే—నేను లేచివచ్చిన ప్రాణంతో—గంపెడాశపెట్టుకుని నేను మూసిపెట్టిన ఆకుల దగ్గిరికిపోయి చూడగా, నాగుండె గుభాలుమంది. జయసారథి కళేబర మక్కడలేదు—నేను మూసిపెట్టిన ఆకు న్నీ పక్కకుతోసెయ్యబడివున్నాయి. జయసారథి యేడీ? అతని కళేబరమన్నా లేదే! నాప్రాణాలు నిలువునా యెగిరిపోయినాయి. ఆప్రాంతమంతా పరుగులెత్తి గాలించాను. కాని నాబహిః ప్రాణ మెక్కడాలేదు.

"ఏడీ! నువ్వు చెప్పిన మనిషి కనుపించడేం?"

అని బైరాగి నన్నడిగాడు.

"ఇక్కడే—ఈ ఆకులన్నీ మూసిపెట్టా నాకళేబరానికి—ఏమయిందీ?"

అని నేను గద్గదస్వరంతో అన్నాను.

"ఏక్రూరమృగమో కబళించివుంటుందేమో దేవీ!" అన్నాది వకుళ.

"అంతేనా?" అని నేను యెలుగెత్తి యేడ్చాను. శ్రమఅంతా వృధా అయింది—ఎంతయినా దుఃఖపడ్డాను. వకుళా సరళలున్నూ నాతో విచారించారు.

"పాముకరిచి యెంతసేపయినా సరే—కట్టెకు ప్రాణం పోసే వాణ్ణి—ఆకట్టెకూడా లేకపోతే—?"

అన్నాడు బైరాగి—

"దుర్మార్గుడా! నీవల్లనే యింత జరిగింది—నాప్రియుడు నాకు గాకుండా పోయాడు-నువ్వారాత్రే నాతో వచ్చినట్లయితే—నా దేవుడు నాకు దక్కేవాడు."

అని నేను ఉగ్రరూపంతో బైరాగి మీదికి లేచాను.

"ఇటువంటి విపరీతం జరుగుతుందని యెవరనుకుంటారు? అయినా సర్పదష్టుడయిన వానిని క్రూరజంతువులు ముట్టుకోవు—మరోవిధంగా జరిగివుండాలి."

అని బైరాగి అంటే—నాకు తిరిగి ఆశకలిగింది.

"నీకు బాగా తెలుసునా? పాము కరిచినవానిని జంతువులు ముట్టుకోవా?" అని నేను బైరాగి నడిగాను.

"ముట్టుకోవు."

అని చెప్పి, వాడు నేను జయసారథికి కప్పివుంచిన ఆకులన్నింటినీ కదిపి పరిశీలించి—

"ఇందులో—నల్లేరు కాడలున్నాయి-నల్లేరు, ఒక మహౌషధి-ఈ ఓషధిలో పాము విషమును విరిచేగుణముంది—అదృష్టముంటే మీవాడు మీకు లభ్యంకావచ్చు—పోయి ప్రయత్నం చేసుకోండి—"

అని చెప్పిన బైరాగి మాటలు నాకు కొత్త ఉత్సాహాన్ని కలిగించాయి—వాడిని చంపాలన్నా బుద్ధి సన్నగిల్లింది.

"నన్నుమాత్రం ప్రాణాలతో వొదిలి వెళ్లిపోనియ్యండి. మీకెంతయినా పుణ్యముంటుంది—"

అని వాడు నా పాదాలమీదపడి ప్రార్థించాడు.

"నాకు ప్రాణసమానులయిన ఈయిద్దరు కన్యల్ని నా రాజ్యంలోంచి నువ్వెలా అపహరించి తెచ్చావు.

అని నేనడగ్గా—

"అదంతా మీకా కన్యలేచెబుతారు—నన్నెందుకు బాధ పడతారు? నేను చెప్పడము—మీరు తిరిగి ఉద్రేకం తెచ్చుకుని, నన్ను పొడుస్తాను—చంపుతాను—అనడము జరుగుతుంది—ఇక నన్ను పోనియ్యండి—మీకు పుణ్యముంటుంది."

అని వాడన్నది కూడా నిజమే అనుకుని—

"సరి—పో—నీపుణ్యం బాగుంది బతికిపోయావు."

నేను వాణ్ణి ఒక కుక్కగా యెంచి పొమ్మన్నాను.

"నువ్వుగాని, మళ్ళీయెప్పుడయినా, మారాజ్యంలో అడుగు పెట్టినా, మాకెక్కడయినా కనుపించినా—నీగడ్డానికి నిప్పంటిస్తాం" అంది వకుళ.

"నిన్ను పాతాళహోమం చేస్తాం." అంది సరళ.

వాడు వారిమాటలు వినిపించుకోకుండా, కట్లు విప్పడమే తడవుగా, బ్రతుకుజీవుడా అనుకుని, నాలు చూపులయినా అందకుండా పలాయితుడయ్యాడు. అనంతరం వకుళా సరళలు తమ తండ్రిగార్ని గురించీ—వాలనగర యితరవిషయాలను గురించీ అడిగారు. నేను వారడిగిన కన్నింటికీ విపులంగా జవాబులు చెప్పి, వారి తండ్రిగారయిన వృద్ధమంత్రి, నేనానగరం వొదిలి వచ్చేవరకూ సురక్షితంగా వున్నారనీ—కూతుళ్లకోసం బెంగపెట్టుకున్నారనీ చెప్పి. యుద్ధసమయంలో ద్వారరక్షణకై నియోగించబడ్డ, వారు బైరాగిచేతుల్లో యెందుకు పడ్డారో అడగ్గా వకుళ తమకు జరిగిన పరాభవమును గురించి యిలా చెప్పింది.

"దేవీ—అదిరాత్రి సమయం. నువ్వు అన్యాయపరస్సును సంరక్షించడంలో నిమగ్నురాలవై యున్నావు. సహ్యాద్రి కొండ ప్రాంతంలో మనసైన్యాలకూ, శత్రుసైన్యాలకు ఘోరమైన పోరు జరుగుతూంది. కోటద్వారాన్ని సంరక్షించడానికై నియోగించబడ్డ మేము—అనుక్షణము యుద్ధవివరాలు తెలుసుకుంటూ, మావాళ్లను హెచ్చరించుకొంటూ, బహుజాగ్రత్త వహించివున్నాము. అప్పుడొక అపరిచితుడు అశ్వారూఢుడై పరుగు పరుగున మాదగ్గిరకొచ్చి, 'వకుళాదేవి' యెవరు అని అడిగాడు. 'నేనే'—ఎందుకూ అని నేను ముందుకురాగా—

"రాణీ ప్రమీలాదేవిగారికి కడుపునొప్పి వచ్చింది. వారా పోటు భరించలేక కోట చేరుకున్నారు—వకుళా సరళను జరూరుగా కోట చేరవలసిందని ఆజ్ఞ." అన్నాడు.

అప్పుడు మేము బెదరిన హృదయాలతో ఎక్కడి వక్కడ వొదిలేసి, జాగ్రత్తగా చూసుకోమని, దళాధిపతితో మాత్రం చెప్పి,

పరుగు పరుగున కోటవైపు వెళ్లాము, మా కావార్త చెప్పినవాడు— మమ్మల్ని అనుసరించుకొనే వున్నాడు, కొంచందూరంలో జోడు గుఱ్ఱములబండి ఒకటి కనుపించంది.

"ఇది మన సంస్థానపు బండి-కోటనుంచి మీకోసమే వచ్చింది దీనిలో మీరు కోటకు సత్వరంగా చేరవచ్చు." అన్నాడు.

మేము ఆలోచించకుండా ఆ బండిలో కూర్చున్నాము. అది మేఘాలమీద ఎగిరినట్లు ఎగిరింది. కొంత సేపయినాక చూసుకుంటే- అది మనకోట మార్గంకాదు. ఆశ్చర్యపోయాం.

"ఏయ్! అపు-ఎక్కడికిలా? కోటమార్గం తప్పించిపోతూంది బండి-"అని కేకలుపెట్టాం. వాడు మా కేకలు వినిపించుకోలేదు. బండిలోంచి ఉరుకుతే ప్రాణాలు పోయేటంతటి వేగంలో పరుగెత్తుతున్నాయి గుఱ్ఱాలు.

"ఏదో మోసం జరుగుతూంది—ఈ బండేమిటి? మనల్ని ఎక్కడికి తీసుకుపోతూంది—ఇంకా చూస్తావేం వకుళా" అని సరళ నన్ను హెచ్చరించింది. వెంటనే మేమిద్దరమూ లేచి, గుఱ్ఱాలు తోలుతున్న వాడితో కలియబడ్డాం—వాడి చేతుల్లోని కళ్లాలు మేము పట్టుకున్నాం. సరళ వాణ్ణి వెంటనే బండిలోంచి కిందపడదోసింది. కింద పడ్డవాడు మాకాశ్చర్యం కలిగించేలాగ గుఱ్ఱాలమీద కురికి—మా చేతులో కళ్లాలను మయానికి దేనితోనో కత్తిరించేశాడు. అంతే గాకుండా గుఱ్ఱాలను హెచ్చరించి మరింత వేగంగా పోనిచ్చాడు. మార్గమంతా ఒడుదుడుకులుగా వుండడంవల్ల, వేగానికి తట్టుకోలేక బండి బోర్లపడి ముక్కముక్కలయింది. సరళా నేనూ ఎక్కడికో విసిరేయబడ్డాం—ప్రాణంపోయిందే అనుకున్నాం—ఒంటిమీద తెలివి తప్పింది—మూర్ఛపోయి వుంటాము.

తెలివొచ్చాక చూసేటప్పటికి-అదుగో నువ్వు చూసిన ఆకొండ గుహలో వున్నాము—బైరాగి మాకు సాక్షాత్కరించాడు. ఇన్ని రోజులనుంచీ వాడితో మాకు పేచీ జరుగుతూంది. ఎలాగయినా మమ్మల్ని ఒప్పించో—నిర్బంధంచేసో—శీలభంగం చెయ్యడానికి వాడు పూనుకున్నాడు, మేము లొంగకుండా—ఎప్పటికప్పుడు వాణ్ణి ఎదుర్కుంటున్నాము. ఇద్దరం కలియబడ్డామంటే—వాడిమీద పడి పీకి పీకి చంపలేకపోము—కాని, వాడు తన దగ్గరున్న ఓ శంఖమును మాకు

చూపించి—దాని మంత్రశక్తివల్ల దాన్ని ఎవరికి తాకిస్తే వాళ్లు శిలలుగా అయిపోతారని మమల్ని భయపెట్టాడు. బైరాగులు అటువంటి పన్లేచేస్తారనీ-వాళ్లదగ్గర అటువంటి మంత్రతంత్రా లుంటాయనీ మేమంతకు ముందు వినివుండడం చేత, ఆ మోసగాడి మాటలు తేలిగ్గా నమ్మాము. వాడు తనమాటల సందర్భంలో యింకా యిలా చెప్పాడు. తాను మన వాలనగరమొచ్చి, అంతకుముందు కొద్ది రోజులే అయిందనీ—మా యిద్దర్ని ఒకనాటి సాయంకాలం, నగరోద్యానవనంలో చూశాడనీ—మా రూపాలకు భ్రమసి, అప్పటినుంచీ, మమ్మల్ని వెన్నంటే వుంటున్నాడనీ—ఆ యుద్ధపురోజున తనకా మాత్రం అవకాశం దొరికినందువల్ల—ఆప్రకారం యుక్తిపన్ని తన నివాసానికి తెచ్చుకోగలిగాడనీ చెప్పాడు.

ఏది ఏమయినా, నువ్వుకూడా వాడి మాయలో నేపడి, మేమున్న దగ్గిరికే రావడం గొప్ప అదృష్టం—లేకుంటే మన మిాజన్మకు తిరిగి యిలా కలుసుకుంటా మనుకోలేదు దేవీ!"

అని వకుళ చెప్పడం ముగించిన తరువాత—

"ఒకవిధంగా అదృష్టమే—మరోవిధంగా దురదృష్టం! నిరాశచేసుకొన్న మిాయిద్దర్ని రక్షించుకో కలిగినందుకు సంతోషపడనా? నా ఆశలన్నీ నిలుపుకున్న నాదేవుడు జయసారిథి సర్పదష్టుడు కావడమే గాకుండా-కళేబరంకూడా మటుమాయమైనందుకు దుఃఖపడాలా?"

"అయితే, మనమిప్పుడు జయసారధి కోసం ఏంచెయ్యాలి దేవీ?"

అని వకుళ అడిగింది.

"మిా యిద్దరూ వివాహం చేసుకున్నారా దేవీ?"

అని సరళ అడిగింది.

"హృదయాలు ఏకమైనాయి—నాప్రాణ సమానులయిన మిారు దొరికే వరకూ మేము పెళ్ళిచేసుకో దలచలేదు. వకుళా! సరళా! మిారా మన్మధమూర్తిని చూడలేదుగాని, ఎంతమంచివాడు! ఎటువంటి వీరుడు! ఎంతఅందగాడు! నాజన్మను సార్ధకం చెయ్యడానికి అవతరించిన పుణ్యమూర్తి అతనేనని యెంతయినా మురిశానర్రా! దరిద్రురాల్ని కనకనే—దక్కకుండా పోయాడు. ఓపని చెయ్యండి. మిా యిద్దరూపోయి, సురక్షితంగా నగరంచేరండి, మిా నాయనగారు

మీాకై పొందుతున్న ఆరాటాన్ని తీర్చండి. నేనింకా కొంతకాలం నా దేవుడి జాడలేకయినా తెలుస్తాయేమో ప్రయత్నం చేస్తాను.''

అని నేనన్నమీాదట—

''నిన్ను వొదిలి మేమెక్కడికీ వెళ్లం దేవీ!'' అన్నది వకుళ.

''ముగ్గురమూ కలసి ప్రయత్నం చేద్దాం అతనికోసం.'' అంది సరళ.

వాళ్లకి నేనేం చెప్పను—అప్పుడిక ముగ్గురం కలిసి, అన్వేషణానికి బయల్దేరాము! మా శిప్పలు మాకు మళ్ళీ మామూలే అయినాయిగదా!

## 3—౨

ఒకరికి ముగ్గురము న్నాము గాబట్టి, ప్రయాణ మేమంత కష్టతరంగా లేదు. కాని జయసారథిని తిరిగి కలుసుకోవడం జరుగుతుందా? జరగదా? అన్న నిరుత్సాహం నిమిష నిమిషానికీ మమ్మల్ని పీడిస్తూంది. అయినా, ఆనిరుత్సాహానికి లొంగకుండా మొండితనం వహించి, ఒక దేశమనక, ఒక నగరమనక, ఒక కొండనక, ఒక మిట్టనక తిరుగుతున్నాము. వకుళా సరళల సందర్భంలో ఆశవుండి తిరిగామా—అంచనా వేసుకుని తిరిగామా? తిరిగినందుకు శ్రమవృథా పోలేదు. కష్టాలను ధరించినా, నిరాశ చేసుకున్న ఆత్మీయులు కళ్లబడ్డారు—అదేవిధంగా జయసారథికూడా కనుపించకూడదా? అతడు బ్రతికివున్నాడో—లేదో అన్న సందేహమొకటి హృదయంలో మధ్య మధ్య ఖరేలు మంటూంది.

విజయకుమారా! నిరాశ నిస్పృహలు మమ్మావరించిన కొద్దీ, మేము మా సర్వశక్తులూ వినియోగించి, వాటిని అనుక్షణమూ అణగద్రొక్కుతున్నాము. విధివిధానాలు లేకుండా ముగ్గురము ఒకే గుట్టు మీాద ప్రయాణాలు సాగిస్తూనే వున్నాము. జయసారథిని గురించి భోగట్టాలు చేస్తూనే వున్నాము—ఇలా కొంతకాలం ప్రయాణాలు చేసీ చేసీ, ముగ్గురమూ అలసిపోయాము. ఒకనాటి సాయంసమయాన ఒక సముద్రతీరాన చేరుకున్నాము.

''దేవీ! బడలిన మన శరీరాలికి సముద్రపుగాలి ఎంతో హాయిని కలిగిస్తూంది. కొంచెంసేపు ఈతీరాన విశ్రమించి, అటుపైన తిరిగి ప్రయాణం సాగిద్దామా?''

అని వకుళ అన్నమీదట, నాకున్నూ అదే ప్రకారం చెయ్యాలని బుద్ధిపుట్టింది. ముగ్గురమూ గుఱ్ఱాలు దిగాము. అక్కడి ఇసకలో కూర్చుని, చల్లగాలి ననుభవిస్తుంటే—క్షణకాలం మా సర్వదుఃఖాలూ మరచాం. అంతవరకు పడ్డశ్రమ—తిరుగుడువల్ల కలిగిన అలసటలు, చేతితో తీసిపారేసినట్లయింది.

“దేవీ! మనం తిరిగి యిలా కలుసుకోగలుగుతామని కలలో కూడా అనుకోలేదు. భగవంతుడి లీల ఎలావుందో చూశావా?” అన్నాది వకుళ.

“ఏమి భగవంతుడు లేవే! ఈ నిమిషంలో ఏడిపిస్తాడు—మరు నిమిషంలో నవ్విస్తాడు.” అన్నాది వకుళ.

“అదే అతని లీల!” అని నేనన్న.

వకుళ తన చేతి రెండు వేళ్ళను ముక్కుమీద పెట్టుకొని, కొంచం సేపు ఏదో మంత్రిస్తున్నట్లుగా కళ్లుమూసుకుని అభినయించి, తరువాత ఆ రెండు వ్రేళ్ళనూ నాముందర పెట్టి—

“దేవీ! ఏదో ఒక వేలు పట్టుకో—జ్యోశ్యం చెబుతాను.” అంది. ఆపరిస్థితిలో నాకు నవ్వాలనో—ఏడవాలనో తెలిసింది కాదు.

“ఒక్కవేలే పట్టుకోవాలి సుమా దేవీ! నాజ్యోశ్యం తప్పక నిజమవుతుంది.” అని ఆమె తిరిగి నను హెచ్చరించింది. అందులో పోయేది మాత్ర మేముండనుకుని—

“సరే—” అంటూ నాముందర పెట్టిన వకుళ రెండు వ్రేళ్ళలోనూ ఒక వేలిని పట్టుకుని—

“ఏమిటమ్మా నీజ్యోశ్యం” అన్నా.

“దొరుకుతాడు—మీఅమ్మాటికీ దొరుకుతాడు జయసారథ—ఇక నువ్వు బెంగెట్టుకో నక్కర్లేదు దేవీ!”

అని సంతోషంతో నవ్వడం మొదలుపెట్టింది. వకుళదగ్గర ఆ మాత్రం కొంటెతనం ఆదినుంచీ వుంది. విసిగి చిరాకుగా వున్నవారిని యిట్టె నవ్వించి హెచ్చరిక కలిగించగల చాకచక్యం ఆమెలో చాలా వుంది. ఏది యేమయినా—ఆమె జ్యోశ్యం వొట్టిదయినా—నిజమయినా అప్పటికి మాత్రం మనస్సుకు కొంచం ఉత్సాహామునే కలిగించింది.

“అయితే—యెప్పుడు దొరుకుతాడో కూడా చెప్పు!”

అని వకుళ, తోబుట్టువు నడిగింది.

"ఎప్పుడు దొరుకుతాడా? ఒకటి, రెండు, మూడు రోజులో!" అని సరళ తడుముకోకుండా జవాబు చెప్పింది. తాత్కాలికంగా నాకు హెచ్చరిక కలిగించడానికీ—నాకు సంతోషం కలిగించడానికీ, ఆ కొంటెపిల్ల అలా అందని నాకు తెలీపోలేదు.

"సరళా! నీజ్యోశ్యమే నిజమయితే—రాజ్యంలో అర్థభాగం నీది." అన్నా నేను.

"అప్పుడు నాకు మంత్రి?"

అని సరళ తిరిగి నడిగింది.

"నేను—సరా?"

అన్నా నేను.

"భేష్! బాగుంది—మాటతప్పకూడదు సుమా దేవీ?"

"నీజ్యోతిషం తప్పకుండావుంటే—నామాట ఎప్పుడూ తప్పను."

ఆ కొంచంసేపయినా ఖులాసాగా మాటలాడుకుంటున్నాం—ఇంతలో ఒక సముద్రకెరటం మేం కూచున్నదగ్గిరికొచ్చి పడింది. అంతేగాకుండా ఆకెరటం తనతో తెచ్చిన ఏదో పదార్థాన్ని మా ముందర పడేసింది.

"పిల్లాడు—పిల్లాడర్రా!"

అని సరళ కెవ్వున అరిచి, భయవిభ్రాంతులతో లేచి నిలుచుంది. వకుళ ఆబిడ్డని చేతుల్లోకి తీసుకుంది.

"నిజంగానే దేవీ! మొగబిడ్డ! సముద్రంలో ఎలా కొట్టుకొచ్చాడు?" అని వకుళ ఆశ్చర్యంతో అంది. వకుళ చేతుల్లో వున్న బిడ్డ ముఖంలోకి నేను పరిశీలనగా చూచి—

"బ్రతికి వునట్టున్నాడు?" అన్నాను.

"అవును బ్రతికేవున్నాడు—కాని నీళ్లు మింగి ఆయాసపడుతున్నాడు." అని వకుళ అన్నమీాదట, ఆబిడ్డను నేను తీసుకుని, ఇసక మీాద నాచీర చెంగుపరిచి, బిడ్డను బోర్లపడుకోబట్టి, వీపుమీాద మెల్లిగా వొత్తి, మింగిన నీరు వెళ్ళగక్కించాను. అప్పుడాబిడ్డ యేడవడం మొదలుపెట్టాడు. సుమారు మూడేళ్లవయస్సులో స్ఫురద్రూపిగా వున్న ఆబిడ్డను చూడ ముచ్చటయింది.

"ఈపిల్లాడెవరో—సముద్రంలో ఎలా కొట్టుకొచ్చాడో—సరిగ్గా మనమున్నదగ్గిరికొచ్చి పడ్డాడు." అని నేనాశ్చర్యంతో అన్నా.

"అక్కర్లేక యెవరో సముద్రంలో పారేసివుంటారు." అంది సరళ.

"ఈ పిల్లాణ్ణి మనతో మననగరం తీసుకుపోదాం దేవీ!" అంది సరళ.

"తీసుకుపోదాంగానీ-అంతవరకూ సాకేదెల్లా-నువ్వు పాలిస్తావా మరి?"

అని సరళను నేను నవ్వుతూ అడిగాను.

"ఈ దగ్గర్లో ఏదయినా వూరుందేమో—పోయి చూద్దాం-పాలు సంపాదిద్దాం."

అంది సరళ, దైవవశాత్తూ బ్రతికి మాపాలిట పడ్డ ఆబిడ్డను సాకేభారమొకటి మీాతలపై పడ్డది. అందువల్ల సరళ చెప్పినట్లు చెయ్యడమే కర్తవ్యంగాతోచింది. ముగ్గురం తిరిగి గుట్టయెక్కి బిడ్డ సయితంగా బయలుదేరాం. ఇసకదిబ్బ కడ్డంపడి పోగాపోగా, కొందరు మనుషులు కనుపించారు. అదృష్టవశాత్తూ, ఆప్రాంతంలో, ఏదయినా పట్టణమో—పల్లో వుండవచ్చు నని సంతోషపడ్డాము. అందునుగురించి, మాకగుపించిన మనుషులను దరియాప్తు చెయ్యగా, సముద్రతీరానికి రెండు క్రోసులదూరంలో నారికేళ పట్నముందని తెలిసింది. గుట్టం మీాద రెండామడలదూరం పోవడానికి యెక్కువసేపు పట్టలేదు. పట్నం చేరగానే ముందర కొన్ని ఆవుపాలు సంపాదించి బిడ్డకు పోశాము. బిడ్డయేడుపు మానడమేగాకుండా సరళ భుజాలమీాద పడు కుని నిద్దరపోయాడు.

అటుపైన మేము క్రమంగా నగరంలోకి పోయాము. అది సామాన్యమైన పట్నంకాదు. సుమారు మా వాలనగరమంతవుంది. విశాలమైన వీధులు—పెద్దపెద్ద మందిరాలు-రమణీయంగా వున్నాయి. ఆనాడక్కడ ఏదయినా ఉత్సవమో-పండుగో-జనం గుంపులు గుంపు లుగా పోతున్నారు—కొందరు పరుగులెడుతున్నారుకూడా, ఆనాడా నగరంలోగల విశేషమేమిటో తెలుసుకోవాలన్న కుతూహలంతో నే నాగుంపులో ఒకరి నుద్దేశించి—

"ఏమయ్యా! విశేషమేమిటి? నగరవాసులందరూ యిలా గుం పులుగా యెక్కడికి పోతారు?"

అని నేనడిగినదానికా నగరవాసుడు, ఒకే గుఱ్ఱమీదవున్న మామువ్గుర్ని ఒకసారి ఎగాదిగాచూసి—

"పరదేశిని ఉరిదీస్తారు—చూడ్డానికి పోతున్నాం." అని మాత్రం చెప్పేసి, ఆ నగరవాడు గుంపులోకలిసి, తనదార్ని తాను పోయాడు.

"ఎవరో—పరదేశిని ఉరిదీస్తారట! యెందుకో."

అని నేనంటే—

"మనంకూడా అక్కడకుపోయి చూడకూడదా దేవీ?"

అంది వకుళ—

"నష్టమేముంది? చూద్దాం పదండి."

అంది సరళ.

నేను గుఱ్ఱాన్ని ఆగుంపుల ననుసరించి పోనిచ్చాను, క్రమంగా నగరవాసులందరూ పట్నందాటి, ఒక బహిరంగం ప్రదేశం చేరుకున్నారు. అక్కడ ఒక ఉరికంబం ఏర్పాటు చెయ్యబడింది. ముఖం నిండా నల్లటి ముసుగుతో కప్పబడిన ఒక వ్యక్తి ఆ వురికంబాన నిలుపబడివున్నాడు. అతని కిరువైపులా యిరువురు తలారులు నిలబడి వున్నారు. ఉరిత్రాడు పైన వ్రేలాడుతున్న దేగాని, ఇంకా అతని కంఠానికి తగిలించబడలేదు. తలారులు, ఎవరిరాకకోసమో—ఎవరి ఆజ్ఞలకోసమో నిరీక్షిస్తున్నట్లుగా తోచింది.

"నేరస్థుడు చేసిన అపరాధమేమిటో—ఆసమయంలో అతని ప్రాణం ఎంతగా కొట్టుకుంటుందో—అతడు మనస్సులో ఎన్నికోరికలు పెట్టుకుని ఉరికంబ మెక్కడోగదా." అంది సరళ.

"పాపం! అతని భార్యాబిడ్డలు— తలిదండ్రులూ ఎంతగా దుఃఖపడుతుంటారో!" అన్నది వకుళ.

"నేరస్థుల్ని తగినవిధంగా శిక్షించకపోతే—పరిపాలన జరిగేదెల్లా?"

అని నేనన్నదానికి—

"నిజమేగాని శిక్షించబడ్డ వారందరూ నేరస్థులనుకోడానికి వీల్లేదు. ఒకొక్కప్పుడు నేరం చేయనివారుకూడా దండించబడతారు." అంది వకుళ.

"న్యాయమూర్తుల శక్తి సామర్థ్యాలపై ఆధారపడ్డ విషయమది. వారు మేధావులయితే, అపరాధనిరపరాధులను చక్కగా

నిర్ణయం చెయ్యగలుగుతారు—మేధావులు కానివారు, దోషులను నిర్దోషులుగానూ, నిర్దోషులను దోషులుగానూ నిర్ణయిస్తుంటారు. దానికెవరూ ఏమీ చెయ్యలేరు.'' అని నేనన్నాను.

గుఱ్ఱం దిగకుండా మేము ముగ్గురమూ, అదేవిధంగా అక్కడ మరికొంచంసేపు నిలుచున్న తరువాత—అక్కడ మూగిన జనంలో సంచలనం బయలుదేరింది.

''రాణీ, వీరమతీదేవిగారు—వస్తున్నారొస్తున్నారు—తప్పుకోండి—తప్పుకోండి.''

అని ఒకరినొకరు హెచ్చరించుకోవడము—గుంపులుగా మూగినవారు ప్రక్కలకు తప్పుకోవడము—జరిగింది. ఇంతలో ఒక నడివయస్కురాలయిన స్త్రీ వెనుక ముందుల అంగరక్షకుల నుంచుకొని, హుటాహుటి ఉరికంబమును సమీపించింది. అక్కడ అశ్వము నాపి, అంది పైనుంచి, అందరూ వినేలాగ, ఉచ్చైశ్వరంతో—

''నగరవాసులారా! ఈపరదేశి యెవడో మన శత్రుకూటము లోనివాడై వుండవచ్చు—లేకుంటే ముక్కు పచ్చలారని నాముద్దుబిడ్డను—మీ యువరాజును చేతులారా హత్యచేయవలసిన కారణమేముంటుంది? వేరు సాక్ష్యములతో అవసరంలేకుండా మన ముఖ్యమంత్రి మార్తాండుడే, అపరాధం జరుగుతుండగా చూచి, నేస్తుని బంధించాడు. ఇంతఘోరం చేసిన మహాపాపిని, మీ అందరి సమక్షంలోనూ ఇప్పుడు ఉరితియ్యడానికి నిర్ణయించబడింది.''

అని విన్నవించిన తరువాత ఆరాణి, తలారుల నుద్దేశించి,

''ఆ పాపిష్టిముఖాన్ని ప్రజలందరూ చూస్తారు—ఒక్కసారి ముసుగు తియ్యండి—''అని హెచ్చరించింది.

వారు ముసుగును తొలిగించారు! అపరాధియెవరు?'' జయసారథి'' అని నేను నోటితో అనడమేమిటి? గుఱ్ఱమును కాలితో హెచ్చరించడమేమిటి? రెండూ ఒకసారి, గుఱ్ఱం తక్షణం గుంపులను దాటి ఉరికంబంకగ్గిరి కురింది, నన్ను చూచి జయసారథి, జయసారథినిచూచి నేను—క్షణకాలం నిష్పరపోయాము—మమ్మల్ని చూచి మిగిలినవారు తెల్లబోయారు, అప్పుడు నేను రాణి నుద్దేశించి—

''మహారాణీ! ఈశిక్ష కేవలం అక్రమం—అన్యాయం—ఇతడు నేరాలు చేసేవాడు కాదు. శృంగారనగర ప్రధానన్యాయాధిపతి—

పాలనగరానికి కానున్న మహారాజు—ముందర ఉరికంబమును దింపండి!''

అని నేను ఉద్రేకంగా అరిచాను.

''ఎవరయితే మాకేం—నేరంచేశాడు—శిక్షిస్తాం.''

అని, మంత్రి చిహ్నాలతోవున్న ఒక వ్యక్తి నన్నదిరించాడు. నేను ఒరనుంచి కత్తి దుయ్యడమే తడువుగా, వకుళా సరళలున్నూ తమకత్తుల నివతలకు తీశారు. నిమిషంలో ఆప్రదేశమంతా రక్తపు కొల్లు కావలసిందే—కాని—ఇంతలో సరళ భుజాలపైవున్న బిడ్డ ఆ ఖంగారుకు లేచి ఏడవడం మొదలుపెట్టాడు. రాణీ వీరమతి ఒక్క దాటులో ముందుకురికి—'ఆగండి' అంటూ సరళ దగ్గరున్న బిడ్డను దానందుకుంది.

''నాబిడ్డ—నాప్రాణం—బ్రతికివున్నాడా.''

అంటూ పట్టలేని సంతోషంతో ఆబిడ్డను హృదయానికి హత్తు కుంది. ఆసందట్లో మంత్రి చిహ్నములు కలిగిన ఉద్యోగి చల్లగా జారి పోతుండడమును గమనించిన రాణియే—

''అదుగో పారిపోతున్నాడు-ఇంతకీ కారకుడయిన నామంత్రిని ముందర బంధించండి.'' అనడంతో, వకుళా సరళల రెండుకత్తుల మధ్య ఆమంత్రి కఠం ఇరుక్కునివుంది, నేను జయసారధిని ఉరి కంబమునుంచి దించి—

''అయ్యో! నీకోసం యెన్నికష్టాలు పడ్డాం జయా! ఈప్రాలుద్ధం ఎలాకలిగింది? ఏమిటిదంతా?''

అని నేనావేశంతో జయసారధిని కౌగలించి, అడుగుతుంటే—

''అమ్మా! మీరెవరో! సకాలంలో అవతరించి, నాబిడ్డను నాకు ప్రసాదించడమే గాకుండా, ఒక నిర్దోషి ప్రాణాలు కాపాడ గలిగారు. ఇంతకూ కారకుడైనవాడు నామంత్రేనని యిప్పుడర్థమైంది. మీరందరూ నా రాణివాసానికి దయచెయ్యండి—అన్ని విషయాలూ సావకాశంగా తెలుసుకోవచ్చు.''

అని రాణీ వీరమతి మాకుచెప్పి—

''దుర్మార్గుడయిన ఈమంత్రి మార్తాండుని, ప్రస్తుతం ఖయిదు చెయ్యండి.''

అని తన సిబ్బంది కాజ్ఞ లుయిచ్చింది. భటులు మంత్రిని బంధించి తీసుకుపోయారు. రాణీ వీరమతి మా అందర్నీ తనతో తన మందిరానికి తీసుకుపోయింది. వీరమతి రాణివాసంలో మా అందరకూ తగుమర్యాదలు చెయ్యబడ్డాయి, అనంతర మామె తనబిడ్డ నొడిలో పెట్టుకుని, మాదగ్గర సావకాశంగా కూర్చుని యిలా చెప్పింది—

"అమ్మా! ముందర నాసంగతి నన్ను చెప్పనియ్యండి—ఆతరువాత మీ సంగతులు మీరు చెప్పవచ్చు.

"నేను ఏడవమాసము ఈ బిడ్డను గర్భంధరించివుండగా, ఈ బిడ్డ తండ్రి క్షయవ్యాధివల్ల దివంగతులయినారు. నాదులగాయితు, నన్ను నామమాత్రంగావుంచి, మంత్రి మార్తాండుడే సర్వకార్యాలూ చక్కబెడుతున్నాడు. నవమాసపూర్తికాగా, నేనీ బిడ్డను ప్రసవించాను. రాజ్యార్హుడయిన మొగబిడ్డ కలిగాడని, నేనేగాకుండా నగరవాసులందరూ ఉప్పొంగారు, కాని, మంత్రిమాత్రం అసూయగా వున్నాడని కొందరు చెబుతే, నేను నమ్మలేను. పసిబిడ్డ రాజ్యపాలన ఏం చెయ్యగలడు?—బిడ్డ తల్లినయిన నావల్ల ఏమవుతుంది? అందువల్ల నేటివరకూ మంత్రి సర్వాధికారిగావుంటూ, రాచకార్యాలను చక్కబెడుతున్నాడు.

ఇలా వుంటుండగా, ఒకనాటిరాత్రి నాపక్కలో బిడ్డ మాయమయ్యాడు. నేను బేజారై—ఈసమాచారమును సైన్యాధిపతికి తెలియజేశాను. అతను వెంటనే తన సిబ్బందిని నగరంలో నాలుగు వైపులకూ పరుగెత్తించాడు. ఈ నగరానికి కొంతదూరంలో సముద్రముంది. ఆసముద్రంవారను, ఈజయసారథి అన్న పరదేశి, నాబిడ్డను ఖండఖండలుగాచేసి, సముద్రంలో పారేస్తుండగా తాను స్వయంగా చూచి, బంధించినట్లుగా మంత్రి మాకొచ్చి చెప్పాడు. మేము విజయసారథిని విచారించగా, తాను శృంగారనగర సైన్యాధిపతిననీ—కారణాంతరములచే, ప్రియురాలితో ప్రయాణములు చేస్తుండగా, ఒక అడవిలో తన్ను పాము కరించిందనీ—తను స్పృహతప్పి పడిపోయాడనీ—అనంతరం, తనకు కప్పబడిన మూలికాప్రభావంవల్ల, పాము విషం విరిగి, తాను సజీవుడయ్యాడనీ—తెలివొచ్చి చూచుకొనేటప్పటికి, ప్రియురాలు దగ్గర లేకపోవడంవల్ల, ఖంగారుపడి, ఆమెకోసం వెదుక్కుంటూ, తిరిగి, తిరిగి మానగరం చేరాడనీ—అక్కడ

సముద్రతీరప్రాంతాన, తాను నడుస్తుండగా కొంతదూరంలో తనకు బిడ్డ యేడుపు వినిపించిందనీ—పరుగెత్తి చూడగా, కొందరు దుర్మార్గులాబిడ్డను ఏమో చెయ్యబోతున్నారనీ–తను వారించబోగా, తనకు వారికీ పోరు జరిగిందనీ–తనతో పోరినవారిలో మామంత్రి, మామ్త్రాం డుడుకూడా వున్నాడనీ—తానావిధంగా వారితో పోరుతుండగా, కొన్ని సైనికబలాలొచ్చి తమ్ము ముట్టడించాయనీ–ఆసమాచరమును గమనించిన వెంటనే, మంత్రి స్వయంగా ఆబిడ్డను సముద్రంలో పారేసి విజయుసారథే నేరస్థుడని భటులకు పట్టియిచ్చాడనీ—

జయసారధి చెప్పినదంతా మాకో కట్టుకథలా కనుపించిందిగాని యధార్థవిషయంగా తోచలేదు. పైగా మేము మామంత్రి మాటలు విశ్వసించవలసివుంది కాని, ఎవరో పరదేసి చెప్పినదాన్ని నమ్మే సావకాశం లేకపోయింది. మంత్రి సర్వాధికారి గాబట్టి, అతనే జయసారధికి ఉరిశిక్షను విధించాడు. సకాలంలో మీరొచ్చి పతరించి, నాబిడ్డను నాకు ప్రసాదించడమే గాకుండా, ఉరితీయబడవలసిన జయసారధిని కాపాడారు.

అని. రాణీ వీరమతి చెప్పినదంతా వినిన తరువాత, నేనడిగాను–

''జయసారధి నిరపరాధి అని, మీ రిప్పటికయినా ఎలా తెలుసుకో గలిగారు?''

''బిడ్డ, ఖండఖండలుగా వధించబడి సముద్రంలో పారవెయ్య బడ్డాడన్న మంత్రిమాట, నాబిడ్డ నాకు దిక్కిన తరువాతయినా, అసత్య మని తేలడం లేదా?''

''మంత్రి నేరారోపణను, ఆవిధంగా యెందుకు చెయ్యవలసి వచ్చిందంటారు? ఖండించకుండా, బిడ్డ పళంగానే జయసారధి సముద్రంలో పారేశాడన్నా శిక్షార్హుడే కదా!''

''బిడ్డ పళంగా పారేశాడంటే—నే నాశపడి, వలలువేయించి, సముద్రమంతా గాలించవచ్చు-ఒకవేళ బిడ్డ దొరుకుతే తన ప్రయత్నం వృధ కాలేదా? బిడ్డ, ముక్కముక్కలుగా ఖండించబడి సముద్రంలో పారవెయ్యబడ్డాడంటే—నేను నిరాశతో ప్రయత్నం చెయ్యకుండా వూరుకుంటానని అతని వుద్దేశం, నిజంకూడా అంతే.''

''ఈఘోరం చెయ్యడంలో మీమంత్రి వుద్దేశ మేమైవుంటుంది?''

''బిడ్డ యెప్పటికయినా పెరిగి పెద్దవాడవుతాడనీ—అప్పుడు తన

సర్వాధిపత్యానికి భంగం కలుగుతుందనీ, ఆలోచించి, మంత్రి యీ ఘోరం చేశాడన్నదాన్ని. అతను బిడ్డ విషయంలో అసూయపడు తున్నాడని, నేను లోగడవిన్న విషయం బలపరుస్తూంది.''

అని రాణీ, వీరమతి చెప్పినమీదట—

''ఇన్ని అంచనాలూ, వూహాలూ ఎందుకు? ఆమంత్రిని పిలిపించి, స్వయంగా అడుగుతే, యిప్పుడేమంటాడో తెలుస్తుందిగా?''

అని, వకుళ అన్నది సమంజసంగావుందని నేను చెప్పాను. వెంటనే బంధించబడిన మంత్రి, మార్తాండుడు, మేమున్న దగ్గరకు తీసుకురాబడ్డాడు. నేను రాణీ వీరమతి నడిగిన ప్రశ్నలనే, అతనిని స్వయంగా నడిగాను. రాణీ వీరమతి మాకు చెప్పినవీ—ఆమె వూహించి నవీ—అక్షరాలా సత్యమని చెబుతూ, అతడు, తన నేరము నంగీ కరించి, క్షమాపణకోరాడు. కాని, రాణి వీరమతి, అతన్ని క్షమించ డానికి అంగీకరించలేదు. తన బిడ్డ సజీవుడై లభించాడు గాబట్టి, మంత్రికి ఉరిశిక్ష లేకుండా, జన్మాంతర ఖయిదును నిర్ణయించింది. అతను వెంటనే మాముందరనుంచి గొనిపోబడ్డాడు.

ఇక మాకక్కడ తెలుసుకోవలసిందేమీ లేదు గాబట్టి, మేము నలుగురమూ, రాణీ వీరమతి దగ్గర శలవుతీసుకుంటూ, నిజరాజధాని చేరుకోడాని కామెను ఒక గుఱ్ఱము నీయవలసిందనీ—మా నగరం చేరిన వెంటనే దాన్ని తిరిగి వాపసు అంపుతామనీ కోరాము. తన బిడ్డను ప్రసాదించినవారి కది ఏపాటి ప్రత్యుపకారమని, ఆమె తన సంస్థానంలోగల, అశ్వము లన్నింటిలో ప్రశస్తమైన దాని నొకటి యెంచి—''దయచేసి, ఈ నాస్వల్ప కానుకను తమ రంగీకరించాలి— తిరిగి వాపసు పంపకూడదు.'' అని ప్రార్థిస్తూ ఆగుఱ్ఱమును మాకు సమ ర్పించింది. అంతకుముందే మాకొక గుఱ్ఱముంది గాబట్టి, దానిపై నేను జయసారథి; రాణీ వీరమతి యిచ్చిన దానిపై, వకుళా సరళలు, ప్రయాణమై, అచిరకాలంలో సురక్షితంగా వాలనగరం చేరు కున్నాము.

# 33

బైరాగియొక్క తంత్రము, వకుళా సరళలు ఏవిధంగా, ఆ బైరాగిచేత చరబట్టబడిందీ—నేను వారి నెలా విడిపించగలిగినదీ—బైరాగి నన్ను పెట్టిన తిప్పలు, మొదలుగాగల సర్వవిషయములు నేను జయసారథికి చెప్పి, అతని కానందసంభ్రమాలు కలిగించడము—అతను, తనకు నేను కప్పిన ఆకులప్రభావంవల్ల, పాము విషం విరిగి తానెలా బ్రతికిందీ, బ్రతికిన తరువాత నన్ను కానక తానెంత దుఃఖించిదీ—మొదలయిన విషయాలు రాణీ వీరమతికి చెప్పినట్లే నాకున్నూ చెప్పి, సంతోషమును కలిగించాడు. ఎవరెన్ని కష్టాలుపడ్డా భగవంతుడి దయవల్ల తిరిగి అందరమూ కలుసుకున్నందుకు, కష్టాలన్నీ మరచిపోయాము. వృద్ధమంత్రి, తన కుమార్తెలను కలుసుకుని పరమానందము ననుభవించాడు. తన బిడ్డలను తనకు తెచ్చి వప్పగించగలిగినందుకు నన్ననేకవిధాల కొనియాడాడు.

మాతండ్రిగారు ఏ యాత్రలు సేవిస్తున్నారో—ఏ దేశంలో వున్నారోకూడా మాకు తెలియదు. నాకు తండ్రి తరువాత తండ్రివంటివాడైన వృద్ధమంత్రికి జయసారథి విషయమంతా చెప్పి, మాతల్లిగారు చనిపోతూ చెప్పినమాటలు "తల్లీ! నువ్వు అనాఘ్రాత పుష్పానివి—నీకు నచ్చిన వరుణ్ణే తిరిగి వివాహం చేసుకొని—జీవితమును సార్థకం చేసుకో—" మంత్రికి తెలుపుదుచేసి, జయసారథికి నన్నిచ్చి వివాహం చేసే సందర్భంలో ఆయన్నే ఆధ్వర్యం వహించి ఆశుభకార్యమును జరిగించవలసిందని కోరాను. ఆయన సంతోషంతో వంగీకరించి, అంత వృద్ధాప్యంలో, నవయువకుడిలాగ ఎంతో ఉత్సాహంతో వివాహానికి అవసరమైన యేర్పాట్లను అతిఘనంగా చేయించాడు. వకుళా సరళల సంతోషం మరీ యెక్కువగావుంది. తండ్రిగారితో కలిసి వారు నాతో సంప్రతించకుండానే—ఏమేమో చేస్తున్నారు—ఎక్కడెక్కడో తిరుగుతున్నారు! ప్రయత్నాలన్నీ బ్రహ్మాండంగా పూర్తిచేశారు.

ముహూర్తమప్పటికింక మూడురోజులుంది—నా వివాహవార్త నామేనత్తల వూరయిన భీమపట్నం ఎలా తెలిసిందో యేమో—జగదాంబ తనకొడుకు కాళిదాసును వెంటబెట్టుకుని దిగింది. నేను

విభ్రాంతురాలినయ్యాను. మా నాయనగారు దేశాంతరగతులయినది లగాయితూ అంతవరకూ అతిగతీలేని మనుషులప్పుడెందుకొచ్చారో నాకర్థంకాలేదు. వారి రాక, నాకపరిమితమైన అసహ్యం కలిగించింది. ఆముఖాల్ని చూడానికూడా నాకు మనస్కరించలేదు. కాని నాకది ఒక విషమపరిస్థితి. నా ప్రథమ వివాహవిషయం జయసారధికి నేనెన్నడూ చెప్పలేను. చెప్పినట్లయితే, అతను నా ప్రేమను నిరాకరిస్తాడనిగాని, నా వివాహమును అంగీకరించడని గాని, నాకెటువంటి సంకోచమూలేదు. ఆ ప్రస్తావన—ఆ వివరాలూ ఎత్తడం, నాకు పరమ అసహ్యంగావుండేది. మనసా, ఆ విషయం తలవ బుద్ధయ్యేది కాదు. అందువల్ల మాత్రమే జయసారధికి నేనాగాధ చెప్పలేదు గాని, వేరు దురుద్దేశముండి యేమాత్రమూ కాదు. ఆవిషయం తెలుసుకొన్న తరువాత అతని ప్రవర్తన యెలావుంటుందో అని మాత్రం సంకోచం కలగకపోలేదు. యేలాగున్నా యీ మాత్రం నేడు చెయ్యగలిగిందేముంది—దానినయినా యెదుర్కోడానికి సంసిద్ధంగానేవున్నాను.

జయసారధి, నేను, వకుళా సరళలు, వృద్ధమంత్రి, యింకా యెవరెవరో పదిమంది వున్నసమయంలో మా అత్త జగదాంబ కొడుకు కాళిదాసును వెంటబెట్టుకొచ్చి—

"ఇదేనా మర్యాద? ఇదేనా సాంప్రదాయం? ఇదేనా నీతి? నాకొడుకును మొదట పెళ్ళిచేసుకొని, గర్భాదానమైనవెంటనే వాది లేశావు. ఇంతవరకూ మొదలకూడా వ్రాడుకుని, ఇప్పుడు రెండో పెళ్ళికి ప్రయత్నం చేస్తున్నావా! నీ అన్యా అభ్యావుంటే-ఇటువంటి ఘోరం జరుగుతుందా?" అని తీవ్రంగా అడిగింది.

జయసారధి తెల్లబోయాడు—నా ముఖంలోకి పరిశీలనగా చూశాడు. వకుళా సరళలు తలలు దించుకున్నారు.

"నీకొడుకు తగిన భర్త కాదు గాబట్టి—తల్లి చనిపోతూ చెప్పిన ప్రకారం రాణీ ప్రమీల తిరిగి వివాహం చేసుకుంటూంది—ఇందులో నువ్వాక్షేపించవలసిన విషయం ఏమీలేదు."

అని వృద్ధమంత్రి ఆమెను ఎదిరించి జవాబు చెప్పాడు.

"ఆక్షేపించవలసిందేమీ లేదా? స్త్రీ, భర్తవుండగా తిరిగి పెళ్లి చేసుకోవచ్చునని ఏ శాస్త్రంలోనయినా వుందా? నీతిగల రాచకుటుంబాలు చెయ్యవలసిన పనేనాయిది?"

అని ఆమె తిరిగి అంది.

"నువ్వు నాకొద్దు—పో-అంటుంటే, చూరుపట్టుకొని వ్రేళ్లాడ్డం మాత్రం ఏమంత నీతి—ఏమంత గౌరవం? భర్త అవధ్యుడయితే ఆభార్య తిరిగి వివాహం చేసుకోడానికి సర్వహక్కులూవున్నాయి"

అని నేను ఉద్రేకంతో ఆమె నెదిరిస్తుంటే, జయసారథి చివాలున లేచి, ఆ తావునొదిలి వెళ్ళిపోయాడు.

"సరే—నన్నుసురుపెట్టి—నాకొడుకు నుసురుపెట్టి—నువ్వు మళ్ళీ పెళ్లిచేసుకుని, ఆ మొగుడితో ఏమంత సుఖపడతావో నేను చూస్తాలే—"

అది జగదాంబ, తన కొడుకును వెంటబెట్టుకుని, ఆతావును వొదిలి వెళ్ళిపోయింది. నేను బరువెక్కిన గుండెల్తో జయకుమారుడున్న దగ్గిరికెళ్లాను. అతడు తల కిందికివంచుకుని దీర్ఘంగా ఆలోచిస్తుంటే—నేనతని పాదాలమీద పడ్డాను.

"జయా! నేనుచేసింది ఒకటేతప్పు, నా మొదటిపెళ్ళి విషయం నీకు ముందుగా చెప్పవలసింది—చెప్పలేదు. ఆ ప్రస్తావన చెయ్యడం నాకు అసహ్యంగా వుండడంవల్ల చెప్పలేదుగాని, యితర కారణాలవల్ల కాదు. మా నాయనగారి పొరబాటువల్ల నాకా వివాహమంటే జరిగిందిగాని, భగవంతుడి సాక్షిగానే నాభర్తను తాకనయినా తాకలేదు—అతనొక జంతువు—చలనంలేని జడం—"

అని నేను చెబుతుండగా—

"నీవల్ల నేనెటువంటి సంజాయిషీనీ వినగోరడంలేదు-ఈరొంపిలోకి నన్ను లాగొద్దు—క్షమించి నన్నింతటితో వొదిలెయ్యి అన్నాడు.

నేను నిర్ఘాంత పోయాను.

"జయా! నీది విశాలహృదయమనుకున్నాను—నిజానిజాలు తెలుసుకోగల వివేకవంతుడ వనుకున్నాను—నిన్నింతగా ప్రేమించాను—నీకోసం ఎన్నికష్టాలు పడ్డాను—"

"అందుకని—కుక్క ముట్టుకున్న ఎంగిలికూడు కెవరయినా ఆశపడతారా?"

అని అత ననేనప్పటికి నానరాల్లో రక్తం వుడుకెత్తి పొంగింది-ఉద్రేకమును ఆపుకోలేకపోయాను—ఆ వుద్రేకంలోనే-ఏడ్చాను-

"ఛీ! లోకంతో పాటు నువ్వూ ఒక గుడ్డివాడవయ్యావు—పురుషజాతిలో వుండే ఆదురహంకారం నీలోనూ వుంది. జ్ఞానాజ్ఞాన శూన్యుడైన నీలాంటి సంకుచిత హృదయుణ్ణి భర్తగా పొంది స్వర్గ సౌఖ్యాలు కోరడం కన్నా, ఆజన్మాంతమూ కన్యగా వుండిపోవడం మేలు—నువ్వు నా ప్రేమ హృదయాన్ని బ్రద్దలు చేసిన పాషాండుడివి—స్త్రీతత్వం తెలియని పామరుడివి—సంస్కారం లేని సన్యాసివి—క్షమించడం చేతగాని రాక్షసుడివి.

నన్ను వలచి, వలపించుకుని—మెఱసి మెఱిపించుకుని—తపించి, కవ్వించి, నువ్వు నేను—నేను నువ్వుగా, మనుషుల మొకటై మనసుల నేకం చేసి—మమతలు రేపిన నీకు నేనిప్పుడు యెంగిలికూడునయ్యాను! ఇది పురుషుల జాతిలక్షణం!—"

అని నేనింకా యేమేమో—సంతత ధారాపాతంగా కన్నీళ్లు కారుస్తూ—ఆవేశంతో అంటూనే వున్నాను—జయసారథి తన పాదాల మీదవున్న నన్ను తన కాళ్లతో తన్ని వెళ్లిపోయాడు.

మార్గంలో వకుళా సరళతన్ని అడ్డు తగిలారు.

"జయా! ఇంతేనా?" అని ఇద్దరూ చెరోవైపునా నిలిచి అడిగారు.

"ఇది, పురుషలజాతి లక్షణం—"

అనేసి, అతను చరచర నడిచి వెళ్ళిపోయాడు. వకులా సరళలు ఖిన్నులై నా ముఖంలోకి చూశారు.

"ఎందుకూ విచారిస్తారూ? నిజానిజాలు తెలుసుకోలేని అవివేకి—అటువంటి పురుషుడితో సంసారమతి యెప్పటికయినా ముప్పు!"

అని నేనాక్షణంలోనే జయసారథిపై వుండే ప్రేమపాశాన్ని తెగ్గోసుకున్నాను. నాకేగాకుండా వకులా సరళ కూడా పురుషజాతి మీద అసహ్యం కలిగింది. నా జీవతంవల్ల తెలుసుకొన్న గుణపాఠం వల్ల వారున్నూ పురుష సంపర్కం లేకుండా ఆజన్మాంతం కన్యలుగా వుండడానికి నిశ్చయం చేసుకున్నారు.

విజయకుమారా! ఆరోజు నేను పురుషుడి ముఖం చూడనని శపథంపట్టాను, పురుషుడు నా రాజ్యంలో అడుగుపెట్టకూడదని శాసించాను—పురుషుడితో సంబంధం కూడదని గర్జించాను—పురుషుణ్ణి నమ్మకూడదన్న నీతిని నేర్చుకున్నాను—నేర్పుతున్నాను. పురు

షుడి దురహంకారాన్ని—దురాశల్ని—దుర్మదాన్ని—పింజ పింజలుగా ఛేదించడానికి కంకణం కట్టుకున్నాను.

నేను తనకు ప్రాణదానం చేసినదాన్నని అయినా గమనించకుండా—శత్రుపక్షంలో వాడు, నాచేత ఓడించబడినవాడు, ఆజన్మాంతమూ నా కారాగారంలో నేను విధించిన శిక్ష ననుభవిస్తూ వుండవలసినవాడు, నేను విశాలహృదయంతో మనసిచ్చి—తనపదధూళిని శిరస్సున దాలుస్తానంటే త్రుణీకరిస్తాడా? హృదయాధిదేవుడనుకొని ఆరాధిస్తానంటే, కాలదన్నుతాడా? నిజా నిజాలు తెలుసుకోగల ఇంగితం లేకుండా, యెంగిలికూడని అవమానిస్తాడా? తాను పవిత్రురాలని యెంచిన కన్యను పెళ్లాడి—రేపామె తనకళ్లు కప్పి, ప్రక్క ప్రక్కల దొంకూళ్లుతింటే—ఏం చెయ్యగలడు?

సత్యాన్ని అర్థించి ఆదరించలేనివాడు పురుషుడా? మృగమా? తన్ను చేరకముందా పురుషు డెందరి స్త్రీలను చక్కబెట్టాడో—యెన్ని అవినీతికార్యాలు చేశాడో ఏ స్త్రీగాని, ఆరాలూ తీస్తున్నదా? తనతోవుంటూ కూడా, అతి డవలెల ఎందర స్త్రీలను చక్కబెట్టినా యెన్ని అవినీతికార్యాలుచేసినా—యింటికి రాగానే, అడుగులకు మడుగులొత్తే స్త్రీజాతి సహనాన్ని—విశాలహృదయాన్ని యెవరూ అభినందించరేం? కాలఖర్మవశాత్తూ, ఒక అవధ్యుడు నా కంఠాన సూత్రమును బంధించినంత మాత్రంలో నేను యెంగిలి కూడునై పోయానా!

తనకు తాహతుండే, నన్ను ఏ అగ్నిపరీక్ష చేస్తాడో చెయ్యరాదూ? నేను అనాఘ్రాత పుష్పాన్నన్న ఆ కాళిదాసు చెప్పడూ? అదేమీ లేకుండా, ప్రేమించుకొన్న ప్రేమని—పడ్డశ్రమని—చూపిన ఉదారాన్ని—దుమ్ముపాలుచేసి, నోటికొచ్చినా కూతలు కూసిపోతాడా? ఇదే ఆదర్శ పురుషలక్షణం. శ్రీరామచంద్రునివంటి ధీరోదాత్తుడు సయితం అగ్నిపరీక్ష చేసి యిల్లాలిసత్యం తెలుసుకున్నాడు. ఆమెను సక్రమంగా పాలించుకున్నాడు. అంత దూరదృష్టి—అంత వివేకము లేని యీనాటి పురుషులు, పురుషులా? మృగాలా?

విజయకుమారా! నువ్వున్నూ పురుషుడివిగాబట్టి, నామాటలు నీకు కర్ణకఠోరంగా వుండవచ్చు, అయినా సందర్భమొచ్చినప్పుడు జారవిడవలేను. నామతము సక్రమమో—అక్రమమో—ధర్మమో,

అధర్మమో న్యాయమో, అన్యాయమో—నా శరీరానికి నేను స్వతంత్రురాలిని—నారాజ్యానికి నేను రాణిని! ఈజన్మంలో నాశరీరాన్ని పురుషుడు స్పృశించకూడదు—నారాజ్యంలో పురుషుడు అడుగు పెట్టకూడదు—నాపరిపాలనలో మొగపురుగయినా వుండకూడదు, ఇది నామతము, నాశాశనము, కనుకనే నువ్వు, సరిహద్దుదాటి వచ్చిన వెంబడే నా సిబ్బంది చేత బంధించబడ్డావు.

కపటబైరాగి కథకూడా విన్నావుగదా! అప్పుడు వాడంత చేసింది చాలక, చింతామణికి చెప్పిన ప్రశ్నలద్వారా నాచావు బ్రతుకులు తెలుసుకో కోరుతున్నాడు. నేను చచ్చినట్లయితే తిరిగి యిక్కడికొచ్చి, నారాజ్యంలోని సౌందర్యవతులను అపహరించుకొనిపోవాలని చూస్తున్నాడు కాబోలు! అది కలలోవార్త. నేను చచ్చినా—నాశాసనాలు చావవు. వాలరాజ్యపు పతాక మొగురుతున్నంతకాలం, ఈ నేలలో పురుషుడు అడుగుపెట్టలేడు-ఇక్కడున్న ఆడకుక్కనయినా కన్నెత్తి చూడలేదు! విజయకుమారా! నీకిప్పుడు నామంత్రులయిన వకుళా సరళను పరిచయం చెయ్యవలసివుంది.

అని రాణీ ప్రమీలాదేవి ఒక పరిచారికద్వారా, వకుళా సరళకు వర్తమాన మంపింది. వెంటనే వారొచ్చి, విజయకుమారుని చూచి, విభ్రాంతులయినారు.

"చెలులారా! పురుషుడయినా యీ రాజకుమారుడు, నా హితవుకోరి—నా అనుమతిమీద యిక్కడున్నాడు—క్షణకాలం మీరు ఓపికపట్టండి.

ఒకప్పుడు మిమ్మల్ని చరబట్టి హింసించిన ఆ కపటబైరాగి జ్ఞాపకమున్నాడా?"

అని రాణీ ప్రమీల అనడమే తడువుగా, వకుళా సరళలు ఒరల నుంచి కత్తులు దూసి—

"ఓరీ! దొంగబైరాగీ ఇంకా బ్రతికివున్నావా?" అని ఉద్రేకపూరితులై యెగిరిపడ్డారు.

"తాను బ్రతికివుండడమే కాదు—నేను బ్రతికివున్నానో లేదో-తెలుసుకోవాలని వాడు కుండినగరమనే ఒక రాజ్యం చేరి, అక్కడి రాజకుమార్తెను వలలో వేసుకుని, ఆమెకు కొన్ని ప్రశ్నలు చెప్పి, ఆప్రశ్నలకు జవాబులు చెప్పినవారిని తప్ప, అన్యుల నామె వివాహ

మాడకూడదనీ అట్టివారి శిరస్సులను ఖండించి, మందిరద్వారానికి వ్రేలగట్టాలనీ శాసించాడట! శిష్యాగ్రాలయిన చింతామణిచే, వాడడిగించే ప్రశ్నల ఒకటి ఏమిటో తెలుసా? వినండి—

"ప్రేమించినవానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ—స్త్రీ అయివుండిన్నీ పురుషవేషము ధరించి, మహార్షిచే కామించబడిన ఇరువురు, కాంతామణులనూ అపహరించి, మహార్షిని ఖండించబూనిన అధీరురా లెవరు? ఆమె బ్రతికివున్నదా? మృతిపొందినదా?"

అని, తమకు సంబంధించిన ప్రశ్నను వివరించిన తరువాత,

"కపటబైరాగి ఆరాజ్యంచేరి బాలమహార్షి అనే దొంగపేరు పెట్టుకుని ఇంతటి పన్నాగం పన్నాడు. విజయకుమారా! మోసగాడయిన ఆబైరాగిచే కామించిన ఇరువురు కాంతామణులూ వీరే— వకుళా—సరళలు—స్త్రీనైవుండిన్నీ పురుషవేషము ధరించి, ఆతుంటరిని ఖండింపబోయిన ధీరురాలిని, నేనేనని నీకు వేరుగా చెప్పబని లేదు."

అని రాణీ ప్రమీలాదేవి చెబుతుండగా—

"దేవీ! వృథాకాలయాపన దేనికి? మనమిక ఆకపటబైరాగిని బ్రతకనియ్యకూడదు. ఆదుర్మార్గు డెక్కడున్నాడో చెప్పి, మాకత్తుల కసిదీరేలాగ—వాడి శిరస్సును శతభిన్నాలు చెయ్యడానికి అనుజ్ఞనియ్యి." అన్నాది వకుళ.

"దేవీ! ఆకపటబైరాగి ప్రాణం అంత తేలిగ్గా తియ్యకూడదు—వాడి జడలకు—వాడి గెడ్డానికీ—నిప్పుముట్టించి, గాడిదపై ఒక్కసారి నగరమంతటా వూరేగించి—ఆపైన, వకుళ చెప్పినట్లు చెయ్యాలి!"

అని సరళ అన్నది. ఆయువతుల కక్ష—వారి పౌరుషమును తిలకించి, విజయకుమారు డాశ్చర్యపోయాడు.

"ఇదుగో! ఈ రాజకుమారుని సహాయంవల్లనే ఆపనులు జరగాలి. ఈతడు, నాగపురసంస్థానపు యువరాజు—విజయకుమారుడు, పురుషజాతిలో తప్ప బుట్టినవాడు, లోకకళ్యాణంకోసం, సమస్త రాజ్యభోగాలనూ విడనాడి, వేలాదియోజనాలు ప్రయాణంచేసి, అనేకములయిన కష్టాలు భరించుకొని, ఆదొంగబైరాగి ప్రశ్నలకు జవాబులు తెలుసుకుని, వాడి అంతు కనుక్కోవాలని కంకణం కట్టుకున్న ధీరుడు!

మీరితనితో పోయి, మీకసితీర్చుకోండి.'' అని రాణీ ప్రమీలాదేవి తన మంత్రులైన వకుళా సరళలకు చెప్పింది.

సోదరీమణులారా! మీరింకా కొద్దికాలంపాటు ఓపికవహించ వలసివుంది. ఏమంటే—అపూర్వచింతామణి ద్వారా ఆబైరాగి నడిగిస్తున్న ఐదు ప్రశ్నలలో నేనిప్పుడు నాలుగింటిని మాత్రం తెలుసుకున్నాను. మిగిలిన ఒక ప్రశ్నకుకూడా జవాబు తెలుసుకుంటే కాని, వాడి గర్వమణిగించడానికి వీల్లేదు. ఆఖరు ప్రశ్నకు జవాబు పొందగల, యాబానగరము నేనిప్పుడు పోవలసివుంది. ఆ నగరంకూడా పోయి, ఆప్రశ్నలకుకూడా జవాబు తెలుసుకుని, తిరిగి వచ్చేటప్పుడు మిమ్మల్ని కలుసుకుంటాను. అప్పుడు మనమందరమూ కలిసి, కుండినగరంపోయి, కపటబైరాగిపై కసితీర్చుకోవచ్చు.''

అని విజయకుమారుడు చెప్పిందాని శాస్త్రులు సంతోషంతో అంగీకరించారు.

''విజయకుమారా! నువ్వు మామహిళారాజ్యంలో ఒకటి రెండు రోజులుండి, మా ఆతిధ్యమును పొందవలసిందని కోరుతున్నాము— నువ్వు మాకు కానుకగా సమర్పించిన అమూల్యమణికి మేమెల్లప్పుడూ కృతజ్ఞులం.''

అని రాణీ ప్రమీల అన్నందుకు—

''దానికేమిలే దేవీ! ఆ యబానగర మెక్కడుందో—దానికి మార్గమెటో నాకేమీ తెలియలేదు. ఆవివరాలు మీకేమయినా తెలుసునా?''

అని విజయకుమారు డడగ్గా—

''అటువంటి పేరుగల నగర మొకటి ఈభూమండలంలో వుందని కూడా నేనెప్పుడూ వినలేదని చెప్పడానికి నేను చాలా విచారిస్తున్నాను. అయినా, నువ్వు బయలుదేరే లోపుగా ప్రయత్నంచేసి, నువ్వు చేయబోయే మహాకార్యానికి నాకు చేతనయిన సాయం చెయ్యడాని కెటువంటి అభ్యంతరమూ లేదు. మా నగర చరిత్రనంతటినీ చెప్పి, నీకు చాలా అలసట కలిగించాను. స్నానభోజనాదులు పూర్తిచేసుకుని, ప్రస్తుతం కొంత విశ్రాంతి తీసుకో.''

అని, రాణీ ప్రమీల, విజయకుమారునికి మజ్జనభోజనాదుల కవసరమైన యేర్పాట్లు చేయించవలసిందని, వకుళా సరళకు చెప్పింది.

# ౩౪

వాలనగరంలో విజయకుమారుడికి, యబానగరమును గురించి ఉపకరించే భోగట్టా యేమీ లభ్యంకాలేదు. తిరిగి భగవంతుడు మీద భారంవేసి, అగుపించిన మార్గము ననుసరించడమే అతనికి కర్తవ్యమైంది!

అది మండువేసంకాలం—ఆచంపగాడ్పు లీచంపకు కొడుతున్నాయి. పైన నెత్తిమాడడం, కింద కాళ్లుకాలడం. అయితే ఏం చెయ్యాలి? నిజరాజధాని బయలుదేరి, అప్పటికే చాలా మాసాలు గడిచింది. ఎండకి భయపడి. [illegible] ఇంకా జాగుచెయ్యడమెలా, అనుకుని విజయకుమారు, అప్పటి కయిదారు రోజులనుంచి, మలమల మాడే ఆమండుటెండలోనే ప్రయాణంచేస్తున్నాడు. మార్గం పొడుగునా, అనేక మృగాలూ—పక్షులూ ఆ యెండదెబ్బకు చచ్చిపడివుండడం అతను కళ్లారా చూస్తూకూడా, లెఖ్కచెయ్యకుండా—తన ప్రయాణమును సాగిస్తూనే వున్నాడు. ఒళ్లు చమటలు కక్కుతూంది—కక్కిన చెమట నంతకుముందు తుడుచుకొన్న తడిగుడ్డల్ని మళ్ళీ మళ్ళీ పిండుకుంటూ, ఆగుడ్డల్తోనే తిరిగి తుడుచుకుని, భగవంతుణ్ణి తల్చుకుంటూ ప్రయాణమును సాగిస్తున్నాడా దీక్షాపరుడు.

ఆ యెండదెబ్బకు తట్టుకోలేక, ఒక అడవిమార్గాన ఉస్సురని వడివడిగా నడిచిపోతున్న విజయకుమారుడి కెదురుగా ఎవరో కొందరు కౌపీనధారులు పరుగెత్తుకొంటూ వస్తున్నారు. వారెవరో—దుస్తులయినా లేక కౌపీనము లెందుకు ధరించారో విజయకుమారునికి అర్థం కాలేదు. క్రమంగా ఆపరుగెత్తినవా రతన్ని సమీపించారు. ఎందుకయినా మంచిదని, అతడు ఒరనుంచి కత్తినిదూసి, తయారుగా వున్నాడు. అతన్ని సమీపించిన వారిలో ఒకడు—

“ఏయ్! పిచ్చివాడా? ఎక్కడి కిలాగ? చచ్చిపోతావ్—పద-పద—వెనక్కిపద—” అన్నాడు.

అతని మాటలు విజయకుమారునికి అర్థంకాలేదు.

“అయ్యా! మీరెవరు? ఒంటికి దుస్తులయినా లేకుండా, ఈ మండుటెండలో యెందుకిలా పరుగెత్తుకొస్తున్నారు. నన్నెందుకు పోవద్దంటున్నారు? దెయ్యమా? భూతమా? అక్కడేముంది?”

అని విజయకుమారుడడిగినదానికా కౌపీనదారి తిరిగి చెప్పాడు-

"దెయ్యమూకాదు—భూతముకాదు—వాటిని మించే గజదొంగ! పట్టపగలు దార్లుగొట్టే, ధీరమల్లున్నాడు."

"ధీరమల్లు! అంటే యెవరు?"

"చెప్పలేదుటయ్యా! వాడో బందిపోటుదొంగ! పాలాక్షుడి కంటకుండా తిరుగుతున్నాడు. వాడివల్లనే మాఖర్మ యిలాకాలింది."

"ఏమయిందీ?"

"సర్వత పరమైంది—కనుపించడంలేదూ? మాఆస్తి పాస్తులన్నీ అపహరించి, గోచీలిచ్చి పంపాడు."

"అయ్యో! అలాగా? మీరెవరు? ఆదొంగ చేతిలో యెందుకు చిక్కుకున్నారూ?"

"మేమందరం రత్నాలవ్యాపారులం-మాది మణిహారద్వీపము. మాద్వీపమునుంచి బయలుదేరి, ఇక్కడికి సుమారు పాతిక యోజనముల దూరములో వున్న యశానగరము పోయి, రత్నము లమ్ముకొని, డబ్బు తెచ్చుకొంటుండగా మార్గంలో యీఘోరం జరిగింది. ధీరమల్లు అనే ఆగజదొంగ పేరును మేమిదివరకు వినివున్నాము. వాడిదేవిధంగా అనేకమంది శ్రీమంతులను దోచుకుంటున్నాడనీ—వాడి శిరస్సును ఖండించి తెచ్చినవారికి లక్షవరహాలు బహుమానం ప్రకటించబడిందనీ మాకు తెలుసు. కాని వాడీమార్గంలో కాచివుండి, మమల్నే యీవిధంగా దోచుకుంటాడనుకోలేదు. మేము రత్నాల వర్తకులమనీ-మాదగ్గర విశేషధనముంటుందనీ-వాడెలా పసికట్టాడో-సరిగ్గా యీప్రాంత మొచ్చేటప్పటికి, తన ముఠాతో మమ్మల్ని ముట్టడించాడు. మాదగ్గిరుండే విశేషధనము నంతటినీ దోచుకోవడమేగాకుండా, మాజలతారు పాగాలు, పట్టుకోట్లు, వగైరా దుస్తులు కూడా విప్పించి, ఇదుగో ఈగోచీగుడ్డలు కట్టించి తరిమేశాడు. బ్రతికుంటే బలుసాకు అవుతుందని, ప్రాణాలతో బయటపడ్డాము. ఇక్కడినుంచి మరో యిరవై యోజనాలు ప్రయాణం చేస్తేగాని, మాద్వీపం చేరలేము. ఎండచూస్తే యిలా మాడిపోతూంది, కట్టుడానికి గుడ్డముక్కలయినా లేవు. మానగరమెలా చేరతామో యేమో—మాఖర్మమెలాగా కాలింది—నువ్వయినా ఆదొంగ కళ్ళబడకుండాపో—"

అని వర్తకులలో ఒకడు చెప్పిన హితవునిని, విజయకుమారుడు—

"అయ్యా! నేను మీకంటే గొప్పవాడినా! నే నీమార్గమున పోకతప్పదు-యశానగర మెటువైపునుందో మీకేమయినా తెలుస్తే చెప్పండి. నే నానగరం జరుగురుగా పోవలసివుంది." అని నడిగాడు.

"అయితే నువ్వీమార్గముగుండా పోకతప్పదు. మమ్మల్ని ఆదొంగ ముట్టడించిన స్థలంనుంచి ఉత్తరముగా పాతిక యోజనములు నడచినయెడల యశానగరము చేరగలవు. కాని ఈ ప్రాంతానగల ఆగజదొంగను దాటిపోవడమే దుస్తరము."

"కానియ్యండి—నాయోగ మెలావుంటే అలా జరుగుతుంది."

"తెలిసుండి, తాచుపాము నోట్లో పడతామంటే యెవరు కాదంటారు——పో——నీఖర్మం——"

అని వర్తకులు తమదారంట తాము ముందుకు సాగిపోయారు.

"ఈ నగరపాలకు డంత చేతకానివాడా? లేకుంటే, ఈదొంగల అత్యాచారమేమిటి? పట్టపగలు, మార్గస్థులను హింసించి దోచుకోవడమా? ఆ దొంగను పట్ట, ఎవరికీ శక్యంకాలేదా? వాడి శిరస్సును ఖండించి తెచ్చినవారికి వేయివరహాలు బహుమానమా! ఏమిటీ విడ్డూరము! ఇప్పుడు నాయోగ మెలావుందో——చూస్తాను."

అని తనలో అనుకుని, విజయకుమారు వడివడిగా ముందుకు సాగిపోతున్నాడు. ఆదొంగ లేవయిపునుంచి వస్తారో——తనమీద యెప్పుడు పడతారో అని, వెనుకప్రక్క, ముందుప్రక్క, అన్ని వైపులా బహుజాగ్రత్తగా పరిశీలించుకొంటూనే పోతున్నాడు. కాని అతని కెవరూ కనుపించలేదు.

"దొంగ లిక్కడ నివాస మెందుకుంటారు? వర్తకులను దోచుకుని, వెంటనే యెక్కడికో పరారి అయివుంటారు."

అనుకొని తిరిగి ముందుకు సాగిపోయాడు. ఎంతదూరం పోయినా అతని నెవరూ యెదిరించలేదు. తనకు గండం తప్పివుంటుందనుకుని సంతోషపడుతూ వెడుతుండగా, ఒక ఎత్తయిన చెట్టుపైనుంచి దీర్ఘకాయుడొకడు, సరిగా విజయకుమారు ఎదుట కురికిపడ్డాడు. హఠాత్తుగా జరిగిన సంఘట్ట నేమో—అందుకు విజయకుమారు అదిరిపడ్డాడు. చెమటలు కారుతున్న శరీరము——లోతుకు దించుకుపోయిన కళ్లు——మండుటెండలో తిండీతిప్పలూ లేకపోయినందువల్ల వాడిపోయిన

ముఖమూ—అంత హీనపరిస్థితిలో వున్న విజయకుమారు నాతృధ కాయు డొకసారి పరిశీలనగా చూచి—చెయ్యిపట్టుకున్నాడు.

"ఎవరు నువ్వు? నాచెయ్యెందుకు పట్టుకుంటా వెందుకు?" అని విజయకుమారు డాశ్చర్యంగా నడిగాడు.

"నీలాంటి వాళ్ళని నేనేం చెయ్యను—నాతోరా—" అని ఆదీర్ఘ కాయుడు, చెయ్యిపట్టుకుని విజయకుమారుని తనతో తీసుకెడు తున్నాడు. ఎందుకో—ఎక్కడికో తెలీదు. ధీరమల్లు అనే ఆగజదొంగ అత నవునో కాదో, విజయకుమారుకు సందేహం కలగడంవల్ల మార్గంలో నడిగాడు.

"ధీరమల్లంటే నువ్వు కాదా?"

"అవును, నేనే—నీకెలా తెలుసు?"

విజయకుమా రతని వైపాశ్చర్యంగా చూశాడు. ఆజాను బాహువైన మనిషి, మంచి స్ఫురద్రూపి—పెద్దశిరస్సు—నూనూగు మీసము—విశాలమైన నుదురు—నల్లటికళ్లు—చేనేతగుడ్డతో కుట్టబడిన ఒక యిజారు, పైజమా తప్ప, యితర దుస్తులేమీ లేవు. దొంగ లుండవలసిన విధంగా లేడే—అనుకున్నాడు విజయకుమారు.

"భయపడుతున్నావా? నీలాంటి వాళ్ళని నేనేమీ చెయ్యనని చెప్పాను గదా! నన్నుగురించి నీకెవరో భయంకలిగేలా చెప్పి వుంటారు. అవునా!"

"ఎవరో కాదు—నే నీదారంటవస్తుంటే, కొందరు వర్తకులు కౌపీనాలు ధరించి, నాకెదురయినారు. వాళ్లే చెప్పారు నిన్నుగురించి."

"అవును వాళ్లు చెబుతారు."

"వాళ్ళధనమంతా నువ్వు దోచుకున్నావటగా!"

"అవును దోచుకున్నాను."

"అప్పుడు వారు చెప్పిందాంట్లో పొరబాటేముంది?"

"నీకేం తెలీదుగాని—కిక్కురుమనకుండా నాతోరా—"

అన్నాడు ధీరమల్లు. అంతవరకూ తన కేటువంటి అపకారమూ తలపెట్టనివానితో అనవసరంగా విరోధపడడమెందుకని, విజయ కుమారు మారుపలకకుండా అతని ననుసరించి వెళ్లాడు. ధీరమల్లు విజయకుమారు నావిధంగా వెంటబెట్టుకుని పోయి పోయి, ఒక చిన్న

తాటాకు గుడిసెదగ్గర నిలిచాడు. ఆకులు రాలిపోయి—కర్రలూడిపోయి ఆగుడిసె శిథిలావస్థలో వుంది.

"చూశావా? ఇదే నానివాసం!"

అన్నాడు ధీరమల్లు. విజయకుమారేమీ జవాబు చెప్పలేదు.

"ఈ గుడిసె యింత దరిద్రంగా వుందేమిటని, అసహ్యించు కోకుండా లోపలికిరా."

అని ధీరమల్లు విజయకుమారుని చెయ్యిపట్టుకుని గుడిసె లోపలకి తీసుకెళ్లాడు. అక్కడ ఒక చింకిచాప మాత్రముంది. దానిమీదనే యిద్దరూ కూర్చున్నారు. అక్కడున్న చిన్న తెరను తొలగించుకుని, ఒక పరిచారకుడు ఎవరూ పిలవకుండానే వచ్చాడు. అక్కడ కూర్చున్న వారిని చూచి వెంటనే లోపలి కెళ్ళిపోయాడు. అయిదునిమిషాలలో అతనే తిరిగివచ్చి—కొన్ని చల్లని మధురపానీయాలను, పండ్లను, తీసుకొచ్చి విజయకుమారుని ముందరపెట్టాడు. కొన్ని పొడిగుడ్డలను కూడా తెచ్చి అక్కడపెట్టాడు. అవి యెవరికోసమో తెలీక, విజయ కుమారుడు తెల్లబోతూంటే—

"నీకోసమే—" అన్నాడా ధీరమల్లు.

"నాకెందుకూ?" అని అడిగాడు విజయకుమారు ఆశ్చర్యంగా.

"మాట్లాడక—తీసుకో—ఎండలో మాడున్నావు—వొడగొట్టి చచ్చిపోతావు. చెమటతో తడిసిపోయిన గుడ్డలన్నీ పిండుకో—ఈపొడి గుడ్డలుపెట్టి తుడుచుకో—"

గజదొంగ అయివుండి, తనకా విధంగా బంధుమర్యాదలు చేస్తున్నాడేమిటా అని విజయకుమారు తెల్లబోతున్నాడు.

"నీకే చెప్పేది—అలా తెల్లబోతావేమిటి? త్వరగా తీసుకో—"

అని ధీరమల్లు గద్దించి పలికాడు. విజయకుమారు నిజంగా ధీరమల్లు చెప్పిన పరిస్థితిలోనే వుండడంవల్ల, విస్తారం తర్కం చెయ్య కుండా, తనకియ్యబడిన వాటిని అమృతప్రాయంగా తీసుకున్నాడు. తడిసిన తనగుడ్డలు పిండుకొని, పొడిగుడ్డలతో చెమటంతా తుడుచు కున్నాడు. ఆ తరవాత పరిచారకుడు ఒక విసనకర్ర తెచ్చి విజయ కుమారుడికి విసిరి—తాపోపశమనం చెయ్యడానికి మొదలుపెట్టాడు. విజయకుమారుడికి ఏదిచూసినా వింతగానే వుంది. ముక్కూ ముఖం తెలీని అపరిచితుడు—పైగా దార్లుకొట్టి జీవించే గజదొంగ—తన

విషయంలో అంతటయగానూ, మర్యాదగానూ, ఎందుకు ప్రవర్తిస్తున్నాడో అర్థం చేసుకోలేక తికమకలు పడుతున్నాడు.

"ఇంతకుముందు విన్నదాన్నిబట్టి, నాచర్యలు నీకెక్కువ ఆశ్చర్యమును కలిగిస్తున్నాయనుకుంటాను. ముఖం చూడగానే మనుషుల తీరంతట్నీ అర్థం చేసుకోగల శక్తిని భగవంతుడు నాకు ప్రసాదించాడు. ఎవర్ని ఏవిధంగా చెయ్యాలో నాకు తెలుసు. కాకులు కూడా ఎగరని యీ నిప్పులాంటి యెండలో ఎంతదూరంనుంచి చిలా ప్రయాణం చేస్తున్నావు? బ్రతుకుదామనా? చద్దామనా? నీదేవూరు? నీపేరేమిటి?"

అని ధీరమల్లు సోదరవాత్సల్యంతో అడిగినదానికి—

"నేను నాగపుర సంస్థానపు యువరాజుని—నాపేరు విజయకుమారు—"

అని తరువాత, తను రాజధాని వొదిలి బయలుదేరడానికి గల కారణము, అపూర్వచింతామణి వివరాలు—ఆమె ప్రశ్నలలో తానప్పటికి నాలుగింటని తెలుసుకోవడము—అయిదవదానిని కూడా తెలుసుకోవాలన్న దృఢసంకల్పంతో యీకాననగరము పోతున్నట్టు-మొదలయిన విషయములన్నింటినీ తు. చ. లు తప్పకుండా, విజయకుమారుడు చెప్పగా విని—

"నేనూహించినదానికంటే యింకా యెక్కువ పరోపకారానికి పాటుపడుతున్నావు-స్వార్థంవొదిలి దేశ సౌభాగ్యానికి పాటుపడే ధీరులు నీవంటి వాళ్లెక్కడో వుంటారు. నీపరిచయం నాకెక్కువ సంతోషమును కలిగిస్తూంది. ధీరమల్లు మహాదుర్మార్గుడనీ—దొంగల నాయకుడనీ—నువ్వింతకుముందు వినివున్నావు—కాని, నా చరిత్ర వింటే—నీ అభిప్రాయాన్ని మార్చుకుంటావు." అన్నాడు ధీరమల్లు.

"నేను విన్నదిగాక, వేరేయేముంది? మార్గస్థులను దోచుకునే గజదొంగవు నువ్వేనని—ఇప్పుడే గదా ఒప్పుకున్నావు. అటుపైన నువ్వు చెప్పవలసిందేముంది? నేను వినవలసిందేముంది?"

"వుంది—చాలావుంది-నీలాంటి దేశసేవాధురంధరులు, నీవంటి త్యాగధనులు-అహింసాప్రతులు—నారహస్యజీవితమును విన్నందువల్ల లాభమేగాని నష్టంలేదు—చెప్తాను, వింటావా?"

"తప్పకుండా వింటాను. అభ్యంతరం లేకపోతే చెప్పు."

అని విజయకుమారు డన్నమీదట, ధీరమల్లు తననిగూడ జీవితవిషయాల నీవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు—

"ఈకాశ్యపదేశము, రత్నగర్భయని అనాదినుంచి భూమండలమంతటా కీర్తినిపొందివుంది. ఈ మహాసామ్రాజ్యానికి, యీబా నగరము ముఖ్యరాజధానిగావుంది. నేనున్నూ యీ కాశ్యపదేశపు పౌరుడను, దేశపాలకుడు, దత్తాత్రేయమహారాజు. నాతండ్రి ఆమహారాజు సైనికదళాలలో ఒక సామాన్య సిపాయిగా వుండేవాడు, సర్వసైన్యాధిపతి, తేజసింగు, అహంభావానికీ, దురంహంకారానికీ పేరు పొందినవాడు. దళాలలో ఎవరుగాని, ఎప్పుడుగాని, తనకు నమస్కారం చెయ్యనివారిని తక్షణం కొలువునుంచి తప్పించేవాడు. ఏమరిగాని, పొరపాటునగాని, అతనిని చూడక నమస్కరించని వారికొలువు ఆ రోజుతోసరి. ఈ కారణంవల్ల, అతని దళాలలోనివారు అతితరుచుగా పనులు పోగొట్టుకొనేవారు, ఇందునుగురించి మహారాజు విచారించడంగాని, క్షమించడంగాని ఏమీ వుండేదికాదు. ఏమంటే, ఆయన ఈ ప్రాపంచిక విషయాలతో ఎక్కువ జోక్యం కలిగించుకొనే వాడు కాదు. ఎప్పుడూ వేదాంత కాలక్షేపము—వైరాగ్య చింతనము తప్ప, వేరు గొడవ లాయనకు పట్టేవికావు. సర్వసమర్థుడయిన తేజసింగుకు సర్వాధికారాలూ యిచ్చి, మహారాజు తన వైరాగ్య చింతలో తాను మునిగివుండేవాడు.

ఒకనాటి విరామపువేళ. మాతండ్రి వీరమల్లు తన కేర్పరుపబడిన గుడారములో ఒంటరిగా కూర్చుని తలవొంచి, తనకత్తికి మెఱుగు తోముకుంటున్నాడట. ఆసమయంలో సర్వసైన్యాధిపతి, ఆ గుడారంముందునుంచి పోతుండడమును మాతండ్రి చూడలేదట. అందువల్ల నమస్కారంకూడా చెయ్యలేదట—తేజసింగు తక్షణం, తన ఉద్యోగులద్వారా మాతండ్రిగారికి 'కొలువు విరమింపు పత్రము'ను పంపించాడట! అంతకుముందా ప్రకారమైన అనేకమందిలో మా తండ్రిగారొకరు గాబట్టి, అందునుగురించి ఆశ్చర్యంగాని, పునః ప్రయత్నంగాని అవసరం లేకుండాపోయింది.

నేనప్పటికి పదహారేళ్లవాడిని. నేను మాఅమ్మ, ఇద్దరు చెల్లెళ్లు, మానాయన, మొత్తం అయిదు జీవనాలు ఆధారంలేకుండా పోయినాయి. మానాన్నగారికిక ఈ దేశంలో వుండడమే యిష్టంలేక

పోయింది. ఈ కొలువే మరొక దేశంలో సంపాదించుకుని సుఖంగా బ్రతకవచ్చునని ఆయన నిశ్చయంచేశారు, అంతవరకూ కుటుంబ పోషణ జరిగేదెల్లా? కొలువు కుదరకుండా అందర మొకేసారిపోతే యింకా చిక్కులు పడతామని, ముందుగా మానాయనగా రొక్కరూ ఉద్యోగ ప్రయత్నంమీద వెళ్లారు. ఎక్కడయినా కొలువుదొరికిన వెంబడే కుటుంబమునంతటినీ తీసుకెళ్ళవచ్చునని ఆయన సంకల్పం! మా నాన్నగా రిల్లు బయలుదేరివెళ్లి యిప్పటికి రమారమీ పదేళ్ల యింది. ఇంతవరకూ ఆయన యెక్కడికి వెళ్లారో—ఏమయ్యారో మాకు తెలియదు మాసాలు నిరీక్షించాము-ఏళ్లు యెదురుచూశాము-వారెక్కడో ఏ ప్రమాదానికో గురియై, అకాలమరణానికి గురి అయ్యారని ఒకసారి నిశ్చయించాము—ఏడిచేడిచి వూరుకున్నాము. మా నాయనగారు యిల్లు వొదిలిపోయింది మొదలు, మా నిత్యజీవనం యెలా జరిగిందంటావు? మా అమ్మ పూలమాలలుకట్టి, మా చెల్లెళ్ళ చేత అమ్మించడము—నేను యెవరేపనిచెబితే ఆపనిచేసి ఆ కూలి డబ్బులు తెచ్చి, అమ్మకియ్యడము.

ఇలా జరుగుతుండగా, మా అమ్మ యెరో వడ్డీవ్యాపారస్తుని దగ్గర అవసరానికి, అయిదువరహాలు అప్పుచేసిందిట! చాలాకాలం వరకూ తీర్చలేకపోయింది, వాడా అయిదువరహాల అసలునూ వడ్డితో పన్నెండు వరహాలకుపెంచి, ఒకనాడు యింటిమీదికి పేచీకొచ్చాడు, అప్పుడు నేనుకూడా యింటిదగ్గర వున్నాను. ఆవడ్డీ వ్యాపారస్థుణ్ణి నేనంతకు ముందెరుగుదును, ఆ నగరంలోగల పెద్ద శ్రీమంతులలో ఒకడు, తనబాకీ తీర్చలేదని, ముందర ఏమేమో నిష్ఠూరంగా మాటలాడాడు.

"అయ్యా! పిల్లలుగలదాన్ని—భర్త దేశాంతరగతుడై తిరిగి రాలేదు-బ్రతికిబావుంటే, నీబాకీ యెప్పటికయినా తీర్చుకుండామూలే-ఇప్పుడు ఒత్తిడిచెయ్యకు." అంది.

దానికి వాడు మరింత కోపంతెచ్చుకుని—

"నీబ్రతుకు బాగుండేవరకూ కాసుక్కూచోవాలా? అంత డబ్బులేకపోతే—యౌవ్వన మింకావుంది గదా—పన్నెండు వరహాలు ఒక్కరాత్రికి సంపాదించగలవు—" అన్నాడు.

ఆ మాటలువిని మా అమ్మ కన్నీళ్లు జలజలరాల్చింది. మా నాయనగారు చనిపోయివుంటారని మేము నిశ్చయించుకున్నది నాన్ని కూడా ద్రవించని మా అమ్మ కళ్ళప్పుడు సంతతధారగా స్రవించడం చూచి నేను ఉద్రేకాన్ని ఆపుకోలేకపోయాను. శరీరంలోని రక్త మంతా ఒక్కసారి ఉడికి పొంగినట్లయింది. ఆ పట్టలేని ఆవేశంతో, ఆచేరువలోనే ఇనపనాడాలు తగిలించబడ్డ మా నాయనగారి ఒక పాత బూటును అందుకుని, వర్తకుడి జలతారుపాగా నూడబెరికి, దవడలు వాచేటట్లు ఆచెంపా యీచెంపా మోదేటప్పటికి పళ్లూడి రక్తం కారడం మొదలయింది.

"అయి నింటి యిల్లాలి నిటువంటి బుద్ధిలేనిమాట లెప్పుడూ అనకు—పో—నీ యబ్బతో చెప్పుకో—అన్నాను.

వాడు రక్తం కారుతున్న ముఖాన్ని చేతుల్తో పట్టుకుని—

"సైన్యాధిపతికి ఫిర్యాదుచేసి—ఇప్పుడు నిన్నేం చేయిస్తానో చూడు."

అంటూ వడివడిగా పోయాడు. అప్పుడు మా అమ్మ నన్ను కౌగలించి మరింత పెద్దగా యేడుస్తుంటే, నాచెల్లెళ్లు కూడా యేడవడం మొదలుపెట్టారు.

"అయ్యో నాతండ్రీ! ఆవర్తకుణ్ణెందుకు కొట్టావురా! దినాలు బాగుండకపోబట్టి మాటపడ్డామని సహించుకోవాలిగాని——చెయ్యి చేసుకున్నందు కిప్పుడు రక్షకభటులొచ్చి నిన్ను బంధించి తీసుకుపోతారు—మీనాయనగారు పోయినందుకే నేను కుళ్ళి కుళ్ళి యేడుస్తుంటే యిప్పుడు నీకొచ్చిన ఉపద్రవానికి నేనేం చేతునురా బిడ్డ! నాప్రాణాలయినా పోవేమిరా తండ్రీ!

అని మాఅమ్మ గుండెలు బాదుకుని యేడుస్తుంటే నాకు కర్తవ్యం పాలుపోలేదు. లేని మొండిధైర్యం తెచ్చుకున్నాను.

"అమ్మా! నాకేం భయంలేదు—నువ్వేడవొద్దు—చెల్లాయిలూ రండి—అమ్మా! రా!"

అని నేను వెంటనే చెల్లాయిలిద్దర్నీ ఒక చేత్తోనూ, అమ్మ నొకచేత్తోనూ పట్టుకొని, ఇల్లు, ఇంట్లో సామానులూ అన్నీ యెక్కడి వక్కడ వొదిలేసి, యివతలికొచ్చేశాను. వారిని వెంటబెట్టుకుని నా కగుపించిన మార్గము ననుసరించి, వడివడిగా పోవడం మొదలు

పెట్టాను. వర్తకుని కొట్టిన నేరానికి రక్షకభటులెక్కడ వెంటతరుము తున్నారో అని, అమ్మా చెల్లాయిలూ భయంతో వెనక్కు వెనక్కు తిరిగి చూస్తున్నారు. వారి భయం నిరాధారమైంది కాదు. ఏ నిమి షంలో అయినా రక్షకభటులొచ్చి మమ్మల్ని చుట్టేయొచ్చు. అప్పటి చట్టము ననుసరించి, నేను చేసింది అంత పెద్ద నేరమవును.

మానాయనగారిది, ఒక స్వంత గుఱ్ఱముండేది. స్వంతగుఱ్ఱ మంటే, వివాహమై, మానాయన మా అమ్మతో అత్తవారింటి దగ్గర నుంచి వచ్చేటప్పుడు, వారు తమయింట పుట్టిన ఆ గుఱ్ఱపుపిల్లను అల్లుడికి కానుకగా యిచ్చిపంపారన్నమాట. వారు ఇల్లువొదిలి వెళ్లి పోయిన కొన్నాళ్ళకు, మా అమ్మ డబ్బు అవసరంకొద్దీ, ఆగుఱ్ఱాన్ని నూరువరహాలకు ఒక వ్యవసాయదారుడికి అమ్మింది. రక్షకభటులకు జడిసి మేమలా పారిపోతున్న సమయంలో ఆగుఱ్ఱం జీను, కళ్లెముల సయితంగా, ఒక బయలులో పచ్చిక మేస్తూంది. అమ్ముడు పోయిన తరువాత, అది మమ్మల్నిగాని, మేము దాన్నిగాని చూడ్డం అదే మొదటిసారి.

''అదుగో! మన గుఱ్ఱమేనర్రా!''

అని చెల్లాయిటు|యిద్దరూ ఒకేసారి అంటే, వాళ్ళగొంతుకలను సయితం ఆనవాలుపట్టిన గుఱ్ఱం ఒక్కసారి సంతోషంతో సకిలించింది. ఇంతలో వెనుకనుంచి, గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినిపించింది. నిజంగా రక్షకభటులే—నన్ను పట్టుకోడానికి తరుముకొస్తున్నారు. అమ్మా చెల్లాయిలు భయవిభ్రాంతులై, తిరిగి ఘొల్లున యేడవడం మొదలు పెట్టారు. క్రమంగా రక్షకభటులు మమ్మల్ని సమీపించకొద్దీ, అమ్మా, చెల్లాయిలు, మరింత బేజారై పోతున్నారు. నేనింక ఆలస్యం చెయ్య కూడదనుకున్నాను. పచ్చిక మేస్తున్న గుఱ్ఱంమీద, ముందు మా చెల్లా యిల నిద్దర్నీ యెక్కించాను. ఆ తరువాత మాఅమ్మ నెక్కించాను. అటువెనుక నేను అది ఏనుగువంటి గుఱ్ఱంగాబట్టి నలుగుర మను ష్యుల్నీ యెక్కించుకుని, నేను కాలిమడమతో సొంజ్ఞ చెయ్యడమే తడువుగా, అది మా ప్రమాదమును గుర్తించినట్లు మేఘాలపై దిరికి వాయుమనోవేగాల్ని మించి పరుగెత్తింది. మమ్మల్ని తరుముతున్న రక్షకభటులున్నూ యిది గమనించి, తమ గుఱ్ఱాలవేగాన్ని కూడా మరింత హెచ్చించారు. మాగుఱ్ఱం ఆవిషయమునుగూడా, వెనకనుంచి

వచ్చే కాతుల అలజడిని గమనించి, తాను నాలుగుకాళ్ళతో ఉర కడం మొదలుపెట్టింది. చెల్లాయిల్ని గట్టిగా పట్టుకోమని అమ్మను హెచ్చరించి—నేను అమ్మను ఒకచేత్తోనూ, గుఱ్ఱపు కళ్ళాన్ని ఒకో చేత్తోనూ పట్టుకుని, కొన్ని యోజనాలు స్వారీజరిగించేటప్పటికి, మా దురదృష్టమా అన్నాట్లు ఒక అఘాతమైన యేరు అడ్డమొచ్చింది. ఏం చెయ్యాలి? రక్షకభటులు దగ్గరవుతుండడంవల్ల, అమ్మా చెల్లాయిలు, ఖంగారుపడడం మొదలుపెట్టారు.

"ప్రాణాలు పోయినాసరే—మనం మాత్రం వాళ్ళకి పట్టుపడ కూడదు—మీరు మాత్రం ధైర్యంగా వుండండి."

అని నేను అమ్మనీచెల్లాయిల్నీ గుఱ్ఱం నడుం గట్టిగా పట్టుకుని బోర్లపడుకోమని, కళ్ళాలు మొదలయిన గుఱ్ఱపుతోలు సామానులతో గుఱ్ఱానికీ గుఱ్ఱంపైవున్నా మనుషులికీ గట్టిగా బిగించి కట్టేశాను.

"గుఱ్ఱాన్ని ఏట్లోకి తోస్తున్నాను. భద్రం!"

అని నేను నావాళ్ళని హెచ్చరించాను.

"నువ్వో?—"

అని, అమ్మా చెల్లాయిలూ భయవిభ్రాంతులై అరిచారు.

"నేనూ ఏట్లోనేదూకుతున్నాను—బ్రతుకుతామా అంతరం కలుసుకుందాం—లేదా—ఇదే ఆఖరు—"

అనేసి, నేను గుఱ్ఱన్ని—"ఊఁ!" అని చేతితో అదిలించాను—అది అమాంతం ఒకే ఒక గెంతులో—ఏటిమధ్యాని కురికింది. వెంటనే నేనుకూడా పరమేశ్వరుణ్ణి తల్చుకుని, ఏట్లో కురికాను—రక్షకభటల గుఱ్ఱాలు ఏటిగట్టున నిలవడం గమనించాను. అంతే—ఆ తరువాత, ఎవరికెవరూ లేరు! ఒకరి సంగతింకొకరికి తెలీదు—నేను యేట్లో ఎంతదూరం కొట్టుకుపోయానో—ఎక్కడికి కొట్టుకుపోయానో తెలీదు—గుఱ్ఱానికి బంధించబడ్డ అమ్మ చెల్లాయిలూ ఏమైనారో అంతకంటే తెలీదు. రక్షకభట సైన్యాలు మాత్రం మాతోపాటు ప్రాణాలకు తెగించలేక, వెనక్కి మళ్ళివుంటాయని, సులువుగా వూహించాను.

తరువాత నాశరీరంలో ప్రాణముందో లేదో కూడా నాకు తెలీదు. ఏటిప్రవాహ మెటుపోతే అటుకొట్టుకుపోయాననుకుంటా. అది మర్నాటి ఉదయమో—మూడోనాటి ఉదయమో తెలియదు గాని, ఒక గడ్డిదుబ్బులో నాతల యిరుక్కునివున్నట్లు తెలిసింది. కళ్లు

విప్పి చూసేటప్పటికి అది ఒకశరీరం—నాశరీరం సగం నీళ్ళలోనూ—సగం గడ్డిదుబ్బులోనూ వుండని గ్రహించాను. మెల్లిగా నీళ్లలోవున్న శరీరభాగాన్ని గడ్డిదుబ్బుల్లోకి లాక్కున్నాను. అప్పుడు మొత్తం శరీరాన్ని లేపి, నిలుచోపెట్టడానికి అవకాశం కలిగింది. నేను బ్రతికే వున్నానని ఖాయం చేసుకున్నాను. ఆ తరువాత గడ్డిదుబ్బులోంచి, రెండడుగులు వేస్తే కాళ్లురెండూ భూభాగంమీద నిలిచాయి. ఆ ప్రాంతమంతావ్వూరో—అడివో—ఏమీ తెలీదు. తెలియకపోయినందు వల్ల, నాకంత విచారంకూడా కలగలేదు. శత్రువులకు పట్టుపడకుండా తప్పించుకున్నాను. అదే పరమసంతోషం.

అటుపైన, అమ్మా చెల్లాయిలు ఏమయినారో అన్నజిజ్ఞాస, వారుకూడా శత్రువుల కందరని ఖాయంచేసుకున్నాను. తడిసినబట్టలు పిండుకొని, అప్పటి యెండలో ఆరబెట్టుకుంటూ, నాభవిష్యత్తును గురించి ఆలోచించడం మొదలుపెట్టాను. ఆలోచనకంటే ఆచరణ ఎక్కువ ప్రధానమైనదని తోచింది, వెంటనే కంటి కగుపించిన మార్గము ననుసరించిపోయాను. కొన్ని యోజనాలు నడవగానడవగా, ఒక చిన్న పల్లె కనుపించింది. ఆపల్లెవాసులతో పరిచయం కలిగించుకున్నాను. ఇదేవ్వూరు? ఏదేశంలోనిది, అని ముందర నడిగాను. పల్లీయులలో ఒకడు, అది మామిడిపల్లె అనీ, కాశ్యపదేశంలో చేరిన గ్రామమనీ—తమకు దత్తాత్రేయమహారాజు ప్రభువని చెప్పారు. నేనూ ఆదేశపు ప్రజలలో ఒకడనని వారికి చెప్పకుండా—

"ఆమహారాజు పరిపాలనలోవున్న మీరందరూ సుఖంగా వున్నారా?" అని నేడిగాను.

"చావకుండా బ్రతికివుంటే—సుఖాలున్నంత."

అని ఆపల్లీయులలో ఒకడు నాతో అన్నాడు. అతనినే, నేనింకా కొన్ని ప్రశ్నలు వేశాను.

"నిత్యపాడిపంటలతో తులతూగుతున్న యీరాజ్యానికి రత్నగర్భమని పేరుగదా! మీకొచ్చిన యిబ్బంది లేమిటి?"

"పాడిపంటలకూ లోటులేదు—పేరుకీ లోటులేదు. అయితే మామహారాజు ప్రజలసుఖాలు పాటించనివాడయ్యాడు. సేనాపతి తేజసింగు చేతులో కీలుబొమ్మగావుంటూ—సర్వం అతనిమీద వొది

లేసి, తాను అహర్నిశలు వేదాంతగ్రంథాలు ముందరపెట్టుకొని అదే గొడవలో మునిగివుంటాడు.

స్వార్థపరుడైన తేజసింగు శ్రీమంతులో శ్రీమంతుడై —వారికి లాభించే చట్టాలు మాత్రమే పరిపాలనా విధానంలో ప్రవేశపెట్టిస్తూ సామాన్య ప్రజలకు తినడానికి తిండీ, కట్టడానికిగుడ్డ—లేకుండా చేస్తున్నాడు.

రాజధానిలో వుంటున్నప్పటికీ— నాకు తెలియని కొన్ని విషయాలు ఆపల్లెవాసులు చెబుతుంటే ఆశ్చర్యపడ్డాను. మహారాజు పరిపాలనంతనీ సయిన్యాధిపతి తేజసింగు చేతులో పెట్టాడనీ—అందరికీ తెలుసు. కాని తేజసింగు పరిపాలనా విధానం యింతహీనంగా వుంటుందనుకోలేదు. అనంతరం పల్లీయులలో మరియొక డిలా అన్నాడు.

"పండిన పంటంతట్నీ, పన్నులకనీ—సైన్యాల అభివృద్ధికనీ—ఎప్పటికప్పుడేదో వొంకపెట్టి తన సిబ్బందిని పంపి తోలించుకుపోతాడు. సంవత్సరంపొడుగునా మానోట్లోమట్టి—మాపెళ్లాంబిడ్డలతో మలమలమాడి పోతుంటాము."

"ఇటువంటి రాజ్యంలో ప్రజలమై వుండడంకంటే—ఏ అడవులో అయినా జంతువులుగా వుంటే—ఆకులలాలుమేసయినా బ్రతకొచ్చు. స్వామీ!"

అని మరొకడన్నాడు. వారు చెప్పిన మాటలన్నీ వింటుంటే—తేజసింగు దుష్పరిపాలనకి నాకడుపు ఉడికిపోయింది. అయినా అప్పుడు నేను చెయ్యగలిగిందేముంది? నేనుకూడా వారిలాంటి ఒక పౌరుణ్ణి—అమ్మనీ చెల్లాయిల్నీ పోగొట్టుకొని, ఎటూకాని దుస్థితిలో నేనున్నాను. ఒక నిట్టూర్పును విడిచి, గ్రామంలోంచి ముందుకు సాగిపోయాను. నివాసయోగ్యమైంది ఒక్కయిల్లూ లేదు. ఆకులూడిపోయి, కర్రలు పడిపోయీవున్న జీర్ణకుటీరాలే అన్నీ. ఎవరిముఖం చూచినా కళ్లు లోతుకు దించుకుపోయి, గుంటలుపడ్డ దవడలతో దైన్యత—ఆకలిబాధ కనపడుతూంది. చూచి భరించలేకపోయాను. వడివడిగా నడిచి, ఆగ్రామం దాటిపోయాను.

మరి కొంతదూరంలో అంతకంటే పెద్దగ్రామం కనుపించింది. అదికూడా మొదటి గ్రామంలాగునే శిథిలావస్థలో వుంది. అక్కడి ప్రజలుకూడా అదేమాదిరి హీనదశలో వుండడం గమనించాను.

ఆవరసలో చిన్నవీ పెద్దవీ కలసి అయిదారు గ్రామాలున్నాయి—గ్రామ్యాలూ ఆగ్రామ ప్రజలూకూడా కొంచ మించుమించు ఒకేరక మైన దరిద్రదశలో వున్నారు. బిడ్డలకు పోషణలేదు—గొడ్లకు మేత లేదు—మనుషులకు తిండిలేదు. దరిద్రదేవత సర్వత్ర విజయ విహారం చేస్తూంది. రాజధాని యశానగరంలో వుంటే దేశంలోని దుస్థితి యేమీ కనుపించదు. నగరాల్లో ధనికుల సిరులన్నీ పల్లీయుల ఉసురు కష్టాలే అని గ్రహించేసుకున్నాను. బస్తీలో కనుపించే దివ్యభవనాలు—విలాసమందిరాలూ, గ్రామీణులు చెమటోడ్చిన శ్రమకు ఫలితాలని తెలిసింది. నే నావిధంగా కొంత కాలం ఒక పిచ్చివాడిలాగ దేశమంతా తిరిగాను. నేను నేరంచేసి, రాజధానినుంచి పరారి అయిన సమాచారం, ప్రభుత్వం ద్వారా యితర నగరాలకూ కూడా తెలియచెయ్యబడి వుంటుందేమో—నన్ను ఎవరు ఎక్కడపట్టుకుంటారో అని భయముకవైపున—ఏట్లోకి తొయ్యబడ్డ ఆగట్టు మేమైందో—అమ్మా, చెల్లాయిలు బ్రతికివున్నారో—లేదో—వారిగతి యేమైందో అన్న దుఃఖమింకోవైపునా—ఇవన్నీ నామతిని చెడగొట్టాయి.

ఒకరోజున ఒక నగరవీధులో పిచ్చిడిలాగ నడచిపోతుంటే—

"మల్లూ! ధీరమల్లూ!"

అని, వెనుకనుంచి నన్నెవరో పిల్చారు. గుండెలు ఝల్లు మన్నాయి. ఇట్టె వెనుదిరిగి చూస్తినిగదా, మాతాత, చేతిలో ఒక కర్ర పట్టుకుని, ఒణుక్కుంటూ నావైపు నడచి వస్తుండడం చూచి ఆశ్చర్యపోయా!

"నువ్వేనా తాతా! ఇక్కడికెలా వొచ్చావు?"

అంటూ మా తాతని కౌగలించుకున్నాను.

"మర్చిపోయావేమిట్రా మల్లూ! ఈ ధవళనగరం దగ్గిరేగా మనపల్లె అపరంజి. బతికి బయటపడ్డావా నాయనా! అంతా మీ అమ్మ కడుపు చలవ—"

అని మా తాత, నన్ను కౌగలించి ఏడ్చాడు. దాన్నిబట్టి మా సంగతులన్నీ మా తాతయ్యకు తెలిశాయని నే నర్థంచేసుకున్నా.

"నీ కెలా తెలుసు తాతా?"

"ఎలా తెలుసు నేమిట్రా? మీ అమ్మా, చెల్లాయిలూ మా యింటికొచ్చి చేరారుగా?"

"ఆఁ! అమ్మా! చెల్లాయిలూ బ్రతికున్నారా తాతా! ఎక్కడున్నారు?"

"అపరంజిలో—మనింటిలోనే వున్నారు. నువ్వేమై పోయావో అని బెంగెట్టు కేడుస్తున్నారు. మా యింటబుట్టిన గుఱ్ఱం—మా యింటికి రాక ఏమవుతుంది—ఏట్లోపడి ఈదుకుని వొచ్చిందిగాబోలు! ఓనాడు తెల్లవారుఝామున నేను పొలం వెళ్ళడానికి యివతలికిరాగానే, ఆగుఱ్ఱం గుమ్మంలో నిలుచునివుండడం చూశాను. దానిమీాపున నువ్వు కట్టినకట్లు చెక్కుచెదరకుండా అలానేవున్నాయి—మీా అమ్మ పిల్లలూ మాత్రం దాని వీపుమీాద స్పృహలేకుండావున్నారు. నాకేమీా అర్థంగాక తెల్లబోయాను. వెంటనే లోపల్నుంచి మన వాళ్లని పిల్చుకొచ్చి—కట్లువిప్పి, ఆ గుఱ్ఱంమీాద స్పృహలేకుండా పడివున్న వార్ని మెల్లిగా లోపలికి తీసుకెళ్ళి—తడిసినగుడ్డలు విప్పించి—పొడిగుడ్డలు కట్టించి—మంటదగ్గిర వాళ్ల శరీరాలు వెచ్చచెయ్యగా—కొంతసేపటికి తెలివొచ్చింది. అప్పుడందరికీ యింత వేడి వేడి గంజి పట్టించాను. క్రమంగా తేరుకున్నారు. ఆదువస్థంతా ఏమిటని నేనడిగిన మీాదట—మీా అమ్మ జరిగిన సంగతులన్నీ నాకుచెప్పి, నువ్వేమై పోయావో అని, ఆ రోజు మొదలు ఈ రోజువరకూ, కంటికీ మంటికీ ఏకధారగా యేడుస్తూంది—రా—యింటికిపోదాం."

అని చెప్పిన మా తాతయ్యవెంట, నేను బయలుదేరాను. మార్గంలో నేను మా తాతయ్య నడిగాను—

"నువ్వు ఈపట్నమెందుకొచ్చావు?"

"రాక ఏంచెయ్యను? మనకి మునుపున్న భూములన్నీ యిప్పుడు లేవు—పన్నులు కాయలు పెరిగిపోయాయని—మనపొలాలన్నీ సర్కారు లాక్కున్నారు—మీా పెద్ద మామయ్య యవనగర సైన్యాల్లోవుంటూ యుద్ధంలో చచ్చిపోయిన సంగతి నీకున్ను తెలిసిందేగదా—చిన్న మామయ్యకి పక్షవాత మొచ్చింది—కూచున్న చోట్లోంచి కదల్లేడు, వాడిపెళ్లాం, యిద్దరుపిల్లలు, సరి యిప్పుడు మీా అమ్మా పిల్లలూ—ఇందరికీ పోషణ జరగడంలేదు, నేను ప్రతిరోజూ యీా పట్నమొచ్చి, సాయంకాలం దాకా యిక్కడేవుంటాను. చదువురాని వర్తకులు కొందరు నాచేత పద్దులు రాయించుకుని, తృణమో ఫణమో యిస్తారు. ఆడబ్బు పట్టుకుని, రాత్రికి యిల్లు చేరుకుంటాను."

అని మా తాతయ్య మార్గంపొడుగునా తమవిశేషాలు చెబుతూ నన్ను తనవెంట తమగ్రామ తీసుకెడుతున్నాడు.

మా తాతయ్యంటే, మా అమ్మకు తండ్రి అని వేరేచెప్పనవసరం లేదనుకుంటాను. ఆదిలో అది ఒక ముఖాసా కుటుంబం. అనేకమైన పొలాలు—పెద్ద వ్యవసాయము—వందలాది పశువులూ వుండేవి. నాకు జ్ఞానమొచ్చిం తరవాత కూడా, మా అమ్మతో ఒకటి రెండు సార్లు నేను వాళ్ల అపరంజి గ్రామం వెళ్ళాను. మా తాతయ్యగారి కుటుంబం పాడిపంటలతో తులతూగుతూ—లక్షలంగా వుండేది. క్రమంగా పరిస్థితులు క్షీణించాయి. మిగిలిందాన్ని సర్కారు వశం చేసుకున్నారని చెప్పాడుగా! అందువల్ల, తన యెనభై యేళ్ల ముసలి వయస్సులో మా తాతయ్య ప్రతిదినమూ, అయిదామడలు నడిచి అపరంజి గ్రామంనుంచి, ఆ ధవళనగరం నడిచి వచ్చి, కష్టపడి వర్తకులకు పద్దులురాసి, కుటుంబపోషణ చేస్తున్నాడని అర్థమయింది.

ఆ గుఱ్ఱమెంత వివేకంగలదో చూశావా! ఎట్లోపడి ఈదుకుని పోయి, పోయి, అమ్మనీ పిల్లల్నీ కన్నవారింటి దగ్గర సురక్షితంగా చేర్చిందిట! తనుకూడా మా అమ్మలాగే ఆవూళ్లో ఆ యింటబుట్టిన బిడ్డ అని దానికి గుర్తుందిగాబోలు! వెధవనరులు-ఆ జంతువు ముందర యెందుకు పనికివస్తారు? భగవంతుడి దయవల్ల, నాలాగే, అమ్మా పిల్లలూ ఎలాగో బతికి బయటపడ్డారని, తాతయ్య చల్లని కబురు చెప్పాడు. అమ్మా పిల్లల్నికంటే' వాళ్లని రక్షించిన గుఱ్ఱాన్ని ముందరచూసి ముద్దు పెట్టుకోవాలని, నాప్రాణం తహతహలాడింది. మా తాతయ్యతో క్రమంగా నడిచిపోయి, యిల్లు చేరుకున్నాను. అమ్మ, చెల్లాయిలూ, చూడగానే బావురుమని యేడుస్తూ, నన్ను కౌగలించారు. నేను వాళ్లని ఓదార్చాను. కాని వాళ్ళందరూ తిండి లేకగాబోలు బక్కచిక్కివున్నారు. పాపం! ముసలితాతయ్య సంపాదించిన అంతమందికి ఎలాసరిపోతుంది. చెల్లాయిలు—పెద్దది మల్లిక, చిన్నది మాలతి. మల్లిక పన్నెండేళ్ళది—మాలతి పదేళ్ళదీ—

"అన్నాయ్! నాకు కట్టుకోడానికి ఒక్కపరికిణీ కూడా లేదు—చూశావా!" అంటూ తను కట్టుకున్న చిరుగులపరికిణీని నాకు చూపింది మల్లిక.

"నాచొక్కా చూడన్నాయ్—ఒళ్లంతా కనిపిస్తూంది—"

అని తవాలికల చొక్కా చూపింది మాలతి. మా అమ్మస్థితి చెప్ప నవసంలేదు. రెండుమూడు రకాల గుడ్డలు ముడిపెట్టుకుని కట్టుకుని వుంది. వాళ్లస్థితి చూస్తే నాకడుపు తరుక్కుపోయింది-ఆపుకోలేనంత యేడుపువొచ్చింది. వెంటనే యివతలికొచ్చాను. గుఱ్ఱమక్కడ గడ్డి మేస్తూ నన్నుచూచి సకిలించింది. వెంటనే దుఃఖమంతా మర్చి పోయాను. దగ్గిరిగావెళ్ళి దాని వీపుతట్టి ముద్దుపెట్టుకున్నాను. యబా నగరంలో దాన్ని మాదగ్గర కొన్న వ్యయసాయదారుడు దాన్ని బాగా మేపేవాడుగాబోలు, అప్పుడు పుష్టిగావుంది-ఇప్పుడదికూడా బక్కచిక్కివుంది.

"నీఋణం యెలా తీర్చుకుంటాం! అమ్మనీ చెల్లాయిల్నీ రక్షించి పుణ్యం కట్టుకున్నావు."

అని నే నంటుండగా మాలతి యివతలకొచ్చి—

"అమ్మ పిలుస్తోంది." అనడంవల్ల, నేను తిరిగి లోపలికెళ్ళాను. అమ్మ నాకు అన్నం వొడ్డించింది.

"ఎప్పుడనాగా తిన్నావో—రా నాయనా!" అంది.

"తాతయ్యా, చెలాయిలూ అందరూ తిన్నారా?"

అని నే నడిగిందానికి.

"ముందర నువ్వుతిను." అని మా అమ్మ నాదగ్గరకూచుని, కడుపునిండా తినిపించింది.

తరవాత, నేను మా అమ్మతో చేప్పాను—

"అమ్మా నేనిక్కడ కూడా వుండకూడదు—నావునికి సర్కారుకు తెలుస్తుంది. రక్షకభటులొచ్చి నన్ను పట్టుకుంటారు."

"అయితే యెక్కడికి పోతావు?"

"ఎక్కడికో పోతాను—రహస్యంగా వుండాలి."

"ఇప్పటి కందరమూ ప్రాణాలతో వున్నామని సంతోషపడు తుంటే—తిరిగి యిలా అంటావేం తండ్రీ! నువ్వు నాకళ్లయెదుట లేక పోతే, నేను గుండెబద్దలై చచ్చిపోతారా!"

"ఫరవాలేదమ్మా—నిన్నువొదిలి నే నెక్కడికి పోను-ఎక్క డెక్కడ తిరిగినా వారానికోసారి వచ్చి నిన్ను చూస్తుంటా—"

"అయితే, జన్మంతా యిలా రక్షకభటులకు భయపడుతూ వుండాలా?"

"చూదాం—కొంతకాల మయ్యాక ఏమవుతుందో."

"ఆనా డావర్తకుణ్ణి అలా కొట్టకపోయినట్టయితే, మనకిన్ని తిప్పలొచ్చేవి కాదుగదా!"

"వాడు పేలిందాన్ని సహించి వూరుకోవాలా అమ్మా!"

"పెద్దరోజులొచ్చినప్పు డేంచెయ్యాలి తండ్రీ! మీ నాన్నగారి వల్ల నేను సగం కృంగిపోయాను. ఇప్పుడు నీవల్ల పూర్తిగా పాతాళానికి దిగబడ్డాను."

"నువ్వేమీ అధైర్యపడకమ్మా—నాకేం ఫరవాలేదు."అని నేను బయలుదేరుతుంటే—

"అన్నప్రకారం, వారం వారం, నువ్వు నాకళ్లబడకపోతే—నాగుండె బద్దలై పోతుంది సుమా నాయనా!"

అని అమ్మ హెచ్చరించిందానికి నేను సరేనని ఆమెకు ధైర్యం కలిగించి, వచ్చేటప్పుడు కొత్త పరికిణీలూ—కొత్త చొక్కాలూ తెస్తానని, చెల్లాయిలకు తృప్తికలిగించి, బయటకొచ్చి, గుఱ్ఱాన్ని విప్పుకుని దానిపై బయలుదేరాను. మార్గం పొడుగునా నాభవిష్యత్తును గురించి దీర్ఘంగా ఆలోచించాను. ఒకనిశ్చయాని కొచ్చా కూడా!

## ౩౫

నా నిశ్చయానికది మొదటి విజయం—

అశ్వారూఢుణ్ణై, అపరంజి గ్రామం వొదిలి—ధవళనగరం మార్గము ననుసరించి వెడుతుండగా, అక్కడ ఒకచెట్టు కిందెవరో ఒక వ్యక్తి కూర్చుని వుండడంచూశాను. జలతారు తలపాగా ధరించి, అయిదువేళ్లకు రవ్వల ఉంగరాలు—ముంజేతికి బంగారు కడియము—విలువగల దుస్తులతో వుండి—ఒక తెల్లని వస్త్రంపరిచి, దానిమీద కొన్ని వెండి, బంగారు నాణాలు పోసుకుని తాపీగా లెక్కపెట్టు కుంటున్నాడు. వెనుకపాటునే వెళ్లి నేనమాంతం వాడిమీద కురికాను—రెండుచేతులతోనూ వాడిపీక పట్టుకుని—

ఈ నాణాలన్నీ యిక్కడ వొదిలి పారిపోతావా? నీ పీక పిసికి చంపెయ్యనా?" అని అడిగాను.

"చంపొద్దు బాబూ—చంపొద్దు—మొన్ననే నేను మూడో పెళ్లి చేసుకున్న—నా చేతి వుంగరాలు—రవ్వలకడియంకూడా నువ్వే తీసుకో—నన్ను ప్రాణాలతో పోనియ్యి."

అంటూ తత్క్షణం తన ఆభరణాలుకూడా తీసి—కింద పెట్టాడు.

"త్వరగా పరుగెత్తు—వెనక్కు తిరిగి చూశావంటే—ప్రాణా లెగిరిపోతాయి."

అని నే నాశ్రీమంతుణ్ణి తిరిగి హెచ్చరించగా, వాడు నిజంగానే వెనుదిరిగి చూడకుండా పారిపోయాడు. నే నా ఆభరణాల్ని—వెండి బంగారు నాణాల్ని మూటకట్టుకున్నాను. తిరిగి మరికొందరు మనుషు లెవరో వస్తున్న అలికిడి వినిపించడంవల్ల, తత్క్షణం గుఱ్ఱమెక్కి ఆ విలువగల మూటతో దాడుతీశాను.

నేను చేసినపని తప్పేమో అని చాలా తీవ్రంగా ఆలోచించాను. అమ్మ, చెల్లాయిల పరిస్థితి నాకళ్లకు కట్టినట్టు కనుపించింది. దేశంలో కొందరు తినడానికి తిండి, ఒళ్లు కప్పేందుకు గుడ్డ లేకుండా అఘోరిస్తుంటే మరికొందరు జల్తారుపాగాలు చుట్టుకుని—రవ్వలాభరణాలు ధరించి, ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారని నాకు తోచింది. దేశంలో అందరిదగ్గరా వుండవలసిన ధనం కొందరిదగ్గర మాత్రమే యెందుకుండిపోయిందా అని ఆలోచిస్తే—వైజ్ఞానికంగానో, శారీరకంగానో—కొందరు దుర్బలురు కావటంవల్ల, ఆకొందరు, యీ కొందరి కళ్లుకప్పి, ధనాన్ని ఏదో ఒకరూపంలో సంగ్రహించి కూడబెట్టారని అర్థమైంది.

ఒక తండ్రికపునపుట్టిన వారిలాగునే, ఒకే దేశంలో పుట్టిన వారందరికీ సమానహక్కు బాధ్యతలున్నాయనీ—ఆదేశసంపదను అందరూ సమానహక్కుల్తో అనుభవించవలసిందనీ—నేను నిశ్చయించాను. తెలివీ బలమూ యెవరిదగ్గర యెక్కువుంటే, వారికి చేతనయినంత ఎక్కువధనమును కూడబెట్టుకో వచ్చునన్న సిద్ధాంతం న్యాయసమ్మతమైనప్పుడు—నేను చేసిందాంట్లో తప్పేమీ లేదని నిర్ణయించుకున్నాను.

ఆదినం మొదలు—ఈదినంవరకూ అదేపద్ధతి, దొరికన శ్రీమంతుణ్ణి వొదలకుండా చిక్కినధనం జారవిడవకుండా దోచుకోవడం నావృత్తి. కత్తులువగైరా అవసరమయిన పరికాలు—ఆధనమును

దాచడానికి గూఢమయినస్థలము-నాకు అన్నివిధాలుగులూ ఏర్పడ్డాయి. వెయ్యిమందికిపైగా నా శిష్యకోటివుంది—గుఱ్ఱాం-ఏనుగులు-ఒకటేమిటి? నేనిప్పుడు కిరీటంలేని చక్రవర్తిని. అయితే ఈదేశపు మహారాజులాగ ధనమును దుర్వినియోగం చెయ్యను. ఆకలిమంటల్తో అలమటించేవారికి—ఇల్లు లేనివారికి—గుడ్డలులేనివారికి—నాదోచుకొన్నధనం వినియోగించబడుతూంది. నాకు వ్యసనాలులేవు—భోగాలపై ఆపేక్షలేదు. రెండుపూటలు రెండుగుప్పెళ్ళ అన్నము—రెండు రొట్టెలు! ఇవిగో యిలాంటివి నాలుగుజతల గుడ్డలు—అంతకంటే నాకింకేమీ అవసరంలేదు.

నేనీవృత్తి మొదలుపెట్టిన కొంతకాలానికి, దేశంలో పెద్ద అలజడి బయలుదేరింది. రాజధానిలో నాసమస్య తీవ్రరూపం దాల్చింది. నన్ను పట్టుకోడానికి ప్రత్యేక సిబ్బందీలు—అపరాధ పరిశోధకులు—ఎన్నెన్నో బయలుదేరాయి. ఎవరివల్ల కాలేదు. చివరకు నన్ను వధించి నా శిరస్సును తెచ్చినవారికి లక్షవరహాలు బహుమానమని, యబానగర పరిపాలనావర్గం ప్రకటనచేసింది. ఒకప్పుడు అణావిలువ చెయ్యని నా శిరస్సు ఇప్పుడు లక్షవరహాలు విలువ కట్టబడిందంటే—అదికూడా ఒక విశేషమేగదా!

రాజ్యంలోగల రక్షకభటశాఖ—సైన్యశాఖ అపరాధ పరిశోధకశాఖ—మొదలయిన అన్నిశాఖలూ, నన్ను పట్టుకోవాలని ప్రబలప్రయత్నాలు చేస్తారనీ, నేనెవరికీ పట్టుబడక తిరుగుతున్నాననీ చెప్పానుగదా! ఆశాఖలన్నీ ప్రయత్నాలు విరమించుకున్నా విరమించుకోకపోయినా, ఆరాజ్యంలో ఎవరో ఒక్కవ్యక్తి—ఏశాఖకు చెందినవాడో, నన్ను పట్టుకుని, నా శిరసుఖండించినడానికి కంకణం కట్టుకున్నాడని తెలిసింది. కాని అతనెవరో నాకుతెలీదు. నేనొకనాడు, యబానగరానికి పదామడదూరంలో ఒక చెట్టుకి నా గుఱ్ఱమునుకట్టి, ఆదాపులోవున్న ఒక కొండపై నిలిచి-అన్నివైపులా చూస్తున్నాను. ఆదినం నాకే(శ్రీ)మంతుడూ దోచుకోడానికి లభ్యంకాలేదు. విసిగి కొండ దిగిపోయాను. గుఱ్ఱం దగ్గిరికొచ్చి, ఎక్కబోయే సమయంలో దానితోక కొక చీటి కట్టబడివుండడం చూచి, చాలా ఆశ్చర్యపోయాను. విప్పిచూడగా అందులో యిలావుంది—

"ధీరమల్లూ! నీ శిరస్సును ఖండించడానికి నేను కంకణం కట్టు కున్నాను. నువ్వు నిజమైన ధీరుడవయితే, ఒకే తల్లికీ తండ్రికీ జన్మిం చిన వాడవయితే, రేపుసాయంకాలం నాలుగుగంటలకు నన్ను, యశానగర సరిహద్దు ప్రాంతంలోవున్న కాళికాలయందగ్గర ఒంట రిగా కలుసుకోవలసింది—నేను ఒంటరిగానే వస్తాను.

ఇట్లు,
నీ శిరస్సుకోరే,
అభిలాషి.

ఆ చీటినిచూడగా, నాకు చాలా ఆశ్చర్యంకలిగింది—" దీనిని ఎవరు వ్రాసివుంటారు? నాగుఱ్ఱపుతోక కెప్పుడు కట్టివుంటారు?" ఒంటరిగా రమ్మనడంలో వారి వుద్దేశమేమిటి? వెళ్ళకపోతే నేను పిరుణ్ణిగాదన్నమాట! ఒక తలిదండ్రులకు జన్మించినవాడిని కాదన్న మాట! ఏమిటీ సవాల్!"

అని నాలో అపరిమితాగ్రహావేశ పరవశుణ్ణయ్యాను, అవ కాశం లేకపోయిందిగాని, నాతో అటువంటి సవాల్ చేసినవాణ్ణి అప్పటికప్పుడే కలుసుకోవాలన్న ఉద్రేకంకలిగింది. మర్నాటి సాయంకాలంవరకూ ఓపికపట్టాను. నామామూలు దుస్తుల్తో ఒక్క కరవాలమును మాత్రం ధరించి, సరిగా నాలుగుగంటలకు, నా గుఱ్ఱం మీద చీటిలో వ్రాయబడిన గుర్తులప్రకారం ఆ స్థలానికిపోయి చేరు కున్నాను. యశానగరపు సరిహద్దుల్లో కాళికాలయమున్న మాట నిజమే—కాని అక్కడ యెవ్వరూలేరు. గుఱ్ఱమునుదిగి, ఆలయంవైపు నడిచి వెడుతుండగా, నా వెనుక మరొక గుఱ్ఱమొచ్చి నిలిచింది. నేను వెనుదిరిగి చూడగా, ఒక నవయౌవన యువకుడు గుఱ్ఱందిగి—

"ధీరమల్లువు నువ్వేనా?" అని అడిగాడు.

"అవును—చీటిరాసి నా గుఱ్ఱంతో కనుకట్టింది నువ్వా?"

"నేనే—"

"నేను ఒకే తలిదండ్రులకు పుట్టినవాణ్ణని అర్థమైందా?"

"అయిందికాని, నువ్వు నిజమైన వీరుడవవునో కాదో యిప్పుడు తేలాలి—"

"నువ్వు తేల్చగలవన్నమాట?"

"ప్రభుత్వానికి పట్టుబడకుండా తిరుగుతూ—దొంగతనంగా శ్రీమంతుల్ని దోచుకోవడం ప్రజ్ఞకాదు—బాకీ యెగబెట్టి అమాయిక వర్తకుణ్ణి చెప్పుదెబ్బలు కొట్టడం పౌరుషంకాదు—విక్రయించిన గుఱ్ఱాన్ని తిరిగి అపహరించుకోవడం ప్రతాపంకాదు. ఆనాడు నువ్వానాడు సైనికదళాని కందకుండా, యేట్లోపడి చచ్చావనుకుని చాలా సంతోషించాం—కాని నీ దుండగాలు రోజురోజుకీ మితిమీరి పోతున్నాయి—నువ్వు బ్రతకడం దేశానికి క్షేమంకాదు—అందుకే నీ శిరస్సు ఖండించి తెచ్చినవారికి లక్షవరహాల బహుమానమని, యుబానగర ప్రకటనచేసింది, దానివల్ల కూడా ప్రయోజనం కలగక పోవడంవల్ల, నేను పూనుకున్నాను. నీతో యుద్ధంచేసి, నీ శిరస్సును ఖండించాలని వచ్చాను."

"పరమసంతోషం-కాని ఒకవేళ నీ శిరస్సు ఖండించబడితే-"

"అందుకుకూడా నేను సంసిద్ధంగానే వున్నాను."

అంటూ ఆయువకుడు ఒరనుంచి కత్తినిలాగాడు—నేనుకూడా ఒరలోంచి కరవాలమును పెరికి—అతని కరవాలానికి కలిపాను. ఐదునిమిషాలు పోరుజరిగినమీదట, ఆ యువకుడు సామాన్యమైన వాడుకాదని అర్థమైంది. నేవిసిరిన దెబ్బను కాసుకుంటూ, తిరిగికత్తిని విసురుతూ—ఒకటిరెండు పర్యాయములు నా కంఠమును తెగనరకబోయాడు—కాని నేను చాతుర్యంగా తప్పించుకుని తిరిగి దెబ్బతియ్యడం ఆయోధుడు కిందపడ్డాడు—అయినా వెంటనే తిరిగిలేచి, నాపై కత్తిని విసిరాడు. నేను తరుణంలో వొంగి కూర్చోడంవల్ల ఆదెబ్బ గాలిలో దూసుకుపోయింది. ఈసారి నేను మరింత ఉద్రేకంతో విజృంభించి మొదటిదెబ్బకు అతనిచేతి కరవాలమును పడగొట్టి, రెండోసారిదెబ్బ తియ్యబోగా ఆయోధుడు నేర్పుగా కాలితో కరవారము నందుకుని నాపై కురికాడు. అప్పుడు నేను మరొక గట్టిదెబ్బ తియ్యగా, యోధుడిచేతిలోని కరవాలం ఫర్లాంగుదూరాన పోయి పడింది, అతడు పరుగెత్తేలోపుగా మరోదెబ్బ కంఠానికి గురిపెడితే అది కొంచంతప్పి, అతని కిరీటాన్ని ముక్కముక్కలుగా చేసి కింద పడగొట్టింది.

ఆశ్చర్యం! అద్భుతం! అంతవరకు కిరీటం మాటునదాగివున్న సుదీర్ఘములయిన నల్లటికురులు శిరస్సునుంచి మోకాళ్ళవరకు చీరా

డుతూపడ్డాయి! తుమ్మెదరెక్కలవంటి ఆనల్లటికురులు కళ్లబడకపోతే, మరో విసురుతో శిరస్సు ఖండించి, స్త్రీహత్యాపాతకాన్ని చుట్టుకునే వాణ్ణి!

"నువ్వు స్త్రీవా? నేను స్త్రీహత్య చెయ్యను."

అని నాకరవాలమును కిందికి దించుకున్నాను. ఆనవయౌవ్వన సౌందర్యవతి, తాను కిందికి దించుకుంది. ఆసౌందర్యమును వర్ణించడానికి నాతరంకాదు. నల్లకలువలను ధిక్కరించే ఆకన్నుగవ—మేలిమిరంగు శరీరచ్ఛాయ—యోధుని వేషంలో వున్నప్పటికీ దాగక, పరిశీలించినవారి చూపుల కందుతున్న ఆచనుగుబ్బలు—ఇరవై యేళ్ల లోపు వయస్సులో అవతరించిన అప్సరస కన్యలాగున, తలదించుకుని నిలుచున్న ఆ సౌందర్యవతిని ఏమని పరామర్శించాలో నాకర్థం కాలేదు.

"స్త్రీవయివుండి ఏమిటీ సాహసం? ప్రియుని కౌగలించవలసిన చేతో కత్తిపట్టా వెందుకు? వలపుచూపులో పురుషజాతిని సమ్మోహితుల చెయ్యవలసి నీకళ్లాంట ఈరోషభీషణ జ్వాలాభీల లెందుకు? ఎండకన్నెరక్కుండా విలాసమందిరాలలో వలపుటుయ్యాల లూగవలసిన, నీకోమలతనూలతను కదనరంగ మెక్కించా వెందుకు? ఎవరు నువ్వు? నీపేరు?"

అని నేడగినవానికి కాసుందరి, కలిగిన అపజయానికో—స్త్రీసహజమైన సిగ్గువల్లనో, వంచినతల యెత్తకుండా—

"నాపేరు సుమబాల—సర్వసైన్యాధిపతి, తేజసింగుకు ఏకైక పుత్రికను."

అని చెప్పినదానికి నాకు తిరిగి ఆవేశం కలిగింది. తేజసింగు పేరు వినేటప్పటికి రక్తం ఉడికి పొంగడం మొదలుపెట్టింది.

"నీతండ్రి, తేజసింగు నాకు జన్మవిరోధి—తనకు నమస్కారం పెట్టలేదన్న దురహంకారంతో, నాతండ్రిని పనిలోనుంచి తొలగించి మా నోటిముందరికూడు పడగొట్టినవాడు. నాతల్లి శీలాన్ని పన్నెండు వరహాల కమ్ముకోమని సలహాయిచ్చిన ఆ ధనమదాంధుడి నాలుక కోయించకపోగా, అతన్ని కొట్టిన నేరానికని, నన్ను బంధించడానికి దళాలు పంపుతాడా? అంతటితో ఆగక, నాశిరస్సును ఖండించిన వారికి లక్షవరహాల బహుమానమని ప్రకటనలు చేయిస్తాడా? నా

విరోధి కూతురువైన నువ్వు నాశిరస్సు ఖండించడానికొచ్చి నాచేతులో చిక్కావు! నిన్నిప్పుడు శిరస్సు ఖండించినా—శీలభంగం చేసినా నన్నడ్డు పెట్టగలవారెవరు? ఛీ! నేనటువంటి క్షుద్రజాతి వీరుణ్ణికాదు—నిన్ను క్షమించాను—పో—పోయి ధీరమల్లు పౌరవప్రతాపాలు నీతండ్రికి చెప్పు—వాణ్ణి, వాడి దుష్టపరివారాన్నీ కూకటివేళ్లతో కూలదోసేవరకు ధీరమల్లు నిద్దరపోడని చెప్పు—''

అని నేన్నదాని కాకన్య తిరుగుచెప్పలేదు. వంచినతల నెత్తలేదు. జీరాడుతున్న కురులను ముడివేసుకోలేదు. మెల్లిగా నడిచి, తనగుఱ్ఱమున్న దగ్గిరికి పోయింది—దాని నధిరోహించి, మరికొంత సేపటికి నాకనుచూపులోంచి తప్పుకుంది. నేనున్నూ, జరిగిన సంఘటనకు వింతపడుతూ నాగుఱ్ఱమునెక్కి మరలిపోయాను.

సుమబాల యీప్రకారం తండ్రి పంపునవచ్చిందో—లేక తన స్వబుద్ధికి తోచివచ్చిందో—నాకు తెలియదు. కాని, తనకు జరిగిన పరాభవమును, నేనన్నమాటలను తేజసింగుకు తప్పక చెప్పివుంటుంది అటుపై తేజసింగు చెయ్యబోయే ప్రతీకారానికై నేనెదురు చూస్తుండగా, మరొకనాడు కొందరు పౌరులు, నువ్వు నాకీ అడవిలో తటస్థమైనట్లే—తిండికి ముఖంవాచి—ఎండదెబ్బకు వాడగొట్టి, నాకు కనుపించారు. సహజంగా, నేనటువంటివాళ్లు కనుపిస్తే జాలిపడతాను—వాళ్ళకి చెయ్యిపట్టినంత వుపకారం చేసిపంపుతాను. వాళ్ళప్పుడు సుమారు ఇరవైందుంటారు.

''మీరెవ్వరు? ఇలా యెక్కడికిపోతారు?''

అని నేను వాళ్ళ నడిగాను.

''మాది యమునానగరం బాబయ్యా! తేజసింగు మాయలోపడ్డ మారాజుకి మాఅజాపజా అక్కర్లేదు. తన భోగాలేమిటో—తన వుంపుడుగత్తెలేమిటో అంతే—మే మారాజ్యంలో బతకలేక—మరో దేశమెక్కడికయిన వలసపోవాలని బయలుదేరామండి! కడుపాకలి మండిపోతూంది—పైగా యెండదెబ్బ తిన్నాం.''

అని వాళ్లు చెప్పారు—నిన్ను తీసుకొచ్చినట్లే. వాళ్ళనీ పాకలోకి తీసుకొచ్చి కూచోబెట్టాను, కడుపునిండా భోజనమూ—పళ్లరసములూ యిచ్చాను. కొంత ధనంకూడా యిచ్చి—

"మీరు దేదేశమూ వలసపోవద్దు—మీరందరూ, తాత్కాలికంగా కలిగిన బాధలు తట్టుకోలేక, స్వదేశం వొదిలి పరదేశం పోయినట్లయితే, ఈరాజ్యం చాలా బలహీనమైపోతుంది. కొద్దికాలం ఓపిక పట్టి వుండండి—తేజసింగు పరిపాలన నశిస్తుంది—మీరందరూ సుఖపడతారు. అంతవరకు, అవసరమైనప్పుడు నాదగ్గిరికి రండి—వీలయినంత ధనసహాయం చేస్తుంటాను."

అని నేను చెప్పిందానికి వాళ్లు చాలా సంతోషించినట్లవుపించారు. అలా అవుపించినట్లే అవుపించి, అమాంతం లేచి నిలుచున్నారు తమ మొలలో భద్రపరుచుకున్న తిరుగుడు కరవాలాలను పైకితీసి, నామీద పడబోయారు. అప్పు డిదుగో—యీమీట నొక్కాను."

అని ధీరమల్లు తనుకూర్చున్న దగ్గిర కుడిప్రక్కగా అమర్చబడి వున్న ఒక మీటను విజయకుమారుకు చూపించి, తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

"నే నీమీటను నొక్కడమే తడువుగా, ఆ యిరవైమంది మోసగాళ్లూ, నిలుచున్నవాళ్లు నిలుచున్నపళంగా, భూమిలోకి దించుకుపోయారు. అలా దించుకుపోయినవాళ్లు, నారహస్య పాతాళ మందిరానికి చేరుకుంటారు. అక్కడ నాసిబ్బంది, వాళ్లని బంధించి, నా ఆజ్ఞలకోసం ఎదురుచూస్తుంటారు. ఇది పైకి ఒక శిథిలమైన గుడిసిలా కనుపిస్తుంది. కాని యిక్కడ నేను చేసిన నిర్మాణము ననుసరించి, దుర్భేధ్యమయిన ఏర్పాట్లున్నాయి. నువ్వూ నేనూ కూర్చున్న యీస్థలం నేలలా కనుపిస్తుంది కాని, నిజంగా నేలకాదు—ఇనపరేకు తాపడం. మీటనొక్కటప్పటి కారేకు కిందికి దిగిపోయి, నాపాతాళ మందిరం చేరుతుంది—ఇటువంటి పాతాళమందిరా లీఅరణ్యాలలో ఇరవైవరకు వున్నాయి.

అటుతరువాత, నేనుకూడా ఆవంచకులు పంపబడిన తావుకు పోయి చేరాను. నాసిబ్బందీచేత అందరూ బంధించబడివున్నారు.

"నన్ను వంచనచెయ్యడానికి మీకెన్నివేల గుండెలున్నాయి? మీరెవరు? నిజం చెప్పినట్లయితే మిమ్మల్ని క్షమిస్తాను—లేకుంటే, మీప్రాణలు మీకు దక్కవు."

అని నేను హెచ్చరించిన మీదట, వారిలో ఒకడన్నాడు—

"మీరు క్షమించినా క్షమించకపోయినా, మేము నిజమే చెప్పదల్చుకున్నాము. మేమందరమూ యశోనగర అపరాధ పరిశోధకులం. ప్రత్యేకం మీజాడలు తెలుసుకోడానికి దళాధిపతి, తేజసింగుచే నియోగించబడ్డవాళ్ళం—నీశిరస్సును ఖండించాలని వచ్చి, నీచే పరాభవించబడిన సుమబాల, జరిగిన విషయమంతా జీరాడుతున్న కురులతో తండ్రి దగ్గిరికొచ్చి చెప్పాకుంది. నీమీద అతను మరింత మండిపడుతూ—

"ఓరీ! ధీరమల్లూ! నీగుండెలు చీల్చి నీరక్తం తాగుతాను. నువ్వికనన్ను తప్పించుకుపోలేవు. అమాయకుల్ని దోచుకుని, అబలను జయించడం ప్రతాపంకాదు—ఇహచూసుకో నీతిప్పలు—" అని గర్జించాడు. సుమబాల అతని గర్జనలు విని సంతోషపడలేదు.

"తండ్రీ! ఒక సంవత్సరం గడువు—ఈగడువులోపున ధీరమల్లు హతుడైనా కావాలి—లేదా, నేనతన్ని వివాహమయినా చేసుకోవాలి—ఇది నా నిర్ణయం. రెంటిలో ఏదో ఒకటి జరిగేవరకూ, ఆ ధీరమల్లు ప్రతాపంవల్ల, విడి జీరాడుతున్న నాకురులను నేను ముడివేసుకోనేదిలేదు! ఇదే నాప్రతిజ్ఞ." అంది.

"ఛీ! రెంటిలో మొదటిదే జరిగి తీరుతుంది. సంవత్సరంలోపుగా నేను వాడిని హతమార్చకపోతానా, చూదువుగాని."

అని తక్షణం, అప్పుడక్కడనే వున్న నాతో—

"చూశావా, ధీరమల్లు పొండగాలు? అతని జాడలు తెలుసుకోడానికి నియమించబడ్డ మీరాయిరవైమంది పరిశోధకులూ తక్షణం బయలుదేరాలి. కనీసం, వాడి నివాసమైనా తెలుసుకురండి—నేను నాసర్వసైన్యాలతోనూ పోయి, ముట్టడి చేస్తాను."

అని అపరాధ పరిశోధక దళానికి నాయకుడనైవున్న నాతో చెప్పగా, నేను నా అనుచరులతో బయలుదేరి, ఎనిమిదిరోజులు ప్రయత్నంచేసి, తొమ్మిదోనాడు నిన్ను కలుసుకోవడము—ఈ విధంగా నీచేత బంధించబడడము జరిగింది."

అని అపరాధ పరిశోధక శాఖకు చెందిన నాయకుడు చెప్పగా విని నేను—

"ఓహో! సుమబాల ఎటువంటి విచిత్రమైన పంతం పట్టింది? సంవత్సరంలోపున నన్ను హతమార్చడమో—లేక తాను నన్ను

వివాహాహాడడమో జరగాలనటనా? బాగుంది! నా చేత పట్టుబడ్డ మీాకు మరణశిక్షన లేకుండా చేస్తున్నాను. కాని మిమ్మల్ని వొదిలి పెట్టను—మీారు నాఖయిదీలుగా వుంటారు.''

అని నేను వారికి చెప్పి, అనంతరం యివతలికొచ్చాను. విజయ కుమారా, విన్నవుగదా సుమబాల ప్రతిజ్ఞ? నేను ఇంతవరకు చేజిక్కిన వారిలో ఒక్కరినికూడా చంపలేదు. అందరినీ క్షమించి వొదిలిపెట్టాను. ఈ అపరాధ పరిశోధకులు ఇరవై మందినీకూడా వొదిలిపెట్టవలసిందే కాని, వారికి నా నివాసము—నారహస్య పాతాళ మందిరము తెలిశాయి. వాళ్ళని విడుదల చేసినట్లయితే, నారహస్యా లన్నీ తేజసింగుకు తెలుస్తాయి. ఎప్పుడయినా సరే—నాకు బయట ఎక్కడయినా సరే, లొటస్థమైన శత్రువులను క్షమించి వొదిలిపెడ తాను. నానివాసము, నారహస్యాలు తెలుసుకొన్నవారిని మాత్రం, పాతాళమందిరంలో బంధించి పడేస్తాను. ఆ ప్రకారం నానివాసమును తెలుసుకుని, నాచేత బంధించబడిన అపరాధ పరిశోధకులు ఇప్పటికి రెండువందలమంది వున్నారు. తనచేత నియోగించబడిన పరిశోధకు లలో కొందరు తిరిగి రాకపోవడమును గమనిస్తున్న తేజసింగు, వారు నాచేతులలో హతులయ్యారో—బంధించబడివుంటారో అని ఊహించు కుని వారి స్థానాలలో ఎప్పటికప్పుడు, కొత్తవారిని నియమిస్తున్నారు. అపరాధపరిశోధనలో నిపుణులయినవారిని యితర దేశాలనుంచి కూడా రావిస్తున్నాడు.

తేజసింగుకు స్వయంగా ఒక గుణపాఠమును చెప్పాలని బుద్ధి పుట్టిందినాకు. అతని కొక ఉత్తరము నిలా వ్రాశాను—

''యమునాగర ప్రధానసేనాని,

తేజసింగుకు—ధీరమల్లు వ్రాసేది ఏమనగా—

అమాయకుడయిన దత్తాత్రేయ మహారాజును వశంచేసుకుని, నువ్వే సర్వాధికారాలూవహించి రాజ్యపాలన చెయ్యడం సంతోషించ దగిన విషయమే—కాని స్వార్థపరుడవై నీధనాగారాలు నువ్వే నింపు కోవడం సహించరాని విషయం. నీపాలనలోని ప్రజలు కూడుగుడ్డలకు కరువుపడి మలమల మాడిపోతున్నారు. ఎందరు పత్తేదారులను నియ మించినా—ఎన్నిలక్షల వరహాలు బహుమానమిస్తానని ప్రకటించినా నన్ను పట్టుకోవడం నీతరంకాదు. రేపు పగలు మూడుగంటల

మధ్యాహ్నంవేళ—నీమందిరానికొచ్చి నిన్ను దోచుకోబోతున్నాను. కనుక తగుజాగ్రత్తలో వుండు—

ఇట్లు,
ధీరమల్లు."

ఉత్తరమునయితే వ్రాశాను. కాని దాన్ని తేజసింగుకు ఎలా అందజెయ్యాలి? నా అనుచరులలో ఎవరయినా తీసుకుపోయి ఏదో వుపాయంవల్ల తేజసింగుకు అందజేసి, అతనికి పట్టుబడకుండా తిరిగి రాగలరు. కాని నేనే స్వయంగా అందజెయ్యాలని పట్టుదల. ఒక క్షత్రియునిగెడ్డాన్నీ, మీసాన్నీ తగిలించుకున్నాను. తెల్లటి పాగా చుట్టాను. ఒక సిక్కు దేశస్థుడిలా వేషం మార్చాను. ఎందుకంటే, యశానగర మప్పుడప్పుడు కొందరు సిక్కులు వ్యాపారనిమిత్తంవచ్చి పోతుండడం కద్దు అందుకనే నేనావేషం వేసుకున్నాను. నాగుఱ్ఱము నెక్కి యశానగర సరిహద్దులోవున్న కొండప్రాంతంమీద సంచారం చేస్తున్నాను. అక్కడ తిరగడంలో వుద్దేశముందిగాని, అనవసరంగా కాదు. ఆకొండవరసల కానించి ఒక ఉద్యానవనముంది. ఆవనంలోకి ప్రత్యేకంగా సంస్థానానికి చెందినవారు మాత్రమే ప్రతిసాయంకాలం వస్తుంటారు. మహారాజు, మంత్రులు, సేనాని, ఇతర రాజోద్యోగుల కోసమే యేర్పడిం దావుద్యానవనం. ఒక్కొక్కప్పుడు సుమబాల కూడా తండ్రితో కలసి వస్తుంటుందని నాగూఢచారులవల్ల అంతకు ముందే తెలుసుకొనివున్నాను. ఎవరొస్తున్నారో—యెవరు వెడుతున్నారో నేను కొండపై నిలిచి పరిశీలిస్తుండగా తేజసింగు ఆవుద్యానవనంలో యెప్పుడు ప్రవేశించాడో చూడలేదుగాని, గుఱ్ఱమెక్కి వెళ్ళిపోతుండడం మాత్రం గమనించాను. ఉత్తరమందుకోడానికి సరియైన మనిషి చిక్కాడని సంతోషపడుతూ, తక్షణం నాదగ్గిరున్న వుత్తరాన్ని ఒక బాణానికికట్టి, గురిచూసి, సూటిగా దాన్ని అతని కిరీటానికి గుచ్చుకునేలా వొదిలి, నేను కొండపల్లంలోకి దిగి తొంగి చూశాను. వాడిబాణం తన కిరీటానికి గుచ్చుకోడమే తడువుగా విభ్రాంతుడై చటుక్కున గుఱ్ఱము నాపాడు. తలపైకెత్తి నాలుగువయిపులా పరికించాడు. ఎవరు కనుపిస్తారు? నాబాణమును లాగి, దాని కతికించబడిన ఉత్తరమును తీసి చదువుతున్నా సమయంలో, నేను కొండదిగి, నాగుఱ్ఱము నెక్కి ఉడాయించబోతుండగా-

ఆ ప్రాంతంలోగల ఒక వ్యవసాయదారు, పరుగు పరుగున వచ్చి, నాగుఱ్ఱపు కళ్లెమును పట్టుకున్నాడు.

"ఏయ్! ఈగుఱ్ఱమునాది-ధీరమల్లు అపహరించుకు పోయాడు." అన్నాడు.

నేను విషయము నర్థంచేసుకుని—

"ధీరమల్లునే అడుగు—గుఱ్ఱంమీద చెయ్యివేశావంటే మాట దక్కదు—"

అని నేను బెదరించగా వాడు వెనక్కుతగ్గాడు. నేను వెంటనే గుఱ్ఱమెక్కి వాడి పిలుపు కందకుండా పరుగెత్తాను.

ఎప్పుడో మా అమ్మదగ్గర ఆ గుఱ్ఱాన్ని కొన్నవాడు వాడే అయివుంటాడనీ—గుఱ్ఱాన్ని చూడగానే గుర్తుపట్టి వచ్చాడనీ— నువ్వుకూడా వూహించివుంటావు. నాప్రాణమైనా వొదుల్తాగాని, మాకుటుంబాన్ని రక్షించిన ఆ గుఱ్ఱాన్ని వొదుల్తానా?"

అని ధీరమల్లు విజయకుమారుడితో తనగాధను చెబుతున్న సమయంలో, అతని అనుచరులు కొందరువచ్చి—

"ప్రభూ! నూరు బండ్లధాన్యము—ఏభై బండ్లు గోధుమలు కొల్ల కొట్టాము—ఆ బండ్లన్నీ యబానగరంనుంచి, ప్రతాపనగరం పోతు న్నాయి, ప్రతాపనగర వర్తకులు, తమ దేశంనుంచి తెచ్చిన కాయి తం బొమ్మలను యబానగరంలో విక్రయించి, ఆధనంతో ఈ ధాన్య దినుసులుకొని, తమదేశం తోలించుకుపోతున్నరట—మార్గంలో మన సిబ్బంది వాటిని వశంచేసుకున్నారు, వాటి నిప్పుడెక్కడికి తోలించ మని శలవు?" అని అడిగారు.

"ధాన్యం బస్తాలు మామిడిపల్లెకు గోదుమబస్తాలు అపరంజి గ్రామానికి చేర్చి, అక్కడి ప్రజలకు పంపకం చేయించండి."

అని ధీరమల్లు చెప్పినప్రకారంగా చెయ్యడానికి అతని అను చరులు వెళ్లిపోయారు.

"విజయకుమారా! ఈ విశేషమునుకూడా నీకు చెప్పవలసి వుంది. ఈ దేశపు ప్రజలు తిండికిగింజలులేక మలమల మాడిపోతుంటే, ఇతర దేశీయులు వచ్చి, వర్తకం పేరుతో ఇక్కడి పంటను తోలించు కోవడం ఎంత ధర్మంగావుందో ఆలోచించు. ఇందువల్ల నా సిబ్బందీలు నగర సరిహద్దులచుట్టూ, అక్కడ కాసివుండి, ఇక్కడిపంట యితర

దేశములకు పోకుండా, వశంచేసుకొంటారు. దానిని అన్నార్తులకు సరాపరాచేసి, ఆహారకొరతను కొంతయినా తగ్గిస్తారు. ఇటువంటి పనులన్నీ ప్రభుత్వం చెయ్యాంవలసింది లేదా? వారు సక్రమంగా చేస్తే నేనెందుకు కలుగజేసుకుంటాను.

## ౩౬

తేజసింగుకు ఉత్తరంలో రాసినప్రకారం, మర్నాడు మధ్యాహ్నం మూడుగంటలకు లోపుగానే బయలుదేరాను. ఎలా బయలుదేరానో తెలుసా? మళయాళదేశపు జ్యోతిషపండితుడి వేషం వేసుకున్నాను. ఒకజలతారు తలపాగా, పైన ఒక కాశ్మీరుశాలువా-ముఖాన గంధాక్షతలు—పెద్ద బవిరిగెడ్డము—వాలుడు మీసాలూ—నేనప్పుడు సరిగా మళయాళపు జోతిషపండితుని లాగానే వున్నానని, నా అనుచరులు చెప్పిన మీదట, నేను నేరుగా దత్తాత్రేయ మహారాజుండే, కోటకుపోయి చేరుకున్నాను. అక్కడి కావలివారు నన్నాపుచేయగా-నేను మళయాళదేశపు జోతిషపండితుడననీ—మహారాజుల దర్శనం కోరి వచ్చాననీ చెప్పగా, వారు లోనికిపోయి, నా సమాచారమును తమ ప్రభువుకుచెప్పి, తిరిగి నాదగ్గరకొచ్చి—

"ప్రభువుల శలవైంది—దర్శనానికి రావచ్చు—"

అని చెప్పారు. అప్పటికి సగంపని జరిగినట్టే సంతోషపడుతూ నేరుగా మహారాజుగారుండే దగ్గరికి గొనిపోయబడ్డాను. నేనాయన్ను చూడడం అదే మొదటిసారి, మానాయన అక్కడి సైన్యాలలో పనిచేస్తున్నప్పుడు కొన్నిసార్లు కోటకు వెళ్లాగాని, మహారాజు దర్శనం ఎప్పుడూ కాలేదు. ఏభై యేళ్ళకుపై దాటిన వయస్సులో స్ఫురద్రూపి—బలాఢ్యుడు. నేను వెళ్లేటప్పటి కాయనదగ్గర, సుమారు పద్దెనిమిదేళ్ళ యీడుగల యువకుడొకడు, రాకుమార చిహ్నాలతో వున్నాడు, అతనే యువరాజై వుంటాడని ఊహించుకుని—

"ప్రభువులకు నమస్కారాలు—" అన్నాను.

"కూర్చొండి."

నేను కూర్చున్న తరువాత—

"మీరు మళయాళదేశపు జ్యోతిషపండితులా?"

"చిత్తం."

"మా ఆంధ్రభాష బాగా మాట్లాడతారు."

"చిన్నతనంలోనే యీ దేశ మొచ్చెయ్యడంవల్ల—"

"రేఖలు పరిశీలించి సాముద్రికం చెప్పగలరా?"

"అందులో ప్రత్యేక నిపుణత సంపాదించాను."

అని నేను చెప్పగానే, మహారాజు తన చెయ్యిని నాకందిచారు.

"తమరు భోగపురుషులు—తమకు కళత్ర నష్టమైనది-ఏకైక పుత్రుడు—అయినా మీకు మించిన ప్రతిభాశాలి—కీర్తివంతుడు, కాగలడు. మీకు రాచకార్యముల యందుగాని, రాజవిస్తీర్ణము నందుకాని, కాంక్ష లేదు. దేశమిప్పుడు అరాజకమై, అల్లకల్లోలంగా వున్నందుకు, తమరిప్పుడు కొంత స్థిమితం చెడివున్నారు."

అని నా చేతికముందు తెలిసిన విషయములన్నింటినీ ఏకరవు పెట్టేటప్పటికి మహారాజు విభ్రాంతుడై, అదంతా నా పాండిత్య మేనని నమ్మాడు.

"దేశమరాజకంకావడానికి కారణమేమిటి?"

అని యువరాజు నన్ను తెలివిగా ప్రశ్నించాడు.

"దొంగలబాధ కొంత—వారి నరికట్టలేని సైన్యాధిపతి అశక్తత కొంత, దేశంలో అశాంతి కారణమైంది."

అని నేను చెప్పగా—

"ఈప్రకారం యింకా యెంతకాల ముంటుంది?"

అని మహారాజు తిరిగి అడిగాడు.

"ఏడాదికిలోపు—ఆతరువాత, సర్వం చక్కబడగలవు."

అని నేను చెప్పినదానికి రాజ యువరాజులిద్దరూ ఎక్కువగా సంతోషించారు. నియమించుకొన్న కాలం దాటిపోతున్నదని నేను ఖంగారుపడుతుండగా, మహారాజు లేచి—

"రండి—మీకు మా సైన్యాధిపతితో పరిచయం చేస్తాను."

అని మహారాజు అన్నాడు గనక సరిపోయింది, లేకుంటే నేనే ఆకోరిక కోరవలసివుండేది. మహారాజప్పుడు నన్ను స్వయంగా వెంట బెట్టుకొని, ఆ చేరువలోనే వుండే తేజసింగు మందిరానికి తీసుకొని పోయాడు. అప్పుడు తేజసింగు తన మందిరంచుట్టూ చేసిన బందోబస్తుకు నాకు చాలా ఆశ్చర్యంకలిగింది. అడుగు కొక యుద్ధభటుడు—భటునికి రెండేసికత్తులు—ఆ రెండుకత్తులూ చాచి కత్తులబోనులాగ

అమరివున్నారు, ఈగకూడా లోపల చొరడానికి అవకాశంలేనంతటి బందోబస్తు చెయ్యబడి వుండడం గమనించాను. మహారాజు మందిరానికీ, సైన్యాధిపతి మందిరానికీగల ప్రత్యేకమార్గంగుండా నేను గొనిపోబడ్డాను. సుమారు నూరుగురు ఖడ్గపాణులైవున్న అంగరక్షకులమధ్య తేజసింగు కత్తిని చేతధరించి అమీరుగా కూర్చున్నాడు! తానవరికీ ప్రవేశంలేకుండా వుండాలని అంత బంధోబస్తు చేశాడో, ఆ ధీరమల్లు స్వయంగా మహారాజుచేత తన సాన్నిధ్యంలో చేర్చబడ్డాడని ఆ మూర్ఖుడికేం తెలుసు?''

అతడాదినం చేసిన సైనిక యేర్పాట్లు మహారాజుకు సయితం అమితమయిన ఆశ్చర్యమును కలిగించాయి. తన్ను చూచిన వెంటనే సవినయంగా లేచి నిలుచుని నమస్కరించిన తేజసింగును—

''ఈదినమేమిటి విశేషము? రాజధానిలోని సైనికదళాలన్నీ మనమందిరం చుట్టూ పహారావుండడానికి కారణమేమిటి?'?

అని మహారాజడగ్గా—

''ప్రభూ! అందుకొక ప్రత్యేక కారణముంది—దానిని తమకు తరువాత మనవి చేసుకుంటాను.''

అని తేజసింగు చెప్పినమీాటట, మహారాజందును గురించి తిరిగి ప్రశ్నించక. నన్ను తేజసింగుకు చూపి—

''వీరు మళయాళదేశపు జ్యోతిషపండితులు—నా రేఖలు చూచి, విషయములు బహుచక్కగా చెప్పగలిగారు. కనుకనే నీ దగ్గరకు తీసుకొచ్చాను, నువ్వూన్నూ కొన్ని ముఖ్యవిషయములడిగి తెలుసుకోవచ్చు—తెలుసుకుని, వీర్ని తగినరీతి సత్కరించి, పంపవలసింది.

అని, మహారాజు నన్ను తేజసింగుదగ్గర వొదిలి, తాను వెళ్ళిపోతున్నసమయంలో మహారాజుతో నాలుగడుగులు, నడిచి సవినయంగా—

''ప్రభూ! పరదేశీయుణ్ణి కనక భయపడుతున్నాను. విచ్చుకత్తులతో నిలిచిన సిపాయిల నింతమందిని నేనెప్పుడూ చూడలేదు. ఇంత బందోబస్తు, యిన్ని విచ్చుకత్తుల పహారాలూదాటి, నేను తిరిగి వెలుపల కెలా దాటగలను?''

అని భయము నభినయిస్తూ అడిగాను. దానికి మహారాజు నవ్వి—నాభుజంపై తట్టి—

"నీకేం భయంలేదు—ఇదుగో! ఈ ముద్రికను దగ్గిరవుంచుకో—నిన్నెవరూ పలకరించరు—నీ యిష్టమొచ్చినప్పుడు సురక్షితంగా బయటికి పోవచ్చు—"

అని తనదగ్గరున్న ఒక ముద్రికను నాకియ్యగా నేను దానిని భద్రపరుచుకుని, మహారాజుకు నమస్కరించి, తిరిగి తేజసింగు దగ్గర కొచ్చి నమస్కరించగా—అతను నన్ను కూర్చోనియమించి, తన చేతిని నాకందించి—

"నాకు వ్యవధిలేదు, అయిదునిమిషాల్లో మీరు చెప్పగలిగిందాన్ని చెప్పి వెళ్ళిపొండి—"అన్నాడు.

"తమ రిప్పుడొక గొప్ప చిక్కులో వున్నారు."

అని నే ననేటప్పటికి తేజసింగు తెల్లబోయాడు, నేను తిరిగి చెప్పాను—

"తమకు ప్రాణభయ మెంతమాత్రమూ లేదు—తమరే శత్రువును గురించి యింత బందోబస్తు చేసుకుని, జాగ్రత్తతో వున్నారో—ఆశత్రువు రానేవచ్చాడు-తనపని తాను నెరవేర్చుకునే వున్నాడు."

అని నేను చెప్పడంతోనే తేజసింగు రౌద్రాకారమును దాల్చి-కత్తి ఝుళిపించుకొంటూ, నిప్పుతొక్కిన కోతిలాగ ఖంగారు పడుతూ-

"ఆఁ! వొచ్చాడా! ఏడీ? యెక్కడ? ఓరీ ధీరమల్లూ! నిలునిలు-నీకంఠము నిప్పుడే నానిసిత కరవాలాని కెరచేస్తా—"

అని ఆచోటునుంచి పరుగెత్తాడు—

"పట్టుకోండి—నరకండి—వొదలకండి—"

అని గర్జించుకొంటూ సైనికదళాలో కురికేటప్పటికి, మందిరంలోవున్న అశేషజనం అతని ననుసరించి బయటపడ్డారు. మందిరం ఖాళీ! సైనికదళాలన్నీ చెల్లాచెదరై—ధీరమల్లును పట్టడానికి కొట్టుమిట్లాడుతుంటే—అసలు ధీరమల్లు మందిరంలోనే వుండి ఖజానా చక్కబెడుతున్నాడని, వారికేం తెలుసు? నవరత్నఖచితాదులయిన కొన్ని విలువగల ఆభరణాలను, బంగారు నగాలను, రెండు పెద్ద మూటలుకట్టి, వాటితో భవన ఉపరిభాగం చేరాను. ఎందుకయినా మంచిదని, నా అనుచరుల కొందరను అంతకుముందే, భవనానికి

వెనుకతట్టున యవనానగర సిపాయిల దుస్తులతో వారితో కలసివుండే లాగ ఏర్పాటు చేశాను. సైనికులందరూ ఎవరిమట్టుకువారు చెలా చెదరై వుండడంవల్ల, నా అనుచరులు మాత్రం గుఱ్ఱాలమీద తయారుగా వుండడం గమనించి, సమయం కనిపెట్టి, నేను కట్టిన మాటలను వారికి విసిరాను—నేనున్నా నేర్పుగా, ఒక గుఱ్ఱంమీద కురికాను. గుఱ్ఱాలమీద పడితే, నన్నుగాని నా అనుచరులనుగాని పాలాక్షుడు పట్టలేడు—ఆ గుఱ్ఱాలకు, ఆ రౌతులకు ప్రత్యేకమైన తరిఫీదు—కొండలు యెక్కడంలో కొండలు దిగడంలో, భూమండలంలో మమ్మలిని ఎవరూ మించలేరని చెప్పకోవచ్చు.

యవనానగర సైనికదళాలు జ్యోతిషుని మాటలు నమ్మి ధీరమల్లుని పట్టడానికి పరుగులెత్తుతూనే వున్నారు—కాని అసలు ధీరమల్లు రెండురకలలో యవనానగరం సరిహద్దులు దాటిపోనేపోయాడు. రాజకుమారా! వింటున్నావుకదా!

అని ధీరమల్లు మధ్యలో హెచ్చరించగా—

"సరి—సరి—ఇంత ఉత్సాహపూరితమైన గాథను వినకుండా యెలా వుంటాను. ఇతర ఆలోచనలన్నీ మాని, బహుశ్రద్ధగా వింటున్నాను."

అని విజయకుమారుడు చెప్పగా, ధీరమల్లుకూడా మరింత ఉత్సాహంతో తన గాథను తిరిగి యీవిధంగా చెప్పడం మొదలు పెట్టాడు.

"మందిరంలోని ధనము—వజ్రవైడూర్యాది వెలలేని సొమ్ములు అపహరించబడడము—తాము తిరిగి వచ్చేటప్పటికి, మందిరమంతా చిందరవందర అయిపోవడము—జ్యోతిషపండితుని వేషంలోవున్న నేను మాయంకావడము—ఈవిపరీతాలను గురించి—తేజసింగు—మహారాజు, ఏమిగా అనుకుంటున్నారో తెలుసుకుకావలసిందని, అప్పటికప్పుడే సమర్థులైన నాగూఢచారుల్ని కొందర్ని నియోగించాను.

వారు తిరిగి చెప్పిన సమాచారమును బట్టి, నేను వెళ్ళి తేజసింగు మందిరాన్ని దోచుకున్న విషయం వారు వెంటనే గమనించారు గాని, అది యేవిధంగా జరిగిందీ తెలుసుకోలేకపోయారని—జ్యోతిష పండితుని విషయంలో అనుమానమే కాని, ఇదమిద్ధమని నిర్ణయించలేక పోయారనీ—తరువాత, మహారాజు, తేజసింగు అవివేకానికీ,

ఇంతవరకు నన్ను పట్టలేని అసమర్థతకూ, ముఖంవాచేటట్లు చివాట్లు వేశాడనీ—దేశమంత అల్లకల్లోలమైపోతుంటే—అన్నివేల సైనిక దళాలు—అందరు అపరాధపరిశోధకులూ ఏం చేస్తున్నారనీ—పట్ట పగలు, పైగా ముందుగాచెప్పి, తనమందిరాన్ని దోచుకున్న వానిని పట్టలేకపోవడం కేవలం చేతకానితనమని, మహారాజూ అతనితో కలిసి యువరాజూకూడా, తేజసింగును అనేకవిధాల నిందించారనీ—అందుకు ఫలితంగా తేజసింగు పౌరుషం తెచ్చుకుని, నన్ను పట్ట డానికి తానే స్వయంగా బయలుదేరబోతున్నాడనీ—యువరాజు కూడా బయలుదేరవచ్చునని— తెలిసింది.

అందువల్ల నేనుకూడా కొంచెం జాగ్రత్తలో వుండవలసిన అవసరం కలిగింది—మనమిప్పుడు కూర్చున్న యీపాక, దీనికి సంబంధించిన నా రహస్యమందిరం ముందు సంరక్షించుకోవలసివుంది. ఏమంటే, నేను దోచుకొచ్చిన ధనమంతా, యిక్కడే భద్రపరుపబడి వుంది-అంచేత యీ గుడిసెను తీసివేశాను. నేలమాదిరిగా అమర్చ బడిన యినపరేకును మాత్రం ఈ ప్రకారమే వుంచాను. పైన కొంత గడి, ఆకులు మొదలయివాటిని పడేస్తే—ఇది నేలగానే కనపడుతుంది గాని, లోపల పాతాళమందిరం వున్నట్లు—అక్కడ నా సిబ్బందీ వున్నట్లూ యెవరికీ తెలీదు. నానివాసాన్ని యశాననగరానికి మార్చే శాను, రాజధానిలోనేవుండి, ఎప్పటికప్పుడు శత్రువుల విశేషాలు తెలుసుకోవచ్చునని నా ఆలోచన. నగరంలో చిన్న గాజుల దుకాణ మొకటి పెట్టాను. ఎందుకంటే, మొగవాళ్లతో యెటువంటి సంబం ధమూ వుండదు. నా దగ్గిరికి మొగవాడెవరు వస్తే వాణ్ణి అనుమా నించవచ్చు, నాదుస్తులు రూపముకూడా ఆ వ్యాపారానికి సరిపోయే టట్లు మార్చేశాను. ఆదుకాణమయినా, మారుమూలల్లోగాకూండా, యశాననగర రాజవీధిలోనే పెట్టాను.

ఇంతకాలమూ, మా అమ్మకుచేసిన వాగ్దానం ప్రకారం, వారానికొకసారి అపరంజిపల్లె పోయి వస్తున్నాననీ, అక్కడ అమ్మకీ చెల్లాయిలకూ, ఎటువంటి లోటురాకుండా, ఆ కుటుంబానికి అవసర మైనంత ధనంచేర్చి, వాళ్ళదరిద్రం పోగొట్టాననీ—నీకు చెప్పడం మరిచాను. నేను చేస్తున్న వుద్యోగం మా అమ్మకిగాని, మా తాత య్యకుగాని, పూర్తిగా తెలియదు. నా శిరస్సుఖండించిన వారికి లక్ష

వరహాలబహుమానం ప్రకటించబడ్డదంటే—అది సేనానాడు వడ్డీ వ్యాపారస్తునికొట్టి, అతని శరీరమంతా రక్తమయం చేసినందుకే నని వారివుద్దేశం! వివరాలు తెలుస్తే మా అమ్మ నన్నుదారిస్తుంది. అందువల్ల వారిని ఆస్థితిలో నేవుంచాను. వారాని కొకసారి ఆయింటికి పోయి చూడ్డమే వాళ్ళకి కావలసింది. కొందరు అపరాధపరిశోధకులు—రక్షకభటులు—మా తాత్యయగారి వూరు వెళ్లితే వివరాలను గురించి అడుగుతే, తమకేమీ తెలియలేదని చెప్పడ మొక్కటిమాత్రం తెలుసు.

సరి—ఇక నాగాజులవ్యాపారం సంగతి—రకరకాలు గాజులు తెచ్చి, రాజవీధికి నట్టనడాన దుకాణం మోపుచేశానని చెప్పాగా—ఒక వృద్ధవ్యాపారస్థుడిలాగ, పెద్దగెడ్డము—పట్టె వర్ధనాలు పెట్టుకొని దుకాణంలో కూచోడము—రామభక్తుడిలాగ ఎప్పుడూ—'శ్రీరామ రామ' అని జపం చేస్తుండడము—ఒక్కొక్కప్పుడు నాలో నాకే నవ్వొస్తుండేది. వయసుమళ్ళిన ముసలాణ్ణి—పైగా రామభక్తుణ్ణి—అందువల్ల, నగరస్త్రీలు—కోటదాసీలు—అందరూ నా దగ్గిరికి గాజుల కోసం సంకోచంలేకుండా వస్తుండేవారు. వీలయినంతవరకూ కోటలోని భోగట్టాలడిగి యుక్తిగా తెలుసుకుంటుండేవాడిని. అలా తెలుసుకున్నవాటిలో—తేజసింగు, యువరాజు అశ్వనీకుమారు, నన్ను పట్టుకోడానికి సర్వసన్నాహాలతో నగరంవొదిలి బయలుదేరారని తెలిసింది. ఒళ్లోబిడ్డను పెట్టుకుని, వూరంతా వెతకడమంటే యిదేగదా! యశానగర రాజవీధిలో శివినీవేసుకున్న ధీరమల్లును వొదిలి—అడవులూ కొండలు, వెతకడానికి బయలుదేరారు వీరులు! నా రహస్యమందిరాలనుంచి కూడా యెప్పటికప్పుడు వార్తలొస్తుండేవి.

ఇలావుండగా ఒకనాడు, కోటలోనుంచి ఒకదాసీ గాజుల కేరానికొచ్చింది. అంతకుముం దాదాసీ నాదుకాణందగ్గిరికొచ్చి గాజులుకొన్నది. ఇప్పుడు తిరిగివచ్చి—

"తాతా! కోటకురాగలవా?" అని అడిగింది.

"ఏం వొస్తానుపిల్లా! ముసిలాణ్ణి—ఈ గాజులన్నీ మోసుకుని కోటకురాగల్నా?"

"వచ్చేవంటే—ఎక్కువ గాజులు ఖర్చవుతాయి—మాసుమబాల, రాజాగారిదాసీలూ, అందరూ తొడిగించుకుంటారు."

"నువ్వెవరి దాసీవి?"

"నేను సుమబాలదాసీని."

"సుమబాల అంటే యెవరూ?"

"సేనాధిపతి తేజసింగుకూతురు! వీరమల్లును చంపడమో—పెళ్లాడ్డమో జరుగుతేగాని జుట్టుముడేసుకోనని పంతపట్టిన వీర కుమారి.'

"అలాగా? వీరమల్లెవరూ?"

"చిన్నపిల్లాడికూ—డా తెల్సు! వీరమల్లుపేరే విన్లేదా తాతా! వాడో గజదొంగ—దేశంలోవుండే భాగ్యవంతుల్ని దోచుకుంటూ, పాలాతుడికి పట్టుపడకుండా తిరుగుతున్నాడు. వాడిశిరస్సు ఖండించిన వారికి వెయ్యివరహాలు బహుమానమనికూడా, మహారాజులు ప్రకటించారు—అగొడవంతా మనకెందుగ్గానీ—గాజులట్టుకొని కోట కొస్తావా రావా?"

"గాజులగంపను నువ్వెత్తుకుంటే-నేను మెల్లిగా నడిచివొస్తా."

"సరే—పద."

అని ఆదాసీ చెప్పినమీాదట, నేను కొన్నిగాజుల నోగంప నిండా అమిర్చి—ఆగంప నామె నెత్తిమీాదపెట్టి, మెల్లిగా ఆమెతో వెళ్లాను. అది మొదట నన్ను తేజసింగు మందిరానికి తీసుకెళ్ళింది, సుమబాల నాకెదురుగా వచ్చింది. ఆనాడు కాళికామ్మవారి గుడిదగ్గర నాతో పోరినప్పుడు విడివడ్డ ఆమె కుమరులు అదేవిధంగా మోకాళ్ల వరకూ జీరాడుతుండడం చూశాను. సుకుమారి అనవసరంగా బాధ పడుతున్నదే అని నాలో నేను విచారిస్తూ దాసీ నెత్తిమీాది గాజుల గంప దించాను.

"చాలామంచి గాజులున్నాయే." అన్నది సుమబాల.

"అందుకేనండి, ముసలాడు రాలేనంటే, బలవంతంచేసి, తీసు కొచ్చా, ఆమె తనకు నచ్చిన గాజులేరుకుంది—

"జుట్టుముడేసుకో రాదాండమ్మా?"

అని, నేనేమీా తెలీనట్లు ప్రశ్నించాను.

"ఈ జుట్టుకీ ఇంకో ఆరుమాసాలు వ్యవధివుందిలే తాతా! అప్పటికి అటోయిటో తేలిపోతుంది. నేను జుట్టు ముడేసుకుంటాను." అంది నవ్వుతూ.

"అంటే, యేమయినా వ్రతమాండీ?"

"ఆఁ! ఆఁ! వ్రతమే, ధీరమల్లు చావడమో—నేను వాణ్ణి పెళ్లాడ్డమో—అప్పటి కేదో ఒకటవుతుంది."

"ధీరమల్లు! వాడెక్కడ చస్తాల్లెండీ?"

"చావకపోతే నేను వాణ్ణి పెళ్ళిచేసుకుంటా."

"వాడొప్పుకోవొద్దండీ!"

"ఒప్పుకోపోతే—వాడి పాదాలదగ్గిర పొడుచుకుని నేను చచ్చిపోతా."

"ఓ యబ్బో! మాగొప్పపంతం పట్టారు బుల్లెమ్మగారు."

అని నేనంటే—

"ఆ గొడవంతా నీ కెందుకులేగాని, ఈగాజుల కెంతయిందో చెప్పు—"

అని దాసీ నడిగింది.

"అనేకసార్లు మాకొట్టుకొచ్చావు—ధర్లు నీకే తెలుసు."

అని నేననగా—

"వాడికి, అయిన డబ్బిచ్చి పంపవే—"

అని చెప్పి, సుమబాల తనకు కావలసిన గాజులు పట్టుకొని, లోపలికెళ్ళిపోయింది. ఆ గాజు లేరుకోవడంలో సుమబాల చేతి వజ్రపుటుంగరమొకటి వ్రేలినుంచి జారి, గాజులగంపలో పడ్డది—అది నేను తప్ప యింకెవరూ గమనించలేదు. దాసీ యిచ్చిన డబ్బు తీసుకుని నామార్గాన నేను వచేస్తూ—

"ఇంకా చాలా గాజులు ఖర్చవుతాయంటివే!"

అని నేను దాసీ నడిగా—

"అలా అంటేగాని, నువ్వు రావని అన్నా, రాజాగారి దాసీలకిప్పుడు తీరికవుండదు—మరొకప్పుడు చూదాములే." అన్నదామె.

మహారాజుగారి దాసీ లెలావుంటారో చూదామనుకున్నగాని, అవకాశం చిక్కలేదు. తరువాత నాఅంగిడికి నేనొచ్చేశా, నేను చేరేప్పటికి, నారహస్య మందిరంనుంచి, నాతాలూకు గూఢచారు డొకడొచ్చి—

"తేజసింగుకి మనజాడ లేమీ తెలియకపోవడంవల్ల అతను తిరుగుముఖం పట్టాడు. యువరాజు మాత్రం పట్టుదలతో మరోప్రాం

లాన తిరుగుతున్నాడు.'' అని చెప్పి వెళ్ళిపోయాడు. గూఢచారుడు వెళ్లిపోయిన మరో పదినిమిషాలకు, సుమబాల దాసీ పరుగుపరుగున వొచ్చి—

''నీగాజుల గంపలోగాని, మా సుమబాల వజ్రపుటుంగరం పడిందా తాతా?'' అని ఖంగారుగా నడిగింది.

''వజ్రపుటుంగరమా? నాకేం తెల్సు? గాజులూ అక్కడే వున్నాయి—గంపా అక్కడేవుంది—చూసుకో.'' అన్నాను.

దాసీ గంపలోని గాజులన్నీ పదిలంగా కిందపోసి, చూసుకుంది.

''లేదే! అదెక్కడ పోయిందో—ఆయమ్మ కసలు మతిలేదు—నన్నవసరంగా పరుగెత్తించి.''

అని సణుక్కుంటూ వెళ్ళిపోయింది. ఆ వజ్రపుటుంగరం, ధీర మల్లుకు జమఅయిందని ఎవరికి తెలుసు?

తేజసింగు తిరిగివచ్చిన మరి కొన్నాళ్ళకు, యువరాజు అశ్వనీ కుమారుకూడా తిరిగివచ్చాడని నకు తెలిసింది. వారిముందు కార్యక్రమం ఏమిటో నాకింకా అర్థంకాని సమయంలో ఒకరోజున నాదగ్గిరి కొక పురుషుడు వచ్చాడు. నేను దుకాణంపెట్టిం తరువాత పురుషుడంటూ రావడం అదే మొదటిసారి. గాజులన్నీ పరకాయించి—

''నగరంలో మొవరిదగ్గరాలేని కొత్తరకాలు నీదగ్గరున్నాయి—వీటిని ఎక్కణ్ణించి తీసుకొస్తావు తాతా?'' అని నడిగాడు.

''చేసినవాళ్ళదగ్గర్నుంచి.'' అని నేను బదులు చెప్పాను.

''అదే యెక్కడని అడుగుతున్నా.''

''నువ్వుకూడా గాజుల వ్యాపారం పెడతావా?''

''ఆఁ! పెట్టాలనే.''

''అయితే నెందుకు చెప్పాలి.''

''చెప్పక దాచుకో. ఈ వ్యాపారంలో నీకేమాత్రం లాభ మొస్తుందీ?''

''ఏదో పొట్టగడిచిపోతుంది.''

''మరయితే వజ్రపుటుంగరం ఎలా చేయించావ్?''

అని వాడడిగేటప్పటికి నాగుండె గుభేలుమన్నది. సుమబాల ఉంగరం నావేలికి దేనికి పడుతవో అని చూసుకుంటూ, అంతకుముందే

వేలుకు తొడిగి మర్చిపోయా—పొరబాటు జరిగింది. అయినా ధైర్యం చెడగొట్టుకోకుండా—

"ఇది నాసొంతంగాదు లే—తాకట్టుపట్టా." అన్నా.

"ఎవరిదగ్గి రేమిటి?"

"అదంతా నీకనవసరం—ఎవరో మర్యాదస్తు లిది—పేరు చెప్పి, వారి నవమానం చెయ్యాలా? గాజు లేమయినా కావాలంటే, కొను క్కెళ్లు—అనవసరం గొడవ లన్నీ నీకెందుకు?"

అని నేనంటే, వాడు వెళ్లిపోయాడుగాని, నా కనుమానంగానే వుంది. వాడెవడో తప్పకుండా పత్తేదారుడై వుంటాడని. ఇంక గాజు లంగడి అక్కడ వుంచడం క్షేమకరం కాదనితోచి—మర్నాడు ఎత్తెయ్యాలనుకొంటూ వుండగా, ఆవేళ సాయంకాలం కనుచీకటివేళ అంగట్లోకి ఒక అందమయిన స్త్రీవచ్చి కూర్చుంది. గాజులన్నీ చూసు కుంటూ, మధ్య మధ్య నావేపు పరిశీలనగా చూస్తుంది. ఎందుకో నాకర్థం కాలేదు. గాజుల బేరానికొచ్చిన స్త్రీకి నాముఖంలో యేముం టుంది? గాజు చూసుకుంటూనే నాతో సంభాషణ మొదలుపెట్టింది. ఆగొంతు కెప్పుడో చిరపరిచితమైనట్లు తోస్తూంది.

"మీ దేవూరు తాతా?"

"ఏం?"

"అడక్కూడదా?"

"ఎందు కడక్కూడదు?"

"మరయితే చెప్పు."

"మాది మణిహారద్వీపం."

"ఈ ముసలివయస్సులో అంతదూరంనుంచి యింతదూరం గాజులవ్యాపారాని కొచ్చావా పాపం?"

"ఏం వొస్తే?"

"అబ్బే ఏంలేదు. గాజులుకూడా అక్కడివే ననుకుంటా."

"ఆఁ!"

"మణిహారద్వీపంలో రత్నాలవర్తకులున్నారుగాని, గాజుల వర్తకులు లేరే!"

నేను దొరికిపోయానేమోనని భయపడ్డా. ప్రశ్నలు చూస్తే, అనుమానాస్పదంగా వున్నాయి.

"చీకటిపడుతూంది—దుకాణం కట్టెయ్యాలనుకుంటున్న, మీాకు నచ్చిన గాజులేవో త్వరగా తీసుకోండి—"

"ఇక్కడ నచ్చినగాజు లేవీ లేవే!"

ఆమాటతో నాకు పూర్తిగా అనుమానం కలిగింది. నాదగ్గ రున్న గాజుల్లో నచ్చకపోవడమంటూ వుండదు గాబట్టి—ఆస్త్రీ యెవో దొంగవేషంతో వచ్చిందని అర్థంచేసుకున్నా.

"లోపల యింకా మంచిరకాలున్నాయి—చూసుకోండి" అని నే నాస్త్రీని, బయటి గదిలోంచి లోపలి గదిలోకి తీసుకెళ్ళి—చెయ్యి పట్టుకున్నా.

"నిజం చెప్పు—ఎవర్నువ్వు?"

ఆ స్త్రీ వెంటనే చీరమాటునుంచి ఖడ్గం తీసింది—తలుపుసందు ల్లోంచి నేనూ ఖడ్గంతీశా—ఆగదిలోనే యిద్దరికీ యుద్ధం. ఆ పోరులో స్త్రీ అతికించుకున్న జుట్టు కిందపడిపోయింది. నేను నిర్ఘాంతపోయాను. ఆమె స్త్రీకాదు—యువరాజు అశ్వనీకుమార్!

కత్తితో పోట్లాడుతూనే—

"నువ్వు ధీరమల్లువికాదా?" అన్నాడు.

అది జవాబు చెప్పవలసిన సమయంగా తోచలేదు. ఆ యువ రాజప్పుడు ఒక్క కేకపెట్టాడంటే—రాజవీధిలో జనమందరూ మూగు తారు.

"ఒక్కవ్రేటుతో నిన్ను చంపగల్నుకాని—అది నా నియ మానికి విరుద్ధం!"

అని వెంటనే వెన్నుపై ఒకపోటుపొడిచి, కిందపడగొట్టాను. అటుపైన నేనింక ఆలశ్యం చెయ్యకుండా—యివతలికొచ్చి, తలుపులు బయట గొళ్ళాలుపెట్టి, వడివడిగా నడిచి, రాజవీధిదాటిపోతూ, కోట దగ్గిర కనుపించినవారితో—

"గాజులకొట్టులో యువరాజు హత్యచెయ్యబడ్డాడుట-త్వరగా పోయి మహారాజుకు చెప్పండి." అన్నాను.

ఎందుకంటే, యువరాజుకు వెంటనే చికిత్స అవసరం—అతను చనిపోవడం నాకిష్టంలేదు. ఈవార్తకోటలో తెలుస్తే, అక్కడి వారె వరో వెడతారు—యువరాజును రక్షిస్తారని నావూహ. అనంతరం అలాగునే జరిగిందని, నాకు నాగూఢచారులవల్ల తెలినవార్త-కోటలో

యీఘోరవార్త తెలియగానే కొందరు సాయుధప్రాణులయిన సైనికులు గాజులకొట్టుకు వెళ్లి యువరాజును రక్షించారట—మరికొందరు నన్ను వెంటతరుమడానికి అశ్వారోహులై పరుగెత్తారట—కాని నేనవుపించలేదట! నేనొక మార్గానపోతే వారింకొక మార్గానపోయి వుంటారు. యువరాజుకు తగిలిన గాయం ఏమంత ప్రబలమైనది గాక పోవడంవల్ల, అతను అచిరకాలంలోనే మామూలు మనిషి అయినాడన్న విషయంకూడా తెలిసింది.

రోజులు గడుస్తున్నకొద్దీ, తేజసింగుకూ, మహారాజుకు, యువరాజుకుకూడా, నామీద కక్ష యెక్కువవుతూంది. ఎన్నివిధాల ప్రయత్నాలు చేసినా నేను పట్టుబడకపోవడం, దేశంలో అలజడి కారణమే గాకుండా వారికి గొప్ప అవమానంగావుంది. శ్రీమంతుల శాఖనుంచి, మహారాజుకు రోజు కొక మహాజరు పోతూంది. కొందరు, తేజసింగును స్వయంగా కలుసుకుని మాట్లాడారట! ఏమనీ? దుర్మార్గుడయిన ధీరమల్లు పట్టుబడనంతకాలం, శ్రీమంతుల అర్థప్రాణాలకు క్షేమంలేదనీ అప్పటికే అతను దోచుకున్న ధనం కోట్లాది వుంటుందనీ—ఒక్క దొంగను పట్టుకోలేకపోవడం, పరిపాలకుల అసమర్థతను తెలుపుతుందనీ—

అని చేసే ప్రజల అలజడికి, తాము ఏమరివుండడంలేదనీ—ధీరమల్లును పట్టుకోడానికి ప్రబలప్రయత్నాలు చేస్తూనే వున్నారనీ—ఇంకా చేస్తామనీ, మహారాజు, తేజసింగులు, తమ్ము తొందరచేసే ధనికవర్గానికి నచ్చచెబుతున్నారనీ—అందు కనుగుణంగా ఏవేవో రహస్యాలోచనలు చేస్తున్నారనీ—నాకెప్పటికప్పుడు నాగూఢచారుల వల్ల తాజావార్తలు వస్తూనేవున్నాయి. నాముందర వారి ప్రయత్నాలు ఒక్కటికూడా పనిచెయ్యలేదు. నాకార్యక్రమం నిరాఘాటంగా జరుగుతూంది. దరిద్రజనాలకు, అన్నార్తులయిన ప్రజలకు, ధీరమల్లు ఒక దేవుడుగా కనుపిస్తున్నాడు. దేశంలో పండిన పంట కాని-వర్తకరూపంలో ధనముగాని యితర దేశీయులు పట్టుకుపోకుండా కట్టడిచేశాను. నాదాటికి, నా అనుచరుల దోపిడీలకు తట్టుకోలేక, ఇతర దేశీయులు ఇక్కడి వ్యాపారములు పూర్తిగాతగ్గించుకున్నారు. అందువల్ల కాశ్యపదేశంలో పండిన పంటలు—ధనము—అక్కడి ప్రజలకే వినియోగపడక తప్పలేదు. ఇది తేజసింగుకేగాక, యితర

ధనికవర్గానికంతకూ కంటకంగావుంది—కాని ఏంచెయ్యగలదు? నన్ను పట్టుకోలేకపోయినందుకు కలిగే తలవంపు లటుండగా, తేజసింగుకు మరొకవైపున కూతురు సుముఖాల పట్టిన ప్రతిజ్ఞ బధించడం మొదలు పెట్టింది. ఆమె పెట్టిన సంవత్సరం గడువులోనూ సగానికిపైగా గడిచి పోయింది. మిగిలిన కొద్ది గడువులో నన్ను పట్టలేకపోతే—సుముఖాల నన్ను వివాహమాడతానంటుంది. తేజసింగు ఆత్మహత్య చేసుకుని, ప్రాణత్యాగమన్నా చేస్తాడుగాని, తన కుమార్తెను గర్భశత్రువు వివాహమాడ్డాని కంగీకరిస్తాడా?

అప్పుడిక జరగవలసిందాన్ని చూడ్డానికి నేనూ నిరీక్షిస్తూనే వున్నాను. ధీరమల్లు భవిష్యత్తు, తేజసింగు భవిష్యత్తు తేలిపోవటాని కింక యెక్కువ వ్యవధిలేదు!

## 32

సర్వసాధారణంగా నేను బయట తిరుగుతున్నప్పుడు, సిక్కు దేశీయుని లాగా దుస్తులు వేసుకుని తిరుగుతుంటాను. అవసరమును బట్టి ఆ యా కార్యాలకు అనుకూలమైన వేషాలు ధరిస్తూ శత్రువులకు పట్టుబడకుండా దాటిపోయేవాడిని. అమ్మనీ చెల్లాయిల్నీ చూడ్డానికి అపరంజి వెళ్ళినప్పుడు మాత్రం మామూలుగా వుండకపోతే వాళ్లు బేజారైపోతారు. వాళ్ల మామూలు ధీరమల్లు వాళ్లకి కనుపించాలి గనక అక్కడికి వెళ్ళినప్పుడు, యితర వేషాలేవీ ధరించేవాణ్ణి కాను.

ఒకనాటి రాత్రి పదకొండుగంటలకు యుబానగరంనుంచి, అపరంజిపల్లెమార్గము ననుసరించి నాగుఱ్ఱంమీద ఒంటరిగా పోతున్నాను. మార్గమంతా చీకటిగావుంది. ఆదారిని నాగుఱ్ఱం బాగా అలవాటు పడివున్నదే గాబట్టి తడుముకోకుండా పరుగెడుతూంది. ఇంతలో హఠాత్తుగా, నావెనుక ఏదో గుఱ్ఱపుడెక్కల అలజడి వినిపించడంవల్ల, కళ్లెమును బిగించి నాగుఱ్ఱము నాపి, వెనుదిరిగి చూశాను. ఎవరూ లేరు——చప్పుడుకూడా వినిపించలేదు. తిరిగి నా గుఱ్ఱమును నడిపించాను——తిరిగి, వెనుక మరోగుఱ్ఱం పరుగెత్తుకొస్తున్న చప్పుడు. నేను మళ్ళీ నాగుఱ్ఱమును నిలిపాను. ఏచప్పుడూ వినబడదు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. నాగుఱ్ఱం పరుగెత్తినప్పుడు మాత్రం ఆగుఱ్ఱపు డెక్కల చప్పుడులో లీనమై మరోగుఱ్ఱపు

డెక్కల చప్పుడు—నేను నాగుఱ్ఱము నాపుచేస్తే, వెనుక గుఱ్ఱం కూడా నిలిచిపోవడం! నాకేమీ అర్థంకాలేదు. ఒకవేళ నేను భ్రమ పడుతున్నానేమో అనీ—నాగుఱ్ఱపు డెక్కల చప్పుడే తిరిగి ప్రతిధ్వ నిస్తున్నదేమో అనీ వూహించాను. కాని, అతికేవలం భ్రమగా తోచలేదు. నాగుఱ్ఱము కొంతసేపు నిలుపుచేస్తే—వెనుక గుఱ్ఱం కూడా అంతసేపూ నిలిచి, నాగుఱ్ఱం పరుగెత్తినప్పుడు మాత్రమే వెనుక గుఱ్ఱమూ పరుగెడుతూంది. సందేహంలేదు. నన్నెవరో అను సరించి వస్తున్నారని గ్రహించాను.

వెంటనే నాగుఱ్ఱమును వెనక్కు పరుగెత్తించి, నన్ననుసరించే వాళ్లను పట్టుకుందామా అనుకున్నా. కాని అందువల్ల ఏమయినా ప్రమాదం జరుగుతుందేమో అని మళ్ళీ సందేహం కలిగింది. ఎలా గయినా, నన్ననుసరించినవాళ్లు కొసవరకూ వస్తారుగదా, అంత మాత్రానికి అపరంజిలో నేను వెళ్లబోయే స్థలం వాళ్లకెందుకు తెలియ నియ్యాలీ అని ఆలోచించి గుఱ్ఱమును వెనక్కు మళ్లించక, ముందుకు సాగనివ్వక, ఒకచోట నిలిపాను. చాలాసేపు. వెనుక గుఱ్ఱంకూడా అంతసేపూ నిలిచి, తరవాత యేమనుకుందో యేమో—నేనున్న దగ్గిరికి పరుగెత్తి నన్ను సమీపిస్తూందని గ్రహించాను. దానితో నా సందేహం తీరిపోయింది. ఎవరో నన్ను గుర్తుపట్టి నన్ను పట్టుకోడా నికే వస్తున్నారని తెలిసింది. వాళ్ళ నెదుర్కోటమొక్కటే మార్గం తప్ప, వేరు మార్గంలేదు. క్రమంగా నావెనుక గుఱ్ఱం నేనున్న దగ్గిర కొచ్చి నిలిచింది. చీకట్లో గుఱ్ఱంమీాద వున్న వ్యక్తిముఖం కనుపించ డంలేదు. వాడు ఒరనుంచి కత్తిదూస్తన్న చప్పుడు విన్నాను—నేను కూడా నాకత్తిని అమాంతగా పట్టుకున్నాను.

"ధీరమల్లూ! ఎంతకాలానికి దొరికావూ? గుర్తుపట్టలేదా? నేను తేజసింగుని!" అన్నాడావ్యక్తి.

"నేనూ అలాగే అనుకున్నాను."

అంటూ నేను వాడిమీాదికి కత్తివిసిరాను. అతనూ అలాగే చేశాడు. రెండుకత్తులూ తాకుకున్నాయి. తేజసింగానాడు, ప్రాణా లపై ఆశవొదులుకొని, మహాపరాక్రమంతో పోరాడాడు. అతన్ని జయించడం నాకు కష్టసాధ్యమైంది. ఇంతలో వెనుకనుంచి మరికొన్ని అశ్వదళాలు పరుగెత్తుకొస్తున్న అలజడి వినిపించింది. ఇక లాభం

లేదనుకున్నాను. ఆరోజుతో నాపని సరి అని నిర్ధారణచేసుకున్నాను. వెనుక పరుగెత్తుకొస్తున్న తన దళాల హాంగుచూసుకుని, తేజసింగు మరింత తీవ్రంగా విజృంభించాడు. అంతకాలమూ తప్పించుకున్న నేనా నాడు తేజసింగు చేతులో హతమైపోవాలి గాబోలునని నిజంగ భయపడ్డా! ఇంతలో నాకు ఒక మంచి ఆలోచన మెఱుపులా మెటి సింది దాంతో నాకు కొంచం ధైర్యం చిక్కింది.

తేజసింగు కత్తిదెబ్బలను కాసుకుంటూ, ఒక్కొక్క అడుగే వెనక్కు తగ్గా—వాడూ నన్ననుసరించే వస్తూ కత్తి విసురుతున్నాడు. క్రమంగా నేను నడిరోడ్డునుంచి, ప్రక్కదారికి తప్పుకున్నా—వాడు కత్తి ఝుళిపించుకుంటూ నాతో యెక్కడికొస్తున్నదీ గమనించ కుండా, ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నాడు. ఆ ప్రక్క మార్గాన వాణ్ణి దట్టమైన ఒక తాటితోపులోకి తీసుకెళ్లా. వెనుక నుంచి వచ్చే సైనికదళాలకు యేం కనుపించం. వాడితో. పోరుతూనే తాటితోపు మధ్యభాగానికి తీసుకుపోయా రోడ్డుమీదికేక కందని దూరం—కళ్ళకవుపించని దూరంలో యిద్దరం హోరాహోరీని పోరు తున్నాం. ఆచేరువలో నాకొక పెద్దగొయ్యి కనుపించింది. బహుశా, అది తాటిమ్రానులు కొయ్యడానికి త్రవ్వబడ్డ రంపపుగొయ్యి అయి వుంటుంది. నాకు వెంటనే మంచి ఆలోచన తోచింది. తేజసింగుతో పోరుతూ పోరుతూ వాణ్ణి క్రమంగా ఆగోతి సమీపానికి నెట్టా. ఒక భయంకర గర్జనతో విజృంభించి నేను కత్తి ఝుళిపించేటప్పటికి వాడు అదిరి ఆగోతిలో అమాంతం పడ్డాడు. వాడందులో పడ్డప్పుడైన చప్పుడునుబట్టి, అది అఘాతమైన గొయ్యిగా తెలుసుకున్నా.

''దళాధిపతీ! నమస్తే—శలవు! నువ్వు నీపదవినుంచి ఎప్పుడు తప్పుకుంటావో—అంతవరకూ యిలాగే బాధలు పడుతూవుంటావు, ధీరమల్లును పట్టే ప్రయత్నాలు ఇకనయినా విరమించుకో—''

అని గోతిలోవున్న తేజసింగును హెచ్చరించి, నే నాతావును వొదిలాను. ఇక వెనుక వెంటాడిస్తూ వచ్చిన సైనికదళాలు ఏమై నవో తెలుసుకోవలసివుంది. రోడ్డుమార్గానికి సమీపంగా వచ్చి, ఒక దట్టమైన తాటి తోపులోనిలిచి, మార్గంవైపు చూశాను. ఆసైనిక దళాలన్నీ అపరంజిపల్లె వైపునుంచి, తిరిగి వస్తుండడం చూశాను, దానినిబట్టి వారు మమ్మల్ని కానక, ఆ పల్లెవరకూ పోయి, ఆయొగువ

మార్గంనుంచి, దిగువకు, తిరిగి యబానగరం పోతున్నారని అర్థం చేసుకున్నాను. అప్పటికి నాకు కలిగిన ప్రమాదం తప్పినట్లే అని సంతోషపడుతూ—ఆ సైనికదళాల శబ్దం చెవికి సోకనంతవరకూ అక్కడే వేచివుండి, అనంతరం నా గుఱ్ఱంమీద నేను అపరంజిపల్లె చేరుకున్నాను. అనంతరం ఒకవారం రోజులవరకూ అక్కడేవుండి, అమ్మతోను చెల్లాయిలతోనూ ఖులాసాగా గడిపాను ఆతరువాత, తిరిగి యివతలకొచ్చాను. మొదట ఒకసారి నాపాతాళ రహస్య మందిరాలన్నీ సురక్షితంగా వున్నయో లేదో చూసుకున్నాను. నా గూఢచారుల్నీ నా పరివారాన్నీ అందర్నీ కలుసుకుని మాట్లాడాను. ఆమరునాటివుదయం, తేజసింగు, నేను పడద్రోసిన గోతిలో నుంచి ఎల్లాగో బయటికొచ్చి రాజధాని చేరుకున్నాడట, తనకు జరిగిన పరాభవమును గురించి యెవరికీ చెప్పుకోలేదట!

తరువాత నాకు తెలిసిన కొత్తవార్త యేమిటంటే-యబానగర మహారాజు చనిపోయాడని! మూడురోజులు మాత్రం తీవ్రమైన విషజ్వరంవల్ల బాధపడి, క్రితం రోజురాత్రి దివంగతుడయినాడట! ఆవార్త వినప్పుడు నాకు నిజంగా చాలా విచారంకలిగింది! మహారాజు స్వతహా బహు ఉత్తముడు—దయాగుణ సంపన్నుడే—కాని స్వార్థపరుడయిన తేజసింగు తంత్రాలు తెలుసుకోలేక, తండ్రి తాతలనాటి గౌరవాన్నీ దేశసౌభాగ్యాన్నీ పోగొట్టుకున్నాడు. నాలాగే యువరాజుకూడా తండ్రిలేని వాడయ్యాడనుకోగానే, నాకు ఆపుకోలేనంత దుఃఖం కలిగింది. తండ్రి మరణానికి దుఃఖసాగరంలో మునిగి తప్పించే యువరాజును ఓదార్చి, అతనికి ధైర్యం చెప్పడం నాకు కర్తవ్యంగా తోచింది. లభ్యమయితే నాదేశపురాజుయొక్క మృతకళేబరాన్ని కడసారి దర్శించాని తోచింది! నా అభిప్రాయమును అనుచరులకు చెప్పి బయలుదేరబోతుండగా, వారు నన్నువారించారు—

"ప్రభూ! మీరు కరుణామయులు కాబట్టి, యీవిధంగా ఆలోచించారు. కాని, మీరు కళ్ళబడిన వెంటనే వారు మీ శిరస్సును ఖండించి తీరతారు. మిమ్మల్ని పట్టుకోడానికి భగీరథ ప్రయత్నాలన్నీ చేసి—చివరికి, మీ శిరస్సు ఖండించినవారికి లక్షవరహాల బహుమానమనికూడా ప్రకటించిన ఆశతృవులమధ్యకు మీ అంతట మీరు పోతే వొదిలిపెడతారా?"

"ఏమైనా కానియ్యండి! నేనీ గడ్డలో పుట్టాను—ఈ గడ్డలో పెరిగాను—ఈ దేశపుగాలినే పీల్చాను. మా తాత ఆ మహారాజు కొలువులో సిపాయిపని చేశాడు—ఆవుప్పుతిని, మా తాత మా నాయన్ను పొందాడు—మా నాయనకూడా ఆ మహారాజుకే కొలువుచేసి, నన్ను పొందాడు, తరాలనుంచి మాకుటుంబం ఆ మహారాజుచేత పోషించబడింది. నేనీదేశపు పౌరుణ్ణి—నాకతడు పాలకుడు—నాప్రభువు చనిపోయాడని విని, ఆఖరుసారి అతని మృతకళేబరం చూడకుండా—అతని ఆత్మశాంతికి ప్రార్థనలు చెయ్యకుండా—అతని ఆత్మీయుల్ని పరామర్శించకుండా నే నెలావుండగలను?"

"అయ్యయ్యో! మీ క్షేమాని సచ్చచెప్పాలో మాకు తెలియడం లేదు! ఆపాలకుల దృష్టిలో మీరు దేశద్రోహులు! మీ కంఠరక్తం చూడాలని వారు చిరకాలంనుంచి వేచివున్నారు, అందులోనూ తేజసింగు మీకు జన్మశత్రువు. మీ తండ్రిగారి నౌఖరీపోగొట్టి, మీ కూట్లో దుమ్ముపోసినవాడు—మీ తల్లిగారి శీలము నవమానించినవాడితరపున మీపై కత్తికట్టినవాడు—అనుక్షణమూ మీచావును కోరుతున్నవాడక్కడ సర్వాధికారియైవుండగా, మీయంతట మీరు పోయి, మృత్యువును వరిస్తారా?"

"మిత్రులారా! పుట్టిన ప్రతిఒక్కడూ ఎప్పుడో ఒకప్పుడు చావవలసిందే కాని, సూర్యచంద్రు లున్నంతవరకూ ఎవరూ సుస్థిరంగా వుండరు. నేను తలచిన కార్యక్రమంలో చాలాభాగం పూర్తిచేశాను. అన్నార్తుల ఆకలిమంటలు చల్లార్చారు—ఇల్లులేనివారి ఇల్లు కల్పించాను—ఇంకా కోట్లాదిధనం కూడాబెట్టి వుంచాను. ఈనాడే ధీరమల్లు చచ్చిపోయినా ఎవరూ విచారపడకూడదు—మీ కతనిపైగల సానుభూతిని, అతని ఆశయాలు అమలు జరపడంలో చూపండి! మీ కతనిపైవుండే భక్తివిశ్వాసాల్ని అతని సిద్ధాంతాలపై చూపండి-మీలో ప్రతిఒక్కడూ ఒకధీరమల్లుగా మారి,దరిద్రులను దయగా చూడండి-అన్నార్తుల నాదరించండి! స్వార్థాన్ని మొదలంటా నరికివెయ్యండి. నేను చచ్చినా బ్రతికినా, మీకు చెప్పగల తుదిసందేశమింతే! నా ప్రయత్నాని కడ్డుతగలకండి—నాప్రభువు మృతకళేబరాన్ని ఆఖరుసారి చూసుకోనియ్యండి-ఆలశ్యంచేస్తే నాకదికూడా లభ్యంకాదు."

అని నా పరివారం ఎంత వారించినా వినక, నేను బయలుదేర బోతుండగా—

ప్రభూ! అనుమతించారంటే, మేమిప్పుడే పోయి, మహారాజు మృతకళేబరాన్ని తెచ్చి మీ సాన్నిధ్యంలో చేరుస్తాము—యువ రాజును కూడా బంధించి మీ ప్రాపున నిలుపుతాము—మీరు మాత్రం మా మృత్యుసన్నిధానానికి పోవద్దు.''

అని నా అనుచరులలో ప్రధాని అనగా—

''తప్పు! తండ్రి మరణానికి కుంగి కృశించిపోతున్న యువ రాజును బంధించి తెస్తారా? వంశ సాంప్రదాయానుసారం ఆత్మీయుల సమక్షంలో అతిఘనంగా జరగనై వున్న మహారాజు అంత్యక్రియలకు నిరోధం కలిగించి, అమృత కళేబరాన్ని యిక్కడికి తెస్తారా? తప్పు—ఇంకేమీ చెప్పకండి! నన్ను వెళ్లనియ్యండి.''

అని నేను స్థిరనిశ్చయంతో అన్నా.

''ప్రభూ! అయితే మేమున్నూ తమ్మనుసరించి వస్తాము''

అని ప్రధాని తిరిగి అన్నాడు.

''కూడదు—నగర సరిహద్దులుదాటి మీరు పట్నంలోకి రాకూడదు.''

అనిచెప్పి, నేపిక ఆలశ్యం చెయ్యకుండా, నాగుఱ్ఱము నధిరోహించి బయలుదేరాను. నా అనుచరులు నేను చెప్పిన ప్రకారం, నగర సరిహద్దుల వరకూ మాత్రం మొచ్చి అక్కడ నిలిచిపోయారు. నేను నాగుఱ్ఱమును, నా కత్తులు వగైరా ఆయుధాలను వారిదగ్గరే వొదిలి—కాలినడకను కోటకుపోయి చేరుకున్నాను. అక్కడి కావలి వారు నన్ను నిరోధించారు. అప్పుడు నేను జ్యోతిషపండితుడుగా వెళ్ళినప్పుడు మహారాజు నాకిచ్చిన ముద్రికను వారికిచూపగా వారు నన్ను లోపలికిపోనిచ్చారు. నేను సకాలంలో వెళ్ళినందుకు కొంత సంతోషపడ్డాను.

కోటముందరి ఆవరణలో—పుష్పగంధాదులతో అలంకరించ బడిన మహారాజు మృతకళేబర మొకవేదికపై పరుండజేయబడింది. స్త్రీలు, పురుషులు, వృద్ధులు, రాజబంధుగులు, రాజోద్యోగులాదిగా నగరవాసుల దరిలో ఆ ప్రదేశం ఇసుకవేస్తే రాలనంతగా క్రిక్కిరిసి వుంది. నేను పోవడానికయినా సందులేదు. అతికష్టంమీద అక్కడ

మూగిన జనసమూహాల్ని తోసుకుని ముందుకుపోయాను. వరుసగా నిలబడివున్న ఆత్మీయు లొక్కరొక్కరికి, రాజపురోహితుడు నాలు గేసి పుష్పాలు చేతుల్లో వేస్తున్నాడు. దేశాచారము ననుసరించి, ఆత్మీయు లొక్కరొక్కరు మహారాజు మృతకళేబరానికి ముమ్మారు ప్రదిక్షిణంచేసి, తమ చేతిలోని పువ్వుల నామృతకళేబరంమీద చల్లి- ఆత్మశాంతికి నమస్కారంచెయ్యాలి. అప్పుడక్కడ అదేమాదిరిగా జరుగుతూంది. తమ విధాయిశాన్ని నెరవేర్చుకున్నవారు ముందుకు పోయి, కొత్తవారికి అవకాశం కలిగిస్తున్నారు. ప్రత్యేకము కొందరు రాజభటు లక్కడుండి, ఆ కార్యక్రమం సక్రమంగా జరిగేటట్లు చేస్తుం డగా, నేనతిప్రయత్నంమీద ఆవరుసలోకి పోయి నిలుచుండ గలి గాను. నాముందర అంతకుముందే నిలుచున్నవారు కొన్నవందల మంది వున్నారు. వారందరూ ఆఖరయినప్పుడుగాని, నాకు మృతకళే బరదర్శనం దొరకదు. ముందరున్నవారు ఒక్కొక్కరు జరుగుతుంటే వెనుకవారొక అడుగుముందు కొస్తున్నారు. నేను సహానంతో వేచి వుండగా, చాలాసేపటికి నాకవకాశమొచ్చింది. మృతకళేబరాన్ని సమీపించగానే నాకు దుఃఖమాగలేదు. సంతతధారలై కారే కన్నీ ళ్లతో పురోహితుడిచ్చిన పువ్వులందుకుంటున్నాను. మృతకళేబరానికి ఓవైపున తేజసింగు, మరోవైపున యువరాజు నిలిచివున్నారు. తేజ సింగు నన్నుచూచి.

"ధీరమల్లు! ధీరమల్లు!"

అని రెండుసార్లు పెనుకేకవేసి, వెంటనే ఒరనుంచి కత్తి దూశాడు. అతనితోనే మరికొందరు తమకత్తులను నాపైకెత్తారు. నిరాయుధుడనై వున్న నేను రెండుచేతులూపైకెత్తి నిలుచున్నాను.

"మీయిష్టం! మీచిరకాల వాంఛితాన్ని నెరవేర్చుకొండి." అన్నాను. తేజసింగు కత్తితోపాటు, కొన్నివందల కత్తులు నాతలపై పడబోతుండగా, రెండువైపులనుంచి రెండుకత్తు లెవరివోవచ్చి నాతను కాశాయి—ఆ శత్రుకూటంలో నాకు హితులయిన వారెవరా అని పరిశీలించాను. ఒకటి, యువరాజు—రెండు, సుమబాల—

"ఆగండి! నాతండ్రి మరణాన్ని విని, నాదుఃఖంలో పాలు పంచుకుని, నాకు సానుభూతి చూపవచ్చిన ధీరమల్లునా? అంత్యసమ యంలో తనప్రభుని మృతకళేబరం తిలకించి, అతని ఆత్మంశాంతికి

ప్రార్థనలు చేయవచ్చిన ధీరమల్లునా, మీరు చంపబూనడం! చాలు మీ ప్రతాపం! కత్తులు దించండి!''

అని తండ్రి మరణానికి ఒక చెంపకన్నీళ్లు కారుస్తూనే, గద్దించి పలికిన యువరాజు మాటలు విని, ఎక్కడివా రక్కడ కత్తులు దించారు.

''ఇంతకాలంనుంచీ మీ పౌరుష ప్రతాపాలేమైనాయ్! మీ బలశౌర్యా లెక్కడదాగాయ్! తనంతటతానై, ఆత్మీయులలో ఒక డుగావచ్చి, నిరాయుధుడుగా, చేతులెత్తి నిలిచిన ధీరమల్లు శిరస్సు ఖండించడానికి ఎందరు లేచారూ? వీరందరూ వీరులా? సిగ్గులేని కుక్కలా? ఛీ! తగ్గండి వెనక్కి.''

అని సుమబాల గర్జించేటప్పటికి, తేజసింగు తలదించుకుని అను చరులతో వెనకు తగ్గాడు. అనంతరం నేను ప్రభు మృతకళేబరానికి ముమ్మారు ప్రదక్షిణం చేసి——

''భగవంతు డీయాత్మకు పరిపూర్ణశాంతి ప్రసాదించుగాక!'' అని ప్రార్థించి మృతకళేబరానికి నమస్కారం చేశాను.

''అశ్వనీకుమారా! తండ్రిగారు దివంగతులైనందుకు విచా రించవద్దని చెప్పడానికి నాకు నోరురాదు——కాని దుఃఖించి ప్రయో జనం లేదని చెప్పగలను——వెనుక ముందులుగా మన మందరమూ చేరుకోనవలసిన గమ్యస్థానమొక్కటే——అని తెలుసుకొని ధైర్యంగా వుండు! వస్తాను——శలవు!''

అని నేను వెళ్ళబోతుండగా యువరాజు——నా చేతులు రెండూ పట్టుకుని——

''నువ్విప్పుడు బందిపోటుదొంగవు కాదు——శత్రుభయంకరుడ వైన ధీరమల్లువు కాదు. నా ఆత్మీయులలో ఒకడివి——దహనచర్యలు పూర్తి అయ్యేవరకు వుండి, మా అందరితోపాటు మహారాజుల ప్రసాదమును స్వీకరించి, అటుపైన నీయిష్టమొచ్చిన దగ్గరికి వెళ్ళి పోవచ్చును.''

అనిన యువరాజు కోరికను నిరాకరించలేకపోయినాను. ఆ సాయంకాలంవరకు వారితోనే వుండి, మహారాజుకు దహనచర్యలన్నీ పూర్తి అయినతరువాత, అందరితోపాటు నేనుకూడా ప్రసాదమును

స్వీకరించి వెళ్ళిపోతుండగా యువరాజు తేజసింగు వగైరా తనవారిని చూచి—

"నగర సరిహద్దులు దాటేవరకు ధీరమల్లును ఎవరుగాని ముట్టు కోడానికి వీల్లేదు!" అని హెచ్చరించి—తదుపరి నాతో—

"ధీరమల్లూ! నువ్వు చేసిన నేరాలిప్పటికే చాలా వున్నాయి. ఈ నీ దుండగాలు, దురాక్రమణాలూ యథాప్రకారం జరుగతుండ వలసిందేనా?" అని ప్రశ్నించాడు.

"తేజసింగు సర్వాధికారిగావుండి దుష్పరిపాలన సాగిస్తున్నంత కాలం, నాదుండగాలు తగ్గవికావు. అతను తన పదవినుంచి తప్పుకో వాలి—నేను నాదుండగాలు మానాలి!"

అని మాత్రం యువరాజుకు చెప్పి, నేను వచ్చేశాను. నగర సరిహద్దులవరకు నన్ను కొందరు సాయుధపాణులు వెంటాడించారు. సరిహద్దులు దాటాక, నాకై వేచివున్న నాపరివార జనాన్ని నేను కలుసుకున్నాను—యబానగర సైనికదళ మదిచూచి వెనక్కు మళ్ళింది. నేను ప్రాణాలతో వచ్చి తమ్ము కలుసుకున్నందుకు, నాపరి వారజనం అపరిమితానందమును పొందారు. జరిగిన విశేషములన్ని వారికి చెబుతూ, వారితో కలసి నేను నాగుఱ్ఱపై, యబానగర సరి హద్దులు దాటి చాలాదూరం పోయాను. క్రమంగా అందరంకలసి, యిదుగో, యీాగమ్యస్థానం చేరుకున్నాం.

ఇప్పుడు మనం కూర్చున్న యీా కుటీరం—అవసరమును బట్టి ఒక్కొక్కప్పుడు పీకిపారవెయ్యబడుతుంది—తిరిగి యెప్పటికప్పుడు నిర్మించబడుతూ వుంటుంది. విజయకుమారా! యబానగర ప్రభువు చనిపోయి, యిప్పటికి మూడుమాసాలయింది. సుమబాల పెట్టుకున్న ప్రతిజ్ఞ గడువు సంవత్సరం పూర్తికావడానికి మరొక్క మూడుదినాల వ్యవధివుంది—ఈ మూడుదినాలలోనూ వారు నా శిరస్సు ఖండించలేక పోతే జరుగవలసిందేమిటో నాకు తెలియదు.

నువ్వొక ఉత్తమవంశానికి చెందినవాడవనీ—నారహాస్యాలు బయటపెట్టవనీ, నమ్మి నీకిదంతా చెప్పాను. ఇప్పుడు నిన్ను నారహస్య పాతాళమందిరానికి గొనిపోయి, అక్కడి విశేషాలు చూపుతా—రా."

అని ధీరమల్లు, తనకు దాపులో వున్న ఒక మీాటనొక్కడమే తడువుగా, ఆ యిద్దరూ కూర్చొనివున్న స్థలం పాతాళంలోకి దించుకు

పోయింది. ధీరమల్లు ఆసాంతం మార్గంగుండా చాలదూరం తీసుకు పోయి, ఒక సువిశాలమైన కట్టడం చేరాడు విజయకుమారునితో, విజయకుమారుని కా భాగమంతా చాలా వింతగా కనుపించింది. అక్కడ ఒక మందిరమే గాకుండా, అనేక మందిరాలు కలిసిన ఒక చిన్న నగరంలా కనుపించింది. అందొక మందిరంలో ఖయిదీలు బంధించబడివున్నారనీ—మరొక దానిలో ధనరాసులున్నాయనీ—వేరొక మందిరంలో ఆయుధసామగ్రి వుంటుందనీ—ఇంకొక మందిరంలో తన సిబ్బందీ వంటలు వగైరాలు చేసుకుంటారనీ—మిగిలిన మందిరాలన్నీ తన దళాలతో నిండివున్నాయినీ—ధీరమల్లు ఒక్కొక్క దానినీ చూపించి, దాని వివరములు చెబుతుంటే, విజయకుమారుడిల్లపోయాడు. అవి యేమి ధనరాసులు! ఏమి రత్నరాసులు! ఎంత ఆయుధసామగ్రి! ఒక సామాన్యమైన రాజధాని కుండవలసిన హంగులన్నీ అక్కడ చేర్చబడ్డాయి. అటువంటి రహస్యమందిరా లింకా యెన్నో వున్నవని, ధీరమల్లు చెప్పగా విని, విజయకుమారుడు మరీ మరీ విభ్రాంతుడయ్యాడు.

ధీరమల్లు అనంతర మతన్ని తిరిగి యథాప్రకారంగా మొదట కూర్చున్నా కుటీరంలోకి తీసుకొచ్చి కూర్చోబెట్టి—

"విజయకుమారా! విషయమంతా తెలుసుకున్నావు గదా! నావృత్తిలో ఏమయినా అపరాధాలుంటే—తెలిసినవాడివి—నువ్వే చెప్పు—నేను వినుకుంటాను." అని అడిగాడు.

"నీయొక్క ప్రతికార్యాన్నీ నేనభినందిస్తున్నాను. నేనిప్పుడు పోనున్నది యశానగరం కాబట్టి, ఆయువరాజును కూడా కలుసుకుంటాను. అతను చెప్పిన దానిని వింటాను. తిరిగి వచ్చేమార్గంలో నిన్ను మళ్ళీ కలుసుకుంటా—" అని విజయకుమారుడు చెప్పగా—

"సంతోషం! యిక్కడికి పాతిక యోజనాల దూరంలో వున్న యశానగరం కాలినడకను పోవడం కంటే, మాగుఱ్ఱాలలో ఒకదానినిస్తాను—యెక్కి వెళ్లు." అన్నాడు ధీరమల్లు. విజయకుమారుడందు కంగీకరించి, ధీరమల్లుచే ఈయబడిన గుఱ్ఱమునెక్కి యశానగర మార్గము ననుసరించి వెళ్లాడు. ధీరమల్లు నివాసంగల అడవిదగ్గర నుంచి, యశానగరం పోయేమార్గం ప్రయాణయోగ్యంగా వుండడం

వల్ల, విజయకుమారుడు అనతికాలంలోనే సరిహద్దు ప్రాంతం సురక్షితంగా పోయి చేరుకున్నాడు.

ఆకృ_నగరానికి సంబంధించిన ప్రశ్నను తెలుసుకుంటే, తన కార్యక్రమం పూ_ర్తి అయినట్లేననీ—చింతామణి గర్వమణచి ఆమెచే జరిగించబడుతున్న హింసాకాండను అరికట్టవచ్చుననీ—అంతవరకూ ధీరమల్లు చెప్పిన యశానగర చరిత్రలో, తను తెలుసుకోవలసిన ప్రశ్నకు సంబంధించిన వివరాలేమీ దొరకలేదనీ అనుకుంటూ విజయకుమారుడు నగరాభిముఖంగా సాగిపోతుండగా ఆనగర సరిహద్దు ప్రాంతాన ఎక్కడో ఒక స్త్రీకంఠ మతనికి వినిపించింది. విజయకుమారుడు ఆశ్చర్యంగా నలువయిపులా పరికించిచూడగా, ఆ చేరువలో ఒక ఆలయము, అందులోనుంచే ఆస్త్రీ కంఠస్వరం వినిపించడము, గమనించాడు. క్రమంగాపోయి ఆలయంలో ప్రవేశించగా అక్కడి కాళీ విగ్రహానికెదురుగా, కురులుముడివిడి, జీరాడుతున్న ఒక నవమోహనసుందరి ఖడ్గపాణియై, ఏమో అంటుండడమును గమనించి, విజయకుమారుడు కొంచసేపు పొంచివుండి విన్నాడు.

"దేవీ! ఆనాడు నీ సమక్షంలోనే, ధీరమల్లుతో యుద్ధం చేశాను. అతనికి ఓడి, నాకురులు ముడివిడి జారాయి—ఏడాదిలోపున అతని శిరస్సును ఖండించడమో—లేక అతన్ని భ_ర్తగా పొందడమో జరగాలనీ ఆరెండూ కానిపక్షంలో నాకు నేనై_వచ్చి నీకు బలిఅవుతానని ప్రతిజ్ఞపూనాను. నేను పెట్టుకొన్న గడువు ఈరోజుతో పూ_ర్తి అయింది—నేనుగాని, నావారుగాని, అనుకున్న గడువులోపున ధీరమల్లు శిరస్సును ఖండించలేకపోయాము—రెండవది—నే నా వీరుణ్ణి వివాహమాడ్డానికి నాతండ్రి అంగీకరించలేదు—పోతే, నాకు నేనై_వచ్చి నీకు బలికాడమే మిగిలింది, ఈరోజుతో అనుకున్న గడువు తీరిపోయింది—కనుక తల్లీ! ఇదుగో నా శిరస్సును నీకు సమర్పణ చేస్తున్నాను—స్వీకరించు—"

అని నిమీలిత నేత్రాలతో ఆసుందరి కరవాలమునె_త్తి, తనకు తాను ఖండిచుకొనబోయే లోపుగా, విజయకుమారుడు మెల్లిగా, ఆమె చూడకుండా అమ్మవారి విగ్రహానికి వెనుకదాగి—

"సుందరాంగీ! తొందరపడకు! నీ శరీరంపై_న—నీ ఆత్మపై_నా నీకు సర్వాధికారాలూ వున్నాయి. ప్రాజ్ఞురాలవయిన నువ్వు ధీర

మల్లును వివాహమాడ్డానికి నీతండ్రి అంగీకారం దేనికి? ఆత్మహత్య ధీర వనితా లక్షణంకాదు! లే! ఇక్కడికి పాతిక యోజనాలదూరంలో, మార్గాని కుత్తరముగా ఒక శిథిల కుటీరముంది. ఆకుటీరంలో ధీర మల్లును చూడగలవు—నాపంపున వచ్చానని చెప్పు—అతడు నిన్ను స్వీకరించగలడు!''

అని చెప్పిన విజయకుమారుని మాటలు, కాళికాదేవి ముఖతా వచ్చినవే ననుకొని, ఆముగ్ధసుందరి ఆత్మహత్యాకార్యమును విర మించుకుని, లేచి నిలుచుంది! సంతోషంతో అమ్మవారికి నమస్కరించి—

''దేవీ! నీ ఆజ్ఞలు శిరసావహించడం నాకు కర్తవ్యం—నీ ఆజ్ఞ ప్రకారం ఇప్పుడేపోయి, ధీరమల్లును కలుసుకుంటాను.''

అనిచెప్పి వెళ్ళిపోయింది, అనంతరం విజయకుమారు దేవి యెదుటనిలిచి, నమస్కరించి—

''దేవీ! నీ యనుగ్రముండబట్టి, ఇప్పటికి నాలుగు ప్రశ్నలకు జవాబులు తెలుసుకొని, యీనగర మొచ్చాచాను. ఇక్కడ ఐదవ ప్రశ్నకూడా తెలుసుకొంటే నాకర్యక్రమం పూర్తి అయినట్లు, కాని, నే నా కపటబైరాగినీ—చింతామణినీ జయించగలనా లేనా? అదిగాక, యింతవరకూ, ఆరాజకుమార్తెచే హతులయిన వంశోద్ధార కులు, మహావీరులు, అయిన వేయిమంది రాజకుమారుల గతియేమిటి? ఇందుకు బదులుచెప్పి—నాకుత్సాహం కలిగించుతల్లీ! లేకుంటే నేను నీసన్నిధి వొదిలిపెట్టను—ఎన్ని రాత్రులు, ఎన్నిపగలు, అయినాసరే, నీపవిత్ర పదసాన్నిధ్యంలో సత్యాగ్రహం చేస్తాను.''

అని విజయకుమారు అక్కడ నిమీలితనేత్రుడై దీక్షతో కూర్చున్నాడు, అతని పట్టుదల—అతని నిగ్రహాము ఆదేవి కంతకు ముందే తెలుసు—కనుక—

''విజయకుమారా! నువ్వికసత్యాగ్రహం చెయ్యవలసింది లేదు, నీదీక్ష—నీనిగ్రహం—నాకర్థమయినాయి! నీవంటి పరోపకార పరాయణుడు—అహింసావ్రతుడు—త్యాగధనుడు—ప్రతిభాశాలి— యింతవరకు ఈ భూమండలాన పుట్టలేదు—ముందుపుట్టబోడు! నీకు నువ్వేసాటి. అంతేగాక కుండినపగరాన నీ ప్రియురాలు, నీకై నన్ను తలంచి, తీవ్రమైన పూజచేస్తున్నది—ఆమె పూజకూడా సిద్ధిపొందే సమయమొచ్చింది! నువ్వా బైరాగిని జయించగలవు—వాడిపాప

ములు పండే సమయం ఆసన్నమైంది! చింతామణిచే ఖండించబడిన శిరస్సులను—వాటి మొండములుగల గోతిలోపడవేసి, నీకు కాబోయే వున్న భార్య శోభాదేవి ఆగోతిపై ఒక గుడ్డనుకప్పి—

"జగన్మాతా! నాపూజాఫలంగా ఈ రాజకుమారులందర్నీ సజీవులుగాచెయ్యి—జై మహాకాళీ" అనాలి.

ఆవెంటనే ఎవరిశిరస్సు వారి మొండెమునకు అతుక్కొని వాతులైన రాజకుమారులందరూ, సజీవులై యివతల కొస్తారు."

అని ఒక అశరీరవాణి పలికిన దానినంతటినీ ఆలకించి, విజయకుమారుడు కళ్లు విప్పాడు.

"తల్లీ! నాజీవితం సార్థకమైంది—ఇక నేను కోరవలసిందేమీ లేదు."

అని విజయకుమారుడా దేవికి మ్రొక్కి రెట్టించిన ఉత్సాహంతో యుబానగరాభిముఖంగా వడివడిగా నడచిపోయాడు.

## ౩౮

విజయకుమారుడు చేరుకొనేటప్పటి కారాజమందిరమంతా మహా అల్లకల్లోలంగావుంది—సుమబాల కనుపించడంలేదని కొందరు—కాళికాదేవికి బలికాబోయిందని కొందరూ ఖంగారు పడుతుండగా, గమనించిన విజయకుమారుడు లోపలకుపోబోతుంటే—కావలివారు అడ్డుతగిలి—

"అనుమతిలేనిదే, లోనికి పోకూడదు. నీవెవరు? ఎందుకొచ్చావు?" అని ప్రశ్నించారు.

"రాజభవనంలో అందరూ సుమబాలను గురించి ఖంగారు పడడం లేదా? నేనామెను చూశాను—యువరాజును దర్శించి ఆవిషయమును చెప్పడానికే వచ్చాను."

అని విజయకుమారుడు చెప్పగా, కావలివారింకేమీ మాటలాడకుండా—అతిన్ని గొనిపోయి, అశ్వనీకుమారునివద్ద హాజరుపెట్టారు.

"ప్రభూ! ఈపరదేశికి సుమబాల సమాచారం తెలుసునట—ఇత నామెను చూశాడట! ఆవిషయం ప్రభువులకు విన్నవించాలని వచ్చాడట!"

అని తనవారు చెప్పగా విని, యువరాజు, విజయకుమారుని సగౌరవంగా కూర్చోనియమించి, తేజసింగుకు కబురుపెట్టగా, తేజ సింగు వెంటనే వచ్చి—

"ప్రభూ! నా ఏకైకపుత్రిక—అమ్మవారికి బలి అయిపోయి వుంటుంది! నా కేందారి! అవివేకణ్ణి—ఆమె కోరిక నిరాకరించాను."

అని కంటతడి పెట్టుకుంటూ చెప్పినదానికి—

"ఖంగారు పడకు—ఈపరదేశి, సుమబాల నెక్కడో చూశా డట! అడిగి తెలుసుకుందాము."

అని ప్రభువు చెప్పగా, తేజసింగు కళ్లనీళ్లు తుడుచుకుంటూ ఆదుర్దాగా—

"అయ్యా! మీ రెవరో భగవంతుడిలా వచ్చారు. నా సుమబాలను మీరు చూశారండీ! ప్రాణాలతో బ్రతికివుందండీ?" అని అడిగాడు.

"ఆ! నేను చూశాను ప్రాణలతో బ్రతికివుంటే—ఆమెను మీ రేమి చెయ్యదలుచుకున్నారు?"

అని విజయకుమారు తిరిగి అడిగాడు.

"నాతల్లి లేనిలోకం నాకెందుకండీ! వంతో మంతో ఆమె కోరి కను నెరవేరుస్తాను—ధీరమల్లు కామె నిచ్చి ఘనంగా వివాహం చేస్తాను."

"అతను చేసుకోనంటే—?"

"కాళ్ళమీదపడి ప్రార్థిస్తాను. గెడ్డంపట్టుకుని బ్రతిమాలుకుం టాను—నాతప్పులన్నీ క్షమించమని వేడుకుంటాను."

"ధీరమల్లు మీకు ప్రబలశత్రువుకదా!"

"ఇప్పుడిక కాదు—ధీరమల్లుని నాఅల్లునిగా స్వీకరించి తల దాల్చి పూజిస్తాను—అతనెలా చెబుతే అలా వింటాను. నా సుమబాల నాకు బ్రతకడమే కావాలి."

అని తేజసింగు పశ్చాత్తాపమును పొంది చెప్పాడు.

"మీమాటలనుబట్టి చూడగా—మానగరరహస్య వివరాలన్నీ మీకు తెలిసినట్లుగా తోస్తుంది—మీ దే దేశము—మీ రేమిటి?"

అని, యువరాజడిగిన మీదట—

"నా వివరాలు తరువాత తెలుసుకోవచ్చును. ముందర వీరి ఆరాటం తగ్గించండి." అన్నాడు విజయకుమారు.

"వార్త తెచ్చిన నువ్వే ఆరాటంకూడా తగ్గించాలి! కర్తవ్య మేమిటి?" సుమబాల బ్రతికివుంటున్నావు కదా! ఎక్కడా? ఆమె నిక్కడికి రప్పించే మార్గమేముంది?"

అని యువరాజడగ్గా—

"ఆఁ! అదే కావాలి—చెప్పండి బాబూ చెప్పండి! మా సుమ బాలను మాకు చేర్చారంటే, మీకెంతయినా పుణ్యముంటుంది." అన్నాడు తేజసింగు.

"మీరిప్పుడు చెప్పినమాటలకు కట్టుబడతారా? సుమబాలను ధీరమల్లుకిచ్చి వివాహం చెయ్యడము-మీరతన్ని తప్పులన్నీ క్షమించ మని కోరడము—ఇకముందు అత నాదేశించిన ప్రకారం నడుచు కోవడము—ఇవన్నీ జరిగేవేనా?" అని విజయకుమారు అడిగాడు.

"ఆహా! అక్షరాలాజరుగుతాయి." అన్నాడు తేజసింగు.

"అందుకు నేనుకూడా పూచీ!" అన్నాడు యువరాజు,

"అయితే ఒక విశ్వాసపాత్రుడయిన నౌఖర్ను పిలిపించండి."

అని విజయకుమారుకోరగా, అశ్వనీకుమారు ఆప్రకారం ఒక నమ్మకమైన భటునిపిలిచి, విజయకుమారుడు చెప్పినట్లుగా చెయ్య మన్నాడు.

అంతలో విజయకుమారు, ధీరమల్లుపేర ఒక ఉత్తరమును వ్రాసి, దానిని సీలుచేసి, ఆభటునకిచ్చి యిలా చెప్పాడు—

"ఇక్కడికి పాతిక యోజనాలదూరంలో మార్గాని కుత్త రంగా ఒక పూరిపాక కనుపిస్తుంచి—ఈ వుత్తరమును తీసుకుపోయి— ఆగుడిసెలో ఎవరుంటే వారి కందజెయ్యి."

ఆ పరిచారకుడు ఉత్తరమునందుకుని, చిత్తమని వెళ్ళిపోయిన అనంతరం—

"మీరు చెప్పినట్లు ఉత్తరమంద జేయబడుతుంది—అటుపైన ఏమి జరుగుతుంది? మా సుమబాల ప్రాణాలతో మాయింటి కొస్తుందా?"

అని తేజసింగు ఖంగారుపడుతూ తిరిగి అడిగాడు.

"మీ అల్లుని సయితం, లక్షణంగా వస్తుంది-మీరిక ధైర్యంగా వుండండి—వారొచ్చేలోపుగా వివాహ ప్రయత్నాలు ఘనంగా చేయిం చండి." అన్నాడు విజయకుమారు.

"అంతకంటేనా నాయనా! నువ్వు నిజంగా నాపాలిటి భగవంతుడు—పెళ్ళి ప్రయత్నాలంటావా? చూడు ఎంత ఘనంగా చేయిస్తానో—" అని విజయకుమారుడితో అని—

"మహారాజా అనుజ్ఞ ఈయిండి." అని ప్రభువునడిగాడు.

"శుభం—వెళ్లు—పెళ్ళికి ప్రయత్నాలన్నీ బ్రహ్మాండంగా చేయించు." అని యువరాజన్నమీదట—

"ఈ పుణ్యమంతా మీది."

అంటూ తేజసింగు ముమ్మార్లు, విజయకుమారు పాదాలు కళ్ల కద్దుకుని సంతోషంతో వెళ్లిపోయాడు. అంతటి తేజసింగు కన్న మమకారానికి లొంగి, ఇంతలో ఎంత బేలగా మారిపోయాడా అని, యువరాజు, తనలో తానెంతయినా ఆశ్చర్యపోయాడు. అనంతరం విజయకుమారుని తిలకించి—

"అయ్యా! తమరెవరో తెలవిచ్చారుకారు. తమదేవూరు? మా నగరం రావలసిన అవసరమేం కలిగింది? ధీరమల్లుతో మీకెక్కడి పరిచయము?" అని అడిగినమీదట, విజయకుమారిలా చెప్పాడు.

"ప్రభూ! నేను నాగపురయువరాజును, నా పేరు విజయకుమారు. నాతండ్రి ఛత్రపాలమహారాజు!"

అని విజయకుమారుడు చెబుతుండగా, అశ్వనీకుమారు విభ్రాంతుడై—

"ఎక్కడి నాగపురము—ఎక్కడి యశానగరము! రెంటికీ నడుమ ఎన్నివేల యోజనాలదూరముంది? ఎన్ని సముద్రాలు దాటాలి? ఎటువంటి కీకారణ్యాల్లో ప్రయాణాలు చెయ్యాలి?" ఎన్ని సంవత్సరాలు పడుతుంది?" అని అడిగాడు.

"ప్రభూ! మీరు చెప్పినదంతా నిజమే? నేను అన్నివేల యోజనాలూ ప్రయాణంచేశాను—అన్ని సముద్రాలుదాటాను—అన్ని కీకారణ్యాల్లోనూ ప్రయాణంచేశాను—తగినంత అవసరముండబట్టే గదా! వివరించి చెబుతున్నాను—చిత్తగించండి—

మగధసామ్రాజ్యంలో, కుండిననగరమనే ఒక మహాపట్నమున్నది. ఆపట్నమును కీర్తికాముడనే ప్రభువు పరిపాలన సాగిస్తున్నాడు—అతనికి లోకైకసుందరి, చింతామణి అనే పుత్రిక, ఆ

కన్యను తగినవరునికిచ్చి వివాహం చెయ్యవలెనని మహారాజు సంక ల్పించగా, బాలమహర్షి అనే వారిగురువు కల్పించుకుని, ఆకన్య అడి గిన అయిదుప్రశ్నలకు జవాబు చెప్పగలవాడే, ఆమె చేపట్టగల అర్హుడై వుంటాడనీ—అట్లు చెప్పలేని రాజకుమారుల శిరస్సులు ఖం డించి, చింతామణి మందిరానికి వ్రేలగట్టించాలనీ ఒక నియమం ఏర్పాటు చేశాడు. చింతామణి, గురువులయందుండే భక్తి విశ్వాసాల వల్ల, ఆయన చెప్పినప్రకారం చెయ్యడానికి శపథం పూనింది. ఆ గురువే చింతామణికి అయిదు ప్రశ్నలు బోధించాడు. చింతామణి యొక్క అపూర్వనియమం ఎల్ల రాజకుమారులకూ తెలియజేయ బడింది. చింతామణి అడిగే ప్రశ్నలకు జవాబు చెప్పి, ఆ త్రిలోక సుందరిని పరిణయమాడాలన్న కోరికతో ఒక్కొక్క రాజకుమారుడూ రావడము, ప్రశ్నలకు జవాబు చెప్పలేక ఆ రాజకుమార్తె కరవాలా నికి గురికావడము—ఈ ప్రకారం వెయ్యిమంది ఉత్తమరాజ వంశీకు లయిన యువకులు ఆమెచేత వధించబడ్డారు. వారిలో నా ఆత్మీయు డున్నా ఒకడున్నాడు.

ఈ ఘోరవిషయం నాకు తెలిసింది, చింతామణిచే జరిగించ బడుతున్న ఈ హింసాకాండను సహించలేకపోయాను. నసించి పోతున్న రాజలోకాన్ని పునరుద్ధరించడానికి కంకణంకట్టుకున్నాను— ఆదారుణహింస నరికట్టడానికి దీక్షబూనాను. ఆ దీక్షతోనే రాజధాని వొదిలి బయలుదేరాను. చింతామణి గురుముఖతా చెప్పించుకున్న ఐదు ప్రశ్నలకు జవాబులు తెలుసుకున్నప్పుడు గదా, నేనామె గర్వ మణిచి, నాదీక్షను నెరవేర్చుకొనగలిగేది. భగవదనుగ్రహంవల్ల, ఇప్పటికా ఐదు ప్రశ్నలలో నాలుగింటికి జవాబులు తెలుసుకున్నాను. కడసారి ప్రశ్నకు మీయబానగరమున జవాబు లభించునని గ్రహించి అనేకములయిన కష్టాలకోర్చుకొని, యెలాగో యిక్కడికి రాగలి గాను. ఈ నగరమొచ్చే మార్గంలోనే ధీరమల్లును కలుసుకోవడము— అతనికి మిత్రుణ్ణి కావడము జరిగింది.”

అని చెప్పి, విజయకుమారు డనంతరం, తా నేయేపట్టణములు సంచారంచేసినదీ, ఎక్కడెక్కడ ఏ ప్రశ్నకు జవాబులభించినదీ, మొదలుగాగల వివరములన్నింటినీ సవిస్తరంగాచెప్పి, తదుపరి, కాళి కాలయంలో తాను సుమబాలను కలుసుకోవడము, ఆమె ఆత్మ

హాత్యాకార్యమును వారించడానికి పన్నినయుక్తి, వివరించి, యువ రాజుకు మరింత సంతోషమును కలిగించాడు.

"విజయకుమారా! నిన్ను బోలిన త్యాగధనులు-దీక్షాపరులూ, రాజలోకమున యిక పుట్టబోరు! లోకకళ్యాణానికై నువ్వు చేస్తున్న ఘనకార్యం ఎంతయినా ప్రశంశానీయం! అయితే నువ్వు మానగర మున జవాబు తెలుసుకోవలసిన ఆ ఐదవ ప్రశ్న యెటువంటిది?"

అని అశ్వనీకుమారు అడగ్గా—

"శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన భర్తురాలిని, మహర్షి కామించిన కారణంవల్ల, ఆయిరుపురనూ కారాగృహమున బంధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే దత్తాత్రేయ మహారా జింకా బ్రతికివున్నాడా? భర్తురాలెట్లున్నది?"

అని విజయకుమారు చింతామణియొక్క ఐదవ ప్రశ్నను వివ రించగా—అశ్వనీకుమారు క్రోధంతో పళ్లు పటపట కొరుకుతూ— లేచి నిలుచుని—చేతువలోవున్న ఖడ్గమునందుకొని—

"ఓయీ! తక్షణంబయలుదేరు! ఆ మహర్షి యెక్కడున్నాడో నాకుచూపించు, వాడిశిరస్సును వేయి ప్రక్కలుచేసినగాని నామనస్సు శాంతించదు. వాడుద్రోహి—మహాపాపి—వాడుచేసిన ఘోరం, మా తండ్రిగారి హృదయాన్ని బ్రతికినంతకాలం పీల్చి పిప్పిచేసింది. వాడింకా యఖానగరంపైనా, ప్రియురాలిమీదా దృష్టిపెట్టుకున్నా డన్నమాట! ఇది సహించరానిది! ఓరీ కపటర్షి! నీకంఠరక్తంతో బలి దర్పణమొదలి, మా నాయనగారి ఆత్మకు శాంతికలిగిస్తాను."

అంటూ అశ్వనీకుమారు తనయెదుట యెవరున్నదీ మరచి, చేతిఖడ్గమును విసరబోగా—

"ప్రభూ! నేను నాగపుర యువరాజునుకాని, ఆ కపట మహర్షినికాను—కొంచం శాంతపడి, జరిగిన విషయమేమిటో చెప్పండి. ఆ మోసగాడు. మనల్నిదాటి యెక్కడికీపోతాడు." అని విజయకుమారు ఉద్రేకుడైవున్న అశ్వనీకుమారుని శాంతపరచిన మాదట, అతిడు తిరిగి యథాస్థానంలో కూర్చుని చెప్పడం మొదలు పెట్టాడు—

"రాజకుమారా! జరిగిన యదార్థగాథను వింటే, నువ్వు నాకంటే యెక్కువ ఉద్రేకుడవవుతావు. చింతామణి దగ్గరచేరి,

గురువునంటూ ఆమెను వశంచేసుకున్నవాడు మహామోసగాడు—దుర్మార్గుడు. వాడు మానాయనగారిచే కారాగృహమున బంధించబడి ఎట్లో తప్పించుకుని పారిపోయింది చాలక, యిప్పుడింకా తన ప్రియురాలిని గురించీ, మానాయనగార్ని గురించీ మెత్తుతున్నాడు. ఎంత ధైర్యము? ఎంత సాహసము!''

అది విని విజయకుమారు—

''ప్రభూ! ఆ మహర్షి యెవరు? వాడిని మీ తండ్రిగారు కారాగృహమున బంధించిన కారణమేమి? వాడి ప్రియురాలనగా యేమి? ఆ వివరములన్నీ నాకు దయచేసి చెప్పండి!'' అని అడిగాడు.

''తప్పక చెబుతాను—నువ్వు వినవలసిన అవసరంకూడావుంది. వాడు శిష్యురాలయిన చింతామణిద్వారా, ఆమె వివాహమాడగోరి వచ్చిన రాజకుమారులను అడిగుతున్న ప్రశ్నలలో అయిదవదానికి జవాబు ఈకథకు సంబంధించినదే అయివుంది, కనుక శ్రద్ధగా విను-''

అని అప్పటి యబానగరప్రభువు, అశ్వనీకుమారు ఈవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు.

''నేను అయిదేళ్ళప్రాయంలో వుండగా, మా అమ్మగారు, దివంగతురాలయింది. ఆమెను ప్రేమించినంత గాఢంగా మానాయన గారీ ప్రపంచంలో యింకెవర్ని ప్రేమించలేదు. అటువంటి ప్రేమ రాసిని గోల్పోయినందు కదిలగాయితు, మా నాయనగారీప్రాపంచిక భోగాలపై విరక్తిని పొందారు. రాజ్యపాలనయందు కూడా ఆశక్తిలేకుండా వైరాగ్యచింతనలో మునిగారు. తిరిగి వివాహం చేసుకోవలసిందని ఆత్మీయులెందరు చెప్పినా వినలేదు. పరిపాలనకు సంబంధించిన సర్వకార్యాలూ సేనాధిపతి తేజసింగుకే వప్పగించి, మంత్రిని అతనికి సహాయకుడిగా నియమించి, తామెప్పుడూ ఏంకాంత మందిరంలోనేవుంటే, భక్తిమార్గము నలవరుచుకొంటూ కాలం గడుపుతున్నారు.

ఈ యదార్థం తెలియని కొందరు, మహారాజు వ్యసనపరుడై, జీవితమును వృథాబుచ్చుతున్నాడని అపోహపడుతుండేవారు కూడా! క్రమంగా వారి నిజజీవితమును తెలుసుకొని, అందరూ అభిప్రాయాలు మార్చుకున్నారనుకో, భక్తిభావము కలిగించే ఉద్గ్రంథాల చదవడము-

తాము తెలుసుకొన్నవాటిని పదిమందికి చెప్పడము—వారికి ముఖ్య కాలక్షేపంగా వుండేది. విద్వాంసులను రావించి, వారిచేత పురాణములు చెప్పించడము—హరికథలు—భజనలు చేయించడము-వారికెక్కువ ఉత్సాహమును కలిగించేవి.

ఇలావుంటుండగా, మానగరాని కొకప్పుడొక భక్తసమాజ మొచ్చింది. స్త్రీ పురుషులు కలిసి వారు సుమారు ఇరవైమంది భక్తులు—హరికథలు చెప్పడము—భజనలు చెయ్యడము—వారికి ప్రత్యేక కృషి. మా నాయనగారు కూడా అదే కాలక్షేపంలో వున్నారు గనక, స్త్రీ పురుషులతో కలసివున్న ఆ భక్త సమాజాన్ని రాజమందిరానికి ఆహ్వానించారు. వారందరికీ తగుమర్యాదలు చేసి, తమ నగరంలో కొంతకాలముండవలసిందిగా కోరారు. వారున్నూ అందు కంగీరించి, తా మక్కడున్నంత కాలము, శ్రీమద్రామాయణమును హరికథారూపంలో కాలక్షేపం చేస్తామని చెప్పారు. మా నాయనగా రందుకు మరింత సంతోషించి, అందు కవసరమైన యేర్పాటు లన్నింటినీ చేయించారు.

కోట ఆవరణలోనే ఒక ప్రత్యేక మందిరమును నిర్మించి, అక్కడ సీతారాముల విగ్రహములను ప్రతిష్ఠింప జేసి, అతిశోభాయమానంగా ఒక శుభముహూర్తాన, కథా ప్రారంభమును చేయించారు. అం దాశక్తి కలిగిన అనేకమంది నగరప్రముఖులను కూడా రావించి, నిత్యమూ సాయంకాలం ఆరుగంటలగాయితు, రాత్రి పది గంటలవరకు ఆకాలక్షేపంలో నిమగ్నులై వుండేవారు.

భక్తసమాజపు ఇరవైమందిలోనూ, ప్రవీణుడైన ఒక హరిదాసు కథ చెప్పడము—అతనికి హంగుదారులుగా కొందరు వీణె మృదంగాది వాద్యములు వాయించడము. భక్తిరసప్రధానమైన ఆ శ్రావ్యగానం వినడానికి, నగరవాసులయిన స్త్రీ పురుషులు ప్రతి నిత్యము వేలాదిగా వెంచేసేవారు. ఆ హరికథా కాలక్షేపం జరిగినంత కాలమూ, రాజమందిర వాతావరణమంతా ఒక తీర్థస్థలంగానూ—ఒక ఉత్సవంగానూ మారి కన్నులపండువుగా వుండేది. ప్రముఖ హరిదాసు నాసామాజకులు మహర్షి అని పిలుస్తుండడమును గమనించి, యితరులుకూడా అలాగే పిలుస్తుండేవారు. హరిదాసు నడివయస్కుడై వుండి, దట్టముగా పెరిగిన గెడ్డము—జడలు కట్టిన

శిరోజము—కలిగి, ఎల్లప్పుడూ పట్టుపీతాంబరములు ధరించి, పూల మాలాలంకృతుడై వుండేవాడు.

ఆస్థానగురువు—మహాపండితుడు అయిన మా వశిష్ఠులవారు యిప్పటికీ వున్నారు. అతను వేదశాస్త్రము లన్నింటినీ చదివిన అధ్యాయనపరుడు. అతని వితంతుశోదరి పుట్టువయిన త్రిపురాంబ, అంతకు ముందునుంచీ, అప్పుడప్పుడు మహారాజుల దగ్గరకు రావడము—వారికి తెలిసిన వేదాంత విషయములు తెలుసుకొంటుండడము కద్దు. ఆవిడ అతిబాల్యంలోనే భర్తను గోల్పోయి, ఇటువంటి సత్సాంగత్యము—సత్కాలక్షేపములతో కాలక్షేపం చేస్తూంది. ఆప్రకారం తన ముప్ప దేళ్ల జీవితం గడిపి, అప్పుడు మాకోటలో జరుగుతున్న శ్రీరామ సత్కథాకాలక్షేపంలో ఎక్కువ ఆశక్తికలిగి, అహర్నిశలు ఆభక్త సమాజంతో కలిసివుంటుండేది. మహర్షిస్నీ, ఆమెయందు ఎక్కువ ప్రీతిగలవాడై, తన శిష్యకోటిలో ఆమెకు ప్రముఖ స్థానమునిచ్చాడు.

ఇంటిపనుల్లోకూడా ఆశక్తి వొదిలి—దివారాత్రము లాభక్త కూటంతో కలసివుంటున్న తన సోదరి, త్రిపురాంబను గురించి వశిష్ఠులవారు, మాతండ్రిగారయిన మహారాజుతో ఒకనా డిలా చెప్పడం నేను విన్నాను.

"ప్రభూ! నేను భక్తితత్వము ననాదరణ చెయ్యడంకాదు—కాని, మాత్రిపురాంబ అసలు ఇల్లుపట్టకుండా—ఇంటి పనులు చెయ్యకుండా ఎప్పుడూ ఆ భక్తకూటంతోనే కలిసివుంటూంది. అది నాకున్నూ సమ్మతమేగాని, ఇంట్లో నాభార్య రోగగ్రస్థురాలై వుంది—పిల్లలకు సంరక్షణ జరిగే దిక్కులేదు. అంతకుముందు త్రిపురాంబ అన్ని పనులూ చక్కబెట్టుకుపోతుంటే, కష్టం కనుపించేది కాదు. ఇప్పు డామె యిల్లు పట్టకపోవడంవల్ల, నిత్యకృత్యాలు జరగడంలేదు."

"మన నిత్యకృత్యాలు జడగడం కోసం, ఒకరి మనశ్శాంతిని చెడగొట్టడం ఏమంత మంచిపని? గురుదేవా! నావిషయం గమనించండి! రాజ్యాంగ విషయాలోగాని, ఇతర భాగ్యభోగాలపైగాని, ప్రయత్నించినా నామనస్సు మళ్లదు—ఈభక్తిధ్యాసలో మునిగిన వారి కితర ప్రపంచం కనపడదు."

"తమరు సాగుబాటుగల ప్రభువులు—తమరెలావున్నా, రాజ్యపాలన అడ్డదు. మాకుటుంబ పరిస్థితు లవికాదు గదా!"

"కాకపోవచ్చు—భర్త సుఖాన్నిరుగని ఆపడుచు భక్తి మార్గంలో పడినందుకు మనం సంతోషించాలిగాని, ఆమె సన్మార్గా నికి అడ్డుతగలడం మంచిదికాదని నావుద్దేశం."

అని, మహారాజు చెప్పినమీదట వశిష్ఠులవారింకేమీ అన కుండా వెళ్ళిపోయారు. మహర్షి చే జరిగించబడుచున్న హరికథా కాలక్షేపం, క్రమంగా నగరవాసులనందర్నీ ఆకర్షించింది. ఒకరోజు కంటే ఒకరోజు అక్కడికొచ్చే భక్తులసంఖ్య ఎక్కువ కావడం మొదలుపెట్టింది. శ్రీరాముని జననం మొదలుకొని, పట్టాభిషేకం వరకు కథచెప్పి పూర్తి చెయ్యడానికి ఒక సంవత్సరం పట్టింది. ఈ సంవత్సరం పొడుగునా, జననకాల మొచ్చినప్పుడు జననోత్సవము—కథా సందర్భంలో కళ్యాణఘట్ట మొచ్చినప్పుడు కళ్యాణమహోత్స వము—మహారాజులు యథావిధిగా ఆనాడు దశరథమహారాజు జరి గించినట్లే జరిగించేవారు.

ఆనాడాఖరిదినం. శ్రీరామపట్టాభిషేక ఘట్టం గానచెయ్య బడుతూంది. ఆ సమయంలో త్రిపురాంబ భక్తిపరవశురాలై తాండ వించడం మొదలుపెట్టగా, అక్కడివారాశ్చర్యచకితులై—'త్రిపు రాంబ భక్తి అపారమైంది—కనుకనే ఆమె పరవశురాలై నాట్యం చేస్తూంది' అన్నారు. మానగరంలో, ఈశ్వరప్రీతికరములయిన దిన ములలో శివాలయమునందు బ్రహ్మాండమయిన ఉత్సవములు జరుగు తాయి. ఆ వుత్సవాలలో శివభక్తులు కొందరు మైమరచి తాండవం చేస్తారు. త్రిపురాంబ అంతకుముందా శివోత్సవాలలో శివతాండవం చేసి వుండడమును బట్టి, యిప్పుడు పరవశురాలై అదేమాదిరిగా శివతాండవం చెయ్యడం మొదలుపెట్టింది. ఆప్రకారం చేసి చేసి, అలిసిపోయింది—ఇహ కిందపడి మూర్ఛపోనున్న సమయంలో హరి దాసుగా వున్న మహర్షి ఆమెను తన రెండు చేతులమీదా ఆనించి పట్టుకున్నాడు. ఆమె అతని హృదయంమీద వాలి—కళ్లు మూసుకుంది. అతడామె చెవిలో జపంచేశాడు—అది తారకమంత్రమని, అందరూ అభిప్రాయపడ్డారు.

అతనెంత భక్తుడయినా—ఈవిడ యెటువంటి భక్తురాలయినా అతనెంత గొప్పగురువయినా—ఆమె ఎంత ప్రియశిష్యురాలయినా—వేలాదిగా జనమున్న నిండుసభలో—ఒక పురుషుడు, ఒక స్త్రీని

ఆవిధంగా హృదయానికి హత్తుకుని పట్టుకోవడమనేది సభ్యతకు చాలా భంగకరమయిన పని అని, నగరవాసులో కొందరు ప్రముఖులు వ్యాఖ్యానించారు. మహారాజుతో బహిరంగంగా అన్నారు. కాని అందును గురించి యెటువంటి చర్యలున్నూ తీసుకొనబడలేదు.

ఆ మర్నాడు, వశిష్ఠులవారి మహారాజులను దర్శించాలని వచ్చింది. ఆమెకు అంతకుముం దెప్పుడూ కోటకు తరుచువచ్చే అల వాటులేదు. పైగా అప్పుడు రోగగ్రస్తురాలై వుంది కూడా—అటు వంటి దామె తగినంత కారణంలేకుండా తమ దర్శనానికి రాదని ఊహించి మాతంగ్రిగా రామె కవకాశమును కల్పించారు. ఆమెవచ్చి మహారాజులకు నమస్కరించి—

"ప్రభూ! తమతో ఒక రహస్య విషయం మాటలాడాలని వచ్చాను." అని అందుకు మహారాజులు కొంచం ఆశ్చర్యపడి—

"ఫరవాలేదు—చెప్పండి—" అన్నారు. అయినా ఆమె సందే హించింది. నే నన్నప్పటికి పన్నెండు పదమూడేళ్లవాడిని. మా అమ్మ గారు పోయిందిలగాయితు, అహర్నిశలు మానాన్నగార్ని వొదిలి పెట్టకుండా వుండేవాడిని. నేనప్పుడు, వారిగదిలో వారికి చేరువలో ఒక మంచంమీద పడుకునివున్నాను. నన్ను గురించి ఆమె సందేహ పడుతూందని గ్రహించిన మానాన్నగారు—

"ఫరవాలేదు—వాడు కుర్రాడు—సందేహించకుండా, మీరు చెప్పవలసిందేమిటో చెప్పండి." అన్నారు. అప్పు డామె యిలా చెప్పడం నాకు బాగా జ్ఞాపకముంది.

"త్రిపురాంబ గర్భం ధరించింది ప్రభూ! ఈ అవమానంవల్ల, మేము ఆత్మహత్య చేసుకోవడంకంటే వేరు మార్గంలేదు. తమ గురువు లెటువంటివారో—మా కుటుంబ మెటువంటిదో తమకు తెలియని విషయంకాదు."

ఆమాట వినేటప్పటికి, మానాయనగారు విభ్రాంతులయినారు. ఐదునిమిషాలవరకు ఆయన నోటంట మాటరాలేదు.

"ఎవరు చెప్పారు—" అని ఆయన గద్గదస్వరంతో అన్నారు.

"ఎవరో చెప్పడమెందుకు ప్రభూ! ఆమె మూడుమాసాల నుంచి, యింటిముఖం చూళ్లేదు. రాత్రింబగళ్లు ఆభక్తసమాజంలో వుంటూ, అక్కడే తింటూంది. నిన్నటిదినం వాంతులవుతున్నాయని

యింటికొచ్చింది. ఆడవాళ్ళ విషయం ఆడవాళ్ళకు తెలుస్తుంది లెండి. ఇప్పుడామెకు ఐదవమాసం గర్భిణి—నేనూ, అన్నగారూకూడా నిలదీసి అడుగుతే, ఏమీ చెప్పకుండా, తిరిగి భక్తసమాజానికి పోయింది. ఈ విషయం పట్టుకొచ్చి మీకు చెప్పడానికి వశిష్ఠులవారి ముఖం చెల్లలేదండి. కుటుంబగౌరవం గంగపాలయిపోతున్నప్పుడు అభిమానపడి ఏం ప్రయోజనమనుకుని-మాకు పోషకులయిన తమతో విషయం చెప్పుకుందామని—తెగులుతోవున్నా వచ్చానండి!''

ఏమి చెప్పాలో తెలియక మానాయనగారు మౌనమును వహించివుండగా ఆమె తిరిగి చెప్పింది.

''వితంతువు గర్భం ధరించడం తమ రాజ్యంలో యెన్నడైనా వుందా? అందులోనూ, మావంటి ఆయతాజ్ఞుల కుటుంబంలోనా? ఇప్పుడు మాకర్తవ్య మేమిటి ప్రభూ! మేమేం చెయ్యాలి? మా ఆలుమగల మిద్దరం ఉరిపోసుకుని చావడంకంటే వేరు కర్తవ్యమేముంది?''

అని కంట తడిపెట్టుకుని యేడవడం మొదలుపెట్టిందా యిల్లాలు.

''తొందరపడకండి—మీకుటుంబ గౌరవం చెడకుండా నేను కాపాడతాను—మీరు వెళ్ళి స్థిమితంగా వుండండి—నేను నిజానిజాలు తెలుసుకుని, కర్తవ్యము నాలోచిస్తాను.''

అని మహారాజులు చెప్పినదాని కప్పటి కామె కొంచం తృప్తిపడి వెళ్ళిపోయింది.

## ౩౯

మహారాజు వెంటనే తేజసింగుకు కబురుచేసి పిలిపించారు. అతనువచ్చి, సవినయంగా నమస్కరించి నిలుచున్న తదుపరి—

''మాతండ్రి తాతలనాటినుంటి, యింతవరకూ జరగని అక్రమం, ఈ రాజ్యంలో యీనాడు జరిగింది!''

అని విషాదంతో అన్నారు.

''ఏమిటిది ప్రభూ?''

అని తేజసింగు ఆశ్చర్యంతో అడిగాడు.

''మన వశిష్ఠులవారి వితంతుసోదరి త్రిపురాంబ లేదూ?''

"చిత్తం—మొన్న శ్రీరామపట్టాభిషేక సందర్భంలో భక్తి పరవశురాలై శివతాండవం చేసింది."

"దానిభక్తి భగ్నమైందిలే—"

"ఏమైంది ప్రభూ?"

"శిష్టాచార సంపన్నులైన వశిష్ఠులవారికి సోదరిగావుండి—వితంతువు, గర్భవతి అయింది."

ఆమాటవిని—

"హరి! హరి!" అని తేజసింగు చెవులు మూసుకున్నాడు.

"ఈ పాపకార్యం ఎవరివల్ల జరిగిందో తెలుసుకుని, దండించ వలసివుంది. ఈరాజ్యంలో ఇహనయినా వ్యభిచారం జరక్కుండా కట్టడిచెయ్యి, వ్యభిచరించినవారికి జన్మాంతర కారాగార శిక్ష విధించ బడుతుందని, దండోరా చేయించు."

"చిత్తము ప్రభూ!"

"త్రిపురాంబ విషయంలో నువ్వు స్వయంగా పూనుకుని, రహస్య పరిశోధనచెయ్యి—ఆపాపిని బంధించి తీసుకురా. వశిష్ఠుల వారి కుటుంబగౌరవం చెడకుండా కాపాడవలసిన బాధ్యత మనపై వుంది."

"రేపీపాటికి విషయం తెలుసుకుని, తమకు మనవిచేస్తా ప్రభూ!"

అనిచెప్పి, తేజసింగు ఆతావును వొదిలి వెళ్ళిపోయాడు, తేజసింగు వెళ్లిపోయిన మరికొంత సేపటికి, మంత్రి నాయనగారి దర్శనాని కొచ్చాడని ఒక పరిచారకుడు చెప్పగా, అతన్ని ప్రవేశపెట్టవల సిందిగా ఆజ్ఞాపించి, మంత్రి వచ్చినవెంటనే అతన్ని ఉచితాసనం మీద కూర్చోనియమించి—

"మంత్రీ! ఇతర సంబంధాలేవీ లేకుండా, ఎప్పుడూ గ్రంథ కాల క్షేపంతో వుండగోరిన నాకు మధ్య మధ్య అంతరాయం కలుగు తూంది. సమర్థులయిన నువ్వూ తేజసింగూవుండీ కూడా, నాకు శాంతి కలిగించలేక పోతున్నారు."

"ప్రభూ! అత్యవసర సందర్భాలలో తప్ప మేము తమశాంతికి భంగం కలిగించడంలేదు."

"ఇప్పుడొచ్చిన అత్యవసర కార్యమేమిటి?"

"తమ రాకను వ్యాపించి, అధికగౌరవంతో చూస్తున్న భక్తసమాజమును గురించి, చాలా చెడ్డవార్తలు వింటున్నాము."

"భక్తసమాజమును గురించా?"

"చిత్తం! ముఖ్యంగా ఆ మహర్షిని గురించి, గెడ్డము పెంచి, జడలు ధరించి, భక్తుడని పేరు మోసిన అతని రహస్య జీవితంలో కుళ్లు చాలా వుందని తెలుస్తూంది. అత నెక్కడెక్కడో నేరాలుచేసి ఈ వేషంతో మన రాజధాని చేరివుంటాడని, మన గూఢచారులు అనుమానిస్తున్నారు."

"అలా అనుమానించడానికిగల ఆధారాలేమిటి?"

"రాత్రులు సమాజకులు వారిలో వారు రహస్యంగా మాటలాడుకొనే సంభాషణలను బట్టి."

"ఆవిషయమును పూర్తిగా తెలుసుకోవలసిందని, తేజసింగును ఇంతకుముందే నియోగించాను."

"చిత్తం! తరువాత, వశిష్ఠులవారి వితంతు సోదరి గర్భవతి అయిందన్న విషయం నగరమంతటా అలజడి కలిగిస్తూంది."

"అప్పుడే నగరమంతటా తెలిసిందా?"

"తెలియడమే కాదు—వశిష్ఠులవారి కుటుంబాన్ని బహిష్కరించడానికి కులపెద్దలందరూ యోచనలు చేస్తున్నారు."

"నేరంచేసినవా రొకరైవుంటే—శిక్ష మరియొకరి కెందుకు? అతని వితంతు సోదరి అవినీతిగా ప్రవర్తించినందుకు అన్నగార్ని శిక్షిస్తారా?"

"కుటుంబంలో ఒకరు తప్పుచేస్తే—ఆతప్పును అర్థించిన కుటుంబమంతకీ శిక్ష విధించడం దేశాచారం?"

"తప్పును అర్థించినప్పుడు గదా! వశిష్ఠులవారు సోదరి చేసిన తప్పును అర్థించారో లేదో—అప్పుడే యెవరు నిర్ధారణ చేశారు?"

"ఇందులో కొన్ని నగరంలో చెలరేగుతున్న గాలివార్తలు కావచ్చు."

"సరి—విషయ నిర్ధారణకు తేజసింగు పూనుకున్నాడు గాబట్టి—మన మంత తొందరపడవలసిందిలేదు. నువ్వు వెళ్లి నీపని చూసుకోవచ్చు—"

అని మా నాయనగారు మంత్రిని పంపి, వెంటనే కావలి వానితో—

"ఈదిన మిక యెవరొచ్చినా—నాతో మాటలాడగల సావకాశం లేదని చెప్పు—నాకు విశ్రాంతి కావాలి." అని చెప్పగా వాడు ప్రభువాజ్ఞలు నెరవేర్చడానికి వెళ్ళిపోయాడు. శేషించిన ఆదినమంతా నాయనగారింకెవరతోనూ మాటలాడకుండా గ్రంథ కాలక్షేపం చేశారు.

మర్నాటి ఉదయం మానాయనగారు జపం చేసుకుంటున్న సమయంలో తేజసింగు ఇదువురు ఖయిదీలను భటులచే బంధింపజేసి తీసుకొచ్చాడు.

"ప్రభువు లెక్కడ?"

అని తేజసింగు నన్నడగ్గా—

"ఇంకా జపంలోంచి లేవలేదు."

అని నేను జవాబు చెప్పాను. అందువల్ల తేజసింగు మహారాజులు వచ్చేవరకూ ఖయిదీలతో వేచివున్నాడు. బంధించబడిన వారిలో ఒక పురుషుడు—ఒక స్త్రీ, భక్తసమాజానికి నాయకుడైన మహర్షి—వశిష్ఠుల వారి సోదరియైన త్రిపురాంబ—ఆయిద్దరే అని, నేను సులువుగా గ్రహించగలిగాను. మరి కొంతసేపటికి మానాయనగారు జపం పూర్తిచేసుకుని యివతలకురాగా, వారికై వేచివున్న తేజసింగు నమస్కరించి—

"ప్రభూ! గతరాత్రి నేను మారువేషంతో భక్తసమాజంలో ఒకడనై సంచరించి, విషయమంతటినీ తెలుసుకున్నాను. నర్ష—మహా—శ్మిమ—వాల—నగరములలో నేరములు చేసి—మారిదాసుగా భక్తసమాజమును వెంటబెట్టుకుని మన నగరం చేరిన యీమహర్షి, మోసగాడు—వంచకుడు అయివున్నాడు. ఇక్కడ చేరిన మొదటి వారంలోనే వశిష్ఠులవారి వితంతు సోదరిని మోహించి, అప్పటినుంచీ ఆమెతో అవినీతి సంబంధమును కలిగివున్నాడు. ఈతనివల్లనే ఈనీచురాలు గర్భము ధరించింది. ప్రభువులు విచారించి, నేరస్థులకు శిక్ష విధించవలసివుంది." అని వివరించాడు.

"మాసేనాపతి వివరించిన దానికి విరుద్ధంగా మీరేమయినా చెప్పవలసివుందా?"

అని మానాయనగా రడిగిన దానికి త్రిపురాంబ వంచిన తల యెత్తలేదు. అడిగిన దానికి జవాబు చెప్పలేదు. మహార్షి మాత్రం—

"అసత్యములు చెప్పి, ప్రభువుల రాజ్యంలో తప్పించుకుపో నవకాశంలేదు. సేనాపతి చెప్పినదంతా యథార్థం—నన్ను క్షమించి వొదిలి పెట్టవలసిందని ప్రార్థిస్తున్నాను." అని ప్రార్థించాడు.

"ఓరీ! నీచుడా! మహాభక్తుడిలానటించి—ఇంత నీచకార్యాని కొడంబడిన నిన్నెవరు క్షమిస్తారు! ఇతర రాజ్యములలో నేరములు చేసి తప్పించుకొచ్చినట్లు యిట్లు సాగదు."

అని మానాయనగారు సేనాపతితో—

"తేజసింగూ! ఈపాపు లిద్దర్నీ జన్మాంతర ఖయిదీలుగావుంచు ఇంతేగాదు—ఈరాజ్యంలో వ్యభిచారమన్నది యిక జరగకూడదు. ఇట్టి నేరంచేసిన ప్రతివారికీ ఇదే శిక్షగా—ప్రజలందరికీ తెలియచెయ్యి వ్యభిచార పిశాచాన్ని కూకటివేళ్ళతో నిర్మూలించవలసిన బాధ్యత పరిపాలకులది. ఈనీచుల్ని నాకళ్ల యెదుటనుంచి తక్షణం తొలగించు వారి పాపిష్టి ముఖాలను నేను చూడకూడదు."

అని ప్రభువులు చెప్పిన వెంటనే, తేజసింగు వార్ని ఆతావు నుంచి తొలగించి, తానున్న శిలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఈ సమాచారం అనతికాలంలోనే వశిష్ఠులవారికి, ఆయన భార్యకూ తెలిసివుంటుంది. ఆయిరువురూ అనంతరం మా నాయన గారి దగ్గరకొచ్చి, గోలుగోలున యేడ్చారు.

"ప్రభూ! మా వంశగౌరవాన్ని దగ్ధంచెయ్యడాని కాకులట మాకుదాపురించింది. ఇల్లు పట్టకుండా—యింటిపనుల్లో జోక్యం కలుగజేసుకోకుండా—భక్తసమాజాన్ని పట్టుకొని యేదుస్తూంది స్వామీ, అని తమతో లోగడ మనవిచేసుకొన్నాను—ఆకులట నిజమైన భక్తురాలనుకొని తమరు, దానిభక్తి మార్గాని కంతరాయం కలిగించవద్దన్నారు. తమ ఆజ్ఞలకు విరుద్ధంగా ప్రవర్తించలేక మేము న్నూరుకున్నాము—"

అని వశిష్ఠులవారనగా—

"అప్పటికే ఆమె శీలంచెడివుంది. భక్తసమాజం నగరంలో కొచ్చిన మొదటివారంలోనే ఆమె యీ అవినీతికి పాల్పడివుంది." అన్నారు ప్రభువులు.

"తమరానీచులకు తగిన శిక్ష విధించినందుకు మాకు పరమ సంతోషంగావుంది—కాని ప్రభూ! కులపెద్దలు మాకు బహిష్కారం విధిస్తా మంటున్నారు. ఇంతకాలమూ వేలెట్టి చూపించుకోలేని మాకుటుంబ గౌరవం ఈనాటితో నాశనం కావలసిందేనా? మేము బహిష్కారం ననుభ వించ వలసిందేనా?"

అని వశిష్ఠులవారి భార్యాసత్తి నోరూమోదుకొని యేడవడం మొదలుపెట్టింది.

"అపరాధం చేసినవారు శిక్షించబడినప్పుడు, కులపెద్దలు మీకు బహిష్కారం విధించడం దేనికి?"

"ధర్మ ప్రభువులుగాబట్టి, తమరు న్యాయా న్యాయములు నిర్ణ యించగలిగారు—కాని కులపెద్దల కామాత్రం విచక్షణ వున్నట్లు లేదు." అన్నాడు వశిష్ఠులవారు.

"ప్రభూ! అకులటపొందిన పాపిష్టిగర్భానికి విచ్ఛిన్నం కలిగించ కూడదా?"

అని వశిష్ఠులవారు అనగా మానాయనగారు రెండుచెవులూ మూసుకుని—

"ఛీ-ఛీ-ఛీ! నా రాజ్యంలో భ్రూణహత్యలు—శిశుహత్యలూ కూడానా? భరించలేను—ఆమాటలు నాకు చెప్పకండి." అన్నారు.

"మహారాజుల మనస్సుకు కష్టంతోపించరు—వెళ్లిపోదాం—పద—"

అని వశిష్ఠులవారు భార్యను హెచ్చరించగా—

"వెళ్లండి—మీకు బహిష్కారం విధించబడుతుందన్న దిగులు మా నండి—కులపెద్దలను రావించి—నేను వారితో మాటలాడి—ఏ నేరమూ చెయ్యని మీకు ఆ శిక్షవిధించడం న్యాయంకాదని చెబుతాను."

అని మా నాయనగారు చెప్పినందువల్ల, ఆదంపతు లిద్దరూ మహారాజుకు అనేకవిధాలుగా మొక్కి వెళ్ళిపోయారు.

సేనాపతి తేజసింగు త్రిపురాంబనూ, కపటమహర్షి నేగాకుండా అతనితోవున్న సుమారు ఇరవైమంది, స్త్రీపురుష భక్త సమాజకు లను చరసాలలో వుంచాడు. వారందరనూ విచారణచెయ్యగా, వారున్నూ, ఆమోసగాడికి హంగుదారులనీ—వాడిచెప్పుచేతుల్లో

వుండేవారనీ తేలింది. అందువల్లనే, తేజసింగు అందర్నీ మొత్తం ఖయిదు చేయించాడు.

అనంతరం మానాయనగారు కులపెద్దలను రావించి, వారితో త్రిపురాంబ విషయమునుగురించి సంప్రదించారు. నేరంచేసిన వారం దరూ శిక్షించబడ్డారనీ—ఏపాపమూ యెరుగనివారిపై అంతఃవిధిం చడం అక్రమమనీ వాదించి, పశిష్ఠదంపతులకు బహిష్కరణ లేకుండా చేశారు, మరి మూడు నాలుగు మాసాలకు త్రిపురాంబ కారాగారం లోనే ప్రసవించి, ఒక ఆడశిశువును కన్నది, తేజసింగు వగైరా పరి వారకులు ఆశిశువును హత్యచేసి పారెయ్యాలని సంకల్పించారు. కాని మానాయనగా రందుకు సమ్మతించలేదు.

"యుబానగరం పశిష్ఠసోదరియైన త్రిపురాంబకును, భక్తసమా జ నాయకుడయిన మహర్షికిని యీబిడ్డ జన్మించింది. ఈమెను ఎవరు నా, నిరాక్షేపణగా పెంచి పెద్ద చేయవచ్చు."

అని మానాయనగారు స్వదస్తూరీతో ఒక రాగిరేకుపైన వ్రాసి, సంతకంచేసి దాని నొకతావీదులో యిమిడ్చి, శిశువుమెడలో కట్ట వలసిందనీ—అట్లా తావీదుకట్టబడిన శిశువును మరొక దేశం తీసుకు పోయి, సంతానహీనులైవున్న వారికెవరికయినా యిచ్చివేయుట గాని, లేక పెట్టెలో ఆశిశువునుంచి, ఆపెట్టెను సముద్రగర్భంలో దిగవిడుచుటగాని, జరిగించవలసినదని ఆజ్ఞాపించారు, మహారాజుల ఆజ్ఞ ననుసరించి తేజసింగు ఆశిశువు నదేప్రకారం చేసివుంటాడు. అటుపై అనంతర మొకపదేండ్లు కాలగర్భంలో కొట్టుకొని పోయాయి, మహర్షి త్రిపురాంబ వగైరా భక్తసమాజంలో కారాగారంలో శిక్ష ననుభవిస్తూనే వున్నారు. కాని, అనంతర మొకనాటిరాత్రి కారా గృహంనుంచి గంటవినిపించింది. చరసాలలోని వారెవరయినా తప్పిం చుకు పారిపోయినప్పుడుగాని, ఏదైనా కొట్లాట జరిగినప్పుడుగాని, సైనికదళాలకు తెలుపుటకుగాను ఆగంట మోగించబడుతుంది. ఆ గంట వినినవెంటనే, సైనికదళాలు కారాగారంపోయి చేరతాయి. ఆరాత్రికూడా అలాగేజరిగింది. విశేషమేమిటని, మహారాజు వాకబు చెయ్యగా, చరసాలలోని మహర్షి తప్పించుకు పారిపోయినాడని తెలిసింది.

సైనికులు నలువైపులా పరుగులెత్తారు, నగరము, నగరపరిసర ప్రాంతాలూ గాలించారు, కాని తప్పించుకు పారిపోయిన ఆదొంగమహార్షి దొరకలేదు, ఒక్క మహార్షితప్ప, త్రిపురాంబ మొదలయిన వారందరూ ఎలా బంధించబడిన వారలాగేవున్నారు. మర్నాడ సైన్యాధిపతి, మహారాజులు, కారాగృహాధికారులను పిలిపించి ఆదొంగమహార్షి ఎలా పరారి అయినదీ విచారించారు. అందుకువారు చేసిన పరిశోధనా ఫలితమును ఇలా చెప్పారు—

"ప్రభూ! ఇందు, రక్షకభటుల అశ్రద్ధకాని—కారాగృహ శాఖవారి నేరంగాని యేమీలేదు, ఆఖయిదీ ప్రతినిత్యమూ ఉదయ కాలకృత్యాలు తీర్చుకొనే నిమిత్తం యువతలకు తీసుకురాబడుతుంవాడు. కాని క్రితంరాత్రి, తనకు విపరీతమయిన కడుపునొప్పి వచ్చిదనీ—అవతలకు వెళ్లాలనీ—అక్కడి కావలివార్ని కోరగా, ఇద్ద విచ్చుకత్తులు ధరించిన రక్షకభటులు వానికి చెరొకవైపునా నిలి యువతలకు తీసుకొచ్చారు. రాత్రిభాగం గాబట్టి, వాడిని మామూ మరుగుదొడ్డికి తీసుకుపోక-చరసాలావరణలోనే వున్న మామిడితోపులో కూర్చోమన్నారు. వాడావిధంగా కడుపునొప్పి నభినయిస్తూ కొంతసేపు కూర్చున్నాడు, రక్షకభటు లిద్దరూ దగ్గరలోనే వున్నారు, కూర్చున్నవాడు కూర్చున్నచోటులోనే మాయమైనాడట—అడుగుల చప్పుడయినా వినిపించలేదట—తక్షణం గంట మోగించబడింది—సైనికదళాలన్నీ వచ్చిపడ్డాయి—కాని, ఎంత వెదికినా ఆ మోసగాడు మాత్రం కనుపించలేదు."

దానినిబట్టి, తేజసింగుగాని, మహారాజుగాని, ఏమీ నిర్ణయం చెయ్యలేకపోయారు. నేరం దొరకనిదే, రక్షకభటులనుగాని, కారాగృహశాఖవార్నిగాని, ఎలాశిక్షిస్తారు? అందువల్ల ఆవిషయమంతటితో పరిసమాప్తి పొందింది. అప్పటినుంచి, ఖయిదీలను రాత్రులందు యువతలకు తీసుకురాకూడదని, కొత్తచట్టం ప్రవేశించబెట్టబడింది. ఏమైతే యేందుకూ? నాటికీనేటికీ ఆదొంగమహార్షి చిక్కలేదు. కాని వాడిమూలాన, రాజధానిలో యింతవరకు ఒక్క వ్యభిచారపు నేరమన్నా జరగనిమాట ఖాయం!

విజయకుమారా! ఇప్పుడా కుండిననగరరాజకుమార్తె, చింతామణిదగ్గర చేరినవాడు, ఆమెచేత ఈప్రశ్నల నడిగించి, మావివరాలు,

తన ప్రియురాలిసంగతి తెలుసుకో గోరుతున్నవాడూ—ఆకపట మహాశ్రేనని నువ్వన్నా వూహించివుంటావు. మానాయనగా రంత రించినా, వారిసంతతి అంతరించలేదు-వారి పరిపాలన అంతరించలేదు. ఆమోసగాడి ప్రాణం తియ్యడానికి, మేము, మాబల్లా చాలు—వాడు తిరిగి యీగడ్డలో అడుగు పెట్టగలడన్నమాట సర్వకల్ల-లే-డయచేసి, వాడుండే రాజ్యానికి మార్గమెట్లో చెప్పు—నాఒక్క వ్రేటుతో వాడిశిరస్సు ఖండిస్తాను, మా నాయనగారు చెయ్యలేని పని నేను చేస్తాను."

అని అప్పటి ప్రభువు అశ్వనీకుమార్ ఉద్రేకంతో చెబుతుండగా సేనాపతి ఆనందసంభ్రమాలతో, ధీరమల్లు సుమబాలను తనవెంట తీసుకొని అక్కడికొచ్చాడు. ధీరమల్లు సుమబాలలు అశ్వనీకుమార్, విజయకుమారులకు నమస్కరించి నిలుచున్నారు.

"అయ్యా! నేనాజన్మాంతమూ పుత్రికాదుఃఖంవల్ల క్షీణించి పోకుండా, నాకు పుత్రికాభిక్ష పెట్టిన నీవుపకారాన్ని జన్మజన్మలకీ మరిచిపోను. ఇక మిగిలిన శుభకార్యంకూడా నీచల్లని చేతులమీదు గానే జరగాలి." అని తేజసింగు పట్టలేని సంతోషంతో అన్నాడు.

"మిత్రమా! నాలేఖ నాదరించి సుమబాలసయితంగా వెంటనే బయలుదేరి వచ్చినందుకు పరమసంతోషం—అదేగౌరవం నాయం దుంచి, నిన్ను వలచిన యీ మోహనాంగినిచేపట్టి, తేజసింగుకు అల్లుడవై, ఈరాజ్యానికి ఆప్తబంధువ్వు కాగలవని ఆసిస్తున్నాను."

అంటూ విజయకుమారు ముందర, కానున్న అల్లుడు మామల చేతులుకలిపి, అనంతరం ప్రేయసీప్రియుల చేతులు కలిపాడు.

"ధీరమల్లు చెప్పబోయే మాటలు నేనే చెబుతున్నాను. ఇంతటినుంచి, తేజసింగు కేవలం సైనికాధిపతిగా మాత్రమే వుం టాడు-ధీరమల్లు నాకు ప్రియమంత్రిగావుండి, ధరాపాలన సక్రమంగా జరిగేటట్లూ చేస్తాడు! అది నీకు సమ్మతమేనా?"

అని ప్రభువు అశ్వనీకుమారు అడిగినదానికి తేపసింగు నమస్క రించి—

"ప్రభూ! నాకిక ఆసైన్యాధిపత్య పదవిలేకపోయినా యేటు వంటి విచారమున్నూ వుండదు—పరమసంతోషంతో విశ్రాంతి తీసుకుంటాను." అన్నాడు.

"వయసులోవున్న వారికి విశ్రాంతి పనికిరాదు—కష్టించి దేశానికి సేవచెయ్యవలసిందే."

అన్నాడు విజయకుమారు.

"ఈ సందర్భంలోనే నాదొక్క మనవి—ఏమంటే, నేనింతవరకూ శ్రీమంతులనుంచి దోచుకొన్నధనం అనేక కోట్లువుంది—తేజసింగు దగ్గరకూడా అంతధనమూ వుండివుంటుంది—ప్రభువులు ఈరెండు మొత్తములూ ఏకంచేసి, కూడుగుడ్డలు లేనివారికై వినియోగించవలసివుంది."

అని ధీరమల్లు చెప్పగా.

"ఈక్షణంనుంచీ నువ్వు సుమబాలకు భర్తవేగాకుండా యశానగర ప్రధానమంత్రివి, రాజ్యపరిపాలనను, ఖజానాను శాసించగల అధికారంనీది. నా తండ్రిగారివలెనే నేనున్నూ నామమాత్రంగా వారి సింహాసనము నాక్రమిస్తున్నాగాని, ప్రజలక్షేమము-ప్రభువులక్షేమము గమనించి, పరిపాలన సాగించవలసినవాడవు నువ్వు!"

అని అశ్వనీకుమారు చెప్పినదానికి అందరూ సంతోషపడ్డారు.

"ఎవరికోరికలు వారు తెలుపుకున్నారు—నెరవేర్చుకున్నారు—నావిషయ మెవరూ గమనించడంలేదు."

అని సుమబాల అనగా—

"గమనించ కేమున్నా దేవేంద్రవైభవంగా వివాహం జరిగించడానికి మీనాయనగారు మీరొచ్చేటప్పటికి ఏర్పాటులన్నీ పూర్తిచేశారు, మీదంపతులు వివాహమంటపంచేరడమే తరువాయి ఇంకేంకావాలి?"

అని అశ్వనీకుమార్ అంటుండగా, వివిధమంగళ వాద్యాలు భవనమంతటా ప్రతిధ్వనించాయి.

"అదిగాక, ప్రభూ! ఈ ధీరమల్లుతో యుద్ధంచేసినప్పుడు విడివడిన నావేణీబంధం ఆనాడుమొదలు నేటివరకూ అల్లేజీరాడుతున్నది..." అని సుమబాల తిరిగి అంది.

"అవును-నువ్వు పూనిన ప్రతిజ్ఞ నెరవేరిందిగదా! ఇక కురులు ముడివేసుకోరాదా?"

అన్నాడు అశ్వనీకుమారు.

"సుమబాల అభిప్రాయం అదికాదు ప్రభూ! వధీరుడిచేతు లామె కురులముడి, విడడానికి కారణమైనవో—తిరిగి ఆచేతులతోనే, జీరాడుతున్న ఈమగువవేణీ భారం తిరిగి ముడిపడవలసివుంది—అని ఆమెభావం—కాదా చెల్లీ?"

అని విజయకుమారుడనగా, సుమబాల సిగ్గుతో తలదించు కుంది, ధీరమల్లు చిరునవ్వుముఖంతో, జీరాడుతున్న ఆమె కురులనె త్తి స్వహస్తాలతో ముడివేశాడు, సుమబాల ముఖం తృప్తిని సూచించింది.

"ఇంక ఆలస్యం దేనికీ—కళ్యాణమంటపములో పురోహితులు వేచివుంటారు." అని తేజసింగు హెచ్చరించగా—

"కొంచం వ్యవధికావాలి—అపరంజిపల్లెలో మా అమ్మగారు, చెల్లాయిలు, తాతగారు, వగైరా ఆత్మీయులున్నారు-వారిని రావించ వలసివుంది."

అని విజయకుమారుడనగా—

"ఓదానికేముంది? నిమిషాలమీద మీ ఆత్మీయులనందర్నీ నేను రావించగలను. అంతవరకూ మీరు విశ్రాంతి తీసుకోండి."

అని తేజసింగు ఆపనిమీద వెళ్లాడు. ధీరమల్లు సుమబాలలు, వారికై నిర్ణయించబడిన ఏకాంతమందిరానికి వెళ్లారు. తన ఆత్మీయు లొచ్చేలోపుగా, ధీరమల్లు పాతాలమందిరాలలో వున్న తన పరివార జనమందరూ రాగల యేర్పాటులను తాను స్వయంగా చేసుకున్నాడు.

"మన ప్రయాణాని కీశుభకార్య మొకటి అడ్డొచ్చింది-ఆకాస్తా అయిపోయినతరువాత, వధూవరుల నాశీర్వదించి, మనవుభయులం కుండిననగరానికి ప్రయాణమైపోదాం—ఆకపట మహర్షిని వాత మారుద్దాం."

అని మహారాజు చెప్పినందువల్ల అంతవరకూ విజయకుమారు కూడా ఆగవలసి వచ్చింది.

సాధ్యమైనంత అనతికాలంలో, ధీరమల్లుయొక్క ఆత్మీయులు, పరివారజనం యమునానగరం చేరుకున్నారు. కొడుకు పెళ్లికొడుకై నందుకాతల్లి—తమకో అందమైన ఒదినకాబోతున్నదని ఆచెల్లా యిలు—ముసలితనంలో మనమడిపెళ్లి కళ్లారా చూడబోతున్నందుకా తాతగారు, తమనాయకుడికి శత్రువులయిన వారందరూ వశులై, అతని చెప్పుచేతల్లో కొచ్చినందుకు పరివారజనం—మితిలేని సంతో

వమును పొందుతుండగా, తేజసింగు శుభసమయాన, నగరప్రముఖులను, తన బంధుపరివారమును, మహారాజుల బంధుకోటినీ రావించి, సర్వజనులూ మెచ్చుకొనేలాగ, దేవేంద్ర విభవంగా వివాహకార్యమును నెరవేర్చాడు. విజయకుమార, అశ్వనీకుమారులు పెళ్ళికిపెద్దలు గనుక, వధూవరుల నాశీర్వదించారు. వేడుకలు ఉత్సవములు ఇంకా ముగియకమునుపే-అశ్వనీకుమారు తేజసింగును వేరుగాపిలిచి, విజయకుమారుని సర్వవృత్తాంతమూ అతని కెరుకపరచి, అతడు నాగపురయువరాజనీ-తమ్మొకప్పుడు మోసంచేసి, ఖయిదునుంచి పరారి అయిన ఆకపటమహర్షి, కుండిననగరంలో చింతామణి అనే రాజకుమార్తెను వశంచేసుకుని అక్కడవున్నాడనీ—తానతనిపై కక్షతీర్చుకోడానికి విజయకుమారునితో, కుండిననగరం పోనున్నాడనీ చెప్పి తాను తిరిగి వచ్చువరకూ, ధీరమల్లు ఆజ్ఞలకులోబడి పరిపాలనాక్రమం సాగిస్తూ వుండవలసిందనీ—నెమ్మదిమీద ధీరమల్లుకుకూడా, తన ప్రయాణవివరములు తెలుపుడు చేయవలసిందనీ కోరాడు.

అనంతరం అశ్వనీకుమార్, వసంతకుమారు లిద్దరూ ప్రయాణమున కవసరమైన సాధనసామగ్రి చేకూర్చుకుని, ఇరువురూ చెరొక ఉత్తమాశ్వంపైనా బయలుదేరారు.

## ४०

అపూర్వచింతామణి ప్రశ్నలకు జవాబు చెప్పడం సాధ్యంకాని పనిగా ఎల్లరాజలోకానికీ అర్థమయింది. అటుపై ఒక్కడుకూడా అందుకు ప్రయత్నం చెయ్యలేదు. అనవసరంగా పోయి, ఆమె ఖడ్గానికి బలికావడమెందుకని యెవరిమట్టుకువారు విరమించుకున్నారు. ఇక చింతామణి పూనిన వ్రతం పరిసమాప్తిని పొందేదెలాగో ఎవరికీ అర్థం కావడంలేదు.

అంతకు ఏడుదినాల క్రితంనుంచి శోభాదేవి ఉపవాసదీక్షలో వుండి, దేవికి పూజలు చేస్తూంది. ఇరవై ఒక్కరోజు లాప్రకారం చెయ్యడాని కామె వ్రతం పూనింది. వ్రతదీక్షలోవుండిన్నీ తన నిత్యవిధులను యథాప్రకారంగానే కొనసాగిస్తున్నది. చింతామణి ఆజ్ఞననుసరించి, వంటలవారుచేసిన భోజన ఫలహారాదులు తెచ్చి గురువుల కమర్చడము—చింతామణికి తలదువ్వడము—ఆమె నలంకరించ

దము—మొదలయిన పనులను వేటినీ మానలేదు. ఒకనా డామె మామూలు అలవాటు ప్రకారం, గురువు, బాలమహర్షికి ఆసనాదు లమర్చి, భోజనసామగ్రి తెచ్చి—వారి నాహ్వానించింది. అతను కూర్చుని భోజనానికి ఉపక్రమించాడు. శోభ అతనికి కావలసిన దానిని వడ్డనచేస్తూ, ఆచేరువలోనే నిలిచివుంది. బాలమహర్షి ఆమె తోనే గాక. మెవరితోనూ విస్తారం మాటలాడేదిలేదు. వారంరోజు లలో ఒకటి రెండు మాటలుతూచి, అంతగా అవసరమైనప్పుడు ఎవ రితోనయినా మాటలాడేవాడు. అటువంటి దానాడు శోభతో యిలా సంభాషించాడు.

"శోభా! నీపూజ యింకా మెంతకాలముంది?"

"స్వామీ! ఇరవైరొక్క రోజులలో ఏడురోజులయింది."

"ఇంకా పద్నాలుగురోజులుంది గాబోలు!"

"చిత్తం"

"కఠినోపవాసాలతో ఎందుకు చేస్తున్నట్లీ పూజ?"

ఆమె బదులు చెప్పలేదు.

"నీపెండ్లికా? నీదేవి పెండ్లికా?"

"నాదేవి చింతామణికి ముందు వివాహం కావాలి. అటుపైన నావిషయం."

"అయితే చింతామణికి శీఘ్రకాలంలో కళ్యాణప్రాప్తి కావా లని పూజలు చేస్తున్నావన్నమాట?"

"ఇప్పటికి వెయ్యిమంది రాజకుమారులు పూర్తిఅయినారు. అటుపైన మెవరూ రావడంలేదు స్వామీ!"

"వొస్తారు! చింతామణికి అచిరకాలంలోనే కళ్యాణమవు తుంది."

"ఏమో స్వామీ, సంవత్సరాలు గడిచిపోతున్నవేగాని, ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పగలవారొక్కరూ రావడంలేదు."

"సత్ఫలితాలు కోరి చేసే వ్రతం అంత తేలికగావుండదు—అర్హత గల వరుడు నిర్ణయం కావాలనే యింతప్రయత్నం. ఇక కొంతకాలాని కయినా, ఆమె ప్రశ్నలకు బదులుచెప్పి, ఆమెను వివాహమాడగల రాజకుమారుడు లభ్యమైతే—నువ్వుకూడా అటువంటి వ్రతమునే

పూనాలి—నీకుకూడా అటువంటి కఠినతరములయిన ప్రశ్నలు కొన్ని చెబుతాను—''

అని బాలమహర్షి యింకా యేమో చెప్పబోతుంటే, శోభకు గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

''స్వామీ, వొద్దులెండి, రాజకుమారి పెళ్ళి కవసరమయినంత పెద్ద ప్రయత్నం నాపెళ్ళి కవసరముండదు. నాకొకవేళ పెండ్లి కాక పోయినా విచారించను. నేనొక సామాన్య చెలికత్తెను.''

''అయినా సౌందర్యంలో నువ్వు మీరాణిని మించివుంటావు—నీయౌవనసౌందర్యాలకు తగిన వరుడు రావద్దా?''

''నా అదృష్టం మెలావుంటే అలా జరుగుతుంది—నా గురించి గురువుల కేమీ శ్రమవద్దండి!''

అంటుంటే బాలమహర్షి ఆమెవైపు ఒకసారి తీక్షణంగా చూశాడు. భయంవల్ల ఆమె శరీరం కంపించింది. ఆతావును వొదిలి వెళ్ళిపోతే బాగుండుననుకుంది. కాని గురువుల భోజనమింకా పూర్తి కాలేదు. అదృష్టవశాత్తూ ఆసమయంలో చింతామణి అక్కడికి రావడంవల్ల, శోభకు ధైర్యం కలిగింది.

''దేవీ! గురువులకేం కావాలో చూస్తుంటావా! అమ్మవారి దగ్గర దీపముందో లేదో ఒకసారి పోయి చూసుకొస్తా.''

అని శోభ అనగా—

''పోయిరా అక్కా! గురువుల దగ్గర నేనుంటా.'' అంది చింతామణి. శోభ వెంటనే ఆతావు వొదిలి వెళ్లింది. బాలమహర్షి గుడ్లురచేశాడెందుకో—చేస్తూ చేస్తున్న భోజనమును వొదిలి, లేచి. చేతులు కడుక్కొని వడివడిగా తనగదిలోకి పోయాడు. చింతామణి విభ్రాంతురాలయింది. గురువుల ఆగ్రహానికిగల కారణమేమిటో అర్థం చేసుకోలేక తొట్రుపడింది. తానున్నూ మెల్లిగా అతని ననుసరించి వెళ్ళింది. కొంచంసేపు మౌనంగా అతని కెదురుగా నిలిచింది. అతను పలుకలేదు.

''గురుదేవా! మాఅపరాధమేమయినా వుందా? వుంటే క్షమించండి! భోజనమైనా పూర్తిగా చెయ్యకుండా వచ్చేశారెందుకో!''

అని, చింతామణి గద్గదస్వరంతో అడిగింది.

"నీప్రశ్నలకు జవాబులు చెప్పవలసిన అవసరం మాకు లేదు—నువ్విక్కడనుంచి వెళ్లవచ్చు."

అని అతను తీక్షణంగా అనడంవల్ల, చింతామణి అక్కనుంచి వెళ్లిపోక తప్పిందికాదు. అక్కడనుంచి తిన్నగా శోభదగ్గరకొచ్చింది. శోభ అమ్మవారి దగ్గిర దీపం సరిచేసుకుని, పూజ అంతక్రితమే ముగిసినందువల్ల, అక్కడి పూజాద్రవ్యాలను సర్దుతూంది.

"గురువుగారు భోజనం చెయ్యకుండానే లేచిపోయారు—వారికంత కోపం యెందుకొచ్చింది శోభా?"

అని చింతామణి అడిగిన దానికి శోభకూడా చాలా ఆశ్చర్యపడింది.

"భోజనం వొదిలి వెళ్లారా?"

"ఆఁ! వారి కింత ఆగ్రహం ఎన్నడూ రాలేదు. వార్ని నువ్వేమయినా ప్రశ్నించావా అక్కా?"

"నే నేమీ ప్రశ్నించలేదు దేవీ! మామూలుగానే, భోజన పదార్థా లన్నింటినీ అమర్చి, చేరువలో నిలుచున్నాను. ఎన్నడూ లేం దీనాడు వారు తమంతటతామై నన్ను పలుకరించారు."

"ఏమనీ?"

శోభ గురువులకూ తనకూ జరిగిన సంభాషణ అంతా చింతామణికి చెప్పింది. గురువుల కోపాని కందేమీ కారణం కనుపించలేదు చింతామణికి.

"నువ్వుకూడా నాలాగే, గురువుల చెప్పిన ప్రశ్నలకు జవాబు చెప్పగల వరుణ్ణి పెళ్లిచేసుకోడాని కంగీకరించలేదని వారాగ్రహించి వుంటారు."

"అంత్య నిష్టూరంకంటే ఆది నిష్టూరం మేలుకదా!"

"నిజమంతే"

"అయినా పెళ్ళికంత పెద్ద ప్రయత్నం దేనికీ! నువ్వా, యోగ్యురాలవుగాబట్టి, నన్నొక తోబుట్టినతోడుగా చూసుకుంటున్నావు—రాజదంపతులు దయామయులు కనక, నన్ను తమస్వంతపుత్రికగా యెంచి ఆదరిస్తున్నారు. లేకుంటే నేనెవరు? తలిదండ్రులులేని అనాధని—వెలకు కొనబడిన బానిసని—అంతఃపురంలో ఊడిగం చేసుకోవలసిదాసీని—కాదా?"

"అబ్బ! ఇప్పుడామాటలన్నీ దేనికి శోభా!"

"అటువంటి నాపెళ్ళికి, గురువులు తిరిగి నాకేవో ప్రశ్నలు చెప్పడము—ఆప్రశ్నలకు జవాబులు చెప్పలేక తిరిగి కొన్నివేలమంది రాజకుమారులు హతులుకావడమూ జరగాలనా? ఇంతవరకూ జరిగిన హింసాకాండ చాలదా?"

అని శోభచెప్పినమాటలు సత్యదూరములు కావు గనుక—చింతామణి ఏమీ బదులు చెప్పలేదు.

"గురువు కాగ్రహం కలుగుతుందనీ—వారి కసంతృప్తికలుగ కూడదనీ, నువ్వింతకాలం పడ్డకష్టాలకు—పట్టిన ప్రతిజ్ఞకూ కలిగిన ఫలితం చూస్తున్నాము గదా!"

"ఆమాట చెప్పకుశోభా! గురువులు నన్నేమీ నిర్బంధం చెయ్యలేదుగదా! వారి నియమాలు పాటిస్తానని, నేనంగీకరించి అటువంటి ప్రబల ప్రతిజ్ఞను పూనాను. సత్ఫలితాలకై చేసేవ్రతం కష్టతరంగానే వుంటుంది. అందునుగురించి గురువులను నెపపెట్టకూడదు."

"గురువుల నెపపెట్టగల తాహతు నాకెక్కడుందిలే దేవీ? జరుగుతున్న విషయాలను చెబుతున్నానంతే."

అని ఒకనాడు కుండినవగర విలాసమందిరంలో చెలులిద్దరూ మాటలాడుకొంటున్న సమయంలో, ఒక పరిచారిక వచ్చి—

"దేవీ! ప్రభువులు—కీర్తికాములు వేంచేస్తున్నారు."

అనిచెప్పగా, చింతామణీ శోభలు, తమసంభాషణ నంతటితో విరమింపజేసుకొని, మహారాజు కెదురేగి, మందిరాంతర్భాగానికి తీసుకొనివచ్చి, ఉచితాసనంమీద కూర్చుండజేశారు. పితృసమానుడైన మహారాజుకు శోభ వింజామర వీస్తోంది. చింతామణి, తండ్రిగారికి దాపులో కూర్చుని—

"అమ్మ సురక్షితమేగదా నాన్న!" అని అడిగింది.

"మాకు సురక్షిత మెక్కడనుంచి వస్తుందిలే తల్లీ! జీవచ్ఛవములమై దినాలుగడుపుతున్నాము. దానికేమిలేగాని—ఇప్పుడొక ముఖ్యావసరమొచ్చి, గురువుల దర్శించాలని వచ్చాను. అదేమంటే—నిన్ను వివాహమాడగోరి వచ్చి, నీచేతహతులయిన రాజకుమారుల తండ్రులందరూ, ఏకమై ఒక మిత్రమండలిగాకూడి, నాకు రాయబార మంపారు. వెయ్యిమంది రాజకుమారులను హతమార్చిన చింతామణి

వ్రతం అక్రమమైందనీ—ఎవ్వరూ జవాబు చెప్పలేని ప్రశ్నల నామె గురువు ఆమెకు బోధచేశాడనీ—అందుకుగాను ఆ వెయ్యిరాజ్యాలూ ఒకటై వచ్చి నాపై కక్షసాధించడానికి యుద్ధం చేస్తామనీ—యుద్ధ ప్రయత్నాలకు నాకొక పదిదినాలు గడువిచ్చామనీ రాయబారుని ద్వారా తెలుపుడుచేశారు. నేనెంతటి బలవంతుడ నయినా—ఎన్ని సైనికదళాలను కలిగివుండినా, వెయ్యిమందిరాజు లొక్కటైవస్తే ఏమి చెయ్యగలను? మగధసామ్రాజ్యము—కుండినగర పరిపాలనా—కీర్తికాముని ప్రతిభ—ఇంతటితో అంతరించి పోవలసిందేనా? అందు కేమయినా వేరుమార్గమున్నదా? ఈ విషయమును గురువుల నడిగి తెలుసుకోవాలనే వచ్చాను.”

చింతామణికి తలపై పిడుగుపడినట్లయింది, తాను జన్మించి తనకన్నవారి కెన్ని యిబ్బందులు తెచ్చిపెట్టవలసివచ్చిందా అని కుమిలి కుమిలి యేడవడం మొదలుపెట్టింది.

“అయ్యో! నాన్న! నావల్ల మీకూ, మీరాజ్యానికీ యెన్ని తిప్పలు కలిగాయి!—పాపాత్మురాల్ని మీగర్భాన ఎందుకు పుట్టాను! తలిదండ్రులకు శాంతి కలిగించలేని సంతానమది బ్రతికి వుండడంకంటే చావడం మేలుకదా! నావల్ల మీకు శాంతిలేకపోగా, మీదు మిక్కిలి కుటుంబనాశనము—రాజ్యపతనముకూడా కలుగబోతున్నవి గదా! వెయ్యిమంది రాజులొకటై వస్తే యెవరుమాత్రం యెదిరించగలరు? అసలే ఆగ్రహావేశులైవున్న గురువు లిప్పుడు దీనికేంచెబుతారో! నాన్నా! నేను పుట్టగానే ఏగరళమైనా గొంతుకలోపోసి, నన్ను చంపినట్టయితే—మీకు, మీకుటుంబానికీ, మీరాజ్యానికీ యిన్ని తిప్పలు కలిగేవి కాదుగదా!”

అని చింతామణి కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తుంటే, ఆమె నోదార్చడం కీర్తికామునికి కష్టతరమైంది.

“కర్తవ్యమాలోచించడం అవసరంగాని, దుఃఖించి ప్రయోజన మేముంటుంది.”

అని శోభ హెచ్చరించినమీదట, చింతామణి కళ్లనీళ్లు తుడుచుకుంటూ—

“రానాన్నా! గురువులను దర్శింతువు గాని”

అని, తండ్రిగార్ని వెంటబెట్టుకుని, బాలమహార్షి వున్న మంది రానికి తీసుకొని వెళ్ళింది. అప్పు డతను ఏదో గ్రంథమును చదువు కుంటున్నాడు.

"మహారాజులు గురువుల దర్శనానికి వచ్చారు."

అని చింతామణి భయభక్తులతో చెప్పగా—

"పని?"

అని బాలమహార్షి క్లుప్తంగా అడిగాడు.

"అత్యవసర కార్యముండడంవల్లనే వచ్చాను స్వామీ? లేకుంటే అనవసరంగా మీ ప్రశాంతతకు భంగం కలిగించను."

అని కీర్తికాముడు చింతామణితో చెప్పిన విషయము లన్నిం టినీ మహార్షికి చెప్పి—

"ఇంతటితో మేము మా రాజ్యము—నామరూపాలు లేకుండా నసించి పోవలసిందేనా స్వామీ!" అని అడిగాడు.

"ఏకాలమొచ్చినప్పుడు దాని ననుభవించక తప్పదు—కాని, వెయ్యిమంది కాదు—లక్షమంది ఒకటైవచ్చినా, కుండిననగరంలోని గడ్డిపోచయినా కదిలించలేరు. మీరు వెళ్ళి నిశ్చింతగా వుండండి!"

అని గురువు చెప్పినమీదట, మహారాజు తిరిగి యేమో అడగా లనుకున్నాడు. కాని చింతామణి, గురువులను విసిగించకూడదన్న తలంపుతో, తండ్రి చెయ్యిపట్టుకుని యివతలకు తీసుకొచ్చింది.

"గురువు లటువంటి అభయమిచ్చినప్పుడు, మనకెందుకు నాన్నా విచారం?"

"అభయంమీద ఆధారపడి వుండడమేనా అని?"

"ఎందుకుండకూడదు? గురువు లెటువంటి శక్తిసంపన్నులు—? ఎంతటి మహిమగలవారు? తెలిసివుండీస్నీ వారి ననవసర ప్రశ్నలు వేసి విసిగించడం దేనికి?"

"ఏకాలమొచ్చినప్పుడు దాని ననుభవించక తప్పదని కూడా వారే చెప్పారు."

అని, మహారాజు ఆతావును వొదిలి, నిజమందిరానికి వెళ్లాడు: ధీమంతుని రావించి, బాలమహార్షి దగ్గర జరిగిన విశేషము లాతనికి చెప్పాడు. కర్తవ్యమును గురించి దీర్ఘాలోచనచేశాడు.

"మహర్షి చెప్పినదానిమీద ఆధారపడివుండడం వివేకంగాదు. మన ప్రయత్నంమీద మనముండడం మంచిది." అని మంత్రి చెప్పగా—

"ధీమంతా! వెయ్యిమంది రాజులను, వారి వారి సైనికదళాలునూ ఒకసారి వస్తుంటే ఎదిరించడానికి చెయ్యగల ప్రయత్నమనగా యెటువంటిది? ఆకాశం విరిగిపడుతుంటే, కాళ్ళ నడ్డంపెట్టి జూచుచు తీసుపుసిట్ట ఆలోచన యిటువంటిదే గదా?"

"నామనవి అదికాదు ప్రభూ! వారు పంపిన రాయబారానికి ప్రతిరాయబారం పంపడం అవసరం."

"ఏమనీ?"

"వారి వారి పుత్రులయిన రాజకుమారులు, చింతామణి నియమాలకు సమ్మతించి, ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పలేనప్పుడామెచే హూతులు కావడానికి అంగీకరించి, తమంతటతామై గదా వచ్చారు? వారిని ఒకరు చేసిన మోసంగాని, అక్రమంగాని యేమీ లేదు. అందుకు వారి తండ్రులు మనపై యుద్ధానికి లేవడంలో న్యాయం లేదు—ధర్మంలేదు."

"ధీమంతా! న్యాయ, ధర్మచట్టాలకు బద్ధులైనారావిధంగా మనపై యుద్ధానికి రావడంలేదు. ప్రతిక్ సంతులు, వంశోద్ధారకులూ అయిన కుమారులను పోగొట్టుకొన్న అహంకారంవల్ల, ఆవేశంవల్ల, ఈపనికి పూనుకున్నారు. వారు ధర్మాధర్మాలు, న్యాయాన్యాయాలూ యోచించగల స్థితిలో లేరు."

"ప్రభూ! తమరు చెప్పినదికూడా నిజమే కావచ్చు. అయినా మన ప్రయత్నం మనం చెయ్యడం నేరమవదు."

"సరే నీయిష్టం—ఎవరిని పంపుతావో—రాయబార మేమని పంపుతావో—నీకు తోచిన విధంగా చెయ్యి. నాకుమాత్రం మీ ప్రయత్నంలో ఎంతమాత్రమూ ఆశ లేదు. మగధరాజ్యము—కుండిననగర పరిపాలనా—కీర్తికాముని ప్రతిభ, నాశనం కావలసిన సమయ మాసన్నమైందని తోస్తూంది. అటు గురువులు చెప్పినదానిపైగాని—యిటు నువ్వు చెప్పిన ఆలోచనపైగాని—నాకెటువంటి విశ్వాసమూ కలగడం లేదు. వెయ్యిమంది రాజులు—వెయ్యిసైన్యాలు—ఆమాట తల్చుకుంటేనే! నా ఆశలన్నీ నిరాశలవుతున్నాయి."

"ప్రభూ! నేను తమకు చెప్పజాలినంతటి వాణ్ణికాను. పరిస్థితులు విషమించి వచ్చినప్పుడు, చతురోపాయలను వినియోగించి వాటి నెదుర్కోవడం ధీరుల లక్షణం. వాటి ఫలితాఫలితాలు—కారణ కార్యాలూ యోచిస్తూ కూర్చున్న ప్రయోజనముండదు. అంతేగాక, కొత్తదళాలను ఆహ్వానించి, శత్రువుల నెదుర్కోగల సేనలు పెంచుతాను—ఆయుధసామగ్రిని వృద్ధిచేయిస్తాను. తప్పని పరిస్థితులు వచ్చినప్పుడు, యుద్ధమే చెయ్యవలసివుంటుంది."

"ధీమంతా! ఈసందర్భంలో నామెదడు పనిచెయ్యడంలేదు. కుమార్తెకు వివాహం కాలేదని విచారించనా! ఆమె పూనిన అపూర్వ వ్రతం అసంపూర్తిగా నిలిచిపోయినందుకు దుఃఖించనా? ఇప్పుడింత మంది రాజులొక్కటై నాపైయుద్ధాని కొస్తున్నారని కుంగి కృశించనా? ఏమీ చెయ్యలేను—సమయా సమయాలు, యుక్తాయుక్తాలూ గమనించి, సర్వసమర్థుడవయిన నువ్వే ఏదో చెయ్యి."

అని కీర్తికాముడు విరక్తితో చెప్పినదానిని విని ధీమంతుడెక్కువగా జాలిపట్టాడు. కలిగిన విపరీత పరిస్థితులవల్ల ప్రతిభాశాలియైన మహారాజు శక్తులుడిగి, నిస్సహాయ పరిస్థితులో వున్నాడుగదా అని విచారించాడు. ఇంతకు కారకుడైనవాడు గురువు—అయినా అతని నేమి చెయ్యడానికీ యెవరికీ అధికారంలేదు. ధీమంతుడు తనకు శక్తి కలిగినంతవరకు, మహారాజుకు ధైర్యం చెప్పడము—సామ్రాజ్య రక్షణకు తన మేధస్సును—బలమును వినియోగించడము—అంతకు మించి అతను మాత్రం ఏంచెయ్యగలడు.

మహారాజా విధంగా మంత్రితో మాటలాడుతున్న సమయంలో మంజులాదేవిగారు దర్శనం కోరుతున్నారని అంతఃపురదాసీ వచ్చి చెప్పినందువల్ల, మహారాజు దేవిని కలుసుకోడానికి వెళ్లాడు. దేవి చిరకాలంనుంచీ మనోవ్యాధివల్ల మంచమ్మైనే వుంటూంది. నేడో రేపో తన కుమార్తెకు అర్హుడయిన వరుడువస్తాడనీ—ఆమెకు వివాహమవుతుందనీ—తాను కన్నులపండువుగా చూడొచ్చుననీ—ఆమె కొనవూపిరితో మంచాని కంటిపెట్టుకుని వున్నది. మహారాజు వచ్చిన వెంటనే ఆమె వికసించిన ముఖంతో అతని నాహ్వానించింది. చిరకాలాని కామె ముఖంలో అంత నానందరేఖలు చూచి విభ్రాంతుడైనాడు. తన రాజ్యాంగ విషయాలు—వెయ్యిమంది రాజులు

తను రాజ్యంపై యుద్ధాని కొస్తున్న సమాచారమూ, దేవికి చెప్పి, ఆమె స్థిమితము నతడు మరింత చెడగొట్టదలచలేదు.

"దేవీ! నాకు వర్తమానం పంపిన కారణమేమిటి? శరీరం స్వస్థతగా వుందిగదా?" అని అడిగాడు.

"రోజూకంటే యెక్కువ స్వస్థతగా వుంది. మీకొక శుభవార్త చెప్పవలసివుండి రావించాను."

"శుభవార్త!"

అని అత నొక శుష్కహాసం చేశాడు. దేవి, దానిని గమనించకుండానే—

"ఆఁ! శుభవార్త! నాతల్లికి కళ్యాణ సమయమొచ్చింది—మంగళతోరణాలతో కళ్యాణతిలకంతో నాతల్లి నాకళ్లకగుపించింది. పెండ్లి పీటలమీద వధూవరులను నేను చూచాను. మందిర మంతటా మామిడితోరణాలు—మంగళవాద్యాలు—ఆహా! ఎంత శోభాయమానంగా వుందీ? ఎన్ని వేడుకలు! ఎంత వుత్సవం? వింటున్నారా?"

"ఆఁ! ఆఁ! వింటున్నా దేవీ?"

"అయితే మీముఖంలో సంతోషం కనుపించడం లేదేం?"

అతడు బలవంతాన సంతోషం తెచ్చుకుని, నవ్వక తప్పలేదు.

"మనకి అల్లుడొస్తాడు—వంశోద్ధారకులయిన మనుమలు కలుగుతారు."

మంజులాదేవికి మతిభ్రమించిందేమోనని అతను అనుమానపడ్డాడు. ఆమె ముఖంకేసి పరిశీలనగా చూశాడు.

"నిజం ప్రభూ! నేను చెప్పిందంతా తప్పక నిజమవుతుంది."

"ఈవేళ యిటువంటి ధోరణిలో పడ్డావేం దేవీ?"

"నాధోరణికాదు ప్రభూ! నిజంగా కలొచ్చింది—రాత్రినుంచి యీశుభవర్తమానం మీకు చెప్పాలని ప్రాణం కొట్టుకుంది. మీ రెంతకూ రాకపోయినందువల్ల కబురు పెట్టవలసివచ్చింది."

మహారాజప్పటికి విషయ మర్థంచేసుకోగలిగాడు. అహర్నిశలు అదేధ్యాసపెట్టుకొని వుండడంవల్ల—అవేతలపులు కలిగివుండడంవల్ల దేవికి కలలుకూడా అవేవస్తున్నాయని తెలుసుకున్నాడు. అమాయకురాలు కలలో కన్నదానిని, యదార్థంగా జరిగినట్లే మురిసి

పోతున్నందుకు చాలా జాలిపడ్డాడు. కాని ఆమెకు నిరుత్సాహం కలిగించడానికి కతని మనస్సంగీకరించలేదు.

"కలలు కంటున్నావా దేవీ? అవును—ఒక్కొక్కప్పుడు కలలు యదార్థములవుతాయి—"

"నాకొచ్చిన యీకల తప్పకుండా నిజమవుతుందండీ!"

"కావచ్చు."

"నేను చింతామణిని గర్భంధరించినప్పుడు—ఇక రెండు మూడు రోజులకు ప్రసవిస్తాననగా—ఆడపిల్ల కలిగినట్లు స్వప్నమొచ్చింది. ఆప్రకారంగానే ఇప్పుడు కలిగిన స్వప్నంకూడా నిజమవుతుంది. మీరింక మనస్సులో యెటువంటి విచారమూ లేకుండా సంతోషంగా వుండండి. చింతామణికి సర్వసద్గుణ సంపన్నుడైన వరుడు లభ్యమవుతాడు—అనతికాలంలోనే అతిఘనంగా కళ్యాణమవుతుంది."

తాను సంతోషంగా వుండడం విషయం యెలావున్నప్పటికీ— మంజులాదేవి సంతోషంగావుంటే, ఆమె ఆరోగ్యమయినా కొంత బాగుపడుతుందనీ మహారాజానపడ్డాడు.

"మీరిక వివాహానికి అవసరమైన యేర్పాట్లన్నీ ఘనంగా మొదలు పెట్టించండి—శోభ, మనమే తలిదండ్రులమని నమ్ముకొని వుంది—మహాబుద్ధిమంతురాలు—ఈసమయంలోనే తగినవరుడు లభ్యమయితే దాని వివాహంకూడా జరిగించడంమంచిది."

"దేవీ! నేనిక పోయివస్తాను-నువ్వు విశ్రాంతి తీసుకుంటావా?"

"నావన్నీ పిచ్చిమాటలుగా భావిస్తున్నారేమో—కాదు ప్రభూ! నాకు సాధారణంగా స్వప్నాలురావు—వచ్చినస్వప్నం యెదార్థమై తీరుతుంది."

"మంచిదే దేవీ! నాకు చాలా సంతోషంగావుంది—తొందర పనులున్నాయి—పోయివస్తాను. నువ్వు హృద్వేగం తగ్గించుకొని— ప్రశాంతంగా పడుకో."

అని మంజులాదేవిని హెచ్చరించినమీదట మహారాజా తావును వొదిలివెళ్లాడు. నిజపరిస్థితులు తెలియకపోవడంవల్ల, ఆమె పొందుతున్న భ్రాంతికి మహారాజు తనలో తానామెనుగురించి ఎక్కువ జాలిపడ్డాడు. తోటి మహారాజు లందరవలెనే తానున్నూ తనకుమార్తెకు సాంప్రదాయసిద్ధమయిన వివాహంచేసి, పదిమందిచేతా

నానవిపించుకోలేక పోయినందు కతడెంతయినా విచారిందాడు. అంతే గాక, తనకుమార్తె వివాహసందర్భంలో అనేకమంది రాజకుమారులు హతులుకావడం, అందుకు పదిమందీ పదివిధాలుగా అనడం—ఇన్ని కారణాలవల్లా మహారాజు స్థిమితం బొత్తిగా చెడిపోయింది.

ఒక మహాసామ్రాజ్యానికి అధిపతియైవుండి—నిజభుజబలపరాక్రమాలతో యెందరెందరి శత్రురాజుల నోడించి, రాజ్యాన్ని సుస్థిరం—సువిశాలం చేసుకొన్న తరువాతకూడా, తలవని తలంపుగా తలమీదపడే అవాంతరాల నతడెదుర్కోలేక అతడు తలక్రిందువుల తున్నాడంటే, దాని నేమనుకోవాలి? ముద్దుకూతురు ముచ్చట తీర్చడానికి—ఆమెపట్టు నెగ్గించడానికి—అతను వ్యర్థుడయినందుకు ఎంతయినా విచారించాడు. తనలాంటి వ్యర్థుడు పుడమికి బరువు చేటకున్నాడు. పంచాగ్ని మధ్యంవంటి పరిస్థితుల్లో నలిగిపోవడంకంటే—విడితనపడి ఎటోపోవడం మంచిదనుకున్నాడు.

మంత్రిచే పంపబడిన రాయబారులు త్వరలోనే తిరిగివచ్చారు. వెయ్యిమంది రాజులతో కూడిన మిత్రరాజ్యసమితి, కుండినగర రాయబారమును లెక్కచేయలేదనీ—నియమించుకున్న ప్రకారం వారు యుద్ధసన్నద్ధులై వున్నారనీ—తెలిసింది. దానితో మహారాజు మరింత కుంగిపోయాడు. మంత్రి ధీమంతుడుమాత్రం సర్వశక్తులూ వినియోగించి, సైనికబలాలను పెంచుతున్నాడు—ఆయుధసామాగ్రిని నిమిషాలమీద వృద్ధిచేస్తున్నాడు, ఎంతచేసినా, వెయ్యిమంది రాజులు ఒకటైవచ్చి పడితే, వారిముందర తనరాజ్యమెంత? తన సైనికబలాలెంత? అని కీర్తికాముడు కుంగిపోతున్నాడు. మానవ ప్రయత్నానికి లోటు రానియ్యకుండా మంత్రి సర్వసన్నహాలూ చేస్తున్నాడేగాని, యుద్ధంలో విజయం కలుగుతుందని కాదని—కీర్తికాముడికి తెలుసు.

ఆరాత్రి సుమారు, పన్నెండుగంటలకుపైదాటివుంటుంది. మహారాజు కీర్తికామునికి ఎంత ప్రయత్నించినా నిద్దరపట్టడంలేదు. అతని బుర్రలో సముద్రాలు ప్రవహించినట్లు—పిశాచములు కొట్లాడుతున్నట్లు—కొండలు బ్రద్దలవుతున్నట్లు—మహాభీభత్సంగా వుంటే, కంటికి నిద్దరెలాపడుతుంది? పాన్పుపైనుంచి మెల్లిగాలేచాడు. అప్రయత్నంగా మంజులాదేవి పరున్న దగ్గరకువెళ్లాడు. ప్రతిదినమూ

నిద్దరపట్టక ఆవేళకు కొట్టుమిట్టాడేదేవి ఆనాడు గాఢనిద్దరలో వుంది. ఆమెకు నిద్రాభంగం చెయ్యడ మతని కిష్టంలేకపోయింది. తిరిగి తన గదిలోకొచ్చి తనపాన్పుమీద కూర్చున్నాడు.

"ఇన్నితరాలనుంచి, కుండినగర పరిపాలన అన్యులచేతుల్లో చిక్కలేదు. ఈనాటి కదిపతనం కానయివుంది-వెయ్యిశత్రుసైన్యాల నెదిరించి, వారికోడి, కుండిననగర సింహాసనమును పరులాక్రమిస్తుంటే కళ్లారాచూసి సహించడంకంటే-అవమానం యింకేముంది? సహించలేను—ఈదారుణ విషాదసంఘట్టన భరించలేను. తెగించి ప్రాణత్యాగంచేసుకుంటే—నాకళ్ళకేమీ కనుపించదు—కుండినగరపతనం—మగధసామ్రాజ్య విచ్ఛిత్తి నేను చూడనక్కరలేదు.

కలిగిన కష్టాలకు తట్టుకోలేక, కీర్తికాముడు ఆత్మహత్య చేసుకున్నాడని లోకులనుకుంటారు—శత్రువులకోడి, రాజ్యమును పరులపాలుచేసిన అసమర్థుడు కీర్తికాముడనిపించుకోవడంకంటే, మొదటిది మేలుకదా! ఇక మంజులాదేవి—చింతామణి—వారి యోగమెలా వుంటే అలాజరుగుతుంది—వార్ని గురువు రక్షించుకుంటాడో—భక్షించుకుంటాడో-ఆపాపపుణ్యా లతనివి. నేను జాగుచెయ్యకూడదు. మంజులాదేవి గాఢనిద్దరలోవుంది, ఇదే నాకు తగినసమయం—"

అని కీర్తికాముడు తనలో నిశ్చయంచేసుకుని, పాన్పుదిగాడు-నిద్దరలోవున్న కావలవారిని అతికష్టమీద దాటి యివతల పడ్డాడు.

"అయితే—ఆత్మహత్యాకార్యము నెలా నెరవేర్చుకోవాలి? ఆయుధాలువేటినీ తెచ్చుకోలేదు—తెచ్చుకున్నా—ఈనగరంలో ఆపని జరగకూడదు. నేనాత్మహత్య చేసుకున్న విషయం తెలిసినవెంటనే మంజులా చింతామణులు ప్రాణాలువొదుల్తారు. కనుక వారికి వెంటనే తెలియకుండావుండేలాగున ఏదూరదేశమన్నా పోయి, అక్కడ నేను తలచిన కార్యమును నెరవేర్చుకోవాలి—"

అని కీర్తికాముడా అర్ధరాత్రిసమయంలో తన కగుపించిన మార్గంవయిపు వడివడిగా నడిచి వెళ్లిపోయాడు! ఆదేశానికి పాలకుడు-ఆనగరానికి ప్రభువు-తన్నెవరు చూస్తారో అని భయపడుతూ—ఎవరు పట్టుకుంటారో అని అడుగడుక్కీ జంకుతూ—ఒక దొంగ మాదిరి—ఒక వంచకునిలాగ, బెదురుతూ—వెనుదిరిగి చూసుకుంటూ, చెట్లమాటున దాగుతూ, గుండెలు చేత్తో పట్టుకొని దాటవలసిన అవ

సరమేర్పడింది. రోజులు సరిలేనప్పుడు, ప్రభువయినా ఒకటే— భిక్షుకుడయినా ఒకటేగదా!

తెల్లవారేటప్పటికి మందిరంలో ప్రభువులేడు. మంత్రి, విష యము నర్థంచేసుకున్నాడు. ఈ సమాచారం మందిరందాటి బయటికి పోకూడదని కఠినశాసనంచేశాడు. మహారాజు కనుపించడం లేదన్న విషయం మంత్రికి, మరి ఒరికొద్దరికీ మాత్రమే తెలుసు. మంజులా దేవికి సయితం యీవార్త తెలియకుండా ధీమంతుడు కట్టడిచేశాడు. తెలిసివుంటే, రాజధాని అప్పటికప్పుడే అల్లకల్లోలమైవుండేది. మహా రాజు స్వస్థతచెడి వున్నారనీ—వారినెవరూ దర్శించకూడదనీ—వారితో పనికలిగినవారు, తనతో మాటలాడవలసివుందనీ, చతురుడయిన మంత్రి నేర్పుగా ఖచ్చితమైన యేర్పాట్లుగావించాడు.

౪౧

"మిత్రమా! ఇది వాలనగరము—ఈ మహానగరాన్ని రాణీ ప్రమీల పరిపాలిస్తున్నది. ఇది మహిళారాజ్యం, పురుషులకు స్థానం లేదు. పరిపాలకులు—ప్రజలు—సైనికులదిగా సర్వజనులూ స్త్రీలు. ఈ పరిపాలకురాలు పురుషజాతిని ద్వేషించడాని కామె భగ్న ప్రేమ కారణం."

అని విజయకుమారు, అశ్వనీకుమారు కారాణి చరిత్రను క్లుప్తంగా వివరించి చిన తదుపరి—

"ఈమెకూడా ఒకప్పుడు ఆకపటబైరాగిచే మోసగించబడి, అత నపహరించిన తన ప్రాణసఖులు, వకుళా సరలను రక్షించు కొన్నది. చింతామణి నాల్గవ ప్రశ్నకు జవాబు ఈనగరవృత్తాంతమే. ఈ ప్రమీలా రాణికూడా, నీవలెనే మోసగాడయిన ఆబైరాగిపై కక్ష సాధించ వేచివుంది. నేను నాతిరుగు మార్గంలో యీమెను కలుసుకుని, నాతో కుండిననగరం తీసుకొని పోతానని వాగ్దానం చేసి వున్నాను. కనుకనే మన మిప్పుడీనగరం రావడమైంది. మనతో యీమెనుకూడా కుండిననగరం తోడ్కొనిపోవలసివుంది."

అని చెప్పి విజయకుమారు మిత్రునకమిత ఆశ్చర్య సంభ్ర మాలు కలిగించి, అతనితో ప్రమీలారాణి భవనం చేరాడు. విజయ

కుమారునితో అక్కడి కాపలావారంతకుముం దొకసారి పరిచయం కలిగివున్నవారు కనుక, వారు నగరప్రవేశం చెయ్యడాని కంతరాయం కలిగించలేదు. ప్రమీలారాణీ, భవన పరిచారికలవల్ల విజయకుమారుని రాకను తెలుసుకుని, వకుళా సరళలతో యెదురై వచ్చి ఆహ్వానించింది. విజయకుమారు, యశా'నగర ప్రభువయిన అశ్వనీకుమారు నామె కెరుకపరచి—అతడున్నూ, మోసగాడయిన బైరాగి తల ద్రుంచడానికై తనతో వచ్చినవాడనీ, తన ఐదవ ప్రశ్నకు యశా నగరమున పొందిన జవాబు—మొదలయిన వివరములన్నీ ఆమెకు తెలుపగా, విజయకుమారు, తనకు చేసిన వాగ్దానం తప్పకుండా, తిరిగి వచ్చి తమ్ము కలుసుకున్నందుకు అపరిమితానందభరితురాలై, వకుళా సరళతో తానున్నూ వెంటనే ప్రయాణమై, అశ్వనీకుమార, విజయ కుమారులతో బయలుదేరింది.

అనంతరం వారెల్లరూ కలసి, కొన్ని దినములు ప్రయాణంచేసి, మార్గంలో అందందు గల విశేషాలనూ, వింతలనూ తెలుసుకుంటూ, లోగడ విజయకుమారునకు సాయంచేసిన వారందరికీ సానుభూతులు తెలుపుతూ—శ్నిమనగరంచేరారు. విజయకుమారుతపోధనమహారాజుకు సంబంధించిన వివరములన్నీ మిత్రులకు తెలియపరచి, తన మూడవ ప్రశ్నకును, ఆనగర చరిత్రకునూ గల సంబంధమును వారికి వివరించి, తుచ్ఛురాలైన రూపసుందరి కథను వారి కెరుకపరచి, తపోధనమహా రాజున్నూ, దొంగబైరాగి రక్తం కళ్ళచూడ్డానికే వేచివున్నాడని తెలిపి, అందరతోనూ ఆ మహారాజును కలుసుకున్నాడు. విజయ కుమారు ఆడినమాట ప్రకారం తిరిగి తన్ను కలుసుకున్నందు కెక్కువగా సంతోషించి, అతనితో వచ్చిన యితర పరిపాలకుల గాథలన్నింటినీ అతడు చెప్పగా విని, తపోధనమహారాజు అమితోత్సాహంతో వారిని కలిసి తానున్నూ బయలుదేరాడు.

విజయకుమార, అశ్వనీకుమార, తపోధనమహారాజ, ప్రమిలా, వకుళా సరళాదులందరూ పరమమిత్రులై కలసిమెలసి, ప్రయాణం సాగిస్తూ మార్గమధ్యంలో విజయకుమారు చూపిన వింతలు చూస్తూ అతడు చెప్పిన వివరాలు వింటూ—అత డెన్ని కష్టములు పడ్డదీ తెలుసుకొని, ఆశ్చర్యవిభ్రాంతులవుతూ, క్రమంగా పోయి, మహా నగరం చేరుకున్నారు. ఆనగర ప్రభువయిన చంద్రసేనమహారాజును

గురించి, మిత్రులకు చెప్పి, మిత్రులను గురించి ఆమహారాజుకు వివరించి, చంద్రసేనమహారాజుతో యెల్లరునూ పయనం కట్టారు.

అటనుండి, నర్మి నగరం పోయే మధ్యదారిలో కొండలపై వున్న సిద్ధురాలిని దర్శించి, విజయకుమారు, తన మిత్రులకును ఆయోగిని యొక్క మహాత్మ్యమును—ఆమె తనకు గావించిన మహోపకారమును, వివరించి, ఆమె దయవలన తానయిదు నగరముల వృత్తాంతములు తెలుసుకొన్నట్లు యోగినికి చెప్పి, ఆమె ఆశీర్వాదములు పొంది, అంతకుముందు తానామె ఆశ్రమాన విడిచిన తన గుఱ్ఱమును తీసుకొని, మిత్రులతో తిరిగి బయలుదేరాడు.

మార్గం పొడుగునా, విజయకుమారుని సాహసప్రయాణ ఘట్టాలు తెలుసుకొని, అచ్చెరువందుతూ, అతని దీక్షా నియమాల నభినందిస్తూ, క్రమంగా కొంతకాలాని కెల్లరూ నర్మి నగరం చేరుకున్నారు. ఆనగర ప్రభువయిన విక్రమదేవుని భీషణ ప్రతిజ్ఞ—కపట బైరాగి ఆనగరంలో చేసిన మోసము లాదిగా సర్వవిషయములు విజయకుమారు మిత్రరాజుల కెరుకపరచి, వారి వారి విచిత్రగాధలు కూడ విక్రమదేవునకు వివరించి, ఆ మహారాజున కపరిమితానందాశ్చర్యములు కలిగించి, ముందు గావించుకొన్న యేర్పాటు ప్రకారం, ఆమహారాజునుకూడా తమతో వెంటబెట్టుకొని, విజయకుమారు, అధికోత్సాహంగా మిత్రమండలితో అక్కడనుంచి, కుండినగరాభిముఖంగా దారితీశాడు.

వారెల్లరూ నదీనగ, తటాకారణ్య మార్గము లన్నింటినీదాటి, అందందుగల తపోధనులను, అడవి, కొండజాతి మనుషులునూ చూచి వింతపడుతూ, నానాజాతి క్రూరమృగములను, వింతవింతవృక్షములను పక్షులనూ తిలకించి, సృష్టివైచిత్రముల కచ్చెరువందుతూ క్రమంగా ఒక కొండమార్గమును చేరారు. విజయకుమారు సూచించిన ప్రకార మెల్లరూ ఆకొండమార్గమును దాట నుద్యుక్తులై వుండగా, యెవరో ఒకవ్యక్తి అత్యున్నత పర్వతశిఖరంనుంచి, క్రిందికి దూకుతుండడమును గమనించారు. విజయకుమారుని సలహా ననుసరించి, తక్షణ మందరూ తమ తమ చేతులనేకంచేసి, వలమాదిరిగా పట్టుకున్నారు. అందువల్ల పైనుంచి దూకినవ్యక్తి కిందపడిపోకుండా, వారి

చేతులో పడ్డంవల్ల, చావకుండా బ్రతికాడు. ఆవ్యక్తి భయవిభ్రాంతులలో యెల్లరనూ తిలకించి—

"అయ్యలారా! చచ్చేటప్పుడుకూడా శత్రువుల చేతులోనే చిక్కాను. నేనందుకు విచారించనుగాని, నన్ను కుండిననగరం తీసుకొనిపోకుండా యిక్కడే వధించి—నాకవమానం లేకుండా చెయ్యండి! ఇదీ నాప్రార్థన!"

అని పర్వతశిఖరంనుంచి పడిన ఆవ్యక్తి ప్రార్థించగా, అక్కడి వారందరూ విభ్రాంతులయ్యారు!

"ఓయీ! నువ్వెవరు? మమ్మల్ని నీశత్రువులుగా యెంచడానికి కారణమేమిటి? ఈపర్వతశిఖరంనుంచి యెందుకు పడ్డావు? స్వస్థత చేకూర్చుకొని, మీవివరములన్నీ చెప్పు—" అని విజయకుమారుడడగ్గా, ఆవ్యక్తి అందరి ముఖాలవైపూ ఒకసారి పరిశీలించి—

"అయ్యలారా! అమ్మలారా! మీరు నన్ను బ్రతికించినందువల్ల నాకు నష్టమేకాని, లాభంలేదు. నేనీ సమీపమునగల, కుండిననగరాధిపతిని—నాపేరు కీర్తికాముడు—"

అనడమే తడవుగా, అక్కడి వారందరూ నిలువునా నీరయినారు, ఆశ్చర్యవిభ్రాంతులతో కొంతసేపు ఒక్కరూ మాటలాడలేక పోయారు. అనంతరం విజకుమారు—

"ప్రభూ! మగధసామ్రాజ్య సార్వభౌములు! అతులిత విఖ్యాత కుండిననగరాధిపతులు—బలపరాక్రమ తేజోవిరాజితకీర్తికామ మహారాజులు తమరా? ఈపర్వత శిఖరంనుంచి పడిపోవలసిన అవసరం తమకేల కలిగింది ప్రభూ! తమరుతలచినట్లు మేము మీకు శత్రువులం కాదు—సందేహించక మీ వివరములు మాకు తెలపండి?"

అని విజయకుమారు సగౌరవంగా అడిగినమీదట—కీర్తికామ మహారాజు, కొంత స్వస్థత చేకూర్చుకుని—

"మీరు నన్నెరుగుదురా?" అని అడిగాడు.

"ప్రభూ! సప్తాంబోధీ వలయభూమండల మంతటిలో విఖ్యాతమైన మీపేరు మాకు తెలియక పోవడం అసంభం."

అని విజయకుమారుడనగా—

"అయితే మీరందరూ యెవరు?" అని మహారాజడిగాడు.

"మావివరాలు తమకు తరువాత విన్నవించుకుంటాము, ముందర తమకీ పరిస్థితి యెందుకొచ్చిందో చెప్పండి."

అని విజయకుమారుడు తిరిగి హెచ్చరించినందువల్ల కుండిన నగరప్రభు విలాచెప్పాడు.

"నాయనలారా! నేనిప్పుడొక అభాగ్యుణ్ణి—నేను చింతామణి అనే ఒక అపురూపలావణ్యవతిని కుమార్తెగా కలిగివున్నాను. ఆ కన్యకు ఈడుగానే, సరిజోడుకాగల వరుడికోసం ప్రయత్నించి, నాకు బావమరది, బిల్వనగరాధిపతియైన ధర్మపాలునికొడుకు, అయిన ఆనందకుమారు, నాకుమార్తెకు తగిన వరుడని నిశ్చయించాను. మహావైభవంగా వివాహకార్యం జరగనై వుండగా, మాకు దైవసముడుగాను, గురువుగాను యేర్పడిన ఒకమహర్షి, శిష్యురాలయిన చింతామణికి ఏవో అయిదు ప్రశ్నలుచెప్పి, వాటికి జవాబులు చెప్పగల రాజకుమారుడు మాత్రమే తగినవరుడు కాగలడనీ—ఆమెను వివాహమాడగోరి వచ్చి, ఆమె ప్రశ్నలకు బదులు చెప్పలేని రాజకుమారుల శిరస్సుల నామెఖండించి, మందిరద్వారానికి వ్రేలగట్టిం స్తుందనీ—ఒకనియమం ఏర్పాటుచేశాడు. అటువంటి ఘోర నియమంకూడదని నేను నాకుమార్తెకు అనేకవిధాల బోధించాను. కాని, గురువులయందుండే అమితభక్తి విశ్వాసములవల్ల, ఆమె మా మాటలు వినకుండా, గురువాజ్ఞప్రకారం, ఆప్రబలవతమునే పూనింది. ఆమెనియమం ఎల్లరాజలోకాలకు తెలుపుడు చెయ్యబడింది. ఆమెను వివాహమాడగోరి అనేకమంది ప్రసిద్ధరాజకుమారులు వచ్చారు. కాని, ఒక్కరూ ఆమె ప్రశ్నలకు బదులుచెప్పినవారు లేరు. అట్టి వారందరూ నియమానుసారం ఆమెచేత ఖండించబడుతున్నారు, అట్లు ఖండించబడిన వారిసంఖ్య యిప్పటికి వెయ్యి—"

అని కీర్తికామమహారాజు చెప్పగా—

"అంతవరకూ లోకమంతటికీ తెలిసినదే—అటుపైన ఏమి జరిగింది? మీకీదుస్థితి యెందుకుకలిగింది—దయచేసి అది చెప్పండి!"

అని రాణీ, ప్రమీలాదేవి హెచ్చరించగా—

"అట్లు మా చింతామణిచే హతులైపోయిన రాజకుమారుల తాలుకూ తండ్రులు వెయ్యిమందీ, ఒక మిత్రమండలిగాచేరి, తాము తమ కుమారులను పోగొట్టుకొన్నదానికి నేను బాధ్యుడనని నాపై

యుద్ధానికి బయలుదేరారు. ఎంతటి ప్రతిభాశాలినయినా—ఎన్ని సైనికదళాలు కలిగివుండినా, వెయ్యిమందిరాజులు ఒక్కసారి తమ తమ సైనికబలాలతోవచ్చి నారాజ్యంపై బడితే, నేను వార్ని జయించగలనా? తండ్రి తాతలనుంచీ శత్రుభయంకరమని పేరుపొందిన కుండిననగర మీనాడు పరులపాలవుతుంటే చూడలేక—తీసిపోని పరాక్రమంతో విరోధిసైన్యాల నెదుర్కొని విజయాలెన్నో పొంది, సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసుకోగలిగిన నేనీనాడు, శత్రుసేనల చేతుల్లో చచ్చి అవమానం పొందడంకంటే—ఈ స్వచ్ఛంద మరణం ఉత్తమమనియెంచి, ఆత్మహత్యా ప్రయత్నంతో—ఈపర్వత శిఖరం నుంచి కిందపడ్డాను. కాని నేనీవిధంగా చావడం భగవంతుడి కిష్టం లేక పోబట్టి, మీరు తటస్థమైవుంటూరు-ఇదీ నావిషయం, మీరెవరో చెప్పి, దయతో నామార్గాన నన్నుపోనియ్యండి!''

అని కీర్తికాముడు చెప్పడం ముగించగా, అక్కడి వారొకరి ముఖాల్లోకరు చూచుకున్నారు.

''ప్రభూ! నేను నాగపురయువరాజును, నాపేరు విజయకుమారు. నేను మీ కాత్మబంధుకోటిలోని వాడినని ఎప్పుడో పెద్దలు చెప్పగా విన్నాను, మా తండ్రిగారిపేరు—చత్రపాలుడు, నాతల్లి రమాదేవి...''

అని విజయకుమారుడు చెప్పగా—

''అవును-నువ్వు మా బంధుకోటిలోనివాడవే అయివుంటావు—కాని మెదడు చెడివున్న నాకా వివరాలిప్పుడు జ్ఞాపకంలేవు.'' అన్నాడు కీర్తికాముడు.

''ఆవిషయం యిప్పుడనవసరకూడా! నాతోయిప్పుడున్న వీరం దనూ నామిత్రులు నేనిప్పుడు వీరందరితో మీనగరమే బయలుదేరి వెడుతున్నాను. ఎందుకంటే, మీచింతామణి అడుగబోయే ప్రశ్నలకు జవాబు చెప్పవలెనని, నాకు కోరికగలిగింది—''

అని విజయకుమారు చెప్పగా, కీర్తికాముడతని రెండు చేతులూ పట్టుకుని—

''నాయనా! ఆప్రయత్నం మాత్ర మొద్దు, ఆప్రశ్నల కెవరూ జవాబుచెప్పలేరు. వెయ్యిమంది ప్రజ్ఞావంతులయిన రాజకుమారు లీప్రయత్నంలో హతులయినారు—విషయం తెలిసివుండీన్నీ నిందు

ప్రాణాన్ని ఎందుకుపోగొట్టుకుంటావు? నాహితవు నతిక్రమించిన వారం దరూ, భూమిమీద లేకుండా పోయారు, నువ్వొక్కవయినా నాహితవు విను—బ్రతికిబయటపడు!''

అని, అనేక విధాల బ్రతిమాలాడు.

''ప్రభూ! ఆమెప్రశ్నలకు జవాబు చెప్పగలనన్న ధైర్యం నాకుంది. అందునుగురించి మీరు విచారించకండి.''

''ఇదివరకెందరో రాజకుమారులు ఇదేవిధంగా చెప్పారు. నువ్వుకూడా వారిలోనే జతకావడం నాకిష్టంలేదు నాయనా!''

''నేను వారితో జతకాను—నామాట నమ్మండి—''

''సరే—ఇటువంటి మూర్ఖపుపట్టు పట్టిన వారందర్నీ నేనేం చెయ్యగలిగాను నీయోగమెలావుంటే, అలా అవుతుంది—వెళ్లు—నన్నుమాత్రం, నాకూర్గాన పోనియ్యి.''

''ఎక్కడికిపోతారు?''

''చెప్పానుగదా! నేనిక బ్రతకడానికి వీల్లేదు, చావడమెలాగా ఖాయం, అటువంటప్పుడు, స్వస్థానంలో శత్రువులచేతుల్లో చావడం నాకిష్టంలేదు. నాకిప్పుడు ఆత్మహత్యే పరమోత్కృష్టమైన మార్గం.''

''ప్రభూ! నేను మీమాట నతిక్రమించానని, మీరున్నూ నామాట నతిక్రమించవద్దు—నేను మీస్థానంలోవుండి మీశత్రువులతో పోరాడతాను—నేను వారిచేతుల్లో మడిసినతరువాత, మీ యిష్టప్రకారం మీరు చేసుకోండి, అంతవరకూ మీప్రయత్నాన్ని మీరు విరమించుకోవాలి—రండి నగరంలోకి.''

''నీకేమయినా పిచ్చిపట్టిందా? వెయ్యిమందిరాజు లొకసైసైనికబలాలతో ఉరుకుతుంటే, నువ్వేమిటి, వారితో పోరడమేమిటి?''

''ఏమయితే మీకెందుకూ? నేను బ్రతికినంతవరకూ మీరు బ్రతికివుండడాని కభ్యంతరమేముంది?''

అని విజయకుమారు ఎంతచెప్పినా ఆ మహారాజు కింకా నచ్చడంలేదు.

''అవును ప్రభూ! అతను చెప్పిందాంట్లో ఆక్షేపణ ఏమీలేదు. ఫలితాఫలితాల నిప్పుడే నిర్ణయించండకంటే—కొద్దికాల మోపిక పట్టి ఆతరువాతనే మీ యిష్టప్రకారం చేసుకోరాదా! విజయకుమారు

బ్రతికినంతకాలం శత్రువులు మిమ్మల్ని ముట్టుకోరని అతను అభయ మిస్తున్నాడు—"

అని విజయకుమారునితో వున్న యితర నగరాధిపతులందరూ చెప్పినమీదట.

"అయ్యా! ప్రయోజనంలేని అభయములవల్ల లాభమేముం టుంది? నాకుమార్తె ప్రశ్నలకు బదులుచెప్పి, ఆమెను జయించ బూనడం ఎంత అవివేకమైనదనో—నన్ను నాప్రయత్నమును విర మించుకోవలసిందని నిర్బంధంచెయ్యకుండా అంత అవివేకకార్యమే అనడంలో సందేహంలేదు. వెయ్యిమంది రాజులను, వారిసైన్యాలనూ ఎదిరించి విజయకుమారు పొందుతానంటున్న ఈయువకుని సాహసం మెచ్చుకో దగిందేగాని, తనశక్తిని ఎదటిశక్తినీ తెలుసుకోలేని అమా యకుడని చెప్పవలసివుంటుంది." అన్నాడు కీర్తికాముడు.

"అందువల్ల తమకు నష్టమేమీ లేదుకదా ప్రభూ?"

అని విజయకుమారుడు తిరిగి సవినయంగా అడిగాడు.

"ఎందుకులేదూ? నాకు చావు ఎలాగాఖాయం. అంతమాత్రా నికి నాకై నువ్వు శత్రువుల నెదిరించడమెందుకు? నీ అనంతరం నేను తిరిగి ఆత్మహత్య చేసుకోవడమెందుకు? ఇదంతా నీకు ప్రయాస— నాకు ఉపయోగంలేనిది. ఇప్పటికయినా నాదారిని నన్ను పోనియ్యండి- మీకెంతయినా పుణ్యముంటుంది."

"ప్రభూ! వీల్లేదు—నేను బ్రతికివుండగా మీరు ఆత్మహత్య చేసుకోవడం జరగదు."

ఆపేచీ పరిష్కార మయ్యేది ఎలాగా అని, అక్కడి వా రాలో చించడం మొదలుపెట్టారు. విజయకుమారుని పట్టుదల తెలిసివారు గాబట్టి అతనికిచెప్పి ప్రయోజనం లేదనుకున్నారు. మహారాజుకు చెప్ప గల శక్తి ఎవరికీలేదు. అందువల్ల విజయకుమారుడే తిరిగి అన్నాడు.

"ప్రభూ! ఇక ఒక్కటేమార్గం—నేను బ్రతికివుండగా మిమ్ము ఆత్మహత్య చేసుకోనియ్యను, మీపట్టును మీరు వొదలరు, కనుక ముందర నేను ఆత్మహత్య చేసుకుంటాను. అటుతరువాత మీపని మీరు చేసుకోండి."

అంటూ విజయకుమారు ఒరనుంచి కత్తినిదూసి, తనకంఠానికి గురిపెట్టుకోబోతుండగా, కీర్తికాము డతనిచేతులు పట్టుకుని వారించి-

"రాజకుమారా! నువ్వింతటి సాహసకుడవనుకోలేదు." అన్నాడు.

"మీరు అనుకోని విషయాలు చాలజరగవచ్చు, కనుక దయ చేసి, యిప్పటికయినా నామాట వింటారా?"

అని విజయకుమారు డడిగినదానికి—

"బిడ్డా! ఒకరికోసం నువ్వెంతయినా త్యాగం చెయ్యగల ధీరుడవని నాకిప్పుడర్థమైంది. నీ యిష్టప్రకారమే కానియ్యి, భగవం తుడు నీపరిచయము నెందుకు కలిగించాడో! ఏమి జగరనై వుందో."

అని కీర్తికాముడు తన ప్రయత్నమును విరమించుకున్నాడు. విజయకుమారుని కార్యదీక్ష నక్కడివారందరూ అనేకవిధాల అభినం దించారు. విజయకుమారు డనంతరం, నర్షి, మహా, శ్మీమ, వాల, యబానగరాధిపతులు వెంటరాగా, కీర్తికామునితో కుండిన నగ రాభి ముఖంగా బయలుదేరాడు.

క్షణంలోవచ్చే అవాంతరాన్ని కానలేముగదా! కలిగిన పరిస్థితు లకు జీవితంపై విరక్తిపొంది—రానున్న అవమానమును భరించలేక, ఆత్మహత్య పూనుకున్న కీర్తికామమహారాజు భవిష్యత్తు కనురెప్ప పాటులో తారుమారయింది! అతని ప్రయత్నం తలక్రిందులయింది!

## ౮౨

కుండిననగర శాంతిభవనంలో, శోభాదేవి చింతామణికి తల దువ్వి జడ అల్లుతూంది.

"ఉపవాస దీక్షలోవుండి, నీకెందుకక్కా యీపనులన్నీ? నా తల నేను దువ్వుకోలేనూ?"

"నీకు పెళ్లయ్యేవరకు, నీతల నేనే దువ్వాలి—నిన్ను నేనే ముస్తాబు చెయ్యాలి."

"ఆపైన?"

"ఆపైన నేనెందుకులే."

"మరెవరూ?"

"రాబోయే వరుడు—"

"పోఅక్కా! నీకంతా వేళాకోళం! తలదువ్వి ముస్తాబులు చేసే వరుణ్ణి నువ్వు సంపాదించుకుందువుగాని లేగానీ, ఉపవాసదీక్ష అయ్యే వరకు, నువ్వేపనులూ చేయొద్దు—నేనే చేసుకుంటాను."

"ఫరవాలేదు దేవీ! జగన్మాత అనుగ్రహమో—యేమో—ఉప వాసంలోవున్న, నాకు నీరసంగా లేదు—మామూలుగానే వుంది."

"ఎవరు నమ్ముతారు?"

"నమ్మకపోతే నేనేం చెయ్యను?"

"గురువుగారికి నీమీద కోపం పోయినట్లుంది కాదు శోభా!"

"ఏమో దేవీ! వారిదగ్గిరి కెళ్లడమంటేనే నాకు చాలా భయ మవుతూంది."

"భయమెందుకే పిచ్చిదానా? వారు నిన్నేం చేస్తారు? మహా తపస్సంపన్నులు—మహిమాన్వితులు—మనకి పితృసమానులు."

ఇంతలో వారున్న దగ్గిరి కొక పరిచారికవచ్చి—

"గురువులు పిలుస్తున్నారమ్మా?" అంది.

"ఎవరినే?" అని చింతామణి అడిగింది.

"శోభమ్మగార్ని." అని పరిచారిక చెప్పింది.

"మిగిలిన జడ నేనల్లుకుంటాగానీ—నువ్వు పోయి గురువులపని చూడు శోభా."

అంది చింతామణి. గురువుల దగ్గరకు వెళ్లడమంటే, ఆమె కడుగుముందుకు పడడంలేదు. ఈమధ్యనే ఆమె కాయన అంటే, ఎందుకో భయంపట్టుకుంది. అయినా విధిలేక వెళ్లింది. పిలిచినప్పుడు గాని, ఏదయినా ముఖ్యావసరముంటేగాని, ఆయనదగ్గర కెవరూ వెళ్ల కూడదు. బాలమహర్షి ప్రశాంతతకు భంగం కలుగకుండా అతని మందిరం ప్రత్యేకంగా, యితర మందిరాలతో సంబంధంలేకుండా నిర్మించబడివుంది. నాలుగయిదు వేరు వేరు మందిరాలు కలిసి శాంతి భవనంగా పేర్కొనబడుతూంది. ఒక మందిరంలో వంటలశాఖ—ఒక మందిరంలో సామగ్రి—ఒక మందిరం రాజకుమార్తె శోభ నివసించ డానికి—ఒక మందిరంనుంచి మరోమందిరానికి రెండు ఫర్లాంగుల దూరానికిపైగా వుంటుంది. తగినంతపని వుంటేగాని ఆయన ఎవరినీ పిలివడు గాబట్టి, తడబడుతున్న అడుగులతో వెళ్ళి శోభ తమ మంది రంనుంచి ఆయన మందిరానికి వెళ్ళి ఆయన కెదురుగా నిలుచుంది. గురు వామె ముఖంలో కొకసారి చూచి—

"మీ దేవి ఏంచేస్తూంది?" అని అడిగాడు.

"తలదువ్వుకుంటూంది—"

"నువ్వీమధ్య మాదగ్గిరికి తరుచు రావడంలేదు కదూ?"

"అవసరమైనపని కలిగినప్పుడు తప్పక వస్తున్నా స్వామీ!"

"వస్తున్నావు కాని—ఈమధ్య యేమంటే యెందుకో కొంచం భయపడుతున్నావు—అవునా?"

శోభ జవాబు చెప్పలేదు.

"మాశక్తి—మామహిమలు—నీకంటే మీ దేవి చింతామణి కెక్కువ తెలుసు. అందువల్లనే ఆమెకు మాయందు భక్తి విశ్వాసా లెక్కువ—"

అత నదంతా యెందుకు చెబుతున్నాడో శోభ కర్థం కాలేదు.

"నిలుచున్నా వెందుకూ? అలా కూర్చో."

శోభ కతని తీరంతా చాలా కొత్తగా కనుపించింది. వెయ్యి మాటల కొకమాట మాటలాడే మితభాష్—గురుస్థానంలో వుండి మహారాజును సయితం శాసించగల ప్రజ్ఞాశాలి—ఆమహారాజు సయితం గురువుల దగ్గరకొచ్చి ఆయన సరస నెప్పుడూ కూర్చోలేదు—అటు వంటి గురుదేవుడు తన కానాడు అంతమర్యాద చేస్తున్నాడేమిటా అని, శోభాదేవి తెల్లపోయింది.

"కూర్చో శోభా!" అని తిరిగి అన్నాడు.

"ఎందుకు లెండి స్వామి ! నేను తమ సేవకురాల్ని."

"సేవకురాలి లక్షణాలన్నీ నీకు బాగా తెలుసునన్నమాట."

ఆ ప్రశ్నల భావం ఆమె కేమీ తెలవడంలేదు. తాను త్వరగా అక్కడనుంచి వెళ్లిపోతే బాగుండు ననుకుంది.

"స్వామీ! నన్ను పిలిపించినపని?"

"ఇదంతా ఆపనే—నిన్ను మేము నవసరంగా పిలిపించలేదు."

"ఏమి కలవు?"

"శోభా! నువ్వింతవరకు మామనస్సు కనిపెట్టలేక పోయి నందుకు చాలా విచారిస్తున్నాము."

"స్వామీ! అపరాధముంటే క్షమించండి!"

"నేను అనేకవేల సౌందర్యవతులను చూచాను. కాని నీయౌవ నము—నీలావణ్యము—నీకులుకు, నన్నెక్కువగా ఆకర్షించాయి."

అంటూ అతను కూర్చున్న చోటులోనుంచి లేచాడు. మందిర ద్వారమును బిగించి తాళం వేశాడు. శోభ ఖంగారుపడింది. గొంతు

కత్తి అరుద్దామనుకుంది—కాని గురువు కోపించి, తన్నే రాయిగా నయినా శపిస్తాడేమోనని భయపడింది.

"శోభా! ఇటుచూడు—నువ్విప్పుడు ఖంగారుపడవలసిం దేమీ లేదు. నా ఆగ్రహానికి గురిఅయితే మాత్రం చాలా చిక్కులు పడతావు—నా నోటంట ఏదివస్తే అది అయితీరుతుంది. నా మనస్సు నిన్ను కోరుతూందన్న విషయాన్ని నీ అంతట నువ్వు కనిపెడతావేమో అనుకున్న—నన్ను నీకౌగిట చేర్చి స్వర్గసౌఖ్యంలో తేలుస్తావనుకున్నా—"

అని మహర్షి కామోద్రేకంతో చెబుతుంటే, ఆమెకు విషయ మర్థమైపోయింది. క్రోధంతో ఆమెలోని రక్తం ఉడుకెత్తి పొంగింది. అయినా ఉద్రేకము నణచుకొని—

"స్వామీ! ఇదెక్కడి న్యాయం—ఇదెక్కడి ధర్మం—? మీరు నాకు పితృసమానులు—నేను మీ బిడ్డని—తండ్రి బిడ్డని కామించడం కంటే వేరు పాతకమెక్కడుంటుంది? మీరు సర్వజ్ఞులు—సర్వధర్మాధర్మాలనూ యెరిగిన గురుదేవులు—నేనొక రాణివాసపు పరిచారికను."

"అయినా, అప్సరసాంగనలు నీకు సరికారు—అపరస్వర్గం నీయౌవ్వనంలో వుంది—దానిని మాకందించి మాకానందం కలుగ చెయ్యి—నువ్వానంద మనుభవించు."

"మహాతపస్సంపన్నులనీ—మహిమాన్వితులనీ—మీ కీగురుస్థాన మిచ్చినవారు బుద్ధిలేని వాళ్లు—"

"శోభా! కొంచమాలోచించి మాటలాడు."

శోభ యిక తన్నుతాను మరచిపోయింది. ఆమె నావహించిన ఆవేశం ఆమె అదుపులో లేకుండా పోయింది.

"మా ఆగ్రహానికి గురిఅయితే నువ్వేమవుతావో గ్రహించుకో ఎక్కువ పెంకితనం చెయ్యకు—రా—నీయౌవ్వన సౌందర్యాలతో నాపిపాసచల్లార్చు—నీ అధరామృతంగ్రోలి నన్ను తరించనియ్యి."

"ఓరీ! నీచుడా! నీముందుగతి ఏమవుతుందో ఆలోచించుకో—గురువ్వనీ—జ్ఞానసంపన్నుడవనీ యింతవరకు గౌరవించాను. నువ్విప్పుడు నాదృష్టిలో కుక్కకంటే హీనం!

"శోభా! నువ్వెవరితో మాటలాడుతున్నావో తెలుసా?"

"తెలుసు—కామంతో కళ్లుమూసుకుపోయిన ఒక తుచ్ఛుడితో—జ్ఞానాజ్ఞాన శూన్యుడయిన ఒక పశువుతో—కార్యాకార్యాలెరుగని ఒక మృగంతో—"

"ఆఁ! ఏమంటున్నావూ?"

"నిన్నేమన్నా పాపంలేదు."

"నేను తల్చుకుంటే నువ్వేమై పోతావో తెలుసా?"

"ఏమైపోయినా లెఖ్ఖచెయ్యను—బెదిరించి నా శీలమును భంగపరచడం నీతరంకాదు—"

అంటూ ఆమె ద్వారందగ్గరకు పరుగెత్తబోగా అత నడ్డు నిలిచి చేతు లడ్డంపెట్టాడు:

"అడ్డంలే—నన్ను పుత్రికా సమానంగా చూసుకుంటున్న మహారాజు కీ విషయం తెలుస్తే, నిన్ను గురువని మన్నించక శిరచ్ఛేదం చేస్తాడు—చింతామణికి నీపై గోప్య మికవుండదు—ఆ దేవి నీముఖాన ఉమ్మేస్తుంది—"

"నాకోరిక తీరాక ఏమయినా సంతోషమే—"

"ఓరి తుచ్ఛుడా! నువ్వీరాజ్యంలో చేరింది ఇందుకేనా? మహర్షినని పేరు పెట్టుకుని, గెడ్డం పెంచుకుని, జడలు ధరించి, ఈ కాషాంబరాలతో ఎందరిని మోసం చేస్తావు?"

"పిచ్చిదానా—దేవేంద్రు డంతటివాడు కామంతో కోడై కూసి కోరిక తీర్చుకున్నాడు—విశ్వామిత్రు డంతటివాడు విశ్వంమరచి, వేశ్యకు లోనయ్యాడు—వృథా కాలయాపన చెయ్యకు—త్వరగావచ్చి—నాకౌగిట చేరు—"

"ఇంతగాదు—ఇంకోయింత రాద్ధాంం చేసినా—నన్ను వశం చేసుకోలేవు—అవసరమైతే ప్రాణత్యాగమయినా చేస్తాగాని, నీకు లొంగను—"

"నిర్బంధం చేస్తే ఇంతసేపు పట్టదు. కాని—మోహనాంగీ! కామించిన కాంతను నిర్బంధంచేసి రమించడం, రసికలక్షణం కాదని యోచన చేస్తున్నాను."

"బుద్ధి తక్కువగా పేలకు. స్త్రీ సాహసించిందంటే—గుండెలు బ్రద్దలు చేస్తుంది—రక్తం పీలుస్తుంది—"

"అవునవును—మావంటి మహర్షులు కళ్లు తెరుస్తేకూడా, సర్వ ప్రపంచాలూ భస్మమైపోతాయి—సృష్టికి ప్రతిసృష్టి జరుగుతుంది—"

అని, బాలమహర్షి కామోద్రేకుడై తనకోరిక తీర్చుకోడానికి సర్వశక్తులూ వినియోగిస్తున్నాడు—శోభాదేవి ప్రాణానికి తెగించి, వానికి వశంకాకుండా, లోపలిభీతిని పైకి తెలియనీయక, అతి గంభీరంగా ఎదిరిస్తూంది.

ఇక్కడీ యిరువురూ యిటువంటి పరిస్థితిలోవుండగా, నగరంలో యేదో గలభాజరుగుతుందని తెలిసి, చింతామణి, ఆమెతో శాంతి భవనంలోని కొద్దిపరిచారికలు, భవనోపరిభాగ గోపరమెక్కి తిలకిస్తున్నారు. నగరమంతటా నేలయీనినట్లుండే సైనికదళాలు—యెటునుంచిదిగారో యెప్పుడుదిగారో—వార్ని చూచి, చింతామణి భయకంపితురాలయింది. వేలాదిగావుండి, లెక్కకందని ఆవీరభట సమూహాల్లో, తమసైన్యాలేవో—శత్రుసైన్యాలేవో ఆమె గుర్తించలేకపోయింది. కాని, నగరంలోకి చొర్చుకొని వచ్చేవి శత్రుసైన్యాలనీ, వాటికి యెదురు సన్నాహంగా యెదిరించడాని కొచ్చేవి, కుండిన నగరసైన్యాలనీ, ఆమె వూహించుకుంది. తమ బాలలెక్కడ? శత్రుబలాలెక్కడ? తమసైన్యాలకు ఎన్నో రెట్లధికంగావున్న విరోధి సైన్యాలను తిలకించి, ఆమె బేజారయింది. లోగడ మహారాజు తమ మందిరానికొచ్చి చెప్పినవిషయం యెదార్థమైందని ఆమె వూహించుకొంది. తండ్రిగారు చెప్పినట్లది మగధరాజ్య పతనసమయం—కుండిన నగర వినాశకాలమని నిర్ధారణచేసుకుంది. అది తనవల్లగదా అని, తన్ను తాను వెయ్యివిధాల శపించుకుంది. అప్పుడు మహారాజు యొక్క మనస్సు ఎంత క్రుంగి బేజారై వుంటుందో ఆలోచిస్తూ కర్తవ్యమును మరచి నిలుచుంది.

కనుమూసి తెరిచేలోపుగా కత్తుల ఝుళిపింపులు—వీరభటుల హుంకారాలు—అశ్వదళాల ఉరుకులు-పరుగులు. కాల్బలాల భయంకరాట్టహాసాలు—ఎక్కడ చూచినా రక్తపువరద—పీనుగులపెంట—ఆభయంకర రణరంగంలో యెక్కడచూచినా తానై విజృంభిస్తున్న మంత్రి ధీమంతు నామె ఒకటిరెండుసార్లు చూచింది, మహారాజెక్కడ? సైన్యాధిపతి యేది? యెన్నడులేనిది మంత్రి రణరంగాని కురకవలసిన అవసరమేంకలిగింది? ఆమెకు బుర్ర తిరిగిపోయింది. కళ్లు

చీకట్లుకమ్మాయి. ఇంతలో ఒకవీరనారి, ఆమెతో మరియొక ధీరుడు, ఆకాశంనుంచి దిగినట్లు—ఇరుపక్షాల సైనికదళాలకూ మధ్యలో దిగ డమును చింతామణి చూచింది.

"మహారాజులా! వీరభట, ధీరరాజకుమారులారా! క్షణకాలం మీమీవైరాలు కట్టిపెట్టి కత్తులు దించండి! నామాటలు వినండి!"

అని ఆ నూతనధీరుడు—

"దళాధిపతులారా! శౌర్యసంపన్నులారా! పరాక్రమోపేత ప్రతిభాశాలులారా! మీమీ క్రౌర్యములుడిగి, మా మాటలు వినండి."

అని ఆవీరవనిత—

ఉచ్చైశ్స్వరములతో ఎల్లరకూ వినిపించేలాగున ప్రబోధిస్తుం డడమును చింతామణి చూచింది. ఆశ్చర్య సంభ్రమాలతో ఆమె కళ్లు మెరిశాయి, ఆధీరుడెవరు? ఆవీరవనితయెవరు? స్వర్గంనుంచి దిగివచ్చిన దేవతాస్వరూపులా—శాంతిస్థాపన కవతరించిన పార్వతీ పరమేశ్వరులా? ఎవరయినదీ ఆమెకు తెలియలేదు. ఆనూతన స్త్రీపురు షుల ప్రబోధవాక్యాలు సెల్లరూవిన్నారు. ఒళ్లుతెలియని ఆవేశంతో-చావుబ్రతుకుల నెరగని ఉద్రేకంతో—పోరాడుతున్న వీరభటసమూ హాలు, వార్ని హెచ్చరించి పోరు ప్రబలంచేస్తున్న దళాధిపతులు—ఎక్కడివారక్కడ నిలిచి కత్తులుదించారు—కళ్లు పెద్దవిచేసి భయంకర రణరంగాన హఠాత్తుగా అవతరించిన ఆనూతన వ్యక్తుల నవలో కిస్తున్నారు.

"నానాదేశ ప్రభువులారా! పుత్రశోకజనిత దుఃఖోద్రేకులారా! మీమీ రాజకుమారులు వెయ్యిమంది చింతామణిచే హతులు కాలేదు—అందరూ సురక్షితులై వున్నారు—యుద్ధము విరమించి, ప్రభువులందరూ కుండినసగరాధిపతి దర్బారుకుచేరండి!"

అని ఆవీరకుమారుడు తిరిగిచెప్పగా—ఎల్లరాజులూ విభ్రాంతు లయ్యారు. ఆమాటలువిన్న చింతామణి కసలేయేమీ అర్థంకాలేదు. అయినా, మహారాజులందరూ, యుద్ధమును విరమింప జేయవలసిందని దళాధిపతుల కాజ్ఞలిచ్చి, తామెల్లరూ ఆనందకోలాహలాలతో నగ రాధిపతి, కీర్తికాముని భవనంవయిపు నడిచారు.

కీర్తికాముని శత్రురాజులలో ఒకడై యున్న, ఛత్రపాలమహా రాజు, కొడుకును గుర్తించి, పరుగు పరుగున పోయి, అతని నాప్రాయంగా కౌగలించి—

''కుమారా! ఎంతకాలానికి కళ్లబడ్డావు—ఇంతవరకు యెక్కడున్నావు తండ్రీ? నీకోసం వేచి వుండి వుండి—నువ్వుకూడా యితర రాజకుమారుల లాగునే, చింతామణి చేతులో హతుడై వుంటావని నిశ్చయించడంవల్ల. అందరి రాజులతోనూ యేకమై, కుండిననగర యుద్ధానికి బయలుదేరి వచ్చాను.''అని ఆనందాశ్చర్యాలతో చెప్పగా-

''తండ్రీ! అంతా భగవత్ప్రేరణ—చింతామణి ప్రశ్నలకు జవాబులు తెలుసుకోడానికే యింతకాలం పట్టింది—తెలుసుకుని వచ్చాను. నాగురించి నువ్వేటువంటి బెంగా పెట్టుకోవద్దు—ఇతర వివరాలు సావకాశంగా చెబుతాను.''

అని విజయకుమారుడు తండ్రిగారి కపరిమితానందమును కలిగించాడు.

తాను కన్నదంతా కలో యథార్థమో—చింతామణి కర్థం కాలేదు. తనకళ్లను తాను నమ్మలేకపోయింది—తన చెవులు తన్ను మోసం చేశాయనుకుంది.

''ఇదేమి మోసము! ఇదేమి విడ్డూరము! నాచే హతులయిన వెయ్యిమంది రాజకుమారుల శిరస్సులూ, మందిరానికి వ్రేలగట్టబడి ప్రత్యక్షంగా కనబడుతుంటే, వారు మృతులుగాక సురక్షితంగా వున్నారనడంలో ఆవీరుని అభిప్రాయమేమిటి? ఆమోసం ఎంతసేపు నిలుచుస్తుంది? యుద్ధం తాత్కాలికంగా విరమించబడ్డప్పటికీ, నానా దేశరాజులూ ఆవీరకుమారుడు చెప్పింది కేవలం బూటకమని తెలుసుకోడాని కెంతసేపుపడుతుంది? రెట్టించిన క్రోధంతో ఆమహారాజు లందరూ తిరిగి యుద్ధంలోకిదిగరా? ఈ తాత్కాలిక విరామంవల్ల ప్రయోజనమేమిటి?''

అని చింతామణి, తానా శాంతిభవన గోపురంపైనుంచి, కన్నదానినిగురించీ, విన్నదానినిగురించీ ఎటూ అర్థంచేసుకోలేక, శోభతోను గురువులతోనూ యీవిషయం చెప్పాలని తొందరగా గోపుర భాగంనుంచి కిందికి దిగిపోయింది.

అక్కడ, రాజమందిరం చేరిన మహారాజులందరూ, సజీవులై వున్నారన్న తమ తమ పుత్రులనందర్నీ కలుసుకోవాలన్న కుతూహలంతో వేచివున్నారు. మహారాజు, కీర్తికాముండు ప్రాణాల నర చేత్తో పట్టుకుని, సభావేదికపై ఉచితాసనంమీద కూర్చొనివున్నాడు. ఆ మహాయుద్ధంలో హఠాత్తుగా అవతరించి, అంతరాయం కలిగించిన స్త్రీ పురుషులు, విజయకుమార ప్రమీలా కాణులని పాఠకులు గ్రహించివుంటారు. చింతామణిచే హతులయిన వెయ్యిమంది రాజకుమారులూ సురక్షితంగా వున్నారని బొంకి, యుద్ధము నాపుచేసిన విజయకుమారుని సాహసమేమో—అతని సాహసంవల్ల కలిగే ప్రయోజనమేమిటో—మహారాజు కీర్తికామునికిగాని నర్షి, మహా, శ్మిమ, వాల, యబా, నగర ప్రభువులయిన—విక్రమదేవ, చంద్రసేన, తపోధన, ప్రమిలా, దత్తాత్రేయులకుగాని, గోరంతయినా అర్థం కాలేదు. తన బూటకము నావెయ్యిమంది మహారాజుల యెదుట ఎలా సమర్థించుకోంటాడో అనీ, అతని బూటకం వెల్లడి అవుతే-అతని గతి యేమవుందో అనీ వేగంగా కొట్టుకొనే గుండెల్తో వేచివుండగా, విజయకుమారా రాజసభలో ప్రవేశించి, జంకక, తొణకక—

“భూపాలకులారా! రాజోత్తములారా! నామాటపై విశ్వాసముంచి—మీరందరూ యుద్ధమును నిలుపుచేసినందుకు మీకెల్లరకూ కృతజ్ఞుణ్ణి! మృతులైనారన్న మీ మీ పుత్రులను గురించి మీ హృదయాలెంత శోకపూరితములయివుంటవో నాకు తెలుసు. వారు సజీవులైవున్నారని నేనంటే, వార్ని కలుసుకోవాలని మీ ప్రాణాలెంత తహతహలాడుతున్నవో నేను గుర్తించగలను. అయితే మీరు మీ మీ పుత్రులను కలుసుకోడానికి ఒకే ఒక్కదినం గడువు కావలసివుంది. ఎందుకనగా—

నాగపురయువరాజును, నాపేరు విజయకుమారు. నాతండ్రి పేరు ఛత్రపాలుడు నేను, చింతామణి అడిగే అయిదు ప్రశ్నలకు జవాబు చెప్పి, ఆమెయొక్క, ఆమె కాప్రశ్నలు చెప్పిన ఆమె గురువుయొక్క గర్వమణిగించి, వారిచే జరిగించబడుతున్న హింసాకాండను అరికట్ట సంకల్పించాను. ఆ మహాకార్యం నావల్ల కాదని మీరు సందేహించడం అనుచితంకాదు. వెయ్యిమంది మహామేధావులు చెయ్యలేని పని నేను చెయ్యగలనంటే, మీకాశ్చర్యం కలగడం అతిశయోక్తి

కాదు. కాని నేను కోరింది. ఇరవై నాలుగుగంటల వ్యవధి! ఈకొద్ది కాలం మీరందరూ ఓపికపట్టినట్లయితే నావివేకా వివేకాలను పరీక్ష చేయవచ్చును—మీ మీ పుత్రరత్నములను మీరు కలుసుకొన వచ్చును.''

అని విజయకుమారుడు చెప్పిందాంట్లో అధర్మంగాని, అక్రమం గాని లేదని అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. తమ పుత్రులు హతులైనారని నిరాశచేసుకుని, తపిస్తున్న తాము ఫలితాఫలితాలు తెలుసుకోవడానికి ఒక్కరోజు వేచివుండడంలో ఆక్షేపణ ఏమిన్నీ లేదని సంతోషంతో ఒప్పుకున్నారు. అటుపై విజయకుమారు తిరిగి చెప్పాడు.

రేపుదయం సరిగా పదిగంటలకు మీరందరూ చింతామణి నివాసమైన శాంతిభవనం చేరవలసివుంది. అప్పు డక్కడ నే నామె అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పడము—మీరు మీ మీ పుత్రులను కలుసుకోవడము జరుగుతుంది. అంతవరకూ మీరెల్లరూ విడుదులు చెయ్యడానికి, కీర్తికామమహారాజులు బసలు ఏర్పాటు చేస్తారు— మీరు, మీ మీ సైనికదళాలు వారి ఆతిథ్యంలో వుండవచ్చు.''

అని విజయకుమారు చెప్పిన ప్రకారం ఏర్పాటులు జరిగించ డానికి, కుండిననగరాధిపతి తగు సమర్థులను నియోగించాడు. అప్పటి కంతటితో సభ ముగిసింది. విజయకుమారుడును అతనితో వచ్చిన మిత్రులును మాత్రం రాజమందిరంలోనే వుండుటకు ఏర్పరుపబడింది. విజయకుమారు, తానప్పుడు శాంతిభవనం పోవలసివుండనీ, చింతా మణి వగైరాలకు కూడా తన ప్రయత్నమును తెలుపుడుచేసి, మరు నాడు పదిగంటలకు ప్రశ్నల నడుగుటకు సిద్ధంగా వుండవలసిందని హెచ్చరించవలసివుండనీ మహారాజుకును, మిత్రులకును చెప్పి, విజయ కుమారు రాజమందిరంనుంచి బయలుదేరాడు.

అనంతరం, మంత్రి ధీమంతుడు, మహారాజును ఏకాంతమంది రానికి గొనిపోయి,

''మహాప్రభూ! ఏమిటీ విపరీతమంతా! రాత్రికిరాత్రి, తమ రంతఃపురంనుంచి మాయమై యెక్కడకు వెళ్లారు? మీతో వచ్చిన విజయకుమారాది రాజకుమారు లెవరు? యుద్ధవిరామానికి వారు పన్నిన పన్నాగమేమిటి? నాకంతా అయోమయంగా వుంది.''

అని చెప్పగా, ప్రభువు కీర్తికాముడు, తానిల్లు వొదిలిపోయింది లగాయితు, తన ఆత్మహత్యా ప్రయత్నములాదిగా, సర్వవిషయములు చెప్పి, తన్ను రక్షించిన విజయకుమారుని సాహసమింతవరకు తనకున్నూ అర్థంకాలేదనీ—అందరితోపాటు తామున్నూ వేచివుండి, జరుగబోయేదాన్ని తెలుసుకోవడం తప్ప వేరు మార్గంలేదనీ వివరించాడు.

"మహాప్రభూ! ఇదంతా నాకేదో మహామాయగావుంది. ఇక ముందు ఏది యెటు జరిగినా—ఆత్మహత్యకు పూనుకొన్న మీరిప్పటికి రక్షించబడ్డమే సంతోషించబడింది. మీరు నగరం వొదిలి పరారి అయినారన్న విషయం తెలుస్తే, రాణీ, చింతామణుల ప్రాణాలు తల క్రిందులు కావడమేగాకుండా, నగరం పూరిముందే అల్లకల్లోలమవుతుందని ఆలోచించి, మీ విషయ మెవరికీ తెలీనీక, స్వస్థత చెడివున్నారనీ—మిమ్మల్ని ఎవరూ దర్శించరాదనీ—శాసించి, మీరు కళ్లబడే వరకూ కాపాడాను. రాణీ మంజులాదేవిగారు మీకై ఖంగారు పడుతున్నారు. ము దుగా పోయి, తమ రామెకు తృప్తి కలిగించవలసి వుంది."

అని మంత్రి చెప్పగా విని, మహారాజతని బుద్ధికుశలతకు సాహాన్ని అనేకవిధాల కొనియాడి, తాను దేవీ మంజులను కలుసుకోడానికి రాణివాసం వెళ్లాడు—లేవలేని స్థితిలోవుండినీ, భర్తను చూడగానే లేచి కూర్చుని—సంతోషంతో—

"మీరు స్వస్థతగా లేదన్నారు—ఇప్పు డెలావుంది ప్రభూ?" అని అడిగింది.

"ఇప్పుడేమీ లేదు—బాగుంది."

"నగరంలో యుద్ధప్రారంభ మయిందిట—నిజమేనా?"

"నిజమేకాని, మనకేమీ నష్టం కలగలేదు. చింతామణి ప్రశ్నల బదులు చెప్పడాని కొక కొత్త రాజకుమారుడు వచ్చాడు."

"నేను చెప్పలేదా ప్రభూ! నాకల నిజమవుతుంది—చింతామణికిక కళ్యాణమాగదు."

ఇతర వివరములన్నీ చెప్పి, ఆమె స్థిమితం చెడగొట్టడాని కిష్టం లేక—

"మంచిదేగాని—యిక నువ్వుపడుకో—నీశరీరస్థితి యేమీ బాగుండలేదు దేవీ!"

అని మహారాజామెను హెచ్చరించాడు.

"నాశరీరస్థితికూడా యింక బావుంటుంది. మన మంథరం పెళ్ళి వారం గాబోతుంటే నేనెందుకు బాగుండనూ? నాతల్లి చింతామణికి కళ్యాణం తోసుకొచ్చింది. ప్రభూ! సమయంలో సమయం—శోభా దేవికికూడా వివాహం చెయ్యరూ! అది, మనమే తలితండ్రులమని, మనల్నే నమ్ముకొనివుంది—దానికూ్కడా మంచివరుడే వస్తాడు."

"వస్తాడుగాని దేవీ! నువ్వుముందర పడుకుంటావా లేదా?"

"అబ్బ! ఇంతకాలంనుంచి, మంచ మరిగిపోయేలా పడు కున్నాను—ఇంక పడుకోలేనండీ! మీరు తొందరగా వెళ్ళాలా? కొంచం సేపు నాదగ్గర కూర్చోండి—నాకిప్పుడు చాలా సంతోషంగానూ—చాలా బలంగానూ వుంది."

"నువ్వు కూర్చొనివుంటే నేను వెళ్ళిపోతాను—పడుకొంటే—కొంచంసేపుంటాను."

"సరే—సరే—పడుకుంటున్నా ప్రభూ! ఎప్పుడూ పనులే అంటారు—వెళ్ళిపోకండి—కూర్చోను."

అని మంజులాదేవి వెనుకదిండు కానుకొని పడుకుంది.

"అమాయకురాలు! జరుగనున్న ఘోరపరిస్థితు లెటుగా పరిణ మిస్తవో ఈమెకు తెలియవుగదా! భగవంతుడా! ఏది యేమయినా, ఈ యిల్లాలికి ఆరోగ్యమయినా ప్రసాదించు—నాకు కలిగే విపరీత పరిస్థితులలో ఈమె నలిగిపోకుండా కాపాడు."

అని, ప్రభువు కీర్తికాముడు తనలో అనుకున్నాడు.

## ౪౩

"ఓరీ! పాపీ! నన్ను ముట్టుకోకు—నాదగ్గిరికి రాకు—నీ కాళ్ళకి మొక్కులేను—నీకెంతయినా పుణ్యముంటుంది—నన్నొదిలిపెట్టు! నాకన్నీళ్లు శాపాక్షతలై నీతల బ్రద్దలుకొడుతాయి—నీకు నావుసురు తగులుతుంది—నా యేడుకొడుతుంది—నాక్షోభ నిన్నుకట్టి కుడుపు తుంది—భగవంతుడంటూ యెవరయినా వుంటే—నీతల వెయ్యి చెక్కలవుతుంది—"

అని శోభాదేవి, కామంతో కళ్లుమూసుకుపోయి, తనమీదికొచ్చి నిర్బంధంవల్ల శీలభంగం చేయనున్న బాలమహర్షిని తూలనాడుతూ—వలవలయేడుస్తూ, వాడికందనుండా, తప్పించుకోడానికయినా వ్యవధిచాలక, కొట్టుమిట్లాడుతుంటే—మందిరంలోని గంట గణగణమోగింది! బాలమహర్షి ఖంగారుపడ్డాడు!

"ఎవరో రాజకుమారుడు—వచ్చివుంటాడు, సరి నువ్వెక్కడికి పోతావు? నేనక్కడికి పోతాను? నీలాంటి లావణ్యవతి ననుభవించక పోతే, నాబ్రతుకెందుకు? ఈరోజు తప్పించుకున్నా, రేపెక్కడికి పోతావులే—ఈసంగతి గనక ఎవరితోఅయినా అన్నావంటే—నీకళ్లు చిల్లులు పడతాయి—భద్రం!"

అని హెచ్చరించి—దుస్తులు సవరించుకొని, బీగంతీసి, ద్వారం తెరిచాడు బాలమహర్షి, శోభ, ఒక్కగంతులో బయటపడింది. మందిరంలో గంటమోగింది.

"శోభా! శోభా! ఎక్కా! ఎక్కడే?"

అంటూ చింతామణి, అంతఃపురమందే మందిరమంతా వెదికి, శోభ నెక్కడా కానకపోవడంవల్ల, బాలమహర్షి మందిరంవైపు వడివడిగా నడిచివస్తూ—యేడుస్తూ పరుగెత్తివస్తున్న శోభను మార్గంలో కలుసుకొని, విభ్రాంతురాలయింది. శోభ చింతామణిని కౌగలించి మరింత వెక్కివెక్కి యేడవడం మొదలుపెట్టింది. చింతామణి కేమీ అర్థంగాక గుండె బేజారయింది.

"ఎందుకమ్మా, యెందుకు? నిన్నవరేమన్నారు? నాతో చెప్పా-గురువుగా రాగ్రహించారా?"

అని శోభను మరింత దగ్గరగా తీసుకొని బుజ్జగిస్తుంటే—

"చెప్పను-చెప్పను—చెబితే నాకళ్లు చిల్లులు పడిపోతాయి—"

అని శోభ ఆపుకోలేని దుఃఖంతో ఉక్కిరి బిక్కిరవుతుంటే—మందిరంలోని గంట తిరిగి తిరిగి విరామంలేకుండా మోగుతూంది.

"చూశావా? యెంతకాలానికో—యెవరో రాజకుమారుడొచ్చాడు అప్పుడే యెన్నోసార్లు గంటమోగింది—నువిప్పుడిలా వుంటే యెలాగమ్మా—తరవాత మాట్లాడుకుందాం—ముందర కళ్లు తుడుచుకో—పయటసవరించుకో—వచ్చిన రాజకుమారుడెవరో తెలుసుకుని రావూ?"

తిరిగి గంట మోగింది.

"ఎవరబ్బా! ఆ సాహసికుడు—ఇన్నిసార్లు గంట మోగిస్తున్నాడూ? శోభా! త్వరగా వెళ్లాలి."

అని చింతామణి హెచ్చరించినందువల్ల, శోభ కళ్లు తుడుచుకుని, దుఃఖాన్ని దిగమింగి, మందిరద్వారంవైపు వెళ్లింది. ద్వారం దగ్గరెవరున్నారు? తనదేవుడు! తన ప్రేమరాసి—తన బహిప్రాణం—విజయకుమారుడు! అతన్నిచూసి శోభ తనకళ్లను తానే నమ్మలేకపోయింది—ఎక్కడి దుఃఖం అక్కడ పటాపంచలయింది! కావలివారుగనక అక్కడ లేకపోతే అమాంతం అతనిహృదయం మీద వ్రాలి పరవశురాలయ్యేది—మాటలాడదామంటే, సంతోషభారంవల్ల ఆమెనోరు పెకలిరాలేదు—

"ఎన్నాళ్ళకీ విజయా!"

అన్న ఆమె అస్పష్టమైన మాటలు అతనొక్కడు మాత్రమే విన్నాడు.

"నీదయవల్ల అన్నిపన్లూ సానుకూలమయ్యాయి, తరువాత మాట్లాడుకుందాం."

అని ఆమెకుమాత్రం వినిపించేలాగ అని, అనంతరం విజయకుమారు తిరిగి ఆమెతో—

"ఈపూటకు సావకాశం లేదు. రేపు ఉదయం సరిగా పదిగంటలకు, మీ గురువుగారినీ—మీ దేవిగారినీ, సిద్ధంగా వుండమను—అప్పుడు నేనొచ్చి, ఆమె ప్రశ్నలకు జవాబు చెబుతాను—"

అని వెంటనే అశ్వారూఢుడై వెళ్లిపోయాడు. శోభ, అతను కనుచూపు కందినంతవరకూ అక్కడేనిలుచుని, అనంతరం పట్టలేని సంతోషంతో పూజామందిరందగ్గరకుపోయి, అమ్మవారికి మొక్కరించి—

"దేవీ! కరుణామయీ! నాపూజలకు ఫలమిచ్చావా తల్లీ! ధన్యురాల్ని—నీమేలు జన్మజన్మాలకీ మరచిపోను."

అని నమస్కరిస్తుండేలోపుగా, చింతామణి అక్కడికే వచ్చింది. ఆమె ఉత్సాహామునుచూచి తెల్లబోయింది. ద్వారందగ్గిరికి వెళ్లేటప్పుడు ఏడుస్తున్న ఆమెకింతలో అంత ఉత్సాహమెందుకు కలిగిందో అర్థంచేసుకోలేక తలక్రిందులౌతూంది. శోభ చింతామణిని బిగియారా

కౌగలించి ముద్దాడింది. ఆవేశంతోపాటు, ఆనందంతో నాట్యం తొక్కింది.

"ఎవరో రాజకుమారుడే దేవీ! వచ్చాడు—నీ ప్రశ్నలకు జవాబు చెబుతాడట—ఈనాడు కాలాతీతమైనందువల్ల, రేపుదయం పదిగంటలకు సిద్ధంగావుండమన్నాడు—అతను వస్తాడట!"

అని శోభ, ఉబికి, పొంగి, వెల్లువలై పారే సంతోషతరంగాలను అదుముకొంటూ చెబుతుంటే—

"దానికింత అట్టహాస మెందుకమ్మా? ఇటువంటి రాజకుమారు లింతకుముందు వెయ్యిమందయినారు—యెన్నడూ లేని యింతసంతోషం నీకెందుకీ వేళ?"

అని అడిగింది చింతామణి.

"ఇతడందరి రాజకుమారుడిలాగా లేడు దేవీ!"

"కొమ్ములున్నాయా? తోక వుందా?"

"ఏమున్నాయో—రేపు నువ్వే చూస్తావుగా?"

"పిచ్చిపిల్లా! పై వేషంచూసి భ్రమపడున్నావేమో—ఈతను మాత్రం మన ప్రశ్నలకు జావాబు చెప్పగలడన్న హామీయేముంది?"

"తినబోతూ రుచి అడగడందేనికి దేవీ? రేపు పదిగంటలికి అన్నీ తేలిపోతాయి. కాని నాది ఒక్కకోరిక—నన్నింకా గురువుగారి దగ్గిరికి పంపించొద్దు. నీకెంతయినా పుణ్యముంటుంది. నన్ను నీదగ్గరే వుండనియ్యి."

"నీకంత యిష్టంలేకపోతే అలాగేలే శోభా! నువ్వు నాతోనే వుందువుగాని—ఆయన దగ్గిరికి వెళ్లొద్దు కానీ, ఇంతకుముందెందుకూ అలాయేడ్చావు? నీయేడుపుచూసి, నాప్రాణం బేజారయిందిగదా!"

"ఒద్దు దేవీ! ఆవిషయం అడగొద్దు—సమయమొచ్చినప్పుడే నేనే చెబుతాను."

అని శోభ అనడంవల్ల, చింతామణి నామె నింకా యెక్కువ నిర్బంధం చెయ్యలేదు. రాజకుమారుడొచ్చిన విషయము—మర్నాటి ఉదయ మతనొచ్చి, తమ ప్రశ్నలకు జవాబు చెప్పడానికి ఏర్పాటు చేసుకొన్న విషయము తెలిపి, తిరిగి మరియొక రాజకుమారుడు తన కరవాలానికి బలికానున్నాడు గదా అని యెక్కువగా విచారించింది.

"శోభ ఏంజేస్తూంది?"

అని గురువుగారడిగిన దానికామె కొంచమాలోచించి.

"ఆమెకు స్వస్థతగాలేదు. అందువల్ల ఆమె కేవనులూ చెప్ప దలచలేదు—తమ కవసరం కలిగినప్పుడు నన్ను పిలవండి—"

అని చెప్పినందు కాతడు కొంచం ఆశ్చర్యపడి.

"నన్ను గురించి ఆమె నీకేమయినా చెప్పిందా?"

అని తిరిగి అడిగాడు.

"ఏమీ చెప్పలేదే! అలా అడుగుతున్నారెందుకు స్వామీ!"

"అహాఁ! ఏమీ లేదులే—"

అని అతనావిషము నంతటితో తుంచాడు.

"నగరంలో జరిగిన యుద్ధసమాచారం తమకు తెలిసిందా స్వామీ!"

"యుద్ధసమాచారమా? ఎప్పుడూ?"

"ఇంతకుముందే! మహారాజులు అంతకుముందొచ్చి, తమతో చెప్పిన ప్రకారమే జరిగింది. అనేకమంది రాజులు తమతమ సైన్యాలతోవచ్చి, నగరమును ముట్టడించారు. యుద్ధప్రారంభమైంది. అప్పుడు మీరేంచేస్తున్నారో నాకు తెలీదు. నేను అలజడివిని-మందిర గోపురమెక్కి చూశాను. మాసైన్యాలను మంత్రినడిపాడు—శత్రు సైన్యాల నెదిరించి యుద్ధంచేస్తుండగా యెవరో యిద్దరు నూతన స్త్రీ పురుషులు రణరంగంలో హఠాత్తుగా ప్రత్యక్షమై యుద్ధము నాపు చేశారు. వారెవరో—అలాయెందుకు చేశారో నాకు తేలీదు. నగరం నుంచి మనకెవరూ వార్తలూ తీసుకురాలేదు. మహారాజు తీరికలేక వుండివుంటారు—లేకుంటే, ఆయనే స్వయంగావచ్చి మనకు విషయము లన్నీ తెలిపివుందురు."

అని చింతామణిచెప్పింది విని.

"యుద్ధ మాగిపోయిందిగదా!" అని అడిగాడు.

"భగవంతుడి దయవల్ల ఆగిపోయింది."

"నేనప్పుడు జపం జేసుకుంటూ నిమగ్నవుండివుంటాను. నువ్వాయినా వచ్చి, విషయం చెప్పవుగాదే?"

"ఏం చెప్పానుస్వామీ? నేల యీనినట్లు వేలాదిసైనికులు నగరమునుచుట్టు ముట్టడంచూసేటప్పటికి నాకళ్ళు చెదిరిపోయాయి— బుర్ర పనిచెయ్యలేదు. తిరిగి యుద్ధమాగిపోయేవరకూ, కొయ్యలాగ

నిలుచుండిపోయాను. నాశరీరంలో ప్రాణలున్నాయో లేదో—అని నాకే సందేహం కలిగింది. మీదగ్గిరకొచ్చేదెల్లా? విషయం చెప్పేదెల్లా!"

"సరి—యుద్ధం దానంతట అది ఉపహరించబడి, నగరం ప్రశాంతమైనందుకు సంతోషం—నువ్వు వెళ్లి నీపనులు చూచుకోవచ్చు—నేను జపం చేసుకోవాలి."

అని గురువాదేశించిన మీదట, చింతామణి తిరిగి శోభదగ్గర కొచ్చింది. గురువు విషయం ఏమైనా ఘోరంగా వినవలసివుంటుందేమో అని శోభ భయపడింది. కాని అటువంటిదేమీ జరగనందువల్ల, ఆమె తిరిగి శాంతపడింది. తానున్నా గురువును గురించి చింతామణి నేమీ ప్రశ్నించలేదు. కొన్ని గంటలకాలం—ఆరాత్రికి గడిచిపోతే—ఏదో బ్రహ్మాండమయిన మార్పు జరగనై వుంది. ఆ మార్పును గమనించడానికే ఆమె వేచివుంది. గురువుచేసిన ఘోరం ఆమెకు మరచిపోదామన్న మరుపు రావడంలేదు.

"తుచ్ఛుడు—కామాంధుడు—తన విషయ మెవరికయినా చెబితే నాకళ్లు చిల్లుపడతాయని శపించాడు—లేకుంటే, యీపాటికే యీ విషయమును మహారాజు వద్దె రాలకు చెప్పి—వాడి బ్రతుకు బ్రద్దలుచేసివుందును. కానియ్యి—నా దేవుడు రానేవచ్చాడు—కొన్ని గంటలు ఓపికపట్టానంటే—నా నోములు ఫలిస్తవి—నామనోహరుణ్ణి నేను కలుసుకుంటాను."

అని శోభాదేవి ఆసుభసమయం కోసం వేచివుంది. ఆరాత్రంతా ఆమెకు నిద్దరపట్టలేదు. విజయకుమారు ఏ యే దేశాలు తిరిగాడో—ఎన్నెన్ని కష్టాలు పడ్డాడో—అని పలువిధాల తలపోసుకుంది. కన్ను మూసేటప్పటికా దివ్యమూర్తి ఆమె కన్నెదుట సాక్షాత్కారమయ్యేవాడు. నవ్వుముఖంతో తన్ను లాలించి పరవశత్వం కలిగించేవాడు. తానతని హృదయంమీద వాలి ఒళ్లు మరిచేది—సరస్సు దగ్గిర తొలిసమాగము—అతని వాగ్దానము—ఆరాత్రంతా ఆమెకదే ఊహాగానం—అవే మధురభావాలు—తియ్యని తలపుల్లో తన్మయురాలై అప్పుడే తెల్లవారకుండా, ఆరాత్రి యింకా యింకావుంటే బావుండు ననుకొంది. ఆమె మధుర స్వప్నాల కంతరాయం కలుగుతుందని కాలం స్థంభించిపోతుందా? మామూలుగానే తెల్లవారింది.

తెల్లవారేటప్పటికల్లా రాజమందిరంనుంచి వచ్చిన కొందరు సేవకులు, చింతామణి మందిరము నంతటినీ శుభ్రపరచి అలంకరించారు. వారెవరి పంపునవచ్చారో–ఎవరికోరికమీద అలా చేశారో ఎవరికీ తెలీదు. కొన్నివేల కుర్చీలు తెచ్చి హాలునిండా అమర్చారు. మామిడితోరణాలతోనూ, రంగుజండాలతోనూ మందిర మతిశోభాయమానంగా చెయ్యబడింది. ఇంతకుముం దనేకమంది రాజకుమారులు తిన ప్రశ్నలకు జవాబు చెప్పి తన్ను వివాహమాడడానికి వచ్చారు. కాని యెన్నడూ యిటువంటి ప్రత్యేకమైన యేర్పాటులు జరగలేదు. ఇప్పుడు మాత్ర మదంతా దేనికో–చింతామణి కర్థం కాలేదు. తానభ్యంతిర పెట్టవలసిన అవసరమున్నా యేమీ కనుపించలేదు.

చీని చీనాంబరాలతో—అమూల్యాభరణాలతో, శోభాదేవి చింతామణి నలంకరించింది. తానున్నా అత్యుత్సాహంలో అలంకరించుకుని, చింతామణితో కలసి పూజామందిరం దగ్గరకుపోయి—

"దేవీ! జగన్మాతా! నేపూనిన ఉపవాసదీక్ష–ఇరవైయొక్క రోజులూ గడచి, నిన్నటితో గదా వ్రతసమాప్తి అయింది! నా వ్రతానికి సత్ఫలసూచకంగా మా చింతామణి ప్రశ్నలకు జవాబులు చెప్ప, రాజకుమారుడు వేంచేశాడు. ఇకనయినా ఆమె కన్య చర వొదిలించి పుణ్యం కట్టుకో తల్లీ!"

అని ప్రార్థించింది.

అప్పుడు చింతామణికూడా దేవికి నమస్కరించింది.

"జననీ! లోకమాతా! గురువులయందుండే భక్తి విశ్వాసాల వల్ల, వారికాదిలో చేసిన వాగ్దానము ననుసరించి–నిర్దాక్షిణ్యాగా వేయి మంది కులదీపకులైన రాజకుమారుల శిరస్సులు ఖండించాను. ఆపాపం నన్నంటకుండా కాపాడి–ఇకనయినా నాహింసాకాండకు స్వస్తి వాచకం చెప్పుతల్లీ! నాపూనిన ఘోరవ్రతానికి ఉద్యాపన చెయ్యి."

అని ప్రార్థిస్తుండగా, మందిరద్వారమున గంటమోగించ బడింది. గంటానాదమును వినినవెంటనే బాలమహర్షి తనమందిరమును వొదిలి యివతలకొచ్చాడు. చింతామణి సభామందిరమంతశోభాయమానంగా అలంకరించబడి వుండడమును తిలకించి ఆశ్చర్యపడ్డాడు, చిరకాలానికి తిరిగి మరియొక రాజకుమారుడు, సాహసించి, తన

ప్రశ్నలకు బదులుచెప్ప వచ్చినందుకు ఉత్సాహపడి, చింతామణే ఆయేర్పాటులన్నీ గావించి వుంటుందనుకొన్నాడు. క్రమంగా చింతామణీ, శోభాదేవులున్న పూజామందిరం దగ్గరకొచ్చాడు, గురువును చూడగానే శోభ చింతామణివెనుకకు తప్పుకుని, అతని దృష్టినుంచి మరుగుపడింది.

"గంటమోగింది-నీస్థానంలోకి నువ్వుపోయివుండు-నాస్థానంలో నేను సర్దుకుంటాను. యెప్పటిలాగున ధైర్యంవొదలక, సాహసంతో ప్రవర్తించు! ప్రతిజ్ఞను నిర్విఘ్నంగా కొనసాగించు!"

అని, గురువు శిష్యురాలిని హెచ్చరించగా

"చిత్తం, గురుదేవా!"

అని, ఆమె అతనికి నమస్కరించి, నియమితస్థలానికి పోయి చేరుకుంది. బాలమహర్షికూడా ఆమెననుసరించి, తననియామకం ప్రకారం తాను యధాస్థానంలో సర్దుకుని కూర్చున్నాడు. శోభాదేవిపోయి, ద్వారములు తెరువవలసినదిగా కావలివారి ఆజ్ఞాపించింది.

ముందర విజయకుమారుడు, అతనికి వెనుక వెయ్యికిపైగా వున్న మహారాజులు—ఆవెనుక నగరప్రముఖులయిన స్త్రీపురుషులు—వారివెనుక కుండినసగర పాలకవర్గము-వారందరకూ వెనుక సాయుధ ప్రాణులయిన సైనికదళాలు—ఆజన బాహుళ్యాన్ని చూస్తే శోభకు కన్ను చెదిరిపోయింది. ఆసందడిసమయంలోనే, విజయకుమారుడామెను చూశాడు—ఆమె అతన్నిచూసింది. ఇరువురి కళ్లూ క్షణకాలం కలుసుకున్నాయి—ఏమేమో మాటలాడుకున్నాయి. ఆభాష మనకి రాదుగనక ఆజోక్యం మనకొద్దు! విజయకుమారుని వెనువెంటనే రాజదంపతులు! ఎన్నడూలేని దానాడు, రాణీ మంజులాదేవి కూడా మహారాజు ననుసరించి వచ్చినందు కామె ఆశ్చర్యపోయింది.

"ఏమేశోభా! మహారాజులకు చెప్పాను—నీకూడా పెళ్ళి చేయించమని."

అని, మంజులాదేవి వొకసారి సాదరంగా, శోభ నునుచెక్కులు తాకి, అటుపైన మహారాజుతో ముందుకు సాగిపోయింది. రాజదంపతులకు వెనుక బారులుతీర్చిన నగరాధిపతులు దరగనితంపిగా లోపల ప్రవేశిస్తుండడము నామె ప్రక్కగా వొదిగి నిలుచుని తిలకిస్తూంది. అయ్యయ్యో! ఏమిజనము—ఏమిగుంపులు—భూమండల

లోని నగరపాలకులందరూ అక్కడే హాజరయ్యారెందుకో అనుకుంది. తన విజయకుమారుడు సామాన్యుడుకాదు—ఏదో విపరీతం జరిగిస్తాడని ఆమె అనుకుంది—క్రమంగా వేలాది జనమందరూ లోపల ప్రవేశించిన తదుపరి-సై నికదళాలు మాత్రం ఎల్లరితో పాటులోన ప్రవేశించక, సాయుధపాణులై శాంతిభవనానికి చుట్టూ వరసలుతీర్చి అమురుకున్నారు. ద్వారపాలకులు తిరిగి ద్వారములు బంధిచారు. శోభాదేవి మందిరంలోపల కొచ్చింది. నానాదేశమహారాజులు, నగరప్రముఖులు, కుండిననగర పరిపాలనావర్గ మంతటితో, సభాభవనమంతా క్రిక్కిరిసి-కిటకిటలాడుతూంది-వేలాదిగా అమర్చబడిన కుర్చీలు సరిపోక కొందరు నిలుచునివుండడం గమనించి—మంత్రివెంటనే మరికొన్ని బల్లలు తెప్పించి ప్రక్కల వేయించాడు! ఎల్లరూ నిశ్శబ్దమూను వహించి జరుగవలసినదానికై ఉత్సాహంతో నిరీక్షిస్తున్నారు.

తనకుమారుని భవిష్యత్తు ఏమికానుందో అని ఛత్రపాలుడు మరింత ఆదుర్దాగా, ప్రాణాల నర చేతుల్లో పట్టుకుని కూర్చున్నాడు.

శాంతిభవనంలోని నగరాగంటలు పదికొట్టింది. విజయకుమారుడు తనకై ప్రత్యేకంగా అమర్చబడిన వేదికపై నిలుచున్నాడు. అది అతని చావుబ్రతుకులు నిర్ణయమయ్యే సమయం! తెరవెనుక చింతామణికూడా లేచినిలుచుని—

"రాజకుమారా! సంసిద్ధుడవై వున్నావా?"

అని ఉచ్చైస్స్వరంతో అడిగింది.

"ఆహా! సిద్ధంగావున్నాను! నీదే ఆలస్యం!"

"నీపేరు?"

"విజయకుమారు."

"నీదేరాజ్యము—నీ తండిపేరేమి?"

"నాది నాగపురసామ్రాజ్యము-నాతండ్రిపేరు ఛత్రపాలుడు!"

"నావ్రతనియమములన్నీ నీకు తెలుసునా?"

"తెలుసును."

"నేనడిగిన ప్రశ్నలకు నువ్వు జవాబులు చెప్పలేకపోతే-నేను నీశిరస్సు ఖండించవలసివుంది. మరొకసారి బాగా ఆలోచించుకుని, విషయ నిర్ణయంచేసుకో."

"ఇప్పుడేమీ ఆలోచించవలసిందిలేదు. కాని, నువ్వడిగే ప్రశ్నలు, నీకు నువ్వు స్వంతంగా అడుగుతున్నావా? లేక, వాటిని నీకెవరియినా చెప్పి, నీచేత అడిగిస్తున్నారా?"

"అడిగిస్తున్నారు."

"ఎవరు?"

"నాగురువు—బాలమహర్షి! నాకు ప్రాణదానం చేసినవారు-విద్యనేర్పినవారు—

"మంచిది. వారిప్పుడెక్కడున్నారు?"

"ఇక్కడనేవున్నారు."

"నువ్వడగబోయే ప్రశ్నలకు జవాబులు నీకు తెలుసునా?"

"తెలియవు."

"అప్పుడు, నాజవాబులు సరియైనవి అవునో—కాదో ఎవరు నిర్ణయిస్తారు."

"మాగురువులే నిర్ణయిస్తారు."

"వారినిర్ణయం, మాకందరకూ ఎలా తెలుస్తుంది?"

అని విజయకుమారు డడిగినదానికి ఏమనిచెప్పాలో తెలియక చింతామణి తటపటాయిస్తుంది! శోభ, మాటునుంచి, విజయకుమారుని ముఖలక్షణాలను—అతని తీవ్రతనూ గమనిస్తూంది.

విజయకుమారుడు తిరిగి చెప్పాడు.

"రాజకుమారీ! ఇది, నా చావుబ్రతుకులకు సంబంధించిన విషయం—కనుక జరిగేవి సక్రమంగా, నాకుతృప్తిగా—ఇక్కడచేరిన మహామహులందరికీ ధర్మసమ్మతంగా వుండాలి."

"రాజకుమారా! అందుకు నువ్వు కోరేదేమిటి?"

"మీగురువులు బహిరంగా యివతలకొచ్చి—ఈ మహాజనులందరి సమక్షంలోనూ కూర్చోవచ్చు—నువ్వడిగే ప్రశ్నలకు నేను చెప్పే జవాబులు సరియైన వవునో కాదో—అతను ముఖాముఖిని మాతో చెప్పవచ్చును. అందుకు మీగురువులు అభ్యంతరపెట్టిన యెడల—ఇందులో ఏదో తంత్రముందని ఎల్లరూ అభిప్రాయపడవలసివుంటుంది. నీప్రశ్నలకు జవాబులు చెప్పవలసిన అవసరంలేకుండానే, నువ్వూ, నీగురువులూ నాకోడినట్లుగాను—నేను గెలిచినట్లుగానూ యెంచబడుతుంది."

అని విజయకుమారుడు తీక్షణంగా పలికినమాటట—రెండవ తెర వెనుకనున్న బాలమహర్షి చింతామణితో—మెల్లిగా—

"పరిస్థితి విషమించింది—నేను బయటపడక తప్పదు—ఆ రాజకుమారుడు కోరినట్లు చెయ్యబడుతుందని చెప్పు." అనగా

"రాజకుమారా! మాగురువులు నువ్వు కోరినట్లు చేయడానికి అంగీకరించారు—వారిప్పుడే వచ్చి-అందరితో బహిరంగంగా కూర్చో గలరు."

అని చింతామణి ఉచ్చైస్స్వరంతో అందరకూ వినిపించేలాగున చెప్పింది.

విజయకుమారుడు వెంటనే—తనకు చేరువలో కూర్చొనివున్న-నర్షి—మహా—శ్మశ—వాల-యశానగర ప్రభువులకు కనుసౌంజ్ఞ చెయ్యగా, వారు తమస్థానములనుంచి లేచి, మరికొంత దూరాన మరుగుగా కూర్చున్నారు. ఆసమాచారము నెక్కువమంది గమనించ లేదు—గమనించినవా రదేమంతవిశేషముగా యెంచలేదు. అనంతరం బాలమహర్షి యిపతలకొచ్చి, ఎల్లరసమక్షంలోనూ బహిరంగంగా కూర్చున్నాడు. నర్షి మహానగరాది ప్రభువులు మహర్షినిచూడగానే ఉద్రేకులై తమలోతామేదో గుసగుసలాడుకొన్నారు. తామిప్పుడే తొందరపడినట్లయితే, విజయకుమారుని కార్యక్రమానికి భంగం కలుగుతుందని యెంచి-తమ తమ ఉద్రేకాలను తమలోనే యిముడ్చుకున్నారు. తెరవెనుకనుంచి, చింతామణి—

"రాజకుమారా! నా మొదటి ప్రశ్న నడుగుతున్నాను. సావధానంగా విని—సరియైన జవాబు చెప్పు—

1. ప్రతిజ్ఞ నెరవేరితేకాని, పెళ్లిచేసుకోనని భీష్మించుకున్న ఆ రాజకుమారు డెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అత నింకా జీవించి వున్నాడా?"

"సుందరీ! విను—ఆ ప్రతిజ్ఞ పూనినవాడు, నర్షినగరాధిపతి-విక్రమదేవుడు. ఆ రాజ్యంలో అతనిని మోసంచేసి, ప్రాణాలు దక్కించుకుని పరారియైవచ్చిన ఒక దొంగబైరాగి శిరస్సు ఖండించినగాని, తాను వివాహమాడకూడదని అతని ప్రతిజ్ఞ. ఆమహారాజింకా బ్రతికి వున్నాడు—తన ప్రతిజ్ఞను నెరవేర్చుకుని తీరతాడు!"

విజయకుమారుని జవాబు వినగానే, బాలమహర్షి ముఖం వెల వెల బోవడం అందరూ గమనించారు.

తెరవెనుకనుంచి, చింతామణి తన రెండవ ప్రశ్న నడుగుతూంది-

2. "విజయకుమారా! పురుషుడై వుండికూడ్నీ, స్త్రీ రూపంతో మహర్షిని మోసంచేసి, అతనిదగ్గరుండే మంత్రశూలము నపహరించి, అతనిని కొట్టి తరిమివేసిన ఆ యువకు డెవరు? అత నింకా బ్రతికి వున్నాడా? మృతుడైనాడా?"

"రాజకుమారీ! పురుషుడై వుండికూడ్నీ స్త్రీరూపంతో మహర్షి మంత్రశూలము నపహరించి, అతన్ని కొట్టి తరిమివేసిన ఆధీరుడు—మహానగరాధీశ్వరుడైన చంద్రసేనమహారాజు, అతను జీవించి సుఖుడై వున్నాడు. బాలహామర్షి తిరిగి అతని రాజ్యంలో అడుగు పెట్టడం సర్వకల్ల!"

"వీరకుమారా! నా మూడవ ప్రశ్నను విను—

3. తపోధనమహారాజు ద్వితీయ భార్యయైన, రూపసుందరి గతి యేమైనది? ఆ తపోధన మహారాజింకా బ్రతికివున్నాడా?"

"ఓ గురుభక్తురాలా! బైరాగిని ప్రేమించిన ఆయిల్లాలు రూప సుందరి, కారాగృహంలో ఉప్పులేని గంజి తాగుతూ, కఠిన శిక్ష ననుభవిస్తూ వుంది. ఆమె భర్త తపోధనమహారాజు, క్షేమనగర పరిపాలన చేస్తూ, లక్షణంగా బ్రతికివున్నారు. మీ గురువుగారిక ఆమెపై ఆశ వొదులుకోవచ్చు."

"ఓ ప్రతిభాశాలీ! ఇది నా నాలుగో ప్రశ్న—

4. ప్రేమించిన వానియందుండే అనురాగంవల్ల, అడవుల్లో తిరుగుతూ, స్త్రీఅయి వుండికూడ్నీ పురుషవేషమును ధరించి, మహర్షి చే కామించబడిన యిరువురు స్త్రీలనూ అపహరించి, మహర్షిని ఖండింపబూనిన ఆ ధీరురాలెవరు? ఇప్పు డామె జీవించివున్నదా? మృతిపొందినదా?"

"చింతామణీ! ఆధీరురాలు, వాలనగర ప్రభ్వి—రాణీ ప్రమీలాదేవి. తన ప్రాణసఖులయిన వకుళా సరళను మహర్షి అపహరించి నందువల్ల, ఆరాణి పురుషవేషంలో వుండి తన కాంతలను రక్షించుకుని, వంచకుడైన మహర్షి శిరస్సు ఖండింపబూనింది. ఇప్పు డా వీరవనిత

బ్రతికివుంది. వకుళా సరళలు, బాలమహర్షి పేరుతో వున్న ఆదోంగ బైరాగి శిరస్సు ఖండించడానికి తయారుగా వున్నారు!''

''వీరశిఖామణీ! ఇది నా అయిదవ ప్రశ్న—

5. శ్రీరామపట్టాభిషేకమున శివతాండవంచేసిన ఆ భక్తురాలిని మహర్షి కామించిన కారణంవల్ల, ఆయిరుపురను కారాగృహమున బంధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే దత్తాత్రేయ మహారాజింకా జీవించివున్నాడా? భక్తురాలెట్లున్నది?''

''భామామణీ! చింతామణీ! మోసగాడయిన మహర్షి, కారాగృహమునుంచి తప్పించుకు పారిపోయి, కుండినవగరంలో చింతామణి దగ్గర చేరినా, అతనివల్ల గర్భమును ధరించిన ఆభక్తురాలు త్రిపురాంబ, ఒక స్త్రీ శిశువును ప్రసవించి, ఆ శిశువును సయితం పోగొట్టుకుని, యబానగర కారాగృహంలో జన్మాంతర శిక్ష ననుభవిస్తూనేవుంది. ఆ ప్రకారం వ్యభిచార నిర్మూలనకు పాటుపడ్డ దత్తాత్రేయ మహారాజు కాలధర్మము పొందినా, అతని కొడుకు అశ్వనీకుమారుడు ఆదోంగ బైరాగి శిరస్సు ఖండించడానికి కత్తినత్తి సిద్ధంగా వున్నాడు.

''కనుక, బాలమహర్షిగా మారిన ఓదోంగబైరాగిగారూ! మీరడిగించిన ప్రశ్నలకు నా జవాబులు సరియైన వవునో కాదో—శలవియ్యండి!''

అని విజయకుమారుడయిదు ప్రశ్నలకు జవాబు చెప్పిన అనంతరం భయంతో వొణికిపోతూ, ఆచేరువలో కూర్చున్న మహర్షి నడగ్గా—

''ఆఁ! ఆఁ! అన్నీ సగ్గా చెప్పావు.''

అంటూ, మెల్లిగా అక్కడనుంచి జారిపోవాలని చూస్తుండగా, నర్షి, మహానగరాది ప్రభువు లయిదుగురూ ముందుకురికి తమ ఐదు కత్తులనూ, వాడి ఐదు ప్రాణాలకూ గురిపెట్టి నిలుచుండగా—

''ఓరి! వంచకుడా! ఇంకా తప్పించుకుని పారిపోవాలని ప్రయత్నమా? నీదుండగాల కిది ఆఖరుదినం! నాకరవాలం నీకంఠరక్తానికై ఎదురుచూస్తూంది. విజయకుమారా! ఇంకా ఆలస్య మెందుకు—అనుజ్ఞనియ్యి—ఈపాపాత్ముడి శిరస్సు వెయ్యి భిన్నాలవుతుంది.''

అని, మహానగర ప్రభువు చంద్రసేనుడు గర్జించాడు.

"చంద్రసేనా! కొంచమాగు! ఈదుర్మార్గుడు నాకరవాలనికే అర్హుడయినవాడు! వీడి శిరస్సు ఖండించి నాప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి గనుక, ఈయవకాశం నాకిచ్చి, మీరందరూ తప్పుకోండి."

అని వర్ధనగరాధిపతి, విక్రమదేవుడు మిగిలినవార్ని ప్రార్థించాడు.

ఇంతలో తెరవెనుకనుంచి, శోభా చింతామణులు యువతుల కొచ్చి, పంచప్రాణాలనూ పంచకరవాలముల మధ్య యిరికించుకుని జీవచ్ఛవములా నిలుచున్న గురువును తిలకించి విభ్రాంతులౌతున్నారు: శోభ విజయకుమారుని ప్రతాపాన్ని తనలో తాను వెయ్యివిధాల అభినందించుకొంటూంది. ఏ రాజకుమారుడూ చెప్పలేని ప్రశ్నలకు బదులు చెప్పడమేగాకుండా వంచకుడయిన బాలమహర్షి బ్రతుకును బయటపెట్టిన విజయకుమారుని అక్కడి వేలాది ప్రజలు ప్రశంశిస్తుండగా, విజయకుమారుడు అందరూ వినేటట్లు—

"రాజమాంత్రాంగులారా! రాజోద్యోగులారా! పౌరులారా! ప్రజాప్రతినిధులారా! మోసగాడయిన యీదొంగబైరాగి జీవితరహస్యాలు, వాడడిగించే ప్రశ్నలోనే యిమిడివున్నాయి గాబట్టి, నేను వాటిని తిరిగి వివరించవలసిన పనిలేదు. వీడు ఒక్కొడు ఏవో కొన్ని క్షుద్ర మంత్రశక్తులు సంపాదించి, వాటిని కామతృష్ణ తీర్చుకోడానికై వినియోగించుకుంటూ—నానా దేశములూ సంచారం చేశాడు. అందందు గల సౌందర్యవతులను మోసగించి పరచడం వీడివృత్తి. వీడి రెండవ ప్రశ్నకు సంబంధించిన మహానగరంలో, చంద్రసేన మహారాజువల్ల తన మంత్రశూలమును పోగొట్టుకొన్నాడు. అది పోయినదగ్గర్నుంచీ వీడి సర్వశక్తులూ సన్నగిల్లాయి. శక్తులు సన్నగిల్లినా, వీడి కామతృష్ణ మాత్రం సన్నగిల్లలేదు. అందువల్ల, మాయోపాయాలూ యుక్తులూ పన్ని—తనపనులు నెరవేర్చుకుంటున్నాడు. వర్ధి—మహా—శ్రమ—పాల—యబానగరములలో వరుసగా విక్రమదేవు, చంద్రసేన, తపోధన, ప్రమీల, అత్రేయ పాలనలలోని ఉత్తమ స్త్రీ జనాలను భంగపరుపబోయి, తానే ఆ యాప్రభువులచే భంగపడ్డాడు. ఇప్పుడావిదు గురు నగరాధిపతులే యిక్కడ, తమ ఐదు కత్తులనూ ఆవంచకుడి కంఠానికి గురిపెట్టి నిలుచున్నవారు. ఈ దుర్మార్గుని దుండగము లా ఐదు నగరములతో తగ్గక, యిక్కడికొచ్చి, రాజకుమార్తె రక్షించ

బడడం, కాక తాళీయమయితే, అది తన ప్రభావమే అని కీర్తికామ మహారాజును నమ్మించి, చింతామణియొక్క భక్తివిశ్వాసాలకు పాత్రుడయ్యాడు. ఆమెద్వారా యీప్రశ్న లడిగించి, తను లోగడ సంచరించిన నగర వృత్తాంతములు తెలుసుకోగోరాడు. ఒకవేళ ఆ యీ ప్రభువులు మరణించివుంటే—తిరిగి తా నక్కడికిపోయి, తన దుండగాలు సాగించవచ్చునని వీడి అభిప్రాయం.

ఇందరికి పని కల్పించిన వీడు సామాన్యుడు కాడు. వీడి ప్రోత్సాహంపై చింతామణిచే వధించబడిన వెయ్యిమంది రాజకుమారులలో నా కాత్మీయుడును, బిల్వనగర యువరాజునూ అయిన ఆనందకుమారుడు కూడా వున్నందువల్ల, నే నీ హింసాకాండ నరికట్టడానికి కొండ తవ్వి యెలుకను పట్టవలసివచ్చింది.

అని చెప్పిన విజయకుమారు, బాలమహర్షిని తిలకించి—

"ఏమండీ! గురువుగారూ! నేను నిర్వచించిన మీచరిత్రలో ఏమయినా పొరబాటులుంటే సవరణ చెయ్యండి." అన్నాడు.

బాలమహర్షి—వంచినతల నెత్తకుండా—

"రాజకుమారా! ఈ రోజుతో నాకాయువు తీరిపోయింది—నా చావును గురించి నేను విచారించను. కాని—నీవంటి ప్రతిభాశాలి, ఈ భూవలయంలో యింతవరకూ పుట్టలేదు. ముందు పుట్టబోడు—దుర్భేద్యములయిన నాజీవితరహస్యముల నన్వేషించి, నాప్రశ్నలకు నువ్వుగాబట్టి బదులు చెప్పగలిగావు—ఇది నరుల కలవికానిపని—నువ్వు చెప్పిందాంట్లో పొరబాటేమీ లేదు."

అని, విజయకుమారు నభినందిస్తూ తన నేరముల నంగీకరించాడు.

"అయితే యిప్పుడు మిగిలిందింక్క ముఖ్య సమస్య—ఈ నరరూపరాక్షసిని—ఈ మాయలమారిని వధించే అవకాశం ఎవరికీయాలా అని—ఈ అయిదుగురు రాజులునూ, నాతోపాటు బహుదూరదేశములనుంచి, అనేక కష్టముల కోర్చి ఈపాపి తల నరికే కుతూహలంతో వచ్చినవారే."

అని విజయకుమారు తిరిగి చెప్పగా వకుళా సరళలు ముందుకొచ్చి—

"విజయకుమారా! ఈ కపటబైరాగి తలద్రుంచే అవకాశం మాకు కలిగించవలసింది! స్త్రీల నవమానించినవాడు, స్త్రీల చేతు లోనే చావడం యుక్తం." అన్నారు.

"వీడి కంఠర క్తంకోసం నా కరవాలం చిరకాలంనుంచి వేచి వుంది—నేనే ఈతుచ్ఛుణ్ణి చంపాలి—నాప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి."

అన్నాడు నర్మినగరమహీపతి, విక్రమదేవుడు.

"వీడు అందరకూ చేసిన వంచనకంటే, నాకు చేసిన వంచన గొప్పది. మహాతపస్సంపన్నుడిలాగ—మహిమాన్వితుడిలాగ, నన్ను నమ్మించి, నాచేత యీఘోరహింసా వ్రతమును పూనించి, వెయ్యి మంది రాజకుమారులను నాచేతుల్తో ఖండింపజేశాడు—కనుక నా కరవాలంతోనే వీడ్రి తలద్రుంచడం న్యాయం—"

అని చింతామణి ముందుకొచ్చి అనగా—విజయకుమారు సాద రంగా ఆమెను తిలకించి—

"రాజకుమారీ! ఈ తుచ్ఛుడిచేత యింత తేలికగా వంచన చెయ్యబడడానికి, నీ విద్యావివేకము లేమయినాయి? కన్నవారి మాటలుకూడా ధిక్కరించి—ఆత్మీయులంతరూ చెబుతే వినక, యిటు వంటి ఘోరహింసావ్రతమును పూనడంలో నీదురహంకారము—స్త్రీ జనసహజమయిన మొండితనమూ—పృథ్వీమండలంలో నిన్ను మించిన వారు లేరనిపించుకోవాలన్న దురాశ—వెల్లడి అవుతున్నాయి— అందుకు నువ్వుకూడా కొంత బాధ్యురాలివే సుమా!"

అని మందలించగా విని, చింతామణి మారుపలుకక ప్రక్కకు తొలిగింది. తరువాత కీర్తికాముడు లేచి—

"మిత్రులారా! నా నగరమును చేరి, నాకుమార్తెచే యిటు వంటి అపూర్వశపథం చేయించి—నన్నూ నాపరివారమునూ మోసం చేసినందుకు వీడి తలబ్రద్దలు చేసే అవకాశం నాకు దయచెయ్య రాదా?" అన్నాడు.

"మహాజనులారా! ఈనీచుణ్ణి వధించే అవకాశం ఎవరికీయాలా అన్న విషయంలో నేనెటూ నిర్ణయించలేకపోతున్నాను. కనుక ఎవరి కెలా తోస్తే అలా చేసుకోండి—"

అని విజయకుమారు డనడమే తడవుగా ముందర నర్మినగర పాలకుడు, విక్రమదేవుడు కసిదీరా తన కరవాలము నాదొంగబైరాగి

కంఠాన గుచ్చాడు—ఆతరువాత మిగిలిన నలుగురు నగరాధిపతులు—వకుళా సరళలు, వాడి ప్రాణవాయువల్ని తమ తమ కరవాలాలకు చెరిసమానంగా పంచియిచ్చి, ఎవరికసిను వారు తీర్చుకున్నారు! నామరూపరహితమయిన ఆసీచుని కళేబరం, తుండుతుండ్లుగా రక్త ప్రవాహంలో తేలి యాడుతుండగా—

"ప్రభువులారా! ఈ కుండిననగర స్మశాన భూములోనే యీ పాపి కొక ఘనమైన సమాధి నిర్మించండి—ఆసమాధిపై వీడి సంగ్రహ జీవిత చరిత్రను శాసనరూపంలో వ్రాయించి, ముందుయుగాలవారు గుణపాఠం నేర్చుకోడానికి సహకరించండి. అంతేగాక, ఎంత నీచు డయినా, ఎటువంటి పాపిఅయినా, దుర్మార్గుడయినా, వీడుకూడా ప్రాణికోటులో ఒక జీవి—ఈ జీవికికూడా ఉత్తరలోకాలో శాంతి కావాలి—కనుక అందు కవసరమయిన కర్మలు చేయించి, ఒకలక్ష మంది ప్రజలకు విరామం లేకుండా అన్నదానం చేయించి, లోకకంట కుడు హతమైనందుకు సంతోషించండి."

అని విజయకుమారుని నోటంట మాట రావడమే తడవుగా, వాటి నములు జరిగించడానికి పెద్దలు పూనుకున్నారు!

## ౪౪

వధించబడిన వెయ్యిశిరస్సులూ మందిరానికి వ్రేలాడుతూ వుంటే—తమకుమారులు సజీవులే అయివున్నారని, విజయకుమారు డాడినమాటల్లోని పరమార్థమేమిటో ఎవరికి అర్థంకావడంలేదు.

"యుద్ధమునాపి, తనకార్యమును తాను సాధించుకోడాని కతను పన్నిన పన్నాగము." అని కొందరంటే—

"బాలమహర్షి కొందర్ని మోసంచేస్తే—విజయకుమారు ఘనంగా మనల్ని మోసంచేశాడు." అని మరికొందరన్నారు.

"అప్పుడు అతనికి పట్టినగతే యితనికీ పడుతుంది!" అని వేరే కొందరు తొందర మనుషులన్నారు.

"తప్పు—తప్పు—అనవసరంగా మాటలు జారకండి—విజయ కుమారు డటువంటి వంచకుడుకాడు, కొంచం నిదానించండి."

అని ఒకరు—

"ఇంకా యేమిటీ నిదానించేదీ? ఖండించబడిన శిరస్సులన్నీ స్పష్టంగా మందిరద్వారానికి వ్రేలాడుతుండగా—'.

అని మరియొకరు—

"దేనికయినా తొందరపడడం మంచిది కాదు. క్షణకాలం ఓపికపట్టకూడదా!"

అని వేరొకరు—

"పుత్రశోకంవల్ల కాలిపోయేకడుపులకు తెలుస్తుందా బాధ-"

అని యింకొకరు—

అని యెవరికితోచినట్లు వారు—అని రకరకాలుగా వ్యాఖ్యా నిస్తుండగా—రాజకుమారుల మొండెములు పారవెయ్యబడిన గోతి దగ్గరకువెళ్ళి-వాటి నన్నింటినీ లెక్కపెట్టి, శిరస్సులసంఖ్యకు మొండెములసంఖ్యకు సరిగా సరిపోయినందుకు తృప్తిపడిన విజయకుమారు—వెయ్యిమందిరాజులూ ఖంగారుపడుతున్న దగ్గిరికొచ్చి—

"ప్రభువులారా! చింతామణిచే వధించబడిన మీమీ కుమారుల మొండెములన్నీ, ఈమందిరానికి వెనుకతట్టునున్న ఒక గోతిలో వెయ్యబడివున్నాయి. తమరెల్లరూ వెళ్లి ఆగోతిదగ్గర వేచి వుండవలసింది—"

అనిచెప్పగా, విజయకుమారు డక్కడ ఏమి విశేషంజరిగింపనై వున్నాడో చూడవలెనన్న కుతూహలంతో, మృతులైనవారి తండ్రులేగాక, యితరప్రముఖు లనేకమంది. ఆప్రదేశమునకుపోయి చేరుకున్నారు. విజయకుమారుడనంతరం, శాంతిభవన ద్వారమునకు వ్రేలగట్టబడిన రాజకుమారుల శిరస్సులన్నింటినీ పదిలంగా తీయించి, వాటి మొండెములుగల గోతిలో వెయ్యవలసిందిగా ఆజ్ఞాపించాడు. తానవంతరం శోభాదేవిని పిలిపించవలసినదిగా, కుండిననగరాధిపతి, కీర్తికామునికోరాడు. అతడదేవిధంగా ఆకన్యనురావించి,విజయకుమారుని యెదుటనిలిపాడు. తానెందుకు పిలవబడిందో అర్థంచేసుకోలేక, ఆమె బెదరుచూపులతో విజయకుమారుని ముఖంలోకి చూచింది.

"కోమలీ! నువ్వేమీ ఖంగారు పడవలసిందిలేదు. మీ చింతామణిచే హతులుకాబడిన ఈ వెయ్యిమంది రాజకుమారులూ ఇప్పుడు నీవల్ల పునర్జీవితులు కావాలి!"

అని విజయకుమారు డనేటప్పటి శామె తెల్లబోయింది. విజయ కుమారుడు తన కేదో విషమపరీక్ష పెడుతున్నాడని భయపడింది.

"నేనా—నావల్లనా? చచ్చినవారు బ్రతకడమా!"

"అవును-నీవల్ల నే-ఈచచ్చిన వారందరూ తిరిగి బ్రతుకుతారు."

ఒక్క శోభాదేవి కేగాక, ఆమాటవినిన అక్కడి వారందరికీ ఆశ్చర్యం కలిగింది.

"విజయా! నన్ను పరాభవం చెయ్యాలని చూస్తున్నావా?"

"శోభా! నిన్ను పరాభవిస్తే—నన్ను నేను పరాభవం చేసుకోవడం కాదా!"

"మరేమిటిదంతా? నావల్ల చచ్చినవారు సజీవులవుతారనడం హాస్యాస్పదంకాదా?"

"ఏమీకాదు. నామాటలో నీకు విశ్వాసముందా?"

"భగవంతుడు చెప్పిందాట్లోంకంటే—నువ్వు చెప్పిందాంట్లో యెక్కువ విశ్వాసముంది."

"అప్పుడు, నేను చెప్పినట్లు చెయ్యి—ఆఫలితాఫలితాలు—నావి—అందుకు నేను బాధ్యుడనవుతాను. నీశక్తిని నువ్వు తెలుసుకోలేక పోతున్నావు."

"నాలో అంత శక్తివుందా?"

"ముమ్మాటికీవుంది—నేను చెప్పినట్లు చేస్తావా?"

"అట్లాగే చేస్తాను."

"పోయి, అభ్యంగన మాచరించి, శుచివై రా!"

శోభ అతనికి నమస్కరించి, అతను చెప్పినట్లుగా చెయ్యడానికి మందిరంలోకెళ్ళింది. ఆలోపుగా విజయకుమారుడా గోతిని కప్పగలిగినంత పెద్దవస్త్రము నొకదానిని తెప్పించాడు. కొద్దిపాటికాలం మిత్రులతో యిష్టాగోష్టి సలుపుతున్నంతలో శోభాదేవి, అభ్యంగన మాచరించి, శుచియైవచ్చి—విజయకుమారు కెదురుగా నిలిచింది.

శోభా! ఇదుగో ఈవస్త్రము నాగోతిపై నీచేతులతో కప్పు-"

అని అతసంతకుముందు తాను తెప్పించి వుంచిన వస్త్రము నామెకందించాడు. ఆమె అతను చెప్పినట్లుగా చేసింది.

"రాజకుమారుల మొండేములతోనూ—శిరస్సులతోనూ నిండి వున్న యీగోతికి ముమ్మారు ప్రదక్షిణం చెయ్యి—నువ్వెంత కాలమూ

పూజించిన దేవిని హృదయపీఠాన నిలుపుకొని ఏకాగ్రతలో ధ్యానం చెయ్యి—ఆతరువాత—

"జగన్మాతా! నాపూజాఫలితంగా యీరాజకుమారుల నందర్నీ సజీవులుగా చెయ్యి—జై—మహాకాళీ!"

అని నమస్కారం చెయ్యి. అంతవరకే నువ్వు చెయ్యవలసింది. అప్పుడు నీశక్తిని నువ్వేగాక—యిక్కడివారందరూ కూడా అర్థం చేసుకుంటారు."

అనిచెప్పిన విజయకుమారుని పాదాలను ముందుగా తనకళ్ళ కద్దుకుని—

"విజయా! నువ్వు నా దేవులకు ఆదిదేవుడివి—నాహృదయాన ముందు నువ్వు నిలిచావు—ఆతరువాత దేవినిలిచింది. నిస్వామిని నీఆజ్ఞలు శిరసావహించడమే నాకర్తవ్యం—"

అని శోభాదేవి, విజయకుమారుడు చెప్పిన విధంగా, రాజకుమారుల మొండెములు—శిరస్సులూ గల ఆగోతికి ముమ్మారు నమస్కరించి, తన ఆరాధ్యదేవతను హృదయాన నిలుపుకొని—

"జగన్మాతా! నాపూజాఫలితంగా, యీ రాజకుమారుల నందర్నీ సజీవులుగా చెయ్యి, జై! మహాకాళీ!"

అని, నిమీలిత నేత్రాలతో చేతులుజోడించి నమస్కారం చేసింది. శోభ, మూసిన కళ్ళింకా తెరవలేదు—జోడించిన చేతులింకా విడలేదు. ఇంతలో సర్వజనులకూ విభ్రాంతి గొలుపుతూ ఎవరి మొండెమునకు వారి శిరస్సు అతుక్కుపోవడము—ఒక్కొక్క రాజకుమారుడు చెక్కుచెదరక, నిద్దరమేల్కొన్న వాడిలాగ, తానిల్లు వెడలినప్పుడు ధరించిన అంబరాభరణములతో—గోతిలోనుంచి లేచి రావడము! అదేప్రకారం వెయ్యిమంది రాజకుమారులూ సజీవులై గోతిలోనుంచి పైకివచ్చారు. వారి వారి తండ్రులు వార్ని ఆశ్చర్య సంభ్రమాలతో కౌగలించారు. శోభ కన్నులువిప్పి చూచేటప్పటికంతా మహామాయలాగ కనుపించింది. చింతామణిచే, తాను చూస్తుండగా ఖండించిబడిన రాజకుమారులందరూ, వారి వారి తండ్రుల కౌగిళ్లలోవుండి తన్మయానందము ననుభవిస్తుంటే, నేత్రోత్సవంగా తిలకిస్తూంది.

మృతులయిన వెయ్యిమంది రాజకుమారులనూ సజీవుల్నిగా చెయ్యగలిగిన ఆ మహత్తరశక్తి శోభాదేవిలో—వుందో—విజయ కుమారునిలోవుందో ఎవరికీ అర్థంకాలేదు. ఆయిరువుర ఆత్మశక్తులూ ఏకమై ఆమహాత్కార్యమును నెరవేర్చినవని అందరూ అనుకున్నారు. చచ్చి బ్రతికినారు—బ్రతికినవారికై ఆనందించేవారు. మొత్తమందరూ కలిసి, శోభా విజయకుమారులకు మొక్కారు. వారిలోనే వున్న బిల్వనగరాధిపతి ధర్మపాలుణ్ణి. అతనికొడుకు ఆనందకుమారునీ తిలకించి, కీర్తికాముడపరిమితానందభరితుడై కౌగలించాడు. విజయకుమారు నితో తమకుగల పూర్వపు బాంధవ్యం తెలుసుకొని మరింతమురిశారు.

అనంతరం ఎల్లరాజులూ శోభా విజయకుమారుల ననేక విధాల అభినందించి—ఎవరినగరాలకు వారు పోవసంసిద్ధులైవుండగా, కీర్తి కాముడు—

"ప్రభువులారా! పరిపాలకులారా! మీరప్పుడే మీ మీ నగ రాలు పోకూడదు. మీ చేతుల్లో హతమై-మీవల్ల పతనం కావలసిన నేను, సామ్రాజ్యమూ విజయకుమారుని మూలాన పునరుద్ధరించ బడ్డాయి. నిర్ణయానుసారం అతనికి నాకుమార్తెనిచ్చి వివాహం చెయ్య వలసివుంది—మీ పెద్దలందరూ ఆ శుభకార్యమును జరిగించి మరీ వెళ్లవలసివచ్చిందని నాప్రార్థన."

అని వేడుకొన్నాడు. అప్పుడు శోభాదేవి ముఖం వెలవెల బోయింది—తన దేవుడు తనకు దక్కడు కాబోలునని భయపడుతూ, విజయకుమారుని ముఖంలోకి తిలకించింది. ఇంతలో బిల్వనగరాధిపతి, ధర్మపాలుడు ముందుకొచ్చి—

"బావా! చింతామణి, ఆనందకుమారు నింతకుముందే ప్రేమించుకొన్నదికదా! ఆయిద్దరకూ వివాహం చెయ్యాలనికూడా మననిశ్చయం చేసుకొన్న విషయం మరిచావా?"

అనగా, కీర్తికామునికప్పుడు సందిగ్ధావస్థ కలిగింది. వైద్యుడూ పాలేకోరాడు—రోగీపాలేకోరాడన్న సామెతగా అయినందుకు విజయ కుమారుడు తనలో తానే నవ్వుకుని—

"చింతామణీ ఆనందునందుల ప్రేమ భగ్నం చెయ్యకండి— ఆదినుంచీ ఆయిద్దరూ ప్రేమించుకుంటున్న విషయం అందరికీ తెలుసు. ఎవరికీ అభ్యంతరం లేకపోతే, శోభాదేవి నాకు దేవికాగలదు."

అనగా, విజయకుమారుని ఉదారబుద్ధి నక్కడివారు వేయినోళ్ల కొనియాడారు. శోభకు గుండెల్లో బరువు తగ్గింది—సంతోషంతో ఆమె కళ్లు మెరిశాయి.

"శోభభాగ్యమే భాగ్యం—ఆమె నాకు చింతామణితో సము రాలు—ఈసంగతిని తెలుసుకొంటే మంజులాదేవి ఎంత సంతోషపడు తుందో—"

అని, కీర్తికాము డెల్లరతోనూ, నిజమందిరానికి బయలు దేరాడు. ముందుగా శోభా విజయకుమారులనూ, చింతామణీ, ఆనం దులనూ వెంటబెట్టుకుని, రాణీ మంజులాదేవి దగ్గరకు వెళ్లాడు, వారం దరూ వెళ్లేటప్పటి కామె పరిచారకులచేత తన వజ్రవైఢూర్య, మణి మాణిక్యాది సర్వాభరణాలూ తెప్పించి, అన్నింటినీ ఒక గుట్టగా పోయింది—వాటిని రెండుభాగాలుగా పంచుతూంది. చూచినవారి కదేమిటో అర్థంకాలేదు.

"అదేమిటిదేవీ! నువ్వు చేస్తున్న పనేమిటి?"

అని కీర్తికాము డాశ్చర్యంగా అడిగాడు.

"ఏంచేస్తున్నాను, నా ఆభరణాలన్నీ రెండుభాగాలు చేసు కున్నాను—ఒకటి శోభాదేవికి—మరొకటి చింతామణికి."

అని ఆమె అంటే అక్కడివారందరూ విరగబడి నవ్వుకోవడం మొదలుపెట్టారు.

"పిచ్చిగాకపోతే ఆకన్యలకు నీ ఆభరాణాలే పంచి ఈయాలా! వారిభర్తలుకూడా సామ్రాజ్యాధిపతులే—అంతేగాక కుండిననగరాధి పతి దివాళా మెత్తలేదు—వాళ్ళకి కావలసిన్ని ఆభరణాలు అతను కూడా చేయించగలడు." అన్నాడు కీర్తికాముడు.

"ఏమో—అదంతా నాకు తెలీదు-నాపిల్లలు నా ఆభరణాలు ముందర పెట్టుకోవాలి—రాశోభా! రావేచింతామణీ! ఇద్దరూ చెరో ఆభరణరాసీ తీసుకుని-నేను చూస్తుండగా ముందర ధరించండి."

మంజులాదేవికి సంతోషమును కలిగించడమే ప్రధానలక్ష్యంగా గల ఆయిద్దరు కన్యలూ తిరుగుచెప్పకుండా-వెంటనే ఆమె చెప్పిన ప్రకారం ఆభరణరాసుల నిద్దరూ చెరొకటీ ధరించారు.

"ఇప్పటింతకీ కన్యలిద్దరికీ వరులెవరో నీకు తెలుసా?"

అని కీర్తికాముడు తిరిగి అడిగినదానికి—

"అది వాళ్ళయిష్టం-మనదేముందీ? ఆనందు బ్రతికివుంటే చింతామణి చేసుకోవాలనను కున్నాను." అందామె.

దాన్నిబట్టి ఆమె అక్కడనేవున్న ఆనందును చూడనేలేదని వారనుకుని ఆశ్చర్యపడ్డారు.

"నీ తెలివి మరీబాగుంది-ఇదుగో నీ అన్నకొడుకు-ఆనంద కుమారు-ఇక్కడేవున్నాడు-చూసుకోలేదా?"

అని కీర్తికాముడు, ఆనందకుమారుని చెయ్యిపట్టి ముందుకు లాగాడు-

"ఏమిటీ? ఆనందకుమా రెలావచ్చాడూ? చింతామణిచే వధించ బడ్డాడుగా? ఆనందూ? నువ్వేనా? ఎలాబతికావు నాయనా!" అంటూ అతన్ని దగ్గిరికి తీసుకొంది.

"నేనేగాదు-చింతామణిచే హతులయిన వారందర్నీ శోభా దేవి బ్రతికించింది!"

"శోభా! దానికంతశక్తి యెలావచ్చిందీ? ఇన్నాళ్లూ అబైరా గితో శాంతిమందిరంలో వుందిగదూ! వాడిదగ్గర మంత్రాలూ-అవీ నేర్చుకుంది కాబోలు."

తిరిగి అందరూ నవ్వారు.

"అలాగా! మంచిపనిచేశావు శోభా! నేనింత సేపట్నుంచీ మా ఆనందుని చూడనేలేదుసుమా! నాకదేవిటో-ఎక్కువ సంతోష మొచ్చినా-ఎక్కువ విచార మొచ్చినా మతిపోతుంది. నాకల నిజ మయిందని ఎక్కువ సంతోష మొచ్చింది. అందుకని మతోయింది."

అని అనంతరం విజయకుమారునిచూచి-

"నువ్వెకదు నాయనా! మాచింతామణి ప్రశ్నలకు బదులు చెప్పావూ? అవును నేనప్పుడక్కడే వున్నా మహారాజుతో. నువ్వు మాశోభని పెళ్ళిచేసుకుంటావా నాయనా! అది మహాబుద్ధిమంతు రాలు!" అంది.

"మీరెలా చెబుతే అలావింటా! నేను మీకు పరాయివాణ్ణి కాదు-ఆనందకుమారు నాకు దాయాదిట!"

అని విజయకుమారు చెప్పగా—

"అలాగా! అయితే నాకు సంతోషం మరీ యెక్కువై పోతుంది—" అందామె.

"మతికూడా యింకా యెక్కువగానే చెడిపోతుందేమో చూసుకోదేవీ! మీ అన్నని చూసుకున్నావా?"

అని కీర్తికాము డడిగాడు.

"ఆఁ! ఆఁ! మా అన్నని యింతకుముందే చూశా. వొదిన మాంచాలమ్మకూడా వొచ్చిందా మరీ?"

అని మంజులాదేవి తిరిగి అడిగింది.

"ఆవిడనూ, అక్కడి మనవాళ్లందర్నీ తీసుకురావడానికి బిల్వ నగరం కొందరు వెళ్లారు—విజయకుమారుని తలిదండ్రులయిన ఛత్రపాల రమాదేవులతో అక్కడి ఆత్మీయులను తీసుకురావడానికి నాగపురం కొందరు మనుషుల్ని పంపించాను."

అని మహారాజు చెప్పినమీదట—

"బావుంది—బావుంది—నాకు సంతోషం మరీ మరీ యెక్కువై పోతూంది—ఏమవుతుందో—వాళ్లందరూ వొచ్చేలోపుగా ముహూర్తాలు నిర్ణయించి—ప్రయత్నాలన్నీ చెయ్యండి—ఈసంగతిని నాకు స్వప్న మొచ్చినప్పుడే చెప్పా—విన్నారు కాదు. పెళ్లి ప్రయత్నాలప్పుడు మొదలెడితే యిప్పటికి పూర్తయ్యేవా?"

అన్నది మంజులాదేవి.

"నిజమే దేవీ! నీస్వప్నాలు నిజమవుతాయని, నాకిప్పుడు తెలిసింది—ఇంతటినుంచీ కలరాగానే చెబుతూండు—నువ్వు చెప్పినట్లు చేస్తుంటాను."

అని కీర్తికాము డామెకు తృప్తి కలిగించి—

"సరి—యింకరండి—మనమందరం యిక్కడున్నా కొద్దీ—దేవికి సంతోషం మరీ మరీ యెక్కువవుతుంది—దానివల్ల యింకా యింకా యింకా మతి చెడుతుంది." అన్నాడు.

"ఆమాట నిజమే-వెళ్లండి-బోలెడన్ని పనులుంటాయి-పెళ్ళి ప్రయత్నాలన్నీ చాలా ఘనంగా చేయించండి."

అని ఆమె అనగా అందరూ వెళ్లిపోతున్నారు.

"శోభా! చింతామణీ! మీయిద్దరూ మాత్రం నాదగ్గిర కొంచం సేపు కూచోండర్రా!"

అనడంవల్ల, ఆకన్య లిద్దరూ మాత్రం మంజులాదేవి దగ్గిర కూర్చున్నారు. మిగిలినవారందరూ అక్కన్నుంచి వెళ్లిపోయారు.

"ఏమే శోభా! నీక్కూడా పెళ్ళవుతూంది—నాకు చాలా సంతోషంగా వుంది."

"అంతా మీ ఆశీర్వచనమేగదా దేవీ!"

"సరేగాని పెళ్ళికొడుకు నీకు నచ్చినవాడేనా! చింతామణి మొగుణ్ణి గురించి అడగనక్కర్లేదు. ఎందుకంటే, వాడూ అదీ, మొదట్నుంచీ మనసులు కలుపుకున్నవాళ్లేగా? నాదగ్గిర సిగ్గుపడకుండా చెప్పు."

శోభ బదులు చెప్పకుండా—మౌనమును వహించింది.

"శోభ చాలా గుట్టుగలమనిషే అమ్మా! మనతో ఏమీ చెప్పదు."

"నన్నేనా దేవీ—అలా అంటావు?"

"విజయకుమారుణ్ణి నువ్వింతకుముందే ప్రేమించివున్నావని నాకనుమానంగా వుంది."

"ఎందుకు కలగాలా అనుమానం?"

"ప్రేమిస్తే తప్పేముందమ్మా? నువ్వు చేసినపనే శోభా చేసి వుంటుంది?" అని తల్లి అనగా—

"నేనేమీ రహస్యంగా చెయ్యలేదు—ఆనందుని అందరకూ తెలిసేలాగే ప్రేమించాను."

"చెల్లీ! నే నారహస్యము నలా కాపాడకపోయినట్లయితే, మనమందరమూ యిలా సుఖంగా వుండకపోదుము. నీపూహా సరి అయిందే అవును. విజయకుమారునికి నామనస్సు ఏనాడో అంకితం చేసుకున్నాను—"

అని శోభ, చింతామణికీ, మంజులాదేవికీ, తాను విజయకుమారుని కలుసుకొన్న మొదటిరోజు లగాయితూ, అంతవరకూ జరిగిన సర్వవిషయములూ దాచకుండా చెప్పి, తదుపరి బాలమహర్షి తన్ను నిర్బంధం చేసిన విషయము-ఆ విషయ మితరులకు చెబుతే, తన కళ్లు పోతాయని, వాడు భయపెట్టిన సమాచారము-చెప్పి, వారి కమితాశ్చర్య సంభ్రమాలు కలిగించింది. మోసగాడయిన గురువును చింతామణి శతవిధాల శపించింది. అతని కపటం తెలుసుకోలేకపోయినందుకు తన్ను తాను పలువిధాల నిందించుకుంది. శోభయొక్క వివేకాన్నీ—దూరదృష్టినీ, తల్లీ కూతుళ్ళిద్దరూ బహువిధాల అభినందించారు.

కాని, అదంతా తన ప్రజ్ఞ కాదనీ-తాను కొలిచిన అమ్మవారి దయ అనీ--శోభ వారికి వివరించి--నరులను నమ్మినవారికి చెరుపుంది గాని, దేవతల నమ్మినవారి కెన్నడూ చెరుపురాదనీ- శేషించిన జీవిత మునుకూడా, జగన్మాతమీదనే నిండు విశ్వాసముంచి గడిపినట్లయితే తమ కెవ్విధమయిన కష్టాలూ కలగవని దృఢపరచింది.

"శోభా! నువ్వు మాయింటికి ఇలవేల్పుగా అవతరించావుగాని, మామూలు కన్యవుగా కాదు.

అన్నది మంజులాదేవి.

"నువ్వు లేకపోయినట్లయితే, మా దేశము--మానగరము--మేమూ నసించిపోయే వాళ్ళంగదా శోభా!"

అని చింతామణి శోభకు కృతజ్ఞత తెలిపింది.

"నాదేముంది దేవీ! విజయకుమారు నంతటి ధీరుడు-ప్రతిభా శాలి కంకణం కట్టుకుని, దేశదేశాలూ తిరిగి—అష్టకష్టాలూపడి, దీక్షను వొదలకుండా సాధించాడు గనక-పరిస్థితులలా తారుమారై మనమందరూ సుఖంగా వున్నాము."

ఆ నిజవిషయం అంది శోభ.

"అక్కా! వివాహమైపోగానే, విజయకుమారుతో నువ్వు వెళ్ళిపోతావు గాబోలు!"

అని చింతామణి గద్గదస్వరంతో అంటే—

"ఆనందకుమారుతో నువ్వు వెళ్ళిపోవు గాబోలు!"

అంది మంజులాదేవి.

"సుఖంగావుంటే—ఎక్కడయితే యేం చెల్లీ! కావాలంటే ఎంతలో కలుసుకోవాలి?" అన్నది శోభ.

"నేను శోభ దగ్గిర కొంతకాలమూ—చింతామణి దగ్గిర కొంత కాలమూ వుంటూ—జీవితాన్ని ఆనందంగా గడుపుకుంటాను."

అంటూ, మంజులాదేవి, ఆప్యాయంగా యిద్దరు కన్యల్నీ చెరో చేత్తోనూ దగ్గిరగా తీసుకుని హృదయానికి హత్తుకొని మురిసింది!

## ౨౩

ఇంద్రవైభవం ఎందుకూ పనికిరాదు—చంద్రమండలాన్నందుకొనే పందిళ్లతో—వివిధరకాల మంగళతోరణాలతో నగరమంతా అలంకరించబడింది. రాజమందిరాలకూ—రాణివాసాలకూ—ప్రత్యేకాలంకరణలు చేయబడ్డవి. కళ్యాణమంటపమంటే—పుష్పకవిమానమనుకొనేలాగ, జలతారు సగిషీపనులతో—ముత్యాలజాలరులతో—పూల అల్లికలతో—బంగారు పూతలతో—మానవనిర్మాణంగాక, దేవతానిర్మాణమేమో అని భ్రమపడేలాగున తయారుచెయ్యబడ్డది! ఎక్కడచూచినా మామిడితోరణాల అలంకరణము—అరటిస్థంభాల అమరికలు—రంగ వల్లురల మురిపెములు—ముత్తయిదుల ముస్తాబులు—దేవదాసీజనాల వృత్యబంగిమాలు—మణిహారాల మేఱుపులు—మాణిక్యాల ధగధగలు! ఎటువిన్నా, పురోహితుల మంత్రవాక్యాలు—భట్టురాజుల దిట్టకవిత్వాలు—ముత్తయిదుల మంగళహారతులు—వందిమాగధుల జేజేధ్వనులు—పండితుల శుభాక్షతలు—బంధుపరివారముల ఆనంద కోలాహలములు—భేరీ, మృదంగ, డోలు, సన్నాయి, నవుబత్కానాది వివిధరకాల శుభమంగళ వాద్యాలు!

వివాహమంటే అది—వేడుకలంటే అవి! వందలుకాదు—వేలుకాదు లక్షలాది జనసమూహాలతో నిండిన ఆశుభకార్యం ఎంత శోభాయమానంగా వుంటుంది? శోభా విజయకుమారుల జంట ఒకవయిపున, చింతామణీ ఆనందకుమారుల జంట ఇంకొక వయిపునా జంటదంపతులుగా అమరి మంటపానికి శోభాకారములయినారుగదా! వార్ని చూడ్డానికి వేయికన్నుల నీయనివిధాతను నిందించే, బంధుపరివారాలు, ఆపరివారాలకు మర్యాదలుచేసే పెండ్లిపెద్దలు—ఆపెద్దలను సలహాలనడిగే పరిచారికజనము—పరిచారకజనాన్ని తొందరచేసే పెళ్లివారు—ఆపెళ్ళివారిలో రెండుతెగలై—ఆడపెళ్ళివారిపై అధార్టీలు చేసే మొగపెళ్ళివారు—ఆ మొగపెళ్లివారిలో ఆడబిడ్డలగన్న వారిని ఏరి—'మరొకప్పుడు, మీరూ ఆడపెళ్ళివారవుతారు జాగ్రత్త!' అని మందలించే అనుభజ్ఞులు—

ఇందర సమక్షంలో—ఇన్ని వేడుకలతో—ఇంత వైభవంగా—కీర్తికామ దంపతులాకన్యలిద్దరకూ వివాహములు జరిపించి, కన్యా

దాన ఫలమును రెట్టింపుగా అందుకున్నారు! చేసే వి_స్తర్ళక—చేసే కులకు పరిమితిలేదు. నిరతాన్నదానము-కళాకారులకు కాన్కలు-పండితులకు బహుమతులు—తరతరాలనుంచీ మురిగివున్న ధన రాసులను విరజిమ్మి కీ_ర్తికాముడా వివాహములను అతిఘనంగా జరిగించాడు.

కల్యాణానికొచ్చిన వెయ్యిమంది రాజులూ—నెయ్యముతో విందులు కుడిచి—కీ_ర్తికామ, విజయకుమారులవద్ద శలవు తీసుకొని, వారి వారి రాజధానులకు పయనమై వెళ్లారు. కీ_ర్తికాముడు, ముఖ్య బంధు పరివారజనమును మాత్ర మప్పుడే పోనియ్యక, తన సంతోషంతో పాల్గొంటూ, మరికొంతకాలం తన నగరంలోనే వుండవలసిందని కోరాడు. అందరి కోరికలూ నెరవేరినవి—అందరి హృదయాలూ ఆనందంతో నిండినవి. నిండు జాబిల్లి పండువెన్నెల విరజిమ్ముతూ, విరిసినమల్లెలకు, వికసించిన విరజాజులకు వింత శోభను కలిగిస్తూంది. ఆమె చెక్కుటద్దాలో ప్రతిబింబించె చంద్రబింబమే—చేరువ సరస్సులోని నిర్మలజలాలోనూ ప్రతిఫలించి, సరస్సుకంటే, శోభను చెక్కులకే ఎక్కువ శోభను కలిగిస్తూంది!

శాంతిభవనానికి వెనుకతట్టున అదే సరస్సు-వారే మనుషులు-

"జ్ఞాపకముందా? మనం మొదటిసారి యిక్కడే కలుసుకున్నాం."

అని తనబడిలో తలపెట్టుకొని,తన చెక్కుటద్దాలో ప్రతిఫలించే చందమామను చూస్తున్న విజయకుమారు ణ్ణడిగింది శోభ.

విజయకుమారు వెంటనే జవాబు చెప్పలేకపోయాడు.

"ఏఁవిటా ఆలోచన? దేన్ని గురించీ?"

అని ఆమె అతని నడుందగ్గర గిలిగింత పెట్టింది.

"ఆహాఁ! ఆలోచన ఏమీ లేదు శోభా! నీచెక్కుటద్దాలో చందమామని చూస్తున్నాను."

"చెక్కుటద్దాలో చందమామా?"

అని ఆమె విరగబడి నవ్వింది శోభ.

"ఆచందమామని వెక్కిరించే ఈముద్దు మొగమో—"

అంటూ శోభ అతని విశాలఫాలభాగాన్ని తన కురులతో తాకింది.

"ఆముద్దు మొగానికి మురిపెమిచ్చేవి యీ ముంగురులు కావుంగా
అంటూ అతనామె ముంగురులను తనకళ్లకు తాకించి
తనివి పడ్డాడు.

"శోభా! ఆ మొదటినాడు నీతో కలిసి యిక్కడు కూచున్నంత
సేపూ గుండెలు కొట్టుకొంటూనే వున్నాయి—"

"ఇప్పుడో?"

"నిర్భయం—నువ్వు నా దానివి!"

"నువ్వు?"

"నీవాణ్ణి—"

"కాదు—"

"కాదా?"

"ఊఁ హు! నువ్వు నేను—నేను నువ్వు! వ్యక్తుం వేరయినా—
మనస్సు లొక్కటిగా?"

"నిజమే శోభా నాకు చెప్పడం చేతయిందికాదు."

"వీరకుమారులకు చెయ్యడమేగాని--చెప్పడం చేతగాదు."

"ఏమిటి?"

"యుద్ధం—"

అంటూ ఆమె తలనువొంచి ఒడిలోవున్న అతనిపెదవులను
తనపెదవులతో అందుకొంటుండగా--ఆమె కంఠహారాలతో పాటొక
రాగితావేతు అతని ముఖంమీద పడింది. విజయకుమారు దానిని
పట్టుకుని ఆశ్చర్యంగా చూస్తూ--

"ఇదేమిశోభా?" అని అడిగాడు.

"తావేదుగదా!"

"వశీకరణ యంత్రమా?"

"ఆఁ ఆఁ! ఈ వశీకరణ యంత్రమే నిన్ను నావశంచేసింది."

"ఇది నీకెక్కడిది శోభా!"

"ఏమోవిజయా! ఎప్పట్నుంచో వుంది—యెవరు వేశారో--
యెందుకు వేశారో తెలీదు--ఉన్నదాన్ని తీసెయ్యడమెందుకని వూరు
కున్నా—"

"దీన్ని గురించి నీకేమీ తెలీదన్నమాట!"

"తెలీదు."

"నిన్నవరో వర్తకులు తెచ్చి—ఈ నగరాధిపతికి అమ్మారని నేనువ్రుదూ!"

రాజ "అవునట—మంజులాదేవి అలాగే చెబుతుంటుంది."

"అయితే నువ్వు పుట్టినప్పుడే—దీనినెవరో నీమెడలో వేసి వుంటారు—"

"కావచ్చు."

"లోపల యేముంటుందో విప్పిచూదామా?"

"నాకు కలగని కుతూహలం నీకెందుకో కలిగింది—కావా లంటే చూడు—నీకభ్యంతర మేముంది?"

అని శోభ తనమెడలోని బొందుతో ఆతావేదు నతని చేతి కిచ్చింది. విజయకుమారు మెల్లిగా దానిని విప్పగా—లోపల ఒక రేగిరేకు కొన్ని అక్షరాలను కలిగివుంది. ఆశ్చర్యంతో అతనా రాగి రేకుపై గల అక్షరాల నిలాచదివాడు—

"వశిష్ఠ శోదరియైన త్రిపురాంబకునూ, భక్తసమాజపు నాయకు డైన మహర్షికినీ—యీబిడ్డ జన్మించింది. ఆమెను ఎవరుగాని, నిరా క్షేపణగా పెంచి పెద్దచేయవచ్చును.

ఇట్లు,

యవనగర సార్వభౌముడు.

దత్తాత్రేయుడు."

అని చదివిన విజయకుమారు కానాడు, యవనగరపాలకుడు, దత్తాత్రేయునికొడుకు, అశ్వనీకుమారు చెప్పినగాథ అంతా స్ఫురణకు వచ్చింది. విభ్రాంతుడయ్యాడు.

"విన్నావుకదా శోభా!"

"నాకేమీ అర్థంకావడంలేదు."

"అయితే విను—బాలమహర్షి అయిదోప్రశ్న జ్ఞాపకముందా? అది యవనగరానికి సంబంధించింది. ఆభక్తురాలికీ—ఈకపట మహర్షికీ నువ్వు పుట్టావన్నమాట."

"ఆనీచుడు నాకు తండ్రా! నాతల్లి! యవనగర కారా గృహంలో శిక్ష ననుభవిస్తూందా?"

"అవును—ఆనగరపురాజు ఆ చరిత్రనంతటినీ స్వయంగా చెప్పగా విన్నాను."

అని విజయకుమారు, అశ్వనీకుమారు తనకు చెప్పిన కథనంతటినీ, శోభకు క్లుప్తంగా వివరించి, ఆమెకు మరింత ఆశ్చర్యమును కలిగించాడు, ఆమె ఒకనిట్టూర్పును విడిచి—

"నాతలిదండ్రు లెంతనీచులు! నాజన్మ ఎంతపాపిష్టిదీ!"

"అందుకు విచారించ నక్కర్లేదు. శోభా హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడు పుట్టలేదా?"

"విశాలహృదయుడవు గాబట్టి నువ్వంటున్నావు. నాతండ్రే నన్ను గవయగోరాడు సుమా!"

"ఓహో! అదొకటా!"

శోభ తన్ను గురువు నిర్బంధచెయ్యడము—అప్పటి తన నిస్సహాయస్థితి—భగవత్ప్రేరణవల్ల ఆదేసమయంలో విజయకుమారు గంట మోగించడము—దానివల్ల తానాప్రమాదమును దాటి బయట పడడము, మొదలయిన వివరములన్నీ చెప్పినమీదట—

"అవును, అప్పటిగాని వాడిపాపాలు పండలేదు. ఈ ఆఖరి తప్పుతో వాడి ఆయుఃప్రమాణం పూర్తి అయిందన్నమాట! శోభా! ఆవిషయమంతా మర్చిపో—ఆదుర్మార్గుని తలంపులను మనసుకు రానియ్యకు. ఇక మందిరానికి పోదామా?"

"వద్దు విజయా! ఇక్కడ యెంతో ప్రశాంతంగావుంది—ఇంకా కొంచంసేపు యిక్కడే వుందాము."

"మా నాయనగారు, ఛత్రపాలుడు, మన నాగపుర ప్రయాణ మును గురించి హెచ్చరిక చేస్తున్నాడు. ఎప్పుడు పోదాము."

"మనం అప్పుడే వెళ్ళడానికి కీర్తికామమహారాజులు అంగీక రించడంలేదు. ఆరాజదంపతులు లింతకాలమూ నన్నెంతదయగా చూశారు. తమస్వంత బిడ్డ చింతామణి నొకకంటితోనూ—నన్నింకొక కంటితోనూ చూశారు. వారిఋణం నేను జన్మజన్మలకీ తీర్చుకోలేను. ఇప్పుడు చింతామణీ నేనుకూడా వార్ని వొదిలిపెడితే ఆపూజ్య దంపతులు బెంబేలు పడతారు. వారికోరిక ప్రకారం, మరికొంత కాలం మనమిక్కడ వుండాలని నాకోరిక."

"అట్లనే చెయ్యవచ్చు. నాయనగారంతగా తొందరచేస్తే, నేను వారితో కలసి వెడతాను. నువ్వు కొంతకాల మిక్కడవుండి, రాజదంపతులకు సంతోషం కలిగించు."

"నువ్వు లేకుండానా విజయా! ఎంతకాలానికి కలుసుకున్నాము! నిన్ను గురించి, నువ్వు నాకుభర్తవు కావాలని—ఉపవాసాలు చేశాను—దేవిని పూజించాను. ఆదేవి కరుణించి, నిన్ను నాకు ప్రసాదించింది. ఇప్పుడు తిరిగి యింతలోనే వియోగం నేను భరించలేను విజయా!"

అని చెబుతుంటే ఆమెకళ్లు చెమ్మగిల్లాయి—దాని నతడు చూడ లేకపోయినాడు.

"ఒద్దుశోభా! ఆపని చెయ్యను—నాకంఠంలో ప్రాణముండగా, మన యిద్దరికీ వియోగం కలగనియ్యను. అంతగా అవసరమయితే—రాజదంపతులనే మనతో మననాగపురం తీసుకెడదాం."

అని అతడామె దిగులును పోగొట్టాడు.

"ఆఁ! జ్ఞాపకమొచ్చింది. అడుగుతాను చెబుతావా విజయా?"

"ఏమిటది శోభా!"

"మృతులయిన ఆవెయ్యిమంది రాజకుమారులు తిరిగిబ్రతకడం వాళ్లవాళ్ల శిరస్సులు వాళ్లవాళ్ల మొండాలకు అతుక్కుపోవడం నాకు చాలా ఆశ్చర్యంగావుంది. ఆ రహస్యమేమిటో నాకింతవరకూ అర్థం కాలేదు. మృతులయినవారు పునర్జీవితులు కావడం—అందులోనూ నావల్ల! ముమ్మారు ప్రదక్షిణంచేసి, జగన్మాతను తలుచుకున్నంత మాత్రలో అలాజరిగింది—అదంతా యేమిటి?

"అదంతా నీ ప్రభావం శోభా! నీశక్తి నీకిప్పటికికూడా తెలీ లేదన్నమాట?"

"నాకు తెలియని నాశక్తి నీకుమాత్రం ఎలా తెలిసిందీ?"

"ఆ దొంగబైరాగి అయిదవప్రశ్నకు జవాబు తెలుసుకోడా నికి నేను అనేక యోజనాలు ప్రయాణంచేసి, యబానగరం వెళ్లాను. ఆనగర సరిహద్దులలో ఒక కాళికాలయముంది. నేనా ఆలయంలోకి వెళ్లి ఆ దేవియెదుట మొరకరించి—

"దేవీ! నీదయవల్ల చింతామణి ప్రశ్నలలో నాలుగింటికి జవాబులు తెలుసుకున్నాను. ఈనగరంలో అయిదవ ప్రశ్నకుకూడా

జవాబు తెలుసుకోగలను. అయితే నేనా దొంగబై రాగినీ—చింతా మణినీ జయించి—వారిచే జరిగించబడుతున్న అఘోరహింసాకాం డను అరికట్టగలనా? ఆచింతామణిచే హతులయిన వెయ్యిమంది రాజకుమారుల గతియేమిటి! అన్ని రాజవంశా లావిధంగా నసించి పోవలసిందేనా! ఈ నాప్రశ్నలకు జవాబు లభించేవరకూ, నేను నీపదసాన్నిధ్యం వొదలను—ఇక్కడనే సత్యాగ్రహంచేసి పడి వుంటాను.''

అని నిమీలిత నేత్రుడనై చాలాసేపు దీక్షగా కూర్చుని వుండగా ఒక అశరీరవాణి వినిపించింది.

''విజయకుమారా! నీకార్యదీక్ష—నీపట్టుదల—నాకు తెలి యనివికావు—నువ్వు సత్యాగ్రహం చెయ్యవలసిన అవసరంలేదు— నీకు జయమవుతుంది. నువ్వాబై రాగినీ, చింతామణినీ జయించగలవు. నీకు కాబోయేభార్య, శోభాదేవి నన్నుతలంచి తీవ్రమైన పూజలు జరిగిస్తున్నది. ఆమెపూజలు సిద్ధిపొందవలసిన సమయమొచ్చింది: ఆమెగనక, ఖండించబడిన రాజకుమారుల మొండెములను, శిరస్సు లనూ ఏకంచేయించి, తానాగోతిపై ఒక గుడ్డనుకప్పి నన్ను తలంచు కొని—

''జగన్మాతా! నాపూజలకు ఫలితంగా, మృతులయిన ఈరాజ కుమారులను సజీవులుగా చెయ్యి! జై! మహాకాళీ!''

అన్నట్లయితే, మృతులయిన రాజకుమారు లందరూ సజీవులు కాగలరు?

''అని చెప్పింది—ఆదేవి చెప్పిన ప్రకారంగానే, నేను నీచేత చేయించాను—''

అని విజయకుమారుడు చెప్పిందానిని విని—శోభ, జగన్మాతకు తనయందుగల అపార కరుణకు ఎంతో సంతోషపడింది. ఇంతలో ఆచేరువ సరస్సు జలంలో ఏదో చప్పుడు కావడంవల్ల, శోభా విజయ కుమారు లిద్దరూ ఉలికిపడి ఆదెసకు చూచారు. కాని వారి కేమీ కనుపించలేదు. అంతవరకూ నిర్మలంగా వున్న నీళ్లన్నీ మాత్రం కల కలై వున్నాయి.

''చాలా ఆశ్చర్యంగా వుంది. నీళ్ళలో ఆ చప్పుడేమిటి విజయా!''

"ఎవరో ఆనీళ్ళలో తేలి మునిగినట్లయింది."

"అసంభవం—మన మిక్కడనే వున్నాము గదా! ఇంతలో యెవరొచ్చారు?"

"అదే నాకూ చాలా ఆశ్చర్యంగా వుంది—చూడు శోభా—నీళ్ళింకా కొట్టుకొంటూనే వున్నాయి."

"ఎందుకు కొట్టుకొంటున్నాయోగాని, మనుషులు మునగడం-తేలడం లేదు—"

అని ఆయిద్దరూ తర్కపడుతున్న సమయంలో పకపకా నవ్వులు—ఆనవ్వులతోనే యిద్దరు వ్యక్తులు ఆనీళ్ళల్లో నుంచుని—

"ఎవరు నెగ్గారు? గెలుపెవరిది?" అని ఒకరు—

"గెలుపు నాది—నేను నెగ్గా—" అని యింకొకరు—

ఆయిరువురూ స్త్రీ పురుషులు—నగ్న శరీరాలతో నీళ్ళల్లోంచి యివతల కొస్తుండగా శోభ వాళ్ళను గుర్తుపట్టింది.

"చింతామణీ—ఆనందులు—" అని కెవ్వున అరిచింది. విజయ కుమారు విభ్రాంతుడయ్యాడు.

"శోభా! మీరిక్కడున్నారా దొంగల్లాగ—"

అంటూ చింతామణి సిగ్గు భారంతో తన శరీరాన్ని నీళ్ళలోకి దింపుకుంది. ఆనందుకూడా అదే ప్రకారం చేశాడు.

శోభా విజయకుమారులు విరగబడి నవ్వుతూ సరస్సుకు దగ్గిరిగా పోయి నిలుచున్నారు.

"శోభా! అదుగో అక్కడ—కట్టుమీద మాగుడ్డలున్నాయి—ఇటు విసురు—" అన్నాది చింతామణి.

"ఊఁ హూఁ! మీరే వొచ్చి తీసుకోండి." అంది శోభ.

"అబ్బ! పోవే—యిప్పుడా నీవేళాకోళం—ముందర పడెయ్యి." అని చింతామణి బ్రతిమాలుకుంది.

"లేకపోతే మీరక్కడచేరి ఏమిటీ పనీ?" అంది శోభ.

"మీదంపతులుకూడా యిక్కడే చేరతారని తెలీక బుద్ధి తక్కువ పని చేశాం—నీకు పుణ్యముంటుందమ్మా—మాగుడ్డలు కొంచం పడెయ్యి—విజయకుమారా! నువ్వయినా పడెయ్యి."

అని చింతామణి తిరిగి బలిమాలుకొంది.

"ఏమిటి శోభా ఆ చిలిపిపనులు—పడెయ్యి వాళ్లగుడ్డలు—ఈ దినం వాళ్లయినారు—రేపు మనం కావచ్చు."

అని విజయకుమారు అనడంవల్ల, గట్టుపైవున్న ఆ యిరువుర గుడ్డలూ నీటిలోకి విసిరింది శోభ—వారు వాటి నందుకుని, కట్టుకుని చిన్నబోయిన ముఖాలతో యివతల కొచ్చారు.

"ఆనందూ! సరిగంగస్నానాలా? నీళ్లలో చాలాసేపు మునిగి వున్నారే—" అన్నాడు విజయకుమారు.

"మాకు చెబితే—మేముకూడా వొచ్చేవాళ్లంగా!" అన్నది శోభ.

"సరిగంగస్నానాలూ కాదు ఏమీ కాదు. శాంతిభవపు పూ తోటలో విహరించాలనీ సాయంకాలమనగా వొచ్చాము. కొంతసే పక్కడ గడిపి—ఆతరవాత, ఆనందు చూస్తానంటే, అక్కడి సారంగ మార్గంగుండా యిక్కడికొచ్చి చేరాము. సరస్సు చూడగానే ఈతా లాడాలని కోరిక పుట్టింది నాకు.

'నీకు ఈతవొచ్చునా ఆనందూ?' అని అడిగాను.

'నాతో సమంగా ఎవరూ ఈదలేరు.' అన్నాడతను.

'నీళ్లలో మునిగి ఎంతసేపుండగలవు?' అని నేను తిరిగి అడుగుతే-

'చేతనయితే పందెంకట్టు—' అన్నాడతను.

అంతకుముందు శోభా నేనూ ఎన్నోసార్లలాగే ఈ సరస్సులో ఈతాలాడి, పందాలు కట్టుకునేవాళ్లు—ఊపిరి బిగబట్టి నీళ్లలో మునిగి వుండడం శోభకుకూడా నేనే నేర్పాను. ఏం శోభా?

అని చింతామణి శోభ నడిగింది.

"అవును—చింతామణి నీళ్ళలో మునిగి ఎంతసేపయినా వుండ గలదు—ఆవిద్య నాక్కూడా నేర్పింది." అని శోభ చెప్పింది.

"అటువంటి నాతో ఆనందు పందెం కడతానంటే నాకెలా వుంటుంది శోభా? సరే దిగమన్నా—ఎవ్వరూ లేరుగదా అని, గుడ్డలు విప్పి గట్టుమీదపెట్టి ఇద్దరం నీళ్ళలో దిగాం—మీరిక్కడి కెప్పు డొచ్చారో యేమో మాకు తెలీదు."

అని చింతామణి అనగా—

"మేముచ్చి అరగంటకుపైగా అయింది. మీరు నీళ్ళలో వున్నారని మీకేం తెలుసూ? విజయా నేనూ మొదటిసారి కలుసుకొన్నది ఈసరస్సు దగ్గరే—ఆమధురభావాలన్నీ చెప్పుకుంటూ—ఆఘట్టాలన్నీ తల్చుకుంటూ—ప్రపంచమునే మరచిన ఆనందంలో మునిగివుండగా, యింతలో నీళ్ళల్లో ఏదో చప్పుడయింది మీరు పైకొచ్చేముందే—మీయిద్దర్లో ఎవరో ఒకరు పైకి తేలి—వెంటనే లోపల మునిగిపోయారు—"

అని శోభ చెబుతుండగా చింతామణి ఆశ్చర్యంతో ఆనందు కళ్ళలోకి చూసింది. అతడు విరగబడి నవ్వడం మొదలుపెట్టాడు.

"దొంగా—నువ్వింతకుముం దొకసారి పైకి తేలావన్నమాట?" అని చింతామణి అడిగింది.

"ఇక ఊపిరి బిగబట్టలేకపోయా—నువ్వు చూడవుగదా అని, ఓసారి పైకితేలి—మళ్ళి మునిగిపోయా!"

అన్నా డానందకుమారు.

"ఓహో! ఇటువంటి దొంగపనులుకూడానా? సమయానికి వీళ్ళిక్కడుండి చూశారు గాబట్టి సరిపోయింది. లేకపోతే గెలుపు'నా' దని దెబ్బలాడేవాడివేనా ఆనందూ?"

"ఎవరిదయితే యేంలెస్తూ—ఇద్దరం ఒకటేగా?"

"ఆఁ! అటువంటి రాజీలు ఇప్పుడు పనికిరావు. నేను గెల్చాను."

అని ఆయిద్దరి వాదమునూ వినిన శోభ—

"ఇప్పు డింతకీ ఓడినవారేం చెయ్యాలి? గెల్చినవారి కేమిటీ లాభం? పందెం ఏమని వేసుకున్నారు?"

అని చింతామణి అడగ్గా—

"గెల్చినవారు, ఓడినవారి నెత్తుకుని, శాంతిభవనందాకా తీసుకెళ్లాలి. ఇదీ మాపందెం."

అని ఆనందకుమా రనగా—అందరూ విరగబడి నవ్వారు.

"బేష్! ఇది బాగుంది—గెలిచినవారి కాశిక్ష కావలసిందే! కలియుగధర్మం యిదికదా?" అన్నాడు విజయకుమారు.

"అది కాదు విజయా! గెల్చినవార్ని ఓడినవారెత్తుకోవాలి—అదీ అసలు పందెం! ఆనందు పందాన్ని తలక్రిందులు చేసి చెబుతున్నాడు." అంది చింతామణి.

"పందాన్నే కాదు—మనం తల్చుకున్నామంటే—ప్రపంచాన్నే తలక్రిందులు చెయ్యగలం—ఎవర్నెవరూ మొత్తుకోవద్దుగాని, పదండి పోదాం—దేవీ మంజుల, మనకోసం ఖంగారుపడుతుంది."

అని శోభ అనడంవల్ల, అందరూకలిసి వెన్నెల్లో పలుకు్కంటూ కులుకు్కంటూ విజమందిరాభి ముఖంగా నడిచిపోయారు. కష్ట పరంపరల నన్నింటినో ఎదుర్కొని గట్టెక్కిన ఆధన్యజీవుల శేషించిన జీవితాలదేవిధంగా సంతోషతరంగ డోలికల్లో ఊగుతూ ఆనంద సాగరాన తేలి యాడుగాక!

సర్వేజనాస్సుఖినోభవంతు!

సంపూర్ణము



శ్రీ ఎల్. వి. ప్రెస్, మదరాసు-1—1955

| | |
|---|---|
| శేముంతపల్లి ఉషాపరిణయనాటకం | 0- 8 |
| పంతెలవారి రామనాటకం | 1- 0 |
| హరిశ్చంద్రనాటకం | 0-12 |
| రుక్మాంగదనాటకం | 0-12 |
| సీతూరు సారంగధరనాటకం | 0-12 |
| పోతులూరి వీరబ్రహ్మంగారినాటకం | 1- 4 |
| వెంకటంపల్లె గయోపాఖ్యాననాటకం | 0- 8 |

**శతకములు**

| | మూలం | టీకా |
|---|---|---|
| సుమతీశతకము | 0- 2 | 0- 4 |
| కృష్ణశతకము | 0- 2 | 0- 4 |
| వేమనశతకము | 0- 2 | 0- 4 |
| కుమారశతకము | 0- 2 | 0- 4 |
| కుమారీశతకము | 0- 2 | 0- 4 |
| దాశరథీశతకము | 0- 4 | 0- 8 |
| బాలరామాయణము | 0- 2 | 0- 4 |
| భాస్కరశతకము | 0- 2 | 0- 8 |
| నరసింహశతకము | 0- 4 | 0-10 |
| గజేంద్రమోక్షము | 0- 4 | 0-10 |
| రుక్మిణీకల్యాణము | 0- 4 | 0-10 |
| పెద్దబాలశిక్ష | | 0-12 |

| | | |
|---|---|---|
| అమరకోశము ప్రథమ కాండము | 0- 4 | 0-12 |
| ,, (త్రికాండము) అట్టబైండు | | 2- 8 |
| రామతారకశతకము | 0- 4 | |
| రామరామశతకము | 0- 2 | |
| మల్లిఖార్జునశతకము | 0- 4 | |
| నారాయణశతకము | 0- 2 | |
| భారతసావిత్రి | 0- 2 | |
| కాళహస్తీశతకము | 0- 4 | |
| ఆంధ్రద్రావిడ (లేక తెలుగువారు అరవము నేర్చుకొనుటకు) | | 0- 4 |
| ఇంగ్లీషు తెలుగు ప్రయాణము | | 0- 8 |
| హింది తెలుగు ప్రయాణము | | 0- 8 |
| గణితబోధిని (మాసాపత్రికసహితం) | | 0- 8 |
| ఎక్కాలు (100 గలవి) | | 0- 1 |
| ఇంగ్లీషు తెలుగు విద్యాబోధిని | | 1- 0 |
| హింది తెలుగు విద్యాబోధిని | | 1- 4 |
| ఇంగ్లీషు తెలుగు మిడియం డిక్షనరి బంగరుపూత ప్యాకీలో సుమారు 1000 పేజీలు | | 9- 0 |
| అరటిచెట్టు పాటిక | | 0- 4 |

## హిందీ విద్యాబోధిని

తెలుగక్షరములు తెలిసిన ప్రతివారు ఈ గ్రంథ సహాయమువల్ల ఒక నెలలోనే హిందీభాషను సులభముగా నేర్చుకొనవచ్చును.

ఉచ్చారణ, అర్థవివరణములు తెలుగక్షరములతో యీయబడినవి. హిందీ నేర్చుకొనువారికి ఇది చాల సహాయకారి. నేడే ఈ 112 పే. ల గ్రంథము తీసికొనండి. వెల 1-4-0

**ఇంగ్లీషు విద్యాబోధిని**—తెలుగు తెలిసినవారు ఆంగ్లమును స్వయముగా నేర్చుకొనవచ్చును. ఇందులో ఆంగ్లము మాట్లాడుటకును, ఆంగ్లములో వుత్తరములు వ్రాయుటకు చాల విమర్శగా తెలియపరచియున్నది. ప్రతి ఇంగ్లీషు పదమునకు తెలుగు అర్థమునుయున్నది. 1-0-0

## పురూరవచక్రవర్తికథ

ఇందులో పూర్వము శనైశ్చరుని మాయవలన పురూరవచక్రవర్తిబడిన కష్టములును భార్య పెట్టియందు దగులుకొనిన వింతయును నవకోటినారాయణశెట్టి కథయును పాపము అతిగిన పురూరవచక్రవర్తిని రాజపుత్రిక మోహించుటయును గలవు. వెల 0-8-0

సి. వి. కృష్ణా బుక్ డిపో, తపాలుపెట్టె నెం. 1805 మదరాసు-1

